అంతర భారతీయ పుస్తకమాల

# మెట్టుకు పై మెట్టు

తకళి శివశంకర పిళ్ళై

అనువాదం

ఇలపావులూరి పాండురంగ రావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

IV

జ్ఞానపీఠ బహుమతి పొందిన తకళి శివశంకర పిళ్ళై గారి ప్రశస్తనవల.

ISBN 81-237-1350-9

ప్రథమ ముద్రణ 1995 (శక 1917)



*Original title in Malayalam*: Eanippadikal by T. Sivashankara Pillai
*Telugu translation*: Mettuku Pai Mettu

రూ. 93.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్,
న్యూఢిల్లీ - 110 016 ద్వారా ప్రచురింపబడినది.

# అవతారిక

మధ్యవర్గానికి లక సామంతవర్గానికి సంబంధించిన కళగా నవల అవతరించింది. మధ్యవర్గంలో కనిపించే ఉన్నతి, అవనతి, ఆశ, నిరాశ, స్వప్న సౌందర్యం, శుద్ధ యథార్థం - ఇవన్నీ యీ కళలో ప్రతిబింబించాయి. సముదాయమనే మహా దుర్గంలో సమర సంరంభంతో పొంగిపోయే శూరుడు ప్రాచీన నవలా సాహిత్యానికి కేంద్రం. పదునెనిమిదో శతాబ్దంలో వాణిజ్య విప్లవం కారణంగా ఇంగ్లండులోనూ, ఫ్రాన్సులోనూ ఒక నవీన మధ్యవర్గం ఆవిర్భవించింది. ఆధునిక నవలా సాహిత్యం అక్కడే ఉదయించింది. ప్రాచీన నవలా రచయి[illegible]ధ్యవర్గానికి సంబంధించిన వీరగాథలను వర్ణించటంలో చాలా వుత్సాహం [illegible]పించారు. రాబిన్సన్ క్రూసో, డాన్ క్విక్సోడ్, పిక్విక్ లాంటి రచనలు ఈ వీరగాథలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. మన దాకా వచ్చేసరికి వీటిలో పౌరాణిక గాథల ఛాయలు కూడా చోటు చేసుకున్నట్లు కనిపిస్తుంది. మలయాళంలో ప్రప్రథమ నవలగా ప్రఖ్యాతి వహించిన 'కుందలత' (1887) లో అద్భుతమయిన పురాణచ్ఛాయలు కనిపిస్తాయి. ఈ నవలలో మంచి గుణాలు ఏమున్నా లేకున్నా కేరళత్వం మాత్రం బొత్తిగా కనిపించదు. ఈ కథ కళింగ దేశంలో జరిగిందని మనకు నమ్మకం కలిగేటట్లు చూస్తాడు రచయిత. కథయెక్కడన్నా జరగనీ - కళింగ దేశంలో గానీ, వంగ దేశంలో గానీ, మాలవదేశంలో గానీ - దాన్ని గురించి మనకేమి పేచీ లేదు. కాని యేదో ఒక కథ కల్పించి చెప్పటం తప్ప రచయితకు మరో గొప్ప ఆశయమేమీ వున్నట్లు కనిపించదు. అందువల్లనే యీనాడు మలయాళ సాహిత్య చరిత్రలో 'కుందలత' చదివేందుకు విలులేని నవలగా తయారయింది.

కాని దాని తర్వాత కొద్ది రోజులకే వెలువడ్డ 'ఇందులేఖ' (1889) ఈ నాటికి కూడా పాఠకులు ఎక్కువ ఆసక్తితో చదువుతారు. లీవ్ బీకన్ ఫీల్డ్ నవల (హెన్రీ టాటేబిల్) ప్రభావం చంతుమేనేన్ మీద కనిపించినా 'ఇందులేఖ' కేరళ నవల అనిపిస్తుంది. చంతుమేనేన్ మాతృప్రధాన కుటుంబానికి సంబంధించిన పురాతన కథ చెపుతారు. ఆ రోజుల్లో కులగౌరవం గల నాయరు కుటుంబాల్లో మరెక్కడా కనిపించని వివాహ వ్యవస్థ కనిపిస్తుంది. నాయరు స్త్రీ కేవలం కుల గౌరవం చూసి నంబూద్రి బ్రాహ్మలను పెళ్ళి చేసుకునేది - మామూలుగా పెళ్ళికొడుకులు ముసలి

వాళ్ళుగా వుండేవాళ్ళు. ఈ పెళ్ళిళ్ళు బ్రాహ్మణులకు వేద విరుద్ధమయిన సంప్రదాయంగా కనిపించాయి. భార్య కుటుంబంలో వాళ్ళు ముఖ్య అతిథులుగా పరిగణింప బడే వాళ్ళు. ఈ సంప్రదాయం రెండు సమ్మదాయాలకూ - ముఖ్యంగా స్త్రీ వైపు వాళ్ళకు - హానికర మయినదని సంఘ సంస్కర్తలు గమనించలేక పోయారు. గమనించిన వాళ్ళు కూడా దీన్ని బాహాటంగా నిరసించ లేదు ఈ విషయాన్ని చంతుమేనేన్ ఎంతో చక్కగా శక్తిమంతంగా వ్యంగ్య మర్యాదతో ప్రతిపాదించాడు. 'ఇందులేఖ' చూసీ చూడగానే అది మామూలు ప్రేమకథగా కనిపిస్తుంది. కథ కంటె కూడా భాష మరీ మామూలుగా జన సామాన్యానికి అనుగుణంగా వుంటుంది. తానొక సారస్వత రచన చేస్తున్నాననే భావం చంతుమేనేన్‌లో ఏమాత్రం కనిపించదు. కాని యీ మామూలుతనం లోనే ఎక్కడలేని చిక్కదనం, చక్కని కొత్తదనం, సరికొత్త చక్కదనం దాగి వుంటాయి. అందుకనే యీ నాడు కూడా 'ఇందులేఖ' ను అందరూ ఆసక్తితో చదువుతారు. ఈ నవల లోని పాత్రలు ఎప్పుడో యెనభైయేళ్ళ క్రితం జీవించిన వాళ్ళవి కాక యీనాడు మన పల్లెటూళ్ళ లో కనిపించే చిర పరిచితులవని మనకు అనిపిస్తుంది.

పాశ్చాత్యుల పరిపక్వతను చంతుమేనేన్ మన దేశంలోకి భావనాళికల ద్వారా తీసుకొని వచ్చారు. ఈ నవలలో యెనభైయేళ్ళ క్రితం పియానో వాయించే ఒక నాయికను చంతుమేనేన్ చిత్రించాడు. ఈనాటి నవలాకారులు తమ నాయికలచేత వీణ వాయింపజేస్తారు. బట్టల మిల్లు, ఏలక్కాయల తోటలు మొదలయినవన్నీ 'ఇందు లేఖ' లో పరామర్శకు వస్తాయి. రచయిత ప్రత్యక్షంగా నాస్తికుడనే విషయం అతని రచనలో కనిపించక పోయినా డార్విన్, తామస్ హెన్రీ అక్స్లీ లాంటి రచయితల ఆలోచనా సరళి అందులో చర్చనీయాంశమయింది. సంగ్రహంగా చెప్పాలంటే చంతుమేనేన్ నిజంగా సిసలయిన క్రాంతిద్రష్ట.

మలయాళ నవలారంగంలో గొప్ప మేధావి అయిన సి.వి. రామన్ పిళ్ళై (1858-1922) చరిత్రను మళ్ళీ సృష్టించటంలో చాలా కృషి చేశాడు. సి.వి., చంతుమేనేన్ - ఇద్దరూ సంప్రదాయపరాయణులు. వాళ్ళిద్దరూ నిజమైన రాజభక్తులు, సంప్రదాయప్రియులు, నీతి పరాయణులు, వీరతారాధకులు. ఈతరం వాళ్ళు వాళ్ళనిద్దరినీ యథార్థ పురాతనులని భావిస్తారు. కాని సి.వి. రామన్ పిళ్ళైలో అంతకు ముందుగానీ, ఆ తర్వాత గానీ కనిపించని ప్రత్యేకత ఒకటి వుంది. ప్రాచీనులు తొలిచూపులోనే 'మూడులోకాలను చూడగలిగిన మూడోకన్ను' అనో లేకుంటే 'ప్రశ్యంతి ప్రజ్ఞా' అని కానీ అనేస్తారు. దావినే హెన్రీ జోన్స్ 'ఆల్ సీయింగ్ ఐ' (అన్నింటినీ చూడగల నేత్రం) అన్నాడు.

మహెూజ్జ్వలమైన మహనీయుల వ్యక్తిత్వాన్ని మళ్ళీ సృష్టించిన సి.వి. రామన్ పిళ్ళై రెండువందల సంవత్సరాల క్రిందటి తిరువితాంకూరు చరిత్రను మన కళ్ళ యెదుట కనిపించేట్టు చేశాడు. ఆ కల్పనా సార్వభౌముని యెదుట గతించిన చిరంతన సన్నివేశాలు కమనీయమైన వేషంతో గజ్జెలు కట్టి నాట్యం చేశాయి. ఎన్నెన్ని అద్భుత సన్నివేశాలో. ఎందరో మహనీయుల గత కాలపు తెరలో నుంచి బయటికి వచ్చి మన యెదుట అభినయం చేస్తూంటే మనం కళ్ళారాచూశాం. మలయాళంలో మహత్తరమైన శైలి అనేది వుంటే అది సి.వి. దే. సి.వి. కి సంబంధించిన ప్రతి విషయమూ మహత్తరం, బృహత్తరం. ఆయన మూడు రచనల్లోని (మార్తాండవర్మా, ధర్మరాజా, రామరాజ బహదుర్) చారిత్రక విస్తృతి, గాంభీర్యం స్కాటునే కాదు, టాల్‌స్టాయిని గుర్తు చేస్తాయి. పసిపిల్లల్లాగా తప్పటడుగులు వేసే మలయాళం నవలను ఒక్క క్షణంలో ఆయన విశ్వసాహిత్య రాజసభలో ప్రవేశ పెట్టాడు.

ఈ ఇద్దరు మహనీయుల తర్వాత చాలా కాలం మలయాళ నవల మధ్య తరగతికి క్రీడారంగంగా మారిపోయింది. అప్పన్ తంపురాన్, కె.యం. పణిక్కర్ లాంటి వాళ్ళు చారిత్రక నవలలు వ్రాశారు. కాని అవి. సి.వి. స్థాయిని అందుకోలేక పోయాయి. 1930 తర్వాత కొన్ని కొత్త కొత్త మార్పులు అనుభవంలోకి వచ్చాయి. యధార్థవాదం, చేతనావర్తం లాంటి కొత్త కొత్త పోకడలను ప్రసిద్ధ సంపాదకులూ, ఆలోచనాపరులూ అయిన యం. బాలకృష్ణ పిళ్ళై తమ వ్యాసాల ద్వారా సాహితీపరులకు పరిచయం చేశారు. బాలకృష్ణపిళ్ళై శిష్యుల్లోనే కొందరు సాహితీపరులయిన యువకులు నూతన రచనా పద్ధతులలో పరిశోధన చేసేందుకు సాహసించారు. అలాంటి వ్యక్తుల్లో ఒకరు తకళి శివశంకరపిళ్ళై. కేశవదేవ్ శ్రమజీవుల సమస్యలను తీసుకుని ఒక నూతన సాహిత్య మార్గాన్ని చేపట్టాడు. పొట్టెకాటు, బషీర్ కాలానుగుణమైన ప్రేరణాబలంతో కథానికారంగంలో కొత్త దారులు తొక్కారు.

వీళ్ళందరూ ముందు కథలు, నవలికలు వ్రాసిన వాళ్ళే. తకళి రచించిన 'పతిత పంకజం', 'త్యాగత్తింటె ప్రతిఫలం' (త్యాగానికి ప్రతిఫలం) లాంటివి సరికొత్త సాంకేతిక విధానం, వస్తువిన్యాసం, వ్యంగ్యపూరితమైన ఆఖ్యాన శైలి ద్వారా ప్రజల దృష్టిని ఆకర్షించాయి. తకళిని ఆరాధించేవాళ్ళూ వున్నారు, నిందించేవాళ్ళూ వున్నారు. అనరానిమాటలు అని అతనిమీద దూషణవర్షం కురిపించారు ఒక్క తకళే కాదు. దేవ్, బషీర్ లాంటివాళ్ళుకూడా ఇలాంటి ఆక్షేపణలకు తట్టుకునే పైకివచ్చారు. వాళ్ళరచనల్లో పేదరికం, దురాచారాలు నైపుణ్యంతో చిత్రింపబడక పోలేదు. ఒకవిధంగా చూస్తే ఫ్లాబర్, హ్యూగో, జోల్లాలో కూడా ఇలాంటి అతిశయోక్తి కనిపిస్తుంది.

ఇంతకు ముందు పేర్కొన్న మలయాళ నవలా రచయితల్లో ఎవరూ కూడా ప్రాచీన నవలా రచయితల్లాగా తమ కథావస్తువులోని పాత్రల చేత సొంతంగా జీవితనాటకం ఆడించేందుకు సిద్ధపడలేదు. కథానిక కంటె కొంచెం ఎక్కువ వ్యాసంగాల ఇతివృత్తం ఈ నవలల్లో కనిపిస్తుంది, అంతే. దాదాపు 1945 వరకూ ఇదే పరిస్థితి కనిపిస్తుంది. ఆ తర్వాత సారస్వత విధానంలో మార్పు వచ్చింది. అభ్యుదయ రచనల ప్రాబల్యం పెరిగింది. చెప్పదలుచుకున్నది మరికొంత స్పష్టంగా విడమరచి చెప్పటం ఆరంభమయింది. 'ఓటయిలనిన్ను' (ఏటినుండి), 'ఇండిటంగళి' (రెండుశేర్ల ధాన్యం), 'తొట్టియుటెమగన్' (పాకీవాడి పిల్లవాడు), 'బాల్యకాలసఖి', 'విషకన్యక' లాంటి ప్రసిద్ధ రచనలు ఈ కాలంలోనే వచ్చాయి. నవలలన్నింటిలో రచయితల స్వానుభవం చక్కగా చోటు చేసుకుంది. దారిద్ర్యం అనే నూతన సమస్య కూడా ఈ నవలల్లో తొలిసారి తల యెత్తింది. రిక్షావాడు, పాకీవాడు, కుట్టనాటిన్, పులయన్ లాంటి వాళ్ళు అంతకు ముందు మలయాళీ నవలల్లో కనిపించలేదు. నూతన జీవితం కోసరం పరితపించే అసంతుష్ట శ్రమజీవులూ, రైతులూ మెల్లమెల్లగా సంఘంలో పైకి రావటం తొలిసారి యీ నవలా కారులే తమ రచనల్లో చిత్రించారు. (కథానికా రచయితలు ఈ పని యింతకు ముందే చేశారు.) 'ఇందులేఖ' నుంచి 'ఇండిటంగళి' వరకుఉన్న దూరం, మాటంపి నాయరుగారి- గొప్పవంశం నుంచి మాలపల్లెలో కూలీనాలీ చేసుకుని బతికే శ్రమజీవుల మట్టియిండ్ల వరకుఉన్న దూరంగా భావించవచ్చు. అంతమాత్రాన ఇక్కడి నవలా సాహిత్యం సామంత వర్గం నుంచి అమాంతం ప్రోలిటేరియన్ జీవితంలో అడుగుపెట్టే సరికి తలకిందులుగా గిరాటు వేసిందని కాదు. ఈ నవలల్లోని పాత్రలు చాలావరకు మధ్యతరగతికి చెందిన వాళ్ళవటంచేత ఆ తరగతి వృత్తాంతమే యీ నవలలకు నేపథ్యం తయారు చేసింది. ముఖ్యంగా తకళి, పొట్టెకాటు, ఉరూబ్‌లాంటి రచయితల నవలల్లో ఇది కనిపిస్తుంది. అయినప్పటికీ వాళ్ళు నూతన దృశ్యాలకోసరం, నూతనసన్నివేశాలకోసరం నిరంతరం కృషి చేశారు. ఈ విధంగా మత్స్యకారుల జీవితాన్ని చిత్రించే 'చెమ్మీన్' లో తకళి, మలబారు ముసల్మానుల జీవితాన్ని చిత్రించే 'ఉమ్మాచ్చు'లో ఉరూబ్, కాలికట్ పట్టణంలోని గాఢాంధకారంలో దిగిచూసే 'తెరువింటెకథ'లో పొట్టెకాటు నూతన రంగాలలో ప్రవేశించారు. ఈ నవలలన్నీ ఒక విధంగా సారస్వత ప్రపంచంలో సంచలనం తీసుకు వచ్చిన సార్థక సంఘటనలతో కూడినవి. నవలా రచయితకు రెండు రకాల దృక్కోణాలు అవసరమని అంటారు. (1) భౌతిక దృక్కోణం (2) ఆధ్యాత్మిక దృక్కోణం. ఈ రెండు దృక్పథాలూ ఇంతకుముందు పేర్కొన్న నవలల్లో సూక్ష్మంగా విస్తరించి కనిపిస్తాయి. తకళి వ్రాసిన 'చెమ్మీన్' మత్స్యకారుల చరిత్రను చిత్రించే దస్తావేజు కాదు. వాళ్ళ జీవితం అందులో సర్వతోముఖంగా

కనిపిస్తుంది. 'చెమ్మీన్' మత్స్యకారుల జీవనదర్శనమని మనల్ని నమ్మిస్తాడు తకళి. అదే ఆయన సాధించిన ప్రయోజనం. పేరుపెట్టి చెప్పాలంటే మిగిలిన యిద్దరు నవలా రచయితలను గురించి కూడా నేను ఇదేమాట చెప్పవలసి వుంటుంది. ఉరూబ్ వ్రాసిన 'సుందరీ కలుమ్ సుందరన్మారుం' అనే రచనలో దస్తావేజు లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి. మలబారు మునల్మానుల ఉద్యమం వల్ల అక్కడి జనజీవనం ఎలా తారుమారయిందో, అందువల్ల ఎన్ని కుటుంబాలు చిందర వందర అయిపోయాయో, ఎంతమంది మతం మార్చుకొని నూతన జీవిత విధానాన్ని వెతుక్కుంటూ వెళ్ళారో చక్కగా చిత్రించాడు ఉరూబ్. తరతరాలనుంచి వస్తున్న సంప్రదాయ బంధనాలను విచ్ఛిన్నం చేయకుండా, కొత్త బంధాలను కల్పించకుండానే మానవజాతి మహనీయతను మధురంగా వర్ణించాడాయన. ఉరూబ్ వ్రాసిన యీ నవలను స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత వెలువడిన నవలల్లో సర్వోత్కృష్టమైనదిగా భావించి కేరళ సాహిత్య అకాడమి బహూకరించింది.

ఇంతవరకు చెప్పింది స్వాతంత్ర్యం రాకముందు సాహిత్యరంగంలో తమ వ్యక్తిత్వాన్ని ముద్రవేసుకున్న రచయితల వృత్తాంతం. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత సాహిత్య రంగంలో ప్రవేశించిన మరో క్రొత్త తరం కూడా వుంది. వీళ్ళల్లో చాలామంది మేధావులు శక్తిమంతమైన రచనలు చేసి సినీతారల్లాగా 'స్టార్‌వేల్యూ' సంపాదించారు. యం.టి. వాసుదేవన్ నాయర్, పారప్పురం (మత్తాయి), కె. సురేంద్రన్, మలయాట్టూర్ రామకృష్ణన్, విలాసిని (యం.కె. మీనన్), జి. వివేకానందన్, జి.వి. విజయన్, కాక్కనాటన్, ముకుందన్ -పేర్కొనదగ్గ వ్యక్తులు. మలయాళంలోని ఇరవై ఉత్తమ నవలల జాబితా ఒకటి తయారు చేస్తే అందులో చాలా భాగం వీళ్ళ రచనలే కనిపిస్తాయి. మరోవిధంగా చెప్పాలంటే 'ఇందులేఖ' తర్వాత అరవై డెబ్భై సంవత్సరాల్లో వచ్చిన ఉత్తమ నవలలు ఈ పది పన్నెండు మంది రచనల నుంచే వచ్చాయని చెప్పవచ్చు. వీళ్ళల్లో ప్రతి రచయితను గురించి వేరువేరుగా చెప్పకుండా వాళ్ళ రచనల్లోని ప్రత్యేకతను గురించి మాత్రం సూత్రప్రాయంగా చెపుతాను. రెండవ ప్రపంచ యుద్ధంలో కొందరిని బలవంతంగా సైన్యంలో చేర్చి అక్కడి జీవితానికి అలవాటు పడేట్టు చేశారు. అందువల్ల సాహిత్యానికి ఏదో లభిస్తుందని అప్పుడు ఎవరూ అనుకోలేదు. కాని ఆశ్చర్యకరమైన విషయమేమంటే యీ సైనికుల శిబిరాలనుంచి అద్భుతమైన సుందర సారస్వత రచనలు బయలుదేరాయి. ముందు చిన్నచిన్న కథలు, తర్వాత నవలలు. ఈ తరగతి వాళ్ళలో ముఖ్యులు నందనార్, కోవిలన్, పారప్పురం. కోవిలన్, నందనార్ చాలా తీక్షణమైన శైలిలో వ్రాస్తే పారప్పురం సరళ రమణీయమైన శైలిలో వ్రాశాడు. ఒకరిది నిషానిచ్చే సారా అయితే మరొకరిది నురుగులు దేరిన బీరులాంటిది. సైనికుల జీవితానికి సంబంధించిన యీ

కథలతో మనకు మరో క్షితిజరేఖ కనిపించింది. బాధలను అనుభవించేవారూ, ఇతరులకు బాధ కలిగించి పరమానందం చెందే సైనికులూ, చస్తే బాగుండుననే నిస్పృహ – యివన్నీ ఒక వైపు. దయార్ద్రత, మానవత్వం, కారుణ్యం, ప్రేమ లాంటి సద్గుణాల అమృత ధార మరోవైపు. ఈ కథా రచయితలు వ్రాసిన కథలన్నీ సైనిక జీవితానికి సంబంధించిన కథలే కాదు. ఈనాడు వాళ్ళు పదవీ విరమణ చేసిన తర్వాత పల్లెటూళ్ళలో సంఘంలో కలిసి మెలిసి కాలక్షేపం చేస్తున్నారు. పారప్పురం వ్రాసిన ఉత్తమ నవల 'అరనాళికనేరం' సైనిక కథానిక కాదు. అది సంకీర్ణ కుటుంబానికి చెందిన కథ. జీవితాన్ని జమా ఖర్చుల జాబితాగా జమకట్టి ప్రేమాను బంధాన్ని విచ్ఛిన్నం చేసుకుని మట్టిపాలయ్యే వాళ్ళ జీవితం అందులో చిత్రించబడింది. చదువరుల సోత్కంఠిత నిరీక్షణకు కేంద్రం నవలా రచయిత యం.టి. వాసుదేవన్ నాయర్. కనుకట్టు విద్యతో ప్రేక్షకులను ఆకట్టుకొనే ఇంద్రజాలికునిలాగా యం.టి. ప్రతి విషయంలో ఏదో ఒక ప్రత్యేకత చూపిస్తారు. యం.టి. నవలలు బాల్య జీవితంలోని దుర్భర బాధలతో తీరని కోరికలతో నిండి వుంటాయి. అదే వాటిలోని ముఖ్య విశేషం. సంఘమర్యాదలను ధిక్కరించే ధైర్యసాహసాలు గల యువకులు ఆయన నవలల్లో ఎక్కువగా కనిపిస్తారు. యం.టి. కి వాళ్ళు ప్రతిరూపాలని చెప్పవచ్చు. భావ కవితలోని సౌకుమార్యంతో నవలను పోషించే సినిమా నగిషీలతో దానిని తీర్చి దిద్దటంలో యం.టి. ప్రతిభ బాగా రాణించింది (ముఖ్యరచనలు – 'నాలుకెట్టు', 'అసురవిత్తు', 'మంజు కాలం').

నవలను సరస సంభాషణ శైలిలో నడిపించిన రచయిత కె. సురేంద్రన్. సముదాయం,ప్రణయం, పరిణయం పత్రికలు,రాజకీయాలు, సాహిత్యం, సంగీతం వీటికి సంబంధించిన సరస సంభాషణలతో సురేంద్రన్ నవలలు ముందుకు సాగుతాయి. మధ్య మధ్య ఉత్తేజ పరిచే పాత్రలు, సంఘటనలు తటస్థపడతాయి. జి. వివేకానందన్, మలయాటూర్ రామకృష్ణన్ అందరి మెప్పును పొందిన నవలాకారులు. పేదల జీవితాన్ని, నిమ్న జాతికి చెందిన వాళ్ళ జీవితాన్ని చిత్రించటంలో జి. వివేకానందన్ అగ్రగణ్యులు. 'కళకు', కల్లిచ్చెమ్మ' పల్లె జీవితం మీద వెలుగును ప్రసరింపజేసే ప్రశస్త రచనలు. ఆశనుంచ నిరాశకు తీసుకొనిపోయే మన పల్లెల దురదృష్టం, మసక చీకటిలో బ్రతికే మానవ జాతి మన స్మృతి పటలంలో పారాడుతూ వుంటుంది. రామకృష్ణన్ బహుముఖ ప్రతిభాశాలి. మనస్తత్వం, రాజకీయ పరిహాసం, వర్గచిత్రణ, డిటెక్టివ్ – అన్నింటినీ నేర్పుతో కూర్చి చిత్రించిన రచయిత ఈయన. విలాసిని (యం. కె. మీనన్) మలేషియాలో వుండే మలయాళి. ఆయన తొలి నవలల్లోనే ఒక ప్రత్యేకత కనిపించింది. కావ్యశైలిలో విస్తారంగా

విదగ్ధమైన కల్పనా శక్తితో అప్రయత్నంగా కథను ఎంతవరకయినా సాగదీసి నడిపించే నేర్పు ఈ నవలలో కనిపిస్తుంది.

సుప్రసిద్ధ హాస్యచిత్రకారునిగా భారతదేశ మంతటా పేరుపొందిన ఓ.వి.విజయన్ 'ఖసాక్కింటె ఇతిహాసత' అనే అపూర్వ నవలా రచనతో సారస్వత రంగంలో ప్రవేశించాడు. మలయాళం నవలతో యూరపులోని నూతన తత్త్వవేత్తల దగ్గరకి చేరగలిగిన తొలి నవలా రచయిత ఓ.వి. విజయన్ అని చెప్పవచ్చు. స్థూలంగా చూస్తే నిష్కారణంగా కనిపించినా, నిజానికి ఆత్మీయ దుఃఖమనే సుడిగుండలో చిక్కుకు పోయిన యువకుడు సుఖాన్ని అన్వేషిస్తూ చేసిన జీవిత యాత్ర యిందులో చిత్రింపబడింది. కొండప్రాంతపు పల్లె భాగంలో, హార్డీ 'వెసెక్సు' లాంటి గ్రామం ఖసాక్. ఆయన కథానాయకుడు చాలామంది దగ్గరకి వెళతాడు. బయటికి చూసేందుకు యథార్థవాదాన్ని ప్రతిపాదించే కథగా కనిపించినా నిజానికి ఈ కథలో నిత్య జీవితంలోని ఇతివృత్తమే కనిపిస్తుంది.

ఒకానొకప్పుడు మలయాళ సాహిత్యంలో అన్నిటి కంటె నీరసమైన శాఖ నవలా శాఖ. ఈనాడు ఈ శాఖ బాగా పెరిగిపోయింది. ఈ లఘు సమీక్షవల్ల ఈ విషయం స్పష్టమవుతుంది.

'చెమ్మీన్' (1956) అనే నవలతో తకళి అంతర్జాతీయ ఖ్యాతి సంపాదించాడు. పూర్తిగా యథార్థవాదిగా పరిగణింపబడే తకళి కావ్య సౌందర్యంతో కమనీయ కల్పనకు కథారూపం ప్రసాదించి ఎంత ప్రఖ్యాతి పొందగలిగాడో చూస్తే ఊహాతీతంగా వుంటుంది. ఏణిప్పడిగళ్ (1964) ఇతని పదమూడో నవల. బీదసాదల జీవితాన్ని చిత్రించి శక్తి మంతమయిన తకళి కళా హస్తాలు ఈ సారి బ్యూరోక్రసీ ప్రపంచం వైపు ప్రసరించాయి. ఇక్కడ గూడా తకళి పొరపాటు పడలేదు. ఇందులో వర్ణించిన తిరువనంతపురం లోని వుద్యోగస్థుల తీరు తెన్నులు ఏ రాజధానిలోనయినా అలాగే కనిపిస్తాయి. ఈర్ష్య, అహంకారం, లంచగొండితనం, మోసం - ఇలాంటి వాటితో నిండి నిబిడీకృతమై వున్న అదో రకపు ప్రపంచం. ఆ ప్రపంచంలో కేవలం బి.ఎ. డిగ్రీ పుచ్చుకున్న పల్లెటూరి యువకుడు కేశవపిళ్ళె ప్రవేశించాడు. నానా బాధలూ పడ్డ తర్వాత అతనికి వుద్యోగం దొరికింది. తన తెలివి తేటలను ఉపయోగించుకుని అతను అడ్డు వచ్చిన సమస్యలనన్నిటినీ దాటేశాడు. క్రమంగా పై పదవులను పొంది చివరకు చీఫ్ సెక్రటరీ అయినాడు. కాలానుగుణంగా వేషం మార్చుకునే రాజకీయవేత్తలూ, ఏరాజకీయనాయకుడికైనా అనుగుణంగా నడుచుకునే వుద్యోగస్థులు - ఇలా యీనాటి యుగంలో రెండు వర్గాలు. కేశవపిళ్ళె యీ రెండో వర్గానికి చెందిన ఆదర్శ పురుషుడు. పైకి ఎక్కిన తర్వాత ఎక్కేందుకు ఉపకరించిన నిచ్చెనను నెట్టివేయటం ఒక పద్ధతి. కేశవపిళ్ళె యీ పద్ధతిని అనుసరించిన వ్యక్తి.

తనకు తటస్థించిన ప్రతి వ్యక్తినీ అతను పూర్తిగా ఉపయోగించుకున్నాడు. పని నెరవేరిన తరవాత నిస్సంకోచంగా, నిర్దాక్షిణ్యంగా, నిర్మొహమాటంగా వాళ్ళను దెబ్బకొట్టి నెట్టేశాడు. భార్య, ప్రేయసి, తల్లి, తండ్రి, స్నేహితులు - అందరూ అతనికి సాధన మాత్రంగానే పనికి వచ్చారు. ఒక యంత్రంలాగా పని చెయ్యటం మాత్రమే అతనికి తెలుసు.

కేశవపిళ్ళెకు ఉత్తరార్థం అతని భార్య. పల్లెటూరిలో పుట్టిపెరిగిన కాత్యాయని - చదువుకోకపోయినా ఆమె అన్నిటికి సర్దుకుపోతుంది. ఈ నవలలోని రమణీయమైన పాత్రల్లో కాత్యాయని పాత్ర ఒకటి. ఆమెపాత్ర సృష్టిలో టాల్‌స్టాయి సారళ్యం వుంది.

'ఏణిప్పడిగళ్' కథావస్తువు రాజకీయమూ, సాంఘికమూ కూడా. తిరువితాం కూరులోని బాధ్యతాయుత ప్రభుత్వం నుంచి కేరళలోని సామ్యవాద ప్రభుత్వందాకా వ్యాపించిన పాతికేళ్ళ చరిత్ర యిందులో వుంది. ఈ పాతికేళ్ళల్లో ఎన్నో సంఘటనలు జరిగాయి, ఎన్నో మార్పులు వచ్చాయి. ఎన్నో సమస్యలు పరిష్కారమయినాయి. ప్రామాణికమైన కథలాగా తకళి చెప్పాడీ కథ. నివేదిక శైలి రాకుండా చూసేందుకు అతనెంత జాగ్రతపడ్డా అక్కడక్కడా అది రాకమానలేదు. అది ఒక విధంగా మంచిదే. కేశవపిళ్ళె అనే పాత్ర ద్వారా అతని జీవధారను పురస్కరించుకొని జాతీయ సంఘర్షణ చిత్రింపబడింది. తకళి యీ నవలలో పక్షపాత రహితుడయిన ఉపద్రష్టలాగా రాజకీయ సమాలోచన చేస్తాడు. ప్రభుత్వం దివాన్‌జీ చేతుల్లో ఉన్నాసరే, సామ్యవాదుల చేతుల్లో వున్నా సరే - రాజ్యాంగం మాత్రం జగన్నాథుని రథచక్రాల్లాగా నిర్దాక్షిణ్యంగా దొర్లిపోతూ వుంటుంది. ప్రజల కోరికలు అణిగిపోతూ వుంటాయి

అవకాశవాదులకు ఎప్పుడూ అవకాశం దొరుకుతూనే వుంటుంది. బీదవాళ్ళు తమ అగచాట్ల అర్జీలు చేత బట్టుకొని తిరిగి తిరిగి జీవితాన్ని నాశనం చేకుంటున్నారు. గోగోల్ వ్రాసిన 'డెడ్ సోల్స్' చదివి పుష్కిన్ అన్నాడట - "అయ్యో! రష్యా ఎంత దురదృష్ట దేశం!" అని. బహుశా 'ఏణిప్పడిగళ్' చదివిన తర్వాత మనం కూడా మన దేశాన్ని గురించి అలాగే అనుకుంటాం.

మనస్తత్వ విశ్లేషణలో తకళికి గల సామర్థ్యం నవలలోని పాత్రలన్నిటిలో కనిపిస్తుంది. ఏణిప్పడిగళ్, కేశవపిళ్ళె వృత్తాంతమే అయినా అతనికి సంబంధించిన యిద్దరు స్త్రీల చరిత్ర కూడా ఇందులో వుంది. కాత్యాయనీ, తంకమ్మా ఏదృష్టితో చూచినా సంకీర్ణ పాత్రలు. పరిస్థితి మారినప్పుడల్లా వాళ్ళలో నూతన పరివర్తన మనకు కనిపిస్తుంది. కాత్యాయని లోని ఓర్పు, సంయమనం తంకమ్మ లోని అతృప్త కామ వాంఛకూ అంతులేని వ్యామోహానికి పూర్తిగా వ్యతిరేకంగా వుంటుంది. ఆమెను కేవలం దుర్మార్గురాలు అనటం మనకు సమంజసంగా తోచదు. కేశవ పిళ్ళె నిర్దాక్షిణ్యంగా తటస్థంగా ఉండటం వల్లనే ఆమె తప్పు దారి పట్టింది. నిజమైన ప్రేమ ఆమెకు ఎన్నడూ

లభించలేదు. కేశవ పిళ్ళై తన అవసరాలు తీర్చుకొనేందుకు ఆమెను పనిముట్టుగా ఉపయోగించుకున్నాడు. ఎక్కడో దాగి వున్న ఏశక్తి సామర్థ్యాల బలంతోనే ఆమెలోని కామవాంఛను అణచినా అణగక బయటికి పొంగి వచ్చింది. కాషాయ బట్టలను, జపమాలలను లెక్క చేయకుండా ఆ ప్రవాహం వెల్లువలై పారింది- సహజమైన దుఃఖాంతము!

అరవైదాటిపోయినా తకళి యిప్పుడు కూడా రచనా వ్యాసంగంలో నిమగ్నులై వున్నారు. సర్వోత్తమమైన నవల నేనింకా రాయాలి - అని ఆయన మాటి మాటికీ చెపుతుంటారు. ఆయన కోరిక నెరవేరాలనే ఆశిద్దాం.

ఎస్.గుప్తన్ నాయర్

# 1

తల్లి చిరునవ్వుతో గుమ్మందాటి తోటలోనుంచి కేశవపిళ్ళను వెంటబెట్టుకుని వెళుతూవుంది. తండ్రి అరుగు చివర కుడి పక్కన కూర్చుని పళ్ళు తోముకుంటున్నాడు. అక్క వంటింటి గుమ్మం దగ్గర నిలబడి వుంది. పక్కామె నాణీ రోజులాగా ఆనాడు కూడా సాయం చేసేందుకు వచ్చింది. అతని ముఖంలో ప్రత్యేకమయిన భావభంగిమ యేమీ కనిపించటం లేదు. టెలిగ్రాం ఇచ్చి ఎందుకు పిలిపించారని కేశవపిళ్ళ ఆశ్చర్యంతో ఆలోచిస్తున్నాడు. చివరకు అడగనే అడిగాడు:

'టెలిగ్రాం ఇచ్చారెందుకమ్మా? నేను చాలా కంగారు పడ్డాను. అమ్మకు బహుశా జబ్బు చేసివుంటుందని అనుకున్నాను.'

తల్లి తెలియనట్టు అంది: 'నాకు తెలీదు. మీ నాన్న నడుగు.'

తల్లి ముఖ ముద్రను బట్టి చూస్తే ఆమెకు అంతా తెలుసని తేట తెల్లమవుతూ వుంది. అక్క ముఖంలో ముసిముసి నవ్వు చూస్తే ఆమెక్కూడా తెలుసని తెలుస్తున్నది.

పళ్లు తోముకుని పప్పు పిళ్ళ కేశవపిళ్ళ దగ్గరికి వచ్చి అన్నాడు: 'నేను నీవు నిన్ననే వస్తావనుకున్నాను.'

'సూపరింటెండెంటు సెలవియ్యలేదు. ఆయన చాలా విచిత్రమైన వ్యక్తి. టెలిగ్రాం కూడా చూపించాను. చివరకు సెలవుచీటి యిచ్చి అనుమతి తీసుకోకుండానే వచ్చాను'- అన్నాడు కేశవపిళ్ళ.

కొంచెంసేపటి వరకూ ఎవ్వరూ ఏమీ మాట్లాడ లేదు. కుట్టి అమ్మ భర్త నడిగింది: 'అయితేమరి..... అసలు విషయం చెప్పండి.'

పప్పు పిళ్ళ నోట 'ఊఁ' అన్నమాట మాత్రం వినవచ్చింది. కొంచెం సేపు ఆగి పప్పు పిళ్ళ కేశవపిళ్ళతో అన్నాడు 'ఈ నెల ముప్ఫయ్యో తేదీ బ్రహ్మముహూర్తంలో నీ పెళ్ళి నిశ్చయమయింది. పిల్ల. కుట్టన్ పిళ్ళ చెల్లెలు.'

కొంచెంసేపాగి తండ్రి అడిగాడు: 'తిరువనంతపురంలో మీ స్నేహితుల్నందర్నీ పిలిస్తే మొత్తం పెళ్ళి వాళ్ళెంత మందవుతారు?'

కుట్టి అమ్మ తన అభిప్రాయం చెప్పింది: 'ఇప్పుడే ఆమాట ఎలా చెపుతాడండీ?'

కొడుకువైపు తిరిగి అన్నది 'బాబూ! ఎక్కువ మందిని తీసుకురాకు. ఇవ్వాల్టికి పదిహేను రోజులకు నీకు పెళ్ళి. పెళ్ళి చాలా ముక్తసరిగా అవుతుందనే విషయం కూడా మనస్సులో పెట్టుకోవాలి.'

పప్పు పిళ్ళై, భార్య మాటతో ఏకీభవిస్తూ అన్నాడు: 'పెళ్ళికి ఎంత తక్కువ మందిని పిలిస్తే అంత మంచిది. అందరికీ ఛార్జీలు నీవే పెట్టుకోవాలిగదా! అందువల్ల తక్కువ మందిని పిలవటమే మంచిది.'

పప్పు పిళ్ళై పెళ్ళి భోజనాలను గురించి కబుర్లు సాగించాడు 'మంగళసూత్రం, వస్త్రాలు ఇక్కడే ఏర్పాటు చేస్తాం. వాడు రెండు వందలు కమలా ఫలాలు తీసుకురావాల్సి ఉంటుంది. తిరువనంతపురంలో మంచి కమలా ఫలాలు దొరుకుతాయి కదా! వాటితో పాటు రెండు కిలోల పొగాకు కూడా వాడే తేవాలి.'

తల్లి మధ్యలో జోక్యం చేసుకుని అన్నది 'వాడిదగ్గర అంత డబ్బెక్కడ ఉంటుందండీ? వాడికి వచ్చే జీతం పదిహేను రూపాయలే కదా!'

'వాడికి కావల్సిన డబ్బు నేనిస్తాను.' కేశవపిళ్ళై బొమ్మలా నిలబడిపోయాడు. తండ్రి బియ్యపుజావ తాగేందుకు వెళ్ళాడు. అమ్మ జావ ఇచ్చేందుకు వెళ్ళింది. కేశవపిళ్ళై తిరువనంతపురంలో సచివాలయంలోని రెవిన్యూ శాఖలో పనిచేస్తున్నాడు. తన కుర్చీ పక్కన కుర్చీలో కూర్చుని పనిచేసే గుమాస్తా తంకమ్మను అతను ప్రేమించాడు.

అక్క గౌరీ అమ్మ తమ్ముణ్ణి పలకరించింది! 'ముఖం కడుక్కున్నావా?' కేశవపిళ్ళై 'లేదు' అని చటుక్కున సమాధానం చెప్పాడు.

'అయితే మొహం కడుక్కుని జావ తాగు.' అన్నది. కేశవపిళ్ళై గుండె అదేరకంగా కొట్టుకుంటోంది. 'నాకక్కర్లేదు–' అన్నాడతను.

ఈమాట అతను చాలా కటువుగా చెప్పాడు. 'అయితే కాఫీ పెట్టిస్తానన్నది' గౌరీ అమ్మ. 'లేదు, అక్కర్లేదు, నేనిప్పు డే వెళ్ళాలి ' అని.

ఒక్కక్షణం ఆగి కేశవపిళ్ళై మళ్ళీ అన్నాడు: 'లేకుంటే నా ఉద్యోగం పోతుంది.' అతని మాటల్లో ఎంతో ఏవగింపూ, తిరస్కారం ధ్వనిస్తున్నాయి.

తిరువనంతపురంలో ఒక స్త్రీని అతను ప్రేమించకుండా వుండి వుంటే అతని మనస్సులో ఇంతటి ఏవగింపూ, తిరస్కృతి వుండేది కాదు. అతను బియ్యే ప్యాసయినాడు. అమ్మ, నాన్న, అక్కయ్య అందరి మీదా అతని బాధ్యత ఉన్నప్పటికీ అతని వివాహ విషయంలో అతని అభిప్రాయం తప్పకుండా కనుక్కుని వుండవలసింది. బహుశా అలా చేసివుంటే అతను పేచీపెట్టేవాడు కాదేమో! గౌరీ అమ్మకు తమ్ముడు ఇలా పెళ్ళి విషయంలో పేచీ పెడతాడని అనుమానం వేసింది. కుట్టి అమ్మ భర్తకు జావ ఇచ్చి కొడుకు దగ్గరికి వచ్చి రమ్మని బలవంతం చేయసాగింది – 'నీవుఇంట్లో తిని ఎన్నాళ్ళయిందో? నీకు నేను వడ్డించి కూడా చాలా రోజులయింది.'

అమ్మ అలా బతిమాలేసరికి కేశవపిళ్ళె మెతకబడి లేచాడు. జావ తాగుతున్నంతసేపూ కుట్టి అమ్మ కొడుకుతో పెళ్ళి కబుర్లు చెబుతూనే ఉంది. నచ్చ చెపుతూ అంది! 'తండ్రీ, ఇది మనకు ధర్మం. అమ్మాయి అన్న కుట్టన్ పిళ్ళె మీ నాన్నను బతిమాలి ఆయన దగ్గర మాట తీసుకుని వెళ్ళాడు. ఇప్పు డెలా కాదనటం? అక్కయ్యను, పిల్లలను కనిపెట్టివుంటున్న కుట్టన్ పిళ్ళె మనకు చాలా కావలసిన వాడు. అతని చెల్లెలే నీకు ఇల్లాలు కాబోతూవుంది. మేము ఒప్పు కున్నాం కాబట్టి ఈ సంబంధంలో తప్పేమీ లేదు. మా కన్న తండ్రికి మేలవుతుంది.'

చెమ్మగిల్లిన కళ్ళతో తల్లి ఆశీర్వదించింది. పెళ్ళి కూతురు గుణగణాలను గురించి కూడా ఆమె చెప్పదలుచుకున్న మాటలు చెప్పింది: 'చాలా నెమ్మదస్తురాలు. ఇప్పుడు నీవు చూడ లేదు. చిన్నప్పు డు చూసుంటావు. మరో విషయం కూడా వుంది బాబూ! ఈ సంబంధం కుదిరితే నాకు చాలా సంతోషంగా ఉంటుంది. మీ అమ్మనూ, నాన్ననూ ఆ అమ్మాయి కనిపెట్టుకుని వుంటుంది. ఎవరినీ పల్లెత్తు మాట అనదు. అంత ధనవంతురాలు కాకపోయినా రాత్రి భోజనానికి బియ్యం కావాలని బలవంతం చెయ్యదు.'

తల్లి పెళ్ళికూతురును గురించి ఇలా చెప్పు కుంటూ పోతున్నది. కేశవపిళ్ళె ఏమీ మాట్లాడలేదు. జావతాగటం పూర్తయ్యాక అతను మాట్లాడకుండా లేచి వెళ్ళాడు.

కేశవపిళ్ళె వెళ్లి పోయాడని గౌరి అమ్మ చెపుతేనే గాని తల్లిదండ్రులకు తెలియలేదు. ఆమె తల్లితో తన అనుమానం వ్యక్తపరచింది. తండ్రికి అసలు చెప్పనేలేదు. కొడుకుకు సంబంధాన్ని గురించి చెప్పి పప్పు పిళ్ళె రోజూలాగే బయటికి వెళ్ళాడు.

కుట్టి అమ్మ కంగారు పడింది. తల్లి కూతుర్ని అడిగింది: 'వాడు తండ్రికి చెడ్డపేరు తెస్తాడటే?' కూతురు జవాబు చెప్పింది: 'నాకు తెలీదు. కాని ఒక్కమాట చెపుతాను- ఈ సంబంధం తనకు ఇష్టమయింది, కానిదీ తేల్చి చెప్పకుండానే వెళ్ళి పోయాడు.'

కుట్టి అమ్మకు కొంచెం స్ఫూర్తి వచ్చింది: 'అసలా విషయం వాణ్ణి ఎవరయినా అడిగితే కదా!'

గౌరి అమ్మ అన్నది: 'వాణ్ణి అడిగి చెయ్యాల్సింది గదా!' కుట్టి అమ్మ సందేహం స్థిరపడ్డది. రకరకాల ఆందోళనలు ఆమెను చుట్టుముట్టాయి.

'వాడు పెళ్ళికి రాడేమో? అసలిక్కడికింక రానే రాడేమో?'

అయినా కుట్టి అమ్మ కచ్చితంగా ఏమీ చెప్పలేకుండా వుంది.

'ఒక వేళ వాడు వచ్చినా యీ సంబంధం చేసుకోడు. అది మాత్రం ఖాయం.'

కుట్టి అమ్మ తన మనస్సును సమాధాన పరుచుకునేందుకు కూతురితో అన్నది: 'వాడు బహుశా సిగ్గుపడి యేమీ చెప్పలేదేమో?'

గౌరి అమ్మ అంది: 'ఏమయినా వాణ్ణి అడిగి సంబంధం నిశ్చయించాల్సింది.'

కుట్టి అమ్మ కూతురితో ఏకీభవించింది. కాని ఆనాడీ మాట యెవ్వరికీ తోచలేదు.

పప్పు పిళ్ళై మూడు నాలుగు గంటల తర్వాత తిరిగి వచ్చాడు. కుట్టి అమ్మ భర్త కోసం ఎదురుచూస్తూ కూర్చుంది. పప్పు పిళ్ళై ఇంట్లో అడుగు పెట్టి పెట్టక ముందే కుట్టి అమ్మ ఆయన దగ్గరికి వెళ్ళి అన్నది: 'చూడండి. అంతా మీ యిష్టప్రకారం నిర్ణయించుకున్నారు. పిల్లవాడేమో అలిగి వెళ్ళి పోయినాడు'.

పప్పు పిళ్ళై స్తంభించి పోయాడు. 'ఏమిటి! అలిగి వెళ్ళిపోయాడా?' అన్నాడు. 'అవును, అలిగి తిరువనంతపురం వెళ్ళాడు.'

భర్తమీద నేరం మోపుతూ కుట్టి అమ్మ మొదలు పెట్టింది: 'చిన్నప్పుడు మనం చెప్పినట్టు వినేవాడు. ఇప్పుడు పెద్దవాడయినాడు కదా! తనకు నచ్చినట్టు చేస్తాడు. మన మాట ఎందుకు వింటాడు? నేనా రోజే చెప్పాను.'

పప్పు పిళ్ళైకు ఏం చెప్పాలో తోచలేదు. 'కచ్చితంగా చెప్పు, నీవనేదేమిటి.'

కుట్టి అమ్మ కూడా వదల్లేదు: 'ఎందుకిలా నా ప్రాణం తినేస్తారు?' అన్నాది!'

పప్పు పిళ్ళై అడిగాడు: 'ఇక్కడేమన్నా కాండ జరిగిందా?'

'అబ్బాయి అలిగి వెళ్ళాడు.'

'ఎందుకు?'

'పెళ్ళికి మాట యిచ్చే ముందు వాణ్ణి కూడా అడిగి వుండాల్సింది గదా?'

పప్పు పిళ్ళై తల తిరిగింది.

'పెళ్ళి చేసుకోవడం ఇష్టం లేదని చెప్పి వెళ్ళాడా?'

'అలా యేం చెప్పలేదు. నిజం తెలుసుకోకుండా వాణ్ణి ఏమనద్దు. కాని వాడు మాత్రం తిరిగి వెళ్ళాడు. అంతా మీ కూతుర్ని అడగండి. నాకేం తెలియదు. నేనారోజే చెప్పాను.'

'ఏమిటి నీవు చెప్పింది? ఎప్పుడు చెప్పావ్?' అంటూ పప్పు పిళ్ళై విసుక్కుంటూ ఇంట్లోకి వెళ్ళాడు. కుట్టి అమ్మ కూడా ఏదో గొణుక్కుంటూ భర్త వెంబడే వెళ్ళింది.

పప్పు పిళ్ళై గౌరి అమ్మను పిలిచి అడిగాడు. గౌరి అమ్మ తన మనస్సులోని సందేహం తండ్రికి చెప్పింది. ఆ తర్వాత పప్పు పిళ్ళై తల్లినీ, కూతురినీ అడిగాడు: 'వాడు ఎప్పుడు వస్తానని చెప్పి వెళ్ళాడు?'

'వాడు వెళ్ళిన సంగతి అసలెవరికయినా తెలిస్తేగా!' అంది గౌరి అమ్మ.

'ఏం, నీవడగ లేదా?'

తల్లీ, కూతురు దీనికేమి సమాధానం చెప్పలేదు. పప్పుపిళ్ళైకు కోపం వచ్చింది.

'తల్లి మంచిదే, కూతురూ మంచిదే, కొడుకూ మంచివాడే! బుద్ధిమంతులందరూ ఇలాగే వుంటారు. నాకిదంతా ముందే తెలుసు'.

కుట్టిఅమ్మకు కూడా ఆవేశం వచ్చింది: 'నామీద విరుచుకు పడతారెందుకు? నాకు బోలెడన్ని పనులు. ఏదని చూస్తాను? ఈ పెళ్ళితో నాకేమి సంబంధం లేదు. సంబంధం నిర్ణయించేముందు అబ్బాయి అభిప్రాయం తెలుసుకోవాల్సింది పోనిచ్చి నా మీద నేరం మోపడం ఎందుకు?'

పప్పు పిళ్ళై కొట్టేందుకు చెయ్యెత్తి బెత్తంతో బెదిరిస్తూ అడిగాడు: 'మరి నేనెలా చెయ్యాలట?'

కుట్టిఅమ్మ ఎదుట నిలబడి మొండిగా సమాధానం చెప్పింది: 'పిల్లవాణ్ణి పిలిపించి పెళ్ళిసంగతి వాడికి చెప్పి తర్వాత మాట యిచ్చి వుండాల్సింది, అలా చేశారా మీరు?'

ఏం చెప్పాలో తోచక పప్పుపిళ్ళై కోపంతో బిగ్గరగా అరిచాడు: 'వాడి అభిప్రాయం కనుక్కోవడం నాకిష్టంలేదు. ఎందుకు కనుక్కోవాలి.'

కుట్టిఅమ్మ వెంటనే అందుకుంది: 'అయితే అంతా మీరే అనుభవించండి.'

పప్పుపిళ్ళై మండిపడ్డాడు: 'ఛీ చండాలవుదానా! నీ వంశమంతా ఇలాంటిదే.'

'మా వంశాన్ని గురించీ, మా వాళ్ళను గురించీ ఏమీ అనవద్దని ఎన్నిసార్లు చెప్పాను!'

ఇప్పటికి పప్పుపిళ్ళైకు సంభాషణలో సారస్యం కొంచెకొంచెం బోధ పడుతూ వుంది. పొట్ట తడుముకుంటూ అతను మామిడి చెట్టు కింద తిరుగుతున్నాడు. కుట్టిఅమ్మ అక్కడికూడా అతని వెనకాలే వెళ్ళింది.

పప్పుపిళ్ళై అడిగాడు 'వాడు మనల్ని మోసం చేస్తాట్టే'

భార్య అతనికి ధైర్యం చెపుతూ అంది 'వాడు మన అబ్బాయి కదండీ, వాడలా చెయ్యడు. తల్లిదండ్రులకు అవమానకరమైన పని చేసేందుకు వాడు పూనుకోలేడు.'

ఎవ్వరితో ఏమీ మాట్లాడకుండా కేశవపిళ్ళై వాకిలిదాటి బయటికి వెళ్ళేసరికి తిరిగి తాను రానేమోనని అతని కనిపించింది. కాని యేమి తోచలేందు. మళ్ళీ ఇంకెన్నటికీ తిరిగి రాకూడదని కచ్చితంగా నిశ్చయించుకోనూలేదు. అతని మనసులో మాటిమాటికి అదే ఆలోచన గిర్రున తిరుగుతూంది. ఎంత ప్రయత్నించినా అతని మనసులో ఆ ఆలోచన అంతరించటం లేదు. అందువల్ల గుండెల్లో ఏదో బండ పెట్టినట్టుంది. అతని మనస్సు మాటిమాటికి అతన్ని 'ఇక యింటికి రాకు, తల్లిదండ్రులను చూడకు' అని వారిస్తూ వుంది.

కాని వెళ్ళేముందు ఒకసారి యింటివైపు తిరిగి చూడమని కూడా మనస్సు మందలిస్తూ వుంది. నడుస్తూ నడుస్తూ కేశవపిళ్ళై ఉన్నట్టుండి నిలబడిపోయాడు. అతని కాళ్ళు ముందుకు సాగటం లేదు. అతను కొంచెం మెడ తిప్పాడు. వీల్లేదు, ఇల్లు వదిలి వెళ్ళేందుకు అతనికి మనస్కరించలేదు.

పప్పుపిళ్ళైకు సమవయస్కుడైన స్నేహితుడు కిట్టూమామ అతనికి దారిలో కనిపించాడు. ఎప్పుడూ చాలా బిగుసుకొని వుండే కిట్టూమామ విరగబడి నవ్వాడు. కిట్టూమామకు కేశవపిళ్ళై అంటే చాలా యిష్టం.

'ఏమబ్బాయ్, ఎప్పుడొచ్చావ్' కిట్టూమామ పలకరించాడు.

కేశవపిళ్ళై కూడా నవ్వేందుకు ప్రయత్నించి మళ్ళీ సర్దుకొని అన్నాడు: 'ఇవాళే ఉదయం వచ్చాను. మీరెక్కడికి వెళుతున్నారు?'

'నేటుంగాట్టు వెళ్తున్నాను. మీనాన్నగారక్కడ లేరా?'

కిట్టూమామకు కేశవపిళ్ళై మనస్థితి తెలీదు. అందువల్ల అతని దిగజారిన ముఖవైఖరిని ఆయన గమనించలేదు. మంచిని కోరే కిట్టూమామ ఆరంభించాడు: 'అబ్బాయ్. అదిచాలా మంచి సంబంధం. ఫస్ట్‌క్లాసయిన సంబంధం. ఆ అమ్మాయి జాతకం చాలా మంచిది. అంతమంచి జాతకం నేను మరోటి చూడలేదు. పంచమహాయోగాల్లో మూడింటి లక్షణా లు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ అమ్మాయిని చేసుకున్నవాడికి సుఖసంపదలు వెతుక్కుంటూ వస్తాయి. అంత యోగకారకమయిన జాతకం ఎక్కడ దొరుకుతుంది! అన్నీ భర్తకు అనుకూలమయిన యోగాలే!'

జాతకంలోని గుణగణాలను వర్ణిస్తూన్న కిట్టూమామ కళ్ళు తళతళ మెరుస్తున్నాయి. జాతకం మీద అతనికి గట్టి నమ్మకం, తృప్తి, ఆనందం ఉన్నట్టు కేశవపిళ్ళై ఆయన మనస్థితిలో కూడా గమనించాడు. ఆ ముసలివాని సంతోషాన్ని కేశవపిళ్ళై అర్థం చేసుకున్నాడు. కిట్టూమామకు తనమీదగల ఆపేక్షను గురించి కేశవపిళ్ళైకు ఏమాత్రం సందేహంలేదు. ఆ అమ్మాయి జాతకంలో ఏమన్నా దోషమంటే అదికూడా కిట్టూమామ చెప్పివుండేవాడు. చిన్నప్పటి నుంచీ అతనికి కిట్టూమామ ప్రేమ తెలుసు. అతడు దాన్ని అర్థంచేసుకున్నాడు. కిట్టూమామ చెప్పుకు పోతున్నాడు:

'ఈనాడు చదువుకున్న మీకు నమ్మకం లేక పోవచ్చు గాని జ్యోతిష్యం మాత్రం నిజం.'

ఆశీస్సులు కురిపించే కళ్ళతో కిట్టూమామ అన్నాడు: 'మా అబ్బాయి అభివృద్ధికోసం నేను సంబంధాన్ని నిశ్చయం చేశాను.'

స్వరం తగ్గించి మెల్లగా రహస్యం చెప్పాలని కిట్టూమామ అతని చెవిలో చెప్పాడు: 'ఆ అమ్మాయికి జీవితంలో మానసికమైన ఆనందం వుండదని కూడా ఆమె జాతకంలో ఉంది.'

కేశవపిళ్ళై ఏమీ మాట్లాడలేదు. అతను వెళ్ళిపోతీరాలి. కిట్టూమామ అడిగాడు: 'కురుమాటీ నుంచి పడవలో వెళతావా?'

'అవును'

'సరే, వెళ్ళు. ఇరవైతొమ్మిదో తేదీ పెళ్ళి ముహూర్తం. ఇరవైయెనిమిదో తేదీ నీవిక్కడికి వచ్చెయ్యాలి. ఒక్కమాట గుర్తుంచుకో. అయిన వాళ్ళతో సంబంధం. ఖర్చు తక్కువ చెయ్యాలి. ఎలాగో శుభకార్యం సక్రమంగా జరిగిపోవాలి.'

కిట్టూమామ అతన్ని సాగనంపాడు.

'ఆ అమ్మాయిని చేసుకోవటం అదృష్ట' మనే మాట కేశవపిళ్ళై హృదయంలో నాటుకు పోయింది. కేశవపిళ్ళై మనస్సులో, పైకి రావాలనే అభిలాష అవ్యక్తంగా దాగివుంది. దానికి కేంద్రం తంకమ్మ. అతని జీవితంలో తంకమ్మ తటస్థించటం వల్లనే అభివృద్ధి సాధ్యమవుతుంది. 'తంకమ్మతో సంబంధం సాగిస్తూనే అదృష్టవంతురాలయిన యీ అమ్మాయిని చేసుకుని నేను జీవితంలో అభివృద్ధి సాధించగలనా?'

– ఆలోచనల్లో మునిగిపోయి ముందుకు సాగుతున్న కేశవపిళ్ళైను మట్టత్తిన్‌గారి అవ్వ గుమ్మంలో నుంచి పిలిచి పలకరించింది: 'అబ్బాయ్ కేశూ! ఇంతకు ముందేగా వచ్చావ్. అప్పుడే వెళ్ళిపోతున్నావేం?'

కేశవపిళ్ళై నవ్వాలి కాబట్టి నవ్వుతూ అన్నాడు: 'అవును వెళుతున్నాను.'

దారిలో తటస్థపడ్డ స్త్రీలూ, పురుషులూ అతన్ని ఇలాగే చిన్నచిన్న ప్రశ్నలు వేశారు. కొంతమందికి అతను సమాధానం చెప్పలేదు. కొందరి ప్రశ్నలను అతను విననేలేదు. బహుశా పెళ్ళి సంబంధం నిశ్చయమైనందు వల్లనే అందరి దృష్టి అతని మీద ప్రసరించింది.

నదీతీరం చేరిన తర్వాత అతను పడవకోసం ఎక్కువ సేపు వేచివుండాల్సిన అవసరం రాలేదు. అతనక్కడికి చేరగానే పడవ వచ్చింది. దానిలో ఎక్కి అతను వెళ్ళిపోయాడు.

పడవ ముందుకు వెళుతోంది. ఇంటినుంచి బయలుదేరేప్పుడు అతనిలో ఉదయించిన ఆలోచనలు చీమలు పాకినట్టు అతని మనస్సులో పాకుతున్నాయి. ఇదే చివరి ప్రయాణం అని అతనికి అనిపించింది. దారిలో ఈ పొలాలన్నీ అతనిక చూడలేకపోవచ్చు. పడవ ముందుకు సాగుతున్నది. ఉన్నట్టుండి ఈపడవను గట్టున ఆపి అక్కడే దిగిపోదామని అతనికి అనిపించింది. కాని అలా చెయ్యలేక పోయాడు.

మనస్సుకు చిరాకు కలిగించే ఆలోచనలను దూరంగా పారద్రోలేందుకు అతను ప్రయత్నించాడు. కాని వాటిబారినుంచి తప్పించుకోవడం అంతసులభం కాదు. రకరకాల దిగుళ్ళతో బాధపడుతున్న అతను

ఏదిగులును మానేయగలడో అతనికే బోధపడటంలేదు. ఆలోచనల కారునీడ అతనికి నిలకడ లేకుండా చేస్తున్నది.

పడవలో అతనితో ప్రయాణం చేసేవాళ్ళు చాలా కొద్దిమందే వున్నారు. నలుగురు ప్రయాణీకులు పడవ పైకప్పుమీద విశాలంగా ఉన్నదని పేకాడుతున్నారు. ఒక ముసలి ప్రయాణీకుడు కొంచెం దూరంలో ఒంటరిగా కూర్చుని వున్నాడు. ఆ ప్రయాణీకుని వయస్సు కేశవపిళ్ళె తండ్రి పప్పుపిళ్ళె వయస్సుకు సమానంగా వుంటుంది. ఆ ముసలివాడు ఏవేతన ఆలోచనల్లో మునిగివున్నాడు. అతని ముఖంలో విషాద రేఖలు అవరించి వున్నాయి. జాగ్రత్తగా గమనిస్తే అతనిలో ఏదో నైరాశ్యం వున్నట్టు గోచరిస్తుంది. అతని నైరాశ్యానికి కారణమేమిటో! ఎందుకో అతనికంత విరక్తి!

ఒంటరిగా కూర్చున్న కేశవపిళ్ళెను ఆముసలివాడు జాగ్రత్తగా గమనించాడు. 'ఏమబ్బాయ్! నీకు పేకాడటం రాదా?' అని అడిగాడు.

'వచ్చు' అని కేశవపిళ్ళె సమాధానం చెప్పాడు.

'మరినీవు కూడా వాళ్ళతో పేకాడకూడదూ?'

'ఆడాలని లేదు.'

'మంచిది' అని ముసలివాడు తన రొండిలోనిమూట విప్పాడు. అందులో చుట్టిన తమలపాకుల బీడా, ఒక చిన్న చాకూ, ఒక వెండిరూపాయి, ఎన్నో అర్ధరూపాయిలూ ఉన్నాయి.

కేశవపిళ్ళె ఆయన్ని పలకరించాడు: 'ఎక్కడికి వెళుతున్నావ్ బాబాయ్?'

'కొల్లం'

'పనిమీదనా?'

కొంచెంసేపు ఆయన మౌనంగా వున్నాడు. వక్కలు కత్తిరిస్తున్నాడు. కొంచెం సేపటికి అన్నాడు: 'అక్కడ మా అబ్బాయి వున్నాడు.'

పిల్లవాడి సంగతి వచ్చేసరికి ఆయనకి తన కథ అంతా చెప్పాలనిపించింది. చెప్పకుండా వుండలేకపోయాడు. కాస్సేపు ఆగి సంభాషణ సాగించాడు.

'నాకొక్కడే పిల్లవాడు. వాడక్కడ రైల్వే ఆఫీసులో పని చేస్తాడు. నాలుగు నెలలనుంచి వాడిదగ్గరినుంచి వుత్తరం లేదు. వాళ్ళమ్మకు అమ్మవారు పోసింది. వాణ్ణి కలుసుకునేందుకు వెళుతున్నాను'.

ఆకూవక్కా నములుతూ పొగాకు బయటికి తీసి అతను మళ్లీ మూట జాగ్రత్తగా కట్టుకున్నాడు. కేశవపిళ్ళెకు తనకేదో సత్యం సాక్షాత్కరించినట్టు అనిపించింది. ఆ ముసలివాణ్ణి గురించి మరికొన్ని విషయాలు తెలుసుకోవాలని అతని మనసులో కుతూహలం కలిగింది. 'అబ్బాయి డబ్బు పంపిస్తాడా?' అని అడిగాడు.

అసలతను ఇంకేదో అడగాలనుకున్నాడు. కాని సంభాషణ ఎలా ఆరంభించాలో అతనికి తెలియలేదు. అయినా ఆ ప్రశ్నతో ఎన్నో విషయాలు బయటపడ్డాయ్.

'పిల్లవాడు పంపించే డబ్బుతోటే నాకు రోజులు గడుస్తాయి. ఈమధ్య వాడు పెళ్లి చేసుకున్నాడు. వయసు వచ్చిన తర్వాత అదికూడా అవసరమే కదా! వాడు కూడా ఒక పిల్లను వెతుక్కుని పెళ్లి చేసుకున్నాడు.'

ముసలి వ్యక్తి తనమూటను రొంటిలో దోపుకున్నాడు. తన పిల్లవాడి మీద అతనికి ఇప్పటికీ సానుభూతి వుంది-

'వాడికి కూడా బాధ్యత వుంది. ముగ్గురు పిల్లల తండ్రి. వాళ్ళను పెంచి పెద్ద చెయ్యాలి. వాడికి వచ్చేది వాడికే చాలదు. ఇదివరకులాగా పంపలేడు.'

అతనికి ఒకటే దిగులు.

'పిల్లవాణ్ణి చూడాలని వాళ్ళమ్మకు కళ్లు కాయలు కాచాయి. వాణ్ణి చూసి ఏడు సంవత్సరాలయింది. డబ్బు పంపించక పోయినా మా కళ్ళకు కనిపించనన్నా కనిపించాలి కదా!'

అతను రాకపోవటానికి ఏమన్నా కారణముందా?' అని అడిగాడు కేశవపిళ్ళై.

ముసలి అతను కొంచెం ఆలోచించి సమాధానం చెప్పాడు: కారణం వుందనీ చెప్పచ్చు. లేదనీ చెప్పచ్చు. ఆ పిల్లను పెళ్లి చేసుకోవడం వాళ్లమ్మకు ఇష్టం లేదు. అది తన అన్న కూతురినిచ్చి చేద్దామనుకుంది. అయినా నేను పెళ్లికి వెళ్ళాను.'

ఉన్నట్టుండి ఒక్కసారి కేశవపిళ్ళై మానసిక నేత్రాల్లో ఒక దృశ్యం మెదిలింది. కొన్ని సంవత్సరాల తర్వాత వప్పు పిళ్ళై కూడా ఇలాగే ఆకూవక్కా, చిల్లర డబ్బులూ తీసుకుని తనను చూసేందుకు పడవలో ప్రయాణం చేయవచ్చునని అతనికి తోచింది. అవును, అలా జరిగినా జరగవచ్చు. కేశవపిళ్ళై కళ్లు మూతలు పడ్డాయి. కాని ఆ దృశ్యం మాత్రం అతని కళ్లలో నిలిచిపోయింది.

'మా అబ్బాయికీ, వాడి భార్యకూ మా మీద అపేక్ష వుండేందుకు కారణమేమన్నా ఉందా?' అన్నాడు ముసలివాడు.

'తంకమ్మకుందా?' అని తన్నుతాను ప్రశ్నించుకున్నాడు కేశవపిళ్ళై.

తన ప్రశ్నకు ముసలి అతను చెప్పిన సమాధానమే, కేశవపిళ్ళై ప్రశ్నకు కూడా సమాధానమయింది.

'ఆపేక్ష కనిపించేది కాదు. దాన్ని చూసేందుకు ప్రయత్నించనవసరం లేదు.'

పడవ నడిపే వాళ్లల్లో ఒకడు అడిగాడు: 'తోట్టపల్లి, తోట్టపల్లి. ఎవరయినా దిగేవాళ్లున్నారా?'

'ఆఁ దిగాలి'- అన్నాడు కేశవపిళ్ళై అప్రయత్నంగా.

పడవ ఒడ్డుకు చేరింది.

'అబ్బాయ్. ఇక్కడే దిగాలా'- అని అడిగాడు ముసలాయన.

'అవును.'

కొల్లం దాకా టిక్కెట్టు తీసుకుని కూర్చున్న కేశవపిళ్ళై తోట్టపల్లి లోనే దిగిపోయాడు.

## రెండు

తల్లి దండ్రులు అష్టకష్టాలు పడి కేశవపిళ్ళైను బియ్యే దాకా చదివించారు. గంజి తాగి బియ్యం అమ్ముకుని చదివించారు. అతను తిరువనంతపురం కాలేజిలో చదివాడు. పరీక్షలో ఉత్తీర్ణుడయిన తర్వాత మళ్ళీ పని చూసుకునేందుకు వెంటనే తిరువనంతపురం వెళ్ళాడు.

అతను ఉద్యోగం కోసం దరఖాస్తులు పెట్టుకున్నాడు. ఆఫీసర్ల చుట్టూ, ఆఫీసుల చుట్టూ తిరిగాడు. ఒంటరివాడు. ఎవ్వరూ సిఫారసు చేసేవాళ్ళు దొరకలేదు. ఈ లోగా అతని స్నేహితులకెందరికో ఉద్యోగాలు దొరికాయి. అతనితో చదువుకున్న రామచంద్రన్ చాలా తెలివిగల విద్యార్థి. సెక్రటేరియట్‌లో సీనియర్ క్లర్కుగా చేరాడు. ఫిలిప్స్ లంచం పెట్టి ఉద్యోగం సంపాదించాడు. అతను కూడా సెక్రటేరియట్ లోనే వున్నాడు. ఎవరో ధనవంతుల పిల్లను, పెళ్లి చేసుకుంటానని చెప్పి పరమేశ్వరన్ నాయర్ ఉద్యోగం సాధించాడు. మరో స్నేహితుడు కొత్తవీధిలో పోలీస్ ఇన్‌స్పెక్టరు వేషంలో వుండగా తను చూశాడు. ప్రసాద్, అబ్దుల్లా బి.యల్ లో చేరారు. కేశవపిళ్ళై లాగా దరఖాస్తులిచ్చి తిరుగుతున్న వాళ్లు కూడా వున్నారు. నలినాక్షన్, రవీంద్రన్ అలాంటి వాళ్లు. కాని వీళ్లకు సిఫారస్ చేసేవాళ్లున్నారు. చిన్న వుద్యోగంతో తృప్తి చెందని వాళ్లుకూడా కేశవపిళ్ళై కు తెలుసు. సంతన్ కోటలో సందుల్లో గొందుల్లో వున్న ఒక యింట్లో లక్ష్మి అమ్మ, ఆమె భర్త శివన్ పిళ్ళై ఒక చిన్న హొటలు పెట్టారు. చెదలు పట్టిన మామిడి కొయ్య చెక్కకు సున్నం పూసి దానిమీద హొటలు పేరు చెక్కించారు- 'ఓం శివమయం లక్ష్మి హొటల్' అని దాని పేరు. ఆ వీధిలోని మిగిలిన ఇళ్ళలో వస్తుప్రదర్శన శాలలో పనిచేసే వాళ్లు, వీధులు ఊడ్చేవాళ్లు ఉంటున్నారు. కొట్టాయంలో ఉద్యోగం పోయిన తర్వాత మళ్ళీ ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్న పోలీసు బంట్రోతు కూడా అక్కడే వుంటాడు. కేశవపిళ్ళై కూడా రెండిళ్ళలో ట్యూషన్ చెప్పు కుంటూ అక్కడే కాలక్షేపం చేస్తున్నాడు.

చదువుకునే రోజుల్లో కూడా కేశవపిళ్ళైకు గొప్ప అభిలాషలు లేవు. ముందు ముందు తను ఏంకావాలా అని అతనేమీ కలలు కనలేదు. దాన్ని గురించి అతను దిగులు పడనూ లేదు. కాని ఆ రోజుల్లో అలా ఆలోచించే అతని స్నేహితులు చాలామంది వుండి వుంటారు. వాళ్లు కూడా ఉద్యోగం

కోసం తిరుగుతూనే వున్నారు. కేశవపిళ్ళైకు తన జీవనోపాధి వెతుక్కోవలసి వచ్చింది. 'లక్ష్మి' హోటల్లో ఒకాయన చీఫ్ సెక్రటరీ మేనన్ మంచితనాన్ని గురించి ఒక రోజతనికి చెప్పాడు. ఆనాటి నుంచి ఉదయం, సాయంత్రం పార్కువ్యూ గేటు ఎదురుగా ఉద్యోగం కోసం అతను నిలబడటం మొదలు పెట్టాడు. చీఫ్ సెక్రటరీ వెళ్లేప్పు డూ, వచ్చేప్పు డూ అతనికి వంగి నమస్కారం చెయ్యటం అతని నిత్యకృత్యమయిపోయింది. ఒకనాడు గేటు దగ్గర నిలబడే పోలీసు బంట్రోతు కేశవపిళ్ళైతో అన్నాడు: 'నీవు కూడా వెళ్లు బాబూ! మేనన్ చాలా మంచివాడు, దయామయుడు. కోప్పడతాడు గాని, నీ పని నెరవేరుతుంది.'

కేశవపిళ్ళైకు ఆశ హెచ్చింది. మరో రోజు మరో పోలీసు బంట్రోతు అతన్ని మందలిస్తూ అన్నాడు: 'అంతా బాగుంది గాని ఆయనగారికి కోపం వచ్చిందంటే మా రంగు మారిపోతుంది. ఇలా మెత్తగా ఉండేందుకు వీలుండదు.'

మరో పోలీసు కర్కోటకుడు 'ఉద్యోగం కోసం నీవు చేసే ప్రయత్నాలు మహాబాగా వున్నాయ్. నీవిలాగే వస్తూ వుంటే ఒకరోజు మెడ బట్టి నెట్టాల్సి వస్తుంది. ముందు గానే సర్దుకుంటే మంచిది'- అన్నాడు.

అయినా మొదటి పోలీసు చెప్పిన మాటలకు కేశవపిళ్ళై విలువనిచ్చాడు.

ఒకనాడు కేశవపిళ్ళై చీఫ్ సెక్రటరీ కంటపడ్డాడు. ఆయన కారాపి 'ఎవరు నీవు? ఏం సంగతి' అని అడిగాడు.

జవాబు ఒక్క వాక్యంలో చెప్పేందుకు వీల్లేదు. ఒక గంటసేపు చెప్పినా చాలదు. ఒక్క వాక్యంలో చెప్పేస్తే పని చెడిపోతుంది. కేశవపిళ్ళై నాలుకలో తడి ఆరిపోయింది. అతను గజగజ వణకి పోతున్నాడు. నోటమాట రావటం లేదు. కాని మరుక్షణమే అతని వాక్కు బలం చేకూర్చుకుంది:

'నేను ఆకలితో బాధపడుతున్నాను. బియ్యే ప్యాసయ్యాను.'

చీఫ్‌సెక్రటరీ అతన్ని ఆపాదమస్తకం తేరిపారచూసి అన్నాడు: 'అయితే నన్నేం చేయమంటావ్?'

'నన్ను కాపాడండి,' అని అతను వెంటనే సమాధానం చెప్పాడు.

చీఫ్ సెక్రటరీ మేనన్ హుంకారంతో దానికి సమాధానం చెప్పి కారులో రివ్వున వెళ్ళి పోయాడు.

మర్నాడు చీఫ్ సెక్రటరీ కారాపి కోపంతో అన్నాడు: 'శకునపక్షిలా రోజూ ఇక్కడ నిలబడతావేం? ఖాళీవుంటే నిన్ను తీసుకుంటాను. ఈ మాట నీకింతకుముందే చెప్పాను. నీకర్థం కాలేదా? మళ్ళీ నీవీ గేటు దగ్గర కనిపించావా- మర్యాదగా వుండదు'.

ఇదంతా వింటున్న జపాన్ బంట్రోతు చీఫ్ సెక్రటరీ కారు వెళ్లిపోయిన తర్వాత అతన్ని మందలిస్తూ అన్నాడు: 'వినిపించిందా నీకు? మళ్లీ నీవి గేటు దగ్గర కనిపించావా నీ మెడపట్టుకొని గెంటేస్తాను.'

కేశవపిళ్ళై ఆలోచించాడు. ఖాళీవుంటే నీకు ఉద్యోగం ఇస్తానని చీఫ్ సెక్రటరీ అతనితో అంతకు ముందెప్పు డూ చెప్పలేదు. అంతేకాదు. అంతకు ముందెవ్వరూ ఇలాంటి మాట అనలేదు. 'ఇక్కడ ఖాళీలేం లేవు' అన్నమాటే అతనికి వినవస్తూంది. కాబట్టి ఉద్యోగం వస్తుందని ఆశించవచ్చునని కేశవపిళ్ళైకు అనిపించింది.

మరోరోజు గేటు దాటి వెళ్లేప్పు డు చీఫ్ సెక్రటరీ కేశవపిళ్ళైను లోపలికి రమ్మన్నాడు. ఆరోజు అతను చెప్పదలచుకున్నదంతా చెప్పాడు. చీఫ్ సెక్రటరీ అంతా జాగ్రత్తగా విన్నాడు. అతన్ని మర్నాటి నుంచి ఆఫీసులో చేరమని చెప్పాడు.

ఆ మర్నాటినుంచి కేశవపిళ్ళైకు సెక్రటేరియట్‌లో నెలకు పదిహేను రూపాయల జీతం మీద జూనియర్ క్లర్కుగా ఉద్యోగం దొరికింది.

ఇప్పు డతను రెవిన్యూ శాఖలో పని చేస్తున్నాడు. ఇంటి నుంచి ఇరవై అయిదు రూపాయలు తెప్పించుకొని అతను కొత్త చొక్కా లుంగీ కొనుక్కున్నాడు. తంపానూర్ హాస్టల్లో తను ఉండేందుకు ఒక గది తీసుకున్నాడు. ఈ విధంగా కేశవపిళ్ళై తన జీవితాన్ని ప్రారంభించాడు.

రెవెన్యూ శాఖలో ఒక సూపరింటెండెంటు కింద అయిదుగురు గుమాస్తాలు పనిచేసే వాళ్లు. ఆ అయిదుగురిలో హరిహర అయ్యర్ అందరికంటె సీనియర్; బుద్ధిమంతుడు. చురుకయినవాడు. వయసు మీరిన బ్రాహ్మణుడు. రెండో గుమాస్తా గోవిందన్ నాయర్. ప్రభాకర్, మాత్యూ నవ యువకులు. నాలుగు సంవత్సరాల నుంచి వాళ్లు పని చేస్తున్నారు. కుమారి తంకమ్మ రెండు సంవత్సరాల క్రితం ఉద్యోగంలో చేరింది. ఆమె, సెక్రటరి కృష్ణన్‌నాయర్ అన్న కూతురు. వాళ్లందరిలో కేశవపిళ్ళై ఒక్కడే బియ్యే ప్యాసయిన వాడు.

కేశవపిళ్ళైకు తనతో చదువుకున్న రామచంద్రన్ నాయరూ, ఫిలిప్పూ అప్పు డప్పు డూ అక్కడ కనిపిస్తూ వుంటారు. వాళ్లిద్దరూ కేశవపిళ్ళైను చూసి వ్యంగ్యంగా ముఖం చిట్లించుకుని నవ్వుతుంటారు. కేశవపిళ్ళై వాళ్ల ప్రవర్తనను ఏమీ పట్టించుకోడు.

కాని కొత్త వీధిలో ఒకనాడు కేశవపిళ్ళై హృదయాన్ని గాయపరిచే సంఘటన ఒకటి జరిగింది. అక్కడ వాళ్ల స్నేహితుడు ప్రసాద్ అతనికి కనిపించాడు. సిఫారసేమీ లేకపోవటంవల్ల అతనికెక్కడా ఉద్యోగం దొరకలేదు. చిన్న ఉద్యోగంతో తృప్తిపడేవాడు కాదతను. కేశవపిళ్ళై కనిపించగానే మూతి

విరుచుకుని ప్రసాద్ అన్నాడు- 'నేను నీకో విషయం చెప్పాలను కుంటున్నాను.'

పాత స్నేహితుని మాటతీరులో మార్పు గమనించికూడా కేశవపిళ్ళై పట్టించుకోకుండా అన్నాడు: 'ఏమిటది?'

ఆపాదమస్తకం అసహ్యించుకున్నట్టు ప్రసాద్ కేశవపిళ్ళైను చూశాడు. కేశవపిళ్ళైకు ఏమీ బోధపడలేదు. 'ఎందుకు నన్నిలా చూస్తున్నావ'ని అడిగాడు.

'జీవించేందుకు ఇంతకంటె మరోమార్గం లేకపోతే ఉరిపోసుకుని చచ్చిపోకూడదా?' అన్నాడు ప్రసాద్.

దాంతో ఆగక ప్రసాద్ చెప్పుకుపోతున్నాడు 'నీవు మిగిలినవాళ్ల జీవితాలకు ఎందుకు అడ్డం వస్తావ్?'

కేశవపిళ్ళైకు ఏమీ అర్థం కావటం లేదు. 'నేనేం చేశాను?' అని అడిగాడు.

ప్రసాద్ మనస్సు కష్టపెట్టే పని తానేమీ చేసినట్టు కేశవపిళ్ళైకు గుర్తు లేదు.

ప్రసాద్ అసలు విషయం చెప్పాడు: 'నీవు బియ్యే డిగ్రీని అవమాన పరిచావు. దాని విలువ నీకు తెలియలేదు. నీవు ఆత్మాభిమానాన్ని అమ్ముకుని తింటున్నావు. మిగిలిన వాళ్ల జీవితాన్ని నాశనం చేశావు.'

అయినా కేశవపిళ్ళైకు ఏమీ బోధపడలేదు. ఏదో తప్పు చేసిన వాడిలా కేశవపిళ్ళై అడిగాడు: 'నేనేం చేశానేయ్, చెప్పు.'

'పదిహేను రూపాయల ఉద్యోగానికి నీవు ఒప్పు కున్నావు కదా!' అన్నాడు అందువల్ల తనకు ఎంతబాధ కలిగిందో అతను వివరించాడు: 'ఇకముందు అధికారవర్గం బియ్యేలను పదిహేను రూపాయలకు విలువ కట్టేస్తారు. నేనైతే ఇలాంటి ఉద్యోగం ఏ పరిస్థితిలో కూడా ఒప్పు కొనేందుకు సిద్ధపడను.'

కేశవపిళ్ళై చెప్పవలసిన సమాధానమేమీ లేదు. అతనెప్పు డూ తన ఉద్యోగాన్ని గురించికానీ, జీతాన్ని గురించి కానీ ఆలోచించలేదు. జీవితానికి ఒకమార్గం దొరికితే చాలను కున్నాడు. దొరికిన దానితో తృప్తి పడ్డాడు.

కాని చదువుకునే రోజుల్లోనే ప్రసాద్ చాలా ఆడంబరంగా ఉండేవాడు. విలువయిన దుస్తులు వేసుకుని వచ్చేవాడు. చాలా డబ్బు ఖర్చుపెట్టే వాడు. ఉపన్యాసాలు చాలా గొప్పగా ఇస్తుండేవాడు. ప్రసాదులాంటి వ్యక్తి మరెవరయినా ఇంతకంటె పెద్ద ఉద్యోగాన్నే ఆశిస్తాడు.

ప్రసాద్ పట్టలేని కోపంతో ప్రశ్నించాడు: 'ఆఫీసరు రోజుకెన్ని సార్లు అజ్ఞాపిస్తుంటాడు?'

కేశవపిళ్ళై ఏమీ సమాధానం చెప్పకుండానే అక్కడినుంచి వెళ్లి పోయాడు. ప్రసాద్ చెప్పింది యథార్థమే అయివుంటుంది. బహుశా తను బియ్యేను సరిగ్గా విలువ కట్టలేక పోయాడేమో! కాని జీవితం ఒక సమస్య.

ఆ జీతంలో జీవితం గడుపు కోవటం కష్టమే. కాని తాను పొరపాటు పడ్డానని అతనను కోలేదు. అలాగే ఆరేడు మాసాలు గడిచాయి. ఒక విధంగా ఆఫీసు పని అతను చాలా వరకు నేర్చుకున్నాడు. బియ్యే ప్యాసయినాడని హరిహర అయ్యర్ అతని చేత ముఖ్యమైన కాగితాలు కాపీ చేయిస్తుండే వాడు. కేశవపిళ్ళైకు మంచి ట్రైనింగివ్వాలని అతని కోరిక. అప్పు డప్పు డూ ఆయన కేశవపిళ్ళైతో అనేవారు: 'నీవు బియ్యే ప్యాసయ్యావు. తొందరగా పని బాగా నేర్చుకుంటే పెద్ద ఉద్యోగం వస్తుంది.'

ఆఫీసులో పనిచేసే వాళ్ళల్లో ఎవరికి కేశవపిళ్ళై మీద అసూయగానీ, దుర్భావం గానీ లేదు. అదే సమయంలో సూపరింటెండెంటు వైయాపురి పిళ్ళై ఒక నెల సెలవు పెట్టి వెళ్ళాడు. ఆయన స్థానంలో కేశవపిళ్ళైతో చదువుకున్న రామచంద్రన్‌ను ఒక నెలపాటు నియమించారు. సూపరింటెండెంటు పదవిలో ప్రవేశించిన తర్వాత రామచంద్రన్ కేశవపిళ్ళైతో తనకు పరిచయం ఉన్నట్టు ప్రవర్తించలేదు. కేశవపిళ్ళై మనసులో కూడా అలాంటి భావం లేదు.

ఒకనాడు మధ్యాహ్నం సూపరింటెండెంటు కేశవపిళ్ళైను తన గదిలోకి పిలిపించాడు. వెనుకటి అలవాటు ప్రకారం అతనివైపు చూడకుండా టేబిలు మీద పెట్టిన కాగితం వైపు చూస్తూ అధికారపూర్వకంగా అడిగాడు:

'ఎవరిది డ్రాఫ్టు?'

అది కేశవపిళ్ళై తయారు చేసిన కాగితం. అందులో సూపరింటెండెంటు కొన్ని మార్పులు చేశాడు. కేశవపిళ్ళైకు కంగారు వల్ల చిరుచెమటలు పడుతున్నాయి. అతని నోట మాట రావటం లేదు. కొంచెం సేపటికి సూపరింటెండెంటు 'సరే, నీవు వెళ్లు' అని అన్నాడు.

కేశవపిళ్ళై బిక్క మొగం వేసుకొని వెళ్ళాడు. అధికారి కటువుగానే అన్నాడు. కాని కూడా చదువుకున్న వాడవడం వల్ల అంత కంటె కటువుగా అనలేక పోయాడు.

కేశవపిళ్ళై తన సీటులో కూర్చున్నాడు. కూర్చుని చాలా సేపు ఏడ్చాడు. అతనెందుకు ఏడుస్తున్నాడని ఇతరులు అడిగారు. అతనేమీ చెప్పలేకపోయాడు. కొంచెం సేపటికి అతని కాగితం సూపరింటెండెంటు చేసిన మార్పులతో తిరిగి వచ్చింది. అనుభవజ్ఞుడయిన హరిహర అయ్యర్ మార్పులను జాగ్రత్తగా చూశాడు. అతని ముఖంలో చిరునవ్వు చిందుతూవుంది. కేశవపిళ్ళై, తంకమ్మ తప్ప మిగిలిన వాళ్లందరూ హరిహర అయ్యరు చుట్టూ చేరారు.

హరిహర అయ్యరుకు అంతా అర్థమయింది. ఆయన ఆ కాగితాన్ని 'చదివి మీ అభిప్రాయం చెప్పండ'ని గోవిందన్ నాయరుకు యిచ్చాడు.

మార్పులు చదువుతూనే గోవిందన్ నాయర్ నవ్వు ఆపుకోలేక పోయాడు. ఆ తర్వాత మాత్యూ, ప్రభాకరన్ నాయర్ కూడా చదివారు. తను రాసిన

తప్పు లను చూసి అందరూ నవ్వుతున్నారని కేశవపిళ్ళె అనుకున్నాడు. 'అంత బిగ్గరగా నవ్వకండి'- అని అతను కోపంతో చిరాకుతో బిగ్గరగా అరిచాడు.

దానితో అందరూ మరీ ఎక్కువగా నవ్వారు. గోవిందన్ నాయర్ అన్నాడు: 'సార్, దీన్ని ఇలాగే పంపండి. వెళ్లనియ్యండి.'

అప్పు డు అక్కడున్న వాళ్లంతా తనకు శత్రువులనిపించింది కేశవపిళ్ళెకు. 'నన్ను పంపిస్తారా? నాకు ప్రొమోషనివ్వరు లేదా ఉద్యోగం లోనుంచి తీసేస్తారు. అంతేగా!' అన్నాడతను.

కేశవపిళ్ళె మాటలను ఎవరూ లక్ష్యపెట్టలేదు. గోవిందన్ నాయర్‌తో హరిహర అయ్యర్ ఏకీభవించలేదు. 'అలా అనకు గోవిందన్ నాయర్! అది మంచిపని కాదు. అలా చేస్తే మన డిపార్టుమెంటుకు చెడ్డపేరు వస్తుంది. ఇక్కడ తప్పు లు లేకుండా రాసే వాళ్లే లేరని దాని అంతరార్ధమవుతుంది' అన్నాడు హరిహర అయ్యర్.

కేశవపిళ్ళె సవాలు చేసేందుకు సిద్ధపడ్డాడు. 'నేను రాసిన దానిలో తప్పెక్కడుందో నాకు చెప్పండి. నేను వ్యాకరణం చదువుకున్నాను' అన్నాడు కోపంతో మనసు కష్టపెట్టుకుంటూ.

గోవిందన్ నాయర్ అతనికి సమాధానం చెప్పాడు 'అసలు విషయం తెలుసుకోకుండా ఏమీ మాట్లాడకు. తప్పు నీవు రాసిన దాంట్లో లేదు. చేసిన మార్పుల్లో వుంది.'

'మార్పులు చేసిన వాడు కాపీకొట్టి పాసయ్యాడు. అతనికి రాయడం వచ్చా అసలు' అన్నాడు కేశవపిళ్ళె.

కేశవపిళ్ళె ఈమాట చాలా బిగ్గరగా అన్నాడు. హరిహరఅయ్యర్ అతన్ని మెల్లిగా మాట్లాడమని సంజ్ఞ చేశాడు. సూపరింటెండెంటు వింటాడేమోనని అతని భయం. 'సూపంరిటెండెంటు, కేశవపిళ్ళె పనిలో తప్పులెందుకు పడుతున్నాడో తెలుసా?' అని హరిహర అయ్యర్, గోవిదన్ నాయర్ని అడిగాడు.

గోవిదన్ నాయరుకు బోధపడలేదు. హరిహరఅయ్యర్ వివరంగా చెప్పాడు 'వాక్యంలో తప్పేమిలేదు, భావంలో వుంది. సూపరింటెండెంటు చేసిన సవరణలో వాక్యం తప్పుపోయింది. కాని భావం సరిగ్గా వచ్చింది. చదివి చూడండి.'

గోవిందన్ నాయర్ మళ్ళి డ్రాఫ్టు చదివాడు. కేశవపిళ్ళె, భావంలో తన తప్పేమిటో తెలుసుకోవాలను కున్నాడు.

హరిహరఅయ్యర్ మళ్ళి చెప్పాడు 'చూడు, ఇది జల విద్యుత్ ప్రణాళికకు సంబంధించిన ఫైలు. సూపరింటెండెంటు దీనిలోనుంచి బంగారపు పిట్టను బయటికి లాగాలని చూస్తున్నాడు. మనం చీఫ్ సెక్రటరీ పక్షంలో

వాళ్ళం. సూపరింటెండెంటు భక్తివిలాస్ పక్షంవాడు. కేశవపిళ్ళైకు ఇదంతా తెలియదు. అందుకనే వెనుకటిలాగా రాశాడు. అంతే. చదివిచూడు.'

చీఫ్ సెక్రటరీ పక్షమేమిటో, భక్తివిలాస్ పక్షమేమిటో కేశవపిళ్ళైకు బొత్తిగా బోధపడలేదు. ఇప్పుడు గోవిందన్ నాయరుకు పూర్తిగా అర్థమయింది. కేశవపిళ్ళై మొదట వ్రాసినదానికీ, తర్వాత సూపరింటెండెంట్ చేసిన మార్పులకీ రెండింటికీ వ్యాఖ్య చెప్పాడు. సూపరింటెండెంటు మనసులోవున్న అభిప్రాయాన్ని గమనించి కేశవపిళ్ళై వ్రాయలేదు. అందువల్లనే భావంలో పొరపాటు వచ్చింది.

కేశవపిళ్ళై తనతప్పు తెలుసుకుని తహతహ లాడాడు. ఆ ఫైల్లోవున్న వెనుకటి రికార్డు చూసి కేశవపిళ్ళై ముసాయిదా తయారు చేశాడు. ఆముసాయిదాలోని ఆశయానికీ, దానికి భిన్నమైన ఆశయానికీ చాలా వ్యత్యాసముంది. ఆవిషయం కేశవపిళ్ళైకు అర్థం కాలేదు. ఇదంతా గమనించి అతను తన సహజమైన సందేహాన్ని వ్యక్తపరిచాడు. 'సార్, భక్తివిలాస్‌కూ, చీఫ్ సెక్రటరీకీ పడదా?'

'అవును, ఈవిషయంలో అంతే.'

'అదెలాసార్, దివాన్‌జీ తలుచుకుంటే....'

హరిహరఅయ్యర్ అన్నాడు. 'చీఫ్‌సెక్రటరీ ఒక్కడూ ఒకవైపు. ఆయన్ని బయటికి పంపించటం ఎవరికి సాధ్యం? అలాంటి ప్రశ్నవస్తే పేపరువాళ్ళున్నారు. నియమ సభవుంది. వాళ్ళు ప్రతిఘటించరూ? ఈ విషయం దివాన్‌జీకి తెలియదు. చీఫ్‌సెక్రటరీకీ, దివాన్‌జీ ప్రైవేట్ సెక్రటరీకీ మధ్య తగాదా వుంది.'

కేశవపిళ్ళై మనసులో ఒక సందేహం ఉదయించింది. 'అయితే యీ విషయం కూడా నాకు ఆయన చెప్పి వుండవల్సింది గదా! ఫైలు చదివి అంతా స్వంతంగా తెలుసుకో, ఇతరులవల్ల తెలుసుకునేందుకు ప్రయత్నించవద్దని ఆయన చెప్పారు.'

'సవరణ చేసినందు వల్ల వాక్యంలో వచ్చిన తప్పు సూపరింటెండెంటు గమనించాలి' అని గోవిందన్‌నాయర్ అన్నాడు.

హరిహరఅయ్యర్ తల తిప్పుతూ సమాధానం చెప్పాడు. 'అది నావల్ల కాదు. వాళ్ళంతా గొప్పవాళ్ళు. చిన్నతనమవుతుంది. ఒకరితో విరోధం పెట్టుకోవడం నాకిష్టం లేదు.'

'ఈ డ్రాఫ్టు ఇలాగే పైకి వెళితే సూపరింటెండెంటు తప్పు అందరి ముందూ బయట పడుతుంది.' అలాగే వెళ్ళనియ్యండి.' అన్నాడు కేశవపిళ్ళై. కాని హరిహర అయ్యర్ ఒప్పుకోలేదు. 'ఇందులో సూపరింటెండెంటు తప్పు కనిపించినా సెక్రటరీ, అసిస్టెంటు సెక్రటరీ చూసీ చూడనట్టు నటిస్తారు' అన్నాడు.

'సూపరింటెండెంటు, భక్తివిలాస్ ప్రైవేట్ సెక్రటరీకి చాలా దగ్గరగా కావలసిన స్నేహితుడనే విషయం కూడా నీవు అర్థం చేసుకోవాలి. అతన్ని తెలివి తక్కువ వాణ్ణి చెయ్యాలని ప్రయత్నించేవాడు ఇరుకున పడతాడు.'

ఆరోజు సాయంత్రం కేశవపిళ్ళెను వార్తలు రవాణా చేసే గుమాస్తాగా బదిలీ చేసినట్టు సూపరింటెండెంటు దగ్గరనుంచి నోటీసు వచ్చింది. ఇంత వరకూ ఈ రవాణా పని తంకమ్మ చేస్తూ వచ్చింది. తంకమ్మకు కేశవపిళ్ళె చేసేపని యిచ్చారు. ఇది ఒకవిధంగా అవమానకరమైన మార్పు.

కేశవపిళ్ళెకు ఇది ఒక విధంగా కనువిప్పయింది. ప్రభుత్వ కార్యాలయాల్లో ఉన్నత పదవులు కావాలంటే కేవలం పని చెయ్యటమే చాలదు, ఆఫీసులోని అన్యవిషయాలను గూడా తెలుసుకొని ప్రవర్తించాలి. కేవలం పైపైన తేలిపోతూ వుంటే రత్నాలు చేతికందవు. లోతుకు దిగి వెతకాలి.

తంకమ్మకు కొత్తపని చెయ్యటం చాలా కష్టంగా వుంది. ఆమె పనికి సంబంధించిన ఫైలు చూసేందుకు చాలా పరిశ్రమ చెయ్యాలి. ఉద్యోగంలో ప్రవేశించింది మొదలు ఇప్పటి వరకు ఆమె ఉత్తరాలు పంపించడం తప్ప మరేపనీ చెయ్యలేదు. మరోపని ఆమెకు తెలియనూ తెలియదు. ఎలా జరిగిందో ఎందుకు జరిగిందో గాని ఆమె తన పనిలో సాయం కోరేందుకు కేశవపిళ్ళె దగ్గరికి తరుచు వెళ్ళడం మొదలు పెట్టింది. హరిహర అయ్యరు మాట ప్రకారం కేశవపిళ్ళె ఆమెకు సాయం చెయ్యటం ఆరంభించాడు.

క్రమంగా తంకమ్మ, కేశవపిళ్ళె కుర్చీలు సమీపమయ్యాయి. చెప్పుకునేందుకు వాళ్ళకు కావలసినన్ని మాటలుండేవి. ఆమె సందేహాలు అడగటం, అతను సమాధానం చెప్పటం. అయినా ఆమెకు ఏమీ బోధపడేది కాదు. హరిహరఅయ్యర్ విడమరచి చెప్పినా ఆమెకు అర్థం కాకపోతే, కేశవపిళ్ళె నవ్వుతూ అనేవాడు 'నీ తలలో పేడముద్ద ఉన్నదా?' అని.

దానికామె ముఖం చిట్లిస్తూ అనేది 'ఓహో! ఒకవేళ ఉన్నదే అనుకోండి, అందువల్ల మీకేమన్నా నష్టమా?'

'నష్టం లేదని ఎవరన్నారు?' అంటాడతను.

'ఎవరికి నష్టం?' అని ఆమెకూడా సంభాషణను పొడిగిస్తుంది.

'నాకు'

తంకమ్మ కోరే సమాధానం ఇదే. తంకమ్మ కేశవపిళ్ళెతో మాట్లాడకపోతే 'నామీదకోపం వచ్చిందా?' అని అతనడుగుతాడు.

'అవును. కోపం వచ్చింది.' అని ఆమె మూతి బిగించుకుని కూర్చుంటుంది. 'అయితే నాకు కూడా నీ మీద కోపం వచ్చింది.' అని కేశవపిళ్ళెకూడా భీష్మించుకుని కూర్చుంటాడు.

ఇలా చాలా నెలలు గడిచాయి. సూపరింటెండెంటుగా రామచంద్రన్ పోయి వైయాపురి పిళ్ళె వచ్చిన తర్వాత కూడా మార్పేమీ జరగలేదు.

కేశవపిళ్ళెకూ, తంకమ్మకూ గల సంబంధం డిపార్టుమెంటులో అందరి దృష్టినీ ఆకట్టుకుంది. అక్కడ అందరిలో వాళ్ళిద్దరే పెళ్ళికాని వాళ్ళు. వయస్సులో, రూపంలో కూడా ఇద్దరూ ఈడూ జోడుగా ఉంటారు.

ఒకరోజు కేశవపిళ్ళె, తంకమ్మ ఇద్దరూ ఆఫీసుపని ఏమీ చెయ్యకుండా ఏదో ఆలోచనలో మునిగి మౌనంగా కూర్చున్నారు.

మరో చివర కూర్చున్న హరిహరఅయ్యర్ ఈ విషయం గమనించాడు. ఈయన తన అభిప్రాయాన్ని తెలియ పరిచాడు. 'చూశారా సార్, పెళ్ళికాని అమ్మాయి, అబ్బాయి ఆఫీసులో కలిసి కూర్చోవడం!'

'పసివాళ్ళుకదా! ఇలాగే కొన్నాళ్ళు వాళ్ళను కలలు కననీ. లేకుంటే యీ ప్రభుత్వోద్యోగపు బాధల్లో ఆనందం ఎక్కడుంది? ఏమంటావ్ తంకమ్మా?' అన్నాడు పైఅధికారి.

అధికారి జేబుల్లో చేతులు పెట్టుకొని నవ్వుతూ కేశవపిళ్ళెతో అన్నాడు 'మీరు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో పుత్రపౌత్రాభివృద్ధిగా వర్ధిల్లాలని నేను, బ్రాహ్మణుణ్ణి ఆశీర్వదిస్తున్నాను.' తంకమ్మ సిగ్గుతో తలవంచుకుంది. కేశవపిళ్ళె ముఖం బిడియంతో కొంచెం ఎఱ్ఱబారింది.

వాళ్ళ ముఖవైఖరిని చూసి గోవిందన్ నాయర్ అన్నాడు 'ఈనాటి నుంచి మీరు దంపతులయినారు.'

'ఏం తంకమ్మా నిజమేనా? ఒప్పుకుంటావా? లేకుంటే...' అన్నాడు కేశవపిళ్ళె.

తంకమ్మ ఏమీ మాట్లాడలేదు. తలవంచుకుని కూర్చుంది.

కల్యాణమండపంలో వధూవరుల్లాగా కేశవపిళ్ళె, తంకమ్మా కూర్చున్నారు. అందరూ యీ వినోదంలో పాల్గొన్నారు.

కచేరీ కార్యభారం వహిస్తున్న హరిహరఅయ్యర్ వ్యంగ్యంగా అన్నాడు- 'అంతా బాగుంది. పెళ్ళి అయిపోయింది. సమ్మతించాను. ఇక ఆఫీసు పని చూడండి.'

మర్నాటినుంచి కేశవపిళ్ళె కనీసం రోజుకోసారి తంకమ్మను రెచ్చగొట్టేందుకు అంటాడు 'ఇప్పుడు నీవు నా భార్యవు. విన్నావా?'

తంకమ్మ కాదనలేదు. ఆమాట వింటేనే ఆమెకు సిగ్గు వేస్తుంది. మనస్సుకు తృప్తిగా ఉంటుంది. ఆఫీసులో అందరూ తలవంచుకుని పని చేసుకునేటప్పుడు, తంకమ్మ కేశవపిళ్ళెను ఎంతో ఆప్యాయంగా చూస్తుంటుంది. అలాంటప్పుడు ఆమె కళ్ళల్లో అనురాగమధుపు తొణికిసలాడుతుంటుంది.

ఒక పర్యాయం కేశవపిళ్ళె 'నీవు నాభార్యవు అన్నప్పుడు తంకమ్మ 'నీవు నన్ను ప్రేమిస్తున్నావా?' అని అడిగింది.

ఒక్కక్షణం ఆగి 'నీకు నా మీద ప్రేమఉందా?' అని కేశవపిళ్ళె మారుప్రశ్న వేశాడు.

'ముందు నేను ప్రశ్న వేశాను. నాకు ముందు సమాధానం రావాలి' అన్నది తంకమ్మ.

'ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పు. నీవు నా భార్యవుకదా! అన్నాడు కేశవపిళ్ళె.

తంకమ్మకు మొదట ప్రశ్నించే హక్కువుంది. కాబట్టి ఆమెకే మొదట సమాధానం రావాలి. కాని బంట్రోతు మాతేవన్‌పిళ్ళె రాగానే వాళ్ళిద్దరి వాగ్వాదం ఆగిపోయింది.

ఆరోజు సాయంత్రం ఆఫీసునుంచి యింటికి వెళ్ళేప్పుడు తంకమ్మ కేశవపిళ్ళె చెవిలో 'నేను నిన్ను ప్రేమిస్తున్నా'నని చెప్పింది.

ఆమె కళ్ళల్లో కాంతి కురిసింది.

తంకమ్మ తన తొలి హక్కు వదులుకొని కేశవపిళ్ళె ప్రశ్నకు సమాధానం చెప్పింది. ఇక కేశవపిళ్ళె సమాధానం కోసరం ఆమె ఉత్కంఠతో ఎదురు చూస్తున్నది. 'నీవు నా భార్యవుగదా!' అన్నాడు కేశవపిళ్ళె.

ఈ మధ్య తంకమ్మ రోజూ అందరి కంటె ముందుగా ఆఫీసుకు వస్తూవుంది. మర్నాడు 'మీరు ఆఫీసుకు ఆలస్యంగా ఎందుకు వస్తున్నారని' ఆమె అడిగింది.

కేశవపిళ్ళె ఆఫీసుకు ఆలస్యంగా ఎప్పుడూ రాలేదు. 'నేను సరియైన వేళకే వస్తున్నాను. ఆలస్యంగా వస్తున్నానని ఎవరన్నారు?' అన్నాడు కేశవపిళ్ళె.

'నేనే అన్నాను మీరు ఆలస్యంగా వస్తున్నారని' అని తంకమ్మ తుంటరిగా నవ్వింది. కేశవపిళ్ళెకు అర్థం కాలేదని ఆమెకు అనిపించింది. 'నేనే అరగంట ముందే వస్తున్నాను' అని అర్థవంతమైన దృష్టితో ఆమె కేశవపిళ్ళెను చూసి నవ్వింది. కొంచెం జాగ్రత్తగా గమనిస్తే ఆమెలో కామవాంఛ కనిపిస్తూ వుంది.

క్షమాపణ కోరుకుంటున్నట్టు కేశవపిళ్ళె అన్నాడు 'రేపటినుంచీ నాకూ ఆలస్యమవదు'.

ఆరోజే బంట్రోతు మాతేవన్‌పిళ్ళె కేశవపిళ్ళెతో అన్నాడు 'ఆ అమ్మాయి ఎంతసేపటినుంచో మీ కోసరం ఎదురుచూస్తూ కూర్చుంటుంది. మీరు కూడా కొంచెం పెందలాడే వస్తే ఏంపోతుంది బాబూ?'

'ఆమె బహుశా మీతో ఏదో ఏకాంతంగా చెప్పాలను కుంటూంది బాబూ' అని అతను కేశవపిళ్ళె చెవిలో చెప్పాడు. 'ఈ ఆఫీసు శ్రీపద్మనాభాలయం. ఇక్కడ అందరూ పవిత్రంగా వుండాలి' అనికూడా అతను సూచన చేశాడు.

అదే విధంగా కేశవపిళ్ళె మర్నాడు ఉదయమే తొందరగా వచ్చాడు.

సెక్రటరీ కృష్ణన్ నాయర్ తంకమ్మకు బాబాయి అవుతాడు. తంకమ్మకు తన బాబాయి వల్లనే ఉద్యోగం దొరికింది.

కేశవపిళ్ళె తంకమ్మ హృదయాన్ని పూర్తిగా స్వాధీనం చేసుకున్నాడని కచ్చితంగా చెప్పేందుకు వీల్లేదు. అతను హృదయాన్నే స్వాధీనం చేసుకున్నాడో మరియింకేమయినా స్వాధీనం చేసుకున్నాడో తెలియదు. తంకమ్మ కేశవపిళ్ళె హృదయం స్వాధీనం చేసుకున్నదా అని ప్రశ్నిస్తే కేశవపిళ్ళెకు అదోరకమైన ఆవేశం వస్తుంది. బహుశా స్వాధీనం చేసుకునేందుకు అదేమార్గం అయివుండచ్చు. తంకమ్మకు భర్త కావాలి. తనకు తగిన వ్యక్తి దొరికాడు. దీనినే ప్రేమ అంటారా? లేకుంటే మరి ప్రేమ యేమిటి? కేశవపిళ్ళెకు కూడా భార్య అవసరం. తంకమ్మ అతన్ని చాలా ఆకర్షించింది. ఆమె భార్య అయితే మంచిదే. ఈ ఆవేశాన్నే ప్రేమ అనవచ్చా? అవును, ఇది కూడా ప్రేమే. తంకమ్మ అతన్ని తనవైపు లాక్కుంటున్నది. అతను ఆమె వైపు మొగ్గుతున్నాడు. కాని యెక్కడైనా ఏకాంతంగా ఇద్దరూ మాట్లాడు కొనేందుకు వాళ్ళకింకా అవకాశం దొరకలేదు. బహుశా ముందు ముందు దొరుకుతుందేమో! తంకమ్మ దానికోసరం ప్రయత్నిస్తున్నది. ఆ ప్రయత్నం ఫలిస్తే ఆమె కేశవపిళ్ళె భుజాలమీద తలపెట్టి వేలకొలది ప్రేమ కబుర్లు చెప్పుకుంటుంది. అప్పుడు ఒట్టు పెట్టుకుని ఆమె తన ప్రేమను గురించి అతనికి చెపుతుంద. అలాగే అతని చేత కూడా ఒట్టు పెట్టించి సమాధానం చెప్పిస్తుంది. కొంత కాలానికి కేశవపిళ్ళె ప్రతిజ్ఞ చేస్తాడు. ఆ తర్వాత వాళ్ళిద్దరూ ఒకరికొకొరు వాగ్దానాలు చేసుకుంటారు. అలాగే ప్రేమ వివాహంగా మారుతుంది.

## మూడు

తోట్టపల్లిలో పడవదిగి కొల్లంనుంచి ఆలప్పుళా వెళ్ళి మరో పడవెక్కి కేశవపిళ్ళె కురుమాటిలో తనయింటికి వెళ్ళాడు. తాను ఇరవై తొమ్మిదో తారీక్కు వస్తానని అమ్మతో, అక్కయ్యతో చెప్పాడు. 'సిగ్గుపడి సమాధానం చెప్పలేద'ని వాళ్ళమ్మ అన్నమాట నిజమయింది. దాన్ని గురించి ఆమె వాదించింది కూడాను.

మర్నాడుఉదయం కేశవపిళ్ళె ఆఫీసుకు చేరుకున్నాడు. క్యాజువల్ లీవు మిగిలివున్నా సూపరింటెండెంటు సెలవు మంజూరు చెయ్యలేదు. దానితో మరో బెడత ఏర్పడ్డది. అప్పుడు మనస్సు కూడా చిరాగ్గా వుంది. హరిహర అయ్యర్, గోవిందన్ నాయర్, ఆఫీసులో అందరూ అతన్ని కుశల ప్రశ్నలు వేశారు. అమ్మ చాదస్తం అని అతను సమాధానం చెప్పాడు.

అందరూ అతని మాట నమ్మారు. కాని తంకమ్మకు అస్పష్టమైన ఆ సమాధానం తృప్తికరంగా లేదు. ఆమె పరిపరివిధాల మార్చిమార్చి ప్రశ్నలు వేసింది. కేశవపిళ్ళె ఏదో సమాధానం చెప్పాడు. కాని ఆమెకు తృప్తి కలుగలేదు.

సెలవు మంజూరు కాకుండా ఆఫీసుకురావటం మానేసి నందుకు కేశవపిళ్ళై సంజాయిషీ చెప్పుకోవలసి వుంటుంది. అంతకు ముందే ఆఫీసులో అనుమతి లేకుండా క్యాజువల్ లీవు కూడా వాడుకునేందుకు వీల్లేదని నోటీసు జారీ చేశారు. ఆఫీసుకు రాగానే కేశవపిళ్ళై అనుకున్నట్టు సూపరింటెండెంటు సంజాయిషీ అడిగాడు.

కేశవపిళ్ళై యింటినుంచి వచ్చిన తంతి చూపించి సెలవు కోరాడు. కాని సూపరింటెండెంటు సెలవియ్యలేదు. జబ్బు చేసిందన్నమాట అబద్ధమవుతుంది. ఆఫీసులో పని చేసే వాళ్ళందరూ బాగా ఆలోచించి ఒక సమాధానం తయారు చేసి సూపరింటెండెంటుకు పంపారు. కొంత జరిమానా కట్టవలసి వుంటుందని అన్నాడు గోవిందన్ నాయర్. 'అయితే అయిందిలే' అని కేశవపిళ్ళై సమాధానం చెప్పాడు.

సూపరింటెండెంటుకు సంజాయిషీ ఇచ్చాడు. దానికి ఆయన దగ్గరనుంచి సమాధానం రావటానికి చాలా కాలం పట్టింది. కేశవపిళ్ళై సూపరింటెండెంటు సమాధానాన్ని గురించి గానీ, జరిమానాను గురించిగాని భయపడటం లేదు. కాని తంకమ్మకు సమాధానం చెప్పేందుకు గాబరాపడుతున్నాడు. ఆమె, యింటి సంగతి తప్పకుండా అడుగుతుంది. అక్కడి విశేషాలు ఆమె ముఖ్యంగా తెలుసు కోవాలి. తెలుసుకునేందుకు ఆమెకు హక్కు కూడా వుంది.

ఆమెకు ఏం చెప్పాలో కేశవపిళ్ళైకు తోచటం లేదు.

'ఇంట్లో విశేషాలేమిటి?' అని ఆమె అడగనే అడిగింది. 'ఏమీ విశేషం లేద'ని అతను సమాధానం చెప్పాడు.

'అయితే మరి టెలిగ్రాం ఎందుకిచ్చారు?'

'అదంతా అమ్మ చాదస్తం'.

'ఆ మాట ఆఫీసులో వాళ్ళందరికీ చెప్పండి కాని నాకు మాత్రం అసలు విషయమేమిటో స్పష్టంగా చెప్పి తీరాలి. మీ సమాధానం నాకు సరిపోదు.'

'ఏం?'

'ఒకసారి నా వైపు చూడండి.'

కేశవపిళ్ళై ఆమెవైపు చూడలేదు. అతను త్వరత్వరగా రాసుకుంటున్నాడు.

కొన్ని క్షణాలు ఆగి తంకమ్మ అంది 'చూడు. పని ఎంత చురుగ్గా జరుగుతున్నదో!'

'నీకోసం డ్రాఫ్టు తయారు చేస్తున్నాను.'

'ఈ విషయం తెలుసుకునేందుకు నాకు అధికారంలేదా? పోనీలెండి, చెప్పకండి' అన్నదామె విచారంగా.

'కోప్పడకు, చెపుతాను.'

కాని కొంచెం సేపాగి తంకమ్మ మళ్ళీ అదే ప్రశ్న అడిగింది.

'ఇంట్లో ఏమయింది?'

'చెపుతా, తర్వాత చెప్తా. చూడు, అందరూ ఇటే చూస్తున్నారు.'

'మన సంభాషణ వాళ్ళందరికీ తెలుసు. చెప్పండి, అసలింట్లో ఏం జరిగింది?'

'చెప్పాను కదా తరవాత చెపుతానని!'

'ఇప్పుడిక్కడ చెప్పారే - అమ్మ చాదస్తమని - అది అబద్ధమే కదా!'

ఆమాట అబద్ధమని ఋజువు చెయ్యటమే తంకమ్మకు కావలసింది. ఆమెకు ఏదో సందేహమే. ఆమెకు అనుమానంగా వుందని కేశవపిళ్ళెకు తెలుసు. ఆమె తననోట ఆమాట చెప్పించాలని చూస్తున్నది.

ఆరోజు మధ్యాహ్నమయిన తర్వాత ఏడెనిమిది సార్లు తంకమ్మ 'అదే ప్రశ్న మాటిమాటికీ అడిగింది. అతను విసుక్కున్నాడు. 'చెప్పటం నాకు ఇష్టం లేకుంటే?' అన్నాడు

తంకమ్మ ముఖం వాడి పోయింది. కేశవపిళ్ళెకు ఆమె ఏడుస్తోందని అనిపించింది. 'ఆమాట తీరికగా చెప్పాలి. చెప్పాను కదా! తరవాత చెపుతాను అని'

'అక్కర్లేదు. నేను వినాల్సిన అవసరం లేదు. నా అవసరం, అధికారం లేనప్పుడు మధ్య నాకెందుకు?' అన్నది తంకమ్మ.

'అవును, మంచి అమ్మాయిలు ఇలాగే వుంటారు' అన్నాడు కేశవపిళ్ళె ఆకట్టుకునే చిరునవ్వుతో.

'తెలివి తక్కువ దాన్ని నేను అనుభవిస్తాను' - అన్నది తంకమ్మ.

'నేను చెపుతున్నాను గదా! నీవు చాలా బుద్ధి మంతురాలివి.'

ఆరోజు సాయంత్రం ఆఫీసునుంచి యింటికి వెళ్ళేప్పుడు 'రేపు నేను తొందరగా వస్తా'నని తంకమ్మ చెప్పింది.

అది పిలుపా? కాదు. అతన్ని ముందుగా రమ్మని కోరటం. 'నేను రాలేన'ని చెప్పేందుకు అతను ఒక్క క్షణం ఆగిపోయాడు. తంకమ్మ ముఖం వైపు చూస్తే ఆమె కేశవపిళ్ళె సమాధానం కోసరం ఎదురుచూస్తున్నదని అనిపిస్తున్నది. అతని గుండెల్లోనుంచి సమాధానం బయటికి లాగేందుకు ఆమె అతని కళ్ళల్లోకి చూస్తున్నది.

ఇంతకు ముందెప్పుడు ఆమె ఇలా సమాధానం కోసరం ఎదురు చూడలేదు. ఇంతలోతుగా తరిచి చూడ లేదు కూడాను. 'రేపు తొందరగా వస్తాన'ని చెప్పి వెళ్ళి పోతూ వుండేది. అతను తొందరగా వచ్చేవాడు కూడా.

కేశవపిళ్ళెకు మళ్ళీ అనుమానం వేసింది. తంకమ్మ శంకిస్తున్నది. అతికష్టంమీద 'వస్తాను'అన్నాడు.

ఆ సమయంలో ఆమె 'ఇంట్లో జరిగిందేమిటి?' అని మళ్ళీ ప్రశ్న వేసివుంటే, కేశవపిళ్ళె జరిగిందంతా స్పష్టంగా చెప్పేవాడేమో? చెప్పినా చెప్పి

వుండచ్చు. అది అంత దుర్బలమైన క్షణం. కాని తంకమ్మ ఆ సమయంలో తననా ప్రశ్న వేయలేదు. తాను సమాధానం చెప్పి చులకన అయిపోయే ప్రమాదం నుంచి తప్పించు కున్నానని అతను తన్ను తాను ప్రశంసించు కున్నాడు.

ఆ రోజు రాత్రి కేశవపిళ్ళైకు బొత్తిగా నిద్ర ఎదుర్కోవలసి వచ్చింది. ఒక వేళ తోట్టపల్లిలో దిగి 'నేనీ సంబంధం చేసుకోన'ని తల్లిదండ్రులకు చెప్పి వచ్చినా తల్లిదండ్రుల కోపం గుర్తుకు వచ్చి అతనికి నిద్రపట్టి వుండేది కాదు. అప్పుడు తల్లి దండ్రులు అతన్ని చీవాట్లు పెట్టేవాళ్ళు. దానితో అతనికి తంకమ్మతో తనకు గల సంబంధం మీద ఏవగింపు కలిగేది. అతను తంకమ్మమీద ఆసక్తి వదలుకునేవాడు. అతనికి ఆమెమీద ఆసక్తి లేదా? అతనికి ఊపిరి సలపలేదు. ఆమె ఆకర్షణలో శక్తి వుంటే అతను తల్లిదండ్రులు కుదిర్చిన సంబంధాన్ని మౌనంగా ఎలా అంగీకరించాడు?

కోపంతో ముఖం ముడుచుకుని వున్న తంకమ్మ రూపాన్ని అతను చూశాడు. ఆమె చిరునవ్వులో ఒకరకమైన ఆకర్షణ వుంది. ఆమె కళ్లల్లో కళ్ళు పెట్టి చూస్తే తనకళ్లల్లో కాంతి పెరిగినట్టు తోస్తుంది. ఆ కాంతి ఎవరిది? ఆమె ముఖంలో దప్పికలాంటిది కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఆమె మాట్లాడే ప్రతిమాటలో మాధుర్యం ఉట్టి పడుతూ వుంటుంది. ఇదంతా ప్రేమించినందుకు ప్రతిఫలం. ఈనాడు 'ఇంటివిశేషాలేమిట'ని ఆమె ఎన్నిసార్లో అడిగింది. ఆమె అలా ఎందుకడిగింది? ఆమెకు తన అధికారం తెలుసు. సరియైన సమాధానం లభించే వరకూ ఆమె అడుగుతూనే వుంటుంది.

జరిగింది జరిగినట్టు చెప్పాలని అతను ఊహించను కూడా లేడు. ఆమె దీన్ని ఎలా అంగీకరిస్తుంది? ఏదో ఒక రోజు ఆమెకు యథార్థం తెలియకపోదు. తెలియటం అవసరం కూడా. అయితే యీ సంబంధం పూర్తిగా ఏర్పడేలోగానే ఆమెకు అంతా చెప్పివేయటం శ్రేయస్కరం. కాని ఉన్నదున్నట్టు తేటతెల్లంగా విప్పిచెప్పే ధైర్యం కేశవపిళ్ళైకు లేదు. ఏదో ఒకరోజు అంతా వివరంగా ఆమెకు దానంతట అదే బోధపడుతుంది.

ఒకవేళ కేశవపిళ్ళై తనకు పెళ్ళి సంబంధం కుదిరిన విషయం తంకమ్మకు చెప్పేస్తే వాళ్ల ప్రేమానుబంధం తెగిపోవడమే కాక ఘోరమైన విషాద పరిస్థితి ఏర్పడుతుంది. తంకమ్మ గుర్తుకు వచ్చినప్పుడల్లా అతనికి బాధ గాఢుంది. ఈ అనుబంధం తెగిపోయినా జీవితాంతం అతనికి తంకమ్మ గుర్తుకు వస్తూనే వుంటుంది. తన కన్నీటి బొట్టు మీద తంకమ్మకు అధికారం వుంది. పెళ్ళి నిశ్చయమయింది. పెళ్ళి కూడా అయిపోయిందని అనుకున్నా ఉద్యోగం వూడిపోయే పరిస్థితివస్తే తన ఉన్నతికే అంతరాయం ఏర్పడుతుంది. కట్టు నాటి కన్యను పెళ్ళి చేసుకున్నందువల్ల అతనికి ప్రయోజనమేమిటి? కిట్టు

మామ చెప్పాడు- పిల్ల చాలా అదృష్టవంతురాలని. అంతే, అంతటితో తనకేం లాభం?

కేశవపిళ్ళై మొట్టమొదట రెండుపూటలు భోజనంచేసేందుకు డబ్బు కోసం పరితపించాడు. పదిహేను రూపాయల జీతంతో తృప్తి పడ్డాడు. బియ్యే ప్యాసయిన వ్యక్తికి సెక్రటేరియట్‌లో ఉద్యోగం దొరికితే చాలు, అతను ఎంత ఉన్నతినైనా సాధించగలడు. కాని వున్నత పదవులు కావాలంటే సిఫారసు కావాలి. కేశవపిళ్ళైకు అలాంటిది లేదు. ఏం కావాలి ఎలా వృద్ధి పొందాలి అనే విషయాలను గురించి అతను ఇంతవరకు ఆలోచించలేదు. కాని ఫిలిప్, రామచంద్రన్ నాయర్ నిర్వహించే పదవులే కాక సెక్రటరీ పదవి కూడా అతనికి సాధ్యమే. ఆ పదవిలో పనిచేయగల సామర్థ్యం అతనికి వుంది. అతనికి కిందివైపు చూడవలసిన పని లేదు. పైపైపదవులు పొందేందుకు చూడటంలో అతను కంగారు పడవలసిన పనిలేదు. వాటికి కావలసిన స్తోమతు అతనిలో వుంది. అయినా అదొక మార్పు. ఆ పదవులకోసరం కలలు కనకపోయినా ఆ స్థాయిని చేరుకునే యోగ్యత తనకు ఉన్నదని అతనికి తెలుసు.

సెక్రటరీ కృష్ణన్‌నాయర్ అన్న కూతురు తన వైపు చూసి హృదయాన్ని కదిలించే నవ్వు నవ్వి నప్పుడు వెంటనే అతను ఆమెకు దగ్గరయినాడు. తంకమ్మే అతన్ని తనవైపు లాక్కునేందుకు తీవ్రంగా ప్రయత్నించిందనే అనుకుందాం. అతను ఆమె వైపు మొగ్గిపోవటం సహజం. తంకమ్మ చిరునవ్వులో గొప్ప ఆకర్షణ శక్తి వుంది. అందువల్లనే కేశవపిళ్ళై ఆమె మందహాసం చూసి మైమరచి పోతాడు. సొట్టలు పడే ఆమె బుగ్గల్లో ఏదో వశీకరణ తంత్రం వుంది. కాని అలా సొట్టలు పడే బుగ్గలు మరో అమ్మాయిలో కనిపిస్తే అతను అలా మురిసి పోతాడా? అంతటి ఆసక్తితో ఎదురుచూస్తాడా? లేదు, సెక్రటరీ అన్న కూతురి మీద సెక్రటేరియట్‌లో పనిచేసే జూనియర్ గుమాస్తాకు ఆసక్తి కలగటం సహజం- ముఖ్యంగా అతనికి సాయం చేసేందుకు మరొకరు లేనప్పు డు.

మరి యిప్పుడు కేశవపిళ్ళై వివాహాన్ని గురించి ఆమెకు తెలిస్తే ఏమవుతుంది? కేశవపిళ్ళైకు చాలా నష్టమవుతుంది. ఆమె దీనికి తగిన సమాధానం ఆలోచిస్తుంది. ఆమె దృష్టి పగబట్టిన పాము దృష్టిగా మారుతుంది. అలా జరిగితే అతను ఆఫీసులో ఎలా ప్రవేశించాడో, అలాగే నిష్క్రమించాల్సి వుంటుంది. ఇక అతని యోగక్షేమాలు కనుక్కునే వాళ్లెవరు? ఎవ్వరూ లేరు. ఆమెను ప్రేమించిన కేశవపిళ్ళై అపరాధి కాడా? ఆమెను ఉత్తేజపరచి, ఆమె ఆసక్తిని దుర్వినియోగం చేసుకుని ఆమె తనను ప్రేమించేట్టు చేసుకున్నాడు. తాను గూడా ఆమెను ప్రేమించాడు. అవును, ప్రేమించాడు. తంకమ్మను తాను ప్రేమించానని ఆమెతో తానెప్పు డైనా చెప్పాడా

అని ఒకసారి అతను ఆలోచించుకున్నాడు. లేదు, అతనెప్పుడూ అలా చెప్పలేదు. అంతేకాదు, ఆమెను పెళ్ళి చేసుకుంటానని ఆమెకు వాగ్దానం చెయ్యలేదు. కాబట్టి ఆడిన మాట తప్పాడనే నేరం అతని మీద ఆరోపించేందుకు వీల్లేదు. అతనామెకు కచ్చితంగా ఏ సమాధానమూ చెప్పలేదు. కాని తంకమ్మ అతని మీద నమ్మకం పెట్టుకుని వుంది. ఆమెది కేవలం నిష్కళంకమైన విశ్వాసమేనా? దానికతను అపరాధా? అతని ప్రవర్తన ఆమె నమ్మకానికి కారణం కాదా? 'ఇంటి సంగతులేమిటి?' అన్న ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయినంత మాత్రాన అతనికి రాత్రంతా నిద్రపట్టలేదా?

మర్నాడు ఉదయం ఆమె త్వరగా ఆఫీసుకు వస్తుంది. అతను కూడా వెళ్ళాలి. అయినా అతను బాగా ఆలోచించుకొని కొంచెం ఆలస్యంగానే వెళ్లాడు. తాను తంకమ్మకు ఏం చెప్పాలి అనే విషయాన్ని గురించి అతనేమీ ముందాలోచన చెయ్యలేదు. నూటికి నూరు సార్లు తంకమ్మకు ఉన్నదున్నట్టు స్పష్టంగా చెప్పేద్దామనుకున్నాడు. అంతా స్పష్టంగా చెప్పటమే మంచిది. లేకుంటే ముందు ముందు ఇబ్బంది కలగవచ్చు. దాచి పెట్టినందు వల్ల ఏం లాభం? విషయం చాలా ముందుకే సాగింది. పోను పోను చిక్కు ఎక్కువయిపోతుంది. పూర్తిగా చిక్కుపడక ముందే చిక్కు విడదీయటం మంచిది. ఈ రోజు సెక్రటరీకి తనకూ విరోధం లేకపోవచ్చు. కాని ముందు ముందు రావచ్చు. అందాకా వచ్చే లోపలనే అంతా సర్దుబాటుచేయటం మంచిది.

కాని కేశవపిళ్ళె మనస్సు సమాధాన పడటం లేదు. తంకమ్మను ఇంకా బూటకపు నమ్మకంతో మోసం చేసేందుకే అతను ఆలోచిస్తున్నాడు. అందుకోసరమే పన్నాగం పన్నుతున్నాడు.

అతను ఆఫీసుకు చేరవలసిన సమయం దాటిన తర్వాతనే హొటలు నుంచి బయలుదేరాడు. ఆలస్యంగా చేరాలనుకున్నాడు. అలాగే ఆలస్యమయింది. ఆలస్యంగా వెళుతున్నాననే భయం కూడా అతనికి లేదు. అందరూ వాళ్ల వాళ్ల పనిలో మునిగివున్నారు. తంకమ్మ విచారంతో కూర్చుని వుంది. 'ఆలస్యమయిందేం'- అని హరిహర అయ్యర్ అడిగాడు. తంకమ్మ వినాలని కేశవపిళ్ళె చెప్పాడు: 'మా వూరి నుంచి ముగ్గురు వచ్చారు. హైకోర్టులో కేసు పెట్టేందుకు వచ్చారు. వాళ్లను వకీలు దగ్గరికి తీసుకెళ్లాను. అందువల్ల ఆలస్యమయింది.'

ఇలా చెప్పాలని అతను ముందుగా అనుకోలేదు. కాని నోటికి అలా వచ్చింది. అతను చెప్పిన యీ అబద్ధాన్ని అందరూ పూర్తిగా నమ్మేశారు. అతను తంకమ్మ వైపు చూశాడు. ఆమెకూడా అతని మాట నమ్మినట్టు అతనికి అనిపించింది. కేశవపిళ్ళె తన్ను తాను అభినందించుకున్నాడు.

అతను కుర్చీలో కూర్చుని తనపని ప్రారంభించాడు. తంకమ్మ కాగితం మీద ఏదో రాస్తూ వుంది. ఆమె తన పని చూసుకోవటం లేదు.

కొంచెంసేపాగి కేశవపిళ్ళై అడిగాడు:

'కోపం వచ్చిందా?'

'నాకెందుకు కోపం? నాకేం అధికారముంది?'

'నామీద కోప్పడకు' అన్నాడు కేశవపిళ్ళై.

ఆమె జవాబు చెప్పలేదు.

మధ్యాహ్నాం భోజనంచేసిన తర్వాత అందరూ వచ్చేలోగానే కేశవపిళ్ళై ఆఫీసుకు వచ్చాడు. అతని వెంటనే తంకమ్మ కూడా వచ్చింది. కొంచెం సేపటికి మిగిలిన వాళ్లు కూడా వస్తారు. పెద్ద బీరువా వెనక గొడుగు పెట్టుకునేందుకు కేశవపిళ్ళై వెళ్లాడు. గొడుగు పెట్టి వెనక్కి తిరిగేసరికి తంకమ్మ తన వెనక నిలబడివుంది.

ఉదయం ఆమె సౌందర్యం ప్రభాత కాంతికి వికసించిన కమలంలా వుంది. విప్పారిన కేశరాశి చివర ముడివేసినా నడుముదాకా జారివుంది. ముఖాన్ని ముసురుకున్న ముంగురుల మధ్య ఆమె పెద్ద బొట్టు పెట్టుకుంది. నల్లంచు చీరె కట్టుకుని జంపరు వేసుకుని వుంది. మొత్తం మీద ఆమె మూడు మూర్తులా రూపెత్తిన నైర్మల్యంలా వుంది.

ఇప్పుడు ఆమె పూర్తిగా వికసించిన కమలం. జుట్టు ముడివేసుకుని, ఎర్రటి కుంకుమ బొట్టు పెట్టుకుని వుంది. జంపరు, మిగిలి వస్త్రాలు అంటినట్టు కట్టుకుని వుంది. ఎండలో తిరిగి వచ్చినందువల్ల ముఖం కొంచెం ఎఱ్ఱబారింది. దానితో ఆమె అందం ఇనుమడించింది.

కేశవపిళ్ళై మనస్సు చలించింది. ఆమె అందమైన ముఖాన్ని అతను రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. ఆమె ముఖం చూస్తుంటే ఆమె ఏదో అడుగుతున్నట్టు అతనికి అనిపించింది. ఆమె కళ్లు 'కావాలి' 'కావాలి' అని అంటున్నాయి ఆ కావల్సింది-చుంబనం- అతను ఇచ్చేశాడు. అందులోని ఆనందానుభూతి కూడా అతనికి అందింది..

అంతకు మించి వ్యవధి లేదు. ఆ పెద్ద బీరువా వెనుక ఇది జరిగింది. మిగిలిన గుమాస్తాలు వచ్చే వేళయింది. ప్రేయసీ ప్రియులిద్దరూ వాళ్ల వాళ్ల కుర్చీల్లో కూర్చున్నారు. అప్పటికి మిగిలిన గుమాస్తాలు వచ్చేశారు.

ఆఫీసు నుంచి యింటికి పోతూ తంకమ్మ కేశవపిళ్ళైతో అన్నది: ఈ రోజు కొట్టియంబళం తలుపు తెరిచేవుంటుంది.'

బహుశా ఆమె కోరిక ఇంకా తీరలేదు.

రాత్రి పదిగంటల తర్వాత కేశవపిళ్ళై చెట్టికుళంగరే యింటి గుమ్మం చేరాడు. కొట్టియంబళం తలువు తెరిచేవుంది. లోపలినుంచి తంకమ్మ కేశవపిళ్ళైను సంజ్ఞ చేసి పిలిచింది. దడదడలాడే గుండెతో అతను లోపలికి

ప్రవేశించాడు. తంకమ్మ అతని చెయ్యి పట్టుకుంది. అతని చేతి యెముకలు నలిగిపోతాయని ఆమెకు అనిపించింది. ఇద్దరూ ఒక గదిలో దూరారు. ఆమె మెల్లిగా తలుపువేసింది. ఏమయినా ప్రమాదం జరుగుతుందేమో నని కేశవపిళ్ళకు భయం వేసింది. మధ్యాహ్నం లంచి టైములో ఆఫీసులో జరిగిన ప్రణయ లీలను సొంతం చేసుకునేందుకు ఇది సరియైన సమయం.

తంకమ్మ అతని చెవిలో మెల్లిగా ఊదింది: 'అయ్యో దైవమా! నేను చేస్తున్నదంతా తప్పే' అంటూ ఆమె కేశవపిళ్ళను ముద్దు పెట్టుకుంది.

హృదయంలో ఆవేదన వల్ల ఆమె అలా అన్నదా? తెలియదు. మరి ముద్దు పెట్టుకోవటం దేనికి? ఆమె శ్వాస చాలా వెచ్చగా వుంది. అయినా ఆమె వెళ్లి పోతుందేమోనని భయంతో కేశవపిళ్ళ ఆమె నడుముచుట్టూ చెయ్యివేసి గట్టిగా హత్తుకున్నాడు. 'రాత్రిపూట ఇలా కలుసుకోవటం న్యాయమేనా?' అని అడిగింది తంకమ్మ.

'తప్పా?' అని అడగాలనుకున్నాడు కేశవపిళ్ళ. కాని అతని నోట ఆ ప్రశ్న రాలేదు. తంకమ్మ ముఖం చూస్తే అతనికి తానా ప్రశ్న అడిగినట్టే అనిపించింది. లేకుంటే తానా ప్రశ్న వేసినట్టే ఆమె సమాధానం చెప్పింది: 'బాప్రే, ఇది చాలా తప్పు ఎని. పెళ్ళికి ముందు...... భగవాన్, నాకేమీ తోచటం లేదు.' ఆమె యీ మాట తన తప్పు తెలుసుకుని అన్నదో లేక కామ వికారం వల్ల అన్నదో తెలియదు.

కేశవపిళ్ళ ఏదో ఒక మాట అనాలి. లేకుంటే తంకమ్మ అపార్థం చేసుకోవచ్చు. అతని నాలుక దాటి ఒక ప్రశ్న బయటపడింది: 'ఎందుకలా అంటున్నావు?'

'నాకేం తెలియదు. నాకు మాత్రం భయమేస్తున్నది. గాబరాగా వుంది. అయినా మిమ్మల్ని వదలి పెట్టాలనిపించటం లేదు'

ఒక్క క్షణం ఆగి ఆమె మళ్లీ అన్నది: 'ఇదే పెళ్ళయిన తర్వాత అయితే బాగుండేది.'

కేశవపిళ్ళ అడిగాడు: 'మరి నీవు కొట్టియంబళం తలుపు తెరిచి వుంటుందని చెప్పి నన్నెందుకు పిలిచావు? నాకోసరం ఎందుకు ఎదురు చూస్తున్నావు?'

'ఆఁ, ఊరికేనే, అదేం లేదు.'

ఈ మాటలన్నీ ఆమె మనస్సు చిన్న బుచ్చుకొని చెప్పలేదు. ఆమె కేశవపిళ్ళ మెడమీద వున్న తన చేతితో అతన్ని ఇంకా దగ్గరకు చేర్చుకుంది- అతను ఎక్కడికీ పారిపోకుండా. అతని ముఖంలో ముఖం పెట్టి 'నామీద ప్రేమ లేదు కదూ! బొత్తిగా లేదు కదూ!' అన్నది.

'ఆఁ, ఎందుకలా అనుకోవాలి?'

ఎంత నిర్వికారంగా అడిగారు? ప్రేయసి ఎవరయినా తన ప్రియుణ్ణి 'నీకు నేను ఇష్టమేనా' అని అడిగితే ప్రియుడు ఇలాగే ఆ ప్రశ్నకు కారణమడుగుతాడు. ఈ సందర్భంలో కేశవపిళ్ళై అభిప్రాయం, ఆమె చెప్పింది తప్పని. అతను తంకమ్మను రెట్టించి ఆమె అభిప్రాయాన్ని స్పష్టంగా తెలుసుకోవలసింది. ఒట్టు పెట్టించుకోవల్సింది. 'నాకలాగే అనిపిస్తున్నది'- అన్నది తంకమ్మ.

బహుశా కేశవపిళ్ళై చుంబనంలో వేడి తక్కువగా వుండి వుంటుంది. అతని ఆలింగనం అంత గాఢంగా వున్నట్టు లేదు. అలా లేనప్పుడు ప్రేమ లేనట్టు తోస్తుంది. ఆమెకు ఇంతకంటె వెచ్చని చుంబనం కావాలని అనిపించివుంటుంది.

'ఇంటి సంగతులేమిట'ని ఆమె అడిగింది.

'ఏం లేవు. విశేషమేమీ లేదు.' అని కేశవపిళ్ళై కంగారుగా అన్నాడు.

సమాధానం వెతుక్కోలేక పోయాడు. అమ్మ చాదస్తం అంటే సరిపోదు. మరేమయినా చెప్పాలి. ఏం చెప్పను అని ఆలోచించాడు.

'మరి టెలిగ్రాం ఎందుకొచ్చింది?' అని అడిగిందామె.

'అదేంలేదు. అమ్మకు నన్ను చూడాలనిపించింది' అని అతను ప్రత్యుత్తరం చెప్పాడు.

'ఉత్తరం రాస్తే సరిపోయేదిగా?'

దానిక్కూడా కారణం చెప్పాలి. 'మళ్లీ ముప్పయ్యో తేదీ వెళ్లాలి-అన్నాడు.'

'ఏమయినా అనండి, ఒకమాట మాత్రం ఖాయం. ఇంటి నుంచి వచ్చిం తర్వాత మీరు అదోలా విచారంగా కనిపిస్తున్నారు.'

'అవును, నిజమే' అని తంకమ్మతో ఏకీభవిస్తూ అన్నాడు కేశవపిళ్ళై.

'మీరు దిగులుగా వుంటే చూసి నేననుకున్నాను- ఇంట్లో ఏదో జరిగివుంటుందని. అందుకనే అడిగాను.'

ఉన్నట్టుండి పట్టీ పట్టనట్టు ఆమె అన్నది- 'పోనీలెండి. నాకా విషయం తెలుసుకొనే అధికారమేముంది?'

'అదే, అదేమంత ముఖ్యమైన విషయం కాదు.'

'ముఖ్యం కానీ, కాకపోనీ అసలు విషయమేమిటని?'

అసలు విషయం స్పష్టంగా చెప్పేస్తే ఎలా వుంటుందని కేశవపిళ్ళై ఆలోచించాడు. కాని అతనికంత ధైర్యం లేదు.

ఆమె అతని సమాధానం కోసరం ఎదురుచూస్తున్నది. కేశవపిళ్ళై నోట అకస్మాత్తుగా వచ్చింది: 'ఏదో పొలాన్ని గురించి రాతకోతలు.'

తనెంత చక్కని సమాధానం చెప్పానో అని అతనికే ఆశ్చర్యమయింది. మరోసారి అతను తన్ను తాను అభినందించుకుంటున్నాడు. అతని ఊహకు ఊపిరి వచ్చింది.

'ఇందులో ఇంతదిగులు పడవలసిన పనియేముంది?' అని అడిగిందామె.

ఇక కేశవపిళ్ళై కథ అల్ల సాగాడు. కథ చాలా అనుకూలంగా సాగింది- 'పుట్టినప్పటినుంచి నాపేరిట కొంత పొలం వుంది. అది నా స్వాధీనం కావాలని చిన్నప్పటి నుంచి నా అభిలాష. మా అమ్మ నన్ను ఒళ్లో కూర్చోబెట్టుకుని తరుచుగా ఆ పొలాన్ని గురించి చెపుతూ వుండేది. ఆ పొలం నా స్వాధీనం కావాలని మా అమ్మ కోరిక. మా అమ్మ అస్తమానం దీన్ని గురించే చెపుతూ వుంటుంది.

ఆపొలం స్వాధీనం చేసుకునేందుకు అతను వెళుతున్నట్టా, లేనట్టా- ఆ విషయం గురించి ఏం చెప్పాలా అని కేశవపిళ్ళై ఆలోచనలో పడ్డాడు. అందువల్ల కథావాహిని కొంచెంసేపు ఆగిపోయింది.

తంకమ్మ చాలా కుతూహలంతో కథవింటున్నది. ఆమె ఆ కథను నమ్మినట్టే కనిపిస్తున్నది. 'తర్వాత?' అని అడిగింది.

కేశవపిళ్ళై కథ మళ్లీ సాగింది- 'ఇప్పు డు ఆ పొలం మీద నాకు జన్మ హక్కు వుంది- అనే విషయం స్పష్టంగా వ్రాతపూర్వకంగా వుండాలి.'

రాయించుకోండి. దానికేముంది?' అన్నది తంకమ్మ.

ఏం లేకపోవటమేమిటి? తరతరాల నుంచి వుద్యోగం చేస్తున్న మీకూ, తిరువనంతపురం వాళ్లకూ పొలాల విషయం ఏం తెలుస్తుంది? అందుకని మీకేమీ దిగులుండదు. కాని వంశపరంపరంగా వ్యవసాయం చేసుకుంటున్న మా కర్థమవుతుంది.'

ఆమె కూడా వదల్లేదు: 'అవును మరి, మేమేదో బీద వాళ్లం. మాకేమన్నా పొలమా పుట్రా?'

కేశవపిళ్ళై మనసు కుదుటపడింది. కథ చెప్పిన ఫలితం దక్కింది- 'ముప్పయ్యో తేదీ, స్వాధీనం చేసుకునేందుకు మళ్లీ వెళ్లాలి.'

ఆ రోజు బ్రాహ్మముహూర్తం వరకూ ప్రేయసీ ప్రియులిద్దరూ ఆ రహస్య స్థలంలో కూర్చుని ఏవేవో చిక్కు ప్రశ్నలు వేసుకుంటూ గడిపారు. కేశవపిళ్ళై తంకమ్మ కౌతుకాన్ని రేకెత్తిస్తున్నాడు. బహుశా యౌవనం లోని చాంచల్యం అతనికి అర్థమవుతున్నది. తంకమ్మను స్వాధీనం చేసుకోవటమే అతని ఉద్దేశ్యం. అందువల్ల అతను మైమరచి ప్రవర్తిస్తున్నాడు. తంకమ్మలో యౌవనపు రక్తం ఉడికి పోతూవుంది. ఆమె ఒళ్లు మరిచింది. కేశవపిళ్ళైకు భయం వేసింది. అతని ఉన్మాదం చల్లబడింది. 'ఏమిటిది?' అన్నాడతను.

'అవును, ఏమిటి?'

'దీనికి పర్యవసానమేమిటి? నీ ప్రతిష్ఠ?'

'ప్రతిష్ఠ? ఎవరికి?'

కేశవపిళ్ళై ఒళ్లు దగ్గిర పెట్టుకుని వుండటం అవసరమనుకున్నాడు. తంకమ్మకేమీ భయం లేదు. కేశవపిళ్ళై భయపడుతున్నాడు.

## నాలుగు

ఇరవై తొమ్మిది, ముప్పై తారీఖులకు సెలవు దొరకాలి. సెలవు మంజూరు చేయించుకుని వెళ్ళిపోవటం మంచిది. వెనకటిలాగా సెలవు చీటీ యిచ్చి వెళ్ళిపోవటం మంచిది కాదని హరిహర అయ్యర్ అభిప్రాయం. హరిహర అయ్యర్ ఇంటికి వెళ్ళాలి. సెలవు తీసుకుని మరీ వెళ్ళాలి. హరిహర అయ్యర్ సూచించిన మార్గమిది-

వైయ్యాపురి పిళ్ళె చెడ్డవాడు కాదు. అతను కూడా బి.య్యే ప్యాసయినాడు - పాతకాలపు బియ్యే. ముప్పై యేళ్ళ క్రితం అతను సెక్రటేరియట్‌లో గుమాస్తాగా చేరాడు. ఈ నాటికి సూపరింటెండెంటయ్యాడు. అతనితోపాటు వుద్యోగంలో చేరిన వాళ్ళు ఈనాడు పేష్కారు, సెక్రటరీ అయ్యారు. అతను అదే డిపార్టుమెంటులో పని చేస్తున్నాడు. అక్కడ వున్న అన్ని కుర్చీల్లో కూర్చుని అతను పని చేశాడు. వైయ్యాపురి పని తెలియని వాడు కాడు. తెలివి తేటలు కూడా తక్కువయినవి కావు. కాని అతన్ని గురించి ఎవ్వరూ పట్టించు కోలేదు. పట్టించుకొనే వాళ్ళు కూడా లేరు. ఈనాటి వరకూ అతన్ని గురించి ఆలోచించే వాళ్ళు అతనికి తటస్థ పడనే లేదు. గడచిన ముప్పై యేళ్ళ నుంచి అతను యంత్రంలా పని చేస్తున్నాడు. సరిగ్గా పదకొండు గంటలకు అతను ఆఫీసుకు వస్తాడు. అయిదు గంటలకు వెళతాడు. సెక్రటేరియట్‌లో తన శాఖలో పని చేస్తున్న గుమాస్తాలతో తప్ప మరెవ్వరితో మాట్లాడడు. సాయంత్రం అయిదు గంటలనుంచి ఉదయం పదకొండు గంటలవరకు ఇంట్లో, ఉదయం పదకొండు గంటల నుంచి అయిదు గంటల వరకూ ఆఫీసులో తప్ప మరెక్కడా అతను కనిపించడు. పదకొండు గంటలకు మాత్రం పాత కోటు వేసుకుని, నొసట విభూతి పూసుకుని ఆఫీసు గేటులో నుంచి లోపలికి వస్తూ అతను కనిపిస్తాడు. ఇందులో పొరపాటు లేదు. సెక్రటేరియట్‌లో పై ఆఫీసర్లకు అతను వ్రాసే రాత కోతలు తప్ప అతను ఆఫీసులో పని చేస్తున్నట్లు కూడా తెలియదు.

వైయ్యాపురి పిళ్ళెకు పదివంది పిల్లలు. ఉద్యోగంలో ప్రవేశించినప్పటినుంచీ యిప్పటి వరకూ ఎవరెంత యిస్తే అంత, అతను తీసుకుంటున్నాడు. ఏదయినా పని చేసి పెట్టాలంటే అతనికి ఇంత ఇవ్వాలని మామూలేమి లేదు. బలవంతం కూడా లేదు. అందువల్ల దాన్ని లంచమనేందుకు వీల్లేదు. ఎంత తక్కువ యిచ్చినా, అతనికేమీ అభ్యంతరం లేదు. ఇంత తక్కువా అని అతనెప్పుడూ నోరు తెరిచి అనలేదు. లెక్కపెట్టడు కూడా. అందువల్ల ఎవరికీ అతను గిట్టక పోవటం కానీ, అతనిమీద కోపంగానీ లేదు. ఈనాటి వరకూ వైయాపురి పిళ్ళె మీద ఏమీ నేరారోపణ జరగలేదు. అతని ప్రవర్తన చూస్తే లంచం తీసుకోవటం జీతంతో పాటు పై సంపాద్యం పొందటమని మాత్రమే అనిపిస్తుంది. జీతంలో భాగమే లంచం కూడా. కాని

లెక్కపెట్టు కోవటం తప్పు. ఈ విధంగా పదిమంది పిల్లలతో ఆ కాపురం జరుగుతూ వుంది. లంచం చాలా కొద్దిగా దొరికే చోట పని చెయ్యటమంటే వైయ్యాపురి పిళ్ళెకు దురదృష్టంగా తోస్తుంది. ప్రమోషను గురించి అతనెప్పుడూ అసంతృప్తి చెందలేదు.

వైయ్యాపురి పిళ్ళెకు సుబ్రహ్మణ్యస్వామి మీద భక్తి ఈ భక్తి వల్లనే తన జీవితం సక్రమంగా జరుగుతున్నదని అతని నమ్మకం. ఈ నాటి వరకూ ఏ ఒడుదుడుకులూ, తగాదాలూ లేకుండా జరుగుతూ వచ్చింది. ఆ సుబ్రహ్మణ్యేశ్వరుడే అతనికి తోడు నీడగా వుండి కాపాడు తున్నాడని అతనంటాడు.

కేశవపిళ్ళె సూపరింటెండెంటు ఇంటికి వెళ్ళి సెలవడుగుదామని నిర్ణయించుకున్నాడు. అతను వాళ్ళింటికి మొట్టమొదటి సారి వెళుతున్నాడు. అందువల్ల ఒట్టి చేతులతో వెళ్ళటం మంచిది కాదు. అలా వెళ్ళటం సూపరింటెండెంటు కూడా హర్షించడని అందరూ అంటారు. పొలం పనికోసరం పది రూపాయలు ఇస్తానని తంకమ్మ మాట యిచ్చింది. దానితో పాటు అతను మరి మూడు రూపాయలు అడిగాడు. మంచి కాఫీ గింజలు, పంచదార తీసుకుని అతను సూపరింటెండెంటు గారి యింటికి వెళ్ళాడు. కాఫీగింజలు, పంచదార చూసి సూపరింటెండెంటుకు చాలా సంతోషమయింది. ఈ విధంగా 29, 30 తేదీలకు సెలవు మంజూరు చేయించుకుని తంకమ్మ దగ్గర పది రూపాయలు తీసుకుని28వ తేదీ యింటికి బయలు దేరాడు.

అతను తన భవిష్యత్తును గురించి యేమీ నిర్ణయించుకోలేదు. పెళ్ళికి వెళ్ళాలి. నెలాఖరు. చేతిలో డబ్బు లేదు. డబ్బు పంపించమని అతను తండ్రికి రాయ లేదు. వెళ్ళి తీరాలి. 'పొలం రాయించు కొనేందుకు డబ్బక్కర్లేదా?' అని అడిగింది తంకమ్మ. కేశవపిళ్ళె 'కావాలి' అన్నాడు. కాని అతను అప్పడగలేదు. కేశవపిళ్ళె ఒక పిల్లను ప్రేమించి మరో పిల్లను పెళ్ళి చేసుకునేందుకు తన ప్రియురాలిని డబ్బడిగాడని అందరూ అంటారు. తాను డబ్బడిగాడనే దోషం తనమీద వుండకూడదు. మరొకరెవరయినా అతనికి డబ్బిస్తే ఈ పైకం అతను తీసుకోకపోవచ్చు.

తన పిల్లవాడు ఒంటరిగా రావటం చూసి పప్పుపిళ్ళె అన్నాడు. 'అరె, ఒక్క స్నేహితుణ్ణి కూడా తీసుకు రాకుండా వచ్చావేం? ఏమయింది?'

గౌరిఅమ్మ తన మనసులోని సందేహం తెలియ పరుస్తూ అన్నది 'పెళ్ళి ఏర్పాట్లన్నీ అయిన తర్వాత పెళ్ళి కొడుకే రాడేమోనని అనుమానం వేసింది.'

కుట్టిఅమ్మ సరియైన సమాధానం చెప్పింది. 'మన వాడు తండ్రికి చెడ్డపేరు తీసుకరాడు.'

ఒక్క విషయంలో తల్లి, కొడుకుకు సంజాయిషీ చెప్పుకోవలసి వచ్చింది. 'పెళ్ళి కొడుకు వేసుకోవలసిన దండ బంగారంది వుండాలని మీ నాన్న గారు అనుకున్నారు. డబ్బు కోసరం ఆయన ఎన్ని చోట్లనే ప్రయత్నించారు. కాని లాభం లేకపోయింది. చివరకు పొలం పాలికి ఇద్దామని అనుకున్నారు. కాని యెవరూ సిద్ధం కాలేదు. అందుకని చివరకు పూలదండతో తృప్తి పడటం మంచిదని అనుకున్నాం. లేకపోతే చేసేదేముంది? ఈ మాట నీకు చెప్పటం నాన్నకు మనస్కరించటం లేదు. అందుకని నేనే యీ మాట నీతో చెబుదామనుకున్నాను.'

కుట్టిఅమ్మ వాత్సల్యంతో కేశవపిళ్ళెను చేరదీసి అన్నది - 'అబ్బాయ్, నీకి విషయంలో విచారంగా లేదు కదా?'

'లేదు' అన్నాడు కేశవపిళ్ళె ఒక్క మాటలో సమాధానం చెపుతూ.

కొంచెం సేపాగి కుట్టిఅమ్మ అన్నది 'ఎంది తక్కువఖర్చుతో చేసినా కొంతయినా డబ్బుకావాలిగా! ఎక్కడ తెస్తాం? నాన్న పెద్ద వారయినారు. పొలం పాలికిచ్చి రోజులు గడుపుతున్నారు.' కుట్టిఅమ్మ చెప్పుకుంటూ పోతున్నది. అక్కడ అందరికీ ఆనందంగా వుంది. ముఖ్యంగా పప్పుపిళ్ళెనూ, కుట్టిఅమ్మనూ ఇంత ఆనందంతో ఎప్పుడూ ఎవ్వరూ చూడలేదు. వాళ్ళ జీవితంలో ఇది పరమానందకరమైన సన్నివేశం. అంత ఆనందకరమైన విషయం ఏముందని ఎవరయినా అడగవచ్చు.

ఆరోజు కిట్టుమామ పిల్లజాతకం తీసుకుని వచ్చారు. కేశవపిళ్ళెను తన దగ్గర కూర్చోపెట్టుకుని ఆ జాతకంలోని మంచి లక్షణాలను వివరిస్తున్నారు. కేశవపిళ్ళెకు ఆవిషయమేమీ తెలియదు. కాని కిట్టుమామ చెప్పుకుని పోతూవుంటే అతను వినక తప్పలేదు. ఆయన మంచీ చెడూ అన్నీ చెపుతూ సంవత్సరం, తేదీలూ అన్నీ చెప్పసాగేసరికి కేశవపిళ్ళెకు అభిరుచి కలిగింది. అతను ప్రశ్నలడగటం మొదలుపెట్టాడు.

పెళ్ళికి ఒక్కొక్కరే చుట్టాలు రావటం మొదలు పెట్టారు. ఈ ముహూర్తానికే కొచ్చినాటి పెళ్ళి కూడా వున్నందువల్ల కొద్ది మందే వచ్చారు. కిట్టుమామ హితబోధ ఫలించలేదని చెప్పేందుకు వీల్లేదు. ఎందుకంటే కేశవపిళ్ళెలో కొంచెం మార్పు వచ్చింది. అతను కూడా అతిథులకు స్వాగతం చెప్పి మర్యాదలు చేయసాగాడు. ఇంతవరకు పట్టీ పట్టనట్టు ఉన్నవాడు వాళ్ళకు తాంబూలాలు అందిస్తున్నాడు. ఇది తనకు సంబంధించిన పనే అని-అతనికి ఇప్పుడిప్పుడే అనిపిస్తున్నది.

అర్ధరాత్రి తర్వాత పెళ్ళి వాళ్ళు పడవలో బయలు దేరారు. వాళ్ళల్లో ఇద్దరు చుట్టాలు కేశవపిళ్ళె సమవయస్కులున్నారు. కేశవపిళ్ళెకు వాళ్ళతో స్నేహంగానీ, దగ్గర సంబంధం గానీ లేదు. మిగిలిన వాళ్ళంతా పప్పుపిళ్ళె వయస్సు వాళ్ళు. కిట్టుమామ భాగవతం ఆరంభించారు. ఆ యిద్దరు

యువకులు తప్ప మిగిలిన వాళ్ళంతా ఆయన భాగవతం చదివి చెబుతుంటే వింటున్నారు. యువకులిద్దరూ నిద్రబోతున్నారు. కేశవపిళ్ళె ఒంటరి వాడయిపోయినాడు. అతనితో మాట్లాడేందుకు ఎవ్వరూ లేరు.

పెళ్ళికూతురింటినుంచి ఒక మైలు దూరంలో వున్న ఒక యింట్లో పెళ్ళి యేర్పాట్లు చేశారు. అందరూ పొద్దున్నే కాఫీ తాగారు. కాఫీ తర్వాత స్వాగతం (వరపూజ) కార్యక్రమం వుంది. పెళ్ళి కూతురు వాళ్ళు వరపూజకు వచ్చే సరికి వరుడు కనిపించలేదు. వరుడు కనిపించకపోయే సరికి ముసలి వాళ్ళు కంగారు పడ్డారు. 'కేశవ్ ఎక్కడ?' అని ఒకరినొకరు ప్రశ్నించుకుంటున్నారు. కొంచెం సేపు అలజడి చెలరేగింది. పప్పుపిళ్ళె కేశవపిళ్ళెను రెండు సార్లు పిలుస్తూ బిగ్గరగా అరిచారు. 'ఇంతకు ముందిక్కడే వున్నాడే? ఇంతలో ఎక్కడికి వెళ్ళాడ'ని గంతులు వేశాడు. కేశవపిళ్ళె పొలాలు దాటి ఏదో ఒక చెట్టు మీద దిగులుగా కూర్చుని వున్నాడు. ఈ అలజడి అతనికి తెలియదు. కిట్టుమామ కంగారుగా అటూఇటూ పరిగెత్తి చివరకు కేశవపిళ్ళెను పట్టుకొచ్చాడు. పప్పుపిళ్ళెకు చాలా కోపం వచ్చింది. కాని ఆ సమయానికి అతను కోపాన్ని ఆపుకున్నాడు. 'మనుషులున్నచోట ఉండకుండా ఏ అడవికి వెళ్ళావురా?' అని అడిగాడు.

'పోనీలే, అతని వయస్సువాళ్ళెవ్వరూ లేకపోయె. మనమధ్య ఎలా వుంటాడు?' అన్నాడు కిట్టుమామ.

ముహూర్తం సమీపించింది. ఒకాయన వరుడి మెడలో దండ వేశాడు. అదే సమయంలో గోడలు చీల్చుకునేటట్టు పెద్దగా మేళాలు మోగాయి. అక్కడి దేవాలయంలో నాదస్వరం వాయించే అతను 'పీపీపీ' అని ఆరంభించాడు. మరొకడు డోలువాయించాడు. పెళ్ళి ఊరేగింపు ముందుకు సాగింది. చంపాకులం ఆలయంలో పండగ పాటలు పాడే గోవిందన్ పిళ్ళె గొంతెత్తి పాడటం మొదలు పెట్టాడు. 'పాంచాలరాజు తనయకు పరిణయమీరోజు' అని అతను పాడుతుంటే యితరులు తాళం వేస్తూ తైతక్కలాడుతున్నారు. ఇది ఒక విధంగా వాళ్ళ నౌకిలీల. మధ్య మధ్య స్త్రీలు, పురుషులు ఎగిరి గంతులు వేస్తున్నారు. దారిన పోయే పెళ్ళికొడుకును చూసి అదేరకంగా చప్పుడు చేస్తున్నారు.

'ఏమిటీ హడావిడి? ఇది తిరువనంతపురం దాకా వెళుతుంది. ఇంత అలజడి యెందుకు? ఇది లేకుండా జరగదా?'

బీరువా చాటున ఒక్క ముద్దుకోసరం మురిపెంతో ఎదురు చూస్తున్న తంకమ్మ ముఖసౌందర్యం అతని కళ్ళ యెదుట కనిపిస్తూ వున్నది. అప్పుడామె తన తడిసిన కేశరాశిని చివరివరకు ముడి వేసుకుని వుంది. నల్లంచు చీరెకట్టుకొని, జంపరు వేసుకొని వుంది. కేశవపిళ్ళె కళ్ళు

మూసుకున్నాడు. అయినా ఆ దృశ్యం అతని కళ్ళల్లో నుంచి తొలగలేదు. రేపు కూడా ఆమె ఇలాగే నిలబడుతుంది.

'పాంచాల రాజు తనయకు.....'

ఓహెూ! ఎంత భయంకరమైన కోలాహలం! కోలాహలం హెచ్చుతూ వుంది. మరో స్త్రీ అతనికోసరం ఎదురు చూడకూడదని యీ కోలాహలంలోని అంతరార్ధం..... ఆఫీసుకు తొందరగా వచ్చి తంకమ్మ అతని కోసరం ఎదురు చూడకూడదా?.... కొట్టియంబలం తలుపు తెరుచుకొని పూలచెట్టు కింద తంకమ్మ యిక అతని కోసరం ఎదురు చూడకూడదా? అంటే నా ఆనందమంతా యిక సర్వనాశనమయినట్టే నన్నమాట. ఇందుకు ప్రతిఫలం?..... ఇంతవరకు అతను పెళ్ళి కూతుర్ని చూడ లేదు.

ఇలా ప్రతిరోజూ తంకమ్మ తన కోసం ఎదురు చూస్తూ వుంటే..... ఇద్దరు భార్యలు తయారవుతారా? ఒకామె యిక్కడ నిరీక్షిస్తూ వుంటే, మరొకామె అక్కడ.

ఇలా ఆలోచించుకుంటూ వరుడు పెళ్ళిఇంటి గుమ్మం చేరాడు. ఒక పిల్లవాడు అతనికి కాళ్ళు కడిగాడు. అంతటితో కోలాహలం బాగా ఉచ్ఛస్థాయిని చేరుకుంది. పడవ పాట ముగిసింది.

ఎదురుగా మల్లెపూల మండపం వుంది. అందులో పెద్ద పెద్దవి ఏడు లైట్లున్నాయి. పక్కనే అక్షింతలు పెట్టివున్నాయి.

ఆ మండపాన్ని ప్రత్యేకంగా అలంకరించలేదు. చిరిగిన రంగు కాగితం కూడా అంటించలేదు. కాని సరియైన స్థలంలో మండపం కట్టారు.

మల్లెపూల మండపంలో పెళ్ళి పీటల మీద తెల్లటి బట్ట పరిచి దాని మీద పెళ్ళికొడుకును కూర్చో బెట్టారు. మంగళద్రవ్యాలతో హారతి పళ్ళెం పట్టుకొని ఒక ముత్తైదువు వచ్చింది. ఆమె వెనుకఉన్న మరో ఆమె చెయ్యి పట్టుకొని పెళ్ళి కూతురు కూడా ప్రవేశించింది. జీవితంలో మొదటిసారి కేశవపిళ్ళై ఆమెను చూస్తున్నాడు...... లేదు, లేదు చిన్నప్పుడు పసిపిల్లగా చాలా రోజుల కింద అతను ఆ అమ్మాయిని చూశాడు. కాని ఆ రూపం ఇప్పుడతనికి గుర్తు లేదు.

వరుడి దగ్గర వధువును కూర్చోపెట్టారు. ఎవరో, పెళ్ళి కొడుకు కేశవపిళ్ళై చేతిలో తాంబూలం పెట్టారు. వప్పుపిళ్ళై అతనికి దక్షిణ యిచ్చాడు. అతను తండ్రి పాదాలకు నమస్కరించాడు.

అప్పుడు తండ్రి పసుపు దారంలో కూర్చిన మంగళసూత్రం అతని చేతికిచ్చాడు. కావలసినంత గలభాలో కంపిస్తున్న చేతులతో వరుడు వధువుమెడలో మంగళసూత్రం కట్టేందుకు ప్రయత్నించాడు. కాని సరిగ్గా కట్టలేక పోయాడు. పెళ్ళికొడుకు కంగారు పడుతూ వుంటే వెనకనుంచి అమ్మలక్కలు నవ్వుతున్నారు. చివరకు పెళ్ళికొడుకు మంగళసూత్రం సరిగ్గా

కట్టాడు. కాని బాగా బిగించి కట్టటం వల్ల పెళ్ళి కూతురుకి ఊపిరాడలేదు. ఆమె గుడ్లు మిటకరించింది. వెనకనుంచి ఎవరో అరిచారు. 'కాస్త ముడి వదులు చెయ్య'మని.

ఒకస్త్రీ ముడిని వదులు చేసింది.

ఆ తర్వాత పెళ్ళి కూతురి చేతుల్లో వస్త్రాలు పెట్టి పాణిగ్రహణ సంస్కారం పూర్తి చేశారు. పెళ్ళికూతురి చెయ్యి పట్టుకునే సమయంలో కంగారు వల్ల పెళ్ళి కొడుక్కి కుడి యెడమలు తెలియలేదు. అక్కడి నుంచి యెలాగయినా వెళ్ళి పోదామని అతనికుంది.

వివాహమహోత్సవం, విందు భోజనం ముగిశాయి. ఆ రోజు సాయంత్రం నాలుగు గంటలకు పెళ్ళి కూతురిని తీసుకుని పెళ్ళివాళ్ళు ఇల్లు చేరారు.

పెళ్ళివాళ్ళు తిరిగి వచ్చిన కొంచెం సేపటికి ఇంటి వెనక ఏదో తగాదా జరుగుతున్నట్టు మాటలు వినిపించాయి. కుట్టిఅమ్మ ఆడంగులతో తగూలాడుతూవుంది. 'పిల్లకు క్షయరోగమయితే ఏమయింది? మా పిల్లవాడే నయం చేసుకుంటాడు. ఇందులో ఎవరికేం నష్టం?' అంటున్నదామె.

'అందరికీ అసూయగా వుంది. పెళ్ళి కాగానే పెళ్ళి కూతురిలో లోపాలు చూపించడం వీళ్ళకు అలవాటు. లేకుంటే యేమిటిది?' అని కేకలు వేస్తున్నది కుట్టిఅమ్మ.

గౌరిఅమ్మ, కిట్టుమామ కలిసి ఆమెను శాంత పరిచేందుకు ప్రయత్నించారు. కాని కుట్టి అమ్మకు కోపం వచ్చిందంటే తొందరగా శాంతించదు. పెళ్ళికూతురికి క్షయరోగమనీ, ఆమెకు జుట్టు లేదనీ ఎత్తు పళ్ళనీ, నల్ల రూపనీ, ఏమేమో అంటున్నారందరూ. ఈమాటలు కుట్టిఅమ్మ చెవుల్లో పడ్డాయి. ఆమెకు చాలా కోపం వచ్చింది.

కేశవపిళ్ళి ఆ రోజే తిరుగు ప్రయాణం కట్టాడు. అతనికి సెలవు రెండు రోజులే యిచ్చారు. ఆ రోజు సాయంత్రం అతను బయలు దేరితే ఆఫీసుకు సకాలంలో చేరతాడు.

కేశవపిళ్ళి మర్నాడు వెళితే బాగుంటుందని కుట్టిఅమ్మ పట్టుదల 'చూడలేని వాళ్ళు ఇప్పుడే ఏమేమో అంటున్నారు. దానికి తోడు నీవివాళే వెళ్ళావంటే వాళ్ళు మరీ నేరు చేసుకుంటారు'అన్నదామె.

కేశవపిళ్ళి ఆరోజే వెళ్ళాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు. అతని తోటివాళ్ళెవరయినా అతనికి నచ్చ చెపితే అతనాగుతాడని ఆమె అభిప్రాయం. ఆరోజు మంచి రోజని ఆమె కిట్టుమామ నడిగి కనుక్కుంది.

కాని యీ విషయం తల్లి పిల్లవాడితో ఎలా చెపుతుంది?

కేశవపిళ్ళి తల్లి దండ్రుల మాట కాదన లేక ఏదో విధంగా వివాహం చేసుకున్నాడు. కాని యిప్పుడు అతను వెళ్ళటానికి సిద్ధమై నాడు. 'ఇలాంటి పిల్లలు కూడా వుంటారా? పెళ్ళి కూతురు కొంచెం బలహీనంగా, జుట్టు

తక్కువగా, నల్ల వన్నెలో వుంటే యేమయింది? వయసు మాత్రం తక్కువే కదా! కేశవపిళ్ళై ఎందుకు ఉత్సాహంగా లేడు?' ఆలోచించి కుట్టిఅమ్మ కూతురితో అన్నది- 'వాడు పెళ్ళి కూతురిని తాకుతాడో లేదో అనిపిస్తున్నది. వాడు వెళ్ళాలని తొందర పడుతున్నాడు. ఇవాళ ఇద్దరూ కలిస్తే అంతా సరవుతుంది. వాణ్ణి వెళ్ళకుండా ఆపేందుకు ఏదో ఉపాయం వెతకాలి!'

కుట్టిఅమ్మ పెళ్ళి కూతురి దగ్గరకి వెళ్ళింది. ఆమె ఒంటరిగా కూర్చొని వుంది. తన భర్త యీ రోజే వెళ్ళిపోతున్నాడని కాత్యాయనికి తెలియదు.

'వాడికి సెలవు లేదు. అందుకని ఇవాళే వెళ్ళాలంటున్నాడు' అన్నది పెళ్ళికూతురితో కుట్టిఅమ్మ.

కాత్యాయని ముఖంలో భావపరివర్తన యేమీ గోచరించలేదు. ఆమెకు సంబంధించినంత వరకూ ఇదేమీ చిన్న విషయం కాదు. అలా జరిగేందుకు వీల్లేదు. ఆమె భర్తతో తొలి రాత్రి గడిపే ముచ్చటను గురించి కలలు కని వుండదా? పెళ్ళి సంబంధం కుదిరినప్పటినుంచే ఆమె శోభనపు రాత్రిని గురించి కలలు కనిఉంటూంది. లేకుంటే జయమాలతో, మంగళసూత్రంతో పెళ్ళి పూర్తవుతుందా? వివాహ సంస్కారం ప్రధానం కాదు. శోభనపు రాత్రి ప్రధాన ఘట్టం. ఆ రోజు కోసరం ఆమె ఎదురు చూస్తూ వుండి వుంటుంది. శోభనపు రాత్రిని గురించే ఆమె కలలుకంటూ వుంటుంది.

'అమ్మాయ్. ఒకపని చెయ్యి. కేశవపిళ్ళై అక్కడ నిలబడి వున్నాడు. ఒంటరిగా వున్నాడు. ఈ రోజు వెళ్ళద్దని అతనికి చెప్పు' అన్నది కుట్టిఅమ్మ, పెళ్ళి కూతురితో.

ఆమాట విని పెళ్ళి కూతురు సిగ్గుతో ముడుచుకు పోయింది.

ఆ సమయంలో కుట్టి అమ్మకు ఏం తోచలేదు. భర్తను కలునుకునేందుకు మనస్సులో ఎంత కుతూహలం వున్న పెళ్ళయిన కొద్ది క్షణాలకు ఏ వధువయినా వరుడితో అలా అనగలదా? పూర్వపరిచయమున్న ప్రేయసీ ప్రియులయినా అలా అనలేరు. బహుశా యీ చిన్న విషయం మరిచి పోయింది. సిగ్గుతో మౌనంగా నిలబడి వున్న కోడలితో ఆమె మరుక్షణమే అన్నది 'ఒద్దులే. ఆమాట అంటే వాడిప్పుడే వెళ్ళిపోతాడు'.

అయినా కాత్యాయని ఉన్నచోటునుంచి కదల్లేదు.

భర్త యీ రోజు వెళ్ళకుండా వుంటే బాగుంటుందని కాత్యాయని మనసులో వుంది. కాని ఆమె నోరు తెరిచి ఆమాట అనలేదు.

కేశవపిళ్ళై ఆరోజు వెళ్ళి తీరాలి. మళ్ళీ ఎప్పుడు వస్తాడో అతను చెప్పటం లేదు. కుట్టి అమ్మకు ఆ విషయం అర్థమయింది.

విధిలేక పప్పుపిళ్ళై 'మళ్ళీ ఎప్పుడు వస్తావురా?' అని అడిగాడు.

'అక్కడికి వెళ్ళి ఆలోచించాలి' అన్నాడు.

పప్పుపిళ్ళై కఠోరంగా ఆదేశిస్తూ అన్నాడు. 'రెండు రోజులు సెలవు తీసుకుని నీవు వచ్చే ఆదివారం వచ్చేసెయి.' కేశవపిళ్ళై ఏమీ సమాధానం చెప్పలేదు. కిట్టుమామ మళ్ళీ మంచి రోజు ఎప్పుడుందా అని లెక్కవేస్తున్నాడు.

'వచ్చే ఆదివారం వస్తావా మరి?' అని పప్పు పిళ్ళై మరోసారి అడిగాడు.

'వస్తాను' అన్నాడు కేశవపిళ్ళై ముక్తసరిగా.

అందరూ కేశవపిళ్ళైను సాగనంపేందుకు గుమ్మందాకా వెళ్ళారు. కాత్యాయని ఇంటి గుమ్మం వెనక నిలబడి భర్తను చూస్తూ వుంది. కేశవపిళ్ళై ఒక్క పర్యాయంకూడా వెనక్కి తిరిగి చూడలేదు. పెళ్ళికూతుర్ని గురించి అతని కేమీ పట్టినట్టు లేదు.

తన కలలన్నీ కల్లలయినందుకు ఆ రాత్రంతా కాత్యాయని ఒంటరిగా పడుకుని కళ్ళువాచేట్టు ఏడిచి వుండదూ?

## అయిదు

తిరువనంతపురం తిరిగి వెళుతున్నంత సేపూ కేశవపిళ్ళై తంకమ్మకు తన ముఖం ఎలా చూపించగలనా అని ఆలోచిస్తూనే వున్నాడు. ఎన్నిసార్లో అతను ఉన్నదున్నట్టు స్పష్టంగా చెప్పాలని ప్రయత్నించాడు. కాని చెప్పలేక పోయినాడు. తనలోని యీ దౌర్బల్యానికి కూడా అతనికి బాధ పడటం లేదు.

అతను కొంచెం కంగారుగా ఆఫీసుకు చేరుకున్నాడు. ఎందుకో తెలియదు గాని అతనికి తను నిస్సహాయుడనే భావం ఏర్పడింది. ఉన్నత పదవులకోసరం ఇక కలలు కని లాభం లేదని అతనికి తోస్తున్నది. అతని హృదయంలో ఈ నైరాశ్యం బాగా కమ్ముకుంది. ఇప్పుడతనికి చేయూతఇచ్చి పైకి లాగే వాళ్ళెవ్వరూ లేరు. జీవితంలో లభించే సదుపాయాలన్నీ అతనికి కాకుండా పోయినాయి, అంతేకాదు వమ్మయి పోయినాయి, వమ్ము చేయబడ్డాయి. సెక్రటరీ కృష్ణన్ నాయర్ అన్న కూతుర్ని చేసుకునే వ్యక్తికి ఈ సదుపాయాలన్నీ లభిస్తాయి. అతని ప్రేయసి ఇకముందు అతనికి పరమ ప్రతిద్వంద్విని అవుతుంది. అన్నకూతుర్ని మోసం చేసినందువల్ల సెక్రటరీ కృష్ణన్ నాయరు అతనికి పరమ శత్రువవుతాడు. అది సహజమే. ఇంత వరకు అతను కేవలం అసహాయుడు మాత్రమే. ఇక ముందు అతను శత్రుకోటిలో చేరుతాడు. బహుశా అతని ఉద్యోగం కూడా ఒకనాటికి ఊడిపోవచ్చు.

ఉద్యోగంలో ప్రవేశించినప్పుడు అతనికి ప్రత్యేకమైన అభిలాష యేమీ లేదు. ఇప్పుడు అభిలాషలు అంకురించే నరికి తోటివాళ్ళు దూరమయినారు. కేశవపిళ్ళై ఉద్యోగంలో ప్రవేశించిన రోజు ఏమనస్థితిలో వున్నాడో, ఈ రోజుకూడా అలాగే వున్నాడు. ఆశలు అడియాసలయినాయి.

ఆరోజు కేశవపిళ్ళైకు తంకమ్మ ముఖంలో ఎక్కువ చైతన్యం కనిపించింది. ఆమె అందంలో అనుమానం లేదు. ఆమె ముఖం ఎంత ఆకర్షణీయంగా వుందో! ఆమె చిరునవ్వులో మునుపటికంటె ఎక్కువ మురిపించే అందం వచ్చింది. ఆమె ఇంత అందంగా ఎందుకు కనిపిస్తూవుందో? దుఃఖంలో, అభివంలో మునిగిపోయిన అతని జీవితంలో ఆమె యెందుకు ప్రవేశించిందా అని కేశవపిళ్ళై అనుకున్నాడు. సాటిలేని ఆమె సౌందర్యాన్ని అనుభవించే అదృష్టం భగవంతుడు తనకి అనుగ్రహించలేదు. అతను తన ఉద్రేకాన్ని అణచి వేసుకోవటం సాధ్యమా? ఏనాటికయినా అతను ఈ పొంగును ఆపుకో గలడా? ఆ సౌందర్యాన్ని త్యజించటం - అవును, త్యజించాలి.

ఉన్నట్టుండి కిట్టువమావ చెప్పిన మాటలు కేశవపిళ్ళై చెవుల్లో మారుమ్రోగాయి - 'ఆ పిల్ల చాలా అదృష్టవంతురాలు.'

'ఆస్తికి సంబంధించిన రాతకోతలయిపోయినాయా?' అని అడిగింది తంకమ్మ.

కేశవపిళ్ళై కొంచెం నవ్వేందుకు ప్రయత్నించాడు. కాని నవ్వలేకపోయినాడు. అవునని కాని కాదని కాని యేమీ చెప్పలేదు.

తంకమ్మ మరో ప్రశ్న వేసింది 'పొలం స్వాధీనం చేసుకోలేక పోయినారా? ఎందుకు అంత దిగాలు పడుతున్నారు? జీవితంలో ఇంతకు మించింది లేదా?'

కేశవపిళ్ళై నవ్వుతూ అంగీకరించాడు.

అతని నవ్వు కృత్రిమంగా వుంది. తంకమ్మను మరిపించేందుకు అతను నటిస్తున్నాడు.

కేశవపిళ్ళై మనస్సులో అంతులేని విపాద రేఖలు అలుముకుని వున్నట్టు తంకమ్మకు అనిపించింది. - 'దీనికింత దిగులు పడవలసిన పనేముంది? ఇంతకంటె మంచి పొలం వచ్చే అదృష్టంఉందేమో? లేకుంటే కొన్నాళ్ళకు ఇదే పొలం మీరు మీ పేర రాయించుకోగలరేమో?'

కేశవపిళ్ళై జవాబు చెప్పలేదు. ఇంతవరకూ అతను ఆడుతున్న అబద్ధపు నాటకం ఇప్పుడు అతన్ని గేలిచేస్తున్నది.

ఆ తర్వాత కేశవపిళ్ళై రెండు రోజులనుంచి పేరుకొనివున్న పని చూసుకునే నెపంతో మౌనంగా పనిలో మునిగి పోయినాడు. అతను దిగులుగా వున్నాడని తంకమ్మ అతన్ని ప్రశ్నలతో విసిగించలేదు. కేశవపిళ్ళైకు సంతోషం కలిగించేందుకు ప్రయత్నించవలసిన బాధ్యత తనదే అని ఆమెకు తెలుసు. ఎలాగో అతన్ని మురిపించి నవ్వించాలి.

కేశవపిళ్ళై జీతం చేతికందగానే అందులో పదమూడు రూపాయలు తంకమ్మ టేబిలుమీద పెట్టాడు. 'ఏమిటీ పైకం' అన్నట్టుగా తంకమ్మ కేశవపిళ్ళై కేసి చూసింది. అతనేమీ మాట్లాడలేదు. తంకమ్మ అన్నది 'ఇక

ఆరు రూపాయలేకదా మిగిలింది? ఉంచండి, మరెప్పుడయినా తీసుకుంటానులే.'

కేశవపిళ్ళె నొచ్చుకున్నాడు. అతనికి సహించలేనంత బాధగా ఉంది. పెళ్ళికి వెళ్ళేప్పుడు అతను పది రూపాయలు బదులడిగాడు. కాని అప్పుడింత బాధ వెయ్యలేదు. ఇప్పుడు పెళ్ళి చేసుకుని వచ్చిన తర్వాత అతనికి ఎంతో బాధ వేస్తున్నది. ఏమీ తెలియనట్టు కేశవపిళ్ళె అడిగాడు 'అవికూడా కావాలా?'

తంకమ్మకు బోధపడలేదు. 'ఏమిటవి?' అని అడిగింది.

కేశవపిళ్ళె అడిగిన ప్రశ్నతో అంతా బయట పడ్డట్టు అతనికప్పుడు తెలిసింది. స్పష్టంగా ఏమీ చెప్పకూడదనే ఆతురత అతన్ని స్వాధీనం చేసుకుంది. 'లేదు, మిగిలిన డబ్బుకూడా నీకు ఇప్పుడే కావాలా?' అని అడిగాడతను నిలుచునే.

ఆమె ముఖం ఉన్నట్టుండి వాడిపోయింది. 'ఊరికే అన్నాను. ఇప్పటికి ఉంచు. మళ్ళీ కావాలంటే తీసుకుంటాను. తమాషాగా ఏదో అంటే ముఖమలా పెట్టుకుంటావేం' అన్నాడు.

'ఇది తమాషా కాదు. ఇప్పుడు మీరున్న స్థితిలో తమాషాకు అవకాశం లేదు. మీ మనస్సులో ఏదో వుంది.' అన్నది తంకమ్మ.

'లేదు' అన్నాడు. కేశవపిళ్ళె బలవంతంగా నవ్వు మొహంపెడుతూ.

తంకమ్మలో తేజస్సు, అందం నానాటికి వృద్ధి పొందుతున్నట్టు తోచింది కేశవపిళ్ళెకు. రోజు రోజుకూ ఆమెలో ఏదో విశేషం కనిపిస్తూవున్నది. నిన్న కనిపించిన తంకమ్మ లావణ్యం ఈరోజు ఇంకా పెరిగింది. ఆమెలో ఏదో కొత్తదనం కొట్టవచ్చినట్టు కనిపిస్తూంది. కేశవపిళ్ళె ఆమెలో ఈ విశేషాన్ని ఇంతకు ముందు గమనించలేదు. తంకమ్మను తనదాన్నిగా చేసుకునే ఆవేశం అతనిలో నానాటికీ పెరుగుతూవుంది.

తంకమ్మ కావాలని ఇలా మారుతూవుందా? ప్రతిరోజూ ఆమె సరికొత్త వేషం వేసుకుంటుంది. అదోలా జుట్టు సవరించుకుంటుంది. మార్చి మార్చి బట్టలు వేసుకుంటుంది. ఈరోజు ఆమె నొసట చందనం పెట్టుకుంది. ఇదంతా స్త్రీకి సహజమే. అంతేకాదు. ఆమెలో ఇలాంటివి మరెన్నో లక్షణాలున్నాయి. నిన్న ఆమెముఖం వికసించిన కమలంలా నిష్కళంకంగా నిగనిగలాడుతూ వుంటే యీ రోజు వాడిపోయి నలిగిపోయినట్టు కనిపిస్తుంది. కళ్లనిండా కలతే. రేపు ఆమె ముఖంలో వయసు తీరిన యువతిలో ఉండే ధైర్యం కనిపిస్తే మరోరోజు ఆమె పసిపిల్లలా అమాయకంగా కనిపిస్తుంది. మరోరోజు ఎన్నో సమస్యల్లో చిక్కుకుని వున్నట్టు కనిపిస్తుంది.

కేశవపిళ్ళె మౌనాన్ని భంగం చేసి అతనిలోని విషాదాన్ని పోగొట్టేందుకు తంకమ్మ ప్రయత్నిస్తున్నది. అతన్ని నవ్వించేందుకు ఆమె అప్పుడప్పుడు

చమత్కారంగా మాట్లాడుతుంది. అప్పుడప్పుడూఆమె అలుగుతుంది. తాను చాలా బుద్ధిమంతురాలనని చెప్పుకునేందుకు అప్పుడప్పుడూఆమె మాట్లాడకుండా కూర్చుంటుంది. తంకమ్మ రోజూ ముందుగానే ఆఫీసుకు వస్తున్నది. కేశవపిళ్ళె కొంచెం ఆలస్యంగా వస్తున్నాడు. అతను రోజూ ఆలస్యంగానే వస్తున్నాడు. 'నేను వచ్చి అరగంటయింది' - అని ప్రతిరోజూ తంకమ్మ కేశవపిళ్ళెతో అంటుంది.

'కొంచెమాలస్యమయింది' - అని దీనంగా అంటాడు కేశవపిళ్ళె.

'ఈ రోజు కొట్టియంబలం వాకిలి తెరిచివుంటుంది' - అని అన్నది తంకమ్మ ఒకనాడు. ఆరోజు కేశవపిళ్ళె అక్కడికి వెళ్ళలేదు. అతను హాస్టలు బయటికి వచ్చి చాలాసార్లు కొంచెం దూరం వెళ్లాడు. కాని ప్రతి పర్యాయం తిరిగి వెళ్ళాడు. అందాకా వెళ్ళలేక పోయినాడు, అంతే.

ఆ రోజునుంచీ ఆరేడు రోజుల వరకూ కేశవపిళ్ళె ఒక పమ్మెను ఏర్పాటు చేయటంలో నిమగ్నమైఉన్నాడు.

వచ్చే ఆదివారం అతను ఇంటికి వెళ్ళాలి. అమ్మకూ, నాన్నకూ అతను వస్తానని చెప్పడు. కాని అతని దగ్గర ప్రయాణం ఖర్చులకు డబ్బులేదు. తంకమ్మకు ఇయ్యవలసింది ఇచ్చిన తర్వాత మిగిలిన ఆరురూపాయలకు అతను భోజనం కూపన్లు తీసుకున్నాడు. ఇప్పుడతని దగ్గర డబ్బు బొత్తిగా లేదు. అతను తంకమ్మనడిగితే ఆమె తప్పక యిస్తుంది. కాని ఆమెని డబ్బడగటం అతనికిష్టం లేదు. అదీకాక మళ్ళీ యీ ఆదివారం ఎందుకు వెళ్ళుతున్నారని అడిగితే అతనేం సమాధానం చెపుతాడు?

కేశవపిళ్ళె ఇంటి సంగతి ఆలోచిస్తున్నాడు. బహుశా నాన్నకు కోపం వస్తుంది. అమ్మ దిగులుపడి ఏడుస్తుంది. ఆ పిల్ల- ఏమనుకుంటుందో? ఆ సంగతి కేశవపిళ్ళె ఏమీ చెప్పలేదు. బహుశా ఏడుస్తుంది, లేకుంటే అలిగి కూర్చుంటుంది. ఏమో ఎవరికి తెలుసు?

ఆ శనివారం అతను చాలా దిగులుగా వున్నాడు. రాత్రంతా అతనికి నిద్రపట్టలేదు. ఏదో విధంగా ఎవరో ఒకరి దగ్గర అయిదు రూపాయలు బదులు తీసుకోవాలి. ఒక రోజు సెలవు కూడా తీసుకోవాలి. కాని యింటికి వెళ్లాలని అతను నిర్ణయించలేకపోయాడు. అతనికి ఇంటికి వెళ్లాలనే వుంది. అతని ఆలోచనలన్నీ అతన్ని ఇంటికి వెళ్లమనే ప్రేరేపించాయి. కాని అవి ఫలించలేదు. అతన్ని ఇంటికి పంపించటం వాటికి సాధ్యం కాలేదు.

రాత్రి అతనికి నిద్రపట్టలేదు. మర్నాడు ఆదివారం ఉదయం నుంచి రాత్రివరకు పనీపాటూ లేకుండా అతను ఊరంతా తిరుగుతున్నాడు. తంకమ్మ యింటిముందు నుంచి కూడా వెళ్లాడు. ఉదయం పచార్లు చేసి అతను గదిలోకి వచ్చి నిద్రపోయాడు.

'నిద్రపోతున్నారా?' అని ఎవరో గదిలోకి వచ్చి అడిగారు.

కేశవపిళ్ళై లేచాడు. మాసిన గుడ్డలు, బక్క చిక్కిన శరీరంతో పరిచయం లేని ఆ పెద్ద మనిషి ఎదురుగా నిలబడ్డాడు. 'కుట్టన్ పిళ్ళై మీకి వుత్తరం ఇచ్చాడు'- అని అతను కేశవపిళ్ళైకు ఒక వుత్తరం ఇచ్చాడు.

'ఏమిటి మీకిక్కడ పని?' అడిగాడు కేశవపిళ్ళై ఉత్తరం చదువుకుని.

ఆ మనిషి సమాధానం చెప్పాడు: 'నా దగ్గర వున్నదంతా ఇంతకు ముందే అయిపోయింది. ఒక్క యిల్లు మిగిలింది. దాని కోసరం ఆ పాడు కలెక్టరు నన్ను పెట్టరాని బాధలు పెట్టాడు. అయితేనేం, భగవంతుడు కూడా అతనికి తగిన శాస్తి చేశాడు. ఆయన కొడుక్కి పిచ్చి పట్టింది. నేను చాలా యిబ్బందిలో వున్నాను. పనిచేసే వయస్సు కూడా దాటిపోయింది. రాహువు నన్ను ఇప్పటికీ వేధిస్తున్నాడు. చీఫ్ సెక్రటరీతో మాట్లాడి నా కేసు సరిచేయించే సదుపాయం మీ చేతుల్లో వుంది. పని నెరవేరాలంటే ఫైలు చీఫ్ సెక్రటరీ దగ్గరికి వెళ్లాలి. మీ డిపార్టుమెంటు నుంచి ఫైలు తెప్పించవలసిందని నేను వ్రాసుకున్నాను. మీరు తొందరగా ఆ ఫైలు చీఫ్ సెక్రటరీ దగ్గరికి పంపండి' అన్నాడు.

గోపాలన్ నాయర్ సామాన్యంగా జీవితం గడుపుకునే వ్యక్తి. ఎనిమిది పది సంవత్సరాల క్రితం ప్రభుత్వం ఎక్కువ ధరకు అతని పొలం కొనుక్కున్నది. కాని ఆ పాడు కలెక్టరు ఎదురు తిరగటం వల్ల అతనికి డబ్బు ముట్టలేదు. ఆ పైకం ఇంకా అడవిని పడివుంది. ఆ కలెక్టరు కూతురి పెళ్ళి సందర్భంలో అతను గోపాలన్ నాయర్‌ను ఏదో అడిగాడు. కాని నాయర్ ఇవ్వలేదు. అప్పటినుంచి యిప్పటివరకు కలెక్టరు పెట్టే బాధలను తప్పించుకునేందుకు గోపాలన్ నాయర్ ప్రయత్నిస్తున్నాడు. ఈ ప్రయత్నంలో అతను ఆ పొలమే కాక మిగిలిన యింటిని కూడా కుదువపెట్టుకోవలసి వచ్చింది. ప్రభుత్వం నుంచి వచ్చే డబ్బుతో అతను ఆ కుదువ విడిపించుకోగలుగుతాడు. కేసు నడిపించేందుకు అతనికి స్తోమత లేదు.

గోపాలన్ నాయర్ చెప్పు కు పోతున్నాడు: 'కుట్టన్ పిళ్ళై, నేనూ దగ్గరగా వుంటాము. ఈ రోజు మీ రక్కడికి వస్తారని అనుకున్నాము. మీరు వస్తే మీతోపాటు ఇక్కడికి వద్దామని నేనింట్లో ఎదురుచూశాను. మీరు రాకపోయే సరికి నేనే బయలుదేరి వచ్చాను. మీ అమ్మా నాన్నా చాలా కంగారు పడ్డారు. మీకు ఒంట్లో బాగా లేదేమో నని వాళ్లకు భయంవేసింది.

'నాకు ఒంట్లో బాగాలేదు'- అన్నాడు కేశవపిళ్ళై.

'ఫైలు పంపించటమేనా, మరేమన్నా వుందా?' అని మళ్లీ అడిగాడు కేశవపిళ్ళై.

'అంతే, చాలు; కాని తొందరగా- అంటే రేపే పంపించాలి'.

'సూపరింటెండెంటు చాలా యుక్తిపరుడు'. గోపాలన్ నాయర్‌కు ఈ విషయం తెలుసు. 'మేం కూడా కొంచెం ప్రయత్నిస్తాం' అన్నాడతను.

ఈ అవకాశాన్ని ఉపయోగించుకోవాలను కున్నాడు కేశవపిళ్ళె. అతని మనసులో రక రకాల ఆలోచనలు కొలిమితిత్తిలా మెదలసాగాయి. అతనికి పిచ్చెక్కినట్టయింది.

'సూపరింటెండెంటుతో మీకు బాగా దగ్గర పరిచయముందా?' అని అడిగాడు గోపాలన్ నాయర్.

పరిచయం వుందని చెప్పాలో, లేదని చెప్పాలో కేశవపిళ్ళెకు బోధపడలేదు. ఆఫీసులో గోవిందన్ నాయర్, ప్రభాకరన్ నాయర్ అలాంటి పనిచేస్తుండగా కేశవపిళ్ళె చూశాడు. ఈ రోజు మొట్టమొదటి సారి తనకు కూడా అలాంటి పనిచేసే అవకాశం దొరికింది. ఏది తప్పూ, ఏది ఒప్పూ అని అతను నిర్ణయించలేకుండా వున్నాడు. అటు గోపాలన్ నాయర్ అతని సమాధానం కోసరం ఎదురుచూస్తున్నాడు. ఉన్నట్టుండి కేశవపిళ్ళె వాక్కులో సరస్వతి ప్రవేశించింది.

'సూపరింటెండెంటు నాపై ఆఫీసరయి నప్పు డు ఆయనతో నాకు పరిచయం లేదని ఎలా చెప్పగలను? కాని చాలా ఆశపోతు.'

తను దానికి సిద్ధంగా వున్నానని చెపుతూ గోపాలన్ నాయర్ అన్నాడు: 'మీరు ఫైలు తొందరగా పంపించండి.' కొంచెం ఆగి అడిగాడు: 'ఎంత ఇవ్వాల్సి వుంటుంది?' గోపాలన్ నాయర్ ఆఫీసులో చొరవ సంపాదించటంలో, ఆఫీసునుంచి బయట పడటంలో, లంచమియ్యటంలో, లంచమియ్యకుండా పని సాధించటంలో బహునేర్పరి. అతను కేశవపిళ్ళెకు చెప్పాడు: 'ఇందులో చేయవలసింది పెద్ద పని యేమి లేదు. నాకు రావాల్సిన డబ్బు రావాలి, అంతే. చాలా ఆలస్యం అయింది. ఇక కొద్ది గంటల్లోనే ఉత్తర్వు వస్తుంది. చీఫ్ సెక్రటరీ నా చేతుల్లో వున్నాడు. ఇక యీ పని తొందరగా సాధించాలి.'

కేశవపిళ్ళె అతనితో ఏకీభవించలేదు. 'అలాగా! అదుగో అంటే ఆరునెలలు పడుతుంది. బహుశా ఫైలు, కాగితాలు మాయమైపోయినా పోవచ్చు' అన్నాడు.

గోపాలన్ నాయర్ అతని మాటను సమర్థిన్తూ అన్నాడు: 'సూపరింటెండెంటుకు డిపార్టుమెంటులో ప్రయత్నించేందుకు ఎంత యివ్వాలో అది కూడా యిస్తాను. పది రూపాయలిస్తే సరిపోతుందా?'

'అంతేనా?' అన్నాడు కేశవపిళ్ళె.

'చాలకపోతే మీరు చెప్పండి.'

'పదిహేను రూపాయలు'.

గోపాలన్ నాయర్ ముఖం దీనంగా వుంది. అతని దగ్గర ప్రస్తుతం పదిహేను రూపాయలు మాత్రమే వున్నాయి. కనీసం ఇంకో నాలుగు రోజులు అతను తిరువనంతపురంలో ఉండాలి. కాఫీకి, సిగరెట్లకు డబ్బు కావాలి. అది

కూడా లేదు. అతను తన పరిస్థితి కేశవపిళ్ళైకు స్పష్టంగా చెపుతూ అన్నాడు: 'ఇక నా దగ్గర కాఫీ తాగేందుకు, బీడీ కొనుక్కునేందుకు కూడా మిగలదు.'

'కనీసం పదమూడు రూపాయలయినా యిచ్చు కోవాలి' అన్నాడు కేశవపిళ్ళై. గోపాలన్ నాయరుకు అనుమానం వేసింది. కేశవపిళ్ళై లెక్క తప్పు వేశాడని అతనికనిపించింది. లంచం పదిరూపాయలన్నా వుండాలి, పదిహేనన్నా వుండాలి. కాని పదమూడు రూపాయలు లంచం ఎప్పుడూ వినలేదు. లెక్క సరిగ్గా లేదు. కేశవపిళ్ళై దళారీతనం గోపాలన్ నాయరుకు అర్థమయింది. బావ గారి ఉత్తరం తీసుకుని వచ్చినా తన దగ్గర డబ్బు తీసుకోవడం అతనికి అవమానకరంగా వుంది. ఇంత పెద్ద మొత్తం అడిగాడు. ఇది న్యాయం కాదు. అప్పు తీసుకున్నట్టు అతని దగ్గర రెండు రూపాయలు మాత్రం మిగులుతాయి.

ఇంత యెక్కువ లంచం ఇవ్వాల్సి వస్తుందని అతను ఊహించ లేదు. మాట్లాడకుండా రొంటిలోనుంచి పదమూడు రూపాయలు తీసి అతను కేశవపిళ్ళై చేతిలో పెడుతూ ఆ డబ్బు అతను ఎంత కష్టపడి ఏర్పాటు చేశాడో అంతా వివరంగా చెప్పసాగాడు. చంటి వాడి వెండి మొలతాడూ, మంత్రించిన బంగారు తాయిత్తూ అమ్మి అతనీ పైకం పోగు చేశాడు. అమ్మేందుకు మిగిలిన విలువ గల వస్తువులవే. అంతా నాశనమయిపోయింది. చిన్న యిల్లు మిగిలితే అది కూడా తాకట్టులో వుంది. మరోసారి ప్రయత్నం చేసి చూస్తున్నాడు. తన డబ్బు తనకు తిరిగి వస్తే ఫర్వాలేదు. లేకుంటే కుటుంబానికి యిల్లూ వాకిలీ లేకుండా పోతుంది. ఇదీ అతని స్థితి. ప్రభుత్వం నిర్ణయించిన ప్రకారమైనా సరే. అతనికి పైకం రావాలి.

ఆ రాత్రి సూపరింటెండెంటును కలుసుకోవాలని అనుకున్నాడు కేశవపిళ్ళై. ఈ పని యెలా సాధించడమా అని ఒకటే ఆలోచన అతని మనసులో, సూపరింటెండెంటు దగ్గరకి గోపాలన్ నాయర్ని కూడా తీసుకువెళ్ళాలా? ఈ పదమూడు రూపాయల్లో తనకు మూడు రూపాయలే దక్కుతాయని అతను ఊహించాడు. గోపాలన్ నాయర్ కేశవపిళ్ళైకు ఇక డబ్బేమీ యివ్వడు. అది మాత్రం ఖాయం.

ఇద్దరూ సూపరింటెండెంటు ఇంటికి వెళ్ళారు. గోపాలన్ నాయర్ సూపరింటెండెంటుకు తన గొడవంతా చెప్పుకున్నాడు. వైయావురి పిళ్ళై సానుభూతితో అంతా విన్నాడు. గోపాలన్ నాయర్‌కు ప్రభుత్వం నుంచి రావాల్సిన పైకాన్ని గురించిన గాథ సాంతంగా విని కేశవపిళ్ళై దగ్గర వున్నాడని కాబోలు ఆయన చేయవలసింది చేస్తానని మాట యిచ్చాడు. సూపరింటెండెంటుకు తెలియకుండా కేశవపిళ్ళై గోపాలన్ నాయర్ని వెళ్ళమని సంజ్ఞ చేశాడు. గోపాలన్ నాయర్ వంగి నమస్కారం చేసి వెళ్ళిపోయినాడు.

గోపాలన్ నాయర్ వెళ్లిన తర్వాత కేశవపిళ్ళె పదమూడు రూపాయలను ఒక కాగితంలో పెట్టి వైయాపురి పిళ్ళె కూర్చున్న కుర్చీలో పెట్టాడు.

ఇద్దరూ మాట్లాడుకున్న తర్వాత కేశవపిళ్ళెకు మూడు రూపాయలు వచ్చాయి. మూడు రూపాయలు రావటం అతనికి గొప్ప అవకాశంగా తోచింది. గోపాలన్ నాయర్ పని మీద ఆదివారం, సోమవారం కేశవపిళ్ళె తిరువనంతపురంలో ఉండవలసి వచ్చింది. ఇంటికి వెళ్లనందుకు ఈ కారణం వ్రాయవచ్చునని కేశవపిళ్ళెకు చాలా ఆనందంగా వుంది. ఇంటికి వెళ్లనందుకు సాక్ష్యం గోపాలన్ నాయర్ చెపుతాడు. అమ్మ, నాన్న, అక్కయ్య ఇప్పు డతన్ని అపార్థం చేసుకోరు. వీలయితే గోపాలన్ నాయర్ ద్వారా కుట్టన్ పిళ్ళెకు ఒక ఉత్తరం రాసి పంపుతాడు.

మర్నాడు గోపాలన్ నాయర్ కేసుకు సంబంధించిన ఫైలు వెతకమని ఉత్తర్వు వచ్చింది. ఆ ఫైలు సూపరింటెండెంటు దగ్గరికి ఆరోజే చేరాలి. ఆ బాధ్యత గోవిందన్ నాయర్ మీధ వుంది. మధ్యాహ్నం దాకా గోవిందన్ నాయర్ ఫైలు వెతక లేదు. గోవిందన్ నాయరుకు జ్ఞాపకం చేద్దామని కేశవపిళ్ళె చాలా సార్లనుకున్నాడు, కాని చెయ్యలేదు. ఒకవేళ అతను జోక్యం కలుగ జేసుకుంటే ఇందులో ఇతనికేదో ఆసక్తి వుందని గోవిందన్ నాయర్ అనుకుంటాడని అతని కనుమానం.

సాయంత్రం అయిదు గంటలకు ఆఫీసు మూసేశారు. కేశవపిళ్ళె ఏదో పనిమీద తిరుగుతున్నాడని తంకమ్మకు తెలిసిపోయింది. 'ఏం పనే?' అని ఆమె అడగనే అడిగింది.

గోపాలన్ నాయర్ గేటు దగ్గర నిలబడి వున్నాడు. కేశవపిళ్ళె అతనికి ఆరోజు జరిగిందంతా చెప్పాడు. గోపాలన్ అక్కడనే చతికిల బడ్డాడు. మాటా మంతీ లేదు.

కేశవపిళ్ళె అతన్ని లేవదీసి ఓదార్చుతూ అన్నాడు 'విచారించవద్దు. డబ్బు తీసుకొని యిలా ఎందుకు అవమాన పరిచావని నేను సూపరింటెండెంటును ఈ రోజే అడుగుతాను.'

గోపాలన్ నాయర్ ఏమీ మాట్లాడలేదు. ప్రాణం పోయిన నీడలా అతను కేశవపిళ్ళె వెంట వెళ్ళాడు. ఈ తగాదాలో తను అనవసరంగా చిక్కుకున్నానని అనుకున్నాడు కేశవపిళ్ళె.

'ఈ పని రేపటికయితే మీకేమన్నా నష్టమా? ఎటు వచ్చీ పన్నెండు గంటలు వ్యత్యాసం. రేపు తప్పకుండా ఫైలు పంపిస్తాను.' అన్నాడతను.

అతని పని తప్పక నెరవేరుతుందని గోపాలన్ నాయరుకు ఎలా నచ్చ చెప్పటమా అని కేశవపిళ్ళె ఆలోచిస్తున్నాడు.

పిశాచంలా వెంటవచ్చే గోపాలన్ నాయర్ 'సార్, నా విషయంలో ఏం చేసినా సరే' అన్నాడు.

'నన్ను ఏమోయ్ అని పిలవండి, సార్ అనద్దు' అన్నాడు. కేశవపిళ్ళై.

కేశవపిళ్ళై ఏదోవిధంగా గోపాలన్ నాయరుకు ధైర్యం చెప్పాలి. కేశవపిళ్ళై మాట విని వినకుండా గోపాలన్ నాయర్ అన్నాడు 'ఇప్పుడున్న చీఫ్ సెక్రటరీతో ఇప్పుడే పనవుతుంది. ఆలస్యం చేస్తే అతని మనసు మారవచ్చు. మనిషే మారవచ్చు. మరో చీఫ్ సెక్రటరీ వస్తే, నాపని......' గోపాలన్ నాయర్ శూన్యంలోకి చూస్తున్నాడు.

కేశవపిళ్ళైకు ఒక కొత్త విషయం తెలిసింది. ఈ మాట అతనితో ఎవ్వరూ అనలేదు. గోపాలన్ నాయరుకు ఎలా తెలిసిందో అని అతని కాశ్చర్యం వేసింది. 'చీఫ్ సెక్రటరీ మారతాడా?' అని కుతూహలంతో అడిగాడతను.

'అవును, కాని ఎప్పుడు వెళతాడో తెలియదు. అందుకనే నా పని నేను తొందరగా చేసుకుని పోదామని పరుగెత్తుకు వచ్చాను.'

ఆ సమయంలో కేశవపిళ్ళై మనసులోనుంచి గోపాలన్ నాయర్‌ను గురించిన విచారం తొలిగిపోయింది. ఆ వార్త అతనికి ఆనందం కలిగించింది.

'మీకి విషయం ఎలా తెలిసింది?' అని అడిగాడు కేశవపిళ్ళై.

'నేను ఎన్ని సంవత్సరాలనుంచో ఇక్కడికి వస్తున్నాను. ఇక్కడ ఎప్పుడూ ఇలాగే జరుగుతుంది. చీఫ్ సెక్రటరీకి కూడా తను వెళ్ళే విషయం తెలియదు. ఆయన వెళ్ళేలోపల నాపని అవక పోతే నేను జీవించలేను.'

కేశవపిళ్ళై మరో సంగతి తెలుసుకునేందుకు 'ఆయన స్థానంలో ఎవరు వస్తున్నారు'అని అడిగాడు.

'కృష్ణన్ నాయర్ అనే సెక్రటరీ ఎవరయినా వున్నారా? అయనే చీఫ్ సెక్రటరీ అవుతాడు.'

ఆమాట విన్న కేశవపిళ్ళై ఉలిక్కి పడ్డాడు.

గోపాలన్ నాయర్ చెప్పుకు పోతున్నాడు. 'ఆయనతో నాకు పరిచయం లేదు. ఆయన దగ్గరికి వెళ్ళి నాపని కోసరం ప్రయత్నించటం నావల్ల కాదు. ఇప్పుడు నామనస్సు మనస్సులో లేదు. నా పని కాకపోతే నేను ఆత్మహత్య చేసుకుంటాను.'

కొత్త చీఫ్ సెక్రటరీ వస్తే గోపాలన్ నాయర్ పని సానుకూలమవుతుందని కేశవపిళ్ళై ఆలోచన. కాని ఆమాట అతననలేదు. దాచవలసిన విషయం దాచి తీరాలి.

## ఆరు

సాయంత్రం గడిచిపోయింది. సూపరింటెండెంటును కలుసుకునేందుకు కేశవపిళ్ళై ఒంటరిగానే వెళ్ళాడు. ఫైలు పంపలేదని అతను విచారంతో అన్నాడు. 'నేను చేయవలసింది చేశాన'ని సూపరింటెండెంటు సమాధానం చెప్పాడు. కొంచెం సేపాగి సూపరింటెండెటు అన్నాడు. 'నేనేమన్నా ఫైలు వెతికి దుమ్ము దులిపి కాగితంలో చుట్టి తీసుకుని వెళతానా? ఏమిటి నీవనేది?'

సూపరింటెండెటు కోపంతో అలా మాట్లాడుతున్నాడని కేశవపిళ్ళై గమనించాడు.

'లేదు, లేదు. ఊరకే అడిగాను' - అన్నాడు భయంతో.

'నీకు పనిచెయ్యటంలో అనుభవం లేదు. కొత్త వాడివి. అందుకే ఆక్షేపించేందుకు వచ్చావు.' అన్నాడు సూపరింటెండెంటు కొంచెం ఆగి.

'ఆక్షేపించటం లేదు.'

సూపరింటెండెటు బోధిస్తున్న ధోరణిలో అన్నాడు. 'ముందు నీవు డిపార్టుమెంటులో ఈపని చూసే గుమాస్తా దగ్గర ఫైలు వెతకాలి. తర్వాత మెసేజి తయారు చేసి మెసెంజరుద్వారా అసిస్టెంటు సెక్రటరీ ధగ్గరికి పంపాలి. ఆ తర్వాత అక్కడ నీకు తెలిసిన వాళ్ళను కలుసుకుని సెక్రటరీ దగ్గరకి పంపాలి. అప్పుడు చీఫ్‌సెక్రటరీ దగ్గరకి పంపాలి. తెలిసిందా? నీవు ఫైలు వెంబడే వెళ్ళాలి. లేకుంటే ఒక సంవత్సరం తర్వాత కూడా ఫైలు చీఫ్ సెక్రటరీ దగ్గరికి వెళ్ళదు.'

'చిత్తం'

'ఆఁ, మరి చేయవలసింది చెయ్యి'

ఫైలు వెతికారా లేదా అని అడిగేందుకు కూడా సూపరింటెండెంటు సిద్ధంగా లేడు. ఈ లెక్కలో గోపాలన్ నాయరుకు డబ్బురాదు. ఈ విషయంలో అతను ఆశలు వదులుకుని ప్రయత్నించటం మానెయ్యటం మంచిది. గోపాలన్ నాయరును ఏదోవిధంగా ఇక్కడినుంచి పంపించాలి. ఏదో వుపాయం ఆలోచించి అతను ఇక్కడినుంచి పారిపోయేట్టు చూడాలి. ఈ బాధ్యతను తప్పించుకునేందుకు ఇదేమార్గం. కొత్త చీఫ్ సెక్రటరీ వల్ల ఈపని అవుతుందని కనక అతనికి చెపితే అతను ఎర్రచీమలా అంటుకునే వుంటాడు. ఈవిషయం గోపాలన్ నాయరుకు చెప్పనందుకు అతను తన్ను తాను అభినందించుకున్నాడు.

కాని చివరకు మర్నాడు కేశవపిళ్ళై, గోపాలన్ నాయర్ పని చేసి పెట్టేందుకు పూనుకున్నాడు.

మర్నాడు కేశవపిళ్ళై ఆఫీసుకు ముందుగానే వచ్చాడు. తంకమ్మ కూడా వచ్చింది. వారం రోజులు తీరిక లేకుండా ఏదో పనిలో తిరిగిన తర్వాత ఇద్దరిమధ్యా మళ్ళీ ప్రేమ వ్యవహారాలు ఆరంభమయినాయి.

'ఏమండీ, మీ హడావిడి అంతా అయిపోయిందా? ఇవాళ తొందరగా వచ్చారే?' అంది తంకమ్మ.

'తొందరగా రావాలనిపించింది' అన్నాడు కేశవపిళ్ళై.

'ఇప్పుడు తంకమ్మలో కొంత మార్పు వచ్చింది' అన్నాడు అతను.

'మార్పేముంది. నేను పాత తంకమ్మనే. ఇతరులు మారితే మారచ్చు.'

'నేను బీదగుమాస్తాను. నాకు సాయం చేసే వాళ్ళెవ్వరూ లేరు. ఇప్పుడు కూడా తంకమ్మ అలాంటిదేనా?' అన్నాడు కేశవపిళ్ళె.

'నాలో కొత్త తనమేముంది?'

'ఏమీ లేదు.' అన్నాడు కేశవపిళ్ళె తంకమ్మ ముఖం వైపు ఒక్కక్షణం చూసి.

అలా తదేక దృష్టితో తంకమ్మను చూసే ధైర్యం అతనికి లేదు.

తంకమ్మకు ఏమీ బోధపడటం లేదు. కేశవపిళ్లె తమాషాగా అనటంలేదు. గంభీరంగానే మాట్లాడుతున్నాడని తంకమ్మకు తోచింది. ఇంతలో కేశవపిళ్ళె అందుకున్నాడు. 'అయినా తంకమ్మ చాలా మంచిది. దాచవలసిన రహస్యాన్ని దాచటంలో దిట్ట.'

తంకమ్మ కంగారు పడింది. కేశవపిళ్ళె మాటల్లో అంతరార్థం ఆమెకు బోధపడటం లేదు. కేశవపిళ్ళె మళ్ళీ ఆరభించాడు. 'మీ బాబాయి చీఫ్ సెక్రటరీ కాబోతున్నాడు కదా! నాకు చెప్పావా?'

'అదా సంగతి? అది రహస్యంగా వుంచమన్నారు. అందుకని చెప్పలేదు. నిజానికి నాలుగయిదుసార్లు నేను చెబుదామనే ప్రయత్నించాను.'

'అవును దాపరికం నాదగ్గరనే కదా?' అన్నాడు కేశవపిళ్ళె తలతిప్పుతూ.

క్షమాపణ కోరుకుంటున్నట్టు తంకమ్మ :సమాధానం. చెప్పింది. 'నిజంగా నేను చెప్పలనుకున్నాను. కాని మీరు ఏరోజయినా ముందుగా వస్తేగా. ఇక్కడ మాట్లాడుకునేందుకు అవకాశమే దొరకదు. అందుకేనా మీరు కోపంగా వున్నారు. మాట్లాడటమే మానేశారు.'

వారంరోజులనుంచి తన ప్రవర్తననూ, తంకమ్మ చెప్పిన సత్యాన్నీ అవగాహన చేసుకుని కేశవపిళ్ళె అన్నాడు.

'నాకెందుకు కోపం?'

'అయితే విచారమా?'

'నాకేం విచారం లేదు.'

'ఉంది, నాకు తెలుసు.'

కేశవపిళ్ళె ఏమీ మాట్లాడలేదు.

తంకమ్మ అన్నది - 'ఈరోజు కుట్టియంబలం తెరిపిస్తాను. తప్పకుండా రండి. అనవసరంగా నన్ను బాధించకండి. మీకు నేనన్ని విషయాలు చెపుతాను.'

ఇంతలో మిగిలిన గుమాస్తాలు రావటం మొదలుపెట్టారు. కేశవపిళ్ళె గోపాలన్ నాయరు ఫైలును గురించి గోవిందన్ నాయరుకు చెప్పాడు.

'అలాగే, అలాగే, చూస్తాను' గోవిందన్ నాయర్ వెంటనే సమాధానం చెప్పాడు.

ఆయన ధోరణి చూస్తే ఆయన చూసేదీలేదు పెట్టేదీ లేదని కేశవపిళ్ళైకు తోచింది.

'ఇది నాసొంత పనేయ్' అన్నాడు కేశవపిళ్ళై.

'అలాగా, నీవు అర్జీదారుడివా?'

'అతను నాకు కావలసినవాడు.'

'అసలువ్యక్తి బయట పడ్డాడు.'

అప్పుడు కేశవపిళ్ళై గోపాలన్ నాయర్ అవస్థలను వివరించాడు.

'నాకు కూడా విచారంగా వుంది. ఏంచెయ్యను? చాలా పని పేరుకుని వుంది. అది పూర్తిచేసి ఫైలువెతికి పంపుతాను.'

అంతా సాంతంగా, విని మధ్యమార్గాన్ని సూచిస్తూ హరిహరఅయ్యర్ కేశవపిళ్ళైతో అన్నాడు. 'మధ్యాహ్నం ఆవ్యక్తిని ఇక్కడికి పిలిచి మాట్లాడు. ఫైలు తీసుకుని వెళ్ళేవాడు మాతేవన్ పిళ్ళై. అందువల్ల గోవిందన్ నాయరుకు, మాతేవన్ పిళ్ళైకు కొంత ముట్టజెప్పించి అతన్ని పంపించేసెయి.'

మాత్యూ, ప్రభాకరన్ నాయర్ హరిహరఅయ్యర్ చెప్పినదాన్ని సమర్థించారు.

కేశవపిళ్ళై ఆలోచించాడు – 'పాపం గోపాలన్ నాయర్ దగ్గర రెండు రూపాయలే వున్నాయి. అందులో అర్ధరూపాయి ఖర్చుపెట్టివుంటాడు.' మధ్యాహ్నం కేశవపిళ్ళై గోపాలన్ నాయర్ని కలుసుకున్నాడు. అతని దగ్గర నిజంగా రూపాయిన్నరేవుంది. ఒక రూపాయి కేశవపిళ్ళై కిచ్చాడు. కేశవపిళ్ళై అతనివల్ల తనకు వచ్చిన మూడు రూపాయల్లో రెండు రూపాయలు చెల్లించుకున్నాడు. గోపాలన్ నాయర్ బాధ్యత తనమీద పెట్టుకున్న కేశవపిళ్ళై ఒక్కరూపాయే మిగిలింది.

ఈ విధంగా ఆ ఫైలు ఆ రోజు సాయంత్రానికి అసిస్టెంటు సెక్రటరీ టేబిలుమీదికి చేరింది. కేశవపిళ్ళై ఇక ఆ పని విరమించుకున్నాడు.

రెండు రోజులనించి అతనికి మనశ్శాంతి లేదు. గోపాలన్ నాయర్ పని వదులుకున్న తర్వాత అతను నిశ్చింతగా ఉన్నాడు. కుట్టియంబలం తలుపు తెరిచి ఆరుబయట ఆమె నాకోసరం ఎదురుచూస్తుంటుంది, అక్కడికి వెళ్ళాలా వద్దా? ఆలోచిస్తున్నాడు. ఈరోజు అనవసరంగా అతను ఆఫీసుకు తొందరగా వెళ్ళాడు. కృష్ణన్ నాయర్ చీఫ్ సెక్రటరీ అయినందువల్ల తనకేం లాభం? అయినా దాన్ని గురించి కచ్చితంగా ఏమీ చెప్పేందుకు వీల్లేదు. తనపని సాధించుకునేందుకు అతను ముందుగా ఆఫీసుకు వెళ్ళాడు. తన ప్రయోజనం నెరవేర్చుకునేందుకు తంకమ్మను కలుసుకోవాలనే కోరిక రేకెత్తింది. ఒక వారంనుంచి అణచి వేసుకున్న కోరిక అతన్ని ఈ సమయంలో లొంగదీసింది.

అయినా అతను ఆరాత్రి అక్కడికి వెళ్ళకూడదని గట్టిగా తీర్మానించుకున్నాడు.. అలా దృఢనిర్ణయం చేసుకోవడం చాలా కష్టమైన విషయం. మూడు నాలుగు పర్యాయాలు అతను గది బయట కాలుపెట్టాడు. కాని అతని అడుగులు ముందుకు సాగలేదు. ఇవాళ కూడా ఆమె ఎదురు చూస్తుంది. చూడనీ! అలిగితే? ఏంచెయ్యాలో కేశవపిళ్ళె ఆలోచించలేకపోతున్నాడు. అయినా అతను వెళ్ళలేదు.

మర్నాడు. ఉదయంనుంచే కేశవపిళ్ళె ఆలోచించసాగాడు - తంకమ్మకు ఏం సమాధానం చెప్పాలి? ఫైలు సంగతి ఆమెకు తెలుసు. ఆ గోపాలన్ నాయర్ రాత్రి వచ్చి నాగదిలో ఉండిపోయాడని చెప్పవచ్చుననుకున్నాడు. అలా చెపితే నమ్మకం కుదురుతుంది.

రోజూలాగా ఉదయం పదకొండు గంటలకు సచివాలయంలో పని చేసేవాళ్ళంతా వచ్చారు. పదకొండు గంటల అయిదు నిముషాలకు చీఫ్ సెక్రటరీ మేనన్ కారులో దిగి తన గదిలోకి వెళ్ళాడు.

కొంతసేపటికి చీఫ్ సెక్రటరీ బంట్రోతు 'తొందరగారండి, తొందరగారండి, దొరగారు.....' అంటూ కంగారుగా కేకలు పెడుతున్నాడు.

ఆ తర్వాత అతనేమీ చెప్పలేకుండా వున్నాడు. అందరూ పరుగులతో చీఫ్ సెక్రటరీ గదిలో ప్రవేశించారు. ఆ సమయంలో చీఫ్ సెక్రటరీ కళ్ళు మూసుకుని కుర్చీలో వెల్లకిల పండుకుని వున్నారు. ఆయన ముఖం పాలిపోయివుంది. ఒళ్ళు చిరుచెమటలు పడుతూవున్నది. ఒక్క నిమిషంలో సచివాలయమంతా అక్కడ గుమి కూడింది.

స్పృహ తప్పిన ఆస్థితి ఎంత సేపో లేదు. ముఖం మీద నీళ్ళు చల్లగానే ఆయన కళ్ళు తెరిచారు. కృష్ణన్ నాయర్ తప్ప సచివాలయంలోని మిగిలిన ఉద్యోగులందరూ చీఫ్ సెక్రటరీ కుర్చీ దగ్గర నలువైపుల నిలబడి వున్నారు. కృష్ణన్ నాయర్ మాత్రం బయట నిలబడి వున్నాడు.

కొంతసేపటికి మేనన్‌ను చీఫ్ సెక్రటరీగా తొలగించి ఆయన స్థానంలో కృష్ణన్ నాయర్ని నియమించారనే సంగతి అందరికీ తెలిసింది. రేపటినుంచి మేనన్ ఏంపని చేస్తారో తెలియదు. వెంటనే ఛార్జి ఇవ్వవలసిందని ఉత్తర్వులు వచ్చాయి.

నాలుగు సంవత్సరాలనుంచి చీఫ్ సెక్రటరీ మేనన్ సచివాలయంలో చండశాసనుడని పేరు పడ్డాడు. అందరికీ అతనంటే భయం. ఈరోజుకూడా ఆయన మామూలుగానే వచ్చాడు. కాని యీ రోజుతో ఆయన పరాయివాడయినాడు.

వెంటనే డాక్టరు వచ్చాడు. ఆరోగ్యం అంత ప్రమాదకరంగా ఏమీ లేదు. ఆయన్ని ఇంటికి పంపించారు. అక్కడినుంచి ఆయన వెళ్ళ వలసిన వాడే కదా!

ఆరోజు మధ్యాహ్నం తర్వాత కూడా ఎక్కడా ఏమీ పని అవలేదు. సెక్రటరీలు కూడా మౌనంగా కూర్చుని వున్నారు. చీఫ్ సెక్రటరీ మీద అభిమానం, సహానుభూతి లేకపోయినా యీ సంఘటన అందరినీ కదిలించింది.

అక్కడి సెక్రటరీలందరూ తమకు తామే ప్రశ్నవేసుకుని ఆలోచించసాగారు - ఈనాడు ఎవరు ఏకుర్చీలో కూర్చున్నారో, రేపుకూడా అక్కడే వుంటారని చెప్పలేం. మరుక్షణంలో బయటికి పంపించవచ్చు. చీఫ్ సెక్రటరీకి ఉద్వాసన చెప్పటం వల్ల ఏర్పడిన భయాన్ని ఎవ్వరూ తోటివాళ్ళతో బాహాటంగా చెప్పలేదు. ఎవరికీ ఎవరిమీదా నమ్మకంలేదు.

మేనన్ చేసిన తప్పేమిటి? అతన్ని ఎక్కడ పోస్టు చేస్తారు? లేక అతన్ని అసలే తీసేస్తారా? మేనన్ చీఫ్ సెక్రటరీగా తొలిగిపోయినందువల్ల ఆఫీసులో ఎలాంటి మార్పులు వస్తాయి? ఎవ్వరికీ ఏమీ తెలియదు.

అభివృద్ధిశాఖలో చీఫ్ సెక్రటరీ మేనన్‌ను తీసెయ్యటానికి కారణం అందరూ ఇలా ఊహించారు. జల విద్యుత్ ప్రణాళికను కాంట్రాక్టు తీసుకునేందుకు లవలింగ్ అనే విదేశీ కంపెనీ వచ్చింది. దివాన్ ప్రైవేట్ సెక్రటరీ అభిమానం ఈ కంపెనీకి లభించింది. చీఫ్ సెక్రటరీ మేనన్‌కు ఈ కంపనీ అంటే గిట్టదు. జలవిద్యుత్ ప్రణాళిక కాంట్రాక్టు ముగ్గురు నలుగురు స్వదేశీయులకు ఇయ్యాలని అతని అభిప్రాయం. అందువల్ల భక్తివిలాస్‌కూ, చీఫ్ సెక్రటరీకి చాలా రోజులనుంచి షష్టాష్టకంగా వుంది. సచివాలయంలోని అన్ని శాఖల్లో కూడా ఈ విరోధభావం ప్రతిఫలించింది. గుమాస్తాలు రెండు పార్టీలుగా చీలిపోయినారు. ఈ విరోధానికి పర్యవసానం చీఫ్ సెక్రటరీ మేనన్ పతనం. కాని ఒక్క విషయం ఎవ్వరికీ బోధపడలేదు. రాజభవనంలో మేనన్‌కు మంచి పలుకుబడివుంది. రాజభవనం ఎరుక లేకుండా యీ వుత్తర్వు జారీ అవలేదు. కాబట్టి బహుశా రాజభవనంలో మేనన్‌కు గల పలుకుబడి ప్రస్తుతం అడుగంటిపోయి వుండాలి.

మేనన్ పతనానికి సంతోషించే వాళ్ళు కొందరు విచారించే వాళ్ళు కొందరు. రెండు భాగాలుగా తయారయినారు. సార్వజనిక నిర్మాణం, అభివృద్ధి, భూమి, అరణ్య, విద్యుత్ - అన్ని శాఖల్లోని అధికారవర్గం, ఆరోజు రెండు పక్షాలుగా ఏర్పడ్డది. మేనన్ పతనాన్ని చూసి సంతోషపడేవాళ్ళను ప్రతిపక్షం వాళ్ళు సవాలు చేసి హెచ్చరిక చేయటం మొదలు పెట్టారు. లవలింగ్ కంపనీ యీ ప్రణాళికను ఎలా సాధిస్తుందో చూద్దామని వాళ్ళు పంతం పట్టారు. సాయంత్రానికి ఇరుపక్షాలను గురించీ వివాదం ఆరంభమయింది.

జలవిద్యుత్ ప్రణాళిక ఆరంభమయినప్పటినుంచి లవలింగ్ కంపెనీ వాళ్ళు, పల్లెటూరి కంట్రాక్టర్లు కలిసి సచివాలయంలో పని చేస్తున్నారు. ఇద్దరికీ సాయం చేసేందుకు అందరూ ప్రయత్నిస్తూ వచ్చారు. ఈరోజు

ఒకపక్షం తాత్కాలికంగా విజయం సాధించింది. మరోపక్షం ఓడిపోయింది. కృష్ణన్‌నాయర్ ఏపక్షంవాడు? అతనేక పక్షానికి చెందినవాడని ఎవ్వరికీ తెలియదు. దివాన్ ప్రైవేట్ సెక్రటరీకి అతను అంతరంగిక మిత్రుడు. ఈమాట చెప్పేప్పుడు అందరూ ముసిముసి నవ్వులు నవ్వుతారు. అంతరంగిక మిత్రుడనటంలో ఏదో అంతరార్థం ఉండి తీరుతుంది.

ఏదియేమయినా, కృష్ణన్ నాయర్ ఆరోజు తనగది నుంచి బయటికి రాలేదు. ఎవరితోనూ మాట్లాడలేదు. ఒంటరిగా తన గదిలో మౌనంగా కూర్చుని వున్నాడు. ఉన్నత పదవి లభించినందుకు చాలామంది వచ్చి అతన్ని అభినందించారు. కాని అతనా పదవికి అర్హుడు కాదని వాళ్ళ మనస్సుకు తెలుసు.

ఈ విషయం కేవలం సచివాలయంలోనే కాక తిరువనంతపురంలో అంతటా చర్చనీయాంశమయింది. అందరూ ఎవరి అభిప్రాయం వాళ్ళు చెప్పారు. సెక్రటరీలలో పోత్తన్ అందరికంటె సీనియర్. మేనన్ కంటె ముందే అతను చీఫ్ సెక్రటరీ కావలసినవాడు.

ఈసారికూడా అతన్ని ఉపేక్షించటం జరిగింది. ఆయన మౌనానికి ఏదో కారణం వుంటుంది. కాని కృష్ణన్ నాయర్ని నియమించటంతో అందరికీ ఆశ్చర్యం వేసింది. అతనంత సీనియర్ కూడా కాదు.

ఆరోజు సాయంత్రం కేశవపిళ్ళ తన స్నేహితులతో కలిసి లాడ్జికి వెళ్ళేసరికి, లాడ్జి యజమాని కొచ్చువేలు పిళ్ళ వచ్చివున్నాడు. అరగంటనుంచి అతను కేశవపిళ్ళ కోసరం, అతని మిత్రవర్గం కోసరం ఎదురుచూస్తున్నాడు. అతను ఎట్టుమానూర్‌లో వుంటాడు. తిరువనంతపురం ఫారెస్టు డిపార్టుమెంటులో పింఛను తీసుకున్నాడు. పెళ్ళి చేసుకున్న తర్వాత అతను తిరువనంతపురం లోనే కాపురం పెట్టాడు. అక్కడే అతని జీవితం గడిచింది. కేశవపిళ్ళ దగ్గర సచివాలయ వార్తలు సంగ్రహించేందుకు అతను వచ్చాడు. ఆ లాడ్జిలో వుండే సచివాలయోద్యోగులు, కొచ్చువేలు పిళ్ళ అందరూ ఒకచోట కూర్చుని సంభాషణ సాగించారు. కేశవపిళ్ళ మాత్రం మౌనంగా కూర్చున్నాడు. మేనేన్ తనకు సిఫారసు లేకుండా ఉద్యోగం ఇచ్చాడు. అతను చెపితే ఇదే విషయం చెప్పాలి. కాని చెప్పలేదు.

కొచ్చుణ్ణి నాయర్ అనే గుమాస్తా చీఫ్ సెక్రటరీ కుటుంబాన్ని గురించి కొచ్చువేలు పిళ్ళను అడిగాడు. అతను చిరునవ్వుతో ఆరంభించాడు 'ఆ విషయం అడగద్దు. మునుపటి రోజుల్లో ఇలాంటి బాధ్యతగల పదవుల్లో ఎవరినంటే వాళ్ళను నియమించే వాళ్ళు కాదు. కాని యిప్పుడు రోజులు మారాయి.'

మేనేన్ పార్టీకి చెందిన కొచ్చుణ్ణి నాయర్ ఈ మాట విని చాలా ఆనందించాడు. 'మరి యీ గుణాలన్నీ కృష్ణన్ నాయర్ లో లేవా?' అని అడిగాడు.

'అన్నీ వున్నాయ్' అంటూ వ్యంగ్యంగా కొచ్చువేలు పిళ్ళై కథ ఆరంభించాడు 'నాయర్ సేనలో అనంతన్ పిళ్ళై, కుమారన్ పిళ్ళై అని యిద్దరు బంట్రోతులుండేవాళ్ళు. ఇద్దరూ నాకు తెలుసు. వాళ్ళిద్దరికీ ఒక భార్య వుండేది. అంటే మన కొత్త చీఫ్ సెక్రటరీకి ఇద్దరు తండ్రులన్నమాట. పెత్తండ్రి చనిపోయి మూడు నాలుగేండ్లయింది. పినతండ్రి బతికి వున్నాడో లేదో తెలియదు. కృష్ణన్ నాయర్‌కు ఒక అన్న కూడా వున్నాడు. చెట్టిక్కాళంగారెలో వుంటాడు. అతని కూతురు సచివాలయంలో పని చేస్తున్నది.'

'మీ డిపార్టుమెంటులోనేగా ఆ అమ్మాయి పనిచెయ్యటం' అన్నాడు కొచ్చుణ్ణి నాయర్ కేశవపిళ్ళైతో.

కేశవపిళ్ళై తల వూపాడు అంగీకారసూచకంగా. కొచ్చువేలు పిళ్ళై ఎవరిని పెళ్ళాడాడో తెలుసా? చెపుతాను విను. ఇదివరకు గోవిందన్ నాయర్ అనే తెలుగాయన గొప్ప పేష్కారు ఇక్కడ వుండేవాడు. పెద్దపెద్ద గుబురు గుబురు మీసాలు, మోకాళ్ళ వరకు సాగిన పొడుగాటి చేతులు, ఎర్రని విప్పారిన నేత్రాలు అతని వ్యక్తిత్వంలో చెప్పదగిన విశేషాలు. అతని గుర్రాన్ని పెంచేందుకు గౌరీశ పట్టర్ అనే వాడొకడుండేవాడు. అతని భార్య చాలా అందకత్తె. ఆమె ముస్లిం కుటుంబానికి చెందిందని అంటారు. గుర్రం పెంచేవాడి ఆ ముస్లిం భార్యకు గోవిందన్ నాయర్ వల్ల పుట్టిన పిల్ల చీఫ్ సెక్రటరీ కృష్ణన్ నాయర్ భార్య.'

'అయితే అంతా వర్ణ సంకరమన్నమాట.' అన్నాడు కొచ్చుణ్ణి నాయర్.

ఆమె చాలా ఆరితేరిన ఆడపడుచు. అందువల్లనే కృష్ణన్ నాయర్‌కు ఎడతెగకుండా ఉన్నత పదవులు వస్తూవున్నాయి. అతనికి అన్నిరకాల కుతంత్రాలూ తెలుసు' అన్నాడు కొచ్చువేలు పిళ్ళై. కృష్ణన్ నాయర్ ప్రతిసారీ ఉన్నత పదవులను ఎలా సాధించాడో వివరంగా చెప్పాడు కొచ్చువేలు పిళ్ళై. ఏదో ఒకరోజు అతను దివాన్ అయినా కావచ్చు.

ఈ కథలో కేశవపిళ్ళైకు ఆలోచనా సామగ్రి కొంత లభించింది. ఇద్దరు బంట్రోతు సోదరుల చిత్తరువులు కేశవపిళ్ళై కళ్ళముందు హాజరయ్యాయి. మర్నాడు తంకమ్మను చిక్కుప్రశ్నలు వెయ్యవచ్చు. తమాషాగా వుంటుంది.

'మీతాతగారి పేరేమిటి?'

తంకమ్మ నిజంగా తంటాలో పడుతుంది. తాత పేరే చెప్పలేకపోతే ముత్తాతపేరేం చెపుతుంది. ఆ బంట్రోతుల పేర్లు చెప్పేస్తే ఆమె మరీ యిరుకులో పడిపోతుంది. తంకమ్మను ఇలా తికమకలు చేసి ఆమెను అవమాన పరచాలని తానెందుకు ప్రయత్నిస్తున్నానా అని మళ్ళీ కేశవపిళ్ళై

ఆలోచించసాగాడు. కాని అవసరమైతే ఒక సారి అడిగి చూడదగిన విషయమే అది.

## ఏడు

కృష్ణన్ నాయర్ చీఫ్ సెక్రటరీ అయినందువల్ల కొన్ని మార్పులు వస్తాయని అందరూ అనుకుంటున్నారు. కొంతమంది సెక్రటరీలను తీసేస్తారనీ, ఒక విధంగా కుళ్ళునంతా కడిగేస్తాడనీ, సిఫారసుగల వాళ్ళకే ఉన్నత పదవులు వస్తాయనీ వినికిడిగా వుంది. ఇది మంచి అవకాశం.

కాని కేశవపిళ్ళెకు అలా భావించవలసిన అవసరం లేదు. అతను జూనియర్ క్లర్కు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకునేందుకు అతనికి అనుభవమూ లేదు. పలుకుబడీలేదు. పైపదవిని గురించి ఆలోచించే తరుణం కేశవపిళ్ళెకు ఇంకా రాలేదు. లాడ్జిలో వుండే పద్మనాభ పణిక్కర్ పార్క్‌వ్యూలో సెక్రటరీ వ్యక్తిగత పదవిలో ప్రవేశించేందుకు ప్రయత్నిస్తున్నాడు. అతను ఆపని సాధించినా సాధించవచ్చు. కొచ్చుణ్ణి నాయరుకు మరో డిపార్టుమెంటుకు వెళ్ళాలని వుంది. వాళ్ళందరికి పనిలో ప్రవేశముంది. మార్గాలుకూడా తెలుసు. ముందు ముందు ఏమయినా మార్పులు వస్తే కేశవపిళ్ళె కూడా పైపదవులను అపేక్షిస్తాడు. వాటికోసరం ప్రయత్నిస్తాడు. 'కూర్చున్న తర్వాత కదా కాళ్ళు చాపాల్సింది' అయినా రామచంద్రన్ సూపరింటెండెంటు కాగలిగితే, కేశవపిళ్ళె సీనియర్ క్లర్కు కావాలనుకోవటంలో తప్పు లేదు.

ఒకరోజు బంట్రోతు మాతేవన్ పిళ్ళె కేశవపిళ్ళెతో అన్నాడు 'మీరేమీ ప్రయత్నించటం లేదేం బాబయ్యా?'

'నేనేం చెయగలనేయ్?' అన్నాడు కేశవపిళ్ళె నిస్సహాయంగా.

బోసి నోటితో నవ్వుతూ మాతేవన్ పిళ్ళె అన్నాడు. 'అదేమిటి బాబయ్యా అలా అంటారు? మీకు మంచిరోజులు వచ్చేశాయి.'

'నాకా?'

'అవును, మీకే.'

'అంటే?'

మాతేవన్ ఆరంభించాడు 'బాబయ్యా! నేనిక్కడికి వచ్చి నలభైయేండ్లయింది. ఇప్పటికి ఎంతమంది దివాన్లే వచ్చారు. ఎంతమంది చీఫ్ సెక్రటరీలో వచ్చారు. సెక్రటరీల సంగతి లెక్కేలేదు. ఇక్కడ తెలివిగల వాళ్ళు పై పదవులు సంపాయించలేక పోయారు. వాళ్ళంతా ప్రయత్నాలు చేసి చేసి విసుగెత్తి పోయినారు, చనిపోయినారు కూడా. ఆకాశంలో మెరుపు మెరిసినట్టు క్షణంలో పెద్ద పెద్ద పదవుల్లోకి వెళ్ళిపోయిన పెద్దమనుష్యులు కూడా వున్నారు. ఇదంతా నేను నా కళ్ళతో చూశాను. ఇదంతా కుతంత్రాల అడ్డదేవ.'

ఒక్క క్షణం ఆగి మాతేవన్ పిళ్ళె కొన్ని కథలు చెప్పాడు. 'ఒకరోజు ఒకే పరీక్షలో ప్రవేశించిన యిద్దరు వ్యక్తులు ఉద్యోగంలో ప్రవేశించారు. ఇద్దరూ గుమాస్తాలుగా చేరారు. ఈరోజు వాళ్ళు ఒకరు సెక్రటరీ అయ్యారు. మరొకరు డిప్టీతహసీలుదారుగా వుండిపోయినారు. మరో కథ వినండి. ఒకాయన రాజభవనంలో ప్రవేశించాడు. అక్కడినుంచి ఆయన తన తోటివాని పై అధికారిగా తిరిగి వచ్చాడు. అతనెవరో తెలుసా? ఇప్పుడు తీసివేసిన చీఫ్ సెక్రటరీ.' మాతేవన్ పిళ్ళెకు మరో విషయం కూడా చెప్పాలనిపించింది. 'డబ్బు సంపాదించాలంటే, ఇక్కడనుంచి బయటికి వెళ్ళాలి. ఇక్కడ పని చేస్తూవుంటే యేమీ లాభం లేదు.'

కేశవపిళ్ళెకు ఏమీ బోధపడలేదు. 'అయితే నన్నేం చెయమంటావేయ్? నాకు సాయం చేసేవాళ్ళెవరున్నారు? నాకు అనుభవం ఏముంచె?' అన్నాడతను.

'ఉద్యోగం సద్యోగం సంగతి వదిలెయ్యండి. మీరు బియ్యే ప్యాసయినారు గదా?'

'అవును, అయితే?'

మాతేవన్ పిళ్ళె కేశవపిళ్ళె చెవిలో రహస్యంగా చెప్పాడు 'మీరు పార్కువ్యూలో కొత్త చీఫ్ సెక్రటరీ బంగళాకు వెళ్ళండి. అతని వెంటపడండి. అయిదు సంవత్సరాలలోగా మంచి పదవిలో తిరిగిరండి. ఆ తర్వాత పేష్కారుగా బయటికి వెళ్ళండి. కొంత డబ్బు సంపాయించండి. అప్పటికి నేను బతికి వుంటే నన్ను గుర్తుంచుకొండి.'

ఆతర్వాత మాతేవన్ పిళ్ళె తనమాట నెగ్గుతున్నట్టుగా నవ్వి, మళ్ళీ ఒక్క క్షణంలో గంభీరంగా అన్నాడు. 'శేఖర్ పిళ్ళెతో కలిసి మీరు ఈరోజే వెళ్ళండి. మరెవ్వరయినా వచ్చేలోగా మీరు వెళ్ళాలి. ఆలస్యం చెయ్యకండి. శేఖర్ పిళ్ళె సంగతే మీకు తెలుసుగదా!' మాతేవన్ పిళ్ళె ఆపకుండా మాట్లాడుతూ పోతున్నాడు.

'అయ్యా మీరు అదృష్టవంతులు, చాలా అదృష్టవంతులు. మీ పట్టు మహాగొప్పది. మీ భవిష్యత్తుకు ఆటంకం లేదు.'

ఒక క్షణం ఆగి ఆశీర్వదించే ధోరణిలో మాతేవన్ పిళ్ళె అన్నాడు. 'ఆ అమ్మాయి చాలా మంచిది. మీరిద్దరూ ఈడూజోడుగా వుంటారు. శేఖర్ పిళ్ళె మంచివాడు. కృష్ణన్ నాయర్, శేఖర్ పిళ్ళె ఒకతల్లి బిడ్డలు. శేఖర్ పిళ్ళె మీసంగతి చెపితే కృష్ణన్ నాయర్ కాదనడు.'

కేశవపిళ్ళెకు తన అభ్యుదయమార్గం కళ్ళకు కట్టినట్టు తోచింది. ఆమార్గం తనను ఆహ్వానిస్తున్నది. ఆదారిలో వంకరటింకరలు లేవు. తిన్నని మార్గం. మధ్య మధ్య విశ్రమించేందుకు మంచి మజిలీలు కూడా వున్నాయి. చీఫ్ సెక్రటరీ పదవి కోసరం అతనెందుకు ఆశించకూడదూ? జీవితంలో మంచి రోజులు ఆరంభమయినాయి. సందేహంలేదు. అదృష్టం కలిసి వచ్చే

సమయం వచ్చింది. ఆలోచన అంచులు ముట్టేసరికి కుట్టిమామ మాటలు అతని చెవుల్లో మారుమోగాయి.

'అమ్మాయి అదృష్ట వంతురాలు.'

ఆ దారిలో వెలుగు మందగించినట్టు కేశవపిళ్ళైకు తోచింది. 'అమ్మాయి అదృష్టవంతురాలు' - అన్న కిట్టుమామ మాటలు మాటిమాటికి అతని చెవిలో ప్రతిధ్వనింపసాగాయి.

మాతేవన్ పిళ్ళై మళ్ళీ మొదలెట్టాడు. 'ఇక్కడ పనిచేస్తూ నేను ఇలా ఎంతమందికో దారి చూపించాను. నాకు ఉపాయాలు తెలుసు. కాని ఒక్క విషయం చెపుతాను. వాళ్ళు మళ్ళీ నావైపు తిరిగి చూడలేదు.'

నేను ఏ పదవిలో వున్నా సరే, నిన్ను మాత్రం మరిచిపోను' - అన్నాడు కేశవపిళ్ళై.

'ఆనాటికి నేనిక్కడ వుండను' అని మాతేవన్ పిళ్ళై అంటూవుండగానే తంకమ్మ వస్తున్నట్టు గమనించి ఆమెవైపు సంజ్ఞ చేస్తూ అతనన్నాడు మెల్లిగా 'చూడండి, అమ్మాయి వస్తూవున్నది. పట్టండి పట్టు. గట్టిగా పట్టండి. తప్పకుండా జయం కలుగుతుంది.'

మాతేవన్ పిళ్ళై కేశవపిళ్ళైతో తనను గురించి యేదో వ్యంగ్యంగా చెప్పివెళుతున్నట్టు తంకమ్మకు అనిపించింది. 'ఏదో నన్ను గురించి వ్యంగ్యంగా చెపుతున్నట్టున్నావే?' అన్నదామె మాతేవన్ పిళ్ళైతో.

వెళుతూ వెళుతూ వెనక్కి తిరిగి మాతేవన్ పిళ్ళై తంకమ్మతో అన్నాడు. 'మీకిద్దరికీ మంచిమార్గం చెప్పాను. అయ్య మీతో చెపుతారు.'

మాతేవన్ పిళ్ళై తంకమ్మతో మరోవిషయం చెబదామనుకున్నాడు. 'మీరు నాన్నగారితో కలిసి బాబాయి (చీఫ్ సెక్రటరీ కృష్ణన్ నాయర్) దగ్గరికి వెళ్ళి మీకు దగ్గరగా కావలసిన వ్యక్తికి పార్క్‌వ్యూలో వుద్యోగం ఇయ్యమని సిఫారసు చెయ్యండి' అన్నాడు.

మాతేవన్ పిళ్ళై చెప్పవలసిందంతా స్పష్టంగా చెప్పేశాడు. కేశవపిళ్ళై మరేమీ చెప్పవలసిన అవసరం లేకపోయింది. కొంచెం కళ్ళార్పుతూ మళ్ళీ అన్నాడు - 'కాని ఆఫీసులో పక్క పక్క కుర్చీల్లో కూర్చుని సరసాలాడటం, అందరు రాకముందు బీర్వాచాటున - ఇక అవన్నీ సాధ్యం కాదు. అలా చెయ్యవలసిన అవసరమూ లేదు.'

మాతేవన్ పిళ్ళై వెళ్ళిపోయాడు. తంకమ్మ, కేశవపిళ్ళై ఒకరి ముఖం ఒకరు చూసుకుని నవ్వుకున్నారు.

అసలు విషయం తెలుసుకునేందుకు తంకమ్మ కేశవపిళ్ళై నడిగింది - 'ముసలివాడేమంటున్నాడు?'

కేశవపిళ్ళై అంతా చెప్పేశాడు. తర్వాత దిక్కులేనివాడిలా అన్నాడు - 'ఉత్తరకేరళం నుంచి వచ్చిన నాకిక్కడ సాయం చేసేవాళ్ళెవరున్నారు?

తిరువనంతపురంలో ఎవరితో ఏమీ సంబంధం కూడా లేదు. పెద్ద వాళ్ళకు జ్ఞాపకం వున్నందువల్ల ఏమీ ప్రయోజనం కూడా లేదు.'

తంకమ్మ కొంచెం పెదవులు విరిచి తల వూపుతూ అంది - 'అవును మరి, ఎవ్వరూ లేరు, పాపం'. 'అయ్యో పాపం' అంటూ విరగబడి నవ్వింది. నవ్వటం ముగిసిన తర్వాత వేటకోసరం ఎదురు చూసే నక్కలా ఆమె నిలకడగా కేశవపిళ్ళను చూసింది.

'ఏదీ ఆదిక్కులేని ముఖం చూడనీయండి.'

తంకమ్మ తన కలంతో కేశవపిళ్ళ బుగ్గలను గిల్లింది.

'నాకు సాయం చేసేవాళ్ళెవరు మరి?' అని అడిగాడు కేశవపిళ్ళ.

ఇంతలో హరిహరఅయ్యర్ వచ్చేశాడు. ఆయన వాళ్ళిద్దరినీ జాగ్రత్తగా చూసి అన్నాడు - 'అబ్బాయిలూ, ఇది బాగాలేదు.'

'ఏమిటి సార్?' అడిగాడు కేశవపిళ్ళ.

'ఏం లేదు, ఊరకనే అన్నాను.'

ఆఫీసు పని ఆరంభించిన తర్వాత గోవిందన్ నాయర్ తంకమ్మనడిగాడు. 'పార్క్‌వ్యూలో వ్యక్తిగతమైన ఉద్యోగంలో నియామకం జరిగిందా?'

'నాకు తెలియదు' - అన్నది తంకమ్మ.

కేశవపిళ్ళ తంకమ్మ ముఖంవైపు చూశాడు. గోవిందన్ నాయర్ మళ్ళీ అన్నాడు - 'చాలా మంది అందు కోసరం తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు.'

'అక్కడి పరిస్థితి అంతే.' అని హరిహరఅయ్యర్ సమాధానం చెప్పాడు.

గోవిందన్ నాయర్ నమ్మలేదు. 'ఏమిటిస్థితి' అన్నాడు.

'ఎవరెవరు ప్రయత్నిస్తున్నారు' ప్రభాకరన్ నాయర్ అడిగాడు.

'చాలామంది - తిరువనంతపురంలో పేరు ప్రతిష్ఠలుగల వాళ్ళందరూ - యం.ఎల్.సీలు కూడా విశ్వప్రయత్నం చేస్తున్నారు. నాకు మాత్రం ఇదంతా చాదస్తంగా కనిపిస్తుంది' అని సమాధానం చెప్పాడు గోవిందన్ నాయర్.

తంకమ్మ తదేకదృష్టితో ఏదో రాస్తున్నది. ఎవ్వరూ చూడకుండా రాసిన ఆ కాగితపు ముక్క ఆమె కేశవపిళ్ళ టేబిలుమీద పెట్టింది.

దానిమీద రాసింది ఇది. 'ఎవరెంత ప్రయత్నించినా లాభంలేదు. మనం ప్రయత్నిద్దాం. మీరేమీ కంగారు పడకండి.'

కేశవపిళ్ళ సంతోషంగా వున్నాడు. దానికి కారణం కూడా వుంది. మంచి రోజులు వస్తే అందరూ ఆనందంగానే వుంటారు. కాని అతని ఆనందంలో ఒక హుందా వుంది. అతను ఒక ప్రశస్త మార్గంలో ప్రయాణం సాగించాడు.

భవిష్యత్తును గురించి యేమీ చెప్పేందుకు వీల్లేదు. బహుశా .... కాదు కచ్చితంగా అతనికి పార్క్‌వ్యూలో ఉద్యోగం దొరుకుతుంది. అతనొక మంచి అధికారి అవటంలో సందేహమేమీ లేదు. అతను త్వరలో భక్తి విలాస్‌లో, రాజభవనంలో అందరికీ పరమ సన్నిహితుడవుతాడు. ఈ వుద్యోగం ద్వారా

అతనికి ఉన్నత పదవి కూడా లభిస్తుంది. కాని కేశవపిళ్ళై ఆలోచనలో పడ్డాడు.

అతను తంకమ్మను పెళ్ళి చేసుకుంటాడనే నమ్మకం మీదనే అతనికి సదుపాయాలన్నీ లభిస్తున్నాయి. శేఖర్ పిళ్ళై తనవిషయంలో తమ్ముడు కృష్ణన్ నాయర్‌కు చెపుతే ఇలా చెపుతాడు. 'మన తంకమ్మను పెళ్ళి చేసుకోబోయే కేశవపిళ్ళైను దగ్గరకు తీసి యోగ్యుణ్ణిగా చెయ్యి.'

బహుశా తంకమ్మ తన పిన్నికి - చీఫ్ సెక్రటరీ భార్యకు చెప్పవచ్చు.

ఇప్పుడతని మనస్సు మరోలావుంది. ఆరోజు తోట్టపల్లిలో దిగి ఇంటికి వెళ్లకుండా వుంటే బాగుండేది. ఈ వివాహం నాకు ఇష్టం లేదని ముందే తండ్రితో స్పష్టంగా చెప్పి వుండాల్సింది. తప్పకుండా తండ్రికి కొంత చిరాకు వేసేది, కోపం వచ్చేది, అమ్మ ఏడ్చేది, బావగారికి అసహ్యం వేసేది, అక్కమీద బావకు కోపం వచ్చేది, నానా మాటలు అనేవాడు. ఊళ్ళో వాళ్ళు కొందరు అతన్ని సమర్ధించేవాళ్ళు. ఒక తుఫాను వెలరేగి అంతా శాంతించేది. అమ్మకూ నాన్నకూ కోపం వచ్చినా ఎక్కువ కాలం ఉండదు. అందులో సందేహం లేదు. అతను ఒక్కగాన ఒక్కడు. అక్కకు ఒక్కడే తమ్ముడు. నెమ్మదిగా అంతా సమసిపోయేది. ముఖ్యంగా ఇలా పెద్ద ఉద్యోగం వచ్చి ముందుకు రావటం చూసి తండ్రి హృదయంలో ఏర్పడ్డ గాయం మాని పోయేది. అంతా సక్రమంగా వుండేది.

ఆనాటి దౌర్బాల్యాన్ని గుర్తు తెచ్చుకుని అతను చాలా దిగులు పడ్డాడు. తగని పని చేశాడు. ఏది ఎలా గయినా కనీసం ముప్పయ్యో తేదీ పెళ్ళి నిశ్చయించామని చెప్పినప్పుడయినా తను భోరున ఏడవవలసింది. తను ఏడుస్తూవుంటే చూసి అమ్మ తన తరపున మాట్లాడేది.

'అదృష్టరేఖ! ఇంతకూ ఆస్త్రీ తనకు భార్యగా రాసి పెట్టివుంది.'

'అమ్మాయి అదృష్టవంతురాలు' - ఆవాక్యం అతని చెవుల్లో గింగురుమంటూ వినివిస్తున్నది. కిట్టుమామ చెప్పిన మాటలు అతని మనఃపటలంలో శాశ్వతంగా నిలిచిపోయినాయి.

ఒకపిల్ల మెడలో మంగళసూత్రం కట్టి ఇంటికి తీసుకొచ్చి వెనక్కి తిరిగి చూడకుండానే అతను వచ్చేశాడు. ఆపిల్ల మనోవ్యథను గురించి అతనేమీ విచారించలేదు. జీవితంలో ఉన్నత పదవులను గురించి కలలు గనటంలో నిమగ్నుడైయున్న అతని హృదయంలో ఇతరుల ఆవేదనకు తావు లేకపోయింది.

ఇదంతా ఆలోచించి అతను తిరువనంతపురం వెళ్లలేదు. ఉద్యోగం దొరకటమే అతనికి అదృష్టం. ఈరోజు ఇలా యీ అవకాశం లభిస్తున్నది. ఇదికూడా అదృష్టమే. ఇప్పుడతనికి ధైర్యం వచ్చింది. తన అదృష్టం మీద అతనికి నమ్మకం కుదిరింది. అదే అతని సామర్ధ్యం. ఈ అవకాశాన్ని పూర్తిగా

ఉపయోగించుకోవాలి. అనవసరమైన ఆలోచనలతో ఆందోళన చెందినందువల్ల లాభంలేదు. ఈజీవిత నౌక ఎటు వెళుతుందో, వెళ్ళనీ.

ఒకవేళ మధ్యలో సుడిగుండంలో చిక్కుకుంటే చిక్కుకోనీ. తంకమ్మకు అతని సంగతి పూర్తిగా తెలిస్తే తెలియనీ. చీఫ్ సెక్రటరీకి అన్ని సంగతులూ సాకల్యంగా తెలిసి తనను మోసగాడని భావిస్తే భావించనీ. అదృష్టవశాత్తు తంకమ్మ బాబాయి కృష్ణన్ నాయర్ని చీఫ్ సెక్రటరీ పదవినుంచి తొలిగిస్తే అన్ని చిక్కులూ తొలిగిపోతాయి. ఏది ఏమయినా అన్నింటినీ ఎదుర్కొనే ధైర్యం అతనికి వచ్చింది.

ఇంకా కిట్టుమామ చెప్పిన మాటలు అతని చెవిలో వినబడుతున్నాయి 'అమ్మాయి అదృష్టవంతురాలు.'

అదృష్టవంతురాలేనా? ఇవన్నీ ఆమె అదృష్టవంతురాలనేందుకు నిదర్శనాలు కాకపోతే మరేమిటి?

కుట్టియంబళం ఎప్పుడన్నా కాదు, ఎల్లప్పుడూ - తెరిచి వుంచమని కేశవపిళ్ళె తంకమ్మకు చెప్పివుంచాడు. తంకమ్మ సరేనన్నది. ఆమెకది చాలా ఇష్టం. కేశవపిళ్ళె తంకమ్మను తన స్వాధీనం చేసుకోవాలని మానసికంగా కేవలం ప్రయత్నించటమే కాదు, శారీరకంగా స్వాధీనం చేసుకుంటున్నాడు. ఆమెను స్వాధీనం చేసుకునేందుకు గట్టిగా ప్రయత్నిస్తున్నాడు. ఆమెలోని స్త్రీత్వం మేల్కొన్నది. నిషిద్ధమైన ఫలాన్ని ఆస్వాదించటంతో ఆమెలో ఉన్మత్తత రేకెత్తింది. కేశవపిళ్ళె ఆమె ఉన్మాదాన్ని అంచనా వేసి చాకచక్యంగా పెంచుతున్నాడు. అటు తంకమ్మ కూడా ఒళ్ళు తెలియకుండా ప్రవర్తిస్తూ వుంది. ఇప్పుడామె కేవలం పూయబోతున్న పువ్వు కాదు, బాగా విరబూసిన పువ్వు. తుమ్మెదలను మురిపించేందుకు ఆరాటపడుతున్న పువ్వు. ఆమెకు వాగ్దానంతో పనిలేదు. కేశవపిళ్ళె దొరికితేచాలు. కేశవపిళ్ళె తంకమ్మలోని స్త్రీత్వపు ఆనకట్ట తెంచేశాడు. ఆ ప్రవాహం ఎంతవరకు వెళుతుందో తెలీదు. తంకమ్మను పూర్తిగా తన స్వాధీనం చేసుకున్నాడు. తంకమ్మ అతనికోసరం ఏమయినా చేసేందుకు నడుం కట్టుకుని సిద్ధంగా వుంది.

ఈ ప్రేమకలాపాలు ఎలా పరిణమిస్తాయో అని ఆలోచించటం మానేశాడు కేశవపిళ్ళె. జీవితంలో అతని అర్ధాంగి ఎవరవుతారో? వాళ్ళ ఊళ్లో అమ్మకు చాకిరీ చేస్తున్న కాత్యాయనా? లేక యిక్కడ తన ఉన్నతి కోసరం పన్నాగాలు వేస్తున్న తంకమ్మా? ఏమయినా సరే. అతనికి జీవితంలో భార్యగా విధాత ఎవరిని నిర్ణయిస్తే వాళ్ళే అవుతారు. ఒకరితో సంబంధం ఏర్పడ్డ తర్వాత మరొకరితో విచ్ఛిన్నమైనా అతనికేమీ విచారంలేదు. కేశవపిళ్ళె బుద్ధి వికసించింది. తనసామర్ధ్యం మీద అతనికి నమ్మకం చిక్కింది. ఈ ధైర్యం అతని సామర్ధ్యాన్ని ప్రేరేపించింది. చివరదాకా వెళ్ళేందుకు అతనికి

భయంలేదు. అటు వెళ్ళినా, ఇటు వెళ్ళినా తనకు విజయం తప్పదని అతనికి ధైర్యం వచ్చింది.

రెండు పూటలకు తిండి వెతుక్కుంటూ వచ్చిన కేశవపిళ్ళై మనస్థితిలో ఇంత మార్పు వచ్చింది. అతని శక్తి సామర్థ్యాలు మేల్కొన్నాయి. అభిలాషలు చిగురించినందువల్ల మారిన తీరుతెన్నులవి. ఈ పరిస్థితిలో అతను తను చేసుకున్న భార్యను, అభ్యుదయ పథంలో ప్రథమ సోపానంగా తారసిల్లిన ప్రేయసిని, తన విజయానికి ఉపకరణాలుగా ఉపయోగించుకోవటంలో అతని భావావేశంలోనూ, విలువల్లోనూ మార్పువచ్చినా, అది అతని సామర్థ్యంగానే భావింపబడుతుంది. కాత్యాయని అదృష్టవంతురాలని కిట్టుమామ చెప్పాడు. ఆమె అదృష్టాన్ని అనుభవించవలసింది ఆమె భర్త. ఆమె అదృష్టవంతురాలయితే, ఆమె అదృష్టంవల్ల ఆమె భర్తకు ఉన్నత పదవి లభిస్తుంది. తంకమ్మకు అపరిమితమైన భావావేశం వుంది. ఆమెభావావేశం కూడా అతని పదోన్నతికి దోహదం చేస్తుంది. దాన్ని అనుభవించేది కూడా అతనే. అంటే ఇద్దరూ అతని అభ్యుదయం కోసరమే ఏర్పడ్డారన్నమాట.

ఇంటినుంచి నాన్న రాసిన ఉత్తరం వచ్చింది. కిట్టుమామ పెట్టిన ముహూర్తానికి అతను ఇంటికి రాలేదు. రానందుకు కారణం తెలియపరుస్తూ గోపాలన్ నాయర్ పనిమీద తిరువనంతపురం వచ్చి అతని దగ్గరవున్నానని అతను రాశాడు. రెండు వారాల తర్వాత గురువారంనాడు మంచిరోజు. ఆనాటికి ఇంటికి రమ్మని తండ్రి గట్టిగా రాశాడు. కేశవపిళ్ళై చేస్తున్నపని సరియైనది కాదని ఆయన నేరారోపణ కూడా చేశాడు. ఊళ్ళో వాళ్ళేమంటారు - అని ఆయన ఉపదేశ వాక్యాలు కూడా రాశాడు. కులాచారాలు పాలించటం అవసరమనీ, లోకుల్లో తండ్రిని అపనిందపాలు చేయటం తగదనీ ఆయన రాశాడు. కిట్టుమామ పంచాంగం, జాతకాలు చూసి గురువారం శోభనం ముహూర్తం పెట్టివుంటాడని కేశవపిళ్ళై ఊహించాడు.

కాని ప్రస్తుత పరిస్థితిలో అతను గురువారం ఇంటికి వెళ్ళలేడు. అది మాత్రం ఖాయం. అతని ఉన్నతికి మొదటి మెట్టు ఈరోజుల్లోనే తయారు కాబోతున్నది. కాబట్టి అతనిక్కడే వుండాలి. తల్లి దండ్రులకు కేశవపిళ్లై యింటికి రావటం ముఖ్యం. కేశవపిళ్ళైకు ఇక్కడవుండి పని సాధించటం ప్రధానం గురువారం నాడు మంచి గడియల్లో అతను తంకమ్మతో కాలక్షేపం చేస్తాడు.

కేశవపిళ్ళై తండ్రికి సమాధానం రాశాడు. ప్రస్తుతం ఉన్నతపదవి లభించే అవకాశాలు వున్నాయనీ, కాబట్టి యింటికి వచ్చే తేదీ కచ్చితంగా చెప్పేందుకు వీల్లేదనీ స్పష్టంగా తండ్రికి రాశాడు. ఈమాట కాత్యాయనికి కూడా చెప్పవలసిందని రాద్దామావద్దా అని చాలాసేపు ఆలోచించాడు. చాలా సేపు ఆలోచించిన తర్వాత వ్రాయనక్కరలేదని నిశ్చయించుకున్నాడు. అంతా ఆ

అమ్మాయికి దానంతట అదే తెలిసిపోతుంది. అదే చాలనుకున్నాడు. ఒక వేళ కాత్యాయనితో సంబంధం తెంచుకోవలసి వస్తే యీ జీవిత సరిత్ప్రవాహంలో అదికూడా చేసేందుకు అతను సిద్ధపడ్డాడు. ఎంతమందో జీవితంలో విడాకులు ఇచ్చేవాళ్ళున్నారు. అందువల్ల కాత్యాయనికి ఏమీ వ్రాయకుండా వుండటమే మంచిదనుకున్నాడు.

ఆ అమ్మాయి అదృష్టవంతురాలే అయితే ఆమె తనకు భార్య అయినందువల్ల తనకు జీవితంలో ఉన్నతి లభిస్తుంది. ఆమె తనకు భార్యగా వుంటుంది. లేకుంటే ఆ పల్లెటూరి పిల్ల యింటి దగ్గర అమ్మను చూస్తూ వుంటుంది. లేకుంటే పుట్టింటికి వెళ్ళిపోతుంది. అప్పుడు తంకమ్మ అదృష్టం ఫలిస్తుంది.

మర్నాడు ఆదివారం సాయంత్రం కేశవపిళ్ళై చెట్టికుళంగరలో కుట్టియంబళం ద్వారా తంకమ్మగారి యింట్లో ప్రవేశించాడు. అతను అందరి యెదుట లోపలికి వెళ్ళటం ఇదే మొదటిసారి. అక్కడికి వెళ్లకుండానే సరిపోతుందని అతననుకున్నాడు. కాని తంకమ్మ బలవంతం చేసింది. ఆమె తల్లిదండ్రులు అతన్ని చూడాలనుకున్నారు. అలాంటి పరిస్థితిలో అతను కాదని యెలా అనగలడు?

తంకమ్మ తల్లి దండ్రులు పెళ్ళికి అతని అంగీకారం అడిగితే వాళ్ళకు ఏం సమాధానం చెప్పాలో కేశవపిళ్ళైకు తెలియదు. ఈ విషయం వాళ్ళు తప్పకుండా అడుగుతారు. అది నిర్ణయమయిన తర్వాతనే ఉన్నతోద్యోగాన్ని గురించి వాళ్ళు చీఫ్ సెక్రటరీకి చెపుతారు. ఈ పెళ్ళికి అతను ఒప్పుకోవాలా? లేదా? కేశవపిళ్ళైకు సరే అనేందుకు సందేహమేమీ లేదు కాని యిప్పుడు పెళ్ళికి ఒప్పుకుని మళ్ళీ కాదంటే ఏం ప్రమాదం జరుగుతుందో అని భయంగా వుంది. ఎలాంటి యిబ్బందులకు గురి కావలసివస్తుందోనని ఆలోచిస్తున్నాడు. కాని వివాహానికి సమ్మతించకపోతే ఏమీ జరగదు. ఆతెలివి తక్కువ దద్దమ్మ మెడలో మంగళసూత్రం కట్టినందువల్లనే యిన్ని చిక్కులు వచ్చిపడ్డాయి. తల్లి దండ్రులను చూసి మెతకపడటమే దీనికి కారణం.

కేశవపిళ్ళై గుండె దడదడలాడుతూ వుంది. అతని మనసును మథన పెడుతూవున్న దిగుళ్ళన్నీ బయటికి పొంగుతాయని అతనికి భయం వేస్తూవుంది. అతనేదో నిజాన్ని దాస్తున్నాడని ఆపరిస్థితిలో ఎవరికయినా అర్థమవుతుంది. తన దిగులుని దాచుకొనేందుకు కేశవపిళ్ళై చిరునవ్వు నటించాడు. అది కేవలం అభినయం.

గుమ్మందాటి లోపలికి వెళ్ళగానే శేఖర్ పిళ్ళై ధవళ తరళహాసంతో అతనికి స్వాగతం చెప్పాడు. కానున్న అల్లుడికి అతను స్వాగతం చెపుతున్నట్లు స్పష్టంగా అవగతమవుతూ వుంది. కేశవపిళ్ళై మహాచిక్కులో పడిపోయాడు. వరాండాలో వున్న తంకమ్మ పరుగెత్తి లోపలికి వెళ్ళిపోయింది. 'అమ్మా,

ఆయన వచ్చారే' అని వాళ్ళ అమ్మకు చెప్పేందుకు వెళ్ళి వుంటుంది. వాళ్ళమ్మ చాటునుంచి అతన్ని చూస్తూ వుండి వుంటుంది.

జీవితంలో శేఖర్ పిళ్ళె అష్టకష్టాలు పడివుంటాడని చెప్పకుండానే తెలుస్తూవుంది. కాని అతను గట్టివాడు. గట్టి సంకల్పం కలవాడు. బహుశా జీవితంలో అతను పడ్డ అవస్థలు అతన్ని అలా చేసివుంటాయి.

'ఎక్కడ వుంటున్నావ్' అని శేఖర్ పిళ్ళె కేశవపిళ్ళెను ఇంటి విశేషాలడిగాడు. కుశలప్రశ్నల తర్వాత ఆయన భార్యను పిలిచాడు.

'భాగీరథీ!'

భాగీరథీ అమ్మ గది తలుపు చాటున నిలబడివుంది. ఆమెకు పిలుపు వినిపించింది. 'లోపలనే నిలబడ్డవెందుకే, బయటికిరా' అన్నాడు శేఖర్ పిళ్ళె.

భాగీరథి అమ్మ రాలేదు. శేఖర్ పిళ్ళె కేశవపిళ్ళెతో అన్నాడు 'మేము తిరువనంతపురం వాళ్ళం. ఇక్కడి ఆచారం ప్రకారం అత్త, అల్లుడు ఒకరి ముఖం ఒకరు చూసుకోరు. అందుకని ఆవిడ చాటున నిలబడి వుంది.'

శేఖర్‌పిళ్ళె నవ్వాడు. కేశవపిళ్ళె నవ్వలేదు. ఆయన మాటలు కేశవపిళ్ళె మనస్సునూ, హృదయాన్నీ కలచివేశాయి. తను బాగా ఇరుకులో పడ్డాననీ, ఇక్కడి నుంచి తప్పించుకుని పోవటం కష్టమనీ అతనికనిపించింది. శేఖర్ పిళ్ళె భార్యతో అన్నాడు 'ఇవన్నీ పాత ఆచారాలు. వీటికి అర్థం, బద్ధం లేదు. బయటికి వచ్చేసెయ్యి.'

'నా పద్ధతి ప్రకారమే నేను నడుస్తాను' అన్నది భాగీరథీ అమ్మ లోపలినుంచే.

'సరే! రాకు.' అన్నాడు శేఖర్ పిళ్ళె ఆమెతో ఏకీభవిస్తూ.

అప్పుడే తంకమ్మ కాఫీ తీసుకుని వచ్చింది. ఆమె ముఖం చూస్తే కేశవపిళ్ళె ఆమెకు పరిచయమున్నట్లు తోచటం లేదు. మర్యాదగల కుటుంబానికి చెందిన ఆడపడుచులా వుంది. తండ్రి దగ్గర కూర్చుని పరిచయం లేని వ్యక్తికి కాఫీ అందించినట్లుగా వుంది ఆమె ముఖవైఖరి. కేశవపిళ్ళె ఆమెవైపు చూడలేదు. ఆమె కూడా పరిచయం చేసుకునేందుకు ప్రయత్నించలేదు.

కాఫీ తాగిన తర్వాత ఆ ప్రసక్తి ఎక్కడ వస్తుందేనని కేశవపిళ్ళె కంగారుపడుతున్నాడు.

కొంతసేపటివరకు శేఖర్‌పిళ్ళె ఏదో ఆలోచిస్తున్నాడు. అదేదో గంభీరమైన విషయమే అయివుంటుంది. ఆసమయంలో నలువైపులా ఎక్కడలేని నిశ్శబ్దం అలుముకుని వుంది. ఇక ఆ ప్రసక్తి రాబోతున్నదని కేశవపిళ్ళె ఖాయం చేసుకున్నాడు. కొంచెం కేశవపిళ్ళె వైపు తిరిగి శేఖర్ పిళ్ళె ప్రారంభించాడు –

'చూడుబాబు! తంకమ్మ మాకు సర్వస్వం. నీవు ఆమె ఆఫీసులో చేరినప్పటినుంచి నీ గుణగణాలే అది చెపుతూ వుంది.'

శేఖర్ పిళ్ళె ఉన్నట్టుండి ఆగిపోయాడు - తర్వాత చెప్పేదుకు ఏమీ లేనట్టు. అతను చాలా గట్టివాడయినప్పటికి ఇలాంటి విషయాల్లో అతనికి పెద్ద అనుభవం లేనట్టు అనిపించింది.. కొంచెం ఆగి శేఖర్ పిళ్ళె మళ్ళి ఆరంభించాడు. 'చీఫ్ సెక్రటరీ నా సొంత తమ్ముడు. ఈనాటివరకు నేను అతన్ని ఏమీ అడగలేదు. నీకు అతని దగ్గర పనిచేసే అవకాశం దొరికితే నీవు ముందు ముందు పైకి రాగలవని తంకమ్మ చెప్పింది. ఇంత వరకు తంకమ్మ చెప్పింది ఏదీ నేను కాదనలేదు. అందువల్ల ఈవని చేద్దామని నిశ్చయించుకున్నాను.'

కేశవపిళ్ళె తన సమస్యలో తాను మునిగివున్నాడు.

శేఖర్ పిళ్ళె మళ్ళి అన్నాడు 'ఇంతవరకు మా వాణ్ణి నేనేమీ అడగలేదు. కాని యీమాట చెబుదామని నిశ్చయించుకున్నాను. నామాట వాడు కాదనడు. తప్పక చేస్తాడు.'

కొంతసేపటివరకు అంతా నిస్తబ్ధంగా వుంది. కేశవపిళ్ళె గుండెలో భూకంపం లేవబోతూవుంది. ఆ అవకాశాన్ని వదులుకుంటే ఎలా వుంటుంది? బహుశా ముందుముందు చాలా ఇబ్బందులు రావచ్చు. అంతా ఒక్క రోజులో తేలిపోతుంది. శేఖర్ పిళ్ళె ఇప్పుడే పెళ్ళి సంగతి కచ్చితంగా అడుగుతాడేమో? ఆ తర్వాత చీఫ్ సెక్రటరీకి చెపితే, అతని మీదనే గాదు. ఎవిరిమీదనైనా నేరం మోపవచ్చు. ఒకవేళ పెళ్ళి అయిన తర్వాత చెపితే అదికూడా ఒక విధంగా న్యాయసమ్మతమే కావచ్చు. స్పష్టంగా సమాధానం చెప్పమని అతన్ని ఎప్పుడయినా అడగవచ్చు. కేశవపిళ్ళె దానికోసరమే ఎదురు చూస్తున్నాడు.

శేఖర్ పిళ్ళె కేశవపిళ్ళె తో అన్నాడు 'మీ అమ్మా, నాన్న ఉన్నారు గదా? వాళ్ళతో మాట్లాడి వాళ్ళ అనుమతి తీసుకో. మీ యిద్దరి జాతకాలు కూడా సరిపోతాయోలేవో అవి చూసుకోటం కూడా చాలా అవసరం. నీ నక్షత్రం ఏమిటి?'

'రేవతి.'

'తంకమ్మది భరణి.'

శేఖర్ పిళ్ళె ఏదో లెక్కవేశాడు. దోషమేమీ వున్నట్టు లేదు.

'మీనాన్న గారిని ఇక్కడికి పిలిపించేందుకు వీలుంటుందా?' అని అడిగాడు శేఖర్ పిళ్ళె.

ఈ ప్రశ్నతో కేశవపిళ్ళె నిశ్చేష్టుడయిపోయినాడు. అతని రక్తప్రవాహం ఆగిపోయినట్టనిపించింది. కాని వెంటనే ఒక సమాధానం స్ఫురించింది.

'ఇప్పుడక్కడ పంటలు కోసే సమయం. నాన్నగారికి బొత్తిగా తీరిక ఉండదు.'

ఇంతలో లోపలినుంచి భాగీరథీ అమ్మ కంఠం వినిపించింది.'

తొందర చేసుకోకపోతే చీఫ్ సెక్రటరీ ఆపదవిలో ఎవరినో ఒకరిని వేసుకుంటారు. నిశ్చితార్థం అయిన తర్వాతనే, పెళ్ళి జరిగిన తర్వాతనే చెపితే కేశవపిళ్ళైకు ఉన్నత పదవి రావటం కానిపని.'

ఈమాటలు భాగీరథీ అమ్మ స్వబుద్ధితో అన్నవి కావు. తంకమ్మ తన అభిప్రాయాన్ని ఆమె ద్వారా అనిపిస్తున్నది. అబ్బ! కేశవపిళ్ళై మనస్సు కుదుటపడింది.

శేఖర్ పిళ్ళై కొంచెం చిరాకుగా అన్నాడు 'నేనామాట అన్నానా? నీమాట వింటే పెళ్ళిఅయిన తర్వాతనే కృష్ణన్‌కు చెప్పాల్సి వస్తుంది. జరగాల్సిన పనిని గురించి నేను చెబుతున్నాను.'

.కేశవపిళ్ళై వైపు తిరిగి అతనన్నాడు 'చూడు, పిళ్ళై! కృష్ణన్‌తో నేను రేపే చెపుతాను. ఆతర్వాత మనం చెయ్యాల్సింది చేద్దాం.' కేశవపిళ్ళై సరేనన్నాడు.

తంకమ్మ బయటికి రాను కూడా లేదు. - ఎవరో పెళ్ళి చూపులకు వచ్చినట్లు. ఆసమయంలో పెళ్ళికూతురులాగానే తంకమ్మకూడా శిలవతిగా వుంది. శేఖర్ పిళ్ళై ఏవేవో మాట్లాడాడు. కేశవపిళ్ళై ఏదోవిధంగా అక్కడినుంచి బయటపడేందుకు చూస్తున్నాడు. అతనికి అగ్నికుండంలో కూర్చున్నట్టువుంది.

కేశవపిళ్ళై వెళ్ళబోతూవుంటే భాగీరథి అమ్మ తలుపు చాటునుంచి 'కలకాలం కళకళలాడుతూ వర్ధిల్లండి' అంది.

కేశవపిళ్ళై నవ్వుతూ ఆమోదించాడు.

కొట్టియంబళం బయటికి వచ్చి అతను వెనక్కు తిరిగి చూశాడు. తంకమ్మ ముంగిలి దాకా వచ్చింది.

## ఎనిమిది

కాత్యాయని త్వరగా వంటపని పూర్తి చేసుకుని స్నానానికి వెళ్ళింది. ఆసమయంలో స్నానాల రేవులో పాప్పిఅమ్మ, మట్టత్తిన్ వాళ్ళ జానకి, కుట్టిక్కాట్ట మాధవి అమ్మ వున్నారు. రేవులో ఎవ్వరూ లేకుండా చూసి కాత్యాయని స్నానానికి వెళుతుంది. అక్కడికి వెళితే ఆడంగులు వెయ్యి ప్రశ్నలు వేస్తారు. చాలా ప్రశ్నలకు ఏం సమాధానం చెప్పాలో ఆమెకు తోచదు. అందుకనే ఆమె అక్కడ ఎవ్వరూ లేకుండా చూసి ప్రతిరోజూ స్నానానికి వెళుతుంది. ఆరోజు దురదృష్టవశాత్తు అక్కడికి వెళ్ళేసరికి అక్కడ ముగ్గురు ఆడవాళ్ళున్నారు. వాళ్ళల్లో ఒకామె జానకి. ఆమె కాత్యాయనిని అడిగింది.

'ఏమమ్మాయ్, కేశవ్ దగ్గరినుంచి ఉత్తరం వచ్చిందా?'

'అవును' - అని కాత్యాయని అనేలోపలనే పాప్పి అమ్మ అందుకుంది- 'అతను బియ్యే ప్యాసయ్యాడు. సమర్థుడు, బుద్ధిమంతుడు. కాని పెళ్ళిచేసుకుని యీ అమాయకురాలిని అన్యాయం చేశాడు.'

మాధవి అడిగింది 'పెళ్ళి కాగానే పెళ్ళికూతుర్ని ఇంటికి తీసుకువచ్చి వెంటనే వెళ్ళిపోయినాడు కదమ్మా! పాపం పక్కలో పండుకోనుగూడాలేదు.'

ఆమెతో ఏకీభవిస్తూ పాప్పి అన్నది 'అసలీ పిల్ల అతన్ని చూడనుగూడా లేదు. ఒక్క మాటన్నా అనలేదు. వినలేదు.' కాత్యాయని వైపు తిరిగి 'అంతే గదమ్మా' అన్నది.

మాధవి, జానకి 'అయ్యో పాపం' అని విచారం వ్యక్త పరిచారు. వాళ్ళకు నిజంగా కాత్యాయన్ని చూస్తే దిగులు వేస్తున్నది.

పెండ్లయి ఎన్ని రోజులో కాలేదు. అమ్మాయిని చిచ్చులాంటి దిగుల్లో పడేసి వెళ్ళాడు. ఇంత కంటె ఏం కావాలి? ఇలా అంటుండగానే చెరువులో రెండు కన్నీటి బొట్లు రాలాయి.

'అరె, ఏడుస్తునదా?'

కాత్యాయని వెక్కి వెక్కి యేడుస్తున్నది.

ఇప్పుడు పాప్పి అమ్మ సానుభూతి ధర్మసమ్మతమైన కోపంగా మారింది.

'పిచ్చిపిల్ల! మీకు ఈ అమ్మాయిని గురించి యేమీ తెలియదు. నేను పక్కింట్లోనే వుంటాను కాబట్టి అన్నీ చూస్తుంటాను. క్షణం తీరిక లేకుండా అస్తమానం పని చేస్తూనేవుంటుంది. ఇంటిపనంతా ఈ అమ్మాయి మీదనే. ఆ కుట్టిఅమ్మకు చాకిరీ చేసేందుకు ఒక పిల్ల కావాల్సి కొడుక్కు పెళ్ళి చేసి యీ పిల్లను తెచ్చుకుంది. దయా దాక్షిణ్యం లేనివాళ్ళు.'

మాధవికి ఇంటి చాకిరీతో పనిలేదు. భర్తవల్ల ఆఅమ్మాయి పొందిన సుఖాన్ని గురించి ఆమెకు కావాలి. కేశవపిళ్ళె ఆ అమ్మాయిని స్పృశించాడా లేదా అని ఆమె తెలుసుకోవాలి. పాప్పి అమ్మ ధర్మకోపంతో అన్నది.'

'చూడండి, అక్కడ పంటి గుర్తు వుందా?'

కాత్యాయని రెవిక విప్పుకొని వుంది.

మాధవి, జానకి నవ్వుకున్నారు.

'ఈ పాప్పిఅమ్మకూడా ఎంత సిగ్గు లేకుండా మాట్లాడుతున్నదో! అలా అనచ్చా? అన్నది జానకి.

'నేనేమన్నా తప్పు చెప్పానా? చూడండి, ఆపిల్ల రొమ్ముమీద ఏమయినా గుర్తుందేమో!' అన్నది పాపిఅమ్మ.

మాధవి, జానకి చెవులు మూసుకుని 'అమ్మయ్య, ఇంక వినలేం' అన్నారు.

పాపిఅమ్మ చాలా గంభీరంగా అన్నది 'నేనంటున్నదంతా నిజమే. పిల్లకు పెండ్లయింది కాని గుండెలో చిచ్చు రగుల్కొన్నది. మనచేతుల్లో మగవాడి లుంగీ వుంది. ఈపిల్ల దిగులు మనకు తెలియకుండా ఎలా వుంటుంది? లేకుంటే మనం ఆడవాళ్ళమెలా అవుతాం?'

'అవును నిజమే' అన్నది మాధవి ఏదో గుర్తు తెచ్చుకొని.

జానకి కూడా ఏకీభవించింది. పాపీఅమ్మ మళ్ళీ అందుకుంది -'తప్పంతా ఆముసలాయనది. పిల్లవాడి అభిప్రాయం కనుక్కుని పెళ్ళి చెయ్యవలసింది. అలా చెయ్యలేదు.'

పాపీఅమ్మ ఏదో కఠోరంగా మాట్లాడబోతున్నదని అనిపించింది జానకికి. కాబట్టి ఆమెను ఇంతటితో ఆపటం మంచిది. జానకి కనుసన్న చేసింది. కాని పాపీఅమ్మ ఊరుకుంటుందా? ఆమె కోపం మరీ రగులుకుంది.

'ఊఁ. ఏమిటలా కళ్ళు తిప్పుతున్నావ్? చెప్పదలచుకుంది చెప్పకపోతే నాకు కడుపు ఉబ్బుకొస్తుంది. ఎన్నాళ్ళనుంచో నేనీఅమ్మాయి విచారంగా వుండటం చూస్తున్నాను. నేను సహించలేను. ఇదేనా మర్యాద? ఇదేనా లోకాచారం? కేశవపిళ్ళైకు ఈ పెళ్ళి బొత్తిగా ఇష్టంలేదు. మరి అతన్ని బలవంతంగా ఈ పెళ్ళికి ఒప్పించటమెందుకు?'

పాపీ అమ్మ తను చెప్పదలుచుకుంది చెప్పి జానకి, మాధవి అభిప్రాయం అడిగింది. 'అదేనిజమయితే అది తప్పే' అన్నది జానకి.

పాపీ అమ్మ మళ్ళీ ప్రారంభించింది 'పోనీలే పాపం. పిల్లవాణ్ణి చాలా కష్టపడి పెంచారు. బియ్యం అమ్ముకుని గంజితాగి చదివించారు. వాళ్ళననటం తప్పు. పప్పుపిళ్ళై, కుట్టిఅమ్మ పిల్లవాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసేందుకు పడ్డంత కష్టం ఇక్కడ మరెవ్వరూ పడలేదు.'

జానకి, మాధవి ఈ విషయంలో ఆమెతో ఏకీభవించారు. 'పిల్లవాడి యిష్టం లేకుండా పెళ్ళి చేస్తే ఆ బాధ్యత తల్లిదండ్రులదే కదా?' అన్నది పాపీఅమ్మ.

ఈ విషయం జానకికి, మాధవికి బోధపడలేదు. 'అంటే యేమిటి పాపీ అక్కా', అడిగింది జానకి.

'ఇప్పుడే చెపుతాను. మాతల్లి దండ్రులు మాయిష్టం లేకుండానే మాకు పెళ్ళి చేశారు. కొచ్చుకుట్టన్ తండ్రిని నేను పెళ్ళి చేసుకునేప్పుడు వస్త్రాలు పెడుతూవుంటే చూశాను. భర్తను చూసి నాకు చాలా దిగులేసింది. కటిక నలుపు, లావు, ఒంటినిండా ముళ్ళు గుచ్చుకొనే బొచ్చు. మీకందరికీ తెలుసుగదా! పెళ్ళయి ముప్ఫై యేళ్ళయింది. అయిదుగ్గురు పిల్లలు గూడా పుట్టారు. మేము ప్రేమతో జీవితం గడుపుతున్నాం. ఆయన ఎప్పుడూ నాతో కోపంగా మాట్లాడలేదు. అప్పుడప్పుడూ నాకే కోపం వస్తూ వుంటుంది.'

పాపీ అమ్మ ముఖవైఖరి మారింది. భక్తితో చేతులు జోడించింది 'స్వామీ! నన్ను కనికరించి భర్త కళ్ళ యెదట నన్ను కడతేర్చు.'

ఒక్క క్షణం గడిచింది. పాపీ అమ్మ ప్రార్థన చేస్తూవుంది కొంచెంసేపుఆగి ప్రారంభించింది 'అప్పుడేమిటి? ఇప్పుడుకూడా. చిన్నపిల్లలు సిగ్గుపడుతుంటారు. ఏదో కుతూహలం గిలిగింతలు పెడుతూవుంటుంది.' తలముందుకు వంచి మెల్లని కంఠంతో పాపీ అమ్మ అడిగింది-

'కొంచెం జ్ఞాపకం తెచ్చుకో. నెల నెలా దూరంగా వున్నప్పుడు మనం అనుకోలా? ఎలాంటి భర్త దొరుకుతాడో? మిసిమిసి రంగు, గుబురు గుబురు మీసాలు .... దాపరికమెందుకు? నాకలాగే అనిపించేది. మగవాళ్ళు కూడా అలాగే అనుకుంటారు. పిల్లకు బాగా జుట్టుండాలి పసుపుపచ్చని వన్నె వుండాలి అని వుంటుంది. తను కోరుకున్న వరుడు, వధువు, దొరికేది ఎవరికో! మరి భార్య భర్తలందరు అన్యోన్యంగా ఎలా వుంటారు? ఈడూ జోడూ లేని పెళ్ళయినా భార్యా భర్తలకు ఒకరితో ఒకరికి పరిచయం అయిన తర్వాత కలిసి మెలిసి కాపురం చేస్తూ వుంటే అదే తృప్తిగా వుంటుంది. క్రమంగా ప్రేమ ఏర్పడుతుంది.'

జానకి, మాధవి నవ్వుకుంటున్నారు. 'ఏం? నవ్వుతున్నారేం? నేనేమన్నా తప్పుచెప్పానా? మరి ప్రేమ ఎలా పుడుతుంది?' అడిగింది పాపీఅమ్మ.

జీవితంలోని యీ గొప్ప సత్యాన్ని యిద్దరు యువతులూ ఒప్పుకొని తీరవలసి వచ్చింది. పాపీఅమ్మ మళ్ళీ కాత్యాయని సంగతి తిరగేసింది.

'కేశవ్‌కు కూడా భార్యమీద అనురాగం ఏర్పడేది. కాని ఆ ముసలామె దానికి అవకాశమిస్తేగా? అదే నాకు కోపం'.

'ఆమె యేం చేసింది? పిల్లవాడి పెళ్ళంటే ఆమెకు చాలా సంతోషమేగదా? దానికోసమే కదా ఆమె తాపత్రయ పడ్డది?' అని ఆశ్చర్యంతో అడిగింది మాధవి.

పాపీఅమ్మ అమాట ఒప్పుకున్నది.

జానకి మరో ప్రశ్నవేసింది.

'వాళ్ళను కలిసి మెలిసి వుండనియ్యలేదా మరి?'

అమాయకపుపిల్లకు తెలియజెప్పటం కష్టం అన్నట్టుగా ముఖం పెట్టుకుని పాపీఅమ్మ అన్నది-

'అదికాదు. ఈ విషయం చెప్పాలంటే చాలా చెప్పాల్సి వుంటుంది. పెళ్ళయిన తర్వాత పెళ్ళి కూతుర్ని తీసుకొచ్చి పిల్లవాడు వెంటనే వెళ్ళిపోయినాడు. అందుకు వాళ్ళమ్మ ఒప్పుకున్నది. అది సరియైన పనేనా? ఆమె కొడుకు, ఇష్టం లేకుండా పెళ్ళి చేసుకున్నట్టేగా. ఆరోజు అతన్ని వెళ్ళకుండా ఆపేసినట్టయితే, ఇద్దరూ కులాసాగా కలిసిమెలిసి కాలక్షేపం చేసేవాళ్ళు. ఇంతవరకూ కేశవ్ తిరిగి రాలేదు. ఆరోజు ఈ అమ్మాయితో అతను హాయిగా గడిపివుంటే మరుసటివారం పరుగెత్తుకుని వచ్చేవాడు.'

'అతనికి తిరువనంతపురంలో ఎవరో ప్రేయసి ఉండి వుంటుంది. అందుకనే యిక్కడికి రావటం లేదు.'

పాపీఅమ్మ ఆలోచన అందాకా వెళ్ళలేదు. 'అవును, కావచ్చు. అక్కడా ఆడ పిల్లలు మగపిల్లల్ని బుట్టలో వేసుకుంటారు. అది ఫ్యాషన్లకు పెట్టిన పేరు. అక్కడి ఆడవాళ్ళు మనలాంటి వాళ్ళు కారు. అందమైన వాళ్ళు. కాని ఒక్క

విషయం. తిరువనంతపురంలో ఏమగవాడయినా అందమైన ఆడవాళ్ళ వలలో చిక్కిపోయినాడా అంటే తిరిగి మళ్ళీ యింటికి రాడు.' అన్నది పాపి అమ్మ.

'అయితే పాపం అతను ఎవరి వలలోనే చిక్కుకునే వుంటాడు.' అన్నది మాధవి ఆశ్చర్యంతో.

కాత్యాయని నీళ్ళల్లో నిలబడి అంతా వింటూనే వున్నది. ఆమెకు ఎన్నో కొత్త విషయాలు తెలిశాయి. ఇష్టం లేకుండా పెళ్ళి చేసుకున్నాడు.. ఒక్కరోజు కలిసి మెలిసి కాపురం చేస్తే మరుసటివారం పరుగెత్తుకొని వచ్చేవాడు. తిరువనంతపురంలో ప్రియురాలు వుండచ్చు. ప్రియురాలి సంగతి కాత్యాయని సహించలేక పోతున్నది.

బిగ్గరగా కేకలు పెడుతూ కాత్యాయని యింటికి వెళ్ళిపోయింది. ఎందుకు ఏడుస్తున్నావని కుట్టిఅమ్మ అడిగింది కాత్యాయని ఏమీ చెప్పలేకపోయింది. ఆమె వెక్కి వెక్కి యేడుస్తూవుంది. కుట్టి అమ్మకు కంగారు వేసింది. స్నానం చేసేందుకు వెళ్ళిన పిల్ల ఏడుస్తూ తిరిగి వచ్చింది. కారణం తెలియదు.

కారణం తెలుసుకునేందుకు కుట్టిఅమ్మ బయటికి వెళ్ళింది. అమెకు అంతా తెలిసిపోయింది. ఇలా లేనిపోని మాటలు చెప్పే పాపి అమ్మతో మాట్లాడి కోడల్ని ఓదార్చాలి. ఆతర్వాతనే ఆమె మరో పని చూసుకుంటుంది. ఇంట్లోనుంచే కుట్టిఅమ్మ బిగ్గరగా అరుస్తూ వెళ్ళింది.

'ఏయ్, పాపీ! మమ్మల్ని గురించి నీవిలా యెందుకు నోరు పారేసుకున్నావ్?'

'నేనేమన్నాను?' అంటూ ఏమీ తెలియనట్టు పాపిఅమ్మ ఇంట్లోనుంచి బయటకు వచ్చింది.

'మళ్ళీ మమ్మల్ని ఆడిపోసుకుంటున్నావా?'

'అయితే ఏం చేస్తావ్?' అన్నది పాపిఅమ్మ.

'మా అబ్బాయి బియ్యే ప్యాసయినాడు. ఇష్టంలేని పెళ్ళి చేసుకున్నాడు. అయితే యిరుగు పొరుగు వాళ్ళకేం నష్టం. ఇది బాగా వుంది.'

'మా అబ్బాయి బియ్యే ప్యాసయినాడంటే అది పూర్వజన్మలో మేంచేసుకున్న అదృష్టం. దానికి నీకు అక్కసెందుకు?' అన్నది కుట్టిఅమ్మ.

పాపిఅమ్మ అలా వదిలి పెట్టదలుచుకోలేదు.

'మీ వాళ్లంతా మహాపుణ్యాత్ములు. దిక్కులేని పిల్లను పెళ్ళిచేసుకున్నారు. ఆ అమ్మాయి కన్నీటితో మీ పుణ్యం పెరిగిపోతూవుంది.'

కుట్టిఅమ్మకు కోపం వచ్చింది.

'పెళ్ళి చేసికొని వస్తే మాకోడలు గదిలో మాట్లాడకుండా కూర్చుంటుంది.'

పాపిఅమ్మకు కాత్యాయనిని గురించి యేమీ చెప్పాలని లేదు. అయినా ఆమె వదల్లేదు. 'ఆపిల్లే మీ కుటుంబంలో గల్లంతు లేవదీస్తున్నది.'

ఇలా ఎలుగెత్తి మాట్లాడేప్పుడు కూడా కాత్యాయని ఆపకుండా ఏడుస్తున్నది.

గౌరిఅమ్మ కుట్టిఅమ్మను బలవంతంగా లోపలికి తీసుకుని వెళ్ళింది. అయినా కుట్టిఅమ్మ ఏదో వాగుతూనే వుంది.

కుట్టిఅమ్మ ఓదార్చేందుకు ప్రయత్నించింది. కాత్యాయని వెక్కివెక్కి యేడుస్తున్నది. కుట్టిఅమ్మ ఆ అమ్మాయి కళ్ళ నీళ్ళు తుడుస్తూ అన్నది - 'నా తల్లి యేడవకే. నీ కష్టాలన్నీ తీరతాయి. నీకు మంచి రోజులొస్తాయి. మీరిద్దరూ కలిసిమెలిసి అన్యోన్యంగా వుంటారు.

అది యెంత హృదయపూర్వకమైన ఆశీర్వాదమయినా కాత్యాయనిని ఓదార్చలేకపోతున్నది. కుట్టిఅమ్మ నచ్చచెప్పింది.

'వాడు రాకపోవటానికి కారణం ప్రేమలేక కాదు. నీమీద నిర్లక్ష్యం కూడా కాదు. ఆఫీసుల్లో పని చేసేవాళ్ళు అన్నప్పుడల్లా ఎలా వస్తూపోతూ వుంటారు? ఈ పాడు ముండలకది యెలా తెలుస్తుంది? వాళ్ల మాటలు విని నీవు దిగులు పెట్టుకోకు. వీళ్ళకు ఈర్ష్య. ఎక్కడలేని ఈర్ష్య. నా తల్లివిగదూ! ఏడవకు.'

కుట్టిఅమ్మ ప్రతిజ్ఞ చేసింది 'పది రోజుల్లోగా వాణ్ణి ఇక్కడికి పిలిపించి తీరతాను.'

కాని యీ మాటలు కాత్యాయనిని ఏమాత్రం ఓదార్చలేకపోయినాయి. తిరువనంతపురంలో అతనికొక ప్రియురాలున్నదనేమాట ఆమె హృదయంలో తిష్ఠవేసుకుంది.

ఈ తగాదా జరిగేప్పుడు పప్పుపిళ్ళె అక్కడ లేడు. పొలం వెళ్ళాడు. కొంతసేపటికి వచ్చాడు. వాకిట్లో అడుగు పెట్టీ పెట్టకముందే కుట్టి అమ్మ మొదలు పెట్టింది. మాటలు బయటికి వినిపించకపోయినా ఆమె బిగ్గరగానే అన్నది - 'పిల్లవాడికి ఇష్టం లేకుండా పెళ్ళి చెయ్యటమెందుకు? ఏపాపం తెలియని పిల్ల ఉసురుతో కాపరం నాశనమయేందుకా?'

పప్పు పిళ్ళెకు ఏమీ అర్థం కాక ఆగిపోయాడు. 'ఏమిటి? ఏమయింది?' అని అడిగాడు.

'ఏమయిందని' అడుగుతున్నారా?'

పప్పుపిళ్ళెకు కోపం వచ్చింది 'ఉఫ్. వెళ్ళిక్కడినుంచి. నాలిక చీల్చుకోకు.'

పప్పు పిళ్ళె నేరం అంతా మోపుతూ, ఇరుగు పొరుగు వాళ్ళ సంగతంతా చెపుతూ కుట్టిఅమ్మ అతనివెంట బడింది. ఆమె భర్తను స్థిమితంగా కూర్చోనియ్య లేదు.

నాలుగయిదు సార్లు పప్పుపిళ్ళె కొట్టేందుకు చెయ్యెత్తాడు: కాని కొట్టలేదు. కుట్టిఅమ్మ మాటలకు పప్పు పిళ్ళె కూడా భగ్గుమన్నాడు. తనవల్ల తప్పు జరిగిందని అతని కనిపించింది. కాని తన తప్పు ఒప్పుకునేందుకు అతను

సిద్ధంగా లేడు. ఆపిల్లను చూస్తే జాలివేస్తూవుంది. అదికాక ఒక విషయంలో పప్పుపిళ్ళెకు చాలా భయం వేసింది. ఆ విషయం కుట్టి అమ్మ వేసిన ప్రశ్నలో స్పష్టంగా స్ఫురిస్తూ వుంది.

'తిరువనంతపురంలో అతనికెవరయినా ప్రియురాలు వుందా?'

అయినా పప్పుపిళ్ళె భార్యను విసుక్కుంటూ 'పోవే పిచ్చిదానా?' అన్నాడు. కాని కుట్టిఅమ్మ వేసిన ప్రశ్న పప్పు పిళ్ళె గుండెలో నాటుకు పోయింది. అతని మనశ్శాంతి చెడిపోయింది. అయితే కావచ్చు. అందువల్లనే బహుశా కేశవపిళ్ళె యింటికి రావటం లేదు.

జమా ఖర్చు, ఇచ్చి పుచ్చుకోవటాలు రాసుకునేందుకు పప్పుపిళ్ళె ఒక నోటుబుక్కు కొని వుంచాడు. వేలంతే పొడవు పెన్సిలు కూడా ఒకటి వుంది. చూరులో నుంచి ఆనోటుపుస్తకం తీసి అందులో ఒక కాగితం చించాడు. భాగవతంలో పెట్టివుంచిన కళ్ళజోడు దారంతో ముడిపెట్టింది బయటికి తీశాడు. తండ్రి కొడుక్కు వుత్తరం వ్రాస్తున్నాడు.

'నా ప్రియమైన ఏకైక పుత్రుణ్ణి ఆశీర్వదించి వ్రాయునది. మీ తండ్రికి నీవు చెడ్డపేరు తీసుకురాకు.....' ఇలా ఆరంభించి కాగితానికి రెండువైపులా వ్రాశాడు. చెప్పదలుచుకుందంతా రాసేశాడు.

ఉత్తరం రాసిన తర్వాత మరో తగాదా మొదలయింది. కుట్టిఅమ్మకు, ఆవుత్తరంలో ఏమి రాశాడో చదివి చెప్పాలి. పప్పుపిళ్ళె వుత్తరం రాయటం మొదలు పెట్టినప్పుడు కుట్టిఅమ్మ మనస్సు ఒక తావున స్థిరంగా లేదు. అదీ కాక, రెండు సార్లు ఆకులు చుట్టి యిచ్చేందుకు లేవాల్సివచ్చింది. పప్పుపిళ్ళె ఆ వుత్తరం చదివి చెప్పేందుకు సిద్ధంగా లేడు. అటు కుట్టిఅమ్మ చదివించుకొని వినాలని పట్టుపట్టింది.

'ఆవుత్తరం చదివి వినిపించండి.'

'వీల్లేదు, ఇప్పుడు కాదు.'

'ఏం? ఎందుకని? నాకు వినిపించాల్సిందే? నేను వాణ్ణి పది నెలలు మోసి కన్నాను.'

'నాకు చదివి వినిపించాలని లేదు.'

కుట్టిఅమ్మకు కోపం వచ్చింది. 'పాపిష్టి! నాకన్న తండ్రికి ఏవేవో రాసి నాకు చెప్పడం లేదు.'

పప్పుపిళ్ళె ఆమె మాటలను లక్ష్య పెట్టలేదు. అయినా కుట్టిఅమ్మ ఆపలేదు 'నా కన్న తండ్రి దేశం కాని దేశంలో వున్నాడు. మీయిష్టం వచ్చినట్టు వ్రాసి వాడి మనస్సును కష్టపెట్టకండి.'

కుట్టిఅమ్మ రెండు మూడు సార్లు బలవంతంగా వుత్తరం లాక్కునేందుకు ప్రయత్నించింది. కాని లాభం లేకపోయింది. దానిమీద ఆమె ఏమేమో అన్నది. కాని పప్పుపిళ్ళె పట్టించుకోలేదు.

కాత్యాయనికి పెళ్ళయిన రోజే నాణికుట్టికి కూడా వివాహమయింది. ఇప్పుడా అమ్మాయి కడుపుతో వుంది. కాత్యాయనికి మరో స్నేహితురాలు వుంది. ఆపిల్ల పేరు కొచ్చుక్కుణ్ణి. కొద్దిరోజుల్లో ఆపిల్లకు పెళ్ళి కాబోతూవుంది. రోజూ వాళ్ళిద్దరూ కాత్యాయనికి వంటపనిలో సాయం చేసేందుకు వస్తుంటారు.

కాత్యాయని విషయంలో కుట్టిఅమ్మకూ, పాపీఅమ్మకు తగాదా వచ్చిన రోజున నాణికుట్టి, కొచ్చికుణ్ణి అక్కడే వున్నారు. వాళ్ళిద్దరూ కాత్యాయనిని ప్రేమతో ఓదార్చారు. కేశవపిళ్ళె మంచి వాడని నాణికుట్టి అభిప్రాయం. నాణికుట్టికి కేశవపిళ్ళెను గురించి చిన్నప్పటినుంచి తెలుసు. తిరువనంతపురంలో కేశవపిళ్ళెకు ప్రియురాలు ఉన్నదనే మాట శుద్ధ అబద్ధం. ఊవూళ్ళో నేళ్ళు పారేసుకునే ఆడంగులు ఇవన్నీ కల్పిస్తున్నారు. కాత్యాయని దిగులు పడవలసిన అవసరంలేదు. నాణికుట్టి కాత్యాయని కళ్ళనీళ్ళు తుడిచింది. కొచ్చిక్కుణ్ణి అభిప్రాయం వేరు. ఆమె తన అభిప్రాయం ఇలా చెప్పింది-

'ఒక వేళ అతనికి ప్రియురాలు వుంటేమాత్రం ఏమయింది? మగవాళ్ళకు సామాన్యంగా ప్రియురాళ్ళు ఉంటూనే వుంటారు. అది నిజమే కావచ్చు కాని కొంత కాలానికి కేశవపిళ్ళె తనంతట తనే యిక్కడికి వస్తాడు.'

కొచ్చిక్కుణ్ణికి కేశవపిళ్ళె మీద మంచి అభిప్రాయమే వుంది. అంతమంచి స్వభావంకల పిల్లవాడు ఆవూళ్ళో మరొకడు లేడు. ఆమె మరో ప్రశ్న వేసింది. 'ఇక్కడ వున్న ఆడవాళ్ళ భర్తల్లో అలా తిరగని వాడేవడు?'

ఇలా తగూలాడే ఆడవాళ్ళ భర్తలను గురించి కొచ్చిక్కుణ్ణి తనకు తెలిసిందంతా చెప్పింది. నాణికుట్టి గట్టిగా నొక్కి చెప్పింది.

'కేశవపిళ్ళె అలాంటి వ్యక్తి కాదు. చక్కగా చదువుకున్నవాడు. అన్నీ తెలిసిన వాడు.'

కాని కాత్యాయనికి తృప్తిగాలేదు. ఆమె మీది ప్రేమతో స్నేహితురాళ్ళు ఆమెకు నచ్చచెప్పేందుకు ప్రయత్నించారు. కాత్యాయని వివాహం జరిగిన రోజు అదే ముహూర్తానికి నాణికుట్టికి కూడా పెళ్ళయింది. పెళ్ళయిన మర్నాడు కాత్యాయనిని చూసేందుకు నాణికుట్టి వచ్చింది. ఆరోజు నాణి చాలా సంతోషంగా వుంది. రోజూ సాయంత్రం ఆమె భర్త వస్తాడు, ఏదో ఒక వస్తువు తీసుకుని వస్తాడు. మిఠాయిలో, రెవికబట్టలో, మంచి సువాసనగల సబ్బులో తీసుకువస్తాడు. ప్రతిరోజూ వాళ్ళ ఆయన తీసకొచ్చిన వస్తువుల భోగట్టా అంతా ఆమె కాత్యాయనికి చెప్పేది. తనకిష్టం కాని వస్తువులను ఆమె విసిరి వేసేది.

'నేను దూరంగా పారేసి మంచంమీద పడుకున్నాను' అంటూ ఆ దృశ్యాన్ని వర్ణిస్తూ నవ్వుతూ అనేది.

'అప్పుడాయన నారాణీ నాణీ అంటూ నా వెంబడి పడేవారు. నన్ను నిద్రపోనిచ్చేవారు కాదు. నేను మాట్లాడే దాన్ని కాదు.'

పకపకా నువ్వుతూ నాణీ అన్నది.

'ఇలా కవ్వించి గిలిగింతలు పెడుతూ వుంటే ఏం చెయ్యను?' మరి కాత్యాయని తన వయోధర్మాన్ని గురించి ఆలోచించదూ? అత్తగారి పక్కన పడుకుంటుంది. పడుకోగానే నిద్రపడుతుంది. కాని అప్పుడప్పుడూ భర్త సంగతి జ్ఞాపకం వస్తుంది. దాదాపు రాత్రంతా జాగరణే. ఆసమయంలో నాణీకుట్టి మాటలు గుర్తుకు వస్తాయి. నాణీకుట్టి తను పడుకునే విషయం చెపుతూ అంటుంది 'తను ఆయన చేతుల మీదనే పడుకుంటుంది. ఆయనమాత్రం తనమీద కాళ్ళు పెట్టి పడుకుంటాడు. అది తనకిష్టంలేక కాళ్ళను నెట్టేస్తుందిట.' ఇది కాత్యాయనికి గుర్తువచ్చేది. తనయితే అలా కాళ్ళను నెట్టేయదు. భర్త గిలిగింతలు పెట్టి కవ్విస్తూ వుంటే ఎంత తమాషాగా వుంటుందో! - అనిపించేది.

ప్రస్తుతం ఏడుస్తున్న కాత్యాయనిని ఓదార్చుతూ కొచ్చుకుక్కణ్ణి, నాణీకుట్టి అన్నారు 'ఏడవకోయ్. నీకూ మంచి రోజులు వస్తాయి'.

రాత్రిపూట పనంతా అయిన తర్వాత కాత్యాయని గదిలో దీపం దగ్గర కూర్చుని ఒక ప్రత్యేకమైన పని ఆరంభించింది. పప్పువిళ్ళై జమాఖర్చు పుస్తకంలోనుంచి ఒక కాగితం చించుకుంది. ఆపెన్సిలు కూడా తీసుకుంది. రాసేందుకు ఆమెకు మాటలకేం కొరవ? బోలెడన్ని విషయాలున్నాయి. తన కఠోర జీవితంలోని కరుణ గాథలు రాసి పంపాలి.

ఈనాటివరకూ కాత్యాయని ఎవ్వరికీ ఉత్తరం ముక్క రాయలేదు. అక్షరాలన్నీ కూడా ఆమెకు పూర్తిగా రావు. వుత్తరం రాసే పద్ధతి కూడా ఆమెకు తెలియదు. అయినా రాస్తున్నది. నాలిక లేకపోతే హృదయం వుండదా? ఇలా ఒక్క వుత్తరం రాసేందుకు ఆమె ఎంతగానో ప్రయత్నించింది. పాపం ఏదో సంతోషకరమైన సందర్భంలో వుత్తరం రాయవలసిన పిల్ల ఇలాంటి విషాదకరమైన సన్నివేశంలో రాస్తున్నది.

రాయటం ఆరంభించింది.

'ప్రియా! నేనిలాగే వున్నానా అంటే నా ప్రాణాలు దక్కవు. మీకక్కడ ఎవరో ప్రియురాలు ఉన్నదని యిక్కడి వాళ్ళంతా అంటున్నారు. అయినా నా స్నేహితురాళ్ళు నాణీ, కుణ్ణి 'ఇదంతా అబద్ధం. నీకు ఏడవ వలసిన పనిలేదు' అని నాకు నచ్చ చెపుతున్నారు. నేను చాలా దిగుల్లో వున్నాను. నాకిష్టంమేమంటే..... 'ఇలా వుత్తరం పూర్తయింది. అంతా రాసింది. ఎంత రాసినా తృప్తిగా లేదు. కాగితం అయిపోయింది. పెన్సిల్లు అరిగిపోయింది. ఇంకేం చెయ్యాలి?

గదిలో వెలుతురు చూసి కుట్టిఅమ్మ మెల్లిగా వచ్చింది. తలుపు సందులోనుంచి తొంగి చూసింది. కాత్యాయని గమనించలేదు. రాయటంలో మునిగిపోయింది. బయట ఏం జరిగితే జరగనియ్, నాకెందుకు అన్నట్టు వుంది.

కుట్టిఅమ్మ లోపలికి వెళ్ళి పప్పు పిళ్ళెను పిలిచింది.

'నిద్రపోయినారా?'

పప్పుపిళ్ళె యింకా నిద్రపోలేదు. అతనికి నిద్రపట్టలేదు. ఆరోజు నిద్రపట్టేట్టుగా కూడా లేదు. ఇంత మధన అతను ఇంతవరకు అనుభవించలేదు. ఇదే మొదలు. అతను తన్నుతాను వేయి ప్రశ్నలు అడుగుతున్నాడు. తిరువనంతపురంలో నిజంగా వాడికి ప్రియురాలు వుందా? వాడు కాత్యాయనిని చూసుకుంటాడా? వాడి దాంపత్య జీవితం ఎలా వుండబోతున్నది? ఈ ప్రశ్నలన్నీ వాడినే అడిగి నిర్ణయం చేస్తే బాగుండేదని కూడా ఒక్కొక్కప్పుడు అతనికి అనిపించింది. ముందు సంగతి ఆలోచించకుండా తను ఇలా చేశాడు.

పప్పుపిళ్ళె తన తప్పు ఒప్పుకొనే ఆసామి కాడు.

'నిద్రపోలేదా?' అన్నాడు పప్పుపిళ్ళె.

'అది వుత్తరం రాస్తున్నది.'

'అయితే దాన్నికూడా పంపించు' అంటూ పప్పుపిళ్ళె అడిగాడు. 'అయితే వాడు రాడా?' అన్నదికుట్టి అమ్మ.

'వస్తాడు, తప్పక వస్తాడు' అని తనే అన్నది వెంటనే.

'వాడికి అక్కడ ఎవరయినా తగిలారంటావా?' అని అడిగాడు పప్పుపిళ్ళె.

'ఇక్కడ తెలివి తక్కువ ఆడంగులనేమాట అది' అన్నది కుట్టిఅమ్మ ఆమాటను ఖండిస్తూ.

'చాలా పొరపాటయింది' అన్నాడు పప్పుపిళ్ళె కొంచెం ఆలోచించి.

'ఏమయింది?'

'వాణ్ణి అడిగివుండవలసింది.'

'ఎందుకు? ఏం పొరపాటుండదు.'

మర్నాడు ఉదయం నాణీ కుట్టి పని పెట్టుకుని వచ్చింది. కిందటి రాత్రి ఆమె తన భర్తతో విషయమంతా చెప్పిందిట. 'మావారికి తిరువనంతపురం బాగా తెలుసు. మొదట్లో ఆయన తిరువనంతపురంలో తోటి ఉద్యోగస్థుడితో వుండేవాడు. ఆ తర్వాత అయిదారేళ్ళు హోటల్లో కూడా వున్నారు.' అని కాత్యాయనితో చెప్పింది. అక్కడ కేశవ్‌కి ఎవరయినా ప్రియురాలు వుందా లేదా అనే విషయం కావాలంటే ఆయన కనుక్కుంటారనికూడా ఆమె చెప్పింది. తను అందుకే వచ్చాననీ, కనుక్కోమంటే కనుక్కుంటారనీ, లేకుంటే లేదనీ ఆమె చెప్పింది.

కాత్యాయని యీ విషయమై ఏమీ ఆలోచించలేదు. కానీ వెంటనే సూటిగా చెప్పింది-

'అక్కర్లేదు. ఈ విషయమై ఎవ్వరూ ఏమీ కనుక్కొనేందుకు వెళ్ళనక్కరలేదు.'

అయినా యీ వైముఖ్యంలోని రహస్యం ఆమె తెలుసుకుని తీరాలి. కాని ఇలా చేయటం సరైన పనికాదని ఆమె మనస్సు చెపుతూవుంది.

## తొమ్మిది

చాలా రోజులనుంచి సచివాలయంలో ఎన్నో మార్పులు వచ్చాయి. చాలామంది సెక్రటరీలను బదిలీ చేశారు. ఒకర్ని పేష్కారుగా వేసి బయటికి పంపించారు. మరొకర్ని ముఖ్యమైన శాఖనుంచి మామూలు శాఖకు మార్చారు. సెక్రటరీ పొత్తన్‌ను అరటిపండ్లు, మిరియాలు, రోగనివారక శాఖకు మార్చి సచివాలయం నుంచి బయటికి పంపించారు. ఇంతకు ముందు చీఫ్ సెక్రటరీగా వున్న మేనోన్ సెలవులో ఉన్నాడు. కొంతమంది అసిస్టెంటు సెక్రటరీలు సెక్రటరీలయినారు. మొత్తంమీద కొత్త వ్యవస్థలో లవ్‌లింగ్ కంపెనీ గెలుస్తుందని అందరూ అనుకుంటున్నారు. కాని అక్కడ కొంతమంది తెలిసిన వాళ్ళు లవ్‌లింగ్ కంపెనీకి, చీఫ్ సెక్రటరీకి మధ్యగల పోటీ అంతరించదని భావిస్తున్నారు. నిరుద్యోగులు బస్తీలో కంట్రాక్టర్లుగా తయారయ్యారు. కొన్ని పేపర్లు కొత్త చీఫ్ సెక్రటరీని బలపరుస్తూ అతని పరిపాలనా పద్ధతిని సమర్థిస్తున్నాయి. మరికొన్ని పత్రికలు విమర్శలు బయలుదేరతీస్తున్నాయి. ఆఫీసర్లకు రాజద్రోహం మీద శిక్ష విధించబడుతుందని వినికిడిగా వుంది.

ఈ మార్పుల్లో సూపరింటెండెంటు వైయాపురి పిళ్ళెను తహసీల్దారుగా మార్చేశారు. అతనిప్పుడు మువాట్టుప్పుళ వెళ్ళాలి. ఈ విధంగా అతను సచివాలయ కక్షలను వదిలిపెట్టి విశాల జగతిలో ప్రవేశిస్తాడు. సహ్యాద్రి కొండలకింద అతను స్వచ్ఛమైన వాయువులు పీల్చుకుంటాడు. ఇంతవరకూ ఫ్యాను గాలికి అలవాటు పడ్డ ప్రాణం స్వేచ్ఛా వాయువులను ఆఘ్రాణించి ఆనందించగలదా? ఏమయినా సరే. ఆ శరీరంలో పాలిపోయిన తనం పోతుంది. ఇకమూడు సంవత్సరాలు మిగిలివున్నాయి. ఈలోగా ఒకయిల్లు కట్టించాలి. అతనితో పాటు పని చేసిన వాళ్ళు రు. 20-40 స్కేలునుంచి రు. 80 - 120లో ప్రవేశించినప్పుడు వైయ్యాపురి పిళ్ళె 100-150 స్కేల్లో పనిచేసేవాడు. 80-120 స్కేలు వాళ్ళు 150-200కు వచ్చినా వైయాపురి పిళ్ళె జీతం 150 రూపాయల దగ్గరనే వుంది. అదే అతనికి కినుక. అతనికి అసంతృప్తి కలిగించే విషయాలింకావున్నాయి. అతనితో పనిలో చేరిన ఒక వ్యక్తి యిప్పుడే పేష్కారుగా పని చేస్తున్నాడు. ఇలా ఎంతమందో వున్నత పదవులు సంపాదించారు. వైయ్యాపురి పిళ్ళె నిజాయితీగా, సక్రమంగా ఆఫీసుపని

చేస్తాడు. తనకు పైపదవి రావాలని అతను ఎన్నో అర్జీలు పెట్టాడు. నెలకోసారి చీఫ్ సెక్రటరీని కలుసుకుంటూనే వున్నాడు. వారానికోసారి గ్రహస్థితిని గురించి జ్యోతిష్కుణ్ణి అడుగుతూనే వున్నాడు. తైక్కాట్టు సుబ్రహ్మణ్య ఆలయానికి, శాస్తా దేవాలయానికి అప్పుడప్పుడూ వెళ్ళి దర్శనం చేసుకుని, దానాలు చేస్తూ వుంటాడు. ప్రస్తుతం అతనికి మంచిరోజులు రాబోతున్నాయని అతనికి ముందే తెలుసు. అందుకనే యీ పెద్ద వుద్యోగం వచ్చింది.

ఇంతదూరం మువాట్టుపుళకు అతన్ని మార్చేందుకు ప్రత్యేకమైన కారణం వుంది. అక్కడికి మార్పు కావాలనుకున్న వాళ్ళు ఆఫీసులో ముగ్గురు. అక్కడికి మార్పు రావటం తన అదృష్టానికి తొలి నిదర్శనమని వైయ్యాపురి పిళ్ళై నమ్మకం. మువాట్టుపుప్పిళ అరణ్య ప్రదేశాన్ని సర్వేచేయించాలని ప్రభుత్వం నిశ్చయించుకుంది. అది మంచి పని. కొట్టాయం పేష్కారు వైయ్యాపురిపిళ్ళైతో కలిసి అతని పక్కన కూర్చుని పని చేశాడు. ఈ మూడు సంవత్సరాల్లో వైయాపురిపిళ్ళై తప్పకుండా ఒకయిల్లు కట్టు కుంటాడు.

ఈ మధ్యనే పార్క్‌వ్యూలో వ్యక్తిగతమైన పదవుల్లో నియామకం జరిగింది. కేశవపిళ్ళైను 40-80 రూపాయల స్కేల్లో నియమించారు. ఇప్పుడు వస్తున్న జీతానికి రెట్టింపు.

ఆరోజు సచివాలయంలో కేశవపిళ్ళై ప్రసిద్ధికెక్కాడు. చాలామందికి అతనెవరో తెలియదు. అలాంటి వాళ్ళంతా అతన్ని తెలుసుకుని పరిచయం చేసుకున్నారు. హరిహరఅయ్యరుకూ, గోవిందన్ నాయరుకూ, ప్రభాకరన్ నాయరుకూ అతని ప్రొమోషన్ను గురించి ముందే తెలుసు. అయినా వాళ్ళకు ఒక విషయం చెప్పాలనిపించింది. గోవిందన్ నాయర్ అన్నాడు- 'నీవు చాలా కాలాంతకుడివోయ్. ఏమీ ప్రయత్నం చెయ్యకుండానే ప్రొమోషన్ తెచ్చుకున్నావు. మిగిలిన వాళ్ళు చేసిన ప్రయత్నాలన్నీ వనికి రాకుండా పోయినాయి. ఒకచోట పని చేస్తున్నా మాకు తెలియను గూడా తెలియలేదు.'

హరిహర అయ్యర్ అన్నాడు. 'చూడు, పిళ్ళై! నేను నామాటల్ని ఉపసంహరించుకుంటున్నాను. దగ్గర దగ్గర కుర్చీల్లో కూర్చుని వుంటే బాగాలేదు. ఇప్పుడు బాగుంది. మీరిద్దరూ సుఖంగా వుండండి. ఇది బ్రాహ్మణాశీర్వాదం.'

హరిహర అయ్యర్ తాంబూలపు చారలతో గారపట్టిన పళ్ళు ఇకిలించి నవ్వాడు.

పెళ్ళి పీటలమీద కూర్చున్న పిల్లలాగా తంకమ్మ తలవంచుకుని కేశవపిళ్ళై వైపు క్రీగంటితో చూసింది. కేశవపిళ్ళై కృత్రిమంగా నవ్వాడు.

స్వామి చాలా మర్యాదగా తంకమ్మతో అన్నాడు 'అటు చూడు తంకమ్మా! ఆ కుర్చీలో నీవిక ఒంటరిగా కూర్చోవాలి. పిళ్ళై పక్కన కూర్చోలేదే అని విచారించకు. సంస్కృతంలో దీన్నే 'విరహం' అంటారు, 'విరహం'. ఆఫీసు

పని మెలకువతో జాగ్రత్తగా చెయ్యాలి. ఊరికే కూర్చోవద్దు. అంతే నేను చెప్పేది.'

స్వామి మళ్ళీ నవ్వాడు.

కేశవపిళ్ళైకు ఆచిన్న శాఖ నుంచి ఘనమైన వీడ్కోలు ఇయ్యాలని స్వామి తన అభిప్రాయం చెప్పాడు. అందరూ ఒప్పుకున్నారు. స్వామి మళ్ళీ అన్నాడు.

'కేశవపిళ్ళైకు ఇంతకంటె ఘనమైన వీడ్కోలు ముందుముందు జరుగుతుంది. అందులో సందేహంలేదు. కాని వీడ్కోలిచ్చే తొలి అవకాశం మనకు దొరకాలి. కేశవపిళ్ళై! గుర్తుంచుకో. ఇలాగే వృద్ధికి వచ్చి ఒకనాడు సెక్రటరీవవుతావు. అప్పుడు మమ్మల్ని గుర్తుంచుకోవాలి. విన్నావా కేశవపిళ్ళై? విన్నావా తంకమ్మా నీవు కూడా?'

గోవిందన్ నాయర్ హరిహర అయ్యర్ని అడిగాడు 'ఆ నాటికి కూడా స్వామి ఇక్కడే కూర్చుని పని చేస్తుంటాడా? మీకు పెన్షను రాదూ అప్పటికి?'

అంతా తెలిసినట్టే స్వామి అన్నాడు 'నీకేం తెలుసునోయ్ గోవిందన్ నాయర్? ఇంకెన్నాళ్ళో పట్టదు. కేశవపిళ్ళై సెక్రటరీ అవటం, నేను రిటైరవటం ఒకేసారి జరుగుతాయి.'

స్వామి కేశవపిళ్ళైను అభినందించాడు. 'పిళ్ళై తెలివితేటలు, అదృష్టం మా కెంతో తృప్తికరంగా వుంటాయి.'

ఆ సమయంలోనే మాతేవన్ పిళ్ళై అక్కడికి వచ్చాడు. అతను పిళ్ళైను ఏదయినా 'ఈనాం' ఇయ్యరా అని అడిగాడు.

'ఏం కావాలోయ్ నీకు?' అని అడిగాడు కేశవపిళ్ళై.

మాతేవన్ పిళ్ళై హరిహరఅయ్యర్ వైపు తిరిగి అన్నాడు 'ఈరోజు మాతేవన్ పిళ్ళైమీద ఎంత అభిమానమో చూశారా? రేపు పార్కువ్యూలో, ఎల్లుండి భక్తివిలాస్‌లో ప్రవేశించిన తర్వాత?'

'అప్పుడేమవుతుంది మాతేవన్‌పిళ్ళై?' అని అడిగాడు హరిహర అయ్యర్.

'అప్పుడు మాతేవన్‌పిళ్ళై తెలివితక్కువ దద్దమ్మ అవుతాడు.' మాతేవన్ పిళ్ళై అన్నాడు.

కేశవపిళ్ళై ఏమీ మాట్లాడలేదు. అతను కృత్రిమంగా నవ్వుతున్నాడు. అతను ఏపదవిలో ఎక్కడవున్నా అతనిలో మార్పు రాదని మాట సామెతకయినా చెప్పటం మర్యాదగదా? కాని అతను చెప్పలేదు. అతనికి మర్యాద తెలియకనా?

'అవును, అలాగే వుండాలి. రేపు మనం ఏ పదవిలో వుంటామో తెలియదు. కాబట్టి నోరు తెరిచి ఏమీ చెప్పక పోవటమే మంచిది.' అన్నాడు హరిహరఅయ్యర్.

ఆరోజు డిపార్టుమెంటులో ఒక చిన్న టీపార్టీ జరిగింది. ఆతర్వాత కేశవపిళ్ళె సెలవు తీసుకునేందుకు సూపరింటెండెంటు గారి యింటికి వెళ్ళాడు. మొట్టమొదటి సారి వైయ్యాపురిపిళ్ళె అనాడు ప్రసన్నవదనంతో కనిపించాడు. ఆయన కేశవపిళ్ళె దగ్గరికి వెళ్ళి కరచాలనం చేసి అన్నాడు.'

'ఆరోజు నిన్ను చూడగానే అనుకున్నాను - నీవు వృద్ధిలోకి వస్తావని. అది నీ లలాటంలో లిఖించివుంది. సాముద్రికశాస్త్రం అదే చెపుతుంది.'

వైయ్యాపురిపిళ్ళె కేశవపిళ్ళెను కూర్చోమన్నాడు. అతను కూర్చోలేదు. ఆయన బలవంతంగా కూర్చోబెట్టాడు. అయినా అతను సరిగ్గా కూర్చోలేదు.

'నీ నక్షత్రమేమిటోయ్?' అన్నాడు వైయ్యాపురి పిళ్ళె.

'రేవతి.'

సూపరిటెండెంటు ఏదో లెక్కవేసి మంచి రోజులు చెడ్డరోజులు చెప్పాడు.

'శుక్రమహాదశ జరుతున్నది. అంతమంచిదని చెప్పేందుకు వీల్లేదు. కాని ముందుముందు మంచి రోజులు వస్తాయి...

ఇప్పుడు వివాహం కూడా అవుతుంది' అన్నాడు నవ్వుతూ.

కొంచెం సేపాగి వైయ్యాపురిపిళ్ళె మళ్ళీ అన్నాడు 'భార్య వచ్చిన తర్వాత నీకు అదృష్టం కలిసి వస్తుంది. అందులో సందేహంలేదు. పిల్ల చాలా అదృష్టవంతురాలవుతుంది.'

తంకమ్మను ఉద్దేశించే వైయ్యాపురిపిళ్ళె యీ మాట అంటున్నాడని కేశవపిళ్ళెకు అనిపించింది. కాని మరుక్షణమే కిట్టుమామ చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది.

'ఆ అమ్మాయి అదృష్టవంతురాలు.'

'నీ దగ్గర జాతకముందా?' అడిగాడు సూపరింటెండెంటు.

'పల్లెటూరిలో జ్యోతిష్కుడు రాసిన జాతకం ఒకటి వుంది. కాని నాదగ్గర లేదు.'

వైయ్యాపురిపిళ్ళె చాలా గంభీరంగా అన్నాడు. 'అది చాలదు. జన్మకుండలి వుండాలి. సమగ్రమైన జన్మకుండలి. పులిమూటలో ఒక జ్యోతిష్కుడు వున్నాడు. ఆయన చాలా తెలివి గలవాడు. ఆయన చేత ఒక జన్మకుండలి రాయించాలి. దానిప్రకారం నడుచుకోవాలి. చీఫ్ సెక్రటరీకి ప్రామోషన్ ఎప్పుడు వచ్చేదీ తారీఖుతో సహా ఆయన చెప్పాడు.'

ఆయన చేత జాతకం రాయించుకునేందుకు కేశవపిళ్ళె ఒప్పుకున్నాడు.

'కేశవపిళ్ళెకు అధి దేవత శని. అయ్యప్పన్‌ను విధిపూర్వకంగా సేవించాలి. చీఫ్ సెక్రటరీకి ప్రామోషన్ ఎలా వచ్చిందో తెలుసా? శని దేవతను సేవించినందువల్ల. ఇప్పుడు దివాన్ గారికి కూడా దీనిమీద నమ్మకం కుదిరింది.'

ఆ తర్వాత ప్రభుత్వోద్యోగం ఎలా చెయ్యాలో వైయ్యాపురిపిళ్ళై ఉపదేశించాడు.

సెలవు తీసుకునేందుకు కేశవపిళ్ళై లేచాడు. కాని సూపరింటెండెంటు అతనికేదో చెప్పాలనుకుంటున్నాడు.

'కేశవపిళ్ళై! నేను చాలా దురదృష్టవంతుణ్ణి. ఇక నాలుగయిదేండ్లు ఉద్యోగం చేసేందుకు మిగిలివున్నాయి. పద్ధెనిమిదేండ్ల వయస్సులో పని ప్రారంభించాను. స్వయంకృషితో పైకివచ్చాను. నా విషయంలో ఎప్పుడయినా ఏదన్నా కాగితం అక్కడికి వస్తే కొంచెం కనిపెట్టివుండు.'

ఆ కాగితాలను గురించి సూపరింటెండెంటు విశదంగా కేశవపిళ్ళైకు చెప్పాడు-

'కేశవపిళ్ళై! రోజులు చాలా చెడ్డవి. ఇది అధికారులను విరోధించే కాలం. ఈ రోజుల్లో నాయకులు విజృంభించి వున్నారు. రాజులన్నా, చక్రవర్తులన్నా వాళ్ళకేమీ గౌరవంలేదు. ఆతర్వాత తహసీల్దార్లు వుండనే వున్నారు. వాళ్ళు అకారణంగా లేనిపోని గొడవలు లేవదీస్తారు. చీఫ్ సెక్రటరీ దగ్గర మనవాడొకడున్నాడని నాకు చాలా ధైర్యంగా వుంది. ముఖ్యంగా ముఖ్యపట్టణానికి దూరంగా వున్నప్పుడు. ఆసంగతి కేశవపిళ్ళైకు ఇప్పుడే బోధపడదు.

అందరిలా సూపరింటెండెంటు కూడా, తను పేష్కారవుతాడని చెప్పాడు.

కేశవపిళ్ళై సెలవు తీసుకొని వెళ్ళాడు. దారిలో అతనికి ఎన్నో విషయాలు గుర్తుకు వచ్చాయి. ఇంటికి వెళ్ళేసరికి అక్కడ అతని కోసరం చాలామంది ఎదురుచూస్తూ వున్నారు. సెక్రటరీ పదవి కూడా అడుగు దూరంలో వుంది. అతని మనస్సు స్థిమితంగా లేదు. ఇంకెవ్వరూ ఆమాట అనకుండా వుంటే బాగుండునని అనుకున్నాడు కేశవపిళ్ళై. ఆపదవికి తను తగినవాడినేనా అనికూడా అతనికే అనుమానం వేసింది. అతని శక్తి అతనికి అతీతమైపోతున్నట్లు అతనికి తోచింది.

పద్మనాభ్ పణిక్కర్ సూటిగా ప్రశ్న వేశాడు:

'వివాహం నిశ్చయమయిందా?'

ఇంతగా హృదయాన్ని కదిలించే ప్రశ్న యింతవరకూ ఎవ్వరూ వెయ్యలేదు. పద్మనాభ్ పణిక్కర్ వేసిన ప్రశ్న విషపూరితమయింది. అతను కూడా పార్కువ్యూలో ప్రవేశించేందుకు ప్రయత్నించాడు. కాని సాధించలేక పోయాడు. దానికి ప్రతీకారంగా ఈప్రశ్న వేశాడు.

కేశవపిళ్ళై ఏమీ సమాధానం చెప్పలేదు. కొచ్చుణ్ణి నాయర్ హెచ్చరిక చేశాడు 'జాగ్రత్తగా వుండాలోయ్. అక్కడ సరిగా పనిచెయ్యకపోతే ప్రమాదం వస్తుంది. పెద్ద వాళ్ళ మధ్య పని చెయ్యాలి. పై అధికారికి ఎప్పుడు కోపం వస్తుందో చెప్పలేం.'

ఇందుకు సమాధానం పద్మనాభ్ పణిక్కర్ చెప్పాడు 'కేశవపిళ్ళకు భయపడవలసిన పనిలేదు. అతను చీఫ్ సెక్రటరీకి బంధువు కదా?'

కొచ్చుణ్ణి నాయర్‌కు ఆవిషయంలో నమ్మకం లేదు. 'ఈ ఆఫీసర్ల సంగతి మనకు తెలియదుటోయ్, పణిక్కర్? వాళ్ళకు అయిన వాళ్ళెవరు? కానివాళ్ళెవరూ?' అన్నాడు.

అంతావిని ఉణ్ణి తన అభిప్రాయం చెప్పాడు 'కేశవపిళ్ళ పార్కువ్యూలో చేరక మునుపే మౌనంగా వుండటం అలవాటు చేసుకున్నాడు.'

'అవును, ముందే అన్ని మెలకువలూ అలవరచుకున్న వ్యక్తి' అన్నాడు పణిక్కర్.

ఒక్కరోజులో సహచరులలో వచ్చిన మార్పును కేశవపిళ్ళ గమనించాడు. అక్కడి వాళ్ళే కాదు, అందరిలో మార్పు వచ్చింది. ఇంతవరకూ కలిసిమెలిసి కాలక్షేపం చేసిన వాళ్ళ మధ్య అతను ఒంటరి వాడయినాడు. అతను పై అంతస్తులో ప్రవేశించాడని అందరూ అనుకుంటున్నారు. అక్కడ అతని తోటి వాళ్ళెవ్వరూ లేరు.

జీతం నలభైరూపాయలు చేశారని మాత్రమే యింటికి రాశాడు. ఎక్కడ ఎలా అనే సంగతి తల్లి దండ్రులకు తెలియదు.

జ్యోతిష్కుణ్ణి కలుసుకుని కొత్తపనిలో ప్రవేశించేందుకు మంచి గడియలు చూసుకున్నాడు. ఆ జ్యోతిష్కుడు గూడా కళత్రస్థానం చాలా బాగున్నదని చెప్పాడు. ఆస్థానంలో ఎవరు కూర్చుంటారో? కాత్యాయనే? తంకమ్మో?

ఆ రోజు రాత్రి ప్రేయసీ ప్రియులు సంకేత స్థలంలో రహస్యంగా కలుసుకున్నారు. ఆరోజు తంకమ్మలో ఎప్పుడూ లేని ఉత్సాహం, ఆవేశం కనిపించాయి. కేశవపిళ్ళ మాత్రం చాలా అలిసిపోయి వున్నాడు. అతనిలో తేజస్సే గాదు, ఓజస్సు కూడా దిగజారిపోయింది. జవసత్వాలు లేని చవటలాగా తంకమ్మ చేతుల్లో చిక్కుకున్నాడు.

'ఏమిటిది?' అని అడిగింది ఆమె కొంచెం కోపంగా.

తన శక్తి క్షీణించిపోతున్నదని అతను కథ చెప్పటం మొదలుపెట్టాడు. చాలా త్వరగా పైపదవికి వచ్చాడని అందరూ ఉప్పతిస్తున్నారు. కేశవపిళ్ళకు ఏదో కంగారు, భయం, త్రొటుపాటుగా వుంది.

అతన్ని తన భోగ సామాగ్రిగా భావిస్తున్న తంకమ్మ అన్నది - 'అయితే..... మరి..... నాకు నా పాత గుమాస్తాయే కావాలి. నాపాత క్లర్కులో జీవం వుంది. నాకు నా పాత గుమాస్తాయే కావాలి.'

తంకమ్మ సాభిప్రాయంగానే యీ మాట అంటున్నదని కేశవపిళ్ళకు అనిపించింది. మళ్ళీ ఆమె తనను క్లర్కుగా మార్చినా మార్చవచ్చు.

కేశవపిళ్ళ ఏదో సమాధానం చెప్పాడు. కాని తంకమ్మ దాన్ని వినిపించుకోలేదు. వినపడనట్టుగా నటించింది. కేశవపిళ్ళ ఇంత వికారంగా

ఆవేశంతో తంకమ్మను ముందెప్పుడూ చూడలేదు. ఆమె, అమానుష శక్తి ఆవేశించిన రాక్షసిలా మారిపోయింది. ఆమె ఎముకలు నిక్కబొడుచుకున్నాయి. కేశవపిళ్ళై ఆమెకు సరితూగలేక పోయాడు.

ప్రతిరోజూ విడిపోయే వేళకు ముందే ఆరోజు తంకమ్మ ఆ వికారస్థితిలోనే కేశవపిళ్ళైను పంపించేసింది. 'వెళ్ళిపో' - అని నెట్టినట్టుగా అతనికి అనిపించింది. 'పనికి రాని పిరికిపందవు వెళ్ళిపొమ్మ'ని అన్నట్టు తోచింది.

నీరసించిన శరీరంతో, హృదయంతో చిరుచెమటలు పడుతూ ఆ రోజు కేశవపిళ్ళై తిరిగి వచ్చాడు. ఇంత కంగారు అతను ఏ రాత్రీ పడలేదు. ఆనాటి అభినందనల ఆనందమంతా అడుగంటిపోయింది. తనకు తగని పదవి వచ్చిందని అతను గాబారాపడుతున్నాడు. 'ఏం చేద్దాం?' అని ఆలోచించాడు. ఈ కంగారుకు కారణం అసమర్ధత. ఈపదవి కూడా వుంటుందో వూడుతుందో అని ఒక మూలన అతనికి భయం కూడా వేస్తున్నది.' నాకు నా పాత గుమాస్తా కావాలి' అన్న తంకమ్మ మాటలు అతనికి మాటిమాటికీ గుర్తు వస్తున్నాయి.

నిజానికి కేశవపిళ్ళై తంకమ్మ విశ్వరూపాన్ని చూశాడు. ఆమె ఇంత భయంకరంగా వుండగలదని అతను ఎప్పుడూ ఊహించనుగూడా లేదు. అతనికి భయం వేసింది. ఆమె యింతకంటెకూడా భయంకరమైన రాక్షసిగా మారవచ్చుననిపించిందతనికి. అసంతృప్తితో ఆమె రేపు ఏం చేసినా చెయ్యవచ్చు.

అంతకు ముందు రోజు లభించిన అభినందనలన్నీ ముందు ముందు నిరుపయోగమయిపోతాయి! అతను సచివాలయంలో యథాప్రకారం ఇరవైరూపాయల గుమాస్తాగా పాతకుర్చీలో కూర్చుంటాడు. దానికంతా తంకమ్మ కారణమవుతుంది. ఆమెకు పాత గుమాస్తా కావాలి. తెప్పించుకుంటుంది. కాని ఆ పాత గుమాస్తా ఆమెకు దక్కడు.

ఊళ్లో, ఇంట్లో పెళ్ళి చేసుకుని కూడా తొలి రాత్రికి నోచుకోని ఆపిల్ల! ఇప్పుడు బోర్ల పండుకుని యేడుస్తూ వుంటుంది. కాదు, పగలంతా పనిచేసి అలిసిపోయి పడుకుని వుంటుంది. కాని మంచంమీద ఒంటరిగా పడుకుని వేడినిట్టూర్పు విడుస్తూ వుంటుంది. ఆమె కంట తడి పెట్టుకుంటూ వుంటుంది. ఆవేడి నిట్టూర్పు ప్రేమకు చిహ్నం కాదు. ఆవెచ్చని కన్నీరు స్త్రీకి జరిగిన అవమానానికి నిదర్శనం. ఆమెకు కావలసింది మెడకు దారం కట్టేవాడు కాదు. అంతే. ఆమె శాపం వల్లనే యిక్కడా ఇలా అయిందని అతనికి అనుమానం వేసింది. కాళికాదేవి కఠోరబంధంలో అతను చిక్కుకున్నాడు. అతని యెముకలు కొరుకుతున్నాయి. ఒళ్ళంతా విపరీతంగా నొప్పులుగా వున్నాయి.

ఆమె అందమైనదే. అందులో సందేహం లేదు. ఒక దృష్టితో చూస్తే వినయవిధేయతలతో మర్యాదగా మసలే మంచితనం, అందం కనిపిస్తాయి. మరోదృష్టితో చూస్తే కళ్ళల్లో నిప్పులు కురుస్తూ వుంటాయి. ఇంత

భయంకరమైన సర్పం అంత అందంగా అమాయకంగా కనిపించవచ్చునని అతననుకోలేదు. చాలా రోజుల క్రితం అతను ఆ పిల్లను తన స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నించిన మాట గుర్తు తెచ్చుకొని అతను నివ్వెరపోయాడు. ఆమెలో ఇంత సామర్థ్యం ఎలా వచ్చిందని అతను ఆలోచించాడు. ముందుముందు కూడా ఇంత సామర్థ్యం వుంటే తను ఓడి పోవటం ఖాయమని అతనికి తోచింది.

ఒకవేళ అదేజరిగితే? అతని చెవుల్లో కిట్టుమామ మాటలు వినబడ్డాయి. ఆతర్వాత సూపరింటెండెంటూ, జ్యోతిష్కుడూ కళత్ర స్థానాన్ని గురించి చెప్పిన గుణ గణాలను వల్లె వేసుకున్నాడు. వెళ్ళిన వరకూ వెళ్ళనీ, దారిలో జీవితనౌక మునిగిపోతే, పోనీ.

తంకమ్మతోటి సంబంధం ఒక సమస్యగా మారవచ్చునని అతనికి భయం వేసింది. కాని ఆమె వికారపు కోరికలను తీర్చగలననే నమ్మకం అతనికి లేదు. అప్పుడామెకు ఏవగింపు వేస్తుంది. అది తన జీవితంలో ఎలా పరిణమిస్తుందో?

ఏది ఎలాగయినా, ఇవ్వాళకాకుంటే రేపయినా యధార్థం అందరికీ తెలియకపోదని అతనికి పూర్తిగా నమ్మకంవుంది. అప్పుడు కలిగే ఏవగింపు చాలా తీవ్రరూపం దాల్చుతుంది. అది జీవితంలో పెద్ద అంతరాయం అవుతుంది. దాన్ని ఎదుర్కొని తీరాలి.

మర్నాడు ఉదయం పదకొండు గంటలకు కొత్త పనిలో ప్రవేశించబోతున్నాడు. ఇక ఉదయం తంకమ్మను కలుసుకునేందుకు వీలుండదు. ఒకవేళ ఆమె ఇక తన ముఖం చూడగూడదనుకున్నదేమో? ఆరోజు ఆమె వైఖరి అలాగే వుంది. అందులో కేశవపిళ్ళైకు ఏమీ అనుమానం లేదు. ఆమె తనని వదిలేస్తే తన భవిష్యత్తు ఎలా వుంటుందని అతను ఆలోచించాడు. ఒకవిధంగా చూస్తే మేలు, మరోవిధంగా చూస్తే ముప్పు.

అయినా కేశవపిళ్ళై తన అదృష్టంమీద ఆశలు పెట్టికొని వున్నాడు. జరగవలసింది జరిగితీరుతుంది. అదృష్టముంటే అన్నీ సక్రమంగానే జరుగుతాయి.

## పది

పార్క్‌వ్యూ ఉద్యోగంలో ప్రవేశించగానే కేశవపిళ్ళై ఒక దైవకార్యం నిర్వహించవలసివచ్చింది. చీఫ్ సెక్రటరీ, అయ్యప్పన్ ఆలయంలో పూమాల సేవ చేయిస్తున్నారు. అందుకు కావలసిన పూలన్నీ చెంకొట్ట నుంచి రావాలి. చెంకొట్ట తహసీల్దారుకు పూలు సేకరించవలసిందని యింతకు ముందే రాయటం జరిగింది. అది కొచ్చమ్మ చేసిన ఉత్తర్వు. పూమాల సేవ శోభాయమానంగా జరిగింది. దీని బాధ్యత సమస్తం కేశవపిళ్ళైదే. అప్రయత్నంగా తనకి అవకాశం లభించిందని కేశవపిళ్ళై అనుకున్నాడు.

పూమాల సేవ రోజు దివాన్‌జీ, ఆయన ప్రైవేట్ సెక్రటరీ, మహారాజాగారి సెక్రటరీ మొదలయిన వాళ్ళందరూ వచ్చారు. వాళ్ళందరినీ కలుసుకునే అవకాశం కేశవపిళ్ళైకు లభించింది. అలాంటి వాళ్ళతో పరిచయం సామాన్యమైన విషయం కాదు. పణిక్కర్, కొచ్చుణ్ణి నాయర్, గోవిందన్ నాయర్ ఈ దృశ్యాన్ని దూరం నుంచి చూస్తున్నారు. వాళ్ళకు కేశవపిళ్ళైను చూసి తప్పకుండా అసూయ ఏర్పడి వుంటుంది. పనిలో మునిగి వుండటంవల్ల కేశవపిళ్ళై వాళ్ళదగ్గరికి వెళ్ళి క్షేమ సమాచారాలు అడగలేకపోయినాడు. వాళ్ళు కొంచెం అపార్థం చేసుకుని వుంటారు.

ఆరాత్రి తంకమ్మను కలుసుకున్న తర్వాత కేశవపిళ్ళై మళ్ళీ ఆమెని కలుసుకోలేక పోయాడు. పూమాల సేవతో అతనికి తీరలేదు. తంకమ్మ ఆలయంలో వున్నట్టు కేశవపిళ్ళై చూశాడు. ఆమె కొచ్చమ్మ వెనకనే నిలుచుని వుంది. కేశవపిళ్ళై కొంచెం కంగారుతో తంకమ్మవైపు చూశాడు. ఆమె కొచ్చమ్మకు అంతా చెప్పేస్తుందని అతనికి భయం వేసింది.

పూమాలసేవ అయిపోయిన తర్వాత చీఫ్ సెక్రటరీ, ఆయన భార్య వెళ్ళిపోయారు. తర్వాత కేశవపిళ్ళై తంకమ్మ దగ్గరకు వెళ్ళాడు. ఏమీ కానట్టే ఆమె నవ్వింది. కేశవపిళ్ళై క్షమాపణ కోరుకున్నట్టుగా అన్నాడు – 'చెంకొట్ట వెళ్ళి పూలు తేవలసి వచ్చింది. తీరుబడి లేకపోయింది.'

కేశవపిళ్ళైకి ఆమె కళ్ళల్లో అగ్ని కనిపించింది. ఆమెను చూస్తేనే భయం వేసింది. తంకమ్మ అడిగింది– 'ఈరోజు?'

'కాదు, రేపు' అన్నాడు కేశవపిళ్ళై వెంటనే.

'రేపు' అనే మాట అతని నోట వచ్చే సమయంలో అతనికి మరి రెండు రోజులు వాయిదా వేస్తే బాగా వుండేదనిపించింది.

చీఫ్ సెక్రటరీ, ఆయన భార్య కేశవపిళ్ళైను అభినందించారు. కైంకర్యం చాలా ఘనంగా జరిగింది. పాయసం బాగా కుదిరింది. కర్మకాండ కూడా చాలా సక్రమంగా జరిగింది.

ఆరోజు కేశవపిళ్ళైకు చాలా ఉత్సాహంగా వుంది. మర్నాడు రాత్రి అతను తంకమ్మను కలుసుకున్నాడు. ఆమెను ఎలాగయినా సరే వశపరుచుకోవాలి. ఆమెకు ఏవగింపు కలిగించటం తెలివితక్కువపని.

పార్క్‌వ్యూలో పని చేయటం చాలా కష్టం. ప్రభుత్వోద్యోగిలాగా పదకొండు గంటలకు పనికి వెళ్ళి సరిగ్గా అయిదు గంటలకు తిరిగి వచ్చేస్తే చాలదు. ఆరు గంటలకు మళ్ళీ వెళ్ళాలి. తిరిగి రాత్రి రెండు గంటల్లోగా రావటం సామాన్యంగా సాధ్యంకాదు. కేశవపిళ్ళై, దగ్గర హొటల్లో చేరాడు. ఇప్పుడతను పార్క్‌వ్యూలో పని చేస్తున్నాడు. కాబట్టి తక్కువధర లుంగీ వేసుకునేందుకు వీల్లేదు. కేశవపిళ్ళైకు ఒక విషయం కలిసి వచ్చింది. పార్క్‌వ్యూకు

సంబంధించిన టోకు వ్యాపారి అతనికి మేలు రకంవి ఆరు బుష్ షర్టులు, ఆరు లుంగీలు ఇచ్చాడు. వాటి ధర చెల్లించవలసిన అవసరం లేకపోయింది.

భక్తివిలాస్‌లో, రాజభవనంలో అతనికి అందరూ పరిచయమైనారు. సెక్రటరీలందరితో కూడా పరిచయం ఏర్పడ్డది. ఈ పరిచయాన్ని వాళ్ళు ప్రకటిస్తుంటారు కూడా. ఒకరోజు రామచంద్రన్ నాయర్ పార్క్‌వ్యూకి వచ్చాడు. రామచంద్రన్ నాయర్ ప్రస్తుతం వైయ్యాపురిపిళ్ళై స్థానంలో సూపరింటెండెంటుగా పని చేస్తున్నాడు. కేశవపిళ్ళై తన పైఅధికారిని గౌరవించినట్టు అతనితో వ్యవహరించాడు. దానితో రామచంద్రన్ నాయర్ అన్నాడు: 'ఎందుకోయ్ పరిహాసం. ఏమీ లేకపోయినా యిద్దరం కలిసి చదువుకున్నాం కదా!'

అంతవరకు బాగానే వుంది. అసలు రామచంద్రన్ నాయర్ తన మామగారి పని సానుకూలం చేసుకునేందుకు వచ్చాడు. ఆ పని తొందరగా నెరవేరేందుకు కేశవపిళ్ళై సహాయం అవసరం. ఇది చాలా తృప్తికరమైన సన్నివేశం.

కేశవపిళ్ళై కేవలం ఇంటిపనే కాదు, ఆఫీసు పనికూడా చెయ్యాలి. చీఫ్ సెక్రటరీ దగ్గరికి పార్క్‌వ్యూలో వచ్చే ఫైళ్ళన్నీ అతనే తీసుకెళ్ళాలి. గాడిదలా వాటిని మొయ్యటమే కాదు, వాటిని జాగ్రత్తగా పరిశీలించాలి. ఏదయినా సందేహంవచ్చి అడిగితే సమాధానం చెప్పే సామర్థ్యం వుండాలి.

ఒక నెలపాటు కేశవపిళ్ళై ఎలాంటి మనిషి అని పరిశీలించేందుకు కొచ్చమ్మ, చీఫ్ సెక్రటరీ అతన్ని జాగ్రత్తగా గమనించారు. కేశవపిళ్ళైకు ఈ విషయం తెలిసి జాగ్రత్తగా, మెలకువగా ప్రవర్తించాడు.

ఆ నెలరోజుల్లో కేశవపిళ్ళైకు కూడా చాలా విషయాలు అర్థమయినాయి. లవలింగ్ కంపెనీ ప్రతినిధులు నాలుగుసార్లు అక్కడికి వచ్చారు. ఒక గొప్ప ధనికుడు కొండలెక్కల కోసరం అక్కడికి వచ్చాడు. అతను వెళ్ళిపోయిన తర్వాత కొచ్చమ్మ కేశవపిళ్ళైను పిలిచి అయ్యగారు వచ్చేలోగా వాళ్ళఫైళ్ళు ఆయన టేబిలుమీద పెట్టివుంచమని చెప్పింది. 'ఆ ఫైళ్ళు టేబిలుమీద పెట్టి వుంచితే అయ్యగారు కోప్పడరు, భయపడనక్కరలేదు' అని కూడా చెప్పింది.

అతనలాగే చేశాడు. ఫైలు పెట్టేటప్పుడు అయ్యగారు 'ఊఁ, ఊఁ,' అని ఊరుకున్నారు. కేశవపిళ్ళై భయంతో వణికిపోతున్నాడు. కాని యింతలో కొచ్చమ్మ అక్కడికి వచ్చింది. ఒక బస్సు యజమాని కానుకగా యిచ్చిన కారులో చీఫ్ సెక్రటరీ షికారు చేస్తాడు. ఒక ముఖ్యమైన రోడ్డు మీద కేవలం అతని బస్సే నడుస్తుంది. అలా ప్రకటన జరిగింది.

అతను మరో విషయం గమనించాడు. పగలు రెండు గంటలకు దివాన్‌జీ ప్రైవేట్ సెక్రటరీ తరుచుగా అక్కడికి వస్తుంటారు. అయ్యగారితో పాటు చేసే షికారును గురించి మాత్రం అతనికి తెలీదు. తెలిసింది కూడా చూసింది చూసినట్టు చెప్పడు.

నెలరోజులు గడిచినా శేఖర్‌పిళ్ళై గానీ, తంకమ్మ గానీ అతని కక్కడ కనిపించలేదు. శేఖర్‌పిళ్ళై చీఫ్ సెక్రటరీకి తోడపుట్టినఅన్న. అందువల్ల అతనికి ఆశ్చర్యమయింది. ఈ బాంధవ్యంలో ఏదో గొడవ వుందని అతనికి అనుమానం వేసింది.

ఒకరోజు మధ్యాహ్నం వంటవాడు వచ్చి కొచ్చమ్మ పిలుస్తున్నదని చెప్పాడు. కొచ్చమ్మ వాలు కుర్చీమీద కూర్చుని వున్నది.

'నీ పెళ్ళి విషయంలో ఏం మాటలు జరిగాయి?' అని ఆమె అడిగింది.

ఒక్క క్షణం కేశవపిళ్ళై కంగారు పడ్డాడు. ఏం సమాధానం చెప్పాలో అతనికి తోచలేదు. కాని జవాబు చెప్పితీరాలి.

'ఏం మాటలు జరగలేదు.'

'ఇక్కడికి వచ్చేముందే అంతా నిశ్చయమయిందటగా?'

'లేదు.'

'ఓహో! పెళ్ళి నిశ్చయం కాకముందే తమ్ముడికి సిఫారస్ చేశారా?'

ఆప్రశ్నలో కేశవపిళ్ళై మీద కొచ్చమ్మ జాలి పడుతున్నట్టు ఆమె స్వరభావాలు తెలియపరుస్తున్నాయి.

కేశవపిళ్ళై ఏమీ మాట్లాడలేదు.

'నీవు పెళ్ళి చేసుకుంటానని మాటయిచ్చావా?' అని అడిగింది కొచ్చమ్మ.

దానికి సమాధానం కేశవపిళ్ళై చెప్పగలడు. కాని సమాధానం దేనికి దారితీస్తుందో అతను చెప్పలేడు. అసలు విషయం తెలుసుకునేందుకే అడుగుతున్నదా? ఏమయినా, తంకమ్మ యీమె భర్త సోదరుని కూతురు. రక్తసంబంధం ఎటూ వుంటుంది. అతను నిజం చెపుతాడో అబద్ధం చెపుతాడో తెలుసుకునేందుకు అలా గొంతు మార్చి అడుగుతుండవచ్చు.

'ఈ రోజు వరకు ఏమీ చెప్పలేదు' అన్నాడు.

'వాళ్ళ నాన్న నిన్ను అడగటం కాని నీవు అతనికి సమాధానం చెప్పటం కాని జరగలేదా?'

'లేదు.' స్పష్టంగా చెప్పాడు కేశవపిళ్ళై.

కొచ్చమ్మ కొంచెం సేపు మాట్లాడలేదు. ఆమె యింకా యేదో చెప్పాలనుకుంటున్నదనేది మాత్రం స్పష్టం.

కొచ్చమ్మ శుష్క కంఠంతో అన్నది 'కేశవపిళ్ళై! వాళ్ళు చాలా చెడ్డవాళ్ళు. చాలా చెడ్డవాళ్ళు. నా వంశాన్ని గురించి నేను అవమానకరంగా చెపుతున్నానని నాకు తెలుసు. కాని వాళ్ళకు గౌరవం, అభిమానం బొత్తిగా లేవు. అయ్యగారికి నీమీద చాలా అభిమానం. వాళ్ళతో సంబంధం చేసుకుంటే నీవు మట్టి పాలయిపోతావు.

'చిత్తం' అనేమాట కేశవపిళ్ళై నోట వచ్చింది.

కొచ్చమ్మ చెప్పుకు పోతూవుంది 'ఆ వివాహ ప్రసక్తివల్లనే నీకు ఇక్కడ వుద్యోగం వచ్చింది. నీవు మంచి వాడివని నేను గ్రహించి నీ కింతగా చెపుతున్నాను. ఇక నీఅంతట నీవే అంతా ఆలోచించుకో.'

అతను మళ్ళీ 'చిత్తం' అన్నాడు.

కొచ్చమ్మ అతన్ని ఇక వెళ్ళవచ్చని పంపించింది.

కేశవపిళ్ళై ఆలోచనలు మారాయి. అతనికి తను విన్నదంతా నిజమేనేమో అని అనుమానం వేసింది.

కొంచెం సేపటికి అతనికి ఆలోచనలకు లోచనలు వచ్చాయి. తంకమ్మను పెళ్ళి చేసుకోవద్దనీ, చేసుకుంటే చెడిపోతావనీ కొచ్చమ్మ అంటూంది. అంటే చేసుకుంటే ఇక్కడి నుంచి వెళ్ళిపోవాలన్న మాట. అంతేగా?

ఒక్క విషయం మాత్రం అతనికి రూఢిగా తెలిసిపోయింది. పార్కువ్యూలో అతని నౌకరి ఖాయం. ఒక వేళ తంకమ్మను పెళ్ళి చేసుకోకపోయినా ఇక్కడినుంచి వెళ్ళి పోవలసిన అవసరముండదు.

ఇలాంటి పరిస్థితి సాధ్యమని కేశవపిళ్ళై ఎన్నడూ అనుకోలేదు. పెళ్ళి చేసుకోకపోతే వుద్యోగం వూడిపోతుందని అతను ఇన్నాళ్ళూ భయపడేవాడు. ఇప్పుడు పెళ్ళి చేసుకుంటే వుద్యోగం పోతుందనే పరిస్థితి యేర్పడింది.

ఎంతహాయిగా వుంది మనస్సు! కిట్టుమామ చెప్పిన వాక్యం చెవిలో మారుమ్రోగింది-'

'ఆ అమ్మాయి అదృష్టవంతురాలు.'

ఆ రోజు అతను ఇంటికి ఒక వుత్తరం రాశాడు. తను ఎక్కడ వుంటున్నదీ, ఏం చేస్తున్నదీ రాశాడు. కాని యీ వుద్యోగం ఎలా వచ్చిందో రాయలేదు. అది రాయాల్సిన విషయం కూడా కాదు. ఆ వుత్తరంలో కాత్యాయనిని గురించి ప్రత్యేకంగా రాశాడు. ఇంతవరకు అతని జీవితంలో తన భార్య యోగక్షేమాలను గురించి విచారించటం ఇదే మొదటిసారి. ఆమె అదృష్టవంతురాలుకదా! మనసులో కాత్యాయని రూపకల్పన చేసుకునేందుకు ప్రయత్నించాడు. కాని సాధ్యం కావటంలేదు. అసలతను ఆ అమ్మాయిని సరిగ్గా చూడను కూడా లేదు.

ఆరోజు కేశవపిళ్ళై హుషారుగా వున్నాడు. ఒక విధంగా మనసు కుదుట పడింది. అంతటి సంతోషం అతనికెప్పుడూ కలగలేదు. ఆరోజు అయిదు గంటల తర్వాత గోవిందన్ నాయర్ దగ్గరి నుంచి ఒక వుత్తరం తీసుకుని మాతేవన్ పిళ్ళై పార్క్‌వ్యూకి వచ్చాడు. ఆ వుత్తరం కేశవపిళ్ళైకు రాశాడు. మర్నాడు అయిదు గంటలకు పార్కుకు రమ్మని ఆవుత్తరంలో వుంది. చాలా ముఖ్యమైన విషయం చెప్పాలట. డిపార్టుమెంటులోని విశేషాలు కేశవపిళ్ళై మాతేవన్ పిళ్ళై నడిగి తెలుసుకున్నాడు. కొత్త సూపరింటెండెంటు రామచంద్రన్ నాయర్ చాలా చండశాసనుడిలా చలాయిస్తున్నాడని

మాతేవన్‌పిళ్ళై చెప్పాడు. తంకమ్మను గంటకు నలభైసార్లు గదిలోకి పిలిచి గదుముతూ వుంటాడట. ఇప్పుడు కొంచెం తగ్గింది. కాని దాదాపు అందరితో ఇలాగే ప్రవర్తిస్తున్నాడట.

కేశవపిళ్ళై ఆ వుత్తరం మరోసారి చదువుకున్నాడు. ఏదో గంభీరమైన విషయమే అతను చెప్పాలనుకుంటూండవచ్చు. ఆ విషయం ఏమిటో ఎంత ఆలోచించినా అతనికి తట్టలేదు.

మర్నాడు. నాలుగు గంటలకే పనంతా పూర్తిచేసి పర్మిషన్ తీసుకుని కేశవపిళ్ళై వెళ్ళాడు. గోవిందన్ నాయర్ అయిదున్నరకు పార్కుకు వచ్చాడు. కేశవపిళ్ళై అతనితో మాట్లాడేందుకు చాలా ఆతురతతో ఎదురు చూస్తున్నాడు. కాని గోవిందన్ నాయర్ విశేషమేమీ లేనట్టు మామూలు ధోరణిలో సంభాషణ సాగించాడు-

'మమ్మల్నెంత తొందరగా మరిచిపోయావేయ్? భలే స్నేహితుడివే!'

కేశవపిళ్ళై తన పనిని గురించి వివరంగా చెప్పాడు. ఆదివారం గూడా సెలవులేదు. క్షేమ సమాచారాలు చెప్పి అసలు విషయమేమిటని అడిగాడు.

'ఏంలేదు, చెపుతాను' అన్నాడు గోవిందన్ నాయర్. అతనేదో ముఖ్యమైన విషయమే చెప్పాలి. కాని అతను చాలా మధన పడుతున్నట్టు కేశవపిళ్ళైకు అనిపించింది.

'పెళ్ళి నిశ్చయమయిందా?' గోవిందన్ నాయర్ మాట సామెతగా అడిగాడు.

'లేదు, ఎందుకు?' ధైర్యంగా అన్నాడు కేశవపిళ్ళై.

'ఏం లేదు. చాలాకాలం గడిచింది కదా! అందుకని అడుగుతున్నాను.'

అదికేవలం పనికి రాని ప్రశ్నకాదు. ఏం చెప్పినా అనుమానించి చెపుతాడు. అతని మాటలు వినేందుకు కేశవపిళ్ళై ఆందోళనతో ఎదురు చూస్తున్నాడు. గోవిందన్ నాయర్ ఆరంభించాడు: 'నీకు నచ్చకపోవచ్చు. నచ్చినా నచ్చకపోయినా చెప్పటం మా విధి. నీవు తంకమ్మను పెండ్లి చేసుకోవటం మాలో ఎవ్వరికీ యిష్టంలేదు. మా యిష్టంతో మీకేమీ సంబంధం లేదని మాకు తెలుసు. నీవు ఉద్యోగంలో వృద్ధికివచ్చి ఎంత వున్నత స్థాయికి వచ్చినా మంచిదే కాని యీ వివాహం మాత్రం మంచిది కాదు. అంతకంటె ఇలా వుండటమే మంచిది.

అది ఒక వుపన్యాసం లాంటిది. నిజమైన స్నేహంతో చెపుతున్న మాటలు. కేశవపిళ్ళై భావంలో మార్పు లేకుండా వింటున్నాడు. ఆ వుపన్యాసాన్ని తొలిసారి ఆటంకపరుస్తూ కేశవపిళ్ళై అడిగాడు:

'అసలు విషయమేమిటి? చెప్పు.'

'నీవు తంకమ్మను పెళ్ళి చేసుకోగూడదు అదే మేమనేది.'

'అందువల్లనే యీ అవకాశాలన్నీ వచ్చాయి కదా? మరి అలా చెయ్యకపోతే.....'

కేశవపిళ్ళె మాట పూర్తి కాకముందే గోవిందన్ నాయర్ అందుకున్నాడు:

'నీవిప్పుడు ఆమెను చూసేందుకు వెళ్తున్నావా?'

'లేదు.'

'అది పాత తంకమ్మ కాదు. మేము మునుపు చూసిన పిల్లకాదు. అది చాలా భయంకరంగా మారింది.'

'ఏమయింది? ఏం మార్పు వచ్చింది?' అని అడిగాడు కేశవపిళ్ళె జుగుప్స తెలియ పరుస్తూ.

ఒక గొప్ప రహస్యం బయట పెడుతున్నట్టు గోవిందన్ నాయర్ గంభీరంగా అన్నాడు:

'అది యిప్పుడు రామచంద్రన్ నాయర్ ప్రియురాలు.'

ఈ వార్త విని కేశవపిళ్ళె స్పృహతప్పి పడి పోతాడనీ, కేకపెడతాడనీ, తలవెంట్రుకలు పీక్కొని పారిపోతాడనీ గోవిందన్ నాయర్ అనుకున్నాడు. ఈ వార్త అతని మీద పిడుగు పడ్డట్టు పడుతుందని ఆ స్నేహితుడు భావించాడు.

కాని కేశవపిళ్ళె నిర్వికారంగా మౌనంగా నిలబడివున్నాడు. తన యెదుట నిలబడి వున్న వాడు కేశవపిళ్ళేనా అని గోవిందన్ నాయరుకు అనుమానం వేసింది. అతను ఆశ్చర్యపోయినాడు. అతను కేశవపిళ్ళె కాదు.

'ఈ విషయం మీకింతకుముందే తెలుసా?' అడిగాడు గోవిందన్ నాయర్.

'తెలియదు.'

'మరి?'

'మరి – అయితే?'

'అలాగే నిలబడ్డావేం?'

'అయితే నేనేం చెయ్యను?'

గోవిందన్ నాయర్ ఉక్కిరి బిక్కిరయ్యాడు. కేశవపిళ్ళె చెప్పింది నిజమే గదా?

'నీవు ఆమెను ప్రేమించావు కదా?' గోవిందన్ అడిగాడు.

'ప్రేమిస్తే?' సమాధానం మరో ప్రశ్నవాచకంగా వచ్చింది.

గోవిందన్ నాయర్ సమాధానం చెప్పలేక పోయాడు. కొంచెం సేపాగి అడిగాడు: 'నీవు ఆమెను పెళ్ళి చేసుకుంటావా?'

'పెళ్ళి సంగతి అలావుండనీ. ఆ సంగతి తర్వాత ఆలోచిస్తాం. నీకి విషయం ఎలా తెలిసింది?' అని అడిగాడు కేశవపిళ్ళె.

గోవిందన్ నాయర్ ఆ వృత్తాంతమంతా వివరంగా చెప్పాడు. రామచంద్రన్ నాయర్ ఛార్జీ పుచ్చుకొన్న రోజే తంకమ్మ మీద నేరారోపణ జరిగింది. రోజుకు పందసార్లు గదిలోకి పిలిచేవాడు. అప్పుడప్పుడు ఏడుస్తూ బయటికి వచ్చేది. అతను గదివేసే వాడు. ఆ తర్వాత సమసి పోయింది. ఇప్పుడు

సూపరింటెండెంటూ, ఆమే తొందరగా ఆఫీసుకు వస్తారు. సూపరింటెండెంటు, రాత్రిపూట ఆమె యింటి ముందుగా వెళుతూ వుండగా నాలుగయిదు సార్లు నేను చూశాను. గోవిందన్ నాయర్ చెప్పిన వృత్తాంతమిది.

అంతకు ముందు తను ఎక్కి దిగిన కొట్టియంబలం మెట్లు ప్రస్తుతం రామచంద్రన్ ఎక్కి దిగుతున్నాడు కాబోలు నని కేశవపిళ్ళై అనుకున్నాడు. ఆ తర్వాత కేశవపిళ్ళైకు తన అనుభవం గుర్తుకు వచ్చింది. బహుశా అది తనకు నచ్చిన మగవాణ్ణి ఎన్నుకుని వుంటుంది.

అప్పటికీ నిర్వికారంగా నిలబడివున్న కేశవపిళ్ళై, గోవిందన్ నాయర్‌కు ఒక సమస్యగా తయారయినాడు.

'ఏమీ బోధపడటం లేదు.' అనుకొని గోవిందన్ నాయర్ స్పష్టంగా అన్నాడు: 'నీవు చాలా విచిత్రమైన వాడివేయ్?'

'మరి నీవు ఇన్నాళ్ళూ దానితో నాటకం ఆడావా?'

'తెలుసుకొని యేం చేస్తావ్?' అన్నాడు కేశవపిళ్ళై గంభీరంగా.

'నీవామెను మోసం చేశావు.'

'అబ్బాయ్. అదంతా అడగటం అనవసరం. అది నా యిష్టం' అన్నాడు కేశవపిళ్ళై చాలా గంభీరంగా.

'సరే, నీమీది ప్రేమ వల్ల నేను వచ్చి అడిగాను. నన్ను పంపించిన వాళ్ళ దగ్గరకి వెళ్ళి మళ్ళీ మన సంభాషణంతా చెపుతాను. ఇకముందు ఇలా వచ్చి నిన్నేమీ అడగను.' అన్నాడు గోవిందన్ నాయర్.

ఇలాంటి భావాలతో వెళ్ళే గోవిందన్ నాయర్ అక్కడికి వెళ్ళి నేను అభినయం చేశాననీ, ఆమెను మోసం చేశాననీ అందరికీ చెపుతాడేమోనని కేశవపిళ్ళైకు అనుమానం వేసింది. రేపటికి ఊరంతా తెలిసిపోతుంది. ఈ విషయం అందరికీ యిలా తెలియగూడదు. తంకమ్మ ఎటూ తప్పటడుగు వేసింది. కాని తాను కొంచెం అధిక ప్రసంగం చేశానేమోనని కేశవపిళ్ళైకు అనిపించింది.

'ఏమోయ్, అక్కడికి వెళ్ళి ఇలా చెప్పవు' అన్నాడు.

'అయితే నేనేం చెప్పను? నా స్నేహితులు నన్ను పంపించారు.'

'మరేదయినా చెప్పు.'

'నాకంతా తెలిసిపోయింది. నాకర్థమయింది నేను చెపుతాను. మరోలా నేను చెప్పలేను' అన్నాడు గోవిందన్ నాయర్.

కేశవపిళ్ళై నవ్వుతూ అన్నాడు: 'అబ్బాయికి వందన్ మెట్టకు ఉద్యోగం మార్పు వచ్చే సమయం సమీపించింది.'

గోవిందన్ నాయర్ స్తంభించిపోయాడు భయంతో కాదు, కేశవపిళ్ళైలో వచ్చిన మార్పు చూసి.

గోవిందన్ నాయర్ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

అతను డిపార్టుమెంటుకు వెళ్ళి యేమేం చెపుతాడో కేశవపిళ్ళైకు తెలియదు. తంకమ్మకు అంతా తెలిసిపోతుంది. కొంచెం ముందుగా తెలుస్తుంది. అంతేగా. ఆమె ఎలా అర్థం చేసుకుంటే అలాగే చేసుకోనీ అనుకుంటూ అతను తన మనసు కుదుట పరుచుకున్నాడు.

### పదకొండు

కేశవపిళ్ళై స్థిరపడుతున్నాడు. అయ్యగారూ, కొచ్చమ్మా అతని పనికి తృప్తి పడ్డారు. తంకమ్మను పెళ్ళి చేసుకోకపోయినా నష్టమేమీ లేదు. తన అభివృద్ధికి కారకురాలయిన తంకమ్మను ఎందుకు వదిలి పెట్టావని ఎవరయినా అడిగితే దానికి తగిన కారణం తన దగ్గర వుంది. ఆమె స్వభావం మంచిది కాదు. తంకమ్మ స్వభావం కేశవపిళ్ళైకు బాగా తెలుసు. తంకమ్మను గురించి కేశవపిళ్ళైకు పూర్తిగా తెలుసు. తెలియక పోయినట్టయితే అతను ఆశ్చర్యపడేవాడు. దానికి ఎప్పుడూ ఎవరో ఒక మగవాడు కావాలి.

ఆఫీసు పనిలో కేశవపిళ్ళై ఆరితేరాడు. పై అధికారి పద్ధతిని అతను పూర్తిగా అర్థం చేసుకున్నాడు. అది మనస్సులో వుంచుకొని అతను టేబిలు మీద ఫైళ్ళు పెడతాడు. టేబిలు మీద ఫైళ్ళు పెట్టటమే కాదు, విషయం స్పష్టంగా వివరిస్తాడు. చీఫ్ సెక్రటరీకి ఆఫీసుపనిని గురించి విచారం లేదు. అయనకు ఆఫీసులో ఎక్కువ పనికూడా లేదు.

కేశవపిళ్ళైలో వుత్సాహం వచ్చింది. అతని తెలివి తేటలు వెలుగులోకి వచ్చాయి. అయినప్పటికీ అతనింకా నిలదొక్కుకున్నాడనే నమ్మకం లేదు. ఇప్పుడిక స్థిరపడాలి. దానికి కారణం కూడా వుంది. ప్రస్తుతం చీఫ్ సెక్రటరీ స్థితి కూడా ఖాయంగా లేదు. అది కూడా అస్తుబిస్తుగానే వుంది. అలాంటప్పుడు కేశవపిళ్ళైకు మాత్రం నిలకడయెలా వుంటుంది?

చీఫ్ సెక్రటరీ ప్రతిరోజూ భయపడుతూ వుంటాడు. అతన్ని భయపెట్టారు. కారణం తెలీదు. ఏక్షణంలోనయినా తనను పదవిలో నుంచి తీసివేయవచ్చునని అతనికి అనుమానం. ప్రతిరోజూ భక్తివిలాస్ నుంచి అతనికి పిలుపు వస్తుంది. అక్కడి నుంచి రాగానే అతను నీరసంగా కనిపిస్తాడు. ప్రతిరోజూ రాగానే 'ఈ ప్రొమోషను రాకున్నా బాగుండేది.' అంటాడు.

కృష్ణన్ నాయరుకు ఈ జీవితం మీద ఏవగింపు కలిగింది. ఈ సంగతి గమనించి ఒకరోజు కొచ్చమ్మ ఏవగింపుతో అన్నది:

'మరి లంచం పెట్టి యీ తగాదా యెందుకు కొనుక్కొచ్చుకున్నట్టు?'

చీఫ్ సెక్రటరీ భార్యవైపు విసుగ్గా చూసి కోపంతో అన్నాడు:

'నీవు నన్ను వేధించి నా ఆస్తంతా లంచం పెట్టి మళ్ళీ యీ మాటలంటున్నావా? నీవేగా ఇచ్చింది? చీఫ్ సెక్రటరీ భార్య కావాలని నీవేగా ఉబలాటపడింది?'

కొచ్చమ్మ కూడా వదల్లేదు :

'అందుకనే నేననేది - ఇందులో భయపడవలసిందేముందని. డబ్బు పుష్కలంగా పెట్టాము. ధైర్యముండాలి. పిరికి తనంవల్ల భయపడుతున్నావు.'

చీఫ్ సెక్రటరీకి చిరాకుగా వుంది. ఎక్కడలేని కోపం, ఆవేదన ఆవరించాయి. ఒకవైపు ఆ చండశాసనుడు పనికి రానివాడివని నిత్యం బెదిరిస్తూ వున్నాడు. మరోవైపు ఇంట్లో ఇల్లాలు కూడా పిరికి పందవని విమర్శిస్తూ వుంది. కొంచెం సేపు అతనేమీ మాట్లాడకుండా కూర్చున్నాడు. అయినా కొచ్చమ్మ భర్తను విమర్శిస్తూనే వుంది.

కృష్ణన్ నాయర్ కోపంతో అన్నాడు: 'చూడు, ఈ రోజు జలవిద్యుత్ ప్రణాళికకు సంబంధించిన ఫైలు మీద చర్చ జరిగింది. నియమానుసారంగా దానికి రాజభవనం ఉత్తర్వు కావాలి. దీవాన్‌జీ దాన్ని రాజభవనానికి పంపకుండా తనే ఉత్తర్వులిచ్చి దానిమీద సత్వర చర్య తీసుకోవలసిందని యిక్కడికి పంపాడు. ఈ విషయంలో ఉత్తర్వులు అవసరమని మాత్రమే నేనన్నాను. నన్ను పదవినుంచి తొలగిస్తానని దానికి సమాధానం వచ్చింది. దీని మీద వెంటనే చర్య తీసుకోవలసిందని మళ్ళీ చెప్పాడు.'

ఒక్క క్షణం ఆగి కృష్ణన్ నాయర్ అన్నాడు: 'ఆయన మాటలను బట్టి పదవినుంచి తొలగించబడే వాళ్ళ వరుసలో నేను నిలబడ్డాను. రేపు రాతపూర్వకంగా ఉత్తర్వులు వచ్చినా రావచ్చు, రాకపోవచ్చునని అనుకోకు.'

'నాకు ఎలాటి ధైర్యం అవసరమో నీవే చెప్పు. వాళ్ళు ఇలాంటి పనులు చేస్తుంటే అడిగే వాళ్ళెవరు?'

'మొదటి నుంచి గట్టిగా ఉండనందువల్ల ఇదంతా జరుగుతున్నది. అంతే కదా అనుకొని వుంటారు. ఇప్పుడేం చేస్తారు?' అన్నది కొచ్చమ్మ ఏమీ బోధపడనట్టు.

ఏమీ చెయ్యలేక చీఫ్ సెక్రటరీ అన్నాడు: 'నీకేం నీవు చెపుతావు. అతను మహారాజా మాటకూడా లెక్కపెట్టని ఘటం. డబ్బిచ్చాననే గొప్ప చూపిస్తే ఇప్పుడే సెలవు తీసుకొని దయ చెయ్యాల్సి వుంటుంది.'

కృష్ణన్ నాయర్ చెప్పిన సమాధానం కొచ్చమ్మకు బోధపడలేదు. కాని యిలా భయపడటం బాగులేదని ఆమెకనిపించింది. ఎందుకు ఈయన్ని ఇలా గజగజవణికిస్తున్నారు. డబ్బు కోసరమయితే ఇంకా ఇస్తూనే వున్నాం గదా అనుకుంది మనసులో.

రెండు రోజుల తర్వాత ఒక రోజు మధ్యాహ్నం ఉన్నట్టుండి ఒక మోటారు కారు బయట ఆగింది. మోటరు కారులోనుంచి దివాన్‌జీ ప్రైవేట్ సెక్రటరీ దిగాడు. కేశవపిళ్ళై నమస్కారం చేసి పక్కకు తొలిగాడు. ప్రైవేట్ సెక్రటరీ 'ఎలా వున్నావ్ కేశవపిళ్ళై?' అని కుశల ప్రశ్నలడిగి లోపలికి వెళ్ళిపోయినాడు.

కేశవపిళ్ళై ఫైలు చదువుకుంటున్నాడు. ఎవరో ఎదురుగా నిలబడి వున్నట్టు అతని కనిపించింది తలయెత్తి చూసే సరికి ఎదురుగా శేఖరపిళ్ళై నిలబడి వున్నాడు. కేశవపిళ్ళై పార్క్‌వ్యూకి వచ్చిన తర్వాత శేఖరపిళ్ళైను అక్కడ మొట్టమొదటి సారి చూస్తున్నాడు. తలవని తలంపుగా రావటం వల్ల కేశవపిళ్ళై కొంచెం కంగారు పడ్డాడు. పెళ్ళి సంగతి మాట్లాడేందుకు వచ్చి వుంటాడని అతనికి భయం వేసింది. అదే నిజమయితే అతనికేం సమాధానం చెప్పాలో అతను ఆలోచించలేదు. అనవసరంగా లేని పోని తగాదా తెచ్చి పెట్టుకొన్నానని చిరాకు పడ్డాడు. ముందే అంతా ఆలోచించుకొని వుండాల్సింది.

ఏమయినా సరే అనుకుని నవ్వు తెచ్చుకుని నవ్వుతూ కేశవపిళ్ళై లేచాడు:

'ఏం పిళ్ళే! ఎలా వున్నావ్?' అడిగాడు శేఖరపిళ్ళై.

'బాగానే వున్నాను. కులాసా ? కూర్చోండి.'

శేఖరపిళ్ళై కూర్చున్నాడు. పుత్ర వాత్సల్యంతో కేశవపిళ్ళైను ఆపాద మస్తకం చూసి శేఖరపిళ్ళై అన్నాడు:

'కృష్ణన్‌కు నిన్ను గురించి చాలా మంచి అభిప్రాయం ఏర్పడ్డది. రెండు మూడు సార్లు నేనిక్కడికి వచ్చి కలుసుకున్నాను. నీవెక్కడికో వెళ్ళావు. ఇంట్లో మావాళ్ళు ఎప్పుడూ నిన్ను గురించి అడుగుతూ వుంటారు.'

ఇంకా కేశవపిళ్ళై అరువు తెచ్చుకున్న నవ్వుతో అలాగే నిలబడిపోయాడు. శేఖరపిళ్ళై నోట పెళ్ళి సంగతి యెక్కడ బయట పడుతుందోనని అతను అనుక్షణం భయపడుతున్నాడు.' భగవతి కుట్టి యింట్లో వున్నారా?' అని శేఖరపిళ్ళై అడిగాడు.

భగవతి కుట్టి, కొచ్చమ్మకు మారుపేరు. కేశవపిళ్ళై కొంచెం తడబడ్డాడు. 'ఉన్నారు' అన్నాడు మళ్ళీ సంభాళించుకుని.

ఆ వ్యక్తి ఇంటి యజమానికి జ్యేష్ఠభ్రాత. తిన్నగా ఇంట్లోకి వెళ్ళే అధికారం అతనికి వుంది. కాని అతను లోపలికి వెళ్ళిపోతే తన సంగతి ఏమవుతుంది అని కేశవపిళ్ళైకు ఆలోచన వచ్చింది. అంతవరకు సంపాదించిన మంచిపేరు మట్టిపాలవుతుంది. శేఖరపిళ్ళైను కావాలని లోపలికి పంపించాడని కూడా వాళ్ళనుకోవచ్చు. శేఖరపిళ్ళై అన్నా, అతని కుటుంబం అన్నా కొచ్చమ్మకు గిట్టదు. ఇతన్ని కూడా శేఖరపిళ్ళై గుంపులో జమ కడుతుంది. ముఖ్యంగా తంకమ్మను పెళ్ళి చేసుకోబోయే వ్యక్తి అతను కావడం వల్ల. ఈ వుద్యోగం శేఖరపిళ్ళై ఇప్పించిందే కదా! అలాంటి వ్యక్తిని లోపలికి వెళ్ళగూడదని ఎలా చెప్పటం? ఒకవేళ శేఖరపిళ్ళై తనంతట తాను లోపలికి వెళితే ఆపటం బాగుంటుందా? ఇక్కడ శేఖరపిళ్ళై మూలంగానే అతను కూర్చుని వున్నాడు.

'నిద్రపోతున్నారు' అన్నాడు కేశవపిళ్ళై ఆలోచించకుండానే.

'అలాగా, సరేలే.'

శేఖరపిళ్ళై లేచి వెళ్ళేట్టు లేడని కేశవపిళ్ళైకు అనిపించింది.

శేఖరపిళ్ళై సంభాషణ సాగించాడు: 'పగలు స్త్రీలు నిద్రపోతే ఐశ్వర్యం అణగారిపోతుందంటారు. కాని యీ రోజుల్లో స్త్రీలకి అలాంటి నమ్మకాలు లేవు. మాయింట్లో అయితే నేనలా ఒప్పుకోను.'

తన ఆత్మీయుడికి చెపుతున్నట్టుగా శేఖరపిళ్ళై మెల్లగా చెప్పసాగాడు:

'అమ్మగారు కదా! ఆమెకు పనేముంది? తినటం, నిద్రపోవటం. ఇంట్లో పని వుంటే నిద్రపట్టదు. బాగా అలిసి పోయినా కళ్ళు మూత పడవు.'

కేశవపిళ్ళై కృత్రిమంగా నవ్వుతూ అలాగే నిలబడి వున్నాడు. శేఖరపిళ్ళై కూర్చోమన్నాడు. కాని కేశవపిళ్ళై కూర్చోలేదు. బలవంతంగా కూర్చోబెడుతూ అన్నాడు:

'కూర్చో పిళ్ళే! కూర్చో. మరేం పరవాలేదు. కూర్చో.' అని

తన అల్లుడితో చెప్పినట్టన్నాడు శేఖరపిళ్ళై.

'అక్కర్లేదు నిలుచుంటాను.' అన్నాడు కేశవపిళ్ళై.

'అదేమిటబ్బాయి? కూర్చుంటే తప్పేమీ లేదు. నా గౌరవానికేమీ భంగం లేదు. కూర్చో.'

అయినా కేశవపిళ్ళై కూర్చోలేదు. శేఖరపిళ్ళై సంతోషించాడు. అతను తనలో తను అనుకున్నాడు:

'ఈ రోజుల్లో ఇలాంటి పిల్లలు అరుదు. బాగుంది.'

'తంకమ్మ తల్లి ఇలాంటి ఆరాచకపు పనులు చెయ్యదు' అన్నాడు శేఖరపిళ్ళై కేశవపిళ్ళైతో.

'అవును' అన్నాడు కేశవపిళ్ళై ఏదో ఒకటి మాట్లాడాలి గదా అన్నట్టు.

తంకమ్మ సంగతి గూడా మొదలుపెట్టాడు శేఖరపిళ్ళై:

తంకమ్మ కూడా ఇలాంటి తప్పు పనులు చెయ్యదు. దాన్ని మేమలా పెంచాం. తిరువనంతపురం తరహాగా పెంచలేదు. ఇక్కడ శుద్ధం బద్ధం ఏమీ లేదు. బయట చేరినప్పుడు వేరుగా వుండటం అలాంటి ఆచారాలంటే అమ్మకూ, కూతిరికీ చాలా నిష్ఠ. మీరంతా ఉత్తరదేశపు ఆచారాలననుసరిస్తారు. ఎరువు, ఎంగిలి దూరంగా వుంచడం, శుభ్రంగా స్వచ్ఛంగా వుండటం వాళ్ళకు అలవాటయిన పనులు. ఆ మర్యాదా మట్టూ చూస్తే తెలుస్తుంది.'

దానికి కూడా కేశవపిళ్ళై అవునని సమాధానం చెప్పాడు. బహుశా ఆ సమయంలో మట్టు మర్యాద, శుద్ధం బద్ధం, మంచి మన్ననలతో పెరిగిన తంకమ్మ అతనికి గుర్తు వచ్చి వుంటుంది. లేకుంటే కూతుర్ని గురించి తండ్రికేం తెలుస్తుంది?

కొంచెం సేపు ఎవ్వరూ ఏమీ మాట్లాడ లేదు. శేఖరపిళ్ళైకు మనసు విప్పి యేదో చెప్పాలని వుంది. ఏదో జ్ఞాపకం చేసుకుంటున్నాడు. ఏమయి వుంటుంది? దివాన్‌జీ సెక్రటరీ తిరిగి వచ్చేదాకా యీ ముసలాయన యిక్కడే

కూర్చుని వుంటే - ఆలోచిస్తున్నాడు కేశవపిళ్ళై. లోపలికి వెళ్ళి యీ ముసలాయన వచ్చాడని చెప్పేందుకూ వీల్లేదు.

శేఖరపిళ్ళై ఆరంభించాడు: 'ఇక్కడ కూర్చుంటే నాకేవేవో ఆలోచనలు వస్తున్నాయి. కృష్ణన్ ఇప్పుడిక్కడ వున్నాడు. రేపీవరకు భక్తివిలాస్ లో ప్రవేశిస్తాడు. చాలా యేండ్ల క్రితం అక్కడ పూర్వీకులు చౌకిదారుపని చేసే వాళ్ళు. అప్పుడు మేం పసిపిల్లలం. మేం పెరిగి పెద్ద వాళ్ళమయినా ఆ యింటిని గురించి నేనిప్పుడు జ్ఞాపకం చేసుకుంటున్నాను. ఆరోజుల్నీ, మా అమ్మనీ, నాన్ననీ గుర్తు చేసుకుంటున్నాను. కృష్ణన్ నాయర్ ఇంతవరకు ఇన్ని చోట్ల ఎలా ప్రవేశించాడో అంతా నాకు గుర్తుంది. పాపం మా అమ్మ పడరాని కష్టాలు పడ్డది. ఈరోజు ఇదంతా చూసేందుకు ఆమెకు లేకపోయింది. మా నాన్నగారు కృష్ణన్ అభివృద్ధిని చూడగలిగితేబాగుండేది! ఆ సుఖం ఆయన అనుభవించలేదు.'

శేఖర్‌పిళ్ళై మనస్సు వికలమయింది. కళ్ళు చెమర్చాయి. ఆయన భావ పరివర్తనను కేశవపిళ్ళై గమనించాడు. తల్లి దండ్రులమీద ఆయనకు ఎక్కువ ప్రేమ అనీ, వాళ్ళను గుర్తు తెచ్చుకుని ఆయన విచారిస్తూన్నాడనీ అతను గమనించాడు.

'జీవితాంతం తల్లిదండ్రులు బతికి వుంటారా?' అన్నాడతను.

అతనితో ఏకీభవిస్తూ కళ్ళు తుడుచుకుంటూ శేఖరపిళ్ళై అన్నాడు:

'నిజమే పిళ్ళై! నిజమే, ఒప్పుకుంటాను. కాని తల్లిదండ్రులు ఎంత పెద్ద వయస్సులో పోయినా దిగులు వేస్తుంది. వాళ్ళు గుర్తు వస్తే కళ్ళల్లో నీళ్ళొస్తాయి.'

'అది నిజమే. కాని, ఈ విధంగా జ్ఞాపకం చేసుకుని విచారించినందువల్ల లాభమేముంది? 'అన్నాడు కేశవపిళ్ళై.

'ఎల్లుండి మా అమ్మ ఆబ్దికం. ఆ విషయం కృష్ణన్ నాయరుకు జ్ఞాపకం చేద్దామని వచ్చాను. తద్దినం పెట్టదలుచుకుంటే పెట్టాలి కాని వాడు పెట్టడు, నాకు తెలుసు. తద్దినం పెట్టి చాలా రోజులయింది. వాడు పెద్ద వుద్యోగస్థుడు కదా! ఇవన్నీ మరిచిపోయి వుంటాడు. వాడికి వాళ్ళు గుర్తుంటారా?'

దిగులుతో దిగజారి పోయినట్లుగా శేఖరపిళ్ళై ముగించాడు.

'వీళ్ళెలా పుట్టారో వీళ్ళకేం తెలుసు. వీళ్ళు ఈ పదవికి వచ్చేందుకు వాళ్ళెంత కష్ట పడ్డారో వీళ్ళకు తెలియదు. జ్ఞాపకం కూడా వుండదు.'

కేశవపిళ్ళై ఒక్కక్షణం తన తల్లి దండ్రులను గుర్తు తెచ్చుకున్నాడు. తల్లి దండ్రులను, వాళ్ళు పడ్డ కష్టాలను మరిచి పోవటం భావ్యం కాదు. అయినా తన అధికారిని గురించి ఏదో సమాధానం చెప్పాలని కేశవపిళ్ళైకు అనిపించింది

'ఆయన యిప్పుడు చాలా పనిలో వున్నారు. బొత్తిగా తీరుబడి లేదు. రాజ్యంలో పరిస్థితిగూడా ప్రశాంతంగా లేదు. అన్ని పనులూ చీఫ్ సెక్రటరీ మీదనే వున్నాయి. ఇంతకు ముందు కనీసం నాయరు జాతయినా ప్రభుత్వం పక్షంలో వుండేది. ఇప్పుడెవ్వరూ లేరు. చాలా గడ్డు రోజులు వచ్చాయి.'

'అందువల్ల తల్లికి తద్దినం పెట్టేందుకు తీరుబడి దొరకదా?' అన్నాడు శేఖరపిళ్ళై.

కేశవపిళ్ళై మళ్ళీ తన అధికారి చిక్కులను ఏకరువు పెట్టటం మొదలు పెట్టాడు. శేఖరపిళ్ళై మాట నిజమేనని కేశవపిళ్ళైకు తెలుసు. అందుకనే అయ్యగారి తరపున మాట్లాడుతున్నాడు. శేఖరపిళ్ళై కోపావేశంతో బిగ్గరగా మాట్లాడసాగాడు:

'అనవసరమయిన కబుర్లు చెప్పకోయ్, కేశవపిళ్ళై! నీవు మీ అయ్యగారిని సమర్థించటం బాగానే వుంది. అది నీ విధి. నీవలా చెయ్యకపోతే నీది తప్పవుతుంది. ఇవన్నీ వింటే నాకు కోపం వస్తుంది. వాడు పెద్ద వుద్యోగస్థుడే. కాని పునాదిని మరిచిపోయినాడు. చిన్నప్పటినుంచి వాడింతే. తన ధోరణి తనది. తల్లిమీదా తండ్రిమీదా అతనికి ఎక్కువ ప్రేమ లేదు. కాని వాళ్ళ ఇద్దరికీ అతనంటే ప్రాణం. అతనే సర్వస్వం.

శేఖరపిళ్ళై చెప్పవలసిందంతా వెళ్ళగక్కేశాడు. కంఠం కూడా కొంచెం పైస్థాయినందుకుంది. 'నేను వాడి కంటె పదిహేనేండ్లు పెద్ద. నేను చదువుకో లేకపోయినాను. అమ్మ, నాన్న, నేను కష్టపడి వాణ్ణి చదివించాము. చిన్నప్పుడు నేను చేసిన ప్రయత్నమంతా దానికే. వాడి చదువు పూర్తయిన తర్వాత నేను పెళ్ళి చేసుకున్నాను. తండ్రులిద్దరూ రిటయిరయ్యారు. వయస్సుకూడా దాటిపోయింది. ఏం చేస్తారు మరి? కుటుంబాన్ని పోషించుకోవాలి. వాణ్ణి చదివించాలి. నేను వాడికోసరం ఎన్నెన్ని ప్రయత్నాలో చేశాను.'

తమ్ముణ్ణి గురించి అన్న చెప్పవలసినవన్నీ ఒక్కొక్కటే బయటికి వచ్చాయి. శేఖరపిళ్ళై ఇంకా చెపుతూనే వున్నాడు:

'నీకోవిషయం చెపుతాను, నీకు తెలియాలి కూడా. ఈ రోజుల్లో స్థితి అలాంటిది. నీవే ఆలోచించు వాడు పెద్ద వుద్యోగస్థుడైనందువల్ల నాకేం లాభం? ఏమీ లేదు. నేనేమీ అడగను కూడా. నాకష్టం నేను పడి బతుకుతున్నాను. దమ్మిడీ యెరగను. తల్లిదండ్రులనే మరిచిపోయినప్పుడు నా సంగతి యేముంది?'

ఒక్కక్షణం ఆగి మెల్లిగా అన్నాడు శేఖరపిళ్ళై: 'నీకు తెలుసుగదా! నాకు ముగ్గురు పిల్లలు. ఇద్దరు పిల్లలకు గవర్నమెంటు ఉద్యోగం దొరకలేదు. ఒకడు ప్లీడరు గుమాస్తా. మరొకడు కటప్పురత్తు ఫ్యాక్టరీలో వున్నాడు. వీళ్ళలో ఎవ్వరికీ కృష్ణన్ నాయర్ వల్ల ఏమీ లాభం కలగలేదు. లేకుంటే వాళ్ళకు గవర్నమెంటు వుద్యోగం రాదూ? నిజానికి తంకమ్మకు వుద్యోగం ఇప్పించింది

పేష్కార్ వటివేలుపిళ్ళై. ఆతర్వాత కృష్ణన్ నాయర్ వల్ల అది సచివాలయంలో ప్రవేశించింది. దానికి వుద్యోగం రావటానికి కూడా ఒక గాథ వుంది. వటివేలుపిళ్ళై సచివాలయంలో క్లర్కుగా పని చేసేప్పుడు తంపానూరులో వుండేవాడు. అక్కడ నా కిళ్ళికొట్టు వుండేది. అతను పేష్కారయినప్పుడు నేను చెపితే తంకమ్మకు అతను వుద్యోగం ఇప్పించాడు. ఆ రోజుల్లో కృష్ణన్ నాయర్ సెక్రటరీగా వుండేవాడు. అయినా నేనతని దగ్గరికి వెళ్ళి చెప్పలేదు. తంకమ్మ అడిగితే వాడు సచివాలయంలో దానికి వుద్యోగం ఇప్పించాడు.'

తన అధికారిని గురించి, అతని అన్నగారిని గురించి తనకు తెలిసి వుండటం చాలా అవసరం గదా! ఆ దృష్టితో శేఖరపిళ్ళై చెప్పే మాటలన్నీ కేశవపిళ్ళై కుతూహలంతో వింటున్నాడు. శేఖరపిళ్ళైను చూసి అంతగా భయపడవలసిన పని లేదని అతని కనిపించింది.

శేఖరపిళ్ళైకు ఇంకా చాలా విషయాలు చెప్పాల్సినవి ఉన్నాయి. కృష్ణన్ నాయర్ కంటె భగవతి కుట్టి అమ్మను గురించి చాలా విషయాలు చెప్పాలి. శేఖర్‌పిళ్ళై తనయింటికి మొట్టమొదట వచ్చిన పెద్దల్లుడితో చెప్పినట్టుగా కేశవపిళ్ళైకు చెపుతున్నాడు. తనయింటికి రావటం కొచ్చమ్మకు ఇష్టంలేదు. అందువల్ల వాళ్ళపేరు చెడిపోతుంది. తమ్ముడు, మరదలు అంటూ వాళ్ళింట్లో తిరగటం వాళ్ళకు అవమానకరం.

శేఖరపిళ్ళై అంటే తంకమ్మ తల్లి కూడా వీళ్ళను లక్ష్యపెట్టదు. అదికూడా గొప్ప వంశంలో పుట్టింది. నట్టియూరక్కావులో పనంకురల్ వాళ్ళని విన్నావో లేదో? ఆ వంశానికి చెందిందది. ఆ వంశం వాళ్ళు సైన్యంలో పెద్దపెద్ద వుద్యోగాల్లో వున్నారు. అది యీ యింట్లో అడుగు పెట్టి పదిహేను సంవత్సరాలయింది. ఆమె గొప్ప ఆమెకేవుంది నాకేం అంటుంది మా ఆవిడ.'

అంతట ఆపి శేఖరపిళ్ళై ఒక్కమాట అన్నాడు. ఆమె అహంకారాన్ని గురించి చెప్పక పోవటమే మంచిది.

ఆరోజుల్లో ఆడవాళ్ళ తగాదాలను గురించి రెండుమూడు ఘట్టాలను శేఖరపిళ్ళై వివరించాడు.

చీఫ్ సెక్రటరీ భార్యను శేఖరపిళ్ళై భార్య చీడపురుగులా మాట్లాడి పంపించింది.

పోనుపోను స్థితి చాలా స్పష్టంగా తెలిసిపోతున్నది. తను నిలబడ్డ స్థానం చాలా గట్టిదని తేలింది. ఇలాంటి చిక్కు పరిస్థితుల్లో తనకి పదవి ఎలా వచ్చిందా అని అతనికి ఆశ్చర్యం వేస్తున్నది. వాళ్ళల్లో వాళ్ళకు ఇన్ని తగాదాలున్నా తనకి వుద్యోగం ఎలా వచ్చింది? మళ్ళీ కిట్టుమామ చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది:

'ఆ పిల్ల అదృష్టవంతురాలు.'

శేఖరపిళ్ళై మళ్ళీ అన్నాడు:

'ఇదంతా అయిన తర్వాత కృష్ణన్ నాయర్‌తో నేను మాట్లాడేప్పుడు అతని భార్య అక్కడుండకూడదు. కాని అతనికి అమిత భయం. మేమిద్దరం ఒక తల్లి బిడ్డలం. ఒకేతల్లి దగ్గర పాలు తాగాం. తమ్ముణ్ణి మోసిన గుర్తు నా నడుము మీద యింకా వుంది. అతనే నా సర్వస్వమనుకొని అతన్ని పెంచి పెద్ద చేశాను. తన భార్య దగ్గర అతను పిల్లిలా వుంటాడు. అదే వచ్చిన తగాదా.'

ఆ తర్వాత శేఖరపిళ్ళై మరో కథ ఆరంభించాడు. అది - కేశవపిళ్ళైకు ఈ వుద్యోగం ఎలా వచ్చిందీ అనే విషయం. కొడుకు మీద ఆపేక్షగల తండ్రిలా అతను తన కథ ఆరంభించాడు:

'మనసు విప్పినీకు సమస్తం చెపుతున్నాను. నీవు కూడా నాకొడుకు లాంటి వాడివి. నేను చాలా విషయాలు నీకు చెప్పాను. నాకొక్కతే ఆడపిల్ల. అదే నాకు ప్రాణం. నాకిద్దరు మగపిల్లలు కూడా వున్నారు. వాళ్ళు కూడా నాకిష్టమే. కాని నాకు మా అమ్మాయంటే అమిత ప్రేమ. దాన్ని ఎంతో మురిపెంగా పెంచాం. దానికి కోపం వస్తే యింట్లో చీకట్లు కమ్ముతాయి. అది నవ్వితే యిల్లు కళకళ లాడుతూ వుంటుంది. పిళ్ళై! దాన్ని కష్టపెట్ట వద్దు. ప్రేమతో చూసుకో. కనికరంతో చూడు పిళ్ళై!'

ఆ ముసలి తండ్రి కేశవపిళ్ళైను బతిమలాడుతూ వున్నాడు. అతని ముదుసలి కండ్లల్లో వాత్సల్యం ఉట్టిపడుతూ వుంది.

'మా యింటికి దీపం నీవే.'

వాత్సల్యంతో అతని కంట ఆనంద బాష్పాలు కూడుకున్నాయి. శేఖరపిళ్ళై లేచి కేశవపిళ్ళైను ప్రేమతో తట్టాడు. కేశవపిళ్ళై తలవంచుకొని నిలబడ్డాడు. శేఖరపిళ్ళై కంట రెండు కన్నీటి బిందువులు రాలాయి. కొంచెం విచారంగా శేఖరపిళ్ళై అన్నాడు:

'మా అమ్మాయికి నీవు ఎలాంటి లోటూ రానియ్యవని నాకు తెలుసు.'

శేఖరపిళ్ళై పెళ్ళి నంగతి ప్రస్తావించి మాట యియ్యమని అంటాడనుకున్నాడు కేశవపిళ్ళై. కాని మొత్తం మీద అది జరగలేదు.

కళ్ళు తుడుచుకొని అతను కుర్చీలో కూర్చుని మళ్ళీ ఆరంభించాడు:

'అంటే నేననేది - తంకమ్మకు నీమీద మహాప్రేమ., నన్ను క్షణం కూర్చోనియ్యలేదు. కృష్ణన్ నాయరుకు నేనేమి చెప్పనని ఒట్టు పెట్టుకున్నాను. కాని తంకమ్మ ఏడుపు మొదలు పెట్టింది. అది యేడుస్తుంటే నా మనస్సు చలించిపోయింది. అది ఏడుపు ఆపనే లేదు. నేను ఆఫీసుకు వెళ్ళి కృష్ణన్ నాయరుకు నీ సంగతి చెప్పాను. ఇక్కడికి వచ్చి చెప్పినందువల్ల లాభం లేదని నాకు తెలుసు. అది ఒప్పుకోదని కృష్ణన్ నాయర్ అన్నాడు. అతని ముఖంలో కొంచెం కంగారు కనిపించింది. ఒకవేళ 'ఈ పని సాధ్యం కాదు' అని అతను అంటే దానికి తగిన సమాధానం చెప్పేందుకు నిర్ణయించుకునే వెళ్ళాను. బంట్రోతు ద్వారా నన్ను బయటికి గెంటిస్తే దానికి గూడా సిద్ధమయ్యే

వెళ్ళాను. అతని మొహంలో విసుగు చూసి నేను చాలా వరకు నచ్చ చెప్పాను. అంతా విని 'నీకేం కావాలన్నయ్యా? కేశవపిళ్ళైను నేను నియమిస్తాను' అన్నాడు. నేను మరేమనలేదు. ఈవిధంగా నిన్నిక్కడ నియమించటం జరిగింది. ఆరోజు తంకమ్మ సంతోషంతో ఎగిరి గంతులేసింది.'

శేఖరపిళ్ళై చెప్పిన దాన్ని బట్టి అన్నగారు చేసే ప్రయత్నమంతా తమ్ముడి మంచి కోసరమే. అన్న చేసిన ప్రయత్నం ఫలించింది. కాని ఆ ఫలితం అతనికి దక్కుతుందా?

కేశవపిళ్ళై ఆశ్చర్యంతో నిలబడిపోయినాడు. ఆ ముసలాయనకు కూతురి మీద వున్న ఆపేక్ష కేశవపిళ్ళైను ప్రభావితుణ్ణి చేయలేదని చెప్పేందుకు వీల్లేదు. ఈ ముసలాయన జీవితాంతం ఆమెనంటిపెట్టు కునే వుంటాడని కేశవపిళ్ళైకు అనిపించింది. చనిపోయిన తర్వాత కూడా అతని ఆత్మ ఆమెను వెన్నంటే వుంటుంది. కంటతడి పెట్టుకుంటూ శేఖరపిళ్ళై కేశవపిళ్ళైను ఆశీర్వదిస్తూ అన్నాడు: 'మీరిద్దరూ కలిసి మెలిసి సుఖంగా వుండటమే నాకు కావలసింది. అంతకుమించి యేమి లేదు.'

ఈ మాటలు కేశవపిళ్ళై మనస్సులో చిచ్చులా చొచ్చుకుపోయ్యాయి.

కొచ్చమ్మ అక్కడికి వచ్చింది. ఆమె ముఖంమీద జుగుప్స నిండి నిబిడీ కృతమై వుంది.

శేఖరపిళ్ళై ఆమెతో అన్నాడు: 'రేపు మా అమ్మ తద్దినం. ఆమాట వాడితో చెప్పు.'

శేఖరపిళ్ళై కర్రతీసుకుని అక్కడినుంచి వెళ్ళిపొయ్యాడు.

ఇతను వచ్చి చాలా సేపయిందా?' అడిగింది కొచ్చమ్మ కేశవపిళ్ళైను.

'ఆఁ, కొంచెం సేపయింది.'

'శబ్దం వినిపించింది' కొంచెం ఆగి కొచ్చమ్మ అడిగింది:' ఆయన యిక్కడనే వున్నారని నీవేమయినా చెప్పావా?'

'లేదు, చెప్పలేదు.'

'మంచిపని చేశావు, మేము కేరమ్సు ఆడుతున్నాము. అతన్ని ఇక్కడినుంచి వెళ్ళమని చెప్పకపోయినావా?'

కేశవపిళ్ళై కొంచెం చాకచక్యం నేర్చుకున్నాడు.

'చెబుదామనే అనుకున్నాను. కాని అలా చెబితే అయ్యగారూ మీరూ.....'

కొచ్చమ్మ కేశవపిళ్ళై వాక్యాన్ని పూర్తి చేసింది:

'నేనేమనుకోను. ఆయన కూడా ఏమనుకోరు. అతన్ని మెడబట్టి గెంటెయ్యాల్సింది. వీళ్ళు చాలా చెడ్డవాళ్ళు.' కేశవపిళ్ళై యేమీ మాట్లాడ లేదు. కొచ్చమ్మ అడిగింది:

'పెళ్ళి సంగతేమన్నా అడిగాడా?'

అతను నిజం చెప్పచ్చు:

'లేదు.'

కొచ్చమ్మ అంతకు ముందు చేసిన హెచ్చరిక మరోసారి గుర్తు చేసింది:

'నీవు వీళ్ళ మధ్య ఇరుక్కోకు.'

మంచి అవకాశం పోగొట్టు కున్నట్టుగా భావిస్తూ ఆమె అన్నది:

'ఈ రోజు అతన్ని వెళ్ళగొట్టి వుంటే మళ్ళీ పెళ్ళి ప్రస్తావన యెత్తే వాడు కాడు.'

అప్పుడే ప్రైవేటు సెక్రటరీ అక్కడికి వచ్చాడు. విప్పారిన చిరునవ్వుతో అతనన్నాడు:

'ఏమిటోయ్, కేశవపిళ్ళా!'

'ఏం లేదు సార్!'

భగవతి కుట్టి అమ్మ వైపు తిరిగి ప్రైవేట్ సెక్రటరీ అన్నాడు:

'కేశవపిళ్ళ బాగా మనసు పెట్టి ఫైళ్ళు చదువుతాడని చీఫ్ సెక్రటరీ నాకు చెప్పాడు. ఆ జల విద్యుత్ ప్రణాళిక మీద చీఫ్ ఇంజనీరు రిపోర్టును కేశవపిళ్ళ బయటికి తీశాడు. లేకుంటే లవ్‌లింగ్ కంపెనీకి ఉత్తర్వులు జారీ చెయ్యటం సాధ్యమయ్యేది కాదు. కేశవపిళ్ళ రక్షించాడు.'

'ఆ చీఫ్ ఇంజనీరు విషయం ఏం చేశారు?' కొచ్చమ్మ అడిగింది.

'అతన్ని వెళ్ళ గొట్టాలి. అదే ఆలోచిస్తున్నాను. అతను లవ్‌లింగుకు శత్రువు. అతను మరొకరి దగ్గర లంచం తీసుకున్నాడు.'

అతను చాలా సమర్థుడని భగవతి కుట్టి అమ్మ అంటుంది.

'మంచిదోయ్ కేశవపిళ్ళా! పని జాగ్రత్తగా చూసుకో. దివాన్‌జీ కూడా నీ పనిని చాలా మెచ్చుకున్నాడు.' అంటూ ప్రైవేట్ సెక్రటరీ వెళ్ళిపోయ్యాడు.

కొచ్చమ్మ ఏదో చెప్పబోతూ వుంది. బహుశా ప్రైవేట్ సెక్రటరీ వచ్చి పోయినాడని ఎవ్వరికీ చెప్పవద్దని కాబోలు.

## పన్నెండు

కుమాటిలో పడవ దిగి కూలీ చేత మూట మోయించుకుని కేశవపిళ్ళ యిల్లు చేరాడు. దారిలో అన్ని యిండ్లల్లో నుంచీ ఆడవాళ్ళు బయటికి వచ్చారు. పెద్ద వాళ్ళు కుశల ప్రశ్నలడిగారు: 'ఇప్పుడే వస్తున్నావా?' 'మూటలో ఏవుంది?'. అతన్ని బాగా చూడలనే కుతూహలంతో ముసలమ్మలు 'కొంచెమాగు బాబూ, బాగా చూడనియ్' అంటున్నారు. కేశవపిళ్ళ వచ్చాడనే విషయం ఊళ్ళో అందరికీ చర్చనీయాంశ మయింది. అక్కడ పుట్టి పెరిగిన ప్రభుత్వోద్యోగి అయినందు వల్లనే కాక, పెళ్ళయిన తరవాత ఇదే తొలిసారి రావటం వల్ల కూడాను. కేశవపిళ్ళ వచ్చాడనే వార్త నాణీకుట్టి పరుగెత్తి కాత్యాయనికి చెప్పింది.

కేశవపిళ్ళ అందంగా తయారయినాడని అందరూ అంటున్నారు. ఉద్యోగస్థుడికి వుండాల్సిన హెూదా, యోగ్యత అతనిలో కనిపిస్తున్నాయి.

అతని మాటల్లో మర్యాద వుంది. శ్రీపద్మనాభుని పదిపైసలు చేతిలోకి వస్తే ఎంత తెలివి తక్కువ వాడిలో కూడా తేజస్సు వస్తుంది. కేశవపిళ్ళెలో అంతకు ముందే తేజస్సు వుంది.

కుట్టి అమ్మ గుమ్మంలోనే కేశవపిళ్ళెను ఆశీస్సులతో ఉక్కిరి బిక్కిరి చేసింది. ఆ సమయంలో కిట్టుమామ కూడా అక్కడే వున్నాడు. అమ్మ, నాన్న, కిట్టుమామ, అక్కయ్య అందరూ పరుగెత్తుకొని గుమ్మం దగ్గరికి వచ్చారు. కుట్టి అమ్మ తన్మయత్వంతో తన్నుతాను మరిచి పోయేంత వుత్సాహంతో మొదలెట్టింది:

'మా బంగారు తండ్రి వచ్చాడు. ఇక్కడి పాడు ముండలందరూ ఏమేమో వాగారు.'

'నీకు తలతిరుగుతున్నది. నోటికి అగ్గం పగ్గం లేకుండా పోయింది.' అన్నాడు పప్పుపిళ్ళె.

కుట్టిఅమ్మ కూహా వదల్లేదు:

'నేను మాత్రం ఏమన్నాను? భలే బాగావుంది.'

కాత్యాయని గుమ్మం చాటున వుందా లేదా అని కేశవపిళ్ళె చూశాడు. ఆమె యెక్కడా కనిపించక పొయ్యే సరికి ఆమె పుట్టింటికి వెళ్ళి పోయిందేమోనని అతనికి అనుమానం వేసింది. కాని అది అడగదగిన ప్రశ్న కాదు. కుట్టిఅమ్మ మూట విప్పి చూస్తూవున్నది. పప్పుపిళ్ళె దృష్టి కుమారుడు తెచ్చిన నల్ల పొగాకు మీద పడింది. బట్టలు చాలా తెచ్చాడు. నాన్న కోసరం లుంగీ, నల్లంచు వుత్తరీయం తెచ్చాడు. అక్కయ్యకు, అమ్మకు కూడా బట్టలు తెచ్చాడు. కిట్టుమామకు మల్‌మల్ లుంగీ, అంచున్న అంగవస్త్రం తెచ్చాడు అవికాక మరో ప్రత్యేకమైన ప్యాకెట్ వుంది. అందులో జరీవేసిన మూడు లుంగీలున్నాయి. నాలుగంగుళాల వెడల్పున జరీఅంచు వుంది. అది ఎవరికోసం తెచ్చి వుంటాడో వేరే చెప్పనక్కరలేదు. కుట్టిఅమ్మ ఒళ్ళు తెలియనంత వుత్సాహంతో కేకవేసింది:

'కాత్యాయనీ! అమ్మాయ్! ఇలారా! ఇటు చూడు.'

పసిపిల్లలాగా కుట్టిఅమ్మ కేకలు పెడుతూ వుంటే పప్పుపిళ్ళె అన్నాడు.'

'నీకేమన్నా పిచ్చి పట్టిందిటే?'

కాత్యాయని రాలేదు. పప్పుపిళ్ళె మందలింపును లక్ష్య పెట్టకుండా కుట్టి అమ్మ మళ్ళీ కేకపెట్టింది.

'అది వంటిల్లు వదిలిరాదు. స్నానం పానం కూడా వదిలేసింది. అలాగే పిచ్చిదానిలా వంటింట్లో ఒక మూల కూర్చుని వుంటుంది. ఇలాంటి పిల్ల ఎక్కడయినా వుంటుందా?'

కాత్యాయని అలా తయారయినందుకు పప్పుపిళ్ళె, కుట్టి అమ్మ మీద నేరం మోపాడు. కుట్టిఅమ్మ సమాధానం చెప్పింది:

'నేనేం చేయ్యను? ఊళ్ళో ఆడవాళ్ళంతా దాన్ని చెరువు దగ్గరికి చేరనియ్యరు. ఏవేవో ఆడిపోసుకుంటారు. అది పెరట్లో నిలబడ్డా ఆడంగులంతా పోగవుతారు. అది మాత్రం ఏం చేస్తుంది? అందుకే వంటింట్లోంచి బయటికి రాదు. ఇందులో నా తప్పేముంది?'

'అమ్మాయి మంచి కుటుంబానికి చెందింది. అసలు విషయమదీ 'అన్నాడు కిట్టుమామ.

వంటింట్లో కాత్యాయని పనిలో వుంది. ఆమెకు సాయంగా కొచ్చునాటీ కూడా వుంది. భర్త వచ్చాడు కదా! అందుకని వంట కమ్మగా చెయ్యాలి. హోటలు భోజనం బాగా వుండదని కాత్యాయనికి ఎవరో చెప్పారు. ఎంత కాలం నుంచో అతను హోటలు తిండి తింటూ వున్నాడు. కేశవపిళ్ళకు ఎలాంటి కూడు యిష్టమో కాత్యాయని కుట్టి అమ్మనడిగి తెలుసుకుంది. ఆమె భర్త కోసరం మంచి మంచి పదార్థాలు తయారు చేస్తూ వుంది.

అయినా ఆ ప్యాకెట్‌లో ఏముందో తెలుసుకోవాలని కాత్యాయనికి గాఢమైన కుతూహలం వుంది. తనకోసరం తెచ్చిన వస్తువును చూడాలని ఆమెకు చాలా ఉబలాటంగా వుంది. తిరువనంతపురం నుంచి తెచ్చిన వస్తువును చూడాలని అభిలాష వుండదూ మరి? ఎంత గాఢమైన అభిలాష వున్నా సిగ్గుపడి అక్కడికి వెళ్ళలేదు.

కుట్టిఅమ్మ తనంతట తనే ఆ జరీ గుడ్డలు తీసుకుని వంటింట్లోకి వెళ్ళింది. నిజంగా కాత్యాయనికి కళ్ళు చెదిరిపోయాయి. ఆమె యింత మంచి గుడ్డలు ఎప్పుడూ చూడలేదు. నాణీకుట్టి కూడా చూసి స్తంభించి పోయింది. అంత మేలు రకం వస్త్రాలు నాణీకుట్టి కూడా ఈ రోజు వరకు చూడలేదు. పెళ్ళయిన తర్వాత కేశవపిళ్ళ తొలిసారి వచ్చాడు. అయితేనేం. (కొరతేమయింది?)

'అక్కయ్యకు, నాకు వేరే బట్టలు తెచ్చాడు. ఇది మా అమ్మాయి కోసరం అన్నది కుట్టిఅమ్మ.

ఆ మాటకు ప్రత్యేకమైన అర్థం వుంది. కాత్యాయని యింతవరకూ అనుకుంటూ వున్నది తప్పని ఆమెకు తెలియాలి. కొంచెం సేపాగి కుట్టిఅమ్మ నాణీకుట్టితో స్పష్టంగా అంది:

'ఈ ఆడ వాళ్ళంతా ఏమేమో అన్నారు. వాడేం వస్తాళ్ళే వాడికి పెళ్ళాం ఎందుకు? తిరువనంతపురంలో వాడికి ఉంపుడుకత్తె వుంది. ఇలా ఏమేమో వాగారు. ఇప్పుడు వాళ్ళంతా వచ్చి చూస్తే తెలుస్తుంది.'

ఆ సమయంలో మరో మూల కూర్చుని కిట్టుమామ పంచాంగం తిరగేసి మంచిరోజు చూస్తున్నాడు. ఆరోజు తను ఇంటికి వస్తానని కేశవపిళ్ళకు కూడా తెలియదు. ఎంతో కష్టం మీద రెండు రోజుల సెలవు తీసుకుని వచ్చాడు. కిట్టుమామ పంచాంగం చూస్తుంటే కేశవపిళ్ళ నవ్వుతూ అన్నాడు:

'నేను జ్యోతిష్యుడి దగ్గర మంచి రోజు చూపించుకునే వచ్చాను.'

కిట్టుమామకు చాలా ఆనందమయింది.

'అయితే మా అల్లుడికి జ్యోతిష్యం మీద నమ్మకం ఏర్పడ్డదన్నమాట. బాగుంది. చెడ్డరోజులు వస్తే జాగ్రత్తగా వుండేందుకు వీలవుతుంది. అలాగే వుండాలి. ఏ పని చేస్తున్నా భగవంతుడి మీద నమ్మకం వుండాలి మంచి రోజు చూసుకోవాలి.

కేశవపిళ్ళె తిరువనంతపురం సంగతి చెపుతూ అన్నాడు: 'అక్కడ బంట్రోతు నుంచి దివాన్‌జీ దాకా జ్యోతిష్యం మీద నమ్మకం వున్నవాళ్ళే. ప్రతివాడికి ఒక జ్యోతిష్యుడున్నాడు. మాసఫలితం ముందే చూపించుకుంటారు. సర్కారు నౌకరి కదా మామా! ఎప్పుడు ఎక్కడికి వెళ్ళాల్సి వస్తుందో తెలియదు. అందుకని మంచి రోజులూ, చెడ్డరోజులూ ముందే చూపించుకుంటారు.

వాళ్ళు చదువుకున్న వాళ్ళు, తెలివిగల్ల వాళ్ళు అవటం వల్ల అలా చేస్తారని కిట్టుమామ తన అభిప్రాయం చెప్పాడు. ఈ మధ్య తిరువనంతపురంలో మరో విషయం ప్రచారంలోకి వచ్చిందని చెపుతూ కేశవపిళ్ళె అన్నాడు:

'నేను చదువుకునేప్పుడు తిరువనంతపురంలో శబరిమల వెళ్ళే ఆచారం అంతగా లేదు. కాని యీ రోజుల్లో సచివాలయంలో సగంమంది నల్లదండ వేసుకుని గడ్డం పెంచుకుంటున్నారు. ఈ సంవత్సరం దివాన్‌జీ కూడా వెళుతున్నారు. అందువల్ల ఈ సంవత్సరం మకర సంక్రాంతికి అందరూ శబరిమలకు ప్రయాణం కడుతున్నారు.'

కిట్టుమామకు ఇదేమంచి వార్త దొరికింది. ఇక అతను ఇంటింటికి వెళ్ళి ప్రభుత్వోద్యోగులు కూడా అయ్యప్ప భక్తులయినారనే విషయం ప్రచారం చేస్తాడు.

'కాని ఒక్కవిషయం వుంది. శబరిమల మీద నమ్మకం వుండాలి.' అన్నాడు కేశవపిళ్ళె.

'అందులో సందేహమేముంది? దాని సంగతే అంత.' అన్నాడు కిట్టుమామ కేశవపిళ్ళెతో ఏకీభవిస్తూ.

కేశవపిళ్ళె ఇద్దరి ముగ్గురి అనుభవాల్ని గురించి చెప్పాడు. ఒకతను ప్రొమోషన్ వస్తే శబరిమల వెళతానని మొక్కుకున్నాడు. అతనికి ప్రొమోషన్ వచ్చింది. శబరిమల వెళ్ళి బాగా పూజచేయించాడు. మరొకతన్ని కింద పదవికి పంపారు. అతను గూడా శబరిమల వెళ్ళాడు. ఆ తర్వాత అతనికి మళ్ళీ ప్రొమోషను వచ్చింది. కంప్లైంటు, పైఅధికార్లకు అపనమ్మకం, తప్పు పనులు చేసినా ఏమీ కాకపోవటం ఇలాంటి కథలే అన్నీ, కేశవపిళ్ళె చెప్పాడు.

'ప్రభుత్వంలో ఉద్యోగం కదా కిట్టుమామ! ఖర్చుకు డబ్బు చాలక పోతే లంచం తీసుకుంటారు. ఆమాట వాళ్ళు చెపితే అందరూ వాళ్ళను నానామాటలూ అంటారు. అందుకని యీ బెడద తప్పించుకొని నేరారోపణ జరగకుండా వుండేందుకు స్వామి దర్శనం'చేసుకుంటారు.'

'నీవు కూడా శబరిమల వెళ్ళాలి, అన్నాడు కిట్టుమామ.

'నేను వెళతాను. మంచి ప్రొమోషను వస్తే శబరిమల తప్పకుండా వెళతాను. నేను మొక్కుకున్నాను.'

'కానీ, అందుకోసం ఏందు చెయ్యాలి. పుష్కలంగా డబ్బు పోగు చేసుకోవాలి. ఇదంతా యెక్కడ జరిగేటట్టు?' అడిగాడు కిట్టుమామ.

'ఇది తిరువనంతపురంలోనే జరగాలి. అక్కడయితే పై అధికారి, సెక్రటరీ, దివాన్‌జీ ప్రైవేట్ సెక్రటరీ కూడా వస్తారు. వస్తే దివాన్‌గారు కూడా రావచ్చు.'

కిట్టుమామ నోరు తెరుచుకొని కూర్చున్నాడు: 'అయితే మా అల్లుడికి దివాన్‌జీతో కూడా పరిచయమున్నదన్నమాట.'

కేశవపిళ్ళె మందహాసంతో అవునన్నట్టు ముఖం పెట్టాడు. కాబట్టి ప్రతియింట్లో చాటి చెప్పేందుకు కిట్టుమామకు మరో విషయం దొరికింది. అలా చెప్పేందుకు అతనికి నాలుగయిదు రోజులు పడుతుంది. కేశవపిళ్ళె ఇంట్లో అందరికీ గుడ్డలు తెచ్చాడని ప్రతియింట్లో చెప్పాలి. అంతేకాక తనకు తెచ్చిన గుడ్డలు చూపించాలి. కేశవపిళ్ళెకు దివాన్‌జీతో పరిచయముంది. అందువల్ల శబరిమల వెళ్ళేముందు ముడుపు తిరువనంతపురంలోనే కట్టాలి. ఈ విషయాన్ని అందరికీ చెప్పాలి.

దివాన్‌జీతో నాకు పరిచయముందని కేశవపిళ్ళె చెప్పినప్పుడు కిట్టుమామ ఒక మాట చెప్పాలనుకున్నాడు:

'ఇదంతా దాని అదృష్టం. కాత్యాయనిదే. ఈ అదృష్టం' అని.

నాణీకుట్టి చాలా కుతూహలంతో అటూ ఇటూ తిరుగుతూ వాళ్ళు చెప్పుకునే మాటలన్నీ వింటున్నది. మంచి రోజును గురించి కిట్టుమామ, కేశవపిళ్ళె అనుకున్న మాటలు నాణీకుట్టి చాటునుంచి విన్నది. కొన్ని మాటలే ఆమె విన్నది. కొన్ని మాటలే ఆమెకర్థమయినాయి. ఆమె పరుగెత్తి కాత్యాయనితో చెప్పింది:

'ఈరోజు మంచి రోజు.

స్నానం చేసి బాగా షోకు చేసుకుని వుండాలి.'

కాత్యాయని సిగ్గు పడుతూవుంది. నాణీకుట్టికి తమాషాగా వుంది. కాత్యాయని చెవిలో ఆమె యేదో చెప్పింది. ఆ తర్వాత తనకు తోచిన సలహాలిచ్చింది.

అప్పుడు కాత్యాయని కూరలో తిరగమోత వేస్తున్నది. ఆ ఘుమఘుమలు బయటిదాకా ప్రసరిస్తూ వున్నాయి.

మధ్యాహ్నం దాటింది. అమ్మ పక్కింటికి వెళ్ళింది. గౌరిఅమ్మ స్నానానికి వెళ్ళింది. తండ్రి బయట నిద్రపోతున్నాడు. కాత్యాయనికి ఇంకా వంటింటినుంచి బయట పడేందుకు తీరుబడి కాలేదు. సాయంత్రం పని పూర్తి చేసుకుంటున్నది. కేశవపిళ్ళె చడీ చప్పుడూ లేకుండా పిల్లిలా వంటింట్లో దూరాడు.

ఆరోజు కాత్యాయని మెరుపులా అటూ ఇటూ వెళుతూ వుంటే రెండు మూడు సార్లు కేశవపిళ్ళె చూశాడు.

కేశవపిళ్ళె వంటింట్లోకి వచ్చిన విషయం కాత్యాయని గమనించలేదు. ఆమె కాఫీగింజలు వేయిస్తున్నది. ఆమె దృష్టంతా గింజల మీదనే వుంది. ఉన్నట్టుండి వెనక్కి తిరిగి చూసేసరికి కేశవపిళ్ళె అక్కడ నిలబడి వున్నాడు. అతను కూడా సగం దూరం వచ్చి ఆగిపోయినాడు.

వంటపని చెయ్యటం వల్ల కాత్యాయని బట్టలు నల్లగా వున్నాయి. రవిక వెనక నూనె మరకలున్నాయి. చెక్కిళ్ళకు మసి అంటింది. తలమీద బూడిద అంటుకొని వుంది. మంట దగ్గర కూర్చుని వుండటం వల్ల ఒళ్ళంతా చెమటలు పట్టింది.

కాత్యాయని కంగారు పడి వేయించటం ఆపి వేసింది. ఆమె తల వంచుకుంది. కేశవపిళ్ళెకు ఏమనాలో తెలియలేదు. ఏదో అనాలి కదా!

'బాణలిలో ఏముంది?' అడిగాడతను.

కాత్యాయని మాట్లాడలేదు. ఆమెకు నవ్వు వస్తూవుంది.

'వంటింట్లో నుంచి బయటికి వచ్చేదెప్పుడు?' అతను రెండో ప్రశ్న వేశాడు.

దానికి సమాధానం లేదు.

'స్నానం – పానం లేదా?'

మౌనం!

ఒకవేళ ఆ అమ్మాయి తంకమ్మ కాక పోయినా పట్నవాసంలో పెరిగిన మరో పిల్ల అయివుంటే వంటింట్లోకి వెళ్ళి కాత్యాయనిని చూడగానే మోకాళ్ళ వరకు వేలాడే జుట్టుతో, నొసట బొట్టుతో, నల్లంచు చీర కట్టుకున్న తంకమ్మ గుర్తు వచ్చేదా? రాదా? దాని సంగతి అలావుంచి తంకమ్మ కాక మరే పిల్లయినా ఆ పరిస్థితిలో ఎలా వుండేది? ఎలా నిలబడి వుండేది?

ఎవ్వరూ లేని సమయంలో కేశవపిళ్ళె కాత్యాయని దగ్గరికి ఎందుకు వెళ్ళినట్టు? కౌగిలించుకునేందుకు వెళ్ళి వుంటాడా? లేకుంటే చుంబనం కోసరం వెళ్ళాడా? లేక ఊరికే క్షేమ సమాచారాలడిగేందుకు వెళ్ళుంటాడా? కౌగిలించుకోవాలనుకుంటే మటుకు అది ఎలా సాధ్యం? బొగ్గు మసి, చెమటతో జిడ్డు కారుతున్న ముఖాన్ని ముద్దు పెట్టుకుంటే అతని మొహం కూడా నల్లబారిపోతుంది. ఆ తర్వాత ఒక సబ్బు బిళ్ళంతా అరగదీసి కడుక్కుంటేనే కాని ఆ మసి పోదు.

ప్రథమ సమాగమం రోజు శోభనపు పెళ్ళికూతురు ఇలాగేనా ఉండాల్సింది? ప్రథమ చుంబనం కోసరం భర్త ఏక్షణంలోనయినా రావచ్చును కదా! చక్కగా పూలు పెట్టుకుని కళకళలాడుతూ వండద్దూ! మంచి లుంగీ, జంపరు వేసుకుని ఉండాల్సింది. బొట్టుకూడా పెట్టుకొని వుండాలి.

అతనిలోని పొంగంతా చల్లారిపోయింది. గుండె ఆరిపోయివుంటుంది. ఆమె రూపం అలా వుంది. అందుకనే అతను ఆమె దగ్గరికి వెళ్ళకుండా వంటింటి మధ్యలోనే ఆగిపోయాడు.

రుచిగా వంటచేసి శుచిగా భర్తకు పెడితే చాలని అనుకుంది పాపమా పల్లెటూరి పిల్ల. అంతకు మించి మరేమయినా జరిగితే అది పగలు జరగదని ఆమె అనుకొని వుంటుంది. చడీచప్పుడూ లేకుండా కేశవపిళ్ళై వంటింట్లో చొరబడతాడని ఆమె ఊహించి వుండదు.

తన భర్త తనను ఇష్టం లేకుండా పెళ్ళి చేసుకున్నాడని కాత్యాయనికి పొరుగింటి వాళ్ళ వల్ల తెలిసింది. భర్తను వశం చేసుకోవాలని ప్రతి యువతికీ ఉంటుంది. కటాక్ష వీక్షణం సంగతి అలా ఉంచండి. అది కొంచెం ఎక్కువే అవచ్చు. కాని కొంచెం ఉత్సాహం చూపించటం, అలంకరించుకోవటం సహజం, అలంకరణ స్త్రీలకు స్వభావ సిద్ధమైన లక్షణం.

కేశవపిళ్ళై కొంచెం అసహ్యించు కుంటున్నట్టు నిలబడ్డాడు. అతని ప్రశ్న కూడా అలాగే వుంది. జీవితమంతా యీ మొరటు పిల్లతో గడవాలి. అసహ్యం వేయక ఏం చేస్తుంది? ఒక వేళ అతను మధ్య మధ్య యింటికి రాక పోయినా ఆశ్చర్యం లేదు.

ఆ సమయంలో నాణీకుట్టి కుట్టిఅమ్మతో ఏదో గంభీరంగా చెపుతూ వుంది. కేశవపిళ్ళై వంటింట్లో వున్న విషయం తెలియ కుండానే కుట్టిఅమ్మ అక్కడికి వెళ్ళింది. కేశవపిళ్ళై వంటింటి నుంచి బయటికి పారిపోయినాడు. కుట్టిఅమ్మ కాత్యాయని మీద కోప్పడింది.

'ఇంత తెలివి తక్కువ పల్లెటూరి మొహాన్ని నేనెక్కడా చూడలేదు. పొద్దుణ్ణుంచి నేను స్నానం చెయ్యమని కొట్టు కుంటున్నాను! అదేమో కూర తిరగమోత వెయ్యటంలో మునిగి వుంది.'

అత్తగారు వంటింట్లోకి వచ్చారు. కాని కేశవపిళ్ళై వెళ్ళిపోయిన సంగతి కాత్యాయనికి తెలియదు. ఆమె బాణలి గరిటెపెట్టి మోకాళ్ళమీద మోచెయ్యి పెట్టుకుని కూర్చుంది.

'ఎందుకిలా కూర్చున్నావ్? అన్నది కుట్టిఅమ్మ.

కాత్యాయని తలెత్తింది. కాఫీ గింజలు మాడి పోయినాయి.

'అరే, కాఫీ గింజలు ఎందుకూ పనికి రాకుండా పోయినాయే? ఏమయిందమ్మా?'

కాత్యాయని మాట్లాడలేదు. స్వానుభవం ఎలా చెపుతుంది? ఆమె తప్పేమీ లేకపోయినా ఏమీ చెప్పలేదు.

'స్పృహ తప్పి పోయిందా అమ్మా?'

కుట్టిఅమ్మ కాత్యాయని ముఖంవైపు జాగ్రత్తగా చూసింది. స్పృహ తప్పటం కాదది. ఆమె మొహం మీద చిరునవ్వు ఇంకా ఇంకి పోలేదు.

'మా తల్లీ! ఇంక స్నానం చెయ్యి. నీతల బాగా మాసింది. తలకు స్నానం చెయ్యి. వెళ్ళమ్మా!'

అప్పటికి నాణీకుట్టి కూడా అక్కడికి వచ్చింది.

'వాడికి నీ ఒళ్ళు వాసన కొడుతుంది' మెల్లిగా అన్నది కుట్టిఅమ్మ.

'ఎందుకలా నిలబడ్డావ్?' అని కుట్టిఅమ్మ కాత్యాయనికి గంధం, శనగపిండీ అందించింది. తాను స్వయంగా కోడలికి స్నానం చేయిద్దామని ఆమె అనుకుంది కాని నాణీకుట్టి ఆ బాధ్యత తన మీద పెట్టుకుంది.

సాయంత్రం పెరట్లో కేశవపిళ్ళై పచార్లు చేస్తున్నాడు. అది పూర్వీకులు కట్టించిన గుడి బయలు. అక్కడో పెద్ద మామిడి చెట్టు కూడా వుంది. శిథిలమైన గంధర్వాలయం; ఎదురుగా ఒక పెద్ద మర్రి చెట్టు వుంది. దాని మీద మల్లె తీగ అల్లుకుని వుంది. చిన్నప్పుడు కేశవపిళ్ళై బుట్టనిండా మల్లెమొగ్గలు కోసుకొని వచ్చేవాడు. ఈనాడు కూడా ఆ చెట్టు, పూలతో కళకళ లాడుతూ వుంది. ఆ చెట్టు చూస్తే ఎవ్వరూ ఒక్క పువ్వు కూడా కోసినట్టు లేదు. రోజూ ఆ చెట్టు కింద ఎన్నో మల్లెపూలు రాలి పడి వుంటాయి. వాడిపోయి ఎండిపోయిన పూలు ఆ చెట్టు కింద అలాగే పడి వున్నాయి. అయ్యో! ఏ పిల్ల కూడా ఆ మల్లె పూలతో దండ కట్టుకొని తలలో పెట్టుకోదు.

ఇంట్లో కుట్టిఅమ్మ కోడలితో వాగ్వాదం చేస్తూ వుంది. స్నానం చేసిన తర్వాత తలలో మురికి, నూనే పూర్తిగా పోలేదనీ, తల వాసన కొడుతున్నదనీ ఆమె గొడవ. మెడ వెనక ఇంకా మురికి వుంది. ఆమె సరిగ్గా స్నానం చెయ్యలేదు.

'అయ్యో దేవుడా! ఏం చెయ్యను? ఈ పిల్ల తెలివి ఇలాంటిది' అన్నది కుట్టిఅమ్మ విచారిస్తూ.

ఆ రోజు కోడలికి కేశవపిళ్ళై తెచ్చిన జరీఅంచు లుంగీ, జంపరూ కట్టారు. పెరట్లో కేశవపిళ్ళై ఒంటరిగా నిలబడి వున్నాడని కుట్టిఅమ్మ గమనించింది. అతని దగ్గరికి వెళ్ళమని ఆమె కాత్యాయనికి చెప్పగలదా? కాత్యాయని తనంతట తానే అతని దగ్గరికి వెళ్ళాలి. ఆ విధంగా ఆమె తన భర్తను వశపరుచుకోవద్దూ? పక్కింటి దేవకి చేత కుట్టిఅమ్మ చెప్పించింది. కాని కాత్యాయని దేవకిని బాగా ఝాడించింది. ఆరోజు సాయంత్రం కుట్టిఅమ్మ కాత్యాయనిని వంటింట్లోకి రానియ్యలేదు. వంటింటి పనంతా ఆరోజు గౌరీఅమ్మ చూసుకుంది.

ఉత్తరం వైపున ఒక చిన్న గదిలో కేశవపిళ్ళై ఇదివరకు పడుకొనే వాడు. భోజనమయిన తర్వాత అతను ఆ గదిలోకి పడుకొనేందుకు వెళ్ళాడు. గదిలో కొద్దిగా వెలుతురుంది. తలుపు దగ్గరకు వేసివుంది. తలుపు తెరుచుకొని కేశవపిళ్ళై లోపలికి ప్రవేశించాడు. ఇంట్లో వున్న పెద్ద దీపం నిండా చమురు పోసి వెలిగించారు. పాత మంచం మీద పక్క పరిచి వుంది. దాని మీద ఒక కొత్త దిండు వేశారు. తెల్లటి దుప్పటి కూడా పరిచారు. కింద నేల మీద చినిగిపోయిన చిరుచాప వేసి దాని మీద నూనె మరకలతో వున్న చినిగిపోయిన దిండు వుంది. దిండులో నుంచి దూది బయటికి కనిపిస్తూ వుంది. చూడగానే అక్కడెవ్వరూ కనిపించటం లేదు. అదీ శోభన గృహం, దాని అలంకరణా. ఆ గది కప్పుమీద బిల్లులు లేవని చెప్పేందుకు వీల్లేదు. అక్కడ సుగంధ ద్రవ్యాల వాసన ఏమీ లేదు. మంచం మీద పూలు లేవు. నీళ్ళ చెంబు మాత్రం అక్కడ పెట్టి వుంచారు. ఒకమూల గోడకానుకొని ఎదురుగాఉన్న గోడవైపు చూస్తూ కాత్యాయని నిలబడి వుంది. కేశవపిళ్ళై తలుపు మూసి గొళ్ళెం వేశాడు. తర్వాత మంచం మీద కూర్చుని మెల్లిగా కాత్యాయనిని దగ్గరికి పిలిచాడు -

'ఇలా రా.'

ఆమె అలాగే నిలబడి పోయింది.

'ఇలా రా.'

అయినా ఆమె కదలలేదు.

కేశవపిళ్ళై లేచి కాత్యాయనిని పట్టుకునేందుకు చెయ్యి చాచాడు, కాని పట్టుకోలేదు. తనకు బహుశా వెనకటి జుగుప్స కారణమయి వుంటుంది.

కేశవపిళ్ళై కాత్యాయనిని చెయ్యి పట్టుకొని మంచం మీర కూర్చో పెట్టాడు. కల్లా కపటం తెలియని పసిపిల్లలా ఆ అమ్మాయి నవ్వుతూ వుంది. అతనికి ఆమె మెడమీద చెయ్యి పెట్టేందుకు మనస్కరించలేదు.

'నీవు స్నానమెందుకు చెయ్యవు' అని అడిగాడు కేశవపిళ్ళై సందేహిస్తూ.

అయినా ఆ అమ్మాయి నవ్వుతూనే వుంది.

తిరువనంతపురం నుంచి వచ్చేప్పుడు తన భార్య వెయ్యి ప్రశ్నలు వేస్తుందని కేశవపిళ్ళై భయపడ్డాడు. ఆమెకు అలా ప్రశ్నించేందుకు అధికారముంది కాబట్టి. తాను సమాధానం చెప్పలేని ప్రశ్నలకు కూడా సమాధానం తయారుచేసి పెట్టుకున్నాడు. తిరువనంతపురంలో తనకెవరయినా ప్రియురాలు ఉందా అని ఆమె అడగవలసిన ప్రశ్న. ఇన్నాళ్ళెందుకు రాలేదు? తన మీద ప్రేమ వుందా? ఇలాంటివే వెయ్యి ప్రశ్నలు. కాని ఆమె ఏమీ అడగలేదు. అడిగే సూచనలు కూడా కనిపించటం లేదు.

మర్నాడు ఉదయం కాత్యాయని కేశవపిళ్ళైకే కాఫీ అందించింది. మధ్యాహ్నం భోజనం కూడా కాత్యాయనే వడ్డించింది. కేశవపిళ్ళై అన్నం తిని

వెళ్ళిన తర్వాత అదే పళ్ళెంలో కాత్యాయని తనకు అన్నం వడ్డించుకుంది. అది చూసి కేశవపిళ్ళె అడిగాడు:

'ఎంగిలి పళ్ళెంలో ఎందుకు తినటం? ఆ పళ్ళెం కడిగి పెట్టుకోవచ్చుగా!'

'అత్తయ్య, మామగారు తిన్న పళ్ళెంలోనే తింటారు.' కాత్యాయని సమాధానం చెప్పింది.

కుట్టిఅమ్మ మనస్సు తృప్తి పడింది. ఆమె తన భర్తతో అన్నది:

'వాళ్ళిద్దరికీ ప్రేమ ఏర్పడింది. చాలా ప్రేమ'

పప్పుపిళ్ళెకు మనస్సు కుదుట పడింది. వాళ్ళిద్దరి ప్రేమను గురించి నాణీకుట్టి ఇరుగు పొరుగు వాళ్ళకందరికీ చెప్పేసింది.

మర్నాడు సాయంత్రం కేశవపిళ్ళె పెరట్లోకి వెళుతూ కాత్యాయనిని కూడా తీసుకొని వెళ్ళాడు. కాత్యాయనికి చాలా పని వుంది. అయినా అతని వెంట వెళ్ళింది.

కొంతమంది ఇరుగు పొరుగు వాళ్ళు వాళ్ళిద్దరినీ చూశారు.

'స్నానం చెయ్యకుండా ఇలా మురికిగా ఎందుకుంటావ్?' అడిగాడతను

'ఊరికే ఎందుకు స్నానం చెయ్యటం?' అన్నది కాత్యాయని.

కేశవపిళ్ళె దోసెడు మల్లెపూలతో ఒక దండ కట్టి కాత్యాయనికిచ్చి తలలో పెట్టుకోమన్నాడు.

'అమ్మయ్యో! ఎందుకు?' అన్నది.

ఇక కేశవపిళ్ళె ఏమంటాడు?

స్నేహితురాలు నాణీకుట్టి రాత్రి విశేషాలను గురించి కాత్యాయనిని పరోక్షంగా అడిగింది. కేవలం జిజ్ఞాస వల్ల కాదు గాని కేశవపిళ్ళెకు కాత్యాయని మీద ప్రేమ వుందా లేదా అని తెలుసుకునేందుకు అడిగింది. అసహ్యించుకుంటూ కాత్యాయని అడిగింది:

'పోవే, ఇలాంటివన్నీ నీవారోజు నాకు చెప్పావా?'

'నీవు నన్నడక్కపోయినా నా అంతన నేనే చెప్పాను.'

'అయినా యిప్పుడు చెప్పాలని లేదు నాకు.'

'చెప్పవే కాత్యాయనీ.'

'అయితే మరి..... అంతా నీలాగే.....'

కాత్యాయని సిగ్గుపడి నవ్వింది.

ఆరోజు కూడా కాత్యాయని భర్తను ఏమీ ప్రశ్నలు అడగలేదు. బహుశా అసలడగదేమో! ఆరోజు ఆమె మంచం మీద మల్లెపూలు చల్లింది.

మర్నాడు ఉదయం కేశవపిళ్ళె వెళ్ళిపోయాడు. గుమ్మంలో నిలుచుని కాత్యాయని చూస్తూ నిలబడ్డది. కేశవపిళ్ళె కళ్ళతోనైనా వీడ్కోలు చెప్పలేదు. ఇక్కడ తన భార్య వుందనే భావం కూడా అతను వ్యక్త పరచలేదు.

ఆరోజు సాయంత్రం భోజనం చేసేప్పుడు కాత్యాయని కుట్టిఅమ్మనడిగింది:

మళ్ళీ 'ఎప్పుడొస్తానని చెప్పారత్తయ్యా?'
'తెలివి తక్కువ దద్దమ్మా! ఈ మాట నీవు అడగాల్సింది.'
'నేనడగనూలేదు, ఆయన చెప్పనూలేదు.'
'చాలా బాగుంది. భలే దాంపత్యం' అంది కుట్టిఅమ్మ.

## పదమూడు

సచివాలయం నుంచి వచ్చిన తర్వాత కేశవపిళ్ళై తంకమ్మను రెండు మూడు సార్లు మాత్రమే చూశాడు. ఒకసారి పూమాల సేవరోజు, ఆతర్వాత తంకమ్మకూ సూపరింటెండెంటు రామచంద్రన్‌కూ సంబంధం వుందని గోవిందన్ నాయర్ చెప్పిన తర్వాత. రెండు సార్లు కేశవపిళ్ళై తంకమ్మను కలుసుకున్నాడు. ఆ రెండు సార్లూ అతనికి తంకమ్మతో మాట్లాడేందుకు అవకాశం దొరకలేదు. కేవలం దర్శనభాగ్యం లభించింది. తంకమ్మ ముఖవైఖరి చూస్తే ఆమెకు అతనితో మాట్లాడాలని వున్నట్టు కనిపించటం లేదు. అతనికి కూడా ఆమెకు చెప్పవలసిన విషయాలేమీ లేవు. అతను చెప్పదలుచుకుంటే చెప్పేందుకు చాలా విషయాలున్నాయి. కానీ, ఆ సంబంధం జీవితంలో ముగిసిన అధ్యాయం లాంటిది. కొంత సవరింపు మాత్రమే మిగిలివుంది. అంతకు మించి మరేమీ లేదు. ఆమె కూడా అతన్ని నిరాకరించింది. అంతా ముగిసిపోయిందనే అనుకోవచ్చు.

అప్పుడప్పుడూ కేశవపిళ్ళై ఆమెతో తనకు గల సంబంధాన్ని గుర్తు తెచ్చుకుంటాడు. ఆమెతో తాననుభవించిన సంభోగసుఖాన్ని అతనింకా మరవలేదు, మరవలేడు కూడాను. వాటన్నిటికి మూల కారణం తంకమ్మకి చెప్పేందుకు కూడా వీల్లేదు. నా అదృష్టం వల్లనే, కాత్యాయని అదృష్టం వల్లనే దానికి ప్రేమావేశం కలిగింది. కూతురి మీది ఆపేక్షవల్ల శేఖరపిళ్ళై శుక్రాచార్యునిలా పనిచేశాడు. కచుడిలాగా తనకది లాభించింది. కథ అలాంటిది. కేశవపిళ్ళై ఈ సంబంధాన్ని అదే దృష్టితో చూస్తున్నాడు. అయినా శేఖరపిళ్ళై స్నేహపాత్రుడు. అతన్ని ఉత్తమ వ్యక్తిగా భావిస్తాడు కేశవపిళ్ళై.

సచివాలయంలో ఆ కుర్చీమీద మౌనంగా కూర్చుని వున్న ఆ అమ్మాయి అప్పుడప్పుడు కేశవపిళ్ళై కళ్ళ ముందు ఒక చిక్కు ప్రశ్నలా కనిపిస్తుంది. కేశవపిళ్ళైను తంకమ్మ నిరాకరించటంలో ఏదో రహస్యం ఉంది. స్త్రీ మనస్సులోని అసంతృప్తి అందుకు కారణమై ఉండవచ్చు. తంకమ్మ అన్ని విషయాలూ మరిచిపోయి రామచంద్రన్ నాయరుతో పారిపోయిందని భావించటం కేశవపిళ్ళైకు సాధ్యం కావటం లేదు. దానికి ఎలాగో సమాధాన పడ్డా ఆమె భవిష్యత్తు ఎలా వుండబోతున్నది? రామచంద్రన్ నాయర్ తంకమ్మను పెళ్ళి చేసుకుంటాడా? అతను ఆమెను అదుపులో పెట్టుకోగలడా? ఒక వేళ రామచంద్రన్ నాయరు తంకమ్మను పెళ్ళి చేసుకునేందుకు సిద్ధమయితే శేఖరపిళ్ళై దానికి సమ్మతించి ఆశీర్వదిస్తాడా?

కేశవపిళ్ళెకు నమ్మకంలేదు. శేఖరపిళ్ళె దానికి సమ్మతించడు. ఒకవేళ సమ్మతించినా సమ్మతించవచ్చు. తంకమ్మ తండ్రిని ఒప్పించి తీరుతుంది. కాని ఆమె భవిష్యత్తు ఎలా ఉంటుంది?

ఆ సంబంధం అంతటితో తేల్చేందుకు అతను తంకమ్మను ఒకసారి కలుసుకోవాలి. అలా తెగతెంపులు చెయ్యకపోతే అందరూ అతన్ని తంకమ్మకు కాబోయే భర్తగా భావిస్తారు. ఆ భావంలో మార్పు రావాలి. బహుశా తంకమ్మ కూడా ఇలాగే తెగతెంపులు చేసుకోవాలని చూస్తూ ఉంటుంది. తాను కేశవపిళ్ళెకు కాబోయే భార్య అనే లోకాభిప్రాయం మార్చాలని, ఆమెకు కూడా ఉంటుంది.

పార్క్‌వ్యూలో కేశవపిళ్ళె పరిస్థితి అన్ని విధాలా సుస్థిరమయిపోయింది. ఇప్పుడతను లవలింగ్ కంపెనీ లాంటి వాళ్ళతో తిన్నగా సంప్రదింపులు జరిపే స్థితికి వచ్చాడు. చీఫ్ సెక్రటరీతోనే కాక దివాన్‌జీ ప్రైవేట్ సెక్రటరీతో కూడా అతను మాట్లాడగలడు. అతని వ్యవహారం అమ్మగారికి, అయ్యగారికి ఇద్దరికీ నచ్చింది. పెద్దపెద్ద పనులు కేశవపిళ్ళె సాధించగలుగుతున్నాడు. ఫైళ్ళను చక్కగా పరిశీలించి పని సాధించటం కేశవపిళ్ళె నేర్చుకున్నాడు.

ఎటువంటి సందేహాలకీ, దుష్ప్రచారానికీ, అవినీతికి కేశవపిళ్ళె ఎప్పుడూ ఆస్కారమియ్యలేదు. అతనెప్పుడూ కానుకలు గానీ లంచంగానీ తీసుకోలేదు. ఎవరయినా ఏదన్నా యిచ్చినా కేశవపిళ్ళె పట్టీ పట్టనట్టు తీసుకుంటాడు. తన సొంత పని కోసరం అతనెప్పుడూ పై అధికారిని కలుసుకోలేదు.

పార్క్‌వ్యూలోనూ, భక్తివిలాస్‌లోనూ కేశవపిళ్ళెకు బాగా చనువు దొరికింది. కాని పైపదవి యింకా రాలేదు. పై అధికారి సంతోషంగా ఉన్న సమయంలో ఈ మాట ప్రస్తావిద్దామని కేశవపిళ్ళె చాలాసార్లు ప్రయత్నించాడు. కానీ చెప్పలేక పోయినాడు.

ఒకరోజు కొచ్చమ్మ కేశవపిళ్ళెకు ఒక శుభవార్త చెప్పింది. ఆమె మొహంలో కూడ సంతోషం కనిపిస్తూ ఉంది. తంకమ్మకు ఇంట్లోవాళ్ళ మీద కోపం వచ్చి మరోచోట పాల్కులంగరేలోనే లేక పోరుంతన్నీలోనే ఒంటరిగా ఉంటున్నది. కొంచెమాగి కొచ్చమ్మ అన్నది:

'సూపరింటెండెంటు రామచంద్రన్ నాయరు దాన్ని పెళ్ళి చేసుకుంటాడు. నిన్ను పెళ్ళి చేసుకోమని యిక అడగదు.'

అసలు వృత్తాంతమంతా తెలుసుకోవాలని కేశవపిళ్ళెకు కుతూహలం వుంది కొచ్చమ్మకు అంతా తెలిసే వుంటుంది. కాని ఎలా అడగటం?

కొచ్చమ్మ చెప్పుకు పోతూ వుంది: 'ఆత్మాభిమానం, మట్టు, మర్యాద లేని చౌకబారు కుటుంబం వాళ్ళది. కేశవపిళ్ళే! నీ అదృష్టం బాగుండి ఆ సంబంధం తప్పిపోయింది. నీవు నిజంగా అదృష్టవంతుడివి. లేకుంటే ఆ పాడుకుటుంబంలో పడి నీవు నానావస్థా పడేవాడివి. మీ అయ్యగారికి

శేఖరపిళ్ళై అంటే మహాభయం. ఆయన యేదో బడబడా వాగే సరికి ఈయన అన్నింటికీ ఒప్పుకుంటారు. నేను దగ్గరుంటే అలాంటి అవకతవకలు జరగవు. ఏదో ఒకరోజు వీళ్ళ అన్నయ్య వచ్చి తంకమ్మను చేసుకోమని నీకు చెప్పమని చెపితే ఆయన నీకు తప్పకుండా చెపుతారు. నీవు కాదనటానికి కూడా వీలుండదు. ఇబ్బంది పడేవాడివి. ఇప్పుడు అలాంటి బెడదలేదు.

ఇందులో కొచ్చమ్మకు కూడా ఏదో జోక్యం ఉండవచ్చు. పార్వత్యాలో తనకు ఉద్యోగం ఇప్పించింది శేఖర్‌పిళ్ళై గదా? ఆమాటేగా ఆ ముసలాయన చెప్పింది?

కేశవపిళ్ళైకు కుతూహలం హెచ్చింది. యింట్లో జరిగింది జరిగినట్టు తెలుసుకునేందుకు ఆమెను అడగకుండా ఉండటమే మంచిదని అతనికి తెలుసు. అయినా ఆవేశంలో అడిగేశాడు:

'తంకమ్మకు కోపం వచ్చిందో లేదో మనకేం తెలుసు? వాళ్ళ నాన్నకు ఆ అమ్మాయంటే మహాప్రేమ.'

కొచ్చమ్మ అసహ్యించుకుంటూ అన్నది: 'ఎందుకో ఏమో నాకు తెలియదు. సిగ్గులేకపోతే సరి. అంతా తెలివితక్కువ దద్దమ్మలు. తండ్రికి తగిన కూతురు'

విషయం ఎలాగో బయట పడాలి. యథార్థం ఎలా తెలుసుకుందామా అని కేశవపిళ్ళై విచారిస్తున్నాడు.

కొచ్చమ్మ కొంచెం చిరునవ్వుతో అంది: 'నీవు ఆ పాడు కుటుంబంలో పడవలసిన వాడివి కావు. నీకు మంచి కుటుంబంలో మర్యాద గల పిల్లను మేము చూస్తాం.'

కేశవపిళ్ళై ఉలిక్కి పడ్డాడు. అన్ని అడ్డంకులూ తొలిగి దారి నిరాటంకం అవుతున్నదని అనుకునే సమయంలో మరో పెద్ద ఆటంకం దారుణమైన నీలినీడలను ప్రసరిస్తూ ఉంది. అందుకనే కాబోలు తంకమ్మతో తను వివాహం చేసుకోవటం తనకు ఇష్టం లేదని కొచ్చమ్మ ఇంతకు ముందు అన్నది. ఇది చాలా ప్రమాదమే. ఆమె మనసులో ఎవరో మరో పిల్ల ఉంది. కేశవపిళ్ళైకు తన సంగతి ఉన్నదున్నట్టు పూర్తిగా చెప్పేద్దామనిపించింది. అదే బాగుంటుంది. నాకు పెళ్ళయింది కాబట్టి యిక నన్ను పట్టించుకోక పోవచ్చునేమో! తన మనసులో ఉన్న పిల్లనిచ్చి చేసేందుకే కొచ్చమ్మ యిలా వ్యవహరిస్తున్నదేమో? మొత్తం మీద మనసులో చిరాకు కలిగింది. అంతే కాదు ఒక వేళ పెళ్ళయిందని చెపితే, ఎవరితో ఏ ఊళ్ళో - అనే ప్రశ్నలెన్నో వస్తాయి. ఈ ప్రశ్నలన్నింటిలో ఏరోజు, ఎప్పుడు అనేవి ముఖ్యమైన ప్రశ్నలు. ఇక్కడికి వచ్చేముందే పెళ్ళయిందని చెపితే తంకమ్మనూ, శేఖర పిళ్ళైనూ మోసం చేసిన వాణ్ణవుతాను. అసలు విషయం తెలుసుకోకుండా అందరూ నన్ను దొంగ అంటారు. నామీద అభిమానం తగ్గినా సరే, ఇప్పుడే

చెప్పెయ్యటం మంచిదా? లేక ఒక పైపదవి వచ్చిన తర్వాత చెప్పటం మంచిదా?

ఇంకో నిమిషం కొచ్చమ్మ అక్కడ నిలబడి వుంటే కేశవపిళ్ళె సమస్తం చెప్పేవాడు. కాని ఆమె అప్పటికే కూనిరాగాలు తీసుకుంటూ వెళ్ళిపోయింది.

కొంచెం సేపు కేశవపిళ్ళె రాతి బొమ్మలా కూర్చున్నాడు. అతని బుద్ధిబలం క్షీణించింది.

ఇంతలో గోపాలన్ నాయర్ దయ్యంలా ఎదుట నిలబడ్డాడు. పోలీసు బంట్రోతును మరిపించి అతను లోపలికి ఎలా రాగలిగాడు? చూసేందుకు ఎంత భయంకరంగానే ఉన్నాడు. చిరిగి పోయిన లుంగీ, బుష్‌షర్టు వేసుకున్నాడు. అవికూడా చాలా మాసిపోయి ఉన్నాయి. ఎముకల గూటిలో ఇరుక్కొని వున్న అతని రెండు కళ్ళూ తళతళలాడుతున్నాయి. ఎండిపోయిన వెంట్రుకలు జడలు గట్టి అతుక్కుపోయి ఉన్నాయి. అతని చేతిలో పాత గొడుగూ, కాగితాలూ వున్నాయి. అతను పూర్తిగా అస్థి పంజరంలా తయారయినాడు. చూసేందుకు పిచ్చివాడిలా వున్నాడు. అవును. నిజంగా పిచ్చివాడే. అందులో సందేహం లేదు. అతన్ని చూడగానే కేశవపిళ్ళెకు భయం వేసింది. ఈ పిచ్చివాణ్ణి లోపలికి ఎలా రానిచ్చావని బయట వున్న పోలీసు బంట్రోతును అడుగుదామనిపించింది. టేబిలు మీద పెట్టిన ఫైళ్ళను చింపుతాడేమో. పోలీసును పిలిచి లాభమేముంది? .....అదిగో ఎంత భయంకరంగా రొప్పుతూ రోజుతూ వున్నాడే! పరిచయమున్నట్టు తెలిపేందుకు అతను నవ్వుతున్నాడు. అది మనిషి నవ్వే నవ్వు కాదు, పిచ్చినవ్వు. ఒళ్ళు వాసన కొడుతూ వుంది. ఆరోజు వెళ్ళిపోయిన మనిషి అతను.

'నీకేం కావాలి?' అడిగాడు కేశవపిళ్ళె.

వినయంతో నమస్కారం చేసి అతనన్నాడు: 'ఆ ఫైలు అసిస్టెంటు సెక్రటరీ దగ్గర పడి వుంది.'

'అయితే నన్నేం చెయ్యమంటావ్' అన్నాడు కేశవపిళ్ళె.

అతను జవాబు చెప్పలేదు. కొంచెం సేపాగి అతనన్నాడు: 'నాయిల్లు వేలం కాబోతూవుంది. ఇద్దరు పిల్లలు ఆకలితో చనిపోయారు. నేనక్కడికి వెళ్ళలేదు. ఈ డబ్బు వస్తుందని చెప్పారు. చీఫ్ సెక్రటరీని కలుసుకుంటే చాలట.'

'అయితే నేను అసిస్టెంటు సెక్రటరీ దగ్గరనుంచి ఆఫైలు లాక్కొని రానా?' అన్నాడు కేశవపిళ్ళె విసుగుతో.

ప్రశ్న చాలా గంభీరంగా ఉందని గమనించి అతనన్నాడు: 'లేదు. అలాకాదు. ఊరికే అన్నాను.'

ఒకటిన్నర సంవత్సరం నుంచి గోవిందన్ నాయర్ ఆఫైలు అక్కడినుంచి కదిలించలేకపోయినాడు. కలుసుకోవలసిన వాళ్ళను కలుసుకోలేక పోలేదు. అక్కడికి వెళ్ళలేదనీ చెప్పలేము. అందరినీ కలుసుకుంటూ ఆఫీసు చుట్టూ

తిరుగుతూనే వున్నాడు. అతనికి మరో పని కూడా లేదు. కొంచెం ఆగి మళ్ళీ అతనన్నాడు:

'వేలం వేస్తారుట, అందుకని ముప్ఫయి రోజుల్లోగా డబ్బు కడితే వేలం ఆగిపోతుంది.'

కేశవపిళ్ళై డ్రాయరులో నుంచి రెండు రూపాయలు తీసి ఇయ్యబోయనాడు. ఆ రెండు రూపాయలు చాలా రోజుల కింద కేశవపిళ్ళై గోపాలన్ నాయరు దగ్గర తీసుకున్నాడు. ఒక్కక్షణం ఆగి వడ్డీ కింద అర్ధరూపాయి కలిపి మొత్తం, రెండున్నర రూపాయలు అతనికి ఇయ్యబోయాడు.

'అబ్బే, వద్దు వద్దు. నాకక్కర్లేదు. నాకు డబ్బక్కర్లేదు. నాఫైలు.....' అన్నాడు గోపాలన్ నాయర్.

అతనికి పిచ్చి పట్టబోతున్నట్టు తోచింది. అతని ధోరణి అలాగే వుంది. అతని చూపుల్లో, మాటల్లో కేశవపిళ్ళైకు మార్పు కనిపించింది. అతని చూపుల్లో నిలకడ లేదు. ఉన్నట్టుండి చంచల్యం ఎక్కువ అవుతూవుంది.

'అంతా నేను చూస్తాను. ఇది తీసుకోండి.' అన్నాడు కేశవపిళ్ళై.

'ఒఒ.'

గోపాలన్ నాయరు వెళ్ళిపోయాడు. అతను డబ్బు తీసుకోలేదు.

గోపాలన్ నాయర్ వెళ్ళిపోయిన తర్వాత గేటు దగ్గర నిలబడి వున్న చౌకీదారును కేశవపిళ్ళై అడిగాడు:

'ఈ మనిషి లోపలికి ఎలా వచ్చాడు?'

చౌకీదారు కంగారు పడ్డాడు. కేశవపిళ్ళై కొంచెం గంభీరంగా అడిగాడు.

తప్పుచేసిన బంట్రోతు అన్నాడు: 'తమర్ని చూస్తే తన పని అవుతుందని ఆయిన యేడ్చాడు బాబు! అందుకని వెళ్ళనిచ్చాను.'

'అతను పిచ్చివాడు.'

'నాకు తెలియదండీ.'

'ఆఁ' తలవూపుతూ కేశవపిళ్ళై అన్నాడు:

'మళ్ళీ యింకెప్పుడూ అతన్ని లోపలికి రానీయకు.'

'అలాగే నండీ.'

చాలా రోజుల కింద చీఫ్ సెక్రటరీని చూసేందుకు తను మాటిమాటికి గేటు దగ్గర నిలబడిన విషయం కేశవపిళ్ళై మరిచి పోయినట్టున్నాడు.

తరవాత, తంకమ్మ పాల్కులంగరేలో ఒంటరిగా ఉంటున్న సంగతి నిజమేనని తేలింది. బహుశా నిరాటంకంగా వచ్చే పోయేందుకు వసతిగా ఉంటుందని రామచంద్రన్ నాయరే అలా చెప్పి చేయించి వుంటాడు. ఆ పిల్ల తనకు నచ్చిన మొగవాడి కోసరం ఏమయినా చేసేందుకు సిద్ధపడుతుంది. ఈ విషయం కేశవపిళ్ళైకు తెలుసు. అతనికి ఎక్కువ వివరాలు తెలియలేదు.

చాలా విషయాలు అతను విన్నాడు. కాని వాస్తవంగా జరిగిందేమిటో యెవ్వరికీ తెలియదు. తంకమ్మ యింట్లోవాళ్ళమీద అలిగి వేరే ఉంటున్నదనే మాట మాత్రం నిజం.

ఒకరోజు కేశవపిళ్ళైకు శేఖరపిళ్ళై దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. వీలు చూసుకొని యేదో ఒక రోజు చెట్టిక్కులంగరేలో యింటికి రావలసిందని ఆ వుత్తరంలో వ్రాశాడు. ఎప్పుడు రమ్మన్నదీ రాయలేదు. ఆరోగ్యం సరిగ్గా లేనందువల్ల తాను రాలేకపోయానని కూడా ఆ ఉత్తరంలో వుంది. ఏదో ముఖ్యమైన విషయం శేఖరపిళ్ళై చెప్పాలట.

ఆ విషయమేమిటో కేశవపిళ్ళైకు తెలుసు. తంకమ్మను చేసుకోమని అడుగుతాడు. అడిగితే కచ్చితంగా వీలుపడదని చెప్పాలనుకున్నాడు. అలా చెప్పేందుకు తనకు చాలా కారణాలున్నాయి.

కేశవపిళ్ళై ఆరోజు వెళ్ళలేకపోయినాడు. మర్నాడు వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. మర్నాడు మధ్యాహ్నం తర్వాత కొంచెం వ్యవధి దొరుకుతుంది. కేశవపిళ్ళై బయలుదేరాడు. అంతట ఆవిషయం ముగిద్దామనే వుద్దేశ్యంతో అతను వెళ్ళాడు. జీవితంలో ఒక అధ్యాయం ముగించేందుకు వెళుతున్నాడు. అలా నిశ్చయించుకున్నప్పటికీ ఆ ముసలాయన మీద అతనికి జాలి వేసింది.

ఆ కొట్టియంబళంలో అతను చాలా రాత్రులు గడిపాడు. వరాండాలో శేఖరపిళ్ళై కూర్చుని వున్నాడు. శేఖరపిళ్ళైను చూసి ఎన్ని సంవత్సరాలో కాలేదు. కాని యిప్పుడు చూస్తే పది సంవత్సరాలు మించినట్టు అనిపిస్తున్నది. ఇంత మార్పు ఎలా వచ్చిందీ కూడా స్పష్టంగానే తెలుస్తున్నది.

కేశవపిళ్ళై వస్తుంటే చూసి ముసలాయన వెక్కివెక్కి యేడవటం మొదలు పెట్టాడు. గొంతు బొంగురు పోయింది. చెప్పదలుచుకుంది చెప్పలేకపోతున్నాడు. అతని గుండె చీల్చుకు పోతున్నట్టుంది. ఏదో విధంగా అతను చెప్పదలుచుకుంది పూర్తి చేశాడు.

'అది మమ్మల్ని మోసం చేసింది. ద్రోహం చేసి పోయింది తండ్రీ!' అంటూ వుండగానే తంకమ్మ తల్లి వచ్చి గుమ్మం చాటున నిలబడ్డది. శేఖరపిళ్ళైను ఓదార్చేందుకు కేశవపిళ్ళై అన్నాడు:

'ఏడవకు మామ! ఇలా యేడ్చావంటే.....'

కొంచెం సేపటికి శేఖరపిళ్ళై ఏడవటం ఆపేశాడు. రుమాలుతో మొహం, కళ్ళు తుడుచుకుంటూ శేఖరపిళ్ళై అన్నాడు: 'ఇక నేను మా అబ్బాయి మొహం ఎలా చూడగలను? అది నాకే కాక మా కన్నతండ్రికి కూడా కళంకం తెచ్చి పెట్టింది. మహా పెద్దదయిపోయింది. అబ్బాయ్, నేను నా మగపిల్లలను కూడా అంత ప్రేమగా పెంచలేదు. నాకు వాళ్ళ దిగులే పట్టలేదు. ఆశలన్నీ దీనిమీదే పెట్టుకున్నాను.'

శేఖరపిళ్ళై దీర్ఘశ్వాస పీల్చుకున్నాడు. భాగీరథీఅమ్మ తనను తదేక దృష్టితో చూస్తున్నదని కేశవపిళ్ళైకు సందేహం కలిగింది. బహుశా అతని ముఖముద్రలో భేదమేమన్నా కనిపిస్తుందేమోనని చూస్తూ వుండి వుంటుంది. 'పిళ్ళిద్దరి మధ్యా ఎలాంటి సంబంధం వుండేదని అతన్ని అడగండి' అన్నది భాగీరథీఅమ్మ తన భర్తతో.

'నీవు చాటునే నిలబడ్డావెందుకే. ఇక అలా వుండవలసిన అవసరమేముంది?' అన్నాడు శేఖరపిళ్ళై తన భార్యతో.

శేఖరపిళ్ళై మళ్ళీ వెక్కివెక్కి యేడవసాగాడు. భాగీరథీఅమ్మ కూడా ఏడుస్తూ ఉంది. 'కేశవపిళ్ళై మాత్రం ఇంకా మనవాడే. కూతురు వెళ్ళిపోయినా కూతురు బదులు కొడుకు దొరికాడు. ఇతను మనకు అల్లుడు కాదు, కుమారుడు. నీవు బయటికిరా.'

భర్త మాట ప్రకారం భాగీరథీఅమ్మ గుమ్మం దగ్గర ప్రత్యక్షమయింది. 'అబ్బాయ్, మీ యిద్దరి మధ్యా ఏమన్నా తగాదా అయిందా?' అని భాగీరథీఅమ్మ కేశవపిళ్ళై నడిగింది.

'లేదు, మాయిద్దరి మధ్యా ఏమీ తగాదా రాలేదు. మాకు ఒకరిమీద ఒకరికి కోపం కూడా రాలేదు.' కేశవపిళ్ళై సమాధానం చెప్పాడు.

'మరి ఇలా యెందుకు జరిగింది?' అని ఆశ్చర్య పడుతూ అంది భాగీరథీఅమ్మ.

తల్లి దండ్రులకు ఆశ్చర్యం కలిగించే ఆ విషయం కేశవపిళ్ళైకు మామూలుగా తోచింది. అది అలా యెందుకు జరిగిందో అతను అర్థం చేసుకోగలడు. ఇంటినుంచి యెలా వెళ్ళిందో అతనికి తెలుసుకోవాలని వుంది. భాగీరథీఅమ్మ మళ్ళీ ఆరంభించింది: "నీవంటే దానికెంతో ప్రేమ! చాలా రోజులది వాళ్ళనాన్నకు ఊపిరాడనియ్యలేదు. కాని యింత మార్పెలా వచ్చిందా అని ఆలోచిస్తున్నాను. మా అమ్మాయి మీద ఎవరో మంత్రమో తంత్రమో ప్రయోగించినట్టున్నది. లేకుంటే యిలా జరిగేది కాదు. ఉన్నట్టుండి యింత మార్పు వచ్చింది.'

'ఏమయింది?' - అడిగాడు కేశవపిళ్ళై.

'పిళ్ళై! నేను చెబుతాను విను' అని శేఖరపిళ్ళై కథ ఆరంభించాడు- 'కొన్నాళ్ళనుంచీ తంకమ్మ నిన్ను గురించి ఏమీ ప్రసక్తి తీసుకురావటంలేదు. అంతకు ముందు అలా లేదు. దాని జీవితంలో కేశవపిళ్ళై తప్ప మరొకరు లేరనుకున్నాం. కాని ఉన్నట్టుండి ఒక్క రోజులో అది కేశవపిళ్ళైను పూర్తిగా మరిచిపోయింది. (ఆ రోజు ఏరోజో కేశవపిళ్ళైకు తెలుసు. తంకమ్మ జీవితంలో తను పూర్తిగా మాసిపోయాడు). ఎవరన్నా యేదో మాటల సందున నీ సంగతి చెపితే తంకమ్మ మాట మార్చేది. లేదా అక్కడి నుంచి వెళ్ళిపోయేది. ఆ సంగతి యెవరూ పట్టించుకోలేదు. ఆ తర్వాత అది

రామచంద్రన్ నాయరును గురించి ఎక్కువగా చెపుతుండేది. మొదట్లో రామచంద్రన్ నాయర్ తంకమ్మ పనిలో లోపాలు కని పెడుతుండే వాడు. అది యేం చేసినా దాంట్లో తప్పులు పడుతుండేవాడు. ఆ తర్వాత కొన్నాళ్ళకు రామచంద్రన్ నాయర్ చాలా మంచి అధికారని అనటం మొదలు పెట్టింది. కొన్నాళ్ళనుంచీ రామచంద్రన్ నాయరే దాని జీవిత సర్వస్వమయినాడు. ఎప్పుడూ అతన్ని గురించే చెపుతుంటుంది' ఆ తర్వాత భాగీరధీఅమ్మ కథ అందుకుంది:

'అబ్బాయ్! అది యిలా రామచంద్రన్ నాయరును గురించి చెపుతూ వుంటే నాకు చాలా దిగులేసింది. ఒక రోజు నేను దాన్ని పిలిచి మెల్లిగా చెప్పాను: 'ఎందుకమ్మా రామచంద్రన్ నాయర్ని గురించి పిచ్చి దానిలా అలా చెపుతావు? ఈ సంగతి కేశవపిళ్ళకు తెలిస్తే ఎంత నష్టమో నీకు తెలుసా?' అన్నాను. నామాట పట్టించుకోకుండా 'ఏమిటి నష్టం?' అన్నది. ఏదో తెలియక అంటున్న దనుకున్నాను. అయినా రామచంద్రన్ నాయర్ను ప్రశంసించింది ప్రశంసించినట్టేవుంది. నిజంగా నాకు భయం వేసింది. చెడాబడా తిట్టాను. దానిమీద 'రామచంద్రన్ నాయర్ మంచివాడు. అతనిలో పొరపాటేముంది?' అన్నది. 'అది తప్పమ్మా' అన్నాను నేను. ఇదంతా వాళ్ళ నాన్నకు తెలియనియ్యలేదు. మగవాళ్ళకు చెప్పాల్సిన మాటలేనా యివి?'

ఆ తర్వాత వృత్తాంతం శేఖరపిళ్ళ వివరించాడు. అతనికేమీ తెలియదట. భాగీరధీఅమ్మ యిదంతా శేఖరపిళ్ళకు చెప్పనే లేదట. తనకు తెలిస్తే మొదట్లోనే యీ విషవృక్షాన్ని తుంచి వేసేవాడట. 'పిచ్చిది దీనికేం తెలుసు?' అన్నాడు.

భాగీరధీఅమ్మ సమాధానం చెప్పింది: ఈ పిల్ల యిలా చేస్తుందని నేనెప్పుడూ అనుకో లేదు. అమాయకపు పిల్ల! ఎవరో ప్రయోగం చేశారు. మోసం చేశారు. 'రామచంద్రన్ నాయర్ నన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు. అతను చాలా మంచివాడు. ఫారెస్టాఫీసరుగారి అబ్బాయి, సూపరింటెండెంటు' అని ఒక రోజు నాకు చెప్పింది. 'ఏమిటమ్మా నీవనేది? నీకేమన్నా పిచ్చిపట్టిందా?' అన్నాను నేను. అప్పుడది నవ్వింది. ఆ నవ్వు నాకింకా కళ్ళల్లో మెదులుతూనే వుంది. భయంకరమైన నవ్వు. అందుకే నా కనుమానం వేసింది - దానికెవరో యేదో ప్రయోగం చేశారని. మా అమ్మాయి ఎంత అందంగా నవ్వేది! ఆ నవ్వే కాదది. భయంకరమైన నవ్వు. అప్పుడందరూ దాన్ని చూసి వుండాల్సింది. పిచ్చిదానిలా అయిపోయింది. మళ్ళీ అది 'నేనేదో తమాషాగా అన్నాను' అన్నది. కాసేపుండి, 'నన్ను నీవు పెళ్ళి చేసుకుంటావా?' అని రామచంద్రన్ నాయర్ అడిగాడని చెప్పింది. నేనన్నాను: 'అమ్మాయ్, ఆ మాట కలలో కూడా అనుకోకు. కేశవపిళ్ళె మంచివాడు. ప్రేమ తెలిసిన వాడు. అతనికి విషయం తెలిస్తే ప్రాణాలు విడుస్తాడు. అందమైన మగవాడు కనిపిస్తే

అతనే నా మొగుడనటం మన కుటుంబ ధర్మం కాదు. మన కుటుంబంలో ఏ అమ్మాయి రెండో పెళ్ళి చేసుకోలేదు. నా కన్నతల్లి! అలాంటి భావాలు పెట్టుకోకు.'

ఇంతలో శేఖరపిళ్ళె అందుకున్నాడు: 'ఇలాంటి పరిస్థితి ఏర్పడ్డప్పుడు నాకు చెప్పాల్సింది కదా! నేను అదిరించో బెదిరించో పరిస్థితి చక్కబెట్టే వాణ్ణి.'

ఆ తర్వాత మిగిలిన వృత్తాంతం శేఖరపిళ్ళె చెప్పాడు: ఒకరోజు (నెలా, తారీఖు కూడా శేఖరపిళ్ళె చెప్పాడు) రాత్రి చాలా వేడిగా వుంది. నిద్ర పట్టలేదు. చాలా చీకటి పడింది. నేను అరుగు మీదికి వచ్చాను. అప్పుడెవరో ఒక మనిషి కుట్టియంబళంలో దూరాడు. అతనితో మరొకరు కూడా వున్నారు. ఇద్దరూ పెరట్లోకి వెళ్ళారు. ఎవరని అరుస్తూ నేను దగ్గరికి వెళ్ళాను. ఒక్క చెంప దెబ్బ వేశాను. దెబ్బ తంకమ్మకు తగిలింది. అతనికి దెబ్బ తగలకుండా ఉండేందుకు తంకమ్మ అడ్డం నిలబడ్డది. ఇంతలో భాగీరథీ దీపం తీసుకుని వచ్చింది. నాకు ఒళ్ళు తెలియనంత కోపం వచ్చింది. నేను చాలా దెబ్బలు వేశాను. కాని ఒక్క దెబ్బ కూడా రామచంద్రన్ నాయరుకు తగల్లేదు. అతన్ని తప్పించేందుకు అది ఎంత ప్రయత్నించిందో! నానా రకాలుగా మెలికలు మెలికలు తిరిగి అతనికి దెబ్బ తగలకుండా చూసింది. ఆ వైఖరి చూసి తీరాలి. దానితో నాకు మరీ కోపం వచ్చింది. ఢాంఢాం అని మళ్ళీ కొట్టాను చాలా సేపు కొట్టిన తర్వాత తంకమ్మ నావైపు చూసి 'ఇక కొట్టకు. మరోసారి ఆయన మీద దెబ్బ పడిందంటే ....' అని ఆగింది. 'ఏం చేస్తావేం?' అన్నాను. అది నా ముఖంలో ముఖం పెట్టి 'నేను కూడా కొడతాను. తండ్రి అని జంకను.' అన్నది. ఆ తర్వాత నేను కొట్టలేదు. లోపలికి వెళ్ళిపోయాను. మర్నాడు సాయంత్రం అది సామాను తీసుకొని వెళ్ళిపోయింది.'

కేశవపిళ్ళె ఏదో ఆలోచిస్తున్నాడు. భాగీరథీఅమ్మ యేమీ మాట్లాడలేదు. ఆ ముసలాయన జాలి కలిగేట్టు కూర్చున్నాడు. ఆయన ఆశలన్నీ తన కూతురి మీదనే పెట్టుకున్నాడు. అది అన్నింటినీ విచ్ఛిన్నం చేసిపోయింది. ఇప్పుడు మౌనంగానే వున్నాడు. కొంచెం సేపటికి గుర్తు తెచ్చుకుని మళ్ళీ యేడిచాడు. అతనిలో వున్న ధైర్యం సాహసం శక్తి, సామర్థ్యం అన్నీ అడుగంటి పోయాయి. అతను కూలిపోయినాడు.

భాగీరథీఅమ్మ అన్నది: 'ఇలా దిగులు పడితే లాభమేముంది? పనికి రాని వాళ్ళు పోతే పోనీ. నా కిద్దరే బిడ్డలనుకుంటాను.'

శేఖరపిళ్ళె ఆమె చెప్పిన మాట వినే వుంటాడు. కాని అంతగా పట్టించు కోలేదు. కళ్ళ నిండా నీళ్ళు నింపుకొని అతను కేశవపిళ్ళె వైపు చూసి అన్నాడు: 'క్షమించు తండ్రీ! ఈ ముసలి వాణ్ణి క్షమించు'

శేఖరపిళ్ళెను ఓదార్చుతూ కేశవపిళ్ళె అన్నాడు:

'నాకు నీవు చేసిన అపకారం ఏమీ లేదు.'

'అలా అనకు' అన్నట్లుగా శేఖరపిళ్ళె తల వూపాడు. 'నీకు నేను అపకీర్తి తెచ్చాను. నిన్ను అవమాన పరిచాను' అన్నాడు.

'మామా! దాన్ని గురించి దిగులు పడకు.'

శేఖరపిళ్ళెకు ఒక కోరిక వుంది. 'నాకీ జన్మలో ఒకే ఒక అల్లుడున్నాడు. అతనే నీవు' అంటూ అతను తన కోరిక బయట పెట్టాడు: 'మరేం లేదు. నెలకోసారి నీవు వచ్చి నాకు కనిపించు. అలా ఎన్నాళ్ళో రావలసిన అవసరముండదు. నీవు ఏ పదవిలో వున్నా, ఎంత పనిలో వున్నా ఎలాగో తీరిక చేసుకుని తప్పక రావాలి. నాకేమీ ఇయ్యక్కర్లేదు. నేను అన్ని కష్టాలూ సహిస్తాను. నీవు వచ్చి కనిపిస్తే చాలు.'

కొంచెం సేపాగి ముసలాయన యేడుస్తూ అన్నాడు:

'అబ్బాయ్! నీవు మరోపని చెయ్యాలి. అవసాన దశలో నేను కళ్ళు మూసే క్షణంలో నా గొంతులో ఒక చుక్క నీళ్ళు పొయ్యాలి. ఇది నా అభిలాష. ఆరోజు నీవెక్కడున్నా సరే పరుగెత్తుకొని రావాలి.'

శేఖరపిళ్ళె దుఃఖంతో ఆయాసంతో పడబోయినాడు. కేశవపిళ్ళె పట్టుకున్నాడు.

కేశవపిళ్ళెకు వుద్యోగంలో ఏ అభివృద్ధి వచ్చినా, దానికి ఆధారం శేఖరపిళ్ళె అవుతాడు. ఇంతపెద్ద అప్పు గుక్కెడు నీళ్ళతో తీరిపోతుందా? కేశవపిళ్ళె దానికి సులభంగా సిద్ధపడ్డాడు. అతనింకా చాలా ఋణపడి వున్నాడు. కమ్ముకున్న మేఘాలు విడిపోయిన తర్వాత అకాశం నిర్మల మయినట్టు పరిస్థితులు తేటతెల్లమయిపోయినాయి. కేశవపిళ్ళెకు ఇంతటి మనశ్శాంతి మరెప్పుడూ లభించలేదు.

వెళ్ళేప్పుడు అతని చెవుల్లో కిట్టుమామ చెప్పిన మాటలు మారు మ్రోగాయి. 'ఆ అమ్మాయి అదృష్టవంతురాలు.'

చెమట కారుతూ మసి పూసుకున్న ఆ మురికి పిల్ల! నాణీకుట్టి సావాసకత్తె!

## పధ్నాలుగు

ఇన్నాళ్ళనుంచీ అతని దగ్గరకి వచ్చే ఫైళ్ళకు భిన్నంగా వున్న కొత్త రకపు ఫైళ్ళు అతని దగ్గరకి ఇప్పుడు వస్తూ వున్నాయి. వాటిలో చాలా ఫైళ్ళు సచివాలయం నుంచి వచ్చేవి కావు. వాటిని తొందరగ కూడా పంపించాలి. అవి చాలా గోప్యమైనవి కూడాను. ఆ ఫైళ్ళను ఎలా సమర్థించాలో కేశవపిళ్ళె యింకా నిర్ణయించ లేక పోతున్నాడు. ఇప్పుడు కేశవపిళ్ళె చేయవలసిన పని అసిస్టెంటు సెక్రటరీ వ్రాసిన నోట్సు చదివి చీఫ్ సెక్రటరీకి చెప్పటం. ఆ నోట్సులో వున్న దానికి యదార్థం భిన్నంగా వుంటే, ఆ విషయం చీఫ్ సెక్రటరీకి చెప్పే అధికారం కేశవపిళ్ళెకు వుంది. కేశవపిళ్ళె సామర్థ్యాన్ని గురించి చీఫ్ సెక్రటరీకి పూర్తి నమ్మకం వుంది. ఈ పరిస్థితిలో కేశవపిళ్ళె యిష్టాయిష్టాలు

ఆయన ఉత్తరువులో కూడా కనిపించటం సహజం. సెక్రటరీ చేసిన సిఫారసులను ఒకసారి కాదు, అనేక పర్యాయాలు నిరాకరించటం జరిగింది. ప్రస్తుతం వచ్చే ఫైళ్ళు కేశవపిళ్ళెకు అంతు పట్టటం లేదు.

బాధ్యతాయుత పరిపాలన కావాలని కోరుతూ ప్రాంతీయ కాంగ్రెసు హింసాయుతమైన సమ్మె ఆరంభించింది. ప్రభుత్వం ఈ సమ్మెను ఎదుర్కొంటున్నది. దానికి సంబంధించిన ఫైలు అది. ఈ ఫైలు చీఫ్ సెక్రటరీ ముందు అలాగే పెట్టటమేనా లేక మరేమన్నా చెయ్యాలా అనే విషయం కేశవపిళ్ళెకు తెలియలేదు. ఆఫైలు చదివేందుకు కేశవపిళ్ళె చాలా ప్రయత్నించాడు. కొన్ని విషయాలు అర్థమయినాయి, కొన్ని కాలేదు. ఏం చెయ్యాలో చీఫ్ సెక్రటరీ కూడా నిర్ణయించ లేక పోతున్నట్టు అనిపిస్తున్నది. కేశవపిళ్ళె ఫైలు తెరిచి చీఫ్ సెక్రటరీ ముందు పెట్టి నిలబడ్డాడు.

'ఏమిటిది?'

చీఫ్ సెక్రటరీ అడిగాడు. ఇంతకు ముందు ఇలా అడిగేవాడు కాదు. ఫైలు తెరుస్తూనే ఆ ఫైలులో ప్రతినోటూ వివరంగా చెప్పి వెళ్ళేవాడు కేశవపిళ్ళె ప్రతి రోజూ. తర్వాత మెల్లిగా మర్యాదగా ఇలా చేస్తే సరిపోతుందని చెప్పేవాడు. అలా ఆయనకలవాటయిపోయింది. ఈ రోజు చీఫ్ సెక్రటరీ చిరాకుగా అడిగాడు: 'ఇదేమిటి?' అని.

కేశవపిళ్ళెకు ఏం చెప్పాలో తోచలేదు. అతను ఫైలు చదివాడు కాని ఏం చెయ్యాలో, అతనికి తెలియలేదు. అయినా కేశవపిళ్ళె అన్నాడు:

'కాంగ్రెస్ కార్యవర్గ సమితి సభ్యుల చరిత్ర చాలా ప్రాచీనమయింది.'

'అయితే?' చీఫ్ సెక్రటరీ అడిగాడు.

కేశవపిళ్ళె సమాధానం చెప్పలేక పోయినాడు.

చీఫ్ సెక్రటరీకి కోపం వచ్చింది.

'నిన్నిక్కడ వేసిందెందుకు?' అన్నాడు కోపంతో. అయన కేశవపిళ్ళెను కోపంగా చూశాడు.

.కేశవపిళ్ళెకు చిరుచెమటలు పట్టాయి. ఏం చెప్పాలి? ఫైలు చదివినా తనకు బోధపడలేదని యధార్థం చెప్పాలా? అదే నిజమైతే అతను ఆ పదవికి తగిన వాడు కాదని తేలుతుంది. అధికారి కోపంలో వున్నాడు. ఆ లావాటి ఫైల్లో కాగితాలను ఆయన అటూ ఇటూ తిరగేస్తున్నాడు. వెనక్కి తిరిగి కోపంతో అడిగాడు:

'ఒరే తెలివి! అదేమిటి? అలా చెట్టులా నిలబడ్డావేం?'

కేశవపిళ్ళె గజగజ వణికాడు. అప్రయత్నంగా అతని నోట రెండు మూడు వాక్యాలు వచ్చాయి.

'కాంగ్రెస్ అధ్యక్షుడు జడ్జి పోస్టు కోసరం చాలాసార్లు దరఖాస్తు వేశాడు. సభ్యులందరూ అప్పుకోసమో, ఉద్యోగం కోసమో అర్జీ పెట్టుకున్నారు. ఇవన్నీ వున్నాయి.'

'అవును, అయితే?' చీఫ్ సెక్రటరీ చిరాగ్గా అన్నాడు.

కంగారు పడి అతను మళ్ళీ అదే సమాధానం చెప్పాడు: 'నేట్సు లేదు.'

కేశవపిళ్ళై పరిస్థితిని స్పష్టం చేసే సమాధానం అదొక్కటే. కాని అధికారికి ఆ సమాధానం అర్థం కాలేదు.

చీఫ్ సెక్రటరీ కాగితాలు తిప్పుతూనే వున్నాడు. అటూ ఇటూ తిరగేసి చివరకు ఆఫైలును విసుక్కుంటూ కింద పారేశాడు. కేశవపిళ్ళై ఫైలును తీసి వేరే పెట్టాడు.

అధికారి మరో ఫైలు అడిగాడు:

'ఆఁ, ఇదేమిటి?'

కేశవపిళ్ళైకు ఆవిషయం తెలుసు: అతను దాన్ని బాగా చదివి అర్థం చేసుకున్నాడు. అతను దానిమీద సమగ్రంగా నేట్సు రాసుకుని వచ్చాడు. కాని ఆ కంగారులో నేట మాట రాలేదు.

'ఏం చేస్తున్నావ్ నీవిక్కడ?' అన్నాడు చీఫ్ సెక్రటరీ.

అప్పుడో సమాధానం బయటికి వచ్చింది:

'ఇది శిస్తు వసూలుకు సంబంధించిన ఫైలు. యీనచ్చుల్ కాంగ్రెస్ వాళ్ళు ప్రభుత్వానికి చాలా డబ్బు చెల్లించాలి. అదంతా వెంటనే వసూలు చేసేందుకు భక్తివిలాస్ దర్శకత్వంలో సత్వర చర్య తీసుకోవటం జరుగుతూవుంది. కేశవపిళ్ళై వస్తుస్థితిని చక్కగా విశదీకరిస్తూ అన్నాడు:

'ఇలా కాంగ్రెసు పేరిట మూడు నాలుగు కేసులున్నాయి.'

ఆ ఫైలు మీద ఉత్తరువు జారీ చేయటంలో చీఫ్ సెక్రటరీకి ఇబ్బంది యేమీ లేకుండా పోయింది. దానితో ఆయన కొంచెం శాంతించాడు. కాని ఆయన ఇరుకులో పడిపోయినాడు. మనస్సుకు తృప్తిగా లేదు.

కేశవపిళ్ళై వణకిపోతున్న చేతులతో మరోఫైలు తెరిచాడు. అతనిలో ఇంకా కొంచెం ధైర్యం మిగిలివుంది. చీఫ్ సెక్రటరీ మామూలుగా అలవాటు పకారం అడిగే ప్రశ్న అడిగాడు. కేశవపిళ్ళై చెప్పాడు:

'ఇది ప్రస్తుతం కాంగ్రెసులో వున్న బ్యాంకి ఉద్యోగస్తులకు సంబంధించిన ఫైలు.'

'అయితే?'

ఈ ప్రశ్నకు సమాధానం లేదు. అయినా చెప్పాడు:

'ఆ బ్యాంకు సంచాలకులు బ్యాంకులో డబ్బంతా కాజేశారు. ఇది దానికి సంబంధించిన రిపోర్టు.'

చీఫ్ సెక్రటరీ 'ఊఁఊఁ' అన్నాడు. ఈ విషయంలో ఏం చెయ్యాలి అన్నది అతనికి అలవాటయిన ప్రశ్న కాదు.

మొత్తం మీద అధికారికి ఏమాత్రం తృప్తిగా లేదు. అలా అనుకుంటూ కేశవపిళ్ళె వెళ్ళి పోయాడు. ఆరోజే కాదు, చాలా రోజులనుంచీ కేశవపిళ్ళె అలాగే అనుకుంటూ వున్నాడు. పాడు కాంగ్రెసు వల్ల అతను తన అధికారి కోపావేశానికి గురి కావలసి వస్తున్నది. బహుశా అధికారికి కూడా, ధర్మసంకటంగా వుందని కేశవపిళ్ళెకు అనిపించింది. అందువల్లనే అయనకు కోపం వస్తూండవచ్చు.

ఆరోజు రాత్రి కేశవపిళ్ళెకు క్షణం కూడా నిద్ర పట్టలేదు. అతనికి ఉద్యోగం పోతుందేమోనని అనుమానం వేసింది. పై అధికారి అసంతృప్తి హెచ్చిపోతూవుంది. ఏదో ఒకరోజు అతను అసమర్థుడని చెప్పి అతన్ని పదవినుంచి తొలిగించవచ్చు కూడా. ఒక వేళ అలా తొలిగిస్తే అడిగేవారెవరున్నారు? ఎలా వచ్చాడో అలాగే వెళ్ళాల్సి వుంటుంది. చీఫ్ సెక్రటరీని కూడా అలాగే అసమర్థుడని చెప్పి దీవాన్‌జీ తొలిగించవచ్చు. అంతా చక్కబడిందని కేశవపిళ్ళె అనుకున్నాడు. కాని యిప్పుడు అతని నమ్మకానికి మూలాధారమే చలించింది. తను ఈ పనికి తగడని కేశవపిళ్ళెకు అనిపించింది. తనకు మించిన పదవిలో ఇరుక్కున్నాడు. కేశవపిళ్ళెకు ప్రసాద్ విషయం గుర్తుకు వచ్చింది. అతను డిగ్రీ విలువను అర్థం చేసుకోలేదు. డిగ్రీ వున్నప్పటికీ అతనిలో ధైర్యం సామర్థ్యం వుండకపోవచ్చు. మళ్ళీ వెనకటి క్లర్కుగానే జీవితం గడపాలి.

ఇక్కడినుంచి వెళ్ళిపోతే? మళ్ళీ సచివాలయానికి వెళ్ళాలి. అక్కడ ఉద్యోగంలో అభివృద్ధికి అవకాశం ఉంటుందా? అవకాశం ఒకసారే దొరుకుతుంది. ఇప్పుడు తంకమ్మ లేదు, శేఖరపిళ్ళె కూడా లేడు. మరో తంకమ్మ ద్వారా అభివృద్ధి సాధ్యమా? అలివి మాలిన అపనిందను నెత్తిన వేసుకుని అవమానంతో మళ్ళీ అక్కడికి వెళ్ళాలి. కాని మళ్ళీ అదే పోస్టులో ఎలా పని చెయ్యటం? జీవితం గడిచేందుకు వెళ్ళక తప్పదు. భవిష్యత్తు మీద ఆశలు వదులుకొని అలాగే అక్కడ కూర్చోవాలి. కేశవపిళ్ళె కల్పనా పథంలో ఆ పరిస్థితిని స్పష్టంగా ఊహించుకున్నాడు.

ఇలాంటి ఆలోచనలతో కుంగి పోవలసిన అవసరమేముంది? ఇంకా అంతవరకు రాలేదు కదా! పట్టు విడిపోతుందేమోనని భయమేకదా! కేశవపిళ్ళె ఆలోచనలు పొలిమేరలు దాటి మరో రంగంలో ప్రవేశించాయి. అసలు చీఫ్ సెక్రటరీ, ఆయన భార్య తనని తీసేయ గలరా అని మళ్ళీ ఆలోచన వచ్చింది. లేదు. అంత ధైర్యం వాళ్ళకు లేదు. ధైర్యం వచ్చే అవకాశం కూడా లేదు. తిరిగి పంపించేందుకు ఉత్తర్వు మీద సంతకం పెట్టేప్పుడు ఒక్క క్షణం ఆలోచించరూ? చెయ్యాడుతుందా? ఆయన భార్యకు ఈ విషయం తెలిస్తే?

పాము పిల్లతో చెలగాటమా? ఆ మాత్రం నీతి వాక్యం తెలియని వాళ్ళున్నారా?

తనకు చీఫ్ సెక్రటరీని గురించి చాలా విషయాలు తెలుసుననే విషయం కేశవపిళ్ళెకు ఉన్నట్టుండి గుర్తు వచ్చింది. దానితో అతనికి ధైర్యం వచ్చింది. తన పట్టు గట్టి పడుతున్నదని అతనికనిపించింది. అలా ఊరకనే తనను తీసి వేసేందుకు చీఫ్ సెక్రటరీకి అంత ధైర్యముందా?

ఊరంతా కాంగ్రెసు వాళ్ళు ప్రభుత్వాన్ని గురించి ఆడి పోసుకుంటున్నారు. దీవాన్‌జీ, మిగిలిన ఉద్యోగస్థులూ లంచం తీసుకుంటున్నారనీ, అవినీతిగా ప్రవర్తిస్తున్నారనీ వాళ్ళు ఉపన్యాసాల్లో చెపుతున్నారు. అతనికి చాలా విషయాలు తెలుసు. అవే గనక వాళ్ళ చెవుల్లో వూదితే..... కేశవపిళ్ళెకు ఇన్నాళ్ళనుంచి ఇలాంటి అనుభవం లేదు. ఇప్పుడతనికి ఒక విధమైన ధైర్యం వచ్చింది. పగ తీర్చుకొనే ధైర్యం. మరుక్షణం కేశవపిళ్ళె తనతో తను అనేశాడు.

'తిరిగి పంపిస్తే పంపించనీ.'

ఈ మాట కొంచెం బిగ్గరగానే అన్నాడు. ఎవరయినా విన్నారేమోనని భయపడ్డాడు. కాని ఆ గదిలో మరెవ్వరూ లేరు. పక్కగది దాకా అతని గొంతు వినిపించి వుంటుందా? రెండు గంటలయింది. అందరూ నిద్రపోతున్నారు. అలా పగతీర్చుకోవటం తప్పవుతుంది. ఏ అధికారీ కూడా అతన్ని నమ్మడు. భవిష్యత్తులో మరో అవకాశం అతనికి దొరకదు. ఉద్యోగం వూడిపోతుంది. ఉద్యోగస్థుడు తన అధికారిని అలా వదిలి పెట్ట కూడదు.

దుష్టులు కాంగ్రెసు వాళ్ళు తెచ్చిపెట్టిన తగాదా యిది. వాళ్ళ సమ్మె గనక కొనసాగక పోతే పరిస్థితులన్నీ ఒడు దుడుకులు లేకుండా చక్కగా సాగి పోతాయి. స్పష్టంగా కళ్ళ యెదుట కనిపించే దారిన పోతే సునాయాసంగా ముందుకు సాగచ్చు. ఈ హడావిడి ఎలా పరిణమిస్తుందో యేమో ఎవరికి తెలుసు?

కాంగ్రెసు కోరేదేమిటో కేశవపిళ్ళెకు బోధపడలేదు. ఉత్తర హిందూస్థానంలో గాంధీజీ నాయకత్వాన స్వాతంత్ర్యోద్యమం సాగుతూ వున్నది. కేశవపిళ్ళె తన తండ్రీ, కిట్టూమామ, వాళ్ళ సమవయస్కులూ ఈ వుద్యమాన్ని సమర్థిస్తూ వుంటే విన్నాడు. విదేశీయులు మన మీద పరిపాలన సాగించటం కేశవపిళ్ళెకూ ఇష్టం లేదు. ఆంగ్లేయులు భారతదేశం వదిలిపెట్టి వెళ్ళవలసిందే. ఈ సమ్మె కేశవపిళ్ళెకు సమ్మతమే కాని తిరువాన్‌కూర్ కాంగ్రెస్ వాళ్ళు చెప్పే మాట కేశవపిళ్ళెకు సరిగ్గా బోధపడటం లేదు. మహారాజు పరమాధికారం క్రింద బాధ్యతాయుతమైన పరిపాలన ఏర్పడాలి. అప్పుడు రాజు వున్నా నష్టమేమీ వుండదు. కాంగ్రెసుకు దీవాన్‌జీ అంటే యిష్టం లేకుంటే ఆ మాట వాళ్ళు

రాజుతో స్పష్టంగా చెప్పాలి కదా? ఉన్నదున్నట్టు చెపితే రాజు వింటాడు. ఆయన దీవాన్‌జీని బయటికి పంపి వెయ్యగలడా?

అదికూడా కచ్చితంగా చెప్పేందుకు వీల్లేదు. భక్తివిలాస్ రాజభవనాన్ని ఉపేక్షించిన ఒక సంఘటన కూడా కేశవపిళ్ళైకు జ్ఞాపకం వచ్చింది. రాజభవనం అనుమతి లేకుండానే భక్తివిలాస్ అనుమతితో ఒక పని జరిగింది. ఆ విషయంలో తుది నిర్ణయం చేసిన చీఫ్ సెక్రటరీ ఆ విషయాన్ని దీవాన్‌జీ దృష్టికి తీసుకు వచ్చాడు. అందుకని దీవాన్‌జీ చీఫ్ సెక్రటరీకి కఠోరమైన ఉత్తర్వు జారీ చేశాడు. చీఫ్ సెక్రటరీ కంగారు పడి గజగజ వణికి పోయాడు. చీఫ్ సెక్రటరీ తన బాధ్యత మీద తప్పు నిర్ణయం చేశాడు. ఈ విషయం గుర్తుకు వచ్చినప్పుడల్లా అతని గుండె గడగడ లాడుతుంది. దీవాన్‌జీని తన పదవి వదలుకుని పొమ్మని చెప్పేందుకు మహారాజుకు బహుశా ధైర్యం చాలదు. ఈ విషయం కాంగ్రెసు వాళ్ళకు తెలుసు. దీవాన్‌జీ వెళ్ళిపోవాలని వాళ్ళు మరో విధంగా చెపుతారు. దీవాన్‌జీ వెళ్ళిపోతే బహుశా కాంగ్రెసు సమ్మె ముగిసిపోతుంది.

కేశవపిళ్ళై తిరువాకూరు చరిత్రను జ్ఞాపకం చేసుకున్నాడు. ఇలాంటి సంఘటన యింతకు ముందు కూడా జరిగింది. కాని ప్రతి పర్యాయం అక్కడి వాళ్ళు రాజభక్తులై కూర్చుంటారు. అలాంటప్పుడు దాన్ని బాధ్యతాయుత పరిపాలన అనటంలో అర్థమేముంది? కాంగ్రెసు నాయకుల్లో కొందరు దాన్ని గురించి ఉపన్యాసాలిస్తారు. ఇది ఎలాంటి పరిపాలనో బహుశా వాళ్ళకే తెలియదు. కాని అందరూ దాన్ని బాధ్యతాయుత పరిపాలన అంటారు.

ఏమయినా సరే. అప్పుడు కూడా ప్రభుత్వోద్యోగులు వుంటారు. అలాంటి సమయంలో ధైర్యంతో పని సాధించే మార్గమేమిటో? ఇలాంటి విషయాలు తనకు కూడా తెలిసి వుండాలని కేశవపిళ్ళైకు తోచింది. వీటికి సంబంధించిన ఫైళ్ళు తుది నిర్ణయం కోసరం పార్కొవ్యూకే రావాలి. తుది నిర్ణయాన్ని పార్కొవ్యూ ద్వారానే అమలులో పెట్టాలి. అప్పుడిలాంటి విషయాలు తెలుసుకోవాలి.

అతనికి రాత్రంతా నిద్రపట్టలేదు. చిన్నవి పెద్దవి అనేక కార్యక్రమాలు అతని మెదడులో మెదులుతూ వున్నాయి. అతని మనసులో ఇంతటి మధన ఇంతకు ముందెప్పుడూ జరగలేదు. ముందు ముందు రాబోయే అస్తవ్యస్త పరిస్థితులు అతనికి స్పష్టంగా గోచరిస్తున్నాయి. రోబోయే రోజుల్లో అతను పార్కొవ్యూ విడిచిపెట్టి వెళ్ళి మళ్ళీ రాకపోవచ్చు. అలాంటి పరిస్థితి కూడా ఏర్పడవచ్చు. అతని గుండె బండరాతికి తగులుకున్నట్టయింది. అతని ఆలోచనలు పరిపరివిధాల పరుగులు తీస్తున్నాయి. ఈ దేశంలో సభలు, సమావేశాలు జరగకుండా చూడాలి. తీవ్రమైన ఉపన్యాసాలకు అనుమతి ఇయ్యకూడదు. ఈ నాయకులందరూ ఉద్యోగాలకోసరం అభ్యర్థన చేసేవాళ్ళే.

వాళ్ళకు ఉద్యోగాలివ్వాలి. అపరిపక్వమైన అతని ఆలోచనలు ఇలా పయనించాయి.

ఈ విధంగా కేశవపిళ్ళై రాత్రంతా జాగారం చేశాడు. అలాగే పార్కువ్యూలో కూడా ఎవ్వరికీ నిద్ర పట్టలేదు. దివాలా తీసిన వాడిలా చీఫ్ సెక్రటరీ, భార్య మీద విరుచుకు పడ్డాడు.

'నేను మొట్టమొదటనే చెప్పాను - ఈ పని నాకు సరిపోదని. శాంతి ఏమాత్రం లేదు.'

ఇటీవల యిలాంటి మాటలు భగవతి కుట్టియమ్మ తరచుగా వింటూవుంది. ఈ మధ్య కొన్ని రోజులనుంచి, దీవాన్‌జీ చీఫ్ సెక్రటరీని చీటికి మాటికి బెదిరిస్తూ వున్నాడు. అతన్నిక వెళ్ళగొట్టటమే తరువాయి అన్నంత పరిస్థితి వచ్చింది. బయటికి పంపించినా కుదురుగా ఉండనియ్యనని కూడా బెదిరిస్తున్నాడు. పరిస్థితి యింతగా విషమించిందని కృష్ణన్ నాయర్ అంటున్నాడు. ఈ కష్టాలకన్నిటికీ కారణం భగవతి కుట్టిఅమ్మ. పార్కువ్యూలో చీఫ్ సెక్రటరీ భార్యగా తను తిష్ఠ వేసుకోవాలని ఆమె కోరిక. అది దురాశ అని కృష్ణన్ నాయర్ అంటాడు.

'చూడు, ఈ పదవి కోసరం నీ వెంతో వెచ్చించావు. ఇంతవరకు సంపాదించిందంతా దానం చేసినట్టయింది. ఇక మనకు మిగిలిందేముంది?' అన్నాడు చీఫ్ సెక్రటరీ.

'నీ వింత తెలివి తక్కువ వాడివని నాకేం తెలుసు?' వెంటనే తగిన సమాధానం చెప్పింది భగవతి కుట్టిఅమ్మ. కృష్ణన్ నాయర్ తన తప్పు ఒప్పుకున్నాడు.

'నేనీమాట నీకు ముందే చెప్పాను. సచివాలయంలోనే, మరోచోటనే పేష్కారుగానే మరో అధికారిగానే వుంటే తక్కువేమయిందని. జీవితంలో కావలసింది - సుఖం, మనశ్శాంతి.'

ఒక్కక్షణం తర్వాత కృష్ణన్ నాయరడిగాడు:

'ఈ మొండి పట్టు దేనికి?'

అమ్మగారికి పట్టరాని అసహ్యంతో అనరాని మాట కంఠం వరకూ వచ్చింది. కాని తనను తాను అదుపులో పెట్టుకుని అన్నది: 'నా చేత ఆ మాట అనిపించకండి.'

అయినా ఆమె ఆపుకోలేక పోయింది. చెప్పదలుచుకుంది నాలుక దాకా వచ్చింది. భర్త వైపు అసహ్యంగా చూస్తూ ఆమె మనస్సులో అనుకుంది: 'నేను పెద్ద వుద్యోగం ఇప్పించాను. నీకు ధైర్యం లేకుంటే కింది పదవిలోనే వుండే వాడివి.' ఆమె చూపులు ఇంకా యేమేమో చెపుతున్నాయి. బంట్రోతు బిడ్డకు పార్కువ్యూలో పని చెయ్యటం ఎలా మనస్కరిస్తుందని ఆమె నాలుకమీద నాట్యమాడుతున్నదొక వాక్యం..

కృష్ణన్ నాయరు నెత్తి మీద చెయ్యి పెట్టుకుని తలవంచుకొని మౌనంగా కూర్చున్నాడు. అతని పరిస్థితి చూస్తే జాలి వేస్తున్నది. అతనికేమీ చెప్పాలని లేదు. చీఫ్ సెక్రటరీ పదవి అతను కోరుకున్నది కాదు. అతనికా పదవి అక్కర్లేదు. కాని ఆమాట అనక పోవటమే అతని తప్పు. దానికి కారణం కూడా వుంది. సామాన్యంగా అతను ఆ పదవిని అనాయాసంగా నిర్వహించగలడు. ఆఫీసులో ఎలా నిర్ణయాలు చెయ్యాలో అతనికి తెలుసు. కాని యిలాంటి విపరీత పరిస్థితి ఏర్పడుతుందని అతననుకోలేదు. ఆమాట చెప్పి వుండేవాడు. ఆరంభంలోనే అతను తన భార్యను అందుకోసరం ప్రయత్నం చెయ్యకుండా చూసేవాడు. అతనికి ఈ సమ్మెను నివారించటం అంత కష్టతరమని తోచలేదు. అదేముందిలే అనుకున్నాడు. ఇప్పుడేం చెయ్యాలో అతనికి తెలియటంలేదు. దీవాన్‌జీ తన వల్ల అపేక్షించేదేమిటో బోధపడటం లేదు.

తన మనస్సులోని బాధ ఏదో పర్యాయం భార్యకు చెప్పేందుకు ప్రయత్నించాడు: 'దీవాన్‌జీకి నేనంటే గిట్టదు. నా మీద అతనికి నమ్మకం లేదు. ఈరోజు నేను రాజీనామా పెట్టి వెళ్ళి పోతానని చెప్పాను.'

భగవతి కుట్టి అమ్మ మనస్సు శాంతికి దూరమైపోయింది. తిరువనంతపురంలో ఒక సెక్రటరీ భార్య తన భర్త చీఫ్ సెక్రటరీ కావాలని కోరుకుంది. అందులో తప్పేముంది? తిరువనంతపురంలో తెలివిగల వుద్యోగస్థుని భార్య భర్తకు వుద్యోగం రావాలని ప్రయత్నించింది. ఇది ప్రాచీన సంప్రదాయం. ఆఫీసులో బంట్రోతులు గుమాస్తా అయేందుకు ప్రయత్నిస్తారు. కాపీ చేసే గుమాస్తాలు, అసిస్టెంటు కావాలని, అసిస్టెంట్లు సూపరింటెండెంటు కావాలని ప్రయత్నిస్తారు. అన్ని మార్గాలూ తెలిసిన భగవతి కుట్టిఅమ్మ వాతావరణాన్ని బట్టి ప్రవర్తించింది. తన భర్త తెలివి తక్కువ వాడని ఆమె అనుకోలేదు. అతనిలో సామర్థ్యం లేదని ఆమెకు తెలుసు. కాని యిలాంటి వాళ్ళు ఇంతకు ముందు దీవాన్లు కాలేదూ?

ఒక్క విషయం ఆమెను బాధిస్తూ వుంది. ఈ వున్నతోద్యోగం కొసం ఆమె చాలా ఖర్చు పెట్టింది. ఇంత వరకు పోగు చేసిందంతా ఆమె దీని కోసరం వెచ్చించింది. ఇంత చేసీ యింతలోనే వుద్యోగం వదులుకోవలసి వస్తున్నది. పెట్టినదానిలో కొంత కూడా తిరిగి రాలేదు. ఒక వైపు భర్త అసమర్థుడని అసహ్యం వేస్తున్నది. మరోవైపు సర్వస్వం సమర్పించినా భక్తివిలాస్ అతన్ని లెక్క చెయ్యటం లేదు. వీటికి తోడు భవిష్యత్తు ఎలా వుంటుందో అని దిగులు. భగవతి కుట్టిఅమ్మకు అంతా స్పష్టంగానే కనిపిస్తూ వుంది.

'ప్రైవేట్ సెక్రటరీని కలుసుకోరాదూ?' అన్నది.

'కలుసుకుంటాను. అతను చాలా దుష్టుడు. మోసగాడు.' అన్నాడు చీఫ్ సెక్రటరీ.

అతనలాంటివాడు కాదని భగవతి కుట్టిఅమ్మ నమ్మకం. ప్రైవేట్ సెక్రటరి గల్లంతు చేసే మనిషంటే ఆమె నమ్మలేక పోతున్నది. ఇంకా డబ్బు గుంజేందుకు అలా బెదిరిస్తున్నాడేమోనని ఆమెకు ఉన్నట్టుండి తట్టింది. ఆమాట ఆమె భర్తనడిగింది. భర్త విసుక్కుంటూ జవాబు చెప్పాడు: 'ఏమో నాకు తెలియదు.'

భగవతి కుట్టిఅమ్మకు కోపం వచ్చింది. అసలు విషయమేమిటో ఆమెకు తెలియాలి. కారణం తెలుసుకుని దానికి సమాధానం వెతికేందుకు ఆమె తీవ్రంగా ఆలోచించసాగింది. కాని భర్త ఆమెతో సహకరించటం లేదు.

'మరేమయివుంటుంది?' అడిగిందామె.

'ఏమయ్యుంటుందో నాకేం తెలుసు? దీవాన్‌జీకి, ప్రైవేట్ సెక్రటరీకి నామీద నమ్మకం లేదు. అంతే. అంతకు మించి మరేమీ లేదు. వాళ్ళకెవరిమీదా నమ్మకం లేదు.'

'నమ్మకం లేదా?'

'అవును, నమ్మకం లేదు.'

ఈ చిక్కు విడదీసేందుకు భగవతి కుట్టిఅమ్మకు ఏదో మార్గం దొరికినట్టు అనిపించింది.

'అంటే?' అడిగిందామె.

'అంటే దీవాన్‌జీ పిచ్చివాడిలా తయారయినాడు. అంతే. అతన్ని అలా తయారు చేశారు.'

'ఎవరు?'

'ప్రైవేట్ సెక్రటరీ.'

'నమ్మకం లేదని ఎందుకన్నారు?'

'నమ్మకం లేదు కాబట్టి.' చీఫ్ సెక్రటరీ కోపంతో అన్నాడు.

భగవతి కుట్టిఅమ్మ కూడా వదల్లేదు.

'అది ఎందుకనీ అని నేనడిగేది.'

'అది అదే - ఈ రాష్ట్రంలో అందరూ కాంగ్రెసువాళ్ళే అని అంటారు.'

తెలివితేటలు గల భగవతి కుట్టిఅమ్మకు ఒక ఆశాకిరణం కనిపించింది. ఆమె దారి చూపించింది:

'మీరు అలాంటివారు కాదని తెలియ చెప్పాలి. అతికి బాగా తెలిసేట్టు చెప్పాలి.'

'బాగుంది. నాకామాత్రం తెలీదూ? నాకేమీ అర్థం కాదు.'

భగవతి కుట్టిఅమ్మ సమాధానం చెప్పలేదు. కొంచెంసేపాగి చీఫ్ సెక్రటరీ తన గొడవ మళ్ళీ మొదలు పెట్టాడు:

'రోజు అయిదు వందల మీటింగులను గురించి రిపోర్టులు వస్తాయి. గూఢచారుల రిపోర్టులు కూడా వస్తాయి. అన్నీ తిన్నగా యిక్కడికే వస్తాయి.

పన్ను తీసేయమని వాళ్ళ గొడవ. పిల్లల్ని స్కూలుకు పంపించకుండా వుండటం, ప్రభుత్వ కార్యాలయాల ముందు తిష్టవేసుకుని కూర్చోవటం, నిబంధనలను అతిక్రమించటం - ఇదీ వాళ్ళ కార్యక్రమం. ఇవన్నీ ఏకధాటిగా జరుగుతాయి. అన్నింటినీ ఎదుర్కోవాలి. వీటిని గురించి రాయాలా అక్కర్లేదా అనేది ధర్మసందేహం. ఏం చేసేందుకూ వీల్లేదు. రాసిపంపితే ప్రమాదం వస్తుంది. పంపకపోతే అభాండం మీద పడుతుంది. నేను దాచి పెట్టానంటారు. వీటితో నాకు పిచ్చెక్కి పోతూవుంది.'

అతను తలగోక్కుంటూ పళ్ళు కొరుకుతూ తన గొడవ ముగించాడు.

'పాడు పదవి. యిది నాకక్కర్లేదు. నీవు లేని పోని ప్రమాదం నెత్తిమీదికి తీసుకొచ్చావు. రేపు భక్తి విలాస్‌కు పంపవలసిన కాగితాలను గురించి ఏమీ అవలేదు. ఇది నావల్ల కాదు.'

భగవతి కుట్టిఅమ్మ దిగులుతో కూర్చుండిపోయింది. భర్త చెప్పిందంతా ఆమెకు బోధపడినట్టు కనిపించటం లేదు. అసలు స్థితి ఏమిటో ఆమె సరిగ్గా అర్థం చేసుకుంటున్నది. భర్త ఒట్టి అధైర్యస్థుడని ఆమెకు తెలుసు. అందులో సందేహం లేదు. కృష్ణన్ నాయర్ ఈ పనికి తగిన వ్యక్తి కాడు. అతని పనికిరానితనం బహుశా ఆమెకు తెలిసినట్టుగా మరొకరికి తెలియదు. దేశంలో అశాంతి పెరిగి పోతున్నది. ఈ పరిస్థితిలో ఎలాంటి సన్నివేశాన్నయినా ఎదుర్కొనే ధైర్యం కావాలి. ఆమె భర్తకు ధైర్యం లేదు. అతను పిరికిపంద అనే మాటకూడా నిజమే. ఏ క్షణంలోనయినా అతను ప్రవాహంలో మునిగి కొట్టుకు పోగలడు. దీవాన్‌జీ కూడా నష్టంలో పడిపోయినాడు. నీరసించిన యీ మనిషిలో ధైర్యం, ఉత్సాహం కలిగించటం సాధ్యమా?

కృష్ణన్ నాయర్ అన్నట్టు ఇంతవరకు కూడాబెట్టినదంతా బూడిద పాలయింది. ఆమె వెచ్చించింది కేవలం బంగారం, డబ్బే కాదు. ఆ విషయం భగవతి కుట్టిఅమ్మ గుర్తు తెచ్చుకుంది. ఆమె ఏమరుపాటులో ఏమేమో కోల్పోయింది. భగవతి కుట్టిఅమ్మకు ఆ విషయం గుర్తుకు రాగానే జుగుప్స కలిగింది. ఆ అరవతను ఒట్టి పశువు. అతని వాసన కూడా ఆమెకు గిట్టదు. స్త్రీని ప్రేమించేందుకు అతనికి వేళా పాళా తెలీదు. తెలివి తేటలు శూన్యం. అసలతను స్త్రీని ప్రేమించగలడా అనేది కూడా సందేహమే. భగవతి కుట్టిఅమ్మను అతను ప్రేమిస్తున్నాడనే విషయం నలుగురయిదుగురికి తెలియాలని అతని కోరిక. దానికతను చాలా ఉబలాట పడతాడు. భగవతి కుట్టిఅమ్మ మరో ప్రమాదాన్ని ఎదుర్కోవాలి. ఆమె ప్రియుని స్నేహితులు తమిళదేశం నుంచి వస్తారు. భగవతి కుట్టిఅమ్మ 'బావురే' అని అసహ్యించుకుంటే ఆమె ప్రియుడు ఒకమాట అంటాడు. 'ఎలాగయినా నీవు మలయాళ మహిళవు కదా?'

భగవతి కుట్టిఅమ్మ కేవలం కృత్రిమమైన నవ్వు నవ్వింది. కాని అతని స్నేహితుడు తమిళదేశం నుంచి వస్తే? ఈ విషయం కొద్ది రోజులనుంచి భగవతి కుట్టిఅమ్మకు చిరాకు కలిగిస్తున్నది. దీవాన్‌జీ ప్రైవేట్ సెక్రటరీ ఆ స్నేహితుడితో కలిసి ఏ రోజయినా రావచ్చు. ఆ పరిస్థితిలో తాను ఎలా వ్యవహరించాలో ఆమె ఆలోచిస్తున్నది. ఆమె ఏవిధంగా కూడా నిర్ణయించ లేకుండా వుంది. ముక్కూ మొహం తెలియని బొండాంలాంటి ఆ అరవ మిత్రుని పాలబడి అవస్థ పడాల్సి వస్తుందేమోనన్న ఆలోచన తప్పకే మరో విషయం ఆమె స్మృతి పథంలో లేదు.

భర్త చెప్పినట్టు, పై వుద్యోగం అంత అవసరం కాదు. సత్యాగ్రహంలో ఇరుక్కోవటం పొరపాటయింది. చిన్నప్పటినుంచీ రాజభవనంలో ప్రవేశించాలనే కోరిక ఆమె గుర్తుకు తెచ్చుకుంది. ఆమె హృదయసీమలో ఆ రాజభవనం ఎలా చొచ్చుకు పోయిందో తెలియదు. జంతుశాలకు వెళుతూ దారిలో ఆపెద్ద భవనాన్ని చూసినప్పుడు ఆమెకాకోరిక కలిగివుంటుందని అనిపించింది. అది ఒక విధమైన ఆవేశం. పర్యవసానం పరిశీలించలేని పట్టుదల. భగవతి కుట్టిఅమ్మ గతకాలాన్ని నెమరు వేసుకుంది. ఆ పట్టుదలే ధైర్యంగా మారింది. కాని అందువల్ల ఆమె చాలా తప్పటడుగులు వేసింది. అన్నిటి కంటె పెద్ద తప్పు ఇప్పుడు జరిగింది. ఈ పరిస్థితిని ఇలాగే కొనసాగించాలంటే యింకా ఏమేం చెయ్యాల్సి వస్తుందో!

ఆరోజు బహుశా భగవతి కుట్టిఅమ్మ తన జీవితపు విలువలను తొలిసారి కొలుస్తూవుంది. ఇంత గంభీర పరిస్థితి ఇంతకు ముందు రాలేదు. ఇంతకు ముందు జీవితం త్వరత్వరగా జరిగిపోతూ వచ్చింది. ఆ వడిలో ఆమె తన భర్తను కూడా లాక్కొని వెళుతూ వుంది. ఈనాడు తన భర్తే కాదు, తాను కూడా అలసి పోయింది. ఆ అలసటలో అప్రయత్నంగా ఆత్మపరిశీలన ఆరంభమయింది. ఇలా జీవితం గడపటం న్యాయమేనా, ఇలా ప్రవర్తించటం స్త్రీకి ధర్మమేనా? తను దారితప్పి తప్పటడుగు వెయ్యటం ఆమెకు గుర్తు వచ్చింది. అది ధర్మంకాదనే ఆలోచన ముందే వచ్చివుంటే ఎంత బాగుండేది! ఆమె ఆలోచిస్తూ వుంది. ఆమె భర్త, పాపం టేబిలు మీద తల వాల్చి కూర్చుని వున్నాడు. ఆయన అమాయకుడు. జీవిత శకటం లాగిలాగి అలసిపోయినాడు. ఇక ముందుకు సాగేందుకు అతనికి ధైర్యం లేదు. అతను తన భార్యను ఎప్పుడూ ఏమీ అనలేదు. ఆమె చేసే పనికి ఎప్పుడూ అభ్యంతర పెట్టలేదు. ఆమె ఏంచేస్తున్నదో కూడా పట్టించుకోలేదు. అతను పట్టించుకుంటాడనే అనుమానం ఆమెకు రాలేదు. అతన్ని చూసి భయపడవలసిన అవసరం ఆమెకు ఇంతవరకు కలగలేదు. అలాంటి పరిస్థితులు ఏర్పడ్డాయి కూడా. కాని అతను ఏమీ తెలియనట్టు

కనిపించేవాడు. భగవతి కుట్టిఅమ్మ కృష్ణన్ నాయర్ని కన్నార్పకుండా చూస్తూ కూర్చున్నది.

ఇలాంటి తప్పటడుగులు వేసిన సన్నివేశాలు అట్టే లేవు. కాని యీ తప్పు పనులన్నీ ఎందుకు చేసినట్టు? అభివృద్ధి కోసరం. కేవలం అందుకేనా? భగవతి కుట్టిఅమ్మ ఆమాట కూడా చెప్పలేదు. చాలా రోజుల క్రితం ఆమె ఒక పురుషుణ్ణి ప్రేమించింది. ఆ ఆవేశం ఆమె మనసులో ఇప్పటికి ఉపశమించలేదు. ధీర్ఘ నిశ్వాస వదిలింది.

మళ్ళీ ఆ తమిళ పురుషుని చేతిలో ఎక్కడ చిక్కుంటానేనని ఆమెకు భయంగా వుంది. అంతా అడుగంటి పోయింది. అతని బారినుంచి తప్పించుకొనే దారి కనిపించటం లేదు. కాదంటే అతను కాలసర్పమై కాటేస్తాడు.

ఆలోచనలంత దాకా ప్రసరించిన తర్వాత కాంగ్రెసు గెలుస్తుందనే ఆశ భగవతి కుట్టిఅమ్మకు కలిగింది. దీవాన్‌జీ వెళ్ళిపోతే, అతనితో పాటు ఆ తమిళ మహాశయుడు కూడా వెళ్ళిపోతాడు. కాని యీ లోగానే ఆధరం నిరాధారమై ఆశలు అడుగంటి పోవచ్చు.

మర్నాడు కేశవపిళ్ళె త్వరగానే పార్కువ్యూ చేరుకున్నాడు. చీఫ్ సెక్రటరీ ఫైలు చూస్తున్నాడు. భగవతి కుట్టిఅమ్మ పక్కనే కూర్చుని వుంది. ఆమె విచారంగా మౌనంగా వుంది. కొంచెం సేపు కేశవపిళ్ళె అక్కడే నిలబడ్డాడు. చీఫ్ సెక్రటరీ ఏమీ మాట్లాడలేదు. ఇక్కడ తను చేయవలసిన పని యేమీ లేదని కేశవపిళ్ళెకు అనిపించింది. తన అధికారి తనను పని నుంచి తొలగించినట్టు అతనికి తోచింది. కాగితం మీద ఆర్డరు రాయటమే తరువాయి.

ఆ నిశ్శబ్దం, నిశ్చేష్టత కేశవపిళ్ళె సహించలేకుండా వున్నాడు. ఆ పరిస్థితిలో అతని నోట మాట వెలువడింది: 'ఒక విషయం చెప్పాలి.' అన్నాడు

'ఊఁ' అన్నాడు చీఫ్ సెక్రటరీ తల తిప్పి.

'ప్రతి చోటా కాంగ్రెసు వాళ్ళు సభలూ, సమావేశాలూ చేస్తున్నారు. ఈ సామావేశాలను అరికట్టి ఉపన్యాసాలను ఆపెయ్యాలి.' చీఫ్ సెక్రటరీ, ఆయన భార్య కూడా ఇదే ఆలోచనలో వున్నట్టు అతనికి తోచింది. ఈ మాట వాళ్ళ మనస్సుకెక్కింది. దీన్ని గురించి వాళ్ళ అభిప్రాయం తెలుసుకోవాలని కేశవపిళ్ళె ఆగాడు.

'నాయకులందరూ వుద్యోగం కోసరం అర్జీ పెట్టారు. వాళ్ళందరికీ వుద్యోగమిస్తే సరిపోతుంది.' అన్నాడు.

చీఫ్ సెక్రటరీకి మరో మార్గం కూడా కనిపించింది.

'ఆ తర్వాత మిగిలిన వాళ్ళను జైల్లో పెట్టెయ్యాలి. బాహాటంగా పోలీసుల చేత కొట్టించాలి.' అన్నాడు కేశవపిళ్ళె.

ఆ మాటలకు కొచ్చమ్మ, ఆమె భర్త - ఇద్దరి ముఖాలు సంతోషంతో విప్పారినట్లు అతనికి తోచింది. వాళ్ళు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

ఉన్నట్టుండి కేశవపిళ్ళై మౌనం వహించాడు. అతనేదో మరిచిపోయినట్టున్నాడు. చప్పునఅతనికో విషయం గుర్తుకు వచ్చింది:

'కాంగ్రెసుకు డబ్బిచ్చే వాళ్ళను మసి చేసేసెయ్యాలి. వాళ్ళ జాబితా పోలీస్ కమీషనరు ఆఫీసుకు వచ్చింది.'

కొంత సేపు చీఫ్ సెక్రటరీ ఆలోచనలో మునిగిపోయినాడు. కేశవపిళ్ళై చేసిన సూచనలు అతనికి ఆలోచించేందుకు దారి చూపించాయి.

'ఈ ఆలోచలను నీకు ఎలా తట్టాయి?' అడిగాడు.

'ఒహెూ' అని కేశవపిళ్ళై కుదుటపడ్డాడు.

'నిన్న రాత్రి ఆలోచించావా?'

భార్యవైపు తిరిగి చీఫ్ సెక్రటరీ అన్నాడు:

'అంతా బాగానే వుంది. కాని దీన్ని ఆచరణలో పెట్టాలి.'

భగవతి కుట్టిఅమ్మ అన్నది:

'ఆచరణలో పెట్టాలి. లేకుంటే ఎలా జరుగుతుంది?'

'ఇదంతా న్యాయం కాదు. నీతిబద్ధం కాదు.'

'నీతీ న్యాయం చూసుకుంటూ వుంటే నూతిలో పడి పోవాల్సిందే.' అన్నది భగవతి కుట్టిఅమ్మ గదిమినట్టు. కృష్ణన్ నాయర్ ఏదో ఆలోచిస్తున్నాడు. భగవతి కుట్టిఅమ్మ అన్నది:

'బాగా ఆలోచించి వివరంగా ఒక రిపోర్టు పంపించాలి. అలా చేస్తే మనపని నెరవేరుతుంది.'

'అవును.'

అప్పుడు 'ఆ పిల్ల అదృష్టవంతురాలు' అని కిట్టుమామ చెప్పిన మాటలు కేశవపిళ్ళై చెవిలో గింగురుమని వినిపించాయి.

## పదిహేను

జీవితంలో చిచ్చు తెచ్చిపెట్టే సంఘటనలు ఎప్పుడూ జరుగుతూనే వుంటాయి. ఒకడు కిందికి దిగజారి పోతూ వుంటే మరొకడు పైకి వస్తూ వుంటాడు. అలాగే యుద్ధంలో లక్షలకొద్దీ కుటుంబాలు కొంపా గోడూ లేకుండా నిరాశ్రయులయి పోతూవుంటే మరికొందరు ఐశ్వర్యాన్ని అనుభవిస్తూ వుంటారు. అలాంటి వాళ్ళకు యుద్ధం ఒక ఆటలాంటిది. రాష్ట్రమంతటా ప్రభుత్వం ఊరేగింపులను, సమావేశాలను నిషేధించింది. ప్రభుత్వమే దానికి సమాధానం చెప్పుకోవాలి. కాంగ్రెసు ఏర్పాటు చేసిన సమావేశాలన్నింటిలో రాళ్ళు రువ్వటం, అల్లరి చేయటం జరిగింది. పరిస్థితిని అదుపులో వుంచేందుకు పోలీసులు కఠిన చర్య తీసుకోవలసి వచ్చింది. లాఠీఛార్జి చేశారు. తుపాకులు పేల్చారు. చాలా చోట్ల ప్రజలు ప్రాణాలు

కోల్పోయారు. కాని కాంగ్రెసు ఓటమిని ఒప్పుకోలేదు. వాళ్ళు నిబంధనలను అతిక్రమించారు. నాయకులేకాక మరి కొంతమంది కూడా జైళ్ళలో ఖైదీలు అయినారు. చేతికి చిక్కిన వాళ్ళను ప్రభుత్వం పూరికే వదిలిపెట్టలేదు. దేశంలో శాంతి క్షీణించిపోతూ వుంది. కేశవపిళ్ళెకు అదృష్టం కలిసి వచ్చే సమయం.

కేశవపిళ్ళె ప్రసాదును వశపరుచుకున్నాడు. అది ఎలా సాధ్యమయిందని అడిగితే కిట్టుమామ చెప్పినట్టు ఆ పిల్ల అదృష్టంవల్ల అలా అయిందని చెప్పాల్సి వుంటుంది. అంతటి విప్లవాత్మకమైన మనస్తత్వంగల ప్రసాదును కాంగ్రెసుకు విరోధిగా మార్చటంలో అతనికి అణుమాత్రం కూడా ఆటంకం రాలేదు. ఇది సునాయాసమయిన పని అని కేశవపిళ్ళె అనుకోలేదు. ప్రసాదుతోపాటు విద్యార్థి సంఘానికి సంబంధించిన ముగ్గురు, నలుగురు నాయకులు కూడా వచ్చారు. ఈ విధంగా కాంగ్రెసు తాత్కాలికంగా నీరసించి పోయిందని చెప్పవచ్చు. చీఫ్ సెక్రటరీ ఒక నాయకుణ్ణి పట్టుకొని దీవాన్‌జీకి అప్ప చెప్పాడు. కాంగ్రెసు యొక్క యధార్థ స్వరూపం, కాంగ్రెస్‌లోని అంతరింగిక విషయాలూ బాగా తెలిసిన వ్యక్తి తీర్చిదిద్దిన తొలి రేఖ అది.

ఆ రోజు కేశవపిళ్ళె జీవితంలో ముఖ్యమయింది. అందులో సందేహం లేదు. కేశవపిళ్ళెకే కాదు, చీఫ్ సెక్రటరీకి, భగవతి కుట్టి అమ్మకూ కూడా అది చాలా ముఖ్యమయిన రోజు. దీవాన్‌జీ సంతోషించాడు. చీఫ్ సెక్రటరీని గురించి ఒక విషయం మాత్రం కృతజ్ఞతాపూర్వకంగా చెప్పుకోవాలి. ప్రసాదును, అతని స్నేహితులను తాను స్వాధీనం చేసుకున్నానని అతను చెప్పలేదు. అలాంటి భావం కూడా అతను వ్యక్తపరచలేదు. అతని స్థానంలో మరో అధికారి వుంటే తప్పకుండా అలా చెప్పివుండేవాడు, అలాంటి భావం వ్యక్తపరిచే వాడు. కాబట్టి ఆ సంఘటనకు సంబంధించిన పూర్తి బాధ్యతా, కీర్తి కేశవపిళ్ళెకే లభించింది. బహుశా భయం వల్ల అతనామాట చెప్పి ఉండడు. ఇది సరియైన విధానం కాదని దీవాన్‌జీ అంటాడేమోనని అతను అనుకుని వుంటాడు. ఏమయితేనేం దీవాన్‌జీ ఆనందించాడు. కేశవపిళ్ళె మీద అతనికి నమ్మకం ఏర్పడ్డది.

అదీకాక కేశవపిళ్ళె మరో విషయానికి కూడా మురుసుకున్నాడు. మానసికంగా ఇంత సంతోషం, సుఖం అతనికి ఇంతకు ముందెప్పుడూ కలగలేదు. కేశవపిళ్ళె మనసును కష్టపెట్టేట్టు మాట్లాడటం ప్రసాదు స్వభావం. యూనివర్సిటీ డిగ్రీని రెండు పైసలకు అమ్ముకున్నావని అతను కేశవపిళ్ళె ముఖం మీద అనేశాడు. ఆ రోజు తగిలిన గాయం కేశవపిళ్ళె గుండెలో ఇంకా మానలేదు. ఏదో రూపంలో ప్రతి రోజూ అతనికి ఈ మాట గుర్తు వస్తూనే వుండేది. వచ్చినప్పుడల్లా మనసుకు బాధ వేస్తూ వుండేది. ఇలా రెండు పైసలకు డిగ్రీ అమ్ముకునే వ్యక్తి డిగ్రీకి సరియైన విలువకట్టి

చెల్లించగలడు కూడా. కాని యీ విషయం కేశవపిళ్ళకు అప్పుడనిపించలేదు. ప్రసాదుకు ఉద్యోగం ఇప్పించగలిగానని మాత్రమే అతననుకున్నాడు. అతనలా చేసింది ప్రసాదు మీద ప్రేమ వల్లకాదు. విప్లవం లేవదీసి జైల్లోపడి జీవితం పాడు చేసుకుంటున్నాడని కూడా కాదు. తనను అవమాన పరచినందుకు ప్రతీకారంగా కూడా కాదు. తన మంచితనాన్ని ప్రచారం చేసుకునేందుకు. తన మంచితనాన్ని గురించి అతనికెంతో తృప్తి గలిగింది. ఎందుకంటే దీవాన్‌జీని కలుసుకుని తిరిగి వచ్చేప్పుడు అతను ప్రసాదుతో అన్నాడు-

"నీకు త్వరత్వరగా వుద్యోగంలో అభివృద్ధి వస్తుంది. కాని ఒక్క విషయం. ఇక నీవు నా సంగతి కూడా చూడాలి. నాకు సాయం చెయ్యాలి".

కారణం లేకుండా అలా అనలేదు. దీవాన్‌జీ ప్రసాదును కూర్చోబెట్టి చాలా తీరికగా మాట్లాడాడు. ప్రసాదు కూడా మర్యాదగా ప్రవర్తించాడు. ప్రసాదును సూపరింటెండెంటును చెయ్యాలి. కేశవపిళ్ళ యింకా లోయర్ డివిజన్ క్లర్కుగానే వున్నాడు.

కేశవపిళ్ళ సూచించిన మార్గాన్ని చీఫ్ సెక్రటరీ అంగీకరించాడు. ఆయన కూడా ఫలితం సాధించాడు. పర్యవసానంగా కాంగ్రెస్ ప్రవర్తక సమితికి సంబంధించిన యిద్దరు సభ్యులను వలలో వేసుకోగలిగాడు. ఆయన చాలా గట్టివాడు, యుక్తిపరుడయిన నాయకుడు. చివరకు కేశవపిళ్ళకు కూడా చాలామంది దొరికారు. వాళ్ళంతా రెండవ తరగతి కాంగ్రెసు నాయకులు.

ఉపన్యాసాలు శాంతియుతంగా జరిగినా కాంగ్రెసు వాళ్ళ ఉద్యమం శాంతియుతంగా లేదని నిరూపించాలి. చీఫ్ సెక్రటరీ అలా రిపోర్టు రాసి దీవాన్‌జీకి పంపాడు. దీవాన్‌జీ దాన్ని ఆమోదించాడు. ఇకదాన్ని ప్రచారంలోకి తీసుకురావాలి. ఆ బాధ్యత చీఫ్ సెక్రటరీ మీద పెట్టారు. పేష్కార్లను, పోలీసు ఉద్యోగస్థులను పిలిచి చీఫ్ సెక్రటరీ ఒక కార్యప్రణాళిక తయారు చేస్తున్నాడు.

నెయ్యాట్టింకరలో పెద్ద ఎత్తున సమ్మెతో పాటు కాంగ్రెసు సమావేశం కూడా జరుగుతూ వుంది. అక్కడ తన కార్యక్రమం అమలు పరచాలని చీఫ్ సెక్రటరీ నిర్ణయించుకున్నాడు. ఏర్పాట్లన్నీ అధికార్లు చేస్తున్నారని చీఫ్ సెక్రటరీకి తెలిసింది. కాని అతని మనస్సు ప్రశాంతంగా లేదు. ప్రతి ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేటూ, ఇన్‌స్పెక్టరూ క్రైస్తవుడు. వాళ్ళు కేశవపిళ్ళను సి.ఐ.డి.గా నియమించారు.

అది నిజంగా కేశవపిళ్ళకు ప్రాధాన్యం తెచ్చిపెట్టే పని. హోదాగల వుద్యోగస్థుల ఆచూకి కనుక్కోవడం కేశవపిళ్ళ పని. ఆ పని అతను చెయ్యలేక పోయినా వాళ్ళ పోకడలను గమనించవలసిన విధి అతని మీద ఉంది. ఇది సామాన్యమైన పని కాదు. అతను చెప్పిన విషయం పార్కువ్యూలో, భక్తివిలాస్‌లో అందరూ నమ్ముతారు. దీనికి కావలసిన డబ్బుకూడా కేశవపిళ్ళ

చేతిలోకి వచ్చింది. పెద్ద పెద్ద హోదాల్లో పనిచేసే అధికార్ల మధ్య కేశవపిళ్ళెకు ప్రాధాన్యం లభించటం కూడా గొప్ప విషయమే. కాని కేశవపిళ్ళెలో అలాంటి భావం లేదు. మామూలు లోయర్ డివిజన్ గుమాస్తాలాగా లుంగీ కట్టుకుని అతను వాళ్ళ యెదుట నిలబడ్డాడు. కేశవపిళ్ళె మిస్టర్ కేశవపిళ్ళె అయినప్పటికీ 'సార్' అనేందుకు అతను సంకోచించడు.

ప్రభుత్వం చాలా మందికి డబ్బిచ్చి చేయవలసిన యేర్పాట్లు చేసింది. ఊరేగింపు జరుగుతుండగా రాళ్ళు రువ్వటం జరిగింది. ఊరేగింపు వాళ్ళు తిరుగుబాటు చేశారు. పోలీసులు కొంతమంది గాయ పడ్డారు. పోలీసులు ప్రతీకారంగా కాల్పులు సాగించారు. కాల్పుల్లో ముగ్గురు మరణించారు. చాలామందికి దెబ్బలు తగిలాయి. ప్రభుత్వం గెలిచింది.

చీఫ్ సెక్రటరీ సంతోషంతో గంతులు వేశాడు. ఆయన సంతోషం పట్టలేక కేశవపిళ్ళెను కౌగిలించుకున్నాడు. నిజానికి కేశవపిళ్ళె వల్లనే కదా యీ విజయం లభించింది!

భగవతికుట్టి అమ్మకు కూడా అదే గట్టి నమ్మకం. అందుకనే ఆమే "ఇదంతా మీ సామర్థ్యంవల్ల అయిందా?" అని తన భర్తనడిగింది.

"ఆ మాట నేనన్నానా?" అన్నాడు చీఫ్ సెక్రటరీ బాగా ఆలోచించి.

"ఇంతటితో సరిపోదు" అన్నట్టుగా భగవతి కుట్టి అమ్మ అన్నది; "కేశవపిళ్ళె మనస్సులో ఇలాంటి ప్రణాళిక లేకపోయినట్టయితే పరిస్థితి యెలా వుండేదే?"

ఒక్కక్షణం ఆగి ఆమే అడిగింది;

"దీవాన్ పేరిట ఇదంతా అతని యోగ్యత వల్ల అయిందా?" కాదనలేక కృష్ణన్‌నాయర్ అన్నాడు;

కేశవపిళ్ళె శక్తి సామర్ధ్యాలను గురించి దీవాన్‌జీకి తెలుసు. అతను చాలా చురుకయిన కుర్రవాడని ఆయన అన్నారు. దీవాన్‌జీ సామాన్యంగా అలా అనరు. మనసులో మంచి అభిప్రాయం వున్నా బయటికి అలా అంటారా? మంచి పని జరిగింది".

"అందుకని యిప్పుడతనికి ఏం చేయ్యాలి?" భగవతికుట్టి అమ్మ అడిగింది.

"అతనికి మంచి ప్రొమోషనివ్వాలి" అతను పనిలో యిప్పుడే ప్రవేశించాడు.

ఇంతవరకు అంతా విజయవంతగా సాగుతున్నదని కేశవపిళ్ళెకు తెలుసు. ఇది సామాన్యమైన విజయం కాదు. దీవాన్‌జీకి కూడా చాలా ఆనందమయింది. కేశవపిళ్ళె తనను కాపాడుకోవటమే కాక చీఫ్ సెక్రటరీని కూడా రక్షించాడు. అన్ని విషయాలూ తెలిసిన మేధావి చీఫ్ సెక్రటరీ కూడా చిరాకు పడటం కేశవపిళ్ళెకు ఆశ్చర్యం కలిగించింది. అలాంటి పరిస్థితిలో ఇలాంటి

ప్రణాళిక మెరుపు తీగలా తన మెదడులో ఎలా మెరిసిందో అని అతనికి ఆశ్చర్యం వేసింది. ఇంతటి బుద్ధిబలం అతనిలో ఉన్నదన్న మాట. ఎలాగయితేనేం ప్రాంతీయ కాంగ్రెసు ఉద్యమాన్ని ఎదుర్కొనేందుకు అతను నడుంకట్టాడు.

అన్నింటికీ ఈశ్వరానుగ్రహమే ఆధారమని కేశవపిళ్ళై భావించాడు. దానికితోడు కిట్టుమామ చెప్పిన మాటా– 'ఆ పిల్ల అదృష్టవంతురాలు' అతని మనస్సులో వుంది. లేకుంటే యిదంతా యింతవరకు వచ్చేదా? ఏదో దివ్యశక్తి అతనికి దారి చూపిస్తూవుంది. అదే శక్తి అతన్ని ఆపదలనుంచి కాపాడుతున్నది. ఇక ముందుకూడా అదే శక్తి అతనికి అండగా వుండగలదని అతని నమ్మకం.

కేశవపిళ్ళైకు ప్రొమోషను వచ్చింది. ఈ ప్రొమోషను అతనికి స్వశక్తి వల్ల వచ్చింది. నెయ్యాంటికర లాగే మరి మూడు నాలుగు చోట్ల అల్లర్లు జరిగాయి. అన్ని చోట్లా అల్లర్లు చేలరేగేందుకు ప్రజల్లో ఆవేశం వుంది. తమకు అడ్డు తగలటంవల్ల రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు దీవాన్‌జీని బెదిరించేందుకు అతని దగ్గరకి వెళ్లారు. ఉద్యమం విరమించవలసిందని గాంధీజీ ఉపదేశించారు. ఈ విధంగా ఆ మహోద్యమం ఆగిపోయింది.

కొన్ని వారాల నుంచేకాదు, కొన్ని నెలల నుంచీ కేశవపిళ్ళై నిర్విరామంగా పని చేస్తున్నాడు. పనులన్నీ సక్రమంగా, విజయవంతంగా సాగిపోతూ వున్నాయి. అతని దృష్టిలో కాంగ్రెసు అంతరించి పోయింది.

కొన్నాళ్ళు సెలవు తీసుకుని కేశవపిళ్ళై యింటికి వెళ్ళాడు. ఇప్పుడు ఇంటికి వెళ్ళటంలో ఒక విశేషముంది. ఇంతకు ముందు ఇంటికి వెళ్ళినట్టు కాదు. కుర్రవాడు ఉద్యమంలో విజయం సాధించి వెళుతున్నాడు. ఈనాడతను రాష్ట్రంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించిన ప్రఖ్యాత వ్యక్తి. అంత పెద్ద వుద్యోగం కాకపోయినా పేష్కారులు, పెద్ద పెద్ద అధికారుల మన్ననలు పొందే పదవిలో ఉన్నాడు. ఈ మధ్య అతను వాళ్లింటి యెదురుగా వుండే పెద్ద స్థలం కొనేశాడు. కాంగ్రెస్ సమ్మెల్లో సంపాదించిన సంపద అది.

కాని యింట్లో వాళ్ళమ్మకు ఇంకా కంగారుగానే వుంది. వాళ్ళ నాన్న కూడా గాబరా పడుతున్నాడు. కాంగ్రెస్ సమ్మె చేస్తే వాళ్ళ అబ్బాయి ఏం చేస్తాడో అతని అమ్మకూ, నాన్నకూ తెలీదు. ఇందులో క్లర్కు చేయవలసిన పని, ఏమిటని పప్పు పిళ్ళై ప్రశ్న. అదంతా పోలీసులు చూసుకోవలసిన పని కదా!

"భగవంతుడి దయవల్ల మా అబ్బాయికి పోలీసుపని రాలేదు. అది మా అదృష్టం". ఈ మాట, కాల్పులను గురించి విన్నప్పుడు కుట్టి అమ్మ అన్నది. ఆ తర్వాత ఆమెకు నెమ్మదిగా అన్ని విషయాలూ అర్థమయ్యాయి.

పిల్లవాడు ఇంట్లో అడుగు పెట్టకముందే వాళ్ళ అమ్మ అడిగిన ప్రశ్నయిది;

"ఏమబ్బాయ్, ఇంత కఠినంగా యీ విప్లవం లేవదీశావా?"

ఈ వాక్యంలో ఆగ్రహం, ఆనందం రెండూ మిళితమై వున్నాయి. వాళ్ళబ్బాయి చేసిందంతా పొరపాటేనని ఆమె అభిప్రాయం.

"నేను విప్లవమేం లేవదీశానమ్మా?" అది కుమారుడు చెప్పిన సమాధానం. ప్రశ్నావాచకంగా వుంది.

కుట్టి అమ్మకు తెలిసిన విషయాలన్నీ చెప్పాలని ఆమెకు కుతూహలం. ఆమే మొదలు పెట్టింది.

"పిళ్ళను తుపాకుల తుఫానుకు గురిచేసి చంపించటం, కాళ్ళూ చేతులూ విరగ్గొట్టి, క్షయరోగం పాలు చెయ్యటం"

కేశవపిళ్ళె తన ముఖంలోని భావాన్ని దాచుకునేందుకు నవ్వాడు.

కుట్టి అమ్మ చెప్పుకు పోతూవుంది:

ఇది కాస్తా కూస్తా విప్లవమట్రా అబ్బాయ్! పద్మనాభస్వామి దగ్గర పదిపైసలు సంపాయించడం ఇందు కోసం కాదు. ప్రజలను కాపాడేందుకు :

ఆ పట్టులో పప్పుపిళ్ళె అందుకున్నాడు:

"ఆ మాట వదిలేయ్. ప్రజలకు రాజంటే గిట్టదు".

"ప్రజలు అలాంటివాళ్ళు కాదు. నాకేం చెప్పక్కర్లేదు. ప్రజలకు దీవాన్‌జీ అంటే అసహ్యం". అన్నది కుట్టి అమ్మ.

"పోపో. నీకేంతెలుసు ?" అన్నాడు పప్పు పిళ్ళె కోపంతో.

కుట్టి అమ్మ భర్త కోపాన్ని లక్ష్యపెట్టకుండా కొడుకుతో అన్నది :

"కోడలు కడుపుతో వున్నప్పుడు కుటుంబానికి వూళ్ళోవాళ్ళ ఉసురు తగలకూడదురా అబ్బాయ్".

ఆ మాటతో ఏకీభవిస్తూ పప్పుపిళ్ళె అడిగాడు:

"నీ వుద్యోగం పోలీసుశాఖలోనా?"

కేశవపిళ్ళె యేమీ మాట్లాడలేదు.

పప్పు పిళ్ళె మళ్ళీ అడిగాడు- "అవునా?" అని.

"లేదు" అన్నాడు కేశవపిళ్ళె వెంటనే.

"మరియిదంతా ఎందుకు చేసినట్టు?" అని గట్టిగా ప్రశ్నించాడు పప్పు పిళ్ళె.

కేశవపిళ్ళె చెప్పదలుచుకుంటే చాలా చెప్పాలి. పార్కువ్యూలో తను చేసే పని యేమిటో, ఈ గొడవలో తను ఎలా పడ్డాడో అన్నీ చెప్పాలి. చెప్పటం మొదలు పెడితే రోజంతా చెప్పినా చాలదు.

"ఇదంతా మంచికే నాన్నా. దీవాన్‌జీకి నా మీద చాలా ప్రేమ" అన్నాడతను.

పప్పు పిళ్ళె న్యాయమూర్తిలా ప్రశ్నించాడు :

"అయితే యిదంతా నీవే చేయించావన్నమాట?"

కేశవపిళ్ళై మరో విషయం నచ్చచెపుతూ అన్నాడు:

"మరి యీ రాజద్రోహులను ఏం చెయ్యాలి?"

ఇదంతా కాంగ్రెసువాళ్ళు చేస్తున్న రాజద్రోహం, దుండగం అని పప్పు పిళ్ళై ఒప్పుకుంటాడు. రాజే పరమేశ్వరుడు, రాజు లేకుంటే యెలా జరుగుతుంది. ఈ విషయాల్లో గాంధీజీని గురించి చెపుతూ ఆయన అస్పృశ్యతను ప్రతిఘటించాడని కూడా ఆయన అంటాడు. ఈ విషయంలో ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించకపోతే పని జరగదు. ప్రజలకు రక్షణ లభించదు.

"అదంతా సరేనేయ్! కానీ, చీమను చంపేందుకు కాళ్ళే కావాలా? ఇదంతా చేసేందుకు నీవే కావలసి వచ్చావా ? ఇలాంటి కఠిన చర్యల్లో వెనక్కి తగ్గటం మంచిది".

కేశవపిళ్ళైకు ఒక విషయం తెలుసుకునేందుకు కుతూహలం ఏర్పడ్డది:

"ఇవన్నీ మీకిక్కడికి వచ్చి యెవరు చెప్పారు ?"

కుట్టి అమ్మ దానికి సమాధానం చెప్పింది:

"ఇక్కడ తొట్టంకర అంగడి వుండేది గదా! అక్కడ ఇంతకు ముందు దేవసి కొట్టు పెట్టేవాడు. ఇప్పుడక్కడ అంగడిలేదు. అక్కడ ఏముంది?" కుట్టి అమ్మ భర్తనడిగింది: "ఏముంది?"

"రీడింగు రూమ్" కిట్టు మామ జవాబు చెప్పాడు.

కుట్టిఅమ్మ చెప్పసాగింది:

"రాత్రిపూట అక్కడ, ఇక్కడి కుర్రకారంతా చేరుతుంది. అన్ని కులాలవాళ్ళు కూడుతారు. ఆ రీడింగు రూమ్ ముందు ఈ రోజుల్లో పెద్ద పెద్ద సమావేశాలు జరుగుతున్నాయి. ఉపన్యాసాలిచ్చేందుకు బయటి నుంచి ఎవరెవరో వస్తారు. నీవు తుపాకులు పేల్పించి ప్రజల ప్రాణాలు తీశావని అందులో ఒకాయన అన్నాడు. ఆయన నిన్ను చెడాబడా తిట్టాడు. మరో ఆయన నీకు ఉరిశిక్ష వేస్తారని అన్నాడు. మనం కొనుక్కున్న స్థలం సర్కారు డబ్బుతో కొనుక్కున్నామని అంటున్నారు".

"ఆయన పేరేమిటి కిట్టుమామా?" అని కుట్టి అమ్మ కిట్టు మామనడిగింది.

"నేచంగనూర్ మాధ్యూ. కేశవపిళ్ళై కాల్పులు చేయించాడని ఆయనే అన్నాడు. ఆయన ఉపన్యాసం చెపుతుంటే వినేవాళ్ళు ఒళ్ళు తెలియని స్థితిలో వుంటారు. ఆయన దీవాన్‌జీని గురించి కూడా నానా మాటలూ అన్నాడు".

"ఉరి తీస్తారని యెవరన్నారు?" కేశవపిళ్ళై అడిగాడు.

"గోపి అనే ఆయన. ఎవరో నారాయణ నాయర్ అనే ఆయన కూడా వున్నాడు".

కిట్టు మామ మరో మాట కూడా అన్నాడు:

"ఆయన ఒక్కసారి ఉపన్యాసమిస్తే రాష్ట్రమంతా చలించి పోతుంది"
పప్పు పిళ్ళై తన అభిప్రాయం చెప్పాడు .
"ఆయన్ని జన్మఖైదీగా పెట్టాలి. ఉపన్యాసాలు ఇయ్య నియ్య కూడదు"
దేశమంతా తిరిగి వచ్చిన కిట్టు మామ అన్నాడు.
"ఉపన్యాసాలిచ్చేవాళ్ళు చాలా మంది వున్నారు. వాళ్ళందర్నీ జైల్లో పెట్టగలరా?"
"పెట్టాల్సిందే".
కిట్టు మామ అన్నాడు :
"దేశం మొత్తంలో మనమంటే ఎవరికీ గిట్టదబ్బాయ్. నిన్ను గురించి ఇంత చెడ్డగా మాట్లాడుతుంటే ఒక్కడు కూడా ఎదురుతిరిగి జవాబు చెప్పలేదు: ఉరితీస్తారన్నప్పుడు కూడా ఎవ్వరూ మాట్లాడలేదు".
"అలా అంటుంటే అందరూ చప్పట్లు కొట్టారు" అన్నాడు, పప్పు పిళ్ళై మాట పూర్తి చేస్తూ.
కుట్టి అమ్మ మరో ముఖ్య విషయం చెప్పింది:
"కొన్నాళ్ళ క్రితం కొంతమంది జండా పట్టుకుని యీ దారిన వెళ్ళారు. వాళ్ళు మన వాకిట్లోకి వచ్చి నిన్ను ఉరితీస్తామని కేకలు వేశారు".
దేశంలో లోకులంతా తనను గురించి ఏమనుకుంటున్నారో కేశవపిళ్ళైకు మొట్టమొదట యీ రోజే తెలిసింది. కాల్పులు, లాఠీ ఛార్జి, సమావేశాలు ఆపి వేయించటం. ఇవన్నీ ఎవరు చేయిస్తున్నారో, ఎవ్వరికీ తెలియదని కేశవపిళ్ళై యింతవరకూ అనుకుంటున్నాడు. తన జన్మ స్థానంలోనే ప్రజలు తనను గురించి యిలా అనుకుంటూ వుంటే, దేశంలో నలుమూలలా పల్లెల్లో ప్రజలు ఏమనుకుంటారో కేశవపిళ్ళై ఊహించాడు. అతను నీరసపడి పోయాడు. మనసులో భయం ప్రవేశించింది.
తల్లి చెప్పుకు పోతూవుంది:
"ఈ స్థలం కొన్నప్పటి నుంచీ అందరికీ మన మీద అసూయరా అబ్బాయ్. ఇక మనం ఇక్కడ ఇల్లు కట్టుకున్నామంటే యీ స్థలం వీళ్ళందరూ కాజేసేందుకు చూస్తారు. కాంగ్రెసు ప్రభుత్వం కనుక వస్తే మన స్థలాన్ని జప్తు చేస్తారని ఆ నాణీ భర్త యిక్కడికి వచ్చి చెప్పాడు".
యధార్థం తెలుసుకునేందుకు కిట్టు మామ అడిగాడు: "అలా చెయ్యొచ్చాబాబూ?"
"వీల్లేదు. వాళ్ళూరికే అలా అంటారు" అన్నాడు కేశవపిళ్ళై.
కేశవపిళ్ళైకు భయం వెయ్యలేదని చెప్పేందుకు వీల్లేదు. కాంగ్రెస్ ప్రముఖులు అలా అంటుంటారని అతనికి తెలుసు. కాంగ్రెస్ కార్యవర్గ సమితి తీర్మానం ప్రకారం బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడ్డ తర్వాత ఎలాంటి కార్యక్రమం రూపొందించాలి అనేది వాళ్ళు ప్రచారం చేస్తుంటారు. దాన్నిబట్టి

తుపాకులు కురిపించి బలాత్కారంగా ప్రాణాలు తీసిన ద్రోహులలకు శిక్ష విధించబడుతుంది. ప్రజల ఆస్తిని అపహరించి లంచగొండితనంతో ఏర్పరచుకున్న ఆస్తిని జప్తు చేస్తారు. ప్రస్తుతం పల్లెటూళ్ళలో కూడా ఇవే చర్చలు జరుగుతున్నాయి. ఇది నిజంగా సాధ్యమా?

"వీళ్ళంతా యిలా గంతులు వేస్తుంటే మిగిలిన వాళ్ళంతా వీళ్ళని వదిలి పెడతారా?" అన్నాడు పప్పు పిళ్ళై.

"ఇదంతా అయ్యేదిగాదు" - అన్నాడు కేశవపిళ్ళై నీరసంగా.

కుట్టి అమ్మకు తెలిసిన విషయం ఆమె నాలుక దాకా వచ్చి ఆగిపోయింది.

"వాళ్ళంతా యేమేం నిశ్చయించుకున్నారో నీకు తెలుసా? ఇక్కడికి ఎవ్వరినీ రావద్దని ఆంక్ష పెట్టారు. మమ్మల్ని మరో చోటికి వెళ్ళనియ్యటం లేదు".

పప్పు పిళ్ళైకు ఆ విషయాన్ని గురించి అట్టే కంగారు లేదు. "అందరూ పని కావాలని పాకులాడే వాళ్ళే. లేకుంటే ఎక్కడికి వెళ్ళతారు?".

కుట్టి అమ్మ అడిగింది :

"ఇంతకు ముందు ఇక్కడికి కోయిందన్, పప్పు నాదన్, ఒసఫ్ ఇంకా ఎంతో మంది వచ్చేవాళ్ళు. కానీ యిప్పుడు వాళ్ళ దారిన వెళుతూ మన యింటివైపు తిరిగి కూడా చూడటం లేదు. ఇక్కడికి ఎవ్వరూ రారు బాబు. మీ పాత స్నేహితుడు పాచ్చూ లేడూ? వాడికిప్పుడెంత గర్వం ? ఆడవాళ్ళు కూడా రావటంలేదు. కొచ్చు నాటీ మాత్రం వస్తుంది. అది కాత్యాయని కోసరం వస్తుంది. ఆడుతూ పాడుతూ నవ్వుతుంటుంది. వాళ్ళిద్దరికీ చాలా స్నేహం. మిగిలిన వాళ్ళందరికీ అసూయ. ఒట్టి అసూయ".

అందరికీ అసూయ ఏర్పడ్డదనే విషయంలో పప్పు పిళ్ళైకు ఏ మాత్రం సందేహం లేదు.

కుట్టి అమ్మ మళ్ళీ అన్నది :

"ఇక్కడికి కేరలం కిట్టూ మామా, గోపాల్ కురుప్ వస్తూంటారు.".

అంతా విన్నతర్వాత కేశవపిళ్ళై అడిగాడు:

"ఈ విషయాలన్నీ మీ కెవరు చెప్పారు?"

"గోపాల్ కురుప్, అంతోటీ మాప్పిలా వుళ్ళే వాళ్ళందరిళ్ళకూ వెళతారు. రీడింగ్ రూమ్‌కు కూడా వెళతారు". అన్నది కుట్టి అమ్మ.

"నీవు కాత్యాయనిని అడుగు. అది చెవుతుంది. కొచ్చునాటీ అన్నీ చెపుతుంది. ఆడవాళ్ళెవ్వరూ యిక్కడికి రారు. ఇరుగు పొరుగు వాళ్ళదగ్గరికి నేను వెళితే, నాతో ఎవ్వరూ మాట్లాడరు. అందుకని నేను వెళ్ళటమే మానేశాను. ఒకవేళ నేను కన్నుమూసినా ఏ ఆడదీ యిక్కడికి రాదు. ఆ విషయం నాకు తెలుసు. అలాంటప్పుడు మనమేం చేస్తాం నాయనా?"

కుట్టిఅమ్మ ఆపకుండా చెపుతూనే వుంది:

"ఇక్కడికి వస్తుంటుందని నాటీ భర్త ఆ అమ్మాయిని చాలా హింసించాడు. కాని ఆ పిచ్చిపిల్ల అతని మాట వినలేదు. అమాయకురాలు. ఆ పిల్లే రాకపోతే మాట్లాడేతోడు లేక కోడలికి పిచ్చి పట్టేది. ఆ పిల్ల చాలా మంచిది"

కుట్టి అమ్మకు ఒక కోరిక వుంది :

"నాయనా! ఇలాంటి కఠోరమైన పనులేమీ చేయ్యకు. ఇది కూడని పని. దానికి వచ్చే నెల్లో పదో నెల వస్తుంది. నీ కుమారుడు దాని కడుపులో వుండగా నీవు తుపాకులు పేల్చిస్తావా? చనిపోయేవాళ్ళకు కూడా తల్లిదండ్రులూ, భార్యాబిడ్డలూ వుంటారు కదా?"

జనసామాన్యంలో వ్యాపించిన క్రోధ భావం కేశవపిళ్ళెకు బోధపడింది. దేశం మొత్తంలో అందరికీ తనమీద ఇంత కోపమెందుకో కేశవపిళ్ళె ఆలోచించాడు. ఈ కార్యకలాపాల్లో తన పాలు చాలా తక్కువ. కావలసినంత డబ్బు కాజేసిన పోలీసులు ఏం చేస్తున్నారో చూసేందుకు తను వెళ్ళాడు. లాఠీ ఛార్జి చేయమని కాని, కాల్పులు సాగించమనికాని అతను ఉత్తర్వులు జారీ చేయ్యలేదు. అతని సమక్షంలో ఇదంతా జరిగిన మాట మాత్రం నిజం. అతనక్కడ నిలబడి వుండటం చూసి తమ శక్తి చాతుర్యాలను ఎక్కువగా చూపించేందుకు వాళ్ళు కొంచెం అతిగా ప్రవర్తించారు. అతను తన పై అధికారి ఆజ్ఞను పాటించాడు. అతని స్థానంలో మరెవరున్నా యిలాగే చేసేవాళ్ళు. మరి ప్రజలకు తనతో ఇంత విరోధమెందుకు?

కిట్టూ మామ ఒక యధార్ధమైన మాట చెప్పాడు :

"మొదట ప్రజలకందరికీ పిచ్చెక్కింది. రోజూ వూరేగింపులూ, సమావేశాలూ జరుగుతూ వుండేవి. గాంధీజీ యిప్పుడన్నింటినీ ఆపేశారు. అందుకని వాళ్ళకు అల్లరి చేసేందుకు అవకాశం లేకుండా పోయింది. అదే వాళ్ళ కోపానికి కారణం. కొన్నాళ్ళకు వాళ్ళే శాంతిస్తారు".

కేశవపిళ్ళెకు కూడా ఈ మాట నచ్చింది. జనసామాన్యంలోని ఆవేశం అరికట్టేసరికి అది ప్రతీకారంగా మారింది.

పప్పుపిళ్ళె మనస్సులో మరో విషయం బాధిస్తూవుంది. చేయతగని పని చెయ్యకూడదు. దేశమంతటా ప్రజలు కోపంతో వున్నారు. ప్రస్తుతం కనిపిస్తున్న శాంతి నమ్మతగింది కాదు. ఈ పరిస్థితిలో ప్రజల ఆవేశం మరో రూపం తాల్చవచ్చు. ఏదో దారుణమైన పని చేసినా చెయ్యవచ్చు.

"నీవు వెళ్ళి వాడికి అన్నం పెట్టు" అన్నాడు పప్పుపిళ్ళె కుట్టి అమ్మతో.

కుట్టి అమ్మ అన్నీ మరిచిపోయి నిలబడ్డది. ఆమె వెళ్ళిన తర్వాత పప్పు పిళ్ళె అడిగాడు :

"మీ అమ్మ వినకుండా అడుగుతున్నాను. ఈ విరోధవర్గం వాళ్ళు వట్టి పిచ్చివాళ్ళు. ఒకవేళ నిన్ను అవమానపరిస్తే?"

"అవమానపరిస్తే" అనే మాట పప్పుపిళ్ళై చాల మృదువుగా అన్నాడు. మనసులో వున్న కంగారు నాలుక మీదికి రాలేదు.

"ఆఁ, అదేం లేదు".

అలా అంటున్నప్పుడే కేశవపిళ్ళైకు 'అవును, అదీ నిజమే' అనిపించింది. రాష్ట్రమంతా అతన్ని ప్రజా ద్రోహిగా భావిస్తున్నది. ఎవరయినా-అతన్ని చంపేందుకు సిద్ధమయితే? దైవ శాపమని తల్లిదండ్రులంటున్నారు. ఈ కార్యకలాపంలో అంశాన్ని కేశవపిళ్ళై ఊహించలేదు.

కాంగ్రెస్ గెలుస్తుందా? రాష్ట్రమంతా కాంగ్రెసువైపు మొగ్గివుంది. జయించదని చెప్పేందుకు ఆధారమేమీ లేదు. కేశవపిళ్ళైకు తొలిసారి యిలాంటి ఆలోచన వచ్చింది. మళ్ళీ ఆందోళన చెలరేగుతుంది. ఇందులో కాంగ్రెసు గెలిస్తే కేశవపిళ్ళై ప్రథమ శత్రువవుతాడు. దీవాన్‌జీ దిగిపోతాడు. చీఫ్ సెక్రటరీ కూడా వుండడు. కేశవపిళ్ళై ఒంటరి వాడయిపోతాడు. తర్వాత కూడా అతను ఇలాంటి పనే చెయ్యాలి.

ఇంతవరకూ సంపాదించిన దానితో తృప్తిపడితే ఎలాగుంటుంది? ఆ క్షణంలో అతని మనస్సులోవున్న యెవరో అతన్ని ప్రశ్నించాడు:

"ఏమిటి సంపాదించింది?"

అంతా అదృష్టం కొద్దీ జరిగింది. ఇదే అదృష్టం ఇక ముందు కూడా కాపాడుతుంది.

## పదహారు

కేశవపిళ్ళై పట్టణంలో ఒక చిన్నయిల్లు అద్దెకు తీసుకుని వుంటున్నాడు. అలా కొద్ది రోజులు గడిచాయి కేశవపిళ్ళై కాంగ్రెసుకు మొదటి తరగతి శత్రువనే విషయం ప్రభుత్వం దృష్టిలోకి కూడా ప్రవేశించింది. గూఢచారుల నివేదిక కూడా ఈ విషయాన్నే బలపరుస్తూ వున్నది. ప్రభుత్వ రక్షణలో ఉండవలసిన వాళ్ళ జాబితాలో కేశవపిళ్ళై పేరు కూడా చేరింది. కేశవపిళ్ళై యింట్లో తెలుసుకున్న విషయాలన్నీ దీవాన్‌జీకి చెప్పాడు.

"నీకు భయమేస్తున్నదా?" దీవాన్‌జీ అడిగాడు.

"లేదు", అన్నాడు కేశవపిళ్ళై.

కేశవపిళ్ళై ప్రత్యేకమైన పోలీసు రక్షణలో వున్నాడు. అయినా అతని మనసులో నాటుకొని వున్న భయం అతని వుత్సాహాన్ని నీరసింప జేసింది.

కేశవపిళ్ళై, సూపరింటెండెంటు గ్రేడులో కొత్తగా ఏర్పడ్డ రాజకీయ శాఖలో బాధ్యతగల అధికారి అయ్యాడు.

కాని అతనిలోవున్న పిరికితనం అతన్ని విచారగ్రస్తుణ్ణి చేసింది. బాగా ఆలోచించి అతనొక నిర్ణయానికి వచ్చాడు. భాగ్యం ప్రసాదించిన వుద్యోగ ప్రవాహంలోపడి అతనీ స్థితికి వచ్చాడు. పదవి నుంచి తొలగిపోయే ప్రసక్తే లేదు. తాను చేస్తున్న పనిలో మనసుపెట్టి పని చెయ్యాలి. కాంగ్రెసును

నాశనం చెయ్యాలి. వాళ్ళను ఏ మాత్రం గెలవనియ్య కూడదు. కాంగ్రెసు గెలిచిందంటే కేశవపిళ్ళై ఓడిపోయాడన్నమాట. 'కేశవపిళ్ళైను ఉరి తీయాలి, అతని ఆస్తంతా జప్తు చెయ్యాలి.' - అని కేకలు పెడుతూ వుంటారు. కాంగ్రెసు గెలుస్తుందని అనుమానం కూడా పనికి రాదు. వాళ్ళను ఓడించి తీరాలి.

ఈ విధంగా కాంగ్రెసు సమ్మె కేశవపిళ్ళైకు చావు బతుకుల ప్రశ్నగా తయారయింది. అందువల్ల అది కేవలం కర్తవ్యపాలన కాకుండా సొంత విషయ మయింది. అతనిలో చైతన్యం జీవం పోసుకుంది. మెదడులో రకరకాల ఆలోచనలు రేకెత్తాయి. యన్.యస్.యస్., యన్.యన్.డి.పి. లాంటి సాముదాయిక సంస్థలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలని అతనికి ఆలోచన తట్టింది. దీని కోసరం తీవ్రంగా కృషి చెయ్యాలి. దానితోపాటు కాంగ్రెసును ఆదుకొనే బ్యాంకును నాశనం చెయ్యాలి. అది చాలా అవసరం. రాష్ట్ర కాంగ్రెసు నాయకులకు దేశభక్తి శూన్యం, దీవాన్‌జీ మీద ద్వేషం - అనే భావాన్ని ప్రచారం చేయ్యాలి. ఈ ప్రచారం రాష్ట్రం లోపల, బయట కూడా జయప్రదంగా సాగించాలి. అదే ప్రచారం ముఖ్యమైన ఉద్దేశ్యంగా వుండాలి. కేశవపిళ్ళై మనస్సులో ఈ విషయమై తర్జన భర్జనలు జరిగాయి. గాంధీజీని నిందిస్తూ, మతం పేరిట బ్రిటిష్ ప్రభుత్వాన్ని అభినందించే వాళ్ళు ఒక వర్గంగా ఏర్పడి రాష్ట్ర కాంగ్రెసును నడిపిస్తున్నారు. వాళ్ళదే కాంగ్రెసు. దీవాన్‌జీ అంటే వాళ్ళకు గిట్టదు. దానికి ఆధారం కూడా వుంది. చాలా నిరాశ చెందిన వాళ్ళు ఆ శాఖలో చేరారు. దీవాన్‌జీకి అతను వివరంగా ఒక రిపోర్టు తయారు చేసి యిచ్చాడు. ఒక కొత్త రకం సంస్థ యేర్పాటు చేయాలని నొక్కి చెప్పాడు. దీవాన్‌జీ దృష్టిని యీ నివేదిక ఆకర్షించింది.

కేశవపిళ్ళై నియామకం భక్తి విలాస్‌లో అయింది. చీఫ్ సెక్రటరీ సలహా లేకుండానే ఉన్నట్టుండి యీ వుత్తర్వు జారీ అయింది. ఉత్తర్వు చూసి కృష్ణన్ నాయర్ కష్టపడ్డట్టు దీవాన్‌జీకి అనిపించింది. అతను తన భార్యను కోప్పడ్డాడు.

"చూశావా! అతనికి ప్రొమోషను ఇచ్చినందుకు ఫలితం? ఇప్పుడు మన చేతులు దాటి పోయినాడు. అస్తమానం నీవు అతన్ని గురించి దీవాన్‌జీకి చెప్పమని గొడవ చేస్తుండే దానివి కదా? ఇప్పుడనుభవించు".

భగవతి కుట్టి అమ్మకు తన తప్పు ఒప్పుకోవాల్సి వచ్చింది. మితిమీరిన ప్రశంస చేసినందుకు మన చేతులు దాటి పోయాడు. చాలా నష్టపడ్డాం. సగం మనసులోనే ఆమే అనుకున్నది. "మనకు చాలా విధాల నష్టమయింది. అతను గొప్ప గొప్ప ఆశయాలతో చాలా మంచి పనులు చేశాడు".

కృష్ణన్ నాయర్ తన భార్యమీద గుణ దోష సమ్మిశ్రితమైన దోషారోపణ చేశాడు :

"ఏదయినా ఒక పనిలో ప్రవేశించే ముందు అందులో మంచి చెడ్డలు బాగా ఆలోచించాలి".

భగవతి కుట్టి అమ్మ కూడా వదల్లేదు:

"తప్పంతా నాదేనా ఏం? అందరూ అలాంటివాళ్ళే. నెయ్యాట్టింకరాలో కాల్పులు జరిపించినప్పుడు మీరేగా అతన్ని కౌగిలించుకున్నారు ?"

చీఫ్ సెక్రటరీకి కేశవపిళ్ళె చాలా సాయం చేశాడు. ఆ విషయం అతనికి గుర్తుంది. భగవతి కుట్టి అమ్మకు కూడా కేశవపిళ్ళె ఎంత చాకచక్యంతో పని చేశాడో తెలుసు. జలవిద్యుత్ ప్రణాళికలో, బస్ కంపెనీ విషయంలో అతనెంత తెలివితేటలతో పని చేశాడో ఆమే జ్ఞాపకం తెచ్చుకుంది.

"ఇంత ప్రేమ, వినయం, నిజాయితీ, కర్తవ్యపాలన గల వ్యక్తి మరొకడు దొరకటం కష్టం. అందులో సందేహం లేదు". అన్నది భగవతి కుట్టి అమ్మ.

చీఫ్ సెక్రటరీ ఆమెతో ఏకీభవిస్తూ అన్నాడు:

"దీవాన్‌జీ దగ్గరకి పంపించేందుకు అతను నాకు అందించిన నివేదికను నేను నా పేరిట పంపించి వుండవలసింది".

కొంచెం సేపు ఆగి అతను మళ్ళీ అన్నాడు:

"నావల్ల జరిగిన తప్పును గురించి నేనేమీ అనకూడదు".

ఇంత మంచి స్వభావంగల వ్యక్తి మరొకరు దొరకరని భగవతి కుట్టి అమ్మ అభిప్రాయం. చీఫ్ సెక్రటరీకి అలాంటి వ్యక్తి అవసరం. ఏమయినా సరే, ఎక్కడున్నా సరే కేశవపిళ్ళె, తాము చేసిన మేలు మరిచిపోడని యిద్దరికీ నమ్మకం.

కేశవపిళ్ళె నియామకం దీవాన్‌జీ ప్రైవేట్ సెక్రటరీని ఆశ్చర్యంలో ముంచి వేసింది. దీవాన్‌జీకి అంతరంగికుడైన వ్యక్తి. దీవాన్‌జీ యీ వుత్తర్వు ఎలా జారీ చేశారు? ఎంత ఆలోచించినా ఏమీ కారణం కనిపించటం లేదు. అందువల్ల అతనికి చాలా ఆశ్చర్యం వేసింది. ఇది యెలా సాధ్యమయింది? ప్రైవేట్ సెక్రటరీ కేశవపిళ్ళెను బాహాటంగానే అభినందించాడనే విషయం సందేహమే. ప్రైవేట్ సెక్రటరీకి తెలియకుండానే భక్తి విలాస్‌లో ఒక వ్యక్తిని నియమించటం అతనికి నచ్చలేదు.

ఆ బ్యాంకుకు సంబంధించిన పనిలో కేశవపిళ్ళె చాలా శ్రద్ధ వహించాడు. దాని కోసరం అతను చాలా తిరగవలసి వచ్చింది. ఈనాడు కేశవపిళ్ళె యిదివరకులా కాంగ్రెస్ సమ్మె కోసరం తిరిగే అధికారి కాదు. ఇప్పుడు పేష్కారు కేశవపిళ్ళె కోసరం ఎదురు చూస్తాడు. డిపార్టుమెంటులో పని చేసే అధికార్లు కేశవపిళ్ళెను కలుసుకునేందుకు ముందుగా టైము అడుగుతారు. కేశవపిళ్ళె చేసే ప్రతి పనీ అందరూ అరితటా చెప్పుకుంటారు. కేశవపిళ్ళె చేయదలచుకున్న పని మిగిలిన పనులన్నింటి కంటే ముఖ్యమైనది, అత్యవసరమైనది. కాని కేశవపిళ్ళె సూపరింటెండెంటు హోదాలో పని

చేస్తున్నట్టుగానే యీనాటి వరకూ ప్రవర్తిస్తాడు. ఏ పేష్కారు దగ్గరా అతను కూర్చోడు. ఇప్పుడతను 'అయ్యా, చిత్తం' అనని మాట నిజమే. వేషభాషలు కూడా మార్చలేదు. ఉద్యోగ ధర్మం నిరాటంకంగా నెరవేరుతూ వుంది.

అయినప్పటికి కేశవపిళ్ళె సుఖంగా జీవితం గడుపుతున్నాడని చెప్పేందుకు వీల్లేదు. అతనికి నిశ్చింతగా నిద్ర పట్టి చాలా రోజులయింది. పడుకొనే సమయంలో రకరకాల ఆలోచనలు మనసులో ముసురుకోవడం అలా వుంచి కళ్ళు మూతపడగానే పీడకలలు ఆరంభమవుతాయి. ఎవరిని నమ్మాలో అతను నిర్ణయించలేక పోతున్నాడు. అతనికి ఆప్తులెవరో అతనికే తెలియదు. అతనికి స్నేహితులంటూ ఎవ్వరూ లేరు. కాసేపు మాట్లాడుకునేందుకు కూడా అతనికి స్నేహితులు కరువైనారు. అన్నం వండి పెట్టేవాడే అన్నంలో విషం పెట్టవచ్చునని అతనికి భయం వేస్తున్నది. అప్పుడప్పుడూ కాత్యాయనిని పిలిపించుకుందామని కూడా అతననుకున్నాడు. కాని– యీ 'కాని' వెనుక ఎంతో కంగారు దాగివుంది. ఈ దుఃఖంలో అతనితో పాలు పంచుకునేందుకు ఒక వ్యక్తి కావాలి. అందుకోసరం కేశవపిళ్ళె ఆరాటపడుతున్నాడు.

జీవితంలో అదృష్టం పండే అవకాశాలన్నీ అతనికి అనుకోకుండానే వస్తున్నాయి. ఈ కాంగ్రెస్ సమ్మె జరగక పోయినట్టయితే అతనికి యీ ప్రొమోషన్ వచ్చేది కాదని కేశవపిళ్ళెకు అనుమానం. ఒక విధంగా కాంగ్రెస్ ఏర్పడటం వల్లనే కేశవపిళ్ళె భవిష్యత్తు బాగు పడింది. ఊళ్ళో సమ్మె యెలా జరగబోతున్నదో అతనికి తెలియదు. ప్రభుత్వం దాన్ని ఎలా యెదుర్కోవాలో కూడా అతనికి తెలియదు. కాని ఆ రోజు చీఫ్ సెక్రటరీకి అతను దారి చూపించాడు. అదృష్టం అతనినోట ఆ మాట పలికించింది. తన బుద్ధిబలం వల్ల అతనలా చెయ్యలేదు. తన మనుగడ కోసరం కాంగ్రెసు ఓడిపోయి తీరాలని అతనికి అనిపించింది. అందుచేత అప్రయత్నంగానే అతను తనంతట తాను రిపోర్టు రాశాడు. కాల్పుల ఘట్టంలో అతను విజయం సాధించాడు. అదంతా అదృష్టంవల్ల జరిగింది.

కాని మంచి రోజులు సముద్రపు అలల్లాగా రాకూడదు. అది మంచి లక్షణం కాదు. అలా వచ్చే అదృష్టం అదృష్ట దోషమవుతుంది. అదృష్ట దోషమంటే యేమిటి? అదికూడా కేశవపిళ్ళె మనసును వేధిస్తూ వుంది. అప్పుడప్పుడూ మెరుపు తీగలా వచ్చిన అదృష్ట రేఖను కేశవపిళ్ళె జ్ఞాపకం తెచ్చుకుంటాడు. దేశమంతటా అతనికి శత్రువులే.

ఒకరోజు ఉదయం కేశవపిళ్ళె తలుపు తెరిచి బయటకి చూసేసరికి భయంకరమైన దృశ్యం కనిపించింది. అతను ఉలిక్కి పడ్డాడు. ఎదురుగా మామిడి చెట్టు కింద ఒక మనిషి వేలాడుతూ వున్నాడు. చినిగిన చొక్కా, చిందర వందరగా చిక్కుపడ్డ ఎర్రజుట్టు, లుంగీతో ఆ మనిషి వేలాడుతూ వున్నాడు. చినిగిపోయి విరిగిపోయిన పాత గొడుగు మామిడి చెట్టు కింద

తలక్రిందులుగా పడివుంది. కాగితాల కట్ట గొడుగు పక్కన కనిపిస్తూ వుంది. కేశవపిళ్ళె కేక పెట్టాడు.

గుంపు కూడింది. ఆత్మహత్య చేసుకున్న గోపాలన్ నాయరతను. ఆ కాగితాల కట్టను పోలీసులు తెరిచి చూశారు. పొలం కొనుగోలుకు సంబంధించిన ఉత్తర్వు దగ్గరినుంచి అన్ని విషయాలూ అందులో వున్నాయి. మరో పుస్తకంలో చాలా యేండ్లనుంచి డబ్బు వసూలు చేసుకునేందుకు ప్రయత్నిస్తూ పెట్టిన ఖర్చంతా రాసి పెట్టివుంది. ఆ లెక్కలో సూపరింటెండెంటుకు ఇచ్చేందుకు కేశవపిళ్ళెకు ఇచ్చిన పదమూడు రూపాయలు కూడా తప్పకుండా ఎక్కించబడి వుంటాయి. ఈనాటికి కూడా ఆ ఫైలు అసిస్టెంటు సెక్రటరీ టేబులు మీద కనిపిస్తుంది. గోపాలన్ నాయర్ ఈ కాగితాలకట్ట తన కుమారుడు ముకుందన్‌కు అప్పగించమని ఒక ఉత్తరంలో వ్రాశాడు. తండ్రి, కొడుకు కోసం కూడబెట్టి యిచ్చిన ద్రవ్యమది.

కొన్నాళ్ళ నుంచీ యీ వ్యక్తి పార్కువ్యూ, భక్తివిలాస్ గేటు దగ్గర లోపలికి వెళ్ళేందుకు పచార్లు చేస్తూ వుండేవాడని పోలీసులు చెప్పారు. అతన్ని చాలాసార్లు పోలీసులు గెంటేశారు. అతను పిచ్చి వాడిలా కనిపించేవాడు. కేశవపిళ్ళె యింటి దగ్గర మామూలు దుస్తుల్లో గస్తీ తిరిగే భద్రతా భటులు రాత్రి ఎనిమిది గంటలప్పుడు ఆ వ్యక్తి ఆ దారిన వెళుతుండగా తాము చూశామని చెప్పారు. బహుశా అతను కేశవపిళ్ళెను కలుసుకునేందుకు తిరుగుతూ వుండవచ్చు. తన ప్రయత్నం సానుకూలం కాకపోవటంవల్ల అతను ఆత్మహత్య చేసుకుని వుంటాడు.

ఇంత భయంకరమైన దృశ్యం కేశవపిళ్ళె తన జీవితంలో యింతవరకు చూడలేదు. నాలుక చాచుకుని, గుడ్లు మిటకరించుకుని, తల వాల్చి అతను చూస్తున్నాడు. ఆ దృశ్యం తను ఎన్నటికీ మరవలేడు.

తంపానూరు లాడ్జిలో వుండేప్పుడు ఆ వ్యక్తి కుట్టన్ పిళ్ళె వుత్తరం తీసుకొని వచ్చాడు. అతన్ని లేపి వుత్తరం యిచ్చారు. అప్పుడతని చేతిలో ఒక దమ్మిడీ కూడా లేదు. కొంత సంభాషణ సాగించిన తర్వాత అతను మూడు రూపాయలిచ్చాడు. చివరకు ఆ మూడు రూపాయలు కూడా అతనికి తిరిగి యివ్వాల్సి వచ్చింది. చేతిలో చిల్లి గవ్వ లేకపోయేసరికి భగవంతుడు ఈ మార్గం చూపించాడు. ఆ సంఘటన తన జీవితంలో మరపురాని భయంకరమైన స్వప్నంగా మారింది. ఈ వ్యక్తి తనయింటి దగ్గరికి వచ్చి ఎందుకు ఆత్మహత్య చేసుకున్నట్టు? ఆ మూడు రూపాయలకే అయితే అంతకు ముందూ, ఆ తర్వాతా ఎంత మందికి ఎన్ని రూపాయలు లంచమిచ్చాడో? ఇంతకంటె ఎక్కువ సొమ్ము అనవసరంగా యిచ్చిన చోటికి వెళ్ళి ఆత్మహత్య చేసుకోవలసింది. తాను చేసిన తప్పు కేశవపిళ్ళెను తపనతో పరితపింప జేసింది. అతన్ని తను కాపాడగలిగేవాడు. ఇలా దారుణంగా ఆత్మహత్య చేసుకోవలసిన అవసరం

లేదు. బావగారి దగ్గరనుంచి వుత్తరం తీసుకొని వచ్చినప్పుడు తన పని నెరవేరుతుందనే నమ్మకంతోనే వచ్చి వుంటాడు. ఆ నమ్మకంవమ్మయ్యేసరికి అతను ఆత్మహత్య చేసుకుని వుంటాడు.

కాంగ్రెసుకు సానుభూతి తెలిపే వార్తా పత్రికల్లో గోపాలన్ నాయర్ అనే వ్యక్తి కేశవపిళ్ళ యింటి యెదురుగా మామిడి చెట్టుకు వేలాడి ప్రాణం తీసేసుకున్నాడని వార్త వచ్చింది. ఆ వార్త విన్నవాళ్ళకు కేశవపిళ్ళ గోపాలన్ నాయర్ని హత్య చేశాడని అర్ధమవుతుంది.

ఇదేదే చెడ్డ రోజులు ఆరంభమవుతున్నందుకు సూచనఅని కేశవపిళ్ళకు అనిపించింది. ఆ లక్షణాలు ముందుగానే కనిపిస్తున్నాయి. ఏదో గ్రహవీక్షణ అప్పుడప్పుడే ఆరంభమయిందని కేశవపిళ్ళకు అనుమానం వేసింది. అనుక్షణం ఏదో చెడ్డ వార్త వినవస్తుందని అతను భయపడుతున్నాడు. కేశవపిళ్ళ విచారమగ్నుడై వున్నాడు. కాంగ్రెసు వాళ్ళు తన ప్రాణాలు తీసేందుకు ప్రతి నిమిషం అవకాశం కోసరం ఎదురు చూస్తున్నారనటంలో సందేహం లేదు. సెక్యూరిటీ పోలీసుగార్డు వున్నప్పటికీ గోపాలన్ నాయర్ తన యింటి ముందే ఆత్మహత్య చేసుకున్నాడు. గోపాలన్ నాయర్ ఆత్మహత్య చేసుకున్న రాత్రి పహరా చేస్తున్న పోలీసు గార్డులను పనిలో నుంచి తొలగించటంతో కేశవపిళ్ళను ఆవరించిన భయం, విచారం తొలగిపోయాయి. వాళ్ళు తమ విధి సక్రమంగా నెరవేర్చలేదని కేశవపిళ్ళ రిపోర్టు రాశాడు. ఈ విధంగా రెండు కుటుంబాలు నిరాధారంగా వీధిన పడ్డాయి. వాళ్ళిద్దరూ పసిబిడ్డలను వెంట పెట్టుకొని వచ్చి అడిగారు: "వీళ్ళ సంగతి యేమవుతుంది సార్?"

కేశవపిళ్ళకు ఇలాంటి పిల్లల గుంపు కూడా తనమీద కత్తిగట్టారని తోచింది. ఇక పెద్దవాళ్ళతో విరోధం రావటంలో ఆశ్చర్య మేముంది?

ఈ విధంగా అతని విరోధి వర్గంలో చేరిన కుటుంబాల సంఖ్య పెరిగి పోయింది. ఎంత మందో లెక్కలేదు. కాల్పులలో ప్రాణాలు కోల్పోయిన వ్యక్తుల నామావళిని కేశవపిళ్ళ గుర్తు చేసుకున్నాడు. వాళ్ళ పిల్లలు, తల్లితండ్రులు, భార్యలు - అందరూ ఇలా ఒక్కొక్కరే ఉరి పోసుకుంటే వాళ్ళ ఉసురు కొడుతుంది. వాళ్ళ ప్రేతాలు అతని యింటి చుట్టూ చేరి అతన్ని చీల్చి చెండాడతాయి. ఇలా ఆలోచిస్తూవుంటే కేశవపిళ్ళకు భయం వేసింది.

కాని అన్నింటిలోకాక పోయినా ఏ ఒక్క విషయంలోనయినా అతను తప్పు చేశాడా? వాళ్ళంతా అతనికి ఎందుకు శత్రువులయినారు? తాను తన విధి నెరవేర్చాడు. అంతకుమించి అతనేమీ చేయలేదు. అతను కాకపోతే అతని స్థానంలో మరెవరయినా అదే పని చేసేవాళ్ళు.

'మన కాపరానికి వాళ్ళ ఉసురు కొట్టకుండా చూడు' - అని చెప్పిన తన తల్లి మాటలు మాటి మాటికి గుర్తుకు వస్తున్నాయి. కాత్యాయనికి కనే రోజులు

దగ్గర పడ్డాయి. కాత్యాయనిని గురించి ఎలాంటి వార్త వినవస్తుందో అని అతనికి సందేహంగా వుంది. ఏదో ఆపద రావచ్చునని అతనికి భయంగా వుంది.

కేశవపిళ్ళై శాస్త మంగళంలో ఒక పెద్దయిల్లు తీసుకుని అక్కడ వుంటున్నాడు. అంతకు ముందు ఆ యింట్లో గవర్నమెంటులో పని చేసే సెక్రటరీ వుండేవాడు. నాలుగు వైపులా పెద్ద పెద్ద ప్రహరీ గోడలతో కట్టిన యిల్లది. కాని యిల్లు మార్చినంత మాత్రాన కేశవపిళ్ళై మనసులో భయం పోలేదు. స్వల్ప కాలంలోనే అతని స్మృతి పథంలో చిరస్థాయిగా నిలిచిపోయే విచార ముద్రను గోవిందన్ నాయర్ వేసి పోయాడు.

కేశవపిళ్ళైకు శని ప్రవేశించాడని జ్యోతిష్యుడు చెప్పాడు. స్థలం మార్పు, అవమానం మొదలయినవి జరుగుతాయని చెప్పాడు. కాని డబ్బు వస్తుందట. ఇన్ని దోషాలున్నా పెద్ద పొరపాటేమీ జరగదు. శని గ్రహాన్ని ఆరాధించటమేకాక మరికొన్ని మార్గాలు కూడా ఆయన సూచించాడు.

ఆఫీసు పని మాత్రం కేశవపిళ్ళై సక్రమంగా చేసుకుంటున్నాడు. అంతకుమించిన పని చెయ్యాల్సిన బాధ్యత అతని మీద వుంది. గాంధీజీ మాటమీద జనం సమ్మెను విరమించుకున్నారు. అయినా ప్రభుత్వం ప్రతి బంధకాలను ఉపసంహరించలేదు. కాంగ్రెసు పార్టీ కొచ్చిన్‌లో ప్రవేశించింది. అక్కడి నుంచి కరపత్రాలను పంచిపెట్టి రహస్యంగా ప్రచారం చెయ్యటం కాంగ్రెసు కార్యక్రమం. చాలామంది నాయకులకు వారంటు వచ్చింది. త్వరలోనే ఒక మంచి పరిపాలనా విధానాన్ని ప్రకటించి ఎన్నికల ద్వారా రాష్ట్రప్రభుత్వాన్ని సుస్థిరం చెయ్యటం దీవాన్‌జీ కార్యక్రమం. దానికి ముందు కేశవపిళ్ళై సూచించిన వ్యవస్థను సరియైన పద్ధతిలో నెలకొల్పాలి. చివరకు ఎన్నికలు జరిపించాలి. కొద్ది రోజుల నుంచీ కేశవపిళ్ళై దాదాపు ఏమీ పని చెయ్యటం లేదు.

అసలు కేశవపిళ్ళైకు ముందంజ వేసి పని చేసేందుకు ఇప్పుడు ధైర్యం లేదు. అతను చేయవలసిన పని చాలా కష్ట సాధ్యమైనది. ఎలా ఆరంభించాలో అతనికి తెలియదు. ఆరంభించవలసిన సమయం మించి పోయిందని కూడా అతనికి తెలుసు. దీవాన్‌జీ, చీఫ్ సెక్రటరీ తన నేర్పరితనాన్ని మెచ్చుకొని తన యోగ్యత గుర్తిస్తున్నందుకు కారణం తన మేధాశక్తి, ఊహాబలం అని అతనికి నమ్మకం లేదు. వీపు తడితేనే అతను నోరు తెరుస్తాడు. ఆనాడు అతనికి తెలియకుండానే అతని అదృష్టం పండింది. ఇప్పుడు బహుశా ఏ క్షణంలోనైనా పిలిచి స్వస్తి చెప్పవచ్చు. ఒకవేళ దీవాన్‌జీ అలా చేయటం వల్ల అతనికి అదృష్టం కలిసివస్తే అతనికి మరో పదవి లభిస్తుంది. లేకుంటే అసమర్థత వల్ల బయటికి వెళ్ళవలసి వస్తుంది. అదృష్టం అలాగే వుంటే వుండనీ.

ఉద్యోగ విషయంలో కేశవపిళ్ళై స్థితి అంత తృప్తికరంగా లేదు. అతను ఈ పదవికి చాలా త్వరలో చేరుకున్నాడు. ఎంతమందినో దాటి అతనీ స్థితిని అందుకున్నాడు. దీవాన్‌జీకి సన్నిహితమైన పదవి అవటంవల్ల కేశవపిళ్లెను చూసి అందరూ వ్యంగ్యంగా నవ్వుతుంటారు. నవ్వేప్పుడు వాళ్ళు పండ్లు కొరుకుతూ వుంటారు కూడా. అసూయవల్లనే వాళ్ళలా పండ్లు కొరుకుతారు. వాళ్ళకు కేశవపిళ్ళై అంటే గిట్టదు. దీవాన్‌జీ ప్రైవేట్ సెక్రటరీ కూడా అవకాశం కోసరం గద్దలా ఎదురు చూస్తున్నాడు. ఇంతవరకు అతనికి తెలియకుండా ఏ పనీ అవలేదు. దీవాన్‌జీ మాటకు ఎదురు చెప్పేందుకు వీల్లేక అతను మాట్లాడకుండా వూరుకున్నాడు. అది బహుశా అతని దౌర్బల్యం కావచ్చు. కాని అవకాశం దొరికితే అతను ఏదో హడావిడి తప్పకుండా చేస్తాడు.

అనుకున్నంతా అయింది. దీవాన్‌జీ కేశవపిళ్ళైను పిలిచి చీవాట్లు పెట్టాడు. ఇన్నాళ్ళ నుంచీ నీవు చేసిన పనేమిటి అని అధికారపూర్వకంగా అడిగాడు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వుంది, అన్న భావం ఆ మాటల్లో వుంది. కేశవపిళ్ళైకు సమాధానం చెప్పేందుకేమీ తోచలేదు. అతను చెప్పగలిగింది చెప్పదగింది కాదు. తనకు భయం వేస్తున్నదని అతను చెప్పగలడా?-

దీనికంతటికీ కారకుడు ప్రైవేట్ సెక్రటరీ అని కేశవపిళ్ళై నమ్మకం. ప్రైవేట్ సెక్రటరీ అతన్ని ముందే కొంచెం కదిలించి చూశాడు. అది అతని స్వభావం.

దీవాన్‌జీ గదిలో నుంచి బయటికి వచ్చి కేశవపిళ్ళై తిన్నగా ప్రైవేట్ సెక్రటరీ దగ్గరికి వెళ్ళాడు. ప్రైవేట్ సెక్రటరీ శ్రేయోభిలాషిలాగా సంభాషణ సాగించాడు:

"దీవాన్‌జీ చాలా కోపంగా వున్నాడు. ఏమయింది కేశవపిళ్ళై గారూ?"

కేశవపిళ్ళై వెంటనే సమాధానం చెప్పలేకపోయినాడు. కాని యేదో చెప్పి తీరాలి. చెప్పక పోతే తనను చిన్న బుచ్చాడని ప్రైవేట్ సెక్రటరీ భావిస్తాడు. దీవాన్‌జీకి చెప్పినట్టు, అతనికి కూడా సమాధానం చెప్పాలి. చీఫ్ సెక్రటరీ, మేనేజరూ అతని యెదట ఎలా నిలబడతారో కేశవపిళ్ళైకు తెలుసు. అతనే అందరికీ నాయకత్వం వహించే వ్యక్తి. అతన్ని సంతోష పెట్టేందుకు మహామహావాళ్ళు సర్వస్వం అర్పిస్తారు. ఇప్పుడు మాత్రం పిల్లి యెలుకను పట్టుకున్నట్టు అతను పిళ్ళై గొంతు పట్టుకున్నాడు.

కేశవపిళ్ళై నమస్కారం చేసి గొంతు సవరించుకొని క్షమాపణ కోరాడు -

"మీరు నన్ను కాపాడాలి."

అమ్మయ్య, అతని మనస్సు కుదట పడింది. అతను చెప్పాల్సింది అదే. అదే నాలుక మీద పలికింది. అక్కడ కూడా అదృష్ట దేవత ఆదుకుంది. కేశవపిళ్ళె కళ్ళల్లో నీళ్ళు ఆడాయి. అంతా సక్రమంగా జరిగింది.

ప్రైవేట్ సెక్రటరీ అన్నాడు :

"కేశవపిళ్ళె గారూ! నేను మిమ్మల్ని ఎలా కాపాడగలను ? ఈ డిపార్టుమెంటుకు దీవాన్‌జీ సర్వాధికారి. ఆయన అన్నీ తనకు తోచినట్టు చేస్తారు. మరొకరి అభిప్రాయాన్ని ఆయన అంగీకరించరు".

ఆయన మాటల్లోని అంతరార్థం కేశవపిళ్ళెకు బాగా బోధ పడింది.

కొన్ని నెలల నుంచీ కేశవపిళ్ళెకు మనశ్శాంతి లేకుండా వుంది. తను చేసే పనులు తనకే తృప్తికరంగా వుండటం లేదు. ఇక రంగంలో దిగాలి.

ఒక్క క్షణం ఆగి కేశవపిళ్ళె అర్ధభరితంగా అన్నాడు: "నేనెప్పుడూ మిమ్మల్ని వచ్చి కలుసుకో లేదు. ఆ విషయం నాకు గుర్తుంది. ఏదో పేదవాణ్ణి. క్రమంగా పైకి వస్తున్నాను. ఇక్కడికి వచ్చేంత యోగ్యత నాలో లేదు".

ప్రైవేటు సెక్రటరీకి అంతా తెలిసి పోయింది. "అబ్బే అబ్బే. నేనా వుద్దేశంతో అనలేదు", అన్నాడు.

ఆ తర్వాత కొంతసేపు ఇద్దరూ మాట్లాడు కున్నారు. అసలు నీవు చేయదలిచింది ఏమిటని ఆయన కేశవపిళ్ళెనడిగాడు. పరివర్తిత జాతీయ సంస్థ నెలకొల్పాలి. అది ఎలా చెయ్యాలి, కార్యక్రమం ఎలా రూపొందించాలి మొదలయిన విషయాలన్నీ చర్చించారు.

ప్రైవేట్ సెక్రటరీ ఉపదేశం ప్రారంభించాడు:

"రాష్ట్రంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించిన పెద్ద వాళ్ళను కూడగట్టు కోవాలి. అలాంటి వాళ్ళ జాబితా ఒకటి ముందు తయారు చేయాలి".

అది కేశవపిళ్ళె తయారు చేశాడు. ఇక కార్యక్రమం ఆరంభించాలి.

"నీకు పెళ్ళయింది కదా?" అడిగాడు ప్రైవేట్ సెక్రటరీ.

ఆ ప్రశ్న వినగానే నిష్కారణంగా కేశవపిళ్ళె నివ్వెర పోయినాడు. ఈయన నన్నీ ప్రశ్న యెందుకడిగాడా అని కేశవపిళ్ళె మరుక్షణం ఆలోచించాడు. కానీ ఆ సంగతి కేశవపిళ్ళెకు తెలుసు.

"ప్రభుత్వోద్యోగం సక్రమంగా నిర్వహించేందుకు సక్రమమైన జీవితం అవసరం. భార్యతో కాపురం చేస్తూ వుండాలి". అన్నాడు ప్రైవేట్ సెక్రటరీ. కొంచెం ఆగి చిరునవ్వుతో అతనన్నాడు:

"ఎప్పుడయినా యింటికి వస్తే ఒక కప్పు కాఫీ తాగేందుకు వీలుంటుంది".

కేశవపిళ్ళె కూడా నవ్వాడు.

ఆ క్షణంలోనే ప్రైవేట్ సెక్రటరీ, కేశవపిళ్ళెకు సరిగ్గా అంతు పట్టాడు.

ముందు ముందు ఏది ఎలా జరగాల్సుంటే అలా జరగనీ. ఆ కర్మ క్షేత్రంలో మరణం తటస్థించినా సరే. అనుమానించాల్సిన అవసరమేమీ లేదు. జీవితాంతం కాంగ్రెసుకు శత్రువుగానే ఉంటాడు. తన జీవితంలో తానేం చేశాడని ఎవరయినా అడిగితే కాంగ్రెస్‌ను ఎదిరించానని చెప్పవచ్చు.

ముందు జరగబోయే సమ్మెను ఎదుర్కొనేందుకు ప్రభుత్వం సన్నాహాలు చేస్తున్నది. కేశవపిళ్ళె కూడా అందుకు సంసిద్ధుడయినాడు. ఒకరోజు చెత్త వుత్తరం ఒకటి పోస్టులో వచ్చింది. కేశవపిళ్ళె ఆ వుత్తరాన్ని అటూ యిటూ తిప్పి చూశాడు. ఎవరో ప్రైమరీ స్కూలు విద్యార్థి ఆ వుత్తరం రాశాడు. ఆ వుత్తరాన్ని కేశవపిళ్ళె చాలా జాగ్రత్తగా పరిశీలించాడు. ఉత్తరం తెరిచి చూశాడు. ఒక చిత్తు కాగితం మీద వంకర టింకరగా ఏదో విన్నపం వ్రాసి వుంది. సిరా మరకలతో చివరలు చినిగిన వుత్తరం చూసేందుకు చాలా అసహ్యంగా వుంది. ఎవరో పసిపిల్లవాడు రాసినట్టుంది. ఒక పేజీ నిండా రాసివుంది. కానీ రాసిన మాటలు మాత్రం తక్కువగా వున్నాయి. అందులోని విన్నపం యిది:

"మా నాన్న నారాయణ నాయరు కాంగ్రెసుకు చెందినవారు. ఆయన ఎర్నాకులంలో వుంటారు. మా అమ్మ ప్రస్తుతం దగ్గుతో జ్వరంతో బాధపడుతూ వుంది. మా నాన్న యిక్కడికి వచ్చేందుకు వీల్లేదు. పోలీసులు పట్టుకుంటారు. కొడతారు. మా వాళ్ళెవ్వరూ లేరు. నేను స్కూలుకు వెళ్ళటం లేదు. అమ్మ దగ్గరే వుంటున్నాను. మా చెల్లెలికి మూర్ఛల జబ్బు. మా నాన్నను రమ్మని నేను రాశాను. ఆయన తప్పకుండా వస్తారు. మీ రతన్ని పోలీసులకు పట్టించి కొట్టించకండి.

--మీ వాసు"

ఆ వుత్తరంలో ఆ కుటుంబంలోని దీనస్థితి కేశవపిళ్ళెకు గోచరించింది. ఆ సమయంలో అతనికి ఒక ఆలోచన తట్టింది. ఇలాంటి వాళ్ళు కాంగ్రెసులో ఎందుకు చేరినట్టు! పెళ్ళాం, పిల్లలగురించి పట్టని పిరికి పందలు!

ఆ వుత్తరం ఎక్కడి నుంచి వచ్చిందా అని కేశవపిళ్ళె చూశాడు. మావెలిక్కర నుంచి వచ్చినట్టు దాని మీద రాసి వుంది. ఉన్నట్టుండి కేశవపిళ్ళెకు నారాయణ నాయర్ పేరు స్ఫురించింది నారాయణ నాయర్! 'కేశవపిళ్ళెను ఉరి తీయాలి' అని కేకలు పెట్టిన గ్రామంలో వేలకొలది ప్రజలను అలా కేకలు పెట్టమని పురి కొల్పింది నారాయణ నాయరే. అతన్ని గురించి వాళ్ళమ్మ చెప్పింది. వాళ్ళమ్మ చెప్పిన మాటలు కేశవపిళ్ళె గుర్తు తెచ్చుకున్నాడు. చెంగనూరు వాసి మాత్యూ, మావెలిక్కర నివాసి నారాయణ నాయర్ ఇద్దరూ కేశవపిళ్ళె మనస్సులో మెదిలారు. ఇతను ఆ నారాయణ నాయరేనా?

కేశవపిళ్ళె మరోసారి ఆ వుత్తరం చదివాడు.

అది ఒకరిని సంప్రతించి రాసిన వుత్తరం కాదు. జబ్బు పడ్డ తల్లి పక్కలో కూర్చుని తనంతట తను స్వంతంగా రాసిన వుత్తరం. అతను కోరింది ఒక్కటే. ఆ పని ఆ కుటుంబానికి అవసరం. ఎర్నాకులంలో అజ్ఞాతవాసం చేస్తున్న రాజద్రోహీ, ఉబ్బసంతో ఊపిరి సలపక జీవితంలో చివరి గడియలు లెక్కపెట్టు కుంటున్న జబ్బు మనిషీ, అతని చెల్లెలూ, అతనూ - అందరూ కోరేది అదే. అతను కూడా ఒంటరివాడే. నారాయణ నాయర్ వస్తే చిక్కు అంతా తీరుతుంది. శాంతి సమకూరుతుంది. కాని కేశవపిళ్ళెకు రాయాలని అతనికెలా తెలిసింది? ఆ రాష్ట్రంలో అంతటా, తిరువాన్‌కూర్‌లో, ఆ జబ్బు మనిషివున్న ప్రాంతంలో కేశవపిళ్ళె సందులేకుండా పోలీసు సిబ్బందిని నింపి పెట్టాడు. వాళ్ళింటికి వచ్చే యిరుగు పొరుగు అమ్మలక్కలు చెప్పివుంటారు - కేశవపిళ్ళె కొంచెం శ్రమ పడితే పోలీసులు పట్టుకోరని. వాళ్ళ అమ్మ దగ్గుతో బాధ పడేప్పుడు, పిల్లలు ఆకలితో బాధపడేప్పుడు, చెల్లెలు మూర్ఛతో పడిపోయి కళ్ళు తేలవేసినప్పుడు అందరూ కేశవపిళ్ళె అనే రాక్షసుణ్ణి శపిస్తూ వుండి వుంటారు. వాసు లాంటివాళ్ళు తిరువాన్‌కూరులో ఇంకెంతమంది వున్నారో? వాళ్ళ ఉసురు! తల్లి చెప్పిన వాళ్ళ శాపం! ఈ శాపనార్థాలు ఎలా వుంటాయో కేశవపిళ్ళె యీ రోజు మొట్ట మొదటిసారి గమనించాడు. అంతకు ముందు జరిగిన సమ్మెలో నశించిన కుటుంబాల గాథ కేశవపిళ్ళె విన్నాడు. ఆ మాత్యూ కుటుంబం ఛిన్నాభిన్నమయి పోయింది. అలా ఎన్ని కుటుంబాలో అధోగతి పాలయినాయి. పరిస్థితి యిలా విషమిస్తుందని బహుశా కేశవపిళ్ళె వూహించి వుండడు. ఇలాంటి కుటుంబాలను గురించి అతను వూహించను కూడా లేదు.

అయినా నారాయణ నాయర్ వేయించిన కేకలు కేశవపిళ్ళె చెవుల్లో గింగురుమంటూ వున్నాయి. ఎర్రబారిన కళ్ళతో, పిడికిలి బిగించి, గొంతు చించుకుని అతను కేకలు వేస్తున్నాడు:

"కేశవపిళ్ళెను ఉరితీయండి."

కేశవపిళ్ళె ఆ దృశ్యం చూశాడు.

అప్పుడే మరో వ్యక్తి మాత్యూ అందుకున్నాడు:

"లంచగొండి ఆస్తి జప్తు చేయ్యండి".

కాని మాత్యూ ఆస్తి జప్తయింది. అతని పిల్లలు ఇల్లూ, వాకిలీ లేకుండా పోయినారు. తల్లియింట్లో వాళ్ళు తల దాచుకుంటున్నారు.

కేశవపిళ్ళె అలాగే ఆలోచిస్తూ కొంతసేపు కూర్చున్నాడు. మిగిలిన వుత్తరాలను అతను తెరవను కూడాలేదు. ఆ వుత్తరం అవతల పెట్టాడు. మిగిలిన వుత్తారాలు తెరిచి చదువుకున్నా యేమీ బోధ పడటం లేదు. ఏం చెయ్యటం? మళ్ళీ వాసు రాసిన వుత్తరం తీసి చూశాడు. తన సంగతి ఏదో తేల్చి తర్వాత మరోపని చూసుకోమని చెపుతున్నట్టుంది ఆ వుత్తరం. ఆ

పిల్లవాడు, అతని చెల్లెలు తన యెదుట నిలబడి వున్నట్లు తోచిందతనికి. వాళ్ళు అతని చెయ్యి పట్టుకున్నట్లుంది.

పోలీసులకు రహస్యంగా చెప్పాలనుకున్నాడు - నారాయణనాయర్ బయటికి వస్తే పట్టుకోవద్దని, పిల్లలకు, తండ్రి దగ్గర వున్నాడన్న తృప్తి లభిస్తుంది. తండ్రిని చూసుకొని వాళ్ళు ఆనందిస్తారు....... కాని అతను తనను ఉరి తీసేందుకు ప్రజలను పురికొల్పిన కిరాతకుడు. సామాన్యంగా మనుష్యుల్లో వుండే ప్రతీకార భావం కేశవపిళ్ళైలో కూడా చెలరేగింది. అంతలోనే అతని మనస్సులో ఎవరో ప్రవేశించి చెప్పినట్లుంది:

"ఇలా ఎంతమంది అని వుంటారు? అందరి మీదా నీవు పగ తీర్చుకోగలవా? పగ తీర్చుకునేందుకు నీవెవరవు?"

ఇది పెద్ద ప్రశ్న. ఆ తర్వాత మరోప్రశ్న: "నీవు చాలా కఠినమైన చర్యకు పూనుకున్నావు కదా? చాల డబ్బు సంపాదించావు గదా? మరి బాధపడుతున్న వాళ్ళకు అలాకేకలుపెట్టే హక్కులేదా? నీవు గొప్పవాడివయినావు. మరీ అంత గొప్పవాడివి కాకు".

కేశవపిళ్ళై ఫోను చేతిలోకి తీసుకున్నాడు. వెంటనే అతని చెయ్యి ఎవరో పట్టుకున్నట్టు అతనికనిపించింది. రేపు, ఎల్లుండి ఇలాంటి అర్జీలు చాలా వస్తాయి. అప్పుడేం చేస్తావ్? ఒకసారి తప్పుచేస్తే మరెన్నో తప్పులు చెయ్యాల్సి వస్తుంది. ఇలా రాష్ట్రం నుంచి పారిపోయిన రాజద్రోహులంతా తిరిగి వస్తారు.

అతను ఫోను మళ్ళీ కింద పెట్టేశాడు. కాంగ్రెసును నశింప జేసేందుకు నియమింపబడ్డ అధికారి తను. ఆ భావంతో అతను తల యెత్తి చూశాడు. రహస్య స్థానం నుంచి బయటికి వచ్చి, యింటికి వెళ్ళే సమయంలో అతన్ని అరెస్టు చెయ్యవలసిందని పోలీసులకు ఉత్తర్వు ఇవ్వాలి.

అబ్బ! ఎంత బాధాకరమైన పని! మరణ శయ్యలో వున్న భార్యకు భర్తను కాకుండా చెయ్యటం, దిక్కులేని పిల్లలకు తండ్రిని కౌగిలించుకునేందుకు అవకాశం లేకుండా చెయ్యటం, పోలీసులు అతన్ని అదిరించి బెదిరించి వెనక్కిలాగుతారు.

'ఏం చెయ్యాలిమరి?' అనే విషయం ఆలోచించకుండానే కేశవపిళ్ళై కుర్చీలో కూర్చున్నాడు.

మర్నాడు కూడా వాసు దగ్గరి నుంచి మరో వుత్తరం వచ్చింది :

"అమ్మ మాట్లాడటం లేదు, చెల్లెలు నిన్నటి నుంచి స్పృహతప్పి పడిపోయింది. మాటలేదు. నాన్న రాలేదు".

## పదిహేడు

శేఖర్‌పిళ్ళై చాలా జబ్బులో వున్నాడు. కేశవపిళ్ళై దాదాపు ప్రతిరోజూ అక్కడికి వెళుతున్నాడు. శేఖర్ పిళ్ళైకు నయం కావటం కష్టం. ఎక్కువ

రోజులు బాధపడకుండా జీవితం అంతటితో సమాప్తి చెందితే చాలని అనుకొనే పరిస్థితిలో వున్నాడు.

శేఖర పిళ్ళె తంకమ్మను చూడాలని కోరిక తెలియ పరిచాడు. ఆమె వచ్చింది.

రామచంద్రన్ నాయర్ కొచ్చిన్‌లో నృత్యంలో, సంగీతంలో పేరుపొందిన ఒక సుందరిని పెళ్ళి చేసుకున్నాడు. ఆమె చాలా ధనవంతురాలు కూడాను. తంకమ్మ, పెళ్ళి సంగతి ఎప్పుడూ తనతో ప్రస్తావించలేదని అంటాడు. రామచంద్రన్ నాయర్. ఆమె కేవలం ప్రియురాలిగా కాలక్షేపం చెయ్యాలనే అనుకుంది.

ఆ పరిస్థితిలో రామ చంద్రన్ నాయర్ తండ్రి బలవంతం మీద పెళ్ళి చేసుకున్నాడు. తంకమ్మ అతన్ని పెళ్ళి చేసుకునేందుకు సిద్ధమై వుంటే అతను ఎంతమాత్రం మరొకర్ని పెళ్ళి చేసుకునేవాడు కాడు. అతను చెప్పేది ఎంతవరకు సత్యమో తెలియదు. ఏది యెలాగున్నా రామ చంద్రన్ నాయర్ తాను ఇప్పటికీ తంకమ్మను ప్రేమిస్తున్నానని తన స్నేహితులతో చెపుతూ వుంటాడు. ఆమెను ప్రేమించకుండా అతను ఉండలేడట.

తంకమ్మ ఈ విధంగా పెళ్ళితో ప్రమేయం లేకుండా ప్రేమతోనే కాలక్షేపం చేస్తూ కుమారిగా చలామణి అవుతూ వుంది. ఆమెకు వుద్యోగంలో రావలసిన వున్నతి వస్తూనే వుంది. దానితో ఆమెకు జీవనోపాధికి లోటు లేకుండా జరిగిపోతోంది.

కూతుర్ని చూసి శేఖర్ పిళ్ళె వెక్కివెక్కి యేడ్చాడు. అలా ఏడవటంతో అతను ప్రాణాలు వదిలేస్తాడేమోనని చూసే వాళ్ళకు భయం వేసింది. ఆ సమయంలో కేశవపిళ్ళె కూడా అక్కడే వున్నాడు.

శేఖర్ పిళ్ళె తన కూతుర్ని మంచం మీద తన దగ్గర కూర్చోమని సంజ్ఞ చేశాడు. కేశవపిళ్ళెను కూడ దగ్గరకి రమ్మన్నాడు. భాగీరథీ అమ్మ కూడా పక్కనే నిలబడి వుంది. కూతురి తల నిమురుతూ అతను కేశవపిళ్ళె వైపు చూస్తూ యేడుస్తున్నాడు.

ఆ దృశ్యం తనకు అపాయకరంగా పరిణమించ వచ్చునని కేశవపిళ్ళె భయ పడుతున్నాడు. మరణ శయ్యమీద వున్న శేఖర పిళ్ళె తన కూతురికి ఏదో తరణోపాయం చూపించే ఆలోచన చేస్తున్నాడని భాగీరథీ అమ్మకు అనిపించింది. ఆమెకు కావలసింది కూడా అదే. కూతురి చెయ్యి తీసుకొని కేశవపిళ్ళె చేతిలో పెట్టి 'దీన్ని నీ చేతుల్లో పెడుతున్నా' అని అంటే కేశవపిళ్ళె కాదని చెయ్యి వెనక్కి లాక్కో గలడా? అలా ఎప్పటికీ కాదని భాగీరథీ అమ్మ నమ్మకం. ఎందుకంటే కేశవపిళ్ళె మంచి వాడు, సహృదయుడు. తంకమ్మ మీద అతనికి ప్రేమ కూడా వుంది. ఆమెకు కూడా అతని మీద అనురాగం వుండేది. ఆమె మీద కేశవపిళ్ళెకు ఏమీ అనుమానం వుండదు. మధ్యలో

కొద్దిపాటి పొరపాటు జరిగింది. కానీ కావాలని తంకమ్మ తప్పటడుగు వెయ్యలేదు. తన కూతురు చెడ్డదని ఏ తల్లి కూడా ఎప్పుడూ అనుకోదు. తంత్ర మంత్రాల్లో చిక్కుకొని అది తెలివి తక్కువ వల్ల ఒళ్ళు తెలియకుండా అతనితో వెళ్ళింది. అలాంటి పరిస్థితిలో కేశవపిళ్ళె ఆమె తప్పును మన్నించి ఆమెను అంగీకరించక పోతాడా? కేశవ పిళ్ళె నిజాయితీ మీద ఆమెకు పూర్తి నమ్మకం వుంది. అలాగే అయితే ఆ ముసలివాడు నిశ్చింతగా కళ్ళు మూస్తాడు. భాగీరథీ అమ్మకు బాగా ధైర్యం చిక్కింది. ఆ మరణ శయ్యమీద జరగబోయే పరిణయం కోసరం ఆమే అనుక్షణం నిరీక్షిస్తూ వుంది.

అలా అయితే ఏం చెయ్యాలని కేశవ పిళ్ళె ఆలోచిస్తూ వున్నాడు. చెయ్యి వెనక్కి లాక్కోవాలా? బహుశా తంకమ్మే చెయి లాక్కుంటుంది. ఆమె అతని వైపు చూడటం కూడా లేదు. తనమీద ఆమెకు అసహ్యం వేస్తున్నదేమోనని అతనికి సందేహం కలిగింది. ఇప్పుడు ఇద్దరూ తమ తమ చేతులు వెనక్కి లాక్కోకుండా చేతులు కలిపినందు వల్ల లాభమేముంది?

శేఖర పిళ్ళె స్పష్టంగా చెప్పలేక పోతున్నాడు. కాని అర్థమవుతూనే వుంది. "అబ్బాయ్, అన్నీ మరిచిపో", అన్నాడు శేఖర పిళ్ళె. కేశవ పిళ్ళె ఏమీ సమాధానం చెప్పలేదు.

"మరణమాసన్నమయిన వాడి కోరిక! నీవు చాలా మంచివాడివి. అబ్బాయి, దీన్ని ఏలుకో".

తంకమ్మ తలవంచుకుని కూర్చుంది.

కేశవపిళ్ళె దీనికి సమాధానం చెప్పాలి. శేఖర పిళ్ళె చాల కష్టం మీద మాట్లాడాడు: "చాదస్తంవల్ల ఏదో పొరపాటు జరిగింది. వితంతువులు, విడాకులిచ్చిన వాళ్ళు మళ్ళీ పెళ్ళి చేసుకోవటంలే. అలాగే వితంతువే అనుకొని దాన్ని ఏలుకో. అన్నీ మరిచిపో".

కేశవపిళ్ళె విధిలేక చెప్పాడు: "నాకు పెళ్ళయింది. ఒక పిల్లవాడు కూడాను".

భాగీరథీఅమ్మ ఉలిక్కి పడింది. ఆమెకి విషయం తెలీదు. తంకమ్మ మొహం మీద ఆ మాట విన్న లక్షణమే కనిపించటం లేదు. శేఖర పిళ్ళె కూడా ఆ మాట పట్టించుకోలేదు.

భాగీరథీ అమ్మ అడిగింది:

"ఎప్పుడయింది? ఈ సంగతి మాకు చెప్పను కూడా లేదే".

"చాలా రోజులయింది".

"తంకమ్మ దగ్గరి నుంచి వెళ్ళిన తర్వాతనా?" అడిగింది భాగీరథీ అమ్మ.

అవునన్నట్టు అతను తల వూపాడు. భాగీరథీ అమ్మ మాటల్లో ఆమెకు అపనమ్మకం వేస్తున్నట్టు తెలుస్తున్నది. ఆమెకు ఆ మాటమీద పూర్తిగా

నమ్మకం లేదు. ఆమె ప్రశ్నకు అతను చెప్పిన సమాధానం కూడా అలానే వుంది.

"ఎక్కడ చేసుకున్నావ్?" అడిగింది భాగీరధీ అమ్మ.

"మా వూళ్లో".

"ఎప్పుడయింది? మాకు చెప్పనే లేదే!"

"అవును, చెప్పలేదు".

శేఖర పిళ్ళై నిరుత్సాహంగా అన్నాడు: "అదృష్టం! అదృష్టం ఫలిస్తుంది".

కొంతసేపాగి శేఖర పిళ్ళై భాగీరధీ అమ్మతో అన్నాడు:

"ఎన్నాళ్ళని ఎదురు చూడటం? పోనీలే!"

అయినా భాగీరధీ అమ్మకు అనుమానం తీరలేదు.

"అనుకోకుండా అయిందా?" అన్నది.

"అవును".

'కేశవ పిళ్ళై చెప్పేది శుద్ధ అబద్ధం' అని కేశవపిళ్ళైకు చెప్పేందుకు భాగీరధీ అమ్మకు ధైర్యం లేదు.

ఇన్ని మాటలు జరుగుతున్నా తంకమ్మకు చీమ కుట్టినట్టు కూడా లేదు. పెళ్ళయింది, ఒక పిల్లవాడు కూడా వున్నాడని చెప్పినా తంకమ్మ చలించలేదు. అసలామెకు దాంతో సంబంధమున్నట్టే లేదు. వీళ్ళు ఎక్కడెక్కడో ఎవరితోనో పెళ్ళిళ్ళు చేసుకుంటూ వుంటారు. అందువల్ల తనకేమయింది?

తంకమ్మ స్వభావం చాలా విచిత్రంగా వుంది. ఇప్పుడు తంకమ్మకూ కేశవపిళ్ళైకూ ఏమీ సంబంధం లేదు. వెనక అలా ఉండేదా? కేశవ పిళ్ళైకు పెళ్ళయిందంటే ఆమే సంతోషించి వుండాల్సింది. తెలిసిన వాళ్ళకు పెళ్ళయిందంటే అందరూ శ్రద్ధగా వింటారు.

కేశవపిళ్ళై పాత చరిత్రనంతా నెమ్మదిగా నెమరు వేసుకున్నాడు. చిన్న చిన్న విషయాలు కూడా అతనికి గుర్తు వచ్చాయి. ఆమె వెనకటిలా నవ్వితే బాగుండు ననుకున్నాడు. బుగ్గ మీద సొట్ట కనిపించే ఆ చిరునవ్వు! దగ్గర దగ్గరగా కూర్చుని తీరికగా అర్థంలేని సంభాషణ సాగించాలని అతనికి సరదా అయింది. కొట్టియంబలం సింహద్వారం నుంచి లోపలికి ప్రవేశించి ఒక్క రాత్రి ఆమెతో గడపాలని అతనికి మోజయింది. వెనకటి ఉద్రేకం మళ్ళీ చెలరేగింది. ఆ రోజులు మళ్ళీ వస్తాయా అనిపించింది. ఒకానొకప్పుడు తంకమ్మ తనది. మంచం మీద తల వంచుకుని కూర్చుండే తంకమ్మ యిప్పుడేమనుకుంటూంది? నాలో వున్న కోరికలే ఆమెలో కూడా వుండవచ్చు. ఆమె మరిచి పోగలదా? ఎన్నటికీ మరచి పోలేదు.

కేశవ పిళ్ళైకు ఏదో మాట్లాడాలని వుంది. ఎలా ఆరంభించటం? ఏం మాట్లాడటం? స్పష్టంగా తెలియడం లేదు. ఆమెను ఒక్కసారి ముట్టుకోవాలని అతనిలో ఉద్రేకం కలిగింది.

అతను వెళ్ళాల్సిన వేళ అయింది. ఆరోజు సాయంత్రానికి దీవాన్‌జీకి ఏదో రిపోర్టు ఇవ్వాలి.

"వెళ్ళనా?" అని అడిగాడు కేశవపిళ్ళై శేఖర పిళ్ళైతో.

శేఖరపిళ్ళై సరే నన్నాడు.

"మళ్ళీ రేపు ఉదయం వస్తాను". అన్నాడు కేశవపిళ్ళై.

"వెళ్ళనా తంకమ్మా? రేపు వుదయం వస్తాను" అన్నాడతను తంకమ్మతో.

తంకమ్మ ఏడుస్తోంది. ఆమె అతని వైపు చూసి 'ఊఁ' అన్నది.

తను మళ్ళీ తంకమ్మకు కైవసమయి పోతున్నట్టనిపించింది కేశవ పిళ్ళైకు. ఇతరులను తనవైపు లాక్కొనే శక్తి ఆమెలో వుంది. అసలామే సిసలైన సుందరి కదా? ఆ సౌందర్యమంతా అనుభవించేందుకు ఏర్పడ్డది. మగవాణ్ణి తనకు స్వాధీనం చేసుకునే శక్తి అందులో వుంది. భార్య వున్నా ప్రియునిగా నటించే పురుషులున్నారు కదా! 'నన్ను వదలకు' అని బతిమాలు కోవాలని అతని కనిపించింది. ఏ క్షణంలోనయినా అతను ఆమె కాళ్ళమీద పడి అలా బతిమాల గలడు.

మర్నాడు శేఖర పిళ్ళైకు చాలా ప్రమాదంగా వున్నదని వార్త అందింది. కేశవపిళ్ళై అక్కడికి వెళ్ళిన సమయంలో చీఫ్ సెక్రటరీ, ఆయన భార్య, తంకమ్మా అందరూ అక్కడే వున్నారు. శేఖర పిళ్ళై స్పృహలోనే వున్నాడు. ఊపిరి పీల్చు కోవటం కష్టంగా వుంది. కాని మాట్లాడుతూనే వున్నాడు. ఆయన కేశవపిళ్ళైను తన దగ్గర కూర్చోమని సంజ్ఞ చేశాడు. కేశవపిళ్ళై అతని దగ్గర కూర్చున్నాడు. ఆ ముసలాయన కేశవపిళ్ళై చెయ్యి తీసుకొని తన రొమ్ము మీద హత్తుకున్నాడు.

ఒక్కొక్కరిని పిలిచి వాళ్ళ దగ్గర సెలవు తీసుకుంటున్న దృశ్యమది. అందరి దగ్గరా సెలవు తీసుకుంటున్నాడు. భగవతి కుట్టి అమ్మను దగ్గరికి పిలిచి ఆమె దగ్గర సెలవు తీసుకుంటూ జీవితంలో ఆమె మాటకు ఎదురు చెప్పివుంటే క్షమించమని ఆమెను అడిగాడు. తమ్ముణ్ణి జాగ్రత్తగా చూసుకోమని చెప్పాడు. వాడు అమాయకుడు. భగవతి కుట్టి అమ్మ కళ్ళల్లో నీళ్ళు నిండాయి. అవసానకాలంలో ఆవరించిన చలిని సహించలేని శేఖరపిళ్ళై భాగీరథీ అమ్మను తన దగ్గర పడుకోమన్నాడు. తల్లిని పిల్లల చేతుల్లో పెట్టాడు. తంకమ్మను, కేశవపిళ్ళైను దగ్గర దగ్గర కూర్చోమన్నాడు. వాళ్ళిద్దరూ దగ్గర దగ్గర కూర్చుంటే శేఖర పిళ్ళై కొంత సేపు చూశాడు. వాళ్ళిద్దర్నీ చూస్తూ వుంటే పెళ్ళయిన కూతురు తన భర్తతోపాటు తండ్రి మరణశయ్య దగ్గర కూర్చున్నట్టు తోచింది శేఖర పిళ్ళైకు. జీవితంలో కేశవ పిళ్ళై తప్ప తన కెవ్వరూ అల్లుడు లేడని ఆయన అన్నాడు.

శేఖర పిళ్ళై తంకమ్మకు ఏమేమో చెప్పాలను కున్నాడు. కాని శ్వాస చాలా తీవ్రంగా ఆడుతూ వుంది. మధ్యలో శేఖర పిళ్ళై అన్నాడు: "ఈ జన్మ యిలా

పోనీ తల్లీ! వచ్చే జన్మ కోసరం ప్రార్థించు". శేఖర పిళ్ళై నేరు తెరిచాడు. ముందు కేశవపిళ్ళై నీళ్ళు పోశాడు. ఆ తర్వాత తంకమ్మకు నీటి చెంబు అందించాడు.

ఈ విధంగా ఆయన జీవితం ముగిసింది. ఎవరినీ పల్లెత్తు మాట అనకుండా, ఎవరికీ ఎలాంటి ద్రోహం తలపెట్టకుండా అతను జీవితం గడిపాడు. చనిపోయే సమయంలో అతనికి సంతానాన్ని గురించి సంతాపం కలిగి వుంటుంది.

కేశవ పిళ్ళై కృతకృత్యుడయినాడు. చివరి గడియల్లో దగ్గర కూర్చుని అతని గొంతులో నీళ్ళు పోశాడు. తన అదృష్టానికి కారణ భూతుడయిన అతని చివరి కోరిక నెరవేర్చాడు. కాని తాను తన కర్తవ్యాన్ని నెరవేర్చానని అతను అనుకోలేక పోతున్నాడు. అతను చేయవలసింది ఇంకా వుంది. తంకమ్మకు అతను చేయవలసింది వుంది.

అంత్యక్రియల తర్వాత అందరూ వెళ్ళారు. తంకమ్మ, కేశవపిళ్ళై మాత్రం అక్కడ వుండి పోయారు. కేశవపిళ్ళై తంకమ్మతో మాట్లాడేందుకు ఎదురు చూస్తున్నాడు.

అతను తిన్నగా తంకమ్మ నడిగాడు: "తంకమ్మా! నీవేమన్నా చెప్పాలా?" తంకమ్మ దానికి సమాధానం చెప్పేలోగానే అతను మరుక్షణమే తంకమ్మతో అన్నాడు: "మరోలా అనుకోకు. నేను గొప్పవాళ్ళ హోదాలో వుండి మాట్లాడుతున్నాననుకోకు. నా పరిస్థితి నేను మరిచి పోలేదు. నేను చేయగలిగింది ఏదయినా వుంటే చెప్పు".

"లేదు, ఏమీ చెయ్యనక్కర్లేదు" - అన్నదామె నిర్వికారంగా:

"ఏమీ అక్కర్లేదా?"

కేశవపిళ్ళైతో ఎక్కువగా మాట్లాడటం ఇష్టం లేనట్టుగా తంకమ్మ అక్కడి నుంచి వెళ్ళి పోయింది.

భాగీరథీ అమ్మ అక్కడే నిలబడి అంతా చూస్తున్నది. ఆమె కూతురినడిగింది: "ఏమిటమ్మా అది? కేశవపిళ్ళై మాట్లాడేందుకు వస్తే, నీవు అలిగి వెళ్లి పోయావెందుకమ్మా?" తంకమ్మ దానికి సమాధానం చెప్పలేదు. కేశవపిళ్ళై భాగీరథీ అమ్మ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళాడు. భాగీరథీ అమ్మకు ఆశపోలేదు. కేశవపిళ్ళైకు పెళ్ళయిందని ఆమెకు ఏమాత్రం నమ్మకం లేదు. కేశవపిళ్ళై జరిగిందంతా మరిచిపోయి తంకమ్మను చేరదీయాలని ఆమెకు గాఢమైన వాంఛ. కాని తంకమ్మ స్వభావంలో మార్పేమీ రాలేదని ఆమెకు చాలా విచారంగా వుంది.

రోజూ కేశవపిళ్ళై చిట్టి కులంగరేలో వాళ్ళ యింటికి వెళుతున్నాడు. తంకమ్మ చాలా రోజుల నుంచి సెలవు తీసుకుని యింట్లో కూర్చున్నది. అక్కడికి వెళ్ళాలని కేశవపిళ్ళైకు చాలా ఉబలాటం. వెళితే గంటల తరబడి

అక్కడే కూర్చుంటాడు. మొదట తంకమ్మ అతన్ని పట్టించుకో లేదు. అతని ఉత్సాహ పూరితమైన చూపులు ఆమెను ఆకట్టుకోలేక పోయాయి. ఎవరో కొత్త మనిషి వచ్చినట్టు ఆమె భావించేది. అంతవరకే.

ఒక రోజు ఆమే అతనికి కాఫీ తీసుకొని వచ్చింది. ఆరోజు ఇద్దరి చూపులూ కలిశాయి. ఆమె చూపుల్లో పరాయి తనం కాని, క్రోధాగ్నిగాని లేదు. కాని తనకేదో అన్యాయం జరిగినట్టు ఆ చూపులు చెపుతున్నాయి. కేశవపిళ్ళకు కొంచెం ఓదార్పు లభించింది. తన అంతరంగంలో కొంత చల్లదనం అతను అనుభవించాడు.

తంకమ్మ కాఫీ టేబిలు మీద పెట్టి ఒక గ్లాసులో పోసింది. ఆ సమయంలో ఆమె తల వంచుకుంది. కాఫీ పోసిన తర్వాత ఒక్కక్షణం ఆమె అక్కడే నిలబడ్డది.

కేశవపిళ్ళ అన్నాడు: "ఆ గ్లాసు నీవు తీసుకుని నాకు అందిస్తే తాగుతాను". ఆమె అతని ముఖం వైపు చూసింది. ఆమె పెదవులు పొడిపొడిగా వున్నాయి. మొహం విచారకరంగా దీనంగా వుంది. చూపుల్లో దిక్కులేని బిక్కతనం చిక్కగా కనిపిస్తూ వుంది. ఏదో ముఖ్యమైన విషయం అతనితో చెప్పాలని అనుకుంటున్న భావం ఆమె మొహంలో కనిపిస్తున్నది.

ఆమే అతనికి కాఫీ అందించింది. కేశవపిళ్ళ ఆమె ముఖంవైపు చూస్తూ నోరు తెరిచాడు. తంకమ్మ అతని పెదవుల మధ్య కాఫీ గ్లాసు పెట్టింది. అతనో గుక్క తాగాడు. తంకమ్మ గ్లాసు కింద పెట్టింది.

ఆమె వెళ్ళి పోయేందుకు వెనక్కి మళ్ళింది. కేశవపిళ్ళ ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఆమె మాట్లాడలేదు.

"నా మీద కోపమా? నా తప్పేముంది?" అన్నాడతను.

నలువైపులా చూసి కేశవ పిళ్ళ ఆమెను గట్టిగా పట్టుకున్నాడు. ఆమె ఎదురు చెప్పలేదు.

అలా అతనెంత సేపో పట్టుకోలేదు. తంకమ్మ విడిపించుకొని వెళ్ళి పోయింది.

మర్నాడు తంకమ్మ బొట్టు పెట్టుకుంది. ఆమె ముఖం విప్పారి వుంది. చూపుల్లో చైతన్యం వుంది. మళ్ళీ వెనకటి తంకమ్మ కనిపిస్తూ వుంది.

కేశవపిళ్ళకు తనమీద ప్రేమ లేదని తంకమ్మకు కోపం. కేశవపిళ్ళ కనబరచిన భావం ఆమెకు ఏ మాత్రం బోధపడలేదు. తంకమ్మ అన్నది:

"నా మీద మీకు ప్రేమ వుంటేగా? నాతో మాట్లాడేప్పుడు, నా దగ్గరికి వచ్చినప్పుడు మీ మనస్సులో ఏవేవో ఆలోచనలు వచ్చేవి. మీ ప్రవర్తనలో నా మీద ఆపేక్ష కనిపించలేదు.".

అది సరికాదని కేశవ పిళ్ళ వాదించాడు. తంకమ్మ ఆలోచనల్లో మునిగి పోయిన కేశవపిళ్ళ అన్నాడు: "అది కేవలం నీ అభిప్రాయం".

తంకమ్మ ఏకీభవించలేదు. ఆ గదిలో, ఆఫీసులో అంతటా ఆమెకు అదే భావం గోచరించింది. ఆమెకు లభించింది కేవలం అతని శరీరం. ఆమె హృదయానికి, మనస్సుకూ ఏమీ దొరకలేదు. అతని సరసాలు, సల్లాపాలు కేవలం నటన. అంతా బూటకం, అభినయం. చుంబనంలో వెచ్చదనం లేదు. కౌగిలిలో బిగువు లేదు. "నిజం చెప్పండి, ఆ సమయంలో నా దగ్గరికి పరధ్యానంలో వచ్చేవారు కదూ! ఈ ముదనష్టపు పిల్ల పిలిచింది. వెళ్ళకపోతే ఏడుస్తుందని వచ్చేవారు కదూ! అవును కదూ! నిజం కదూ!" అన్నది తంకమ్మ.

"కాదు".

అంతకు మించి కేశవపిళ్ళె యేమీ చెప్పలేక పోయాడు.

"లేదు. అప్పటికీ ఇప్పటికీ మీకు నా మీద ప్రేమ లేదు. నాకు కావలసింది లేదు. కేవలం పొడిపొడి మాటలు". అన్నది తంకమ్మ.

"నీకలా అనిపిస్తూంది" అన్నాడు కేశవపిళ్ళె.

"లేదు" ఆమె తల వూపుతూ అన్నది "తప్పు నాదే. మీ చేత క్షమాపణ చెప్పించు కోవాలని నేనిలా అంటున్నానని అనుకోకండి. క్షమాపణ చెప్పించుకొనే యోగ్యత బహుశా నాకు లేకపోవచ్చు. ఆ దుష్టుడు నన్ను మోసం చేశాడు. నాకు కావలసిన అనురాగం, ఆత్మీయత అతని దగ్గరకూడా లభించలేదు. మొదట నేను నా మీద మీకు ప్రేమ వుందనే అనుకున్నాను. కాని అది నిజం కాదని తెలిసిన తర్వాత మరో వ్యక్తి తియ్యని మాటల్లో చిక్కుకున్నాను".

ఒక్క క్షణం తర్వాత ఆమె మళ్ళీ ఆరంభించింది: "ఈ రోజు నాకు తెలిసింది – మీ మనస్సులో మరో వ్యక్తి చోటు చేసుకున్నదని. నాతో మాట్లాడేప్పుడు ఆ మరోవ్యక్తి మీకు గుర్తుకు వస్తూవుండేది.".

కేశవపిళ్ళె ఈ దోషారోపణను నిరాకరించలేక పోయాడు. ఆమెను దృష్టిలో పెట్టుకొనే ఒక పర్యాయం ఈమెతో సంబంధం ఏర్పరుచుకోలేక పోయాడు. ప్రతిసారీ ప్రేమ ప్రసక్తి వచ్చినప్పుడల్లా అతని మనసులో మరో భావన మెదులుతూ వుండేది. తంకమ్మ అందుకుంది:

"మన యిద్దరి మధ్య దాపరికం ఏమీలేదు. మీరు మనస్ఫూర్తిగా నాకు ఒక్కసారయినా ముద్దియ్యలేదు. నేను నా సర్వస్వం మీకు అర్పించాను. కాని మీరు నాకు..........".

కంఠావరోధంతో ఆమె ఆగిపోయింది. కేశవపిళ్ళె ధైర్యం తెచ్చుకొని ఒక ప్రశ్న అడిగాడు:

"చివరిసారి మనం ఆ గదిలో కలుసుకున్నప్పుడు నీవు నన్ను తృణీకరించి బయటికి నెట్టేశావు. అవునా?"

తంకమ్మ ఆ మాట ఒప్పుకున్నది.

"అవును. నిజమే. ఆరోజు మీలో పురుషత్వం పూర్తిగా లోపించింది. ప్రాణం, చైతన్యం కోల్పోయిన కొయ్య బొమ్మలా అయిపోయారు. నా మీద అణుమాత్రం కూడా అనురాగం లేదు. మీ మనసులో ఏవేవో ఆలోచనలు స్వారి చేస్తున్నాయి. మనస్సు పిచ్చెక్కి నట్టయింది. ఆ స్థితిని సహించలేక అలా చేశాను".

ఆమె అంతటితో ఆగలేదు: "మీరు నన్నెప్పుడూ ప్రేమించలేదు. ఇక ముందు ఎప్పుడూ ప్రేమించలేరు. మీకు మీ భార్య వుంది. పిల్లవాడూ వున్నాడు".

ఈ సంభాషణ నిశ్శబ్దమయిన వాతావరణంలో జరిగింది. కనక ఆమె చెప్పదలుచుకున్నదంతా చెప్పేసింది. మనోవికారానికి లోనయిన స్త్రీ చెప్పగలిగిందంతా చెప్పేసింది. చెప్పిందంతా నిజమే. తప్పంతా కేశవపిళ్ళెదే. ఇంతవరకు తప్పు ఆమె మీద వుంది.

"నిజమే. నాకు ప్రేమించే అర్హత లేదు. కాని నీకో?" అన్నాడు కేశవపిళ్ళె.

"నాకు ప్రేమించే యోగ్యత ఎప్పుడూ వుంది. కాని నా ప్రేమకు విలువ యేముంది? నా విలువ నాకు రాదు కూడా".

"నా మనస్సులో నా భార్య, పిల్లవాడు వున్నట్టే నీ మనస్సులో రామచంద్రన్ నాయర్ ఉన్నాడు కదా ?"

"లేదు. నేనతన్ని మరిచి పోయాను".

"అతని ప్రేమ ముద్ర నీ మనసులో నిలిచి పోలేదా?"

తంకమ్మ వైఖరి మారింది. కొంచెం గాంభీర్యంతో ఆమె సమాధానం చెప్పింది: "ఇలాంటి ప్రశ్నలతో మీరు వాదాన్ని పెంచుతున్నారా?"

ఆ గాంభీర్యం కొత్తగా కనిపించింది, ఇంతకు ముందు ఇలాంటి గాంభీర్యం ఆమెలో లేదు. ఎదట నిలబడి ఆమె యేమేమో అడుగుతూ వుంది. "మీ భార్య సంగతి నేనడగనా? ఆమె ముఖముద్ర మీ హృదయంలో లేదా?" అని అడిగింది.

కేశవపిళ్ళె ముఖంలో చిరునవ్వు వెలిసింది. కాని అతను నవ్వలేదు. నవ్వేందుకు ప్రయత్నించను కూడా లేదు. నిజానికి మాటల సందర్భంలో ఇద్దరూ ఒక గంభీర మనోదశను చేరుకున్నారు. ఇద్దరూ తమతమ పరిస్థితిని గురించి ఆలోచించుకుంటున్నారు. ఇద్దరూ ఎవరి ఆలోచనలో వాళ్ళు మునిగి పోయినారు. ఎవరూ ఏమీ నిర్ణయంచ లేకపోతున్నారు. ఒకవేళ ఆమెను కౌగిలించుకుంటే బహుశా ఆమె కాదనదని కేశవపిళ్ళెకు అనిపించింది. ముద్దాడినా ఆమెకు అభ్యంతరం లేక పోవచ్చు. ఆమె సహకరిస్తుంది. కాని ఆమెకు కావలసిన వెచ్చదనం, పట్టు అతనిలో లేకపోవచ్చు.

"వెళ్ళనా?" అడిగాడతను.

"వెళ్ళాలంటే వెళ్ళండి" అన్నది వెంటనే ఆమె.

"నీవు ఈ రోజు బొట్టు పెట్టుకున్నావే?" అన్నాడతను వరాండాలో నిలబడి.

ఆమె తల వూపింది.

"నీలో ఏదో ప్రత్యేకమైన స్ఫూర్తి కనిపిస్తున్నది"

ఆమె కొంచెం నవ్వింది. అంతే.

"నేను రేపు వస్తాను"

"సరే".

అతను వెళ్ళాడు. తంకమ్మ యింట్లోకి వెళ్ళిపోయింది.

## పద్దెనిమిది

తంకమ్మకు ఏదయినా మేలు చెయ్యాలని కేశవపిళ్ళె నిశ్చయించుకున్నాడు. ఆ మేలు నలుగురి దృష్టినీ ఆకర్షించేట్టుగా వుండాలి. ఇది అతని ధర్మం. తంకమ్మకు అతను ఋణపడి వున్నాడు. ఆ ఋణం తీర్చుకోవాలి. ఆమెకు ఎక్కడయినా మంచి యిల్లు కట్టించి యివ్వాలని అతని ఆలోచన. తంకమ్మతో యీ మాట ప్రస్తావించినప్పుడు ఆమె ప్రత్యేకమైన యిష్టంగానీ, అయిష్టంగానీ తెలియపరచ లేదు. తనకో యిల్లు ఏర్పడుతుందని ఆమె ప్రత్యేకమైన సంతోషాన్ని తెలియబరచలేదు. ఆ ప్రస్తావనను ఆమె కాదననూ లేదు. ఆమెకు కావలసింది ఆపేక్ష. ఆమె మనస్సులో వున్న ప్రేమ ఎలాంటిదో కేశవపిళ్ళెకు బోధపడలేదు.

కేశవపిళ్ళెకు చాలా డబ్బుంది. తంకమ్మ సరేనంటే ఆమె పేరిట కొంత స్థలం కొనవచ్చునని అతని ఆలోచన. భాగీరథీ అమ్మకు కూడా తన కూతురి మనో వైఖరి బోధపడలేదు. కేశవపిళ్ళె అదృష్టానికీ, అభివృద్ధికీ మూల కారణం తంకమ్మ. దీనికి ప్రతిఫలంగా తంకమ్మకు ఏమీ లభించలేదు. అందువల్ల తంకమ్మకు ఒక యిల్లు, కొంత భూమి ముట్ట చెప్పడం న్యాయం. ఇందుకు సమ్మతించవలసిందని తల్లి, కూతురికి నచ్చ జెప్పింది. తంకమ్మ సమ్మతించింది. పొలం కొనుగోలు జరిగింది.

అదే సమయంలో ప్రాంతీయ ఎన్నికలు ప్రకటించారు. కాంగ్రెసు చేసిన ప్రకటనను ప్రభుత్వం అంగీకరించింది. దివాన్‌జీ కేశవపిళ్ళెను పిలిపించి ఎన్నికల పనిని నిర్వహించగలవా అని అడిగాడు. చేయిజారిన అభిమానాన్ని తిరిగి సంపాదించేందుకు ఇది మంచి అవకాశమని భావించి కేశవ పిళ్ళె అన్నాడు: "మీరు ఆశీర్వదిస్తే యీ బాధ్యత నేను నిర్వహిస్తాను".

అతనికి ధైర్య సాహసాలు వున్నాయని దివాన్‌జీ గమనించాడు. ఈ విధంగా వుత్సాహంతో పనిచేసే అవకాశం అతనికి లభించింది.

కేశవపిళ్ళె మొట్టమొదట చెయ్యవలసిన పని ఊళ్ళో తిరగటం. యన్.యన్.యన్. నూ, యన్.యన్.డి.పి. ని అతను స్వాధీనం చేసుకున్నాడు. ధనవంతులు, భూస్వాములు అతనికి సహకరించారు. ఒక

నూతన సంస్థ ఏర్పడింది. ప్రాథమిక చర్యల్లోనే దీవాన్‌జీ అతని పనికి సంతోషించాడు.

వేటర్ల పేర్ల పట్టికను పరిశీలించటం కేశవపిళ్ళకు మంచి అవకాశం. కాంగ్రెసు వాళ్ళ జాబితాలు చాలావరకు సాంకేతిక కారణాలతో తోసి వెయ్యటానికి సదుపాయం లభించింది. మరి కొంతమంది పేర్లను కూడా తీసివేశాడు. ఇలా మరో పర్యాయం కేశవపిళ్ళ తన కార్య నిర్వహణలో కృతకృత్యుడై ప్రశంసలకు పాత్రుడయినాడు.

వెనకటిలాగానే డబ్బు బాగా వెచ్చించేందుకు అవకాశం లభించింది. దీవాన్‌జీకి లెక్క చూపిస్తే చాలు. ఆయన డబ్బు సంగతి అట్టే పట్టించుకునే వ్యక్తి కాదు.

తంకమ్మ యిల్లు చాలా పైకి వచ్చింది. పూర్తిగా తయారయిన తర్వాత అది తిరువనంతపురంలోని పెద్ద భవనాల్లో ఒకటి అవుతుంది. ఆ యింటి మీద ఎంత ఖర్చయినా పెట్టేందుకు కేశవ పిళ్ళ సిద్ధంగా వున్నాడు. అతని కిందులో ఇబ్బంది యేమీ లేదు.

రాష్ట్రమంతటా మళ్ళీ కేశవపిళ్ళను గురించి చర్చ ఆరంభమయింది. కాంగ్రెసు సమావేశంలో ఒక వ్యక్తిలోని లోపాలను గురించి మాత్రమే ఉపన్యాసాలు సాగుతాయి. కేశవ పిళ్ళ కార్యకలాపాలను గురించి అందరికీ ఇదే సందేహం:

"ఇతని వుద్దేశం ఇక్కడే జీవితం గడపాలనా? లేక సహ్యాద్రి సముద్రం దాటి వెళ్ళాలనా?"

ప్రతిరోజూ కేశవపిళ్ళకు చిరునామా లేని ఉత్తరాలు వస్తూ వున్నాయి. కాళ్ళూ చేతులూ విరగ్గొడతాం, ఎముకలు సున్నం చేస్తాం, చావగొట్టి ముక్కలు ముక్కలు చేస్తాం - ఇలాంటి మాటలే ఆ వుత్తరాల్లో వుంటాయి. బాధ్యతాయుత ప్రభుత్వం వస్తే కేశవపిళ్ళ ఆస్తినంతా జప్తు చేసి అతన్ని రాజద్రోహిగా దండిస్తారని అందరూ అనుకునేవారు. 'కేశవ పిళ్ళను జైల్లో పెట్టండి' అని నినాదాలు వినబడుతూ వున్నాయి. కేశవపిళ్ళ నంబర్ వన్ ప్రజా శత్రువు.

కేశవపిళ్ళ భయపడలేదు. ఇప్పుడతనికి ధైర్యం వచ్చింది. అతను వెనకటి కేశవపిళ్ళ కాదు. అతనిలో పూర్తిగా చైతన్యం వచ్చింది. అతని కార్యదక్షత పెరిగింది. అతను యంత్రాంగంలో ఒక భాగంగా పనిచేయ సాగాడు.

రెండు మూడు చోట్ల అతన్ని అందరూ చుట్టు ముట్టారు. ధైర్యంతో అతను తప్పించు కున్నాడు.

కాని ఒక వుత్తరం మాత్రం అతన్ని బెదిరించింది. కాని అంత మాత్రం చేత అతను చలించలేదు. ఒకరోజు అతనికో వుత్తరం వచ్చింది. ముకుంద అనే వ్యక్తి ఆ వుత్తరం రాశాడు తన తండ్రికి వురిశిక్ష వేసి చంపించిందెందుకని ఆ

ఉత్తరంలో అతను అడిగాడు. దిక్కులేని కుటుంబాన్ని నాశనం చేసేందుకు కారణమేమిటని రాశాడు. గోపాలన్ నాయరును చంపించింది కేశవ పిళ్ళేనని ముకుంద నమ్మకం. అతనేమీ బెదిరించ లేదు. పగ తీర్చుకుంటానని కూడా రాయలేదు. కాని తన తండ్రిని చంపించింది కేశవపిళ్ళేనని అతనికి పూర్తిగా నమ్మకం. ఎందుకు చంపించాడో అతను తెలుసుకోవాలి.

తండ్రి దగ్గర వారసత్వంగా లభించిన కోర్టు కాగితాలకట్ట చేతపట్టుకొని అంతటా తిరుగుతూ వుండే ఒకానొక వ్యక్తి కేశవపిళ్ళకు ఆ వుత్తరంలో కనిపించలేదు. కత్తి చేతిలో పెట్టుకొని వున్న ఒక వ్యక్తి మాత్రం అతని కళ్ళ యెదుట ఎప్పుడూ నిలబడ్డట్టు అతనికి పొడగడుతూ వుంది. అతనెక్కడికి వెళితే అక్కడే ఎవరో ఒక వ్యక్తి నలుగురిలో వున్నా సరే, ఒంటరిగా వున్నా సరే, ఇంట్లో కూర్చున్నా సరే నక్కి నక్కి అతన్ని వెన్నంటుతున్నాడు. జీవితంలో ఒక ధ్యేయంగల ఆ వ్యక్తిని తప్పించుకుని తిరగటం అసంభవం.

ఆ భయం అతన్ని ఎలా ఆవరించిందో అతనికి తెలియదు. బెదిరిస్తూ రాసిన వుత్తరాలు అతనిలో భీతిని కలిగించలేదు. ఈ వుత్తరం మాత్రం అతన్ని భయగ్రస్తుణ్ణి చేసింది.

'ఏం చెయ్యటం' అని ఆలోచిస్తూ కేశవపిళ్ళ ఒక్కక్షణం కూర్చున్నాడు. ఆ వ్యక్తి అక్కడెక్కడ వున్నాడో తెలుసుకునేందుకు అతను నలువైపులా చూశాడు. అతనికో ఆలోచన తట్టింది. ముకుంద అనే ఆ వ్యక్తిని జైల్లో పెట్టేందుకు, తగిన నేరమేదయినా అతని మీద మోపవలసిందని పోలీసులకు రాయాలనుకున్నాడు. వెంటనే అలాంటి వుత్తరం ఒకటి రాసి పంపించాడు. కాని కేశవపిళ్ళ మనసులో ఒక విధమైన ఆందోళన ఏర్పడింది. మనశ్శాంతికి మరో మార్గం ఏమిటి?

అనేక కార్యాలలో నిమగ్నుడైనందువల్ల అతనీ సంఘటనను మరచి పోయాడు.

ఆ వూరూ యీ వూరూ తిరగటంలో కేశవపిళ్ళ ఒకరోజు ఇంటికి వెళ్ళాడు. తల్లిదండ్రులు పిల్లవాణ్ణి చూసేందుకు తాపత్రయ పడుతున్నారు. ఆ వూళ్లో వున్న ముసలివాళ్ళు కేశవ పిళ్ళను ఏవేవో అడుగుదామని ఎదురు చూస్తున్నారు. అతని అదృష్టానికి మురిసి పోతూ వాళ్ళ అమ్మ అడిగింది: "అబ్బాయ్, ఇక అన్నీ వదిలి యింట్లో వుంటే సరిపోదూ?"

"ఎందుకమ్మా?"

తల్లి యేమేమో చెప్పాలను కుంది. తండ్రి మాట్లాడకుండా కూర్చున్నాడు. తల్లి తన కొడుకునొక ప్రశ్న అడిగింది: "నీవు తిరువనంతపురంలో పెద్దయిల్లు కడుతున్నావటగా?"

భావభంగిమలో ఏమీ మార్పు లేకుండా కేశవపిళ్ళ సమాధానం చెప్పాడు: "అబ్బే లేదమ్మా! తిరువనంతపురంలో నేనెందుకు ఇల్లు కడతాను?"

కుట్టియమ్మ కేశవ పిళ్ళైను నఖశిఖ పర్యంతం తేరిపార చూసింది. ఆమె చూపులకు కేశవ పిళ్ళై పది పన్నెండేళ్ళ పిల్లవాడిలా కనిపిస్తున్నాడు. దండిస్తున్నట్టు ఆమె అడుగుతున్నది. ఇప్పుడు కుమారుడు మరో తప్పు చేశాడు. అబద్ధం చెప్పాడు. కేశవపిళ్ళై కొంచెం మెతక పడ్డాడు. తల్లి బెదిరిస్తూ అన్నది: "అలాగా? నీవు కట్టించటం లేదా? ముఖం ఎదురుగానే అబద్ధం చెప్పడం కూడా నేర్చుకున్నావా?"

"చూడండి, మన ముఖం ఎదుటే వీడు అబద్ధం చెబుతున్నాడు" అన్నదామె భర్తతో.

"అంతా వింటున్నాను" అన్నాడు పప్పు పిళ్ళై బాధపడుతూ.

కేశవ పిళ్ళై యేమీ తెలియనట్టు అన్నాడు: "ఏమిటమ్మా మీరిద్దరూ అంటున్నది?"

"నేనేమన్నాను?" అన్నాడు పప్పు పిళ్ళై.

ఒక్క క్షణం ఆగి తల్లి అన్నది : "నీకు పది రూపాయలు సంపాదించుకొనే శక్తి ప్రసాదించమని మేము పద్మనాభస్వామిని ప్రార్థించాం. దానికోసరం మేమెంతో కష్టపడ్డాం. భగవంతుడు మా మొర విన్నాడు. మేమలా యెందుకు ప్రార్థించామో నీకు తెలుసు. అంతేగాని నీవు మోసం చేస్తావని నేననుకోలేదు. ఆ ద్రవ్యం చాలా పవిత్రమయింది. అబ్బాయ్, ఇప్పుడు నీ వ్యవహారమంతా ఎదురు తిరిగినట్టుంది."

పప్పు పిళ్ళై యీ విషయాన్ని గురించి యేమేమో చెప్పాలను కున్నాడు.

"జీతంతోపాటు మరోమార్గంలో నాలుగు పైసలు సంపాయిస్తే సంపాయించుకో. అది కూడా అవసరమైనంతే. కాని ఒకరికి ద్రోహం చెయ్యకు."

అప్పుడు తను వున్న మనఃస్థితిలో కేశవ పిళ్ళైకు ఆ మాటలు నచ్చలేదు. అతని మాటల్లో ఆ భావం పూర్తిగా బయట పడుతూనే వుంది.

"మీరు యేమంటున్నారో నాకు బోధపడటం లేదు. దేశమంతా నన్ను గురించి యేమేమో అనుకుంటున్నది. ఇప్పుడు మీరు కూడా మొదలు పెట్టారా? నే నేం చెయ్యను?"

తల్లి అన్నది: "ఇంతకంటే నీకు అవమానం ఏముంటుంది. కావలసింది లేదు. రాష్ట్రమంతటా నిన్ను తిడుతున్నారు అందరూ నిన్ను గురించి అలాంటి మాటలు నేను వినలేను. నాకు చదవటం రాదు. అందరూ అనుకునే మాటలు మాత్రం వింటూంటాను. వింటుంటే గుండె బద్దలై పోతూంది."

కొడుకు వయస్సును బట్టి, అతని హోదాను బట్టి తల్లి అతనికి తగిన హితవు చెప్పింది.

"అబ్బాయ్! సత్యం, ధర్మం, నీతీ లేకుండా జీవితం ఫలించదు."

కుట్టిఅమ్మ కొడుకు ముఖంలోకి చూస్తూ అడిగింది: "నీవు ఒక అమ్మాయి కోసరం తిరువనంతపురంలో పెద్దయిల్లు కడుతున్నావటగా?"

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం కేశవ పిళ్ళకు కష్టమనిపించింది. నిష్కళంక స్వభావాన్ని అభినయించ లేక పోయాడు. తల్లి మళ్ళీ అడిగింది: "ఆ పిల్ల నీకు పెద్ద వుద్యోగం ఇప్పించిందా? పెద్ద ఆఫీసరుగారి అమ్మాయి కాబోలు!"

ఉన్నట్టుండి కేశవ పిళ్ళ కోపంతో చిర చిరలాడాడు: "ఈ విషయాలన్నీ మీ కెందుకు? అనవసరమైన ప్రశ్నలతో నా బుర్ర పాడు చేయకండి".

పప్పు పిళ్ళ వెంటనే అందుకున్నాడు : "ఒరే అబ్బాయ్! నీవు చాలా గొప్పవాడివే, ఒప్పుకుంటాను. నీ కోపం నీ దగ్గరే వుంచుకో. తెలిసిందా?"

కుట్టియమ్మ కూడా వదల్లేదు: "అయితే మరి ఇక్కడ ఆడంగులు అనుకునే చెప్పిన మాటలన్నీ నిజమేనన్న మాట. ఒరి ఛండాలుడా! ఈ మాట ముందే చెప్పి వుంటే యిద్దరు ఆడకూతుళ్ళు అలమటించేవాళ్ళు కారు గదా ?"

కేశవ పిళ్ళకు ఒళ్ళు తెలియనంత కోపం వచ్చింది. ఇవన్నీ అతనికి ముందే తెలుసు. ఇలా జరుగుతుందని అతను అనుకున్నాడు కూడా. కాని తల్లి, మొహం మీద అడిగే సరికి, ఆ మాటా మాటా పెరిగేసరికి అతను సహించలేక పోయాడు. ఇలాంటి మనస్థితిని అతనెప్పుడూ ఎదుర్కొనలేదు. తప్పు చేశానన్న భావాన్ని మనస్సులో దాచుకుని ఎవరయినా జీవితమంతా గడపగలరు. కాని ఆ సంగతి యెవరయినా వాళ్ళకు జ్ఞాపకం చేస్తే తప్పు చేశానన్న విషయం మనస్సును కలవర పెడుతుంది. అప్పుడు చాలా కోపం రావచ్చు. మనస్సు స్వాధీనంలో లేకుండా పోవచ్చు. ఆ సమయంలో తన తప్పు తనకు తెలిసిరావచ్చు కూడా. కేశవ పిళ్ళ ఎలుగెత్తి బిగ్గరగా అరచాడు: "నన్ను ఎప్పుడూ బాగుపడనియ్యలేదు ఇక ముందు బాగుపడనియ్యరు కూడా".

కన్న కొడుకు అలా ఆవేశంతో మాట్లాడుతూ వుండగా ఆ తల్లి తండ్రులెప్పుడూ చూడలేదు. అలా బిగ్గరగా తల్లిదండ్రుల యెదుట అతనెప్పుడూ మాట్లాడ లేదు. వాళ్ళు నివ్వెర పోయారు. పప్పు పిళ్ళ యీ పరిస్థితిని వెంటనే గమనించాడు : "చాలు చాల్లే, ఏమన్నావు?"

కుట్టియమ్మ అందుకుంది: "సరేరా తండ్రీ! నీ అభివృద్ధికి మేము అడ్డుపడ్డాము."

ఆ పల్లెటూరి ముసలమ్మ రొమ్ము చరుచుకుంటూ అన్నది: "అయ్యో భగవంతుడా! ఈ మాటలు వినాల్సి వచ్చింది కదా! "పప్పు పిళ్ళ ఆమె చేతులు పట్టుకున్నాడు. అతను కూడా ఏడ్పు మొదలు పెట్టాడు.

"ఒరి పాపిష్టి! అలా అనకూడదురా!"

కేశవ పిళ్ళె యిలా పరిణమిస్తుందని అనుకో లేదు. అతనక్కడి నుంచి లేచి వెళ్ళిపోయినాడు.

కేశవ పిళ్ళె గదిలోకి వెళ్ళి పండుకున్నాడు. ఉయ్యాల్లో అతని కూతురు నిద్ర పోతున్నది. పెరట్లో తల్లి వెక్కి వెక్కి యేడుస్తూవుంది. తండ్రి ఆమెను ఓదారుస్తున్నాడు. మధ్య మధ్య కేశవ పిళ్ళెను తూలనాడుతూ వున్నాడు.

"పనికి రాని వాళ్ళను వెళ్ళనీ, మనకు జీవితంలో కావలసింది మనకుంది. వాడి యిల్లు, డబ్బు, గొప్పహోదా మనకేం అక్కర్లేదు. వెళితే వెళ్ళనీ" అంటున్నాడు పప్పు పిళ్ళె.

తండ్రి స్వభావం కేశవపిళ్ళెకు బాగా తెలుసు. కాదన్న మాట అతను ససేమిరా అంగీకరించడు. రైతుబిడ్డ కాబట్టి చాలా గట్టి పట్టుదల కలవాడు.

ఈ అలజడి విని యిరుగు పొరుగు వాళ్ళు కూడా పోగవుతారేమోనని కేశవ పిళ్ళెకు భయంగా వుంది. ఈ విషయం దేశమంతటా పాకి పోతుంది. తల్లిని హింసించాడనే వార్త మర్నాడు పేపర్లల్లో వస్తుంది.

తనమీద అదువు తానెలా పోగొట్టు కున్నాడా అని కేశవపిళ్ళె ఆలోచించాడు. నాలో యింత కాఠిన్యం యెలా వచ్చింది? వాళ్ళింత బాధపడేందుకు నేనేమన్నాను? తన అభివృద్ధికి వాళ్ళు అడ్డు పడుతున్నారనే కదా తానన్నది? ఇందులో ఇంత అపార్థం చేసుకునేందుకు ఏముంది? అసలీ మాట అనేప్పుడు అతని మనస్సులో ఏముందీ అని అతనొక్కసారి ఆలోచించుకున్నాడు. పెళ్ళి సంగతా? తంకమ్మను గురించీ తన పెళ్ళిని గురించీ మళ్ళీ ఆలోచించటంలో అతను మునిగి పోయాడు. ఆ రోజు ఈ వివాహ బంధంలో చిక్కుకోకుండా వున్నట్టయితే జీవితం ఇంతకంటె బాగా వుండేది. పరిస్థితిని పూర్తిగా పరిశీలించుకున్నాడు. బాగాండేదే, కాదో అతను కచ్చితంగా చెప్పలేక పోయాడు. ఈ వివాహం అతని అభివృద్ధికి ఆటంకం కలిగించి వుండక పోవచ్చు. తంకమ్మను పెళ్ళి చేసుకోనందువల్ల నష్టమేమయింది? ఏమీ కాలేదు. కాని యింత కంటె ఎక్కువ లాభించేది. ఈనాడు అతను చెప్పలేడు. బహుశా ఆమె సంపర్కం వల్ల ఇంతకంటె ఎక్కువ సౌకర్యం లభించివుండేది. సెక్రటరీ పదవి ఖాయం.

ఇలా అతను ఆలోచనా ప్రవాహంలో పడిపోయినాడు. బహుశా అమ్మ యేడ్పు ఆపేసింది. తన వున్నతిలో తన తల్లిదండ్రులు అడ్డుపడక పోయినప్పటికీ అతని ప్రవర్తనకు వాళ్ళు కొంత అంతరాయం కల్పించారు. తన జీవితంలో పరిపూర్ణత సాధించినట్టు అతనికెప్పుడూ అనిపించలేదు. తర్వాత యీ పరిపూర్ణత కోసం అతను తంకమ్మ దగ్గరకు వెళ్ళలేదు. కేశవ పిళ్ళె తన జీవితాన్ని గురించి యింత గంభీరంగా అంతకు ముందెప్పుడూ ఆలోచించలేదు.

కాత్యాయని తన జీవితంలో తటస్థించకపోతే తన హృదయం పూర్తిగా తంకమ్మకు అంకితమై వుండేదని కేశవపిళ్ళె అనుకున్నాడు. తంకమ్మకు తన అనురాగం లభించలేదు. ఆమె చెప్పిన మాట నిజమే. తన హృదయంలో మొట్టమొదట ప్రవేశించిన స్త్రీ ఆమె. కాని తర్వాత ఆమెకు అక్కడ ఏ మాత్రం స్థానం లభించలేదు.

ప్రతిరోజూ ఆమెలో ఏదో కొత్తదనం కనిపిస్తుంది. ఈనాటికీ ఆమె అలాగే వుంది. ఆమె దగ్గర కూర్చుంటే కాలం ఎలా గడిచి పోతుందో తెలీదు. జీవితం ఇలా చిందర వందర అయినప్పుడు కూడా తను ఆమెను చూస్తూ కూర్చోగలడు. ఆమె గ్లాసు పట్టుకుని కాఫీ తాగించింది. ఆమె చిరునవ్వులో ఎంత ఆకర్షణ వుంది? ఆమె తన జీవిత సహచరి అయినట్టయితే అతని జీవిత వైఖరి పూర్తిగా మారివుండేది. దిగులనేది తెలియకుండా నూతనోత్సాహంతో గౌరవంగా తను ముందంజ వేశేవాడు. జీవితం ఉల్లాసంతో వెల్లివిరుస్తూ వుండేది. ఇలాంటి స్వయంకృషితో జీవితం ఇంతకంటె మెరుగ్గా వుండేది.

ఈనాడు జీవితం ఎంత దీనంగా వుంది! అతనికీ ఒక భార్య వుందని అతననుకున్నాడు. పెళ్ళి చేసుకున్న భార్య యింట్లో వుంటే నెలల తరబడి ఆమె గుర్తుకు రాలేదు. తన భార్య అదృష్టవంతురాలని జ్యోతిష్కులు చెపితే అప్పుడు జ్ఞాపకం వస్తుంది కట్టుకున్న భార్య. ఆమె చెమట కంపు కొడుతూ వుంటుంది. ఆమెను తాకాలంటే అసహ్యం వేస్తుంది. అది కూడా ఒక భార్యేనా. నిజం చెప్పాలంటే ఆమె తన జీవితం నాశనం చేసింది.

తంకమ్మను గురించి కేశవ పిళ్ళెకు ఇంత ఉద్రేకం ఎప్పుడూ కలగలేదు.

మసిపట్టిన మురికి చీరె కట్టుకొని చెమటకారుతున్న ఒంటితో సగం జడవేసుకున్న కాత్యాయని గదిలోకి ప్రవేశించింది. ఆమె చేతిలో గరిటె కూడా వుంది.

కాత్యాయని కొంచెం లావెక్కింది. ఆమె కొంచెం వన్నె దేరింది. జుట్టు కూడా బాగా పెరిగింది. రెండు చేతులకూ ఏడెనిమిది గాజులున్నాయి. మెడలో సొమ్ములున్నాయి. ఈనాడు ఆమె వెనకటి కాత్యాయని కాదు.

"అయ్యో! అమ్మా నాన్నతో ఏమన్నారు?" అడిగింది ఆమె.

"ఏమిటి నీవనేది?" అన్నాడతను తటస్థంగా.

"ఇది నిజమేనా? తల్లిదండ్రులతో అలా అంటారా?" అని అడిగింది భార్య.

"నీవు నాకు ఉపదేశం చేసేందుకు వచ్చావా?"

ఆమెకు కేశవ పిళ్ళె మనసులోని భావం బోధపడలేదు.

"ఇది చాలా తప్పు".

ఉయ్యాలలో నిద్రపోతున్న పసిపిల్లను చూపించి కాత్యాయని అన్నది: "ఈ పాప పెరిగి పెద్దదయిన తర్వాత మనల్ని యిలా అంటే మనకెలా వుంటుంది? ఆ విషయం మీరెందుకాలోచించరు?"

ఈ ప్రశ్న కేశవ పిళ్ళె మనసును ఎక్కడో గాయపరిచింది. కాత్యాయని అంతతో ఆగలేదు. "తిరువనంతపురంలో ఒక ప్రియురాలున్నదా అని అత్తయ్య అడిగితే లేదంటే సరిపోదూ? అప్పుడప్పుడూ అత్తయ్య నన్ను కూడా ఇలాగే అడుగుతారు. అప్పుడు నేను 'లేదు' అని చెపుతాను. మీకు అక్కడ ఒక ప్రియురాలు వుందని యిక్కడ ఆడంగులంతా అంటున్నారు. మీరు కట్టిస్తున్న యింటి ఫొటో కూడా పేపర్లలో వచ్చింది. అలాంటప్పుడు "అయిందేదో అయిందిలే, అందువల్ల మీకేం నష్టం?" అన్నాను. ఇక్కడ ఆడంగులు చాలా చెడ్డవాళ్ళు. కాబట్టి "లేదని" చెపితే సరిపోతుందని".

కేశవ పిళ్ళె ఆమెను తదేక దృష్టితో చూశాడు. విగ్రహంలా అతను పండుకుని వున్నాడు. భార్య మాటలు అతను నమ్మలేక పోతున్నాడు. నిజంగా కాత్యాయనే మాట్లాడుతున్నదా? లేక యిదంతా కలా?

"తర్వాత అత్తయ్య అడిగితే యేం చెప్పను? ఈ యిరుగు పొరుగు ఆడవాళ్ళు అడిగితే లేదని చెపితే సరిపోయేది".

ఒక్క క్షణం ఆగి ఆమె అన్నది:

"వెళ్ళి అమ్మా నాన్నను ఓదార్చు. నేను వెళుతున్నాను. కూర మాడిపోతూ వుంటుంది".

ఆమె వెళ్ళి పోయింది. అలా వెళుతూ వున్న ఆ స్త్రీ స్వరూపాన్ని కేశవ పిళ్ళె నివ్వెరపోయి చూస్తూ కూర్చున్నాడు. ఉన్నట్టుండి పాప మేల్కొని యేడవడం మొదలు పెట్టింది. కేశవ పిళ్ళె వెళ్ళి పాపను ఊపాడు. కాత్యాయని గుమ్మంలోకి వచ్చి చూసింది. కేశవ పిళ్ళె పాపను నిద్ర పుచ్చుతున్నాడు. "నిద్రపోయిందా?" అని నవ్వు మొహంతో ఆమె అడిగింది.

"నిద్ర పోతూ వుంది"

"నేనిప్పుడే వస్తాను. అప్పడాలు వేయించేందుకు పొయ్యిమీద కొబ్బరి నూనె పెట్టాను"

ఆ రోజు రాత్రి కేశవపిళ్ళె తల్లిదండ్రులను క్షమాపణ కోరాలని కాత్యాయని అతనికి పరిపరి విధాల చెప్పింది. క్షమాపణ కోరకుండా వెళ్ళద్దని ఆమె చెప్పింది. తండ్రికి కనిపిస్తే ఆయన శపిస్తాడని కేశవ పిళ్ళెకు భయం. ఆయన శాపం తగలకుండా వెళ్ళటం మంచిదని ఆతని భావం కాని కాత్యాయని అందుకు అనుమతించలేదు.

"ఆయన కాళ్ళ మీద పడ్డ తర్వాతనే వెళ్ళండి. శాపం యేమీ యివ్వరు. అలా మీరనుకుంటున్నారు అంతే. మన పిల్లలు బాగుపడకూడదని మనం

మాత్రం అనుకుంటామా? తల్లిదండ్రుల శాపం పిల్లలకు తగలదు. అలా, కావాలని వాళ్ళు శాపమిస్తారా?"

కేశవపిళ్ళై యింత విషమస్థితి యింతకు ముందు ఎప్పుడూ అనుభవించలేదు. అమాయకపు నవ్వుతో కాత్యాయని అడిగింది: "సరేగాని, కోపగించుకోకుండా వుంటే నేనొక ప్రశ్న అడుగుతాను. కోప్పడద్దు. తిరువనంతపురంలో మీకసలో ప్రియురాలు వుందా? ఈ ఆడవాళ్ళు, వార్తా పత్రికలు ప్రచారం చేసేది నిజమేనా?"

అమాయకత్వాన్ని అభినయిస్తూ అతనన్నాడు : "ఒట్టిది. ఇదంతా కాంగ్రెసు వాళ్ళు చేసే ప్రచారం".

"అయితే ముందే ఎందుకు చెప్పలేదు?"

"చెప్పలేదు. అంతే".

కాత్యాయనికి నమ్మకం ఏర్పడ్డది. "ఎన్నాళ్ళ నుంచో అత్తయ్య, మామయ్య అంటున్నారు - తిరువనంతపురం మీరు తీసుకెళ్ళాలని. ఒక్కసారి తీసుకెళ్ళ కూడదూ?"

"తీసుకెళతా. ఇంకా సరియైన సమయం రాలేదు" అన్నాడతను.

"నాకు కూడా తిరువనంతపురం చూడాలని వుంది" అన్నదామె.

అది కాత్యాయని కోరిక. కాని అది సాధ్యమవుతుందా? ప్రైవేట్ సెక్రటరి!

ఉయ్యాల వూపుతూవున్న ఆమెవైపు చూసి కేశవపిళ్ళై అన్నాడు: "నీవు శుభ్రంగా ఎందుకుండవు? నీ దగ్గర చెమట కంపు కొడుతూ వుంటుంది"

"ఎప్పుడూ చెమటపోస్తూ వుంటుంది. పని చేస్తాను కదా అందుకని చెమట పోస్తుంది. మంచి మంచి చీరెలు కట్టుకుని ఎలా కూర్చుంటాను?" అన్నదామె.

ఒక్క క్షణం ఆగి ఆమె మళ్ళీ అన్నది: "ధనవంతురాలనయిన తర్వాత పని కూడా ఎక్కువయింది."

అమాయకపు భార్యను చూసి కేశవపిళ్ళై అన్నాడు : " ఏమయినా సరే, నీవు అదృష్టవంతురాలివి"

గర్వంతో నవ్వుతూ ఆమె అన్నది : "కిట్టూ మామ కూడా ఎప్పుడూ ఈమాటే అంటారు"

ఆ తర్వాత ఆమె యింకా యిలా అన్నది: "ఆయన మన అమ్మాయి జాతకం రాశారు. మీరు చూశారా? పిల్ల అదృష్టవంతురాలని అన్నారు. ఇంత అదృష్టవంతురాలు ఎక్కడా పుట్టలేదట"

ఈ సంఘటనల కారణంగా అతను మర్నాడు మాత్రమే వెళ్ళ గలిగాడు. తల్లి దండ్రుల దగ్గరికి వెళ్ళి అతను క్షమాపణ కోరాడు. అది అతనికి చాలా కష్టంగా వుంది. కాంగ్రెసు వాళ్ళ మూలంగా అతనికెప్పుడూ మనశ్శాంతి లభించలేదు. దీవాన్‌జీ వాళ్ళ మీద కత్తిగట్టి వున్నాడు. ఆ పరిస్థితిలో అతను

ఆలోచన లేకుండా తల్లిదండ్రులతో నేటికి వచ్చినట్టు మాట్లాడాడు. అయినా వృద్ధులయిన తల్లిదండ్రులు వెక్కి వెక్కి యేడ్చారు.

ఆ తర్వాత అతను ఎన్నికల హడావిడిలో నిమగ్నుడయినాడు. కాంగ్రెసు వాళ్ళకు కేశవపిళ్ళై నిజంగా తలనొప్పిగా తయారయినాడు. చాలా చోట్ల కాంగ్రెసువాళ్ళల్లో తగాదాలు పెట్టటంలో కేశవపిళ్ళై కృతకృత్యుడయ్యాడు. ఎన్నికల్లో ఇరవైఅయిదు శాతం వోట్లు కూడా కాంగ్రెసుకు రాలేదు. ప్రభుత్వం తరఫున ఎన్నికల్లో నిలబడ్డ వాళ్ళకు తప్పుడు ఓట్లు వేయించారనీ, ఓట్లు లెక్క పెట్టేముందే అలా చేశారని తర్వాత దోషారోపణ చేశారు.

దీవాన్‌జీ కేశవపిళ్ళైను ముక్తకంఠంతో అభినందించాడు. కేశవపిళ్ళై యిప్పుడు సెక్రటరీ పదవికి అర్హుడని ఆయన అందరిముందూ ఒప్పుకున్నాడు. అంతకు ముందు ఈ యోగ్యత లేదు.

ఎన్నికలతోపాటు తంకమ్మ యిల్లు కూడా పూర్తయింది. తంపానూరు ప్రాంతంలో అది అన్నిటి కంటే మంచియిల్లు. కేశవపిళ్ళై ఆ యింటికి 'శేఖర విలాసం' అని పేరు పెట్టాడు. తంకమ్మ ఆ యింట్లో వుంటూ వుంది.

## పంథొమ్మిది

ప్రభుత్వం, పరిపాలనలో కొన్ని మార్పులను ప్రకటించింది. ప్రాంతీయ కాంగ్రెసులో ప్రమాదకరములయిన పరిస్థితులను ఎదుర్కొనేందుకు ఆ ప్రకటన జరిగింది. ఈ మార్పులు ప్రభుత్వ పరిపాలనను మరింత పటిష్ఠం చేసేందుకు కేశవ పిళ్ళై తయారు చేసిన రిపోర్టును పురస్కరించుకొని చేయబడ్డాయి. దీవాన్‌జీ యీ రిపోర్టు మీద తన అభిప్రాయం చెపుతూ యిది మొదటి తరగతికి చెందిన రిపోర్టని చెప్పారు. బాగా ఆలోచించి అన్ని నిబంధనలనూ చక్కగా వివరిస్తూ యీ నివేదిక తయారు చేయబడింది. ఈ నిబంధనలన్నీ అతనికి ఇంతకు ముందే తెలుసు కేశవపిళ్ళై తెలివి తేటలను, అతను చేస్తున్న మంచి పనులను దీవాన్‌జీ పరిశీలించి అతని శక్తి సామర్థ్యాలను కొనియాడారు. అతను చాలా సమర్థుడైన కార్యకర్త అని దీవాన్‌జీ ప్రకటించాడు.

పరిపాలనలో మొదటి సంస్కరణ, పబ్లిక్ సర్వీసు. పబ్లిక్ సర్వీసులో నియమించేందుకు నిబంధనలు తయారు చేసేందుకు ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. రెండోది, నేరాలను అరికట్టేందుకు ఒక కొత్త శాఖను ఏర్పరచారు. మూడోది, పారిశ్రామిక వ్యవస్థ. ఈ నిబంధనల్లో ముఖ్యమైన విషయం జల విద్యుత్ ప్రణాళికను త్వరగా ప్రారంభించి పూర్తి చేయటం. దానితోపాటు కొన్ని వ్యాపారాలను ఆరంభించటం. విద్యా శాఖలో కూడా కొన్ని సవరణలు చేయాల్సి వుంది.

ఈ ప్రకటన చేసిన తర్వాత రాజధానిలోని పారిశ్రామిక సమాఖ్యలు జీవం పుంజుకున్నాయి. పెద్ద పెద్ద పదవుల్లో కొన్ని మార్పులు వస్తున్నాయి. ఈ మార్పుల్లో మంచి మంచి పదవుల కోసరం ప్రయత్నాలు మొదలయినాయి. పారిశ్రామిక అభివృద్ధి శాఖలో సెక్రటరీ పదవి కోసం అందరూ చూస్తున్నారు.

అందరూ ప్రయత్నిస్తున్నారు. అందరూ గట్టి ప్రయత్నం చేసిన వాళ్ళే. కేశవపిళ్ళె మాత్రం ఏమీ చేయ్యలేదు. కేశవపిళ్ళె ఆ రంగంలో లేడు. దీవాన్‌జీ అభినందించినంత మాత్రాన ప్రయత్నించకుండానే అభివృద్ధి శాఖ సెక్రటరీ పదవి లభించగలదని కేశవ పిళ్ళె అనుకున్నాడని కూడా చెప్పేందుకు వీల్లేదు. "నాకి వుద్యోగం అక్కర్లేదు." అని కూడా అతననుకోలేదు. ఈ వుద్యోగం చాలా మంచిదని అతనికి తెలుసు. ఆ వుద్యోగం సంపాదించేందుకు అతను తగిన ఉపాయం ఆలోచించలేక పోయాడు. అతని తరఫున అతన్ని గురించి చెప్పేందుకు ఎవ్వరూలేరు. 'రిక్త హస్తాల' చీఫ్ సెక్రటరీని గురించి దీవాన్‌జీ అభిప్రాయం ముమ్మాటికి కాదు, పలుమార్లకి ఇదే. అతనంటే అందరికీ అసహ్యామే. అతను కీలుబొమ్మలా చీఫ్ సెక్రటరీ కుర్చీలో కూర్చుని వున్నాడు. తల నెరసిన భగవతి కుట్టియమ్మ వల్లనే అతనికి ఆ కుర్చీ లభించింది. చీఫ్ సెక్రటరీ తప్పేంలేదు. అతని మాటకు విలువ లేదు. భగవతి కుట్టియమ్మ మాటకు మాత్రం విలువ వుంది. సెక్రటరీ జి.యన్. నాయరు మద్రాసులో ఒక వ్యక్తిని పట్టాడు. అతనికి దీవాన్‌జీతో బాగా పరిచయం. దీవాన్‌జీ అతని మాట కాదనరు. సెక్రటరీ అలెగ్జాండరు రోములో వుండే ఒక పురోహితుని ద్వారా పోప్ వైస్రాయికి వుత్తరం రాశాడు. తంబి రాజధానికి సంబంధించిన వ్యక్తి. ఇంతమంది గొప్ప గొప్ప వ్యక్తులు ప్రయత్నిస్తుంటే కేశవపిళ్ళె సంగతి ప్రస్తావించే వాళ్ళెవరు? ఎవ్వరూ లేరు. అతనికి సిఫారస్ చేసే వాళ్ళెవ్వరూ లేరు.

మొదట చిన్న చిన్న పదవుల కోసరం ప్రయత్నించాడు. ఇప్పుడలా కాదు. నేరుగా దీవాన్‌జీ దగ్గరకి వెళ్ళి అడగాలి. వెనక దీవాన్‌జీ అభినందించారు. కాని యిప్పుడాయన అభిప్రాయం ఏమిటో? కాబట్టి యీ పదవి కోసరం తాపత్రయ పడకుండా ప్రయత్నించకుండా తటస్థంగా వుండటమే శ్రేయస్కరమని అతని వివేకం అతనికి చెప్పింది.

దీవాన్‌జీ అభినందించడం వల్ల కేశవపిళ్ళెకు ఒక విధమైన తృప్తి కలిగింది. అంతమాత్రం చేత ఇంతకు మించిన వున్నతి అక్కరలేదని అతని అభిప్రాయం కాదు. తన వూళ్ళో తనకు కొంత పొలం, ఇల్లు ఉన్నాయి. మువాట్టు పుళలోని పొలంలో సగం తోటగా మారింది. మిగిలిన నేలను బాగు చేస్తున్నారు. చేతిలో కొంత డబ్బు కూడా వుంది. 'ప్రబల కార్యకర్త' అనే కీర్తి కూడా లభించింది. తాత్కాలికమైన విషయమైన సంతోషించదగిన విషయం

కదా! అందరిలా అనవసరంగా అటూ యిటూ పరుగెత్తవలసిన అవసరం లేదు. ఇదే కేశవపిళ్ళె అభిప్రాయం.

ఒక విధంగా తన కర్తవ్యం తాను నెరవేరుస్తున్నాననే భావం కొన్ని సంవత్సరాల నుంచి అతనిలో ప్రవేశించింది. అది కూడా సంతృప్తికి నిదర్శనమే. ప్రతిరోజూ ఆలయానికి వెళ్ళి శాస్తను దర్శిస్తాడు. 'శేఖర విలాసం' లో రాత్రి గడుపుతాడు. నెలకోసారి యింటికి వెళతాడు. మాటిమాటికి జ్యోతిష్కుణ్ణి పిలిపించడు. హాయిగా నిద్రపోతాడు.

కేశవపిళ్ళె మనసులో, మార్పు కావాలని యేమీ లేదు. అలాంటి ఆలోచన కూడా అతనికి లేదు. ఒక వారం సెలవు తీసుకుని అతను వాళ్ళ వూరికి, మువాట్టుప్పుళ వెళ్ళాడు. ఆ సమయంలోనే కొత్త నియామకాలయ్యాయి.

అందరికీ ఆశ్చర్యం కలిపే నియామకానికి సంబంధించిన ఉత్తర్వు జారీ అయింది. ఆ రోజు ఉదయమే కేశవపిళ్ళె సెలవు నుంచి వచ్చాడు. అతన్ని అభివృద్ధి శాఖకు సెక్రటరీగా నియమించారు. కేశవపిళ్ళె కూడా యీ విషయం నమ్మలేక పోయాడు. ఒక్కక్షణం అతనలాగే కూర్చుండి పోయాడు.

కేశవపిళ్ళెకు ఎగిరి గంతులు వెయ్యాలనిపించింది. బిగ్గరగా అరవాలనిపించింది. ఆ యింట్లో మాతు పిళ్ళె అనే వంటవాడు తప్ప మరెవ్వరూ లేరు. అన్నింటినీ మరిచిపోయి అతను వంటవాడి దగ్గరకి పరుగెత్తాడు.

"మాతు పిళ్ళే! అదృష్టం! గొప్ప అదృష్టం! నన్ను అభివృద్ధి శాఖకు సెక్రటరీగా వేశారు."

ఆ ముసలివాడు పాపం నోరు తెరుచుకుని అలాగే నిలబడిపోయాడు. వాడికేమీ అర్థంకాలేదు. తన అయ్యగారి అదృష్టం పండిందని మాత్రం వాడికి బోధ పడింది. వెంటనే కేశవపిళ్ళె సిగ్గు పడ్డాడు. ఇంతకు ముందు మాతుపిళ్ళెకు అతను ఇలాంటి విషయాలు చెప్పేవాడు కాదు. అందువల్ల అతనికి సిగ్గు వేసింది.

అతని ఆనందంలో పాలు పంచుకొనేందుకు మరొకరు ఎవరున్నారు? ఎవ్వరూ లేరు. ఆ యింటి గుంజలు చిర పరిచితంగా నిలబడి వున్నాయి. 'నన్ను అభివృద్ధి శాఖలో సెక్రటరీగా నియమించారని' వాటికి చెప్పాలనిపించింది. ఉన్నట్టుండి కాత్యాయని గుర్తుకు వచ్చింది. ఆమెకు ఈ విషయం అర్థమవుతుందా? ఇలా గంతులేస్తూ పరుగులు తీస్తూ హడావిడి చేస్తూ వుంటే బహుశా ఆమె 'మీ కేమన్నా పిచ్చిపట్టిందా?' అని అడుగుతుంది.

ఆ తర్వాత కేశవపిళ్ళెకు ఎవరెవరో గుర్తుకు వచ్చారు. హరిహర అయ్యర్, గోవిందన్ నాయర్, ప్రభాకరన్ నాయర్, మాత్యూ, మాతేవన్ పిళ్ళె - వీళ్ళంతా ఒకప్పుడు అతన్ని హృదయ పూర్వకంగా అభినందించారు. కాని.

యిప్పుడు వాళ్ళు ఆనందిస్తారా? అది సాధ్యంకాదు. అయినా వాళ్ళు తృప్తి పడతారు. కేశవపిళ్ళెకు తన పరువు ప్రతిష్ఠలు గుర్తుకు వచ్చాయి. మాతు పిళ్ళెకు పొరపాటున తన్నుతాను మరిచిపోయి యేమేమో చెప్పినట్టుగా యీ క్రింది పదవుల్లో పనిచేసే వాళ్ళకు అతనేమీ చెప్పదలుచుకోలేదు. అతనితోపాటు గంతులేసే వాళ్ళే అతనికి కావాలి.

తంకమ్మా!

టెలిఫోన్ మోగింది. అతను పరుగెత్తుకొనిపోయి రిసీవరు ఎత్తాడు. చీఫ్ సెక్రటరీ భార్య మాట్లాడుతూ వుంది. ఆమె కేశవపిళ్ళెను అభినందించింది. అది కేవలం నోటిమాట కాదు, హృదయ పూర్వకమైన అభినందన. తన వున్నతికి ఆమే కారణమని కేశవపిళ్ళె కృతజ్ఞత చెప్పుకున్నాడు.

తన ఆనందం ఇంతా అని అతనికే బోధపడటం లేదు. ఈ పదవి కోసం ఎంతమందో ఎన్ని ప్రయత్నాలో చేశారు. కాని ఎవరికీ విజయం లభించలేదు. అందరికీ యీ విషయం టెలిఫోనులో చెపితే యెలా వుంటుంది? వాళ్ళకిపాటికి తెలిసే వుంటుంది. అయినా అలెగ్జాండరుకీ, జి.యన్. నాయర్‌కీ, తంబీకి తప్పకుండా ఫోను చేసి చెప్పాలి. అందులో ఒక ప్రత్యేకమైన ఆనందం వుంది. అందులో కొంత పర్యాచకంవల్ల వచ్చే ఆనందం కూడా వుంది. దీవాన్‌జీ బంధువు ఏమయినట్టు? వైస్‌రాయి సిఫార్సేమయినట్టు? ఇవన్నీ అడిగేందుకు ఇది తరుణం. అప్పుడు వాళ్ళేమంటారో చూడాలి.

ఉన్నట్టుండి టెలిఫోను మోగింది. భక్తి విలాస్ నుంచి వచ్చిందా ఫోను. కేశవ పిళ్ళెను దీవాన్‌జీ పిలిపించారు.

ఎగిరి గంతులు వేస్తున్న అతని ఉత్సాహం ఉన్నట్టుండి చప్పబడింది. ఒక్క క్షణంలో కారు వచ్చింది. మరు క్షణంలో అతను వెళ్ళిపోయాడు.

ఎందుకు పిలిచాడో అని అతనికి భయం వేసింది. అణగదొక్కేందుకా? పైకి లాగేందుకా? నోటి నుంచి పొరపాటు మాట యేదయినా వస్తే అంతా నాశనమై పోతుంది. ఈ రోజు తనను అభివృద్ధి శాఖలో సెక్రటరీగా నియమించారన్నమాట, అందరికీ తెలిసి పోయింది. ఇందులో కొంత మార్పు చెయ్యాలని తర్వాత ఆయనకు అనిపించిందేమో? దీవాన్‌జీ చాలా దిట్ట. ఎవరితోనయినా మాట్లాడుతూనే ఎదుటి వాణ్ణి ఎందుకూ పనికిరాని వాణ్ణి చేయగలరు. అలా యెందుకూ పనికిరాని మూర్ఖుడిగా చేసి తన నియామకాన్ని రద్దు చేస్తారా? అందుకోసరమే పిలిపించారేమో? రాత్రి భోజనం లేక పడుకున్న బీదవాణ్ణి నిద్ర నుంచి లేపి అన్నం ముందు కూర్చోమని విస్తరి తీసేస్తే యెలావుంటుందో అలా వుంది కేశవపిళ్ళెకు.

కేశవపిళ్ళె మనస్సూ, హృదయం ధర్మాధికారిలో లీనమైవుంది. ఈ మధ్య కేశవ పిళ్ళె జోతిష్కుని దగ్గరకి వెళ్ళినప్పుడు అతన్ని ఏమీ అడగటం లేదు.

ఆ సమయంలో కూడా అతని చెవుల్లో కిట్టూమామ చెప్పిన మాటలు వినబడుతూ వున్నాయి.

"ఆమె అదృష్టవంతురాలు".

అతనికి తనమీద నమ్మకం ఏర్పడ్డది. ఈ పదవి కావాలని అతననుకోలేదు. ఒకవేళ పోతే పోనీ. మరేం చేస్తాం? కానీ అలా జరిగితే ఒర్చుకునే శక్తి తనకి లేదు.

అతను తన పిచ్చి సంతోషాన్ని కేవలం మాతుపిళ్ళై యెదుట ప్రదర్శించాడు. తనసంతోషాన్ని అతనొక్కడే చూశాడు. తాను ఓడిపోతే బహుశా యింటి గుంజలు తనను పరిహాసిస్తాయి. అలెగ్జాండరుకూ, జి.యన్. నాయర్‌కూ చెప్పక పోవటం మంచిదయింది. భగవతి కుట్టియమ్మ యిలాంటి వార్త వింటే చాల విచారిస్తుంది.

లేదు, అలా యెన్నటికీ కాదు. దైవం అలా యెప్పుడూ చెయ్యడు. కాత్యాయని అదృష్టం తనను కాపాడుతుంది - అనుకుంటూ వెళ్ళాడు.

దీవాన్‌జీ దగ్గరకి నిష్కంపంగా వెళ్ళటం అతనికి చేతకాదు. దీవాన్‌జీ ముఖవైఖరి సౌమ్యంగా వుంది. కానీ ఆత్మను ఆయాసపరిచే అతని చూపులలో కేశవపిళ్ళై తన చూపులను చేర్చలేక పోయాడు.

"నియామకం ఉత్తర్వులు జారీ చేసిన విషయం తెలిసిందా?" అడిగారు దీవాన్‌జీ.

"అవును, తెలిసిందండీ", అన్నాడు కేశవపిళ్ళై వినయంగా.

ఒక్క క్షణం ఆగి ఆయన అన్నారు: "ఇది నీ రిపోర్టును బట్టి చేసిన పని. ప్రభుత్వపు ప్రకటనను చక్కగా త్వరగా అమలుపరిచే బాధ్యత నీ మీద పెడుతున్నాం. నీ పనీ, నీ బాధ్యతా నీకు బాగా తెలుసనే అనుకుంటాను".

అంతా శ్రద్ధగా విని కేశవ పిళ్ళై సమాధానం చెప్పాడు: "అవును సార్, నాకు తెలుసు".

"సరే, నీకేమీ అడ్డు ఉండదు. నీ కెంత డబ్బు కావాలన్నా దొరుకుతుంది. అందులో ఏ మాత్రం ఆలస్యం కానీ సాంకేతికమైన అంతరాయం కానీ ఉండదు. ఖాళీ చెక్కు ఇచ్చామనుకో, నీకు తోచినట్టు నీవు చెయ్యాలి" అన్నారు దీవాన్‌జీ.

అంతకు మించి దీవాన్‌జీ చెప్పవలసింది లేదు. కేశవపిళ్ళైను ఇక వెళ్ళవచ్చునన్నారు. కేశవపిళ్ళై 'బ్రతుకు జీవుడా' అనుకున్నాడు. దీవాన్‌జీ చెప్పిన దానిలో అంతరార్థం కేశవపిళ్ళైకు బోధపడిందా లేదా అనేది సందేహామే. బయటికి రాగానే ప్రైవేట్ సెక్రటరీ అతన్ని ఆప్యాయంగా అభినందించేందుకు అక్కడే నిలబడి వున్నాడు.

ఉల్లాసంతో కేశవపిళ్ళై తిరిగి వచ్చాడు. ఈ ప్రాంతంలో ఇంత అదృష్టవంతులు మరెవ్వరూ లేరు. "ఎవరన్నా ఉన్నారా?" అని బిగ్గరగా

ప్రశ్నించేందుకు ఎదురుగావున్న ముక్కున్ని కొండ అతన్ని ఆహ్వానిస్తూవుంది. ఆ ప్రశ్నకు సమాధానంగా 'ఇదుగో, నేనున్నాను' అని ఎవరయినా చెప్పగలరా? లేదు. చెప్పలేరు.

ఎంత కళకళలాడుతూ వుంది ప్రపంచమంతా! ఎక్కడ చూసినా ఆనందమే, ఆవేశమే. అంగడి ముందు కూర్చుని పోచుకోలు కబుర్లు చెప్పుకునే అల్లరి పిల్లలు కూడా నవ్వు కుంటున్నారు. తలమీద బుట్ట పెట్టుకుని కూరగాయలు అమ్ముకునే ఆ పడుచుపిల్ల, మెడమీద గడ్డపార వేసుకొని వెళ్ళే ఆ మగవాడితో ఏదో చెపుతూ వుంది. ఏదో రసవత్తరమైన విషయమై వుండాలి. వాళ్ళుకూడా నవ్వుతున్నారు. అంగళ్ళల్లో చాలామంది పోగయినారు. అదేదో పండుగ రోజుగా అతనికి తోచింది. పండగ చేసుకునేందుకు వాళ్ళు సరుకులు కొంటున్నారు.

కేశవపిళ్ళె యిల్లు చేరుకున్నాడు. అతనక్కడ మౌనంగా కూర్చోలేక పోయాడు. తనలో తనకు ఉత్సాహం, ఉల్లాసం పైకి ఉబుకుతూ వుంది. దానిని పంచుకునేందుకు కూడా ఎవ్వరూలేరు. ఎక్కడికి 'వెళదామా అని ఆలోచించి శేఖర్ విలాస్‌కు ఫోన్ చేశాడు.

భాగీరథీ అమ్మ పలికింది. తంకమ్మ అక్కడలేదు. ఎక్కడికి వెళ్ళిందో తెలీదు. ఎక్కడికో బయటికి వెళ్ళింది.

"ఒక మంచివార్త. నన్ను అభివృద్ధి శాఖలో సెక్రటరీగా నియమించారు." అన్నాడు కేశవపిళ్ళె. భాగీరథీ అమ్మకు ఆ విషయం బోధపడలేదు. "ఇది ఎలాంటి వుద్యోగం అబ్బాయ్?" అని అడిగిందామె. కేశవపిళ్ళె యేమీ చెప్పకుండా ఫోను పెట్టేశాడు.

ఇది యెలాంటి వుద్యోగమో తంకమ్మ అర్థం చేసుకుంటుంది. దీవాన్‌జీ ఖాళీ చెక్కు ఇచ్చాడని చెపితే దాని అభిప్రాయం ఆమెకు బోధ పడుతుంది. కాని దాని దుంపతెగ, అదెక్కడికో వెళ్ళింది.

ఆ చిన్న యింట్లో ఒంటరిగా కూర్చోలేక అతను గుర్రంబండి మీద బయటకి బయలుదేరాడు. రోజంతా బండిమీద వూరంతా స్వారి చేశాడు. సముద్ర తీరంలో కాసేపు విశ్రాంతిగా కూర్చున్నాడు. బండివాడు గుర్రానికి కొంచెం విశ్రాంతి కావాలని చెపితే 'చావనీ దాన్ని' అనేశాడు. ఒక కారు కొనుక్కోవాలనుకున్నాడు.

సాయంత్రం వళుతెక్కాట్ రామవర్మ క్లబ్బు ముందుగా బండి వెళుతూవుంది. అభివృద్ధి శాఖ డైరెక్టర్లూ, సెక్రటరీలు, వాళ్ళ భార్యలూ అందరూ అక్కడే వుంటారు. ఆ భవనం, దాని పరిసరాలూ దీపాలతో తళతళలాడుతూ వున్నాయి. కేశవపిళ్ళె బండిని లోపలికి తీసుకెళ్ళమని బండివాడికి చెప్పాడు.

కేశవపిళ్ళై క్లబ్బులో మెంబరు కాడు. అందులో మెంబరుగా చేరమని సెక్రటరీ చాలా రోజులనుంచి అతన్ని బలవంతం చేస్తూ వున్నాడు. కాని అతను చేరలేదు. ఇది చాలా పెద్ద వుద్యోగస్థులకు సంబంధించిందని అతను చెపుతూ వచ్చాడు. చాలా ఏండ్ల నుంచి కేశవపిళ్ళై తిరువనంతపురంలో ముఖ్యమైన వుద్యోగంలోనే వున్నాడు. అయినా అతను తనెలాగో అలా పైకి వస్తున్నా అనుకున్నాడు. పెద్ద వుద్యోగాల కోసరం పుట్టిన గొప్ప వ్యక్తులది ఆ క్లబ్బు అని అతని భావం. వాళ్ళల్లో తను చిన్నవాడు. అందువల్ల ఇంతవరకు అతను అందులో మెంబరుగా చేరలేదు.

బయట పూదోటలో అక్కడక్కడ మూడు నాలుగు గుంపులుగా కొంతమంది కూర్చుని మాట్లాడు కుంటున్నారు. అక్కడికి కొంచెం దూరంలో రెండు జట్లు టెన్నీసు ఆడుతున్నారు. లోపల ఉద్యోగస్థుల భార్యలు క్యారంస్ ఆడుకుంటున్నారు. కొంత మంది టేబుల్ టెన్నిస్ ఆడుతున్నారు. రెండవ అంతస్తులో కూడా కొంతమంది వున్నారు. వాళ్ళు ఫలహారాలు చేస్తున్నారు. పొడుగాటి చొక్కా, టోపీ పెట్టుకున్న నౌకర్లు హడావిడిగా అటూ యిటూ పరుగెత్తుతూ వున్నారు. వాళ్ళు తప్పకుండా కేశవపిళ్ళై ప్రొమోషను గురించే మాట్లాడుతూ వుంటారు.

గుర్రం లోపలికి వచ్చిన చప్పుడు వినగానే అక్కడవున్న ఆడామగా అందరూ అటువైపు తిరిగి చూశారు. కేశవపిళ్ళై బండి దిగగానే అందరూ అతన్ని గుర్తు పట్టారు. బయట తోటలో కూర్చున్న వాళ్ళు అతన్ని అందరి కంటె ముందు గుర్తు పట్టారు. అది ముఖ్యమైన సంఘటన. ఆడవాళ్ళతో సహా అందరూ అతని చుట్టూ చేరారు. ఆరోజు తిరువనంతపురంలో అందరూ కేశవపిళ్ళైను గురించే చెప్పుకుంటున్నారు. అంతమంది మధ్యలో వున్నా కేశవపిళ్ళైకు నామోషీగా ఏమీలేదు. అంతులేని ఆనందం, అభిమానం అతని తృప్తికి కారణమయినాయి. అందరూ అతనితో కరచాలనం చేసి అభినందించారు. అతను నవ్వుతూ అందరికీ కృతజ్ఞత చెప్పాడు.

క్లబ్బు సెక్రటరీ థామస్, ఇదే సరైన సమయమని "ఈ శుభ ముహూర్తంలో తమరు మా క్లబ్బులో మెంబరుగా చేరతారా?" అని కేశవపిళ్ళైను అడిగాడు.

చిరునవ్వుతో కేశవపిళ్ళై తన అంగీకారాన్ని తెలియపరిచాడు. అక్కడవున్న అందరితో కేశవపిళ్ళైకు పరిచయం లేదు. సెక్రటరీ అతన్ని అందరికీ పరిచయం చేశాడు. "వీళ్ళ భార్యలు కూడా మెంబర్లే" అన్నాడు థామస్. కేశవపిళ్ళైకు కొంచెం నామోషీ తోచలేదని చెప్పేందుకు వీల్లేదు. అందువల్ల అతని నవ్వు కొంచెం వక్రించింది.

"నా భార్య యిక్కడ లేదు. ఉన్నా క్లబ్బుల్లోకి వచ్చే రకంకాదు. పల్లెటూరి పిల్ల"

అసిస్టెంట్ సెక్రటరీ కృష్ణపిళ్ళై భార్య, సూపరింటెండెంటు గౌరిఅమ్మ ఏదో వ్యంగ్యంగా నవ్వుకుంటున్నారు. వాళ్ళు తప్పకుండా తంకమ్మ సంగతి తలుచుకొని వుంటారు.

"దీవాన్‌జీని చూశారా?" అని అడిగాడు సెక్రటరీ జోన్.

"చూశాను. ఈ రోజు వుదయమే నేను వూరు నుంచి వచ్చాను. ఒక వారం సెలవు పెట్టానుకాదు. ఉదయం రాగానే భక్తివిలాస్ నుంచి టెలిఫోనులో ఆయన పిలిపించారు". అన్నాడు కేశవపిళ్ళె అక్కడ ఎవ్వరూ తనమాట నమ్మడంలేదని అతనికి తోచింది. ఇంతలో సెక్రటరీ జి.యన్. నాయర్, అలెగ్జాండర్, తంబి రెండో అంతస్తు నుంచి కిందికి వచ్చారు. వాళ్ళ చేతుల్లో సారా గ్లాసులున్నాయి. ముగ్గురూ బాగా తాగారు. కేశవపిళ్ళై లేచి నిలుచుని ముగ్గురికీ నమస్కారం చేశాడు.

ముందు అలెగ్జాండరు మాట్లాడాడు. కేశవపిళ్ళైను ఆయన అభినందించాడు. అందరూ ఒకరి ముఖం ఒకరు చూసుకొని నవ్వటం మొదలు పెట్టారు. పోటీలో ఓడిపోయిన వ్యక్తి తన ఓటమిని మరిచిపోయి అభినందిస్తున్నాడు. "ఒక్క గుక్క పుచ్చుకోవోయి పిళ్ళై!" అన్నాడలెగ్జాండర్.

కేశవపిళ్ళై జవాబు కోసరం ఎదురు చూడకుండానే ఆయన విస్కీ, సోడా తీసుకురమ్మని కుర్రాడికి చెప్పారు. కొంచెం తటపటాయిస్తూ కేశవపిళ్ళై అన్నాడు: "థ్యాంక్సు, నేను తాగను. ఎప్పుడూ తాగలేదు."

"అయితే మరి డెవలప్‌మెంట్ సెక్రటరీ పని యెలా చేస్తావోయ్?" అన్నాడు తంబి.

అందరూ పకపకా నవ్వారు.

"మిస్టర్ పిళ్ళైకు కల్లంటే యిష్టం కాబోలోయ్" అన్నాడు జి.యన్.నాయర్ కొంచెం పరిహాసం చేస్తూ.

"లేదు, నేనింతవరకు మద్యపానం చెయ్యలేదు." అంటూ వుంటే కేశవపిళ్ళై ముఖం కొంచెం పాలిపోయినట్టయింది. తను ఈ క్లబ్బుకు తగినవాడిని కాదని అతనికనిపించింది. అక్కడ వున్న ఆడవాళ్ళు కూడా అతన్ని ఉక్కిరిబిక్కిరి చేశారు. చాలామంది ఆడవాళ్ళు వ్యంగ్యంగా నవ్వుతున్నారని అతనికి తోచింది. వాళ్ళ దృష్టిలో కేశవపిళ్ళై మంచివాడు కాదు.

అందులో ఒకరన్నారు: "ఈ రోజు కొత్త సభ్యుడు చేరుతున్నాడు. అందరికీ ఒక గుక్క దక్కాలి."

మరోవ్యక్తి అతనితో ఏకీభవిస్తూ వుండగానే నౌకరు విస్కీ, సోడా తెచ్చాడు.

తంబి ఉత్తర్వు చేశాడు: "ముందు కొత్త సభ్యునికి స్వాగతం చెప్పాలి. కాని కొత్త సభ్యునికి కొత్తగా ప్రమోషన్ వచ్చింది కాబట్టి అతనే చిన్న పార్టీ యివ్వాలి."

ఆ మాట అందరికీ నచ్చలేదు. అతన్ని గౌరవించాలని ఎక్కువమంది అభిప్రాయ పడ్డారు.

కేశవపిళ్ళె విస్కీ తాగలేదు. అంతకు ముందు రెండు మూడు పర్యాయాలు బీరు తాగాడు. అందువల్ల ఒక గ్లాసు బీరు తాగాడు. కొంతమంది ఆడవాళ్ళు కూడా బీరు తాగుతున్నారు. ఆ పెద్ద హాల్లో నుంచి కొంతమంది జట్లు జట్లగా తయారయి తోటలోకి, మేడపైకి వెళ్ళారు. కేశవపిళ్ళె, ఫారెస్టు కన్సర్వేటరు, మరకతం పిళ్ళె - యిద్దరూ గ్లాసులు తీసుకొని తోటలోకి వెళ్ళారు. చెట్టుకింద గౌరిఅమ్మ, అసిస్టెంటు సెక్రటరీ భార్యా మాట్లాడు కుంటున్నారు. ఇద్దరూ తప్పకుండా తంకమ్మ సంగతే చెప్పుకుంటూ వుంటారు.

కేశవపిళ్ళె తిన్నగా వాళ్ళ దగ్గరికి వెళ్ళాడు. జంకులేకుండా అతనడిగాడు: "మీరు నా సంగతే అనుకుంటున్నారు కదూ?"

ఆ సమయంలో అతనికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. "పై ఆఫీసరు వచ్చాడన్న" గౌరవ భావంతో గౌరిఅమ్మ కొంచెం వెనక్కి జరిగింది. భానుమతిఅమ్మ ఆకట్టుకునే చిరునవ్వు చిందుతూ అన్నది: "ఏం? మీరేమయినా చెప్పాలను కుంటున్నారా?"

"నేను చెప్పాల్సింది యేమీ లేదనే అనుకుంటూన్నాను."

"కానీ పిల్లల్నా, తల్లినీ దాచిపెట్టడం బాగాలేదు" అన్నది గౌరిఅమ్మ భానుమతి అమ్మ వెనక నిలబడి.

కేశవపిళ్ళె నవ్వుతూ అన్నాడు: "ఆవిడకు పల్లెటూర్లో వుండడం ఇష్టం."

"అదేం లేదు, ఇదే దాగుడు మూత" అన్నది భానుమతిఅమ్మ.

"అదే సమయంలో ఇన్‌కంటాక్సు కమీషనర్, అసిస్టెంటు సెక్రటరీ అక్కడికి వచ్చారు. అంతటితో వాళ్ళ సంభాషణ ఆగిపోయింది.

మరకతం పిళ్ళె, కమీషనర్ కొంచెం ముసలి వాళ్ళయిపోయారు. కొత్త ప్రకటనను గురించి వాళ్ళు ఏదో చెప్పాలను కున్నారు. ప్రభుత్వం చేసిన యీ ప్రకటన రాష్ట్ర కాంగ్రెసు నోరు మూయించగలదని అసిస్టెంటు సెక్రటరీ కృష్ణ పిళ్ళె తన అభిప్రాయం చెప్పారు. కేశవ పిళ్ళె యేమీ చెప్పాలనుకోలేదు.

లోపల హాల్లో సెక్రటరీ అలెగ్జాండరు, జి.యన్.నాయరూ, తంబీ బిగ్గరగా మాట్లాడు తున్నారు. తర్కించు కుంటున్నారు. వాళ్ళు బాగా తాగి వున్నారు. రాష్ట్ర కాంగ్రెసు పరిపాలనలోకి వస్తుందని అలెగ్జాండరు అంటున్నాడు. ఈ విషయంలో నాయర్లు సహకరిస్తేనే పని నెరవేరుతుందని నాయరు అభిప్రాయం. ఈ రోజు కాకపోతే రేపయినా అదే జరుగుతుందట. తంబి తలాతోకా లేకుండా ఏదో అసందర్భ ప్రలాపం చేస్తున్నాడు. అలా తాగితాగి వాళ్ళు నెక్కి పోతున్నారు.

కేశవపిళ్ళై అందరి దగ్గరా సెలవు తీసుకుని గుర్రపుబండి మీద యింటికి వచ్చాడు. అతను తప్ప మరెవరూ అక్కడి నుంచి కదల్లేదు. ఇంకా వాళ్ళు అక్కడనే వుండి తాగుతూ వున్నారు.

అది కొత్త అనుభవం. గౌరి అమ్మ ఆకారం కేశవపిళ్ళై మనసులో హత్తుకొని పోయింది. ఆమెలో ఏదో విచిత్రమైన ఆకర్షణ వుంది. మరికొంత సేపు ఆమెతో మాట్లాడాలని అతనికి ఎంతగానో అనిపించింది. ఇంతలో ఇద్దరు ముసలి వాళ్ళూ పానకంలో పుడకల్లాగా వచ్చారు.

కేశవపిళ్ళై తిన్నగా శేఖర విలాస్‌కు వెళుతున్నాడు. రోజూ కంటె యీనాడు ఆలస్యమయింది. ప్రతి రోజూ అతను అక్కడికి వెళతాడు. తంకమ్మ అతని చేతిలో కీలుబొమ్మ. అయినా వాళ్ళిద్దరి సంబంధాన్ని గురించి స్పష్టంగా ఏమీ చెప్పేందుకు వీల్లేదు. వాళ్ళిద్దరికీ ఈ విషయంలో ఏమీ సందేహం లేదు. తంకమ్మ తన జీవితంలో ఒక తప్పనిసరి వ్యక్తిగా కేశవపిళ్ళైను స్వీకరించిందా? ఇందులో కేశవపిళ్ళైకు సందేహమే. కాని కేశవపిళ్ళైకు తంకమ్మ కావాలి. తంకమ్మ అతని స్వాధీనంలో వుంది. కేశవపిళ్ళై ఆలస్యంగా వచ్చినా ఎందుకాలస్యమయిందని అడగదు. ఆమె ఎదురుచూస్తూ వుండేది. ఆమె తనది అని కేశవపిళ్ళైకు ఇంతవరకు అనిపించలేదు. కాని తంకమ్మ మీద తనకు అధికారం వుండాలని అతని కోరిక. ఆమె పూర్తిగా తనది - కేవలం తనదిగా వుండాలి. ఎందుకు వుండగూడదు? ఈ యిల్లు ఆమెకు తనే కట్టించాడు. తెన్నిప్పాల్ పారి పోయినా ఆమెను మళ్ళీ స్వీకరించాడు. ఆమె కేశవపిళ్ళైకు ఋణపడివుంది. ఆ పరిస్థితిలో ఆమె అతనిదై వుండవలసిందే.

క్లబ్బులో వాళ్ళందరూ లాంఛన ప్రాయంగా అతన్ని అభినందించారు - హృదయపూర్వకంగా కాదు. హార్దికంగా అతని ఆనందంలో పాలుపంచుకునే వాళ్ళు ఎవరున్నారు? ఉదయం అతని హృదయంలో ఉదయించిన అభిలాష మళ్ళీ మొలకెత్తింది. జీవితంలో అతను ఒంటరివాడు. అతనికి సంతోషంలో తోడుగా వుండే వాళ్ళెవరూ లేరు. కష్ట సమయంలో కూడా అతనికి తోడెవరూ లేరు. ఎవ్వరూ లేరు. అతను ఒంటరి వాడు.

ఒకసారి తంకమ్మ అతనితో సుఖమనుభవించింది. కేశవపిళ్ళై గొప్పవాడయినందువల్లనే ఆమెకు 'శేఖర విలాస్' లభించింది. 'ఇంకా గొప్పవాడయితే యింకా లాభిస్తుంది'. అనే భావం ఆమెకు ఉండవచ్చు. తనకు జరిగే మేలును బట్టి అతని సంతోషంలో భాగస్వామిని అవుతుంది కదా!

అతను గుమ్మందాటి ముంగిట్లో ప్రవేశించాడు. ఆమె అక్కడ లేదు. అతను ముందు గదిలోకి వెళ్ళాడు. అక్కడ ఒక యువకుడు నిలబడి వున్నాడు. అతన్ని కేశవపిళ్ళై తేరిపార చూశాడు. అతను అందంగా వున్నాడు.

ఆరోగ్యంగా వున్నాడు. కేశవపిళ్ళైకు అనుమానం వేసింది. అతనడిగాడు:
"నీవెవరు? నీకిక్కడేం పని?"

ఆ యువకుడు జంకాడు. ఇంతలో తంకమ్మ అక్కడికి వచ్చింది. ఆమె దానికి సమాధానం చెప్పింది:

"నా బంధువు"

అతను నొక్కినొక్కి అన్నాడు: 'ఊఁ ఊఁ'

ఇంతలో భాగీరథీ అమ్మ అక్కడికి వచ్చింది. విప్పారిన చిరునవ్వుతో ఆమె అడిగింది : "పిళ్ళైకు చాలా గొప్ప వుద్యోగం దొరికిందని విన్నాను. అవునా?"

ఇంతటి ఆత్మీయత అతనికి మరోచోట కనిపించలేదు. అతనితో పాటు ఆనందించే మరో వ్యక్తి వున్నారు. అలాంటి వ్యక్తిని వెతుక్కుంటూనే అతనిక్కడకి వచ్చాడు. కాని యిక్కడ మరో చిక్కులో ఇరుక్కున్నాడు. భాగీరథీ అమ్మకు ఈ విషయం తెలిసిపోయింది. కేశవపిళ్ళై సమాధానం చెప్పలేదు.

ఇది చాలా క్లిష్టమైన పరిస్థితి అని భాగీరథీ అమ్మ అర్థం చేసుకుంది. తంకమ్మకూ, కేశవపిళ్ళైకూ ఏ క్షణంలోనయినా తగాదా రావచ్చు. ఇద్దరూ సిద్ధంగా వున్నారు. ఈ విస్ఫోటంలో ఇద్దరూ వేరు అవచ్చుకూడా. అది చాలా విషమ పరిస్థితి. ఈ దారుణ పరిస్థితిని తప్పించేందుకే ఆమె అడిగింది: "ఏం పిళ్ళై! అలా నిలబడ్డావ్? కూర్చో. ఏమిటా వుద్యోగం? జీతమెంత యిస్తారు? అన్ని విషయాలూ చెప్పు."

కేశవపిళ్ళై ఏదో లెక్క తేల్చుకుందామని నిలబడ్డాడు. అతను దాన్ని అంగీకరించేందుకు సిద్ధంగా వున్నాడు. కాని తంకమ్మ కోప్పడలేదు. ఇంతలో ఆ యువకుడు అక్కడినుంచి ఎక్కడికో పారి పోయినాడు.

ఒక యువకుడు కనిపించాడు. దానికింత కోప్పడవలసిన పనేముంది? ఇక్కడికి మగవాళ్ళు రాకూడదా? అనుమానించేందుకు అక్కడ ఏముంది? ఆమె చెప్పినట్టు బహుశా అతను ఆమె బంధువే అయివుండచ్చు. ఇలా నిర్బంధమైన జీవితానికి ఒప్పుకొని ఆమె కేశవపిళ్ళై ఆధిపత్యానికి ఏ మాత్రం లొంగదు. ఆమె జీవితం ఈనాడు ఒక కట్టుబాటుకు లొంగకుండా ఆరంభమయింది. గడచినవన్నీ మరిచిపొమ్మని ఆమె కేశవపిళ్ళైను కోరలేదు. ఇక ముందు తను తప్పు చెయ్యనని ఆమె ఒట్టు పెట్టుకోను కూడా లేదు. తాను అతనికే అంకితమైపోతానని ఆమె ప్రతిజ్ఞ చెయ్యలేదు. తను ఆమెను అలా కోరనుగూడా లేదు. అందువల్ల తను కోపం తెచ్చుకుని, చిరాకు పడడంలో అర్థం లేదు.

మాట్లాడకుండా కేశవపిళ్ళై అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. కాని తంకమ్మ చలించలేదు.

భాగీరథీ అమ్మ దిగులు పడింది. అతను కోపంతో వెళ్ళి పోతున్నాడు.

"కేశవపిళ్ళై మాట్లాడకుండా వెళ్ళి పోతున్నాడే. తగాదా ఏమన్నా జరిగిందా?" అడిగింది భాగీరథీ అమ్మ

తంకమ్మ యే మాత్రం తొణకకుండా సమాధానం చెప్పింది: "అయితే అయివుండచ్చు."

ఒక్క క్షణం ఆగి కోపంతో నైరాశ్యంతో ఆమె అన్నది: "అమ్మాయ్! ఏమిటిలా చేస్తున్నావ్? నా మనస్సుకు చాలా కష్టంగా వుంది."

తంకమ్మ జంకులేకుండా అడిగింది: "అయితే యేమిటంటావ్?"

"ఏమిటా? గౌరవంగా మర్యాదగా బతకటం నీకు తెలియదు. అదే నేననేది. ఈ కుర్రవాడు ఇక్కడికి రావటం మొదలు పెట్టినప్పటినుంచీ నేనంటున్నాను - ఇది బాగాలేదని. తగాదా వస్తుందని చెప్పాను. ఇప్పుడు చూశావా? ఎంత కష్టం వచ్చిందో? నీకు సిగ్గూ, మర్యాదా లేదు. ఇదంతా నేను చూస్తూ వుండలేను. నేను వెళుతున్నాను."

"వెళ్ళు", అన్నది తంకమ్మ.

భాగీరథీ అమ్మ సహించలేక పోయింది: "అయితే నీ యిష్టం వచ్చినట్లు నీవు ప్రవర్తించేందుకు అడ్డు లేదా? అవును, అవును. నీవు తండ్రి ప్రాణం కాజేసిన దానివి. నాకు తెలుసు. అయ్యో దైవమా? ఇది ఇలా యెందుకు తయారయింది?"

భాగీరథీ అమ్మ గొల్లు మన్నది. తంకమ్మ యే మాత్రం చలించలేదు.

ఆ రోజు రాత్రి భాగీరథీ అమ్మ తన సామానంతా సర్దుకొని వెళ్ళి పోయింది. తంకమ్మ వెళ్ళవద్దన లేదు.

భాగీరథీ అమ్మ వెళ్ళి పోయిన తర్వాత ఆ యువకుడు మళ్ళీ వచ్చాడు. అతను కంగారు పడుతున్నాడు. చిరునవ్వులు చిందిస్తూ తంకమ్మ అతనిదగ్గరకి వెళ్ళి అన్నది: "దుష్టులంతా దూరమై పోయినారు."

ఇరవై

అవి చాలా గౌరవ ప్రదమైన క్షణాలు. కేశవపిళ్ళై గదిలో అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. మిగిలిన వాళ్ళంతా బొమ్మల్లా నిలబడ్డారు. గదిలో అంతా నిశ్శబ్దంగా వుంది. బయటి నుంచి దీపపు పురుగు వచ్చి దీపం చుట్టూ ఎగిరి ఎగిరి ఆ నిశ్శబ్దాన్ని భంగం చేసింది.

కేశవపిళ్ళైలో ఒక అధికారిలో ఉండవలసిన భావం, ఠీవి ప్రవేశించాయి. ఈనాడు అతను వెనకటి కేశవపిళ్ళై కాదు. వెనక కొంచెం తేలికతనం వుండేది. ఇప్పుడది లేదు. ఈ రోజు అతనిలో గాంభీర్యం, ఇచ్ఛాశక్తి, హుందాతనం కనిపిస్తున్నాయి. అతను శాసనకర్త. అతనికి ఆజ్ఞాపించే అధికారం వుంది. అక్కడ నిలబడి వున్నవాళ్ళకు ఏదో గంభీరమైన ఉత్తర్వు ఇస్తున్నాడు. అలా ఆజ్ఞాపించే సామర్థ్యం అతనిలో వుంది. కేశవపిళ్ళై గొంతులో కూడా మార్పు వచ్చింది.

కేశవపిళ్ళై తలఎత్తి వాళ్ళ ముఖంవైపు తీవ్రంగా చూస్తూ అడిగాడు: "ఏమంటావ్ మాత్యూ? ఇది యేదో ఒక నిర్ణయం చేయవలసిన సమయం."

ఆ నలుగురూ విచారంగా నిలబడి వున్నారు. నిజంగానే వాళ్ళేమీ నిర్ణయం చేయలేక పోయారు. చేయలేరు కూడా. వాళ్ళల్లో ఇచ్ఛాశక్తి నశించింది. వాళ్ళు శవాల్లా నిలబడి వున్నారు. ఈ విషయం కేశవపిళ్ళై గమనించాడు.

కేశవపిళ్ళై అన్నాడు: "ఇది ప్రభుత్వం ఆలోచించి చేసిన తుది నిర్ణయం. దేశభక్తి అంటే ఏమిటో, ప్రజలు ఎంతవరకూ అర్థం చేసుకున్నారో ఆ విషయం కూడా ఇప్పుడు నిశ్చయించాలి. బహిరంగ సభల్లో దేశభక్తికి సంబంధించిన నినాదాలు చేయటం నిజమైన దేశభక్తి కాదు. ఇది వెల్లని నాటెం లాంటిది. నిజమైన దేశభక్తి ఎవరిదో తెలుసుకోవాలి. అలాంటి సమయం వచ్చింది."

ఒక్క క్షణం ఆగి అతను తనలో తాను అనుకుంటున్నట్టుగా అన్నాడు: "రాజు మీద రాజ్యం మీద ఎవరికి ప్రేమవుందో తెలుసుకోవాలి. ఈనాడు ఈ నినాదాలు నలువైపులా వినిపిస్తున్నాయి."

ఆ తర్వాత కొంతసేపు వాళ్ళంతా మౌనంగా వున్నారు. మరుక్షణం ఏదో జవాబు కోసరం ఎదురు చూస్తూ కేశవపిళ్ళై అన్నాడు: "నిశ్చయించి ఏదో చెప్పు."

నిజానికి ఆ నలుగురూ ఏమీ చెప్పలేని స్థితిలో నోటికి తాళం వేసుకుని నిలబడ్డారు. ఎవరూ ఏమీ మాట్లాడటం లేదు. వాళ్ళకు తెలివితేటలు లేవు, శక్తి సామర్థ్యాలూ లేవు. కాని సెక్రటరీ ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ. ఏదో చెప్పాలి.

'ఏం చెప్పమంటారు?' అన్నాడు మాత్యూ.

వినీ విననట్టు, విన్నా అర్థం కానట్టు కేశవపిళ్ళై అడిగాడు: "ఏమిటీ?"

వాళ్ళు నలుగురూ ఉలిక్కి పడ్డారు. వాళ్ళు మాయాజాలంలో చిక్కున్నారు. వాళ్ళు చెప్పింది చేస్తారు. స్వబుద్ధితో ఏమీ చెయ్యలేరు. కేశవపిళ్ళై వ్యక్తిత్వం అలాంటిది. ఇతరులచేత ఏ పనయినా చేయించే ధైర్యం అతనిలో వుంది.

కొన్ని సంవత్సరాల క్రితం కేశవపిళ్ళై అభివృద్ధి శాఖకు సెక్రటరీ అయ్యాడు. ఎక్కువ కాలం కాలేదు. ప్రభుత్వపు అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన ప్రకటనవల్ల ఏమీ ప్రయోజనం లేకపోయిందని చెప్పేందుకు వీల్లేదు. ముఖ్యంగా విద్యావిషయిక సంస్కరణల్లో ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రభుత్వం అజమాయిషీ క్రింద పెట్టినందువల్ల ప్రాంతీయ కాంగ్రెసులో పెద్ద చీలిక యేర్పడ్డది. ఈ కాంగ్రెసులో చాలా శాఖలు ఏర్పడ్డాయి. అంతకు ముందునుంచే అభ్యుదయ శాఖ పేరిట కాంగ్రెసులో ఒక శాఖ చాలా వుత్సాహంతో పని చేస్తూవుంది. విద్యా సంస్కరణలు కాంగ్రెసు కిందికి రావటంవల్ల వాళ్ళుకూడా ఆ సంస్థను వదిలి శ్రామిక వర్గంలో చేరారు. వాళ్ళు శ్రామికులను కూడగట్ట సాగారు. ఈ విధంగా కాంగ్రెసులో శైథిల్యం వచ్చింది. ప్రభుత్వం ఈ అవకాశాన్ని ఊరికే పోనియ్యలేదు. చాలా సంవత్సరాల నుంచీ

సచివాలయంలో దుమ్ము, బూజు, చెదలూ పట్టిన పాత ఫైళ్ళను కేశవపిళ్ళై బయటికి లాగించాడు. మిస్టర్ ఫిలిప్‌తో సహా చాలా మంది సెక్రటరీలు ఈ విషయంలో కేశవపిళ్ళైను విరోధించారు. కానీ ఎవరి మాటా నెగ్గలేదు. కేశవపిళ్ళై ఏమి రాసినా సరే భక్తివిలాన్ దాన్ని ఉన్నదున్నట్టుగా ఆమోదిస్తుంది. కేశవపిళ్ళై రిపోర్టును పురస్కరించుకొనే రామచంద్రన్ నాయరుతో పాటు మరి నలుగురిని 'సస్పెండు' చేశారని అందరూ అంటారు. ఆ తర్వాత అందరికీ భయం వేసింది. కొన్ని నెలల తర్వాత జల విద్యుత్ ప్రణాళిక కార్యక్రమం ఆరంభమయింది. అంతేకాక ఒక ఎరువుల కర్మాగారంతోపాటు రెండు మూడు వ్యాపార సంస్థలు కూడా నిర్మింప బడ్డాయి. ఈ కార్యక్రమాల నన్నింటినీ కేశవపిళ్ళై చక్కగా నిర్వహించగలిగాడు.

కాంగ్రెసు వాళ్ళు కేశవపిళ్ళైను ఎదిరించి అతని మీద ఏవేవో నేరాలు ఆపాదించారు. ఫెర్టిలైజర్ ఫ్యాక్టరీలో పెద్దవాటా కేశవపిళ్ళై భార్యది. దానికతనేమీ డబ్బు ఖర్చు పెట్టలేదు. మిషన్లు సప్లై చేసే కంపెనీ కమీషను క్రింద యీ వాటా యిచ్చారు. రబ్బరు కర్మాగారంలో అతని బావకు వాటా వుంది. నాంచినాట్టులో పొలం కొనేందుకు డబ్బు ఎక్కడి నుంచి వచ్చిందని కేశవపిళ్ళైను సవాలు చేస్తున్నారు. పారిశ్రామీకరణం కోసరం పిలిపించిన యంత్రకారుల కార్య కౌశలాన్ని గురించి, వాళ్ళు ఇంతవరకు జీవితంలో చేసిన పనులను గురించి అడగాలి. చాలామంది అవినీతిపరులని వాళ్ళంటారు. జల విద్యుత్ ప్రణాళిక ఫలించదట. దాని కోసరం ఖర్చు పెట్టే డబ్బంతా నిరర్థకమని వాళ్ళ వాదం. నీటి సరఫరా కోసరం నిర్మించిన కార్యాలయాలు కూడా దండగేట. సంగ్రహంగా చెప్పాలంటే కాంగ్రెసువాళ్ళు అన్ని కార్యక్రమాలనూ ఖండించారు. కాని ఏదో కొంత పని జరుగుతున్నదని ప్రజలు అనుకుంటున్నారు.

అప్పుడా ప్రాంతమంతా తిరిగి, కేశవపిళ్ళైకూ, అతని బంధువులకూ ఉన్న ఆస్తిని తనిఖీ చేయించి విచారణ జరిపిస్తానని వాగ్దానం చేసి, యీనాడు కేశవపిళ్ళై యెదుట నిలబడ్డ కాంగ్రెసు కమిటీ సభ్యుడు మాత్యూ. మాత్యూ ఒకే ఒక ప్రతిజ్ఞ చేశాడు. కేశవపిళ్ళై అవినీతిని అందరిముందు బట్టబయలు చెయ్యటమే ఆ ప్రతిజ్ఞ. మాత్యూకు ఏకైక శత్రువు. మాత్యూ కంటే కేశవపిళ్ళై సమర్థుడయిన వ్యక్తి అని దీవాన్‌జీకి తెలుసు. కేశవపిళ్ళై యోగ్యతను ఆయన కూలంకషంగా పరీక్షించారు.

ఇప్పుడు కాంగ్రెసు బాగా దెబ్బ తిన్నది. దీర్ఘకాలపు సమ్మెల చరిత్రలో చాలామంది అనేక కష్టనష్టాలకు గురి అయ్యారు. దాన్ని సమితి అనే కంటె అనేకుల సంస్థ అనటం భావ్యం. రాష్ట్ర మంతటా చాలా కాలంనుంచీ ప్రదర్శనల రహితంగా శిథిలంగా వున్న ఆ సంస్థలో చాలా సంఘటనలు జరిగాయి. ఆదాయ వ్యయాలకు సంబంధించిన సరియైన లెక్కలు కాంగ్రెసు

దగ్గరలేవు. అందరూ చందా పోగు చేశారు. నాయకుల నాటా యెక్కువ. జండా పట్టుకునే వాళ్ళకు తక్కువ. సంస్థ కోసరం కూడా చాలా సొమ్ము ఖర్చయివుంటుంది. కార్యకర్తల్లో చాలామంది జీవితంలో అన్నీ వదిలేసి ఆదర్శాల కోసరం పాకులాడిన వాళ్ళే. వాళ్ళు సర్వస్వం పోగొట్టుకున్నారు. అలాంటి వాళ్ళు పనిచేస్తే మరి తినేందుకు కూడా ఏమన్నా వుండాలి కదా! ఈ విధంగా చందాలో కొంత భాగం వాళ్ళు తినేశారు. కొంతమంది డబ్బు పోగు చేసుకున్నారు కూడా. కాని దీనికంతా లెక్కయేమీ లేదు. మొదటి నుంచీ అంతే.

ఎన్నికల చందాలను గురించి చాలా నేరాలు వచ్చాయి. ఒకానొక నాయకుడు ఇల్లు కట్టించుకున్నాడు. మరో నాయకుడు పొలం కొనుక్కున్నాడు. మరో వ్యక్తి తన కుమారుణ్ణి సీమలో చదువుకునేందుకు పంపించాడు. ఎన్నికల తర్వాత వర్కింగ్ కమిటీలో దీన్ని గురించి చర్చలు జరిగాయి. ఎన్నికల్లో ఓడిపోయిన వాళ్ళమీద చాలా నేరారోపణలు జరిగాయి. వాళ్ళకు చేసిందేమీ లేదు. వార్తా పత్రికల్లో దూషణలు ఆరంభమయ్యాయి. ఇది అవమానకరమయిన విషయం. కాంగ్రెసు చందాలను గురించి దేశమంతటా ప్రచారం జరిగింది. ఎవరి మీదా ఎవరికీ నమ్మకం కుదరటం లేదు. ఖద్దరు బట్టలు కట్టుకుని తిరిగేవాళ్ళను చూసి అందరూ పరిహాసం చేస్తున్నారు. జీవనోపాధి లేక చందా పోగుచేసుకుంటున్న వ్యక్తి కాంగ్రెసు సభ్యుడనే ప్రతీతి ఏర్పడింది. ఈ పరిస్థితి కాంగ్రెసులో కొంత మందిని ఇరుకులో పెట్టింది. అలాంటి వాళ్ళల్లో ఒకడు మాత్యూ.

మాత్యూ మంచి ధనవంతుల కుటుంబానికి చెందిన వాడు. మంచి కుటుంబంలోనే అతనికి వివాహం కూడా అయింది. మొదటి నుంచీ అతను కాంగ్రెసులో ముఖ్యమైన కార్యకరత్త. చాలాకాలం వర్కింగ్ కమిటీలో సభ్యుడిగా వున్నాడు. భార్య తరఫున బంధువుల్లో ఎవరికీ మాత్యూ కాంగ్రెసులో ప్రవేశించడం ఇష్టం లేదు. వాళ్ళల్లో చాలామంది కేరళ దేశం బయట ప్రభుత్వోద్యోగులుగా వున్నారు. మరికొందరు ఆంగ్లేయుల కార్యాలయాల్లో పెద్ద పెద్ద జీతాలు తీసుకుంటూ వున్నారు. ఆయన భార్యకు కూడా ఆయన జాతీయ కార్యకలాపాలంటే ఇష్టం లేదు. కాని దేశభక్తుడు అవన్నీ పట్టించుకో లేదు. అతను చాలా పర్యాయాలు జైలుకు కూడా వెళ్ళాడు. దుండగాలను సహించగల శక్తి అతనిలో అంతాయింతా కాదు. మాత్యూ కథ ఆ సమ్మెల చరిత్ర నియమోల్లంఘన చేసి పట్టుబడకుండా దాగి వున్నందువల్ల ఆయన డబ్బంతా జప్తు చేశారు. మాత్యూ పేరు వింటే అందరికీ ఆనందం కలిగేది. ఆయన్ని గురించిన కథలు ప్రజల్లో దేశభక్తి గాధలుగా వ్యాపించాయి.

చాలా రోజులు కారాగారంలో వుండి మాత్యూ బయటికి వచ్చాడు. అప్పుడు అతని ఆరోగ్యం అంత బాగాలేదు. ఆయన భార్య, పిల్లలతో పుట్టింటికి వెళ్ళి

వుంది. ఉన్నదంతా ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది. భార్య పుట్టింటి వాళ్ళు ఆమెను పనికిరాని భర్త దగ్గరకు పంపించేందుకు ఇష్టపడటం లేదు. ఆమె నతను ఎక్కడికి తీసుకెళతాడు? మళ్ళీ అతను జైలుకు ఎప్పుడు వెళతాడో అతని భార్యకూ తెలియదు, అతనికీ తెలియదు. అతని బావమరుదులూ, మామా అందరూ ఒకే అభిప్రాయంలో వున్నారు. భార్యను ఏలుకోవాలని గట్టిగా నిర్ణయించుకుని, దానికి తగిన సామర్థ్యం అతనిలో వస్తేనేగాని అన్నమ్మను పంపించకూడదని వాళ్ళ నిర్ణయం. నిజమేమరి. అతను వాళ్ళ మాట కాదనలేడు. ఎక్కడ వుంటాడో, ఎక్కడ తింటాడో, ఎప్పుడు ఏమవుతుందో అతనికే తెలియదు. ఉదయం బయటికి వెళితే మళ్ళీ ఎన్ని నెలలకో సంవత్సరాలకో తిరిగి రావటం. ఈ సంగతి మాత్యూకు తెలిసిపోయింది. అందువల్ల అతను ఎవరినీ ఏమీ అనలేదు.

ముందు చూపువల్ల లాభంలేదు. ఏం చెయ్యగలడు? స్వతంత్రుడే. కాని అతనిలో పెద్ద అనుమానం వుంది. అటూ యిటూ చూడకుండా జాతీయ సమరంలో ఆవేశంతో పురోగమించేప్పుడు మధ్యమధ్య హఠాత్తుగా అతని మనస్సు మసకలు కమ్ముతూ వుంటుంది. అన్నమ్మ అనురాగవతి. చెప్పిన మాట వింటుంది. కాని ఆమెకు కూడా ఏమో చెప్పాలని వుంది. నిజమేమరి. పాపం! ఆమెను వదిలి అనుకుని అతను వెళ్ళి పోయినాడు. కానీ ఆపదలో చిక్కుకున్నాడు. పోలీసులు అతన్ని బోర్లపడేసి ప్రతి అవయవం మీదా కొట్టారు. ఎందుకు? కాంగ్రెసు అధ్యక్షుడు దొంగ అని అతని చేత చెప్పించేందుకు. కాని అతనా మాట చెప్పలేదు. మళ్ళీ పోలీసులు తనను అలా చేస్తే అన్నమ్మ తనను వదిలి పెట్టినట్టుగానే తాను కూడా తన నాయకుణ్ణి వదిలిపెట్ట వచ్చు. అలాంటి అవకాశం వుందేమో అని మాత్యూకు అనుమానం వేసింది. ఈ అనుమానం క్రమంగా భయంగా పరిణమించింది. అతనికి ఆత్మ విశ్వాసం తగ్గింది. అన్నమ్మ కంటతడి పెట్టుకున్న దృశ్యం అతను గుర్తుచేసుకున్నాడు. పిల్లలు తన దగ్గరికి రాలేదు. అది కూడా గుర్తుకు వచ్చింది. కానీ, అతను బలహీనుడు కాడు.

మాత్యూ మొండివాడు. కావాలని మొండితనాన్ని అలవరుచుకున్నాడు. అతని మొండితనం అన్ని హద్దులనూ దాటి ఎల్లలు లేని స్థితికి వచ్చింది. తన భవిష్యత్తు కోసరం అతనేమీ చేసుకోలేక పోయాడు. కాంగ్రెస్‌కోసం ఏమయినా చేసేందుకు అతను సిద్ధంగా వున్నాడు. ఒక విధంగా ఇది అతనికి పట్టిన పిచ్చి. తాను ఇలా చేస్తున్నానని అతనికి ఏమాత్రం దిగులు పడేందుకు కూడా అతను సిద్ధంగా లేడు. ఆ మొండితనం పోతే అతను బలహీనుడై పోతాడు.

ఈ విధంగా ఎన్నికల సమయంలోనూ, ఆ తర్వాతనూ అతను తుఫానులాగా పని చేశాడు. అతని వుపన్యాసాలు వినేందుకు వేలకొలదీ మంది ప్రతి

గ్రామంలో పోగయ్యేవాళ్ళు. మాత్యూ అన్నీ చెపుతాడు. కలుపుగా మాట్లాడతాడు. ఆ విధంగా కేశవపిళ్ళై అతనికి శత్రువయినాడు. అంతకంటె వేరే విరోధమేమీ లేదు. ఉద్యోగ ప్రపంచంలో అతనికి తెలిసింది ఒక్క కేశవపిళ్ళై మాత్రమే. కేశవ పిళ్ళైకూ, కాంగ్రెసుకూ ఏ మాత్రం పడదు.

ఎన్నికల తరవాత చందా వసూలు చేసేవాళ్ళు వస్తే వాళ్ళు సొమ్ము అపహరించారని నేరారోపణ జరగటం మొదలయింది. మాత్యూ తప్పు చేసిన వాళ్ళను పిలిపించి, విచారణజరిపాడు. అందువల్ల అతన్ని గురించి తీవ్రమయిన విమర్శలు బయలుదేరటం సహజమే. రాజ్యం కోసరం తన సర్వస్వం అర్పించిన వాడు, సమ్మెల ద్వారా సొమ్ము చేసుకునే వాళ్ళనూ, భార్యా బిడ్డల కోసరం గడ్డితినే వాళ్ళనూ ఊరికే వదిలిపెడతాడా? మాత్యూ మంచి ప్రతిభాశాలి. పట్టుదలకల వ్యక్తి. అందరూ దొంగలే అన్నట్టు అతనికి తోచింది.

మాత్యూ తన పదవికి రాజీనామా యిచ్చాడు. ఆ రోజుల్లో మాత్యూ కేశవపిళ్ళైను ఒకసారి కలుసుకున్నాడు. కొన్ని నెలల తర్వాత మాత్యూ ప్రభుత్వపు జలవిద్యుత్ ప్రణాళిక కింద కంట్రాక్టరుగా పని చేశాడు.

ఆ తర్వాత అతను పోగొట్టుకున్న ఆస్తిపాస్తులతో పాటు కావలసిన డబ్బు సంపాదించుకునేందుకు అతనికి ఎక్కువ కాలం పట్టలేదు. అన్నమ్మా, పిల్లలూ మళ్ళీ అతన్ని చేరుకున్నారు.

ఆల్వా రహదారి బంగళాలో ఒకగదిలో సెక్రటరీ కేశవపిళ్ళై కొంతమందితో కూర్చోమనకుండా నిలబెట్టే మాట్లాడుతున్నాడు. వాళ్ళల్లో మాత్యూతోపాటు వెనకటి కాంగ్రెసు కార్యకర్తలు కూడా వున్నారు. వాళ్ళు కూడా ప్రాంతీయ కాంగ్రెసు సమ్మెలో పాల్గొన్నారు. వాళ్ళు మంచి ధనవంతులూ, పలుకుబడిగల వాళ్ళూ. ఈనాడు కూడా వాళ్ళు చేసిన త్యాగాన్ని గురించి ప్రజలు చెప్పుకుంటూన్నారు. వాళ్ళల్లో ఒకడు నారాయణన్ నాయర్. రెండవవాడు లూకోస్. జైల్లో వున్నప్పుడు నానా దెబ్బలూ తిని అతను క్షయరోగి అయ్యాడు. నయం చేయించేవాళ్ళు కూడా ఎవ్వరూ లేరు. మూడో వ్యక్తి గోపీనాథ్. ముసలి తల్లిదండ్రుల కోసరం అతను కాంగ్రెసును వదిలేశాడు. అతని తమ్ముడు పోలీసు కాల్పుల్లో మరణించాడు.

కేశవపిళ్ళై ప్రశ్నలకు నివ్వెర పోతున్న ఆ వ్యక్తులు ఇదివరకు కాంగ్రెసులో పనిచేసిన వాళ్ళే. తమ గడచిన చరిత్ర తలుచుకుంటే వాళ్ళకే ఆశ్చర్యం వేస్తుంది కానీ వాళ్ళు ఒకరాగాన ఏమాత్రం భయపడే మనుషులు కాదు. ఆశ్చర్యపడేవాళ్ళు కూడా కాదు. భయమంటే యేమిటో కూడా వాళ్ళకు తెలియదు. వాళ్ళు ఎంతెంత సాహస కృత్యాలో చేశారు.

ఇది ఎలా సాధ్యమయింది? బహుశా వాళ్ళు జీవితంలో సుఖమంటే ఏమిటో అనుభవించి వుంటారు. తర్వాత కష్టంలోని కాఠిన్యం తెలిసి

వుంటుంది. కష్టం అంత కటువుగా వుంటుందనే విషయం ఆరంభంలో బహుశా తెలిసివుండదు. ఈనాడు వాళ్ళ దగ్గర డబ్బు వుంది, పొలం వుంది, స్థలం వుంది. ఇవన్నీ వాళ్ళకు కావాలి. వాళ్ళ శక్తి క్షీణించి పోయి వుంటుంది. ఆ నలుగురూ కేశవపిళ్ళె మాట కాదనలేరు. అతనికి వాళ్ళు ఋణపడి వున్నారు.

కానీ, కేశవపిళ్ళె చెప్పిందంతా కళ్ళు మూసుకుని చేద్దామని వాళ్ళకు లేదు. ఇప్పుడు-వాళ్ళు నిరాకరిస్తున్నది ఒకానొక ఆదర్శాన్ని. ఒకప్పుడు వాళ్ళు మంచి ఆదర్శం కోసరం జీవితాన్ని త్యజించారు. ఇప్పుడు వాళ్ళు కాంగ్రెసుతో సంబంధం వదులు కున్నారు. కాని వాళ్ళు ఏ ఆదర్శం కోసరం కాంగ్రెసులో ప్రవేశించారో అది చాలా గొప్పదికదా. డబ్బు వున్నప్పుడు రెండు చేతులతో కాంగ్రెసుకు డబ్బిచ్చారు. ఇప్పుడు గాంధీని ఎదుర్కోనాలిట. అది వాళ్ళకు చేతగాదు.

భారత దేశానికి స్వాతంత్ర్యం రావటం ఖాయం. ఇంగ్లీషువాళ్ళు వెళ్ళిపోతారు. దానికికావలసిన రాతకోతలన్నీ ముగిసి పోయినాయి. భారత దేశంలోని మిగిలిన ప్రాంతాలతో సంబంధం లేకుండా తిరువితాంకూరు ప్రత్యేకమైన రాష్ట్రం కావాలి. ఆ విషయాన్ని బలపరిచేందుకు కేశవపిళ్ళె వాళ్ళ అంగీకారం కోరుతున్నాడు.

మాత్యూ మధనపడుతున్నాడు. ఆ విషయం కేశవపిళ్ళెకు తెలుసు. "ఏదో ఒక నిర్ణయానికి రావాలి" అన్నాడతను.

ఈ ప్రశ్నను గురించి చర్చించేందుకు ఎవ్వరూ సిద్ధంగా లేరు. అందుకు కారణం చర్చించేందుకు వాళ్ళకు సరియైన మాటలు దొరకకపోవటం, లేదా చర్చించే శక్తి క్షీణించటం, లేదా చర్చించటానికి మనస్కరించకపోవటం.

"ప్రజలు మమ్మల్ని వదిలి పెట్టరు" అన్నాడు మాత్యూ.

ఉన్నట్టుండి కేశవపిళ్ళె అన్నాడు: "అయితే మీరు తిరువితాంకూరు పై ప్రేమను అలవరుచుకోలేదన్నమాట. ఈ పాపానికి ఫలితం మీరనుభవించవలసిందే."

ఒక్కక్షణం ఆగి అతను మళ్ళీ అన్నాడు:

"ఇది చాలా ముఖ్యమైన విషయానికి నాంది. మామూలు విషయం కాదు. జీవితంలో అంత భద్రత కూడా వుండదు. ఎవరో నన్ను కనిపెట్టి వెన్నంటుతున్నారని నాకు తెలుసు. అతనెవరో నాకు తెలియదు. అతని వుద్దేశ్యమేమిటో కూడా నాకు తెలియదు. ఎవరో కాంగ్రెసు వాడో? కమ్యూనిస్టు వాడో? ఇవన్నీ ఎదుర్కొనేందుకు మనం సిద్ధంగా వుండాలి. సమృద్ధిగల యీ చిన్న రాజ్యం స్వతంత్రంగా వుంటే ఎలా వుంటుందో మీరు కొంచెం ఆలోచించండి! మీరెందుకు అలా ఆలోచించరు? మన పని మనం చేసుకునే శక్తి మనలో లేదా? ఈ ప్రపంచంలో మన రాజ్యం లాంటి చిన్న స్వతంత్ర

రాజ్యం మరొకటి వుందా? ఇక్కడ అన్నీ వున్నాయి. అంతా మనదే. కలకాలంగా ప్రజలను కన్నబిడ్డల వలె పోషించి పరిపాలించే రాజవంశం మనది. వాళ్ళ జీవితం ఎంత నిరాడంబరమైనది? వాళ్ళు తమ కోసరం ఖర్చు పెట్టుకొనేదేమీ లేదు. చెప్పవలసిందేమీ లేదు. ఈ రాజవంశం కలకాలం వర్ధిల్లాలి. మన రాజ్యాన్నీ, రాజునూ మనం ప్రేమించాలి.

మాత్యూ, అతని స్నేహితులూ కచ్చితంగా ఏమీ చెప్పలేక పోయినారు.

మధ్యలో, చురుకయిన లూకోస్ అన్నాడు: "మీరు చెప్పిందంతా అక్షరాలా నిజం. ఏ విషయమయినా అదేముందిలే అని వదలకూడదు. కాని ఉన్నట్టుండి యీ మాట వింటుంటే మెరుపు మెరిసి నట్టుంది."

కేశవపిళ్ళై సమాధానం చెప్పాడు: "అవును, నిజమే. ఎవరికయినా అలాగే అనిపిస్తుంది. అన్నిటి కంటె ముందు విచారించవలసిన విషయం - తిరువితాంకూరును పరమాధికార రాష్ట్రంగా రూపొందించటం."

"నిజానికి స్వాతంత్ర్యమంటే ఏమిటో, మనం అర్థం చేసుకోవాలి. స్వాతంత్ర్యాన్ని గురించి కాంగ్రెసు వాళ్ళూ, కమ్యూనిస్టువాళ్ళూ ఏమేమో చెపుతూ వుంటారు. ఈ రోజు మీరు ఉలిక్కి పడుతున్నారు. కానీ తర్వాత బాగా ఆలోచించి చూస్తే స్వతంత్ర తిరువితాంకూర్ అంటే ఏమిటో దేశభక్తులకు మాత్రం బోధపడుతుంది. ముందు మన యింటిని ప్రేమించాలి కదా!" అన్నాడు కేశవపిళ్ళై.

ఆ ప్రశ్న కేశవపిళ్ళై సాభిప్రాయంగా అడిగాడు. ఒక్క క్షణం అతను వాళ్ళ ముఖవైఖరిని జాగ్రత్తగా గమనించాడు. ఆ తర్వాత అతనన్నాడు: "మన యిల్లంటే మన తిరువితాంకూరు. మన రాజ్యం."

మాట్లాడకుండా నిలబడివున్న నారాయణ్ నాయరును కేశవపిళ్ళై అడిగాడు: "మాట్లాడకుండా నిలబడ్డావేం?"

"రాజ్యంలో ఇంతవరకూ కనీవినీ ఎరుగని తిరుగుబాటు బయలుదేరుతుంది." అన్నాడు నారాయణ్ నాయరు అప్రయత్నంగా.

చిరునవ్వుతో కేశవపిళ్ళై సమాధానం చెప్పాడు: "అదేం ఫరవాలేదు. దాన్ని ఎదుర్కొనే శక్తి యీ ప్రభుత్వానికి వుంది. అణచి వేస్తుంది. ఏ విధమయిన సానుభూతీ చూపించదు. విరోధించేవాడు తిరువితాంకూరులో జీవించలేడు. అలాంటివాడు సహ్యాద్రి దాటి వెళతాడు. అతను రాజ్యంలో పనికిరాడు. తిరువితాంకూరు సంతానంలో అతను చేరడు."

కొన్ని క్షణాలు ఆగి అతను మళ్ళీ అన్నాడు : "కానీ అలా ఎన్నటికీ జరగదు. ప్రజలకు మెదడుంది. వాళ్ళకు తెలివితేటలున్నాయి. ఇప్పుడు కాంగ్రెసు, వాళ్ళను అరణ్యంలో వదిలి వేసింది. వాళ్ళకు సరయిన మార్గం, వెలుగూ దొరికితే చాలు. ప్రజలను గురించి ప్రభుత్వానికేమీ భయం లేదు.

మొదట, వాళ్ళు కూడా మీలాగే భయపడతారు. దాని వల్ల ఏమీ కాదు. దాన్ని ఎదుర్కొని తీరాలి."

విరోధాన్ని ఎలా ఎదుర్కోనాలో ఆలోచిస్తున్నట్లుగా కొంతసేపు మౌనంగా వున్న తర్వాత కేశవపిళ్ళె అన్నాడు: "పున్నప్రాలో, వయలార్లో చాలా మంది చనిపోయారు. అలాగే యిక్కడ కూడా చాలా మంది తుపాకి గుండ్లకు గురికాక తప్పదు. అయితే అవుతారు. మంచి పని కోసరం యిలాంటి బలి అవసరమే."

ఆ తర్వాత ఒక గంటవరకూ కేశవపిళ్ళె మాట్లాడాడు. స్వతంత్ర తిరువితాంకూరును ఆ నలుగురూ సమర్థిస్తారని అతను నిరీక్షిస్తున్నాడు. ఆ రోజు వాళ్ళు తిరిగి వెళ్ళటం లేదు. ఆ రాత్రి వాళ్ళు ఏదో ఆలోచించుకోవాలి. మర్నాడు ఉదయం భవిష్యత్తును గురించి బాగా ఆలోచించుకున్న తర్వాత ప్రతిజ్ఞా పత్రం మీద సంతకాలు పెడితే సరిపోతుంది. ఆ ఒప్పందంతోటి వాళ్ళు ఆ గదిలోకి వెళ్ళారు.

వాళ్ళ జీవితంలో ఇలాంటి పరిస్థితి అంతకు ముందు రాలేదు. స్వతంత్ర తిరువితాంకూరు! నారాయణ నాయరూ, గోపీ ఆ విషయాన్ని ఊహించలేక పోయినారు. తిరువితాంకూరు భారతదేశంతో సంబంధం లేకుండా ఒక సర్వతంత్ర స్వతంత్రమైన రాష్ట్రంగా ఎలా రూపొందగలదో అది యెలా వుంటుందో వాళ్ళకు బోధపడలేదు.

మాత్యూకు ఇందులోని అభిప్రాయం తెలిసిపోయింది. తిరువితాంకూరుకు సరిహద్దులు ఏర్పడతాయి. బయటి వాళ్ళు అక్రమణ చెయ్యకుండా సైన్యాన్ని ఏర్పాటు చేస్తారు. వైమానిక దళం, నావికా దళం ఏర్పడతాయి. మన ప్రతినిధులను విదేశాలకు పంపిస్తారు. ఇలా వుంటుంది స్వతంత్ర తిరువితాంకూరు. బహుశా మద్రాసుతో మనకు యుద్ధం రావచ్చు. 'అసలిదేమిటో ఎందుకర్థం చేసుకోరు?' అని అడిగాడతను.

లూకోస్ మరో అభిప్రాయం వ్యక్త పరిచాడు : "తిరువితాంకూరు స్వతంత్రమైతే తప్పేముంది?"

లూకోస్ ఆలోచిస్తున్నాడు. కాని మాత్యూ అంత దూరం వెళ్ళలేక పోతున్నాడు. తప్పేమిటి. భారతదేశమంతా ఒకటి. తిరువితాంకూరు సమగ్ర భారత దేశంలో ఒక భాగం. ప్రత్యేకంగా నిలబడితే పురోగమనం ఎలా సాధ్యమవుతుంది? "గాంధీజీని కాదని ఎలా అనగలం?" అన్నాడతను.

నారాయణ నాయరు ఆవేశపూరితుడై అన్నాడు: "నావల్ల కాదు. జీవితంలో మొదటి నుంచీ చెపుతున్న మాట. ఊపిరి లాంటి ఊహ. గతిలేక యిలా అయిపోయాం. మనం క్షంతవ్యులం. ప్రజలు మనల్ని క్షమిస్తున్నారు. వీల్లేదు. నేను మాత్రం అలా చెయ్యలేను."

గోపికూడా అదేమాట అన్నాడు

"అప్పుడే అక్కడ నేను చెప్పుదామనుకున్నాను. నా వల్ల కాదిది. భారతీయునిగా జన్మించాను. భారతీయునిగానే మరణిస్తాను."

లూకోస్ ఆ నిర్ణయంలో వుండే లోపాలను గురించి చెప్పాడు: "వాడు మనల్ని ముక్కలు ముక్కలు చేస్తాడు. మనమీదనే వాడి పగంతా."

ఈ విషయంలో మాత్యూకూ ఏమీ సందేహం లేదు. ఈ విషయం అతను స్పష్టంగా చెప్పాడు. అతనేమీ దాచలేదు. సర్వనాశనం చేసేందుకు అతనేమీ జంకడు

కొంచెంసేపు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. నిముషాలు బరువుగా గడిచిపోతున్నాయి. లూకోస్ మళ్ళీ ఆరంభించాడు: "మాత్యూకు కొంత పొలం, కొన్ని యిండ్లూ వున్నాయి. నాకున్నదంతా సున్నం, ఇటుకలూ. తూరుపు కొండల్లో పడి వున్నాయి."

"పొలం మాత్రం జప్తు చేయకుండా వుంటారా? ఎదిరిస్తే మనకు దక్కేదేమీ లేదు." అన్నాడు మాత్యూ.

నారాయణ నాయరు ఏదో నిర్ణయానికి వచ్చినట్టున్నాడు. "ఒకప్పుడు నాకో కుటుంబం వుండేది. అది నశించటం నేను చూశాను. అనుభవించాను. ఆ తర్వాత మరో కుటుంబం ఏర్పరుచుకుంటూ వస్తున్నాను. అది కూడా పోతే అది నాకు కొత్తగా ఏమీ వుండదు."

గోపీ కూడా దాదాపు అలాంటి నిర్ణయానికే వచ్చినట్టుంది. చిన్న పిల్లవాడు చనిపోయిన దుఃఖాన్ని వాళ్ళ తల్లిదండ్రులు అనుభవించారు. పెద్దవాడి మరణం కూడా వాళ్ళు చూస్తారు.

"నా తమ్ముడు దీన్ని సహించడు" అన్నాడతను.

లూకోస్ ఈ సమస్యను అన్ని దృక్కోణాలతో ఆలోచిస్తూ అడిగాడు: " ఈ స్వతంత్ర తిరువితాంకూరు ఏర్పడుతుందంటావా, మాత్యూ?"

"నాకు సందేహమే. ప్రజలు దీనికొప్పు కోరు" అన్నాడు మాత్యూ.

"మరి?"

"రాజ్యంలో గలభా జరుగుతుంది. చాలామంది చనిపోతారు."

లూకోస్‌కు ఒక ఉపాయం తట్టింది.

"అయితే మరి సరేనని చెప్పి తప్పుకుంటే? నష్టం లేదు. ఇబ్బంది లేదు. చివరకు అయ్యేదీ పెట్టేది ఏమీ లేదు. యుక్తి బాగుందా?"

"అదే యుక్తి" అన్నాడు మాత్యూ అసలు విషయం గమనించకుండానే.

లూకోస్ తన అభిప్రాయం చెప్పాడు: "ఈ తగాదాలకూ, అల్లర్లకూ మనం దూరంగా వుండటం మంచిది. దేన్నీ ఆత్టే పట్టించుకోవద్దు. అలా వుండాలని ధైర్యంగా వుంటేచాలు. ఏమంటావ్ నారాయణ నాయర్?"

నారాయణ నాయరు ఆ ప్రశ్న విన్నట్టు లేదు. గోపీ కూడా సమాధానం చెప్పలేదు. "ప్రతిజ్ఞాపత్రం మీద సంతకం పెట్టి మాట్లాడకుండా వుంటే ఎలా?" అని అడిగాడు లూకోస్.

మాత్యూ దీనికి సూటిగా సమాధానం చెప్పలేదు. ఉదయం అతన్ని కలుసుకున్నప్పుడు ప్రతిజ్ఞా పత్రం మీద సంతకం పెట్టటం మాత్రం ఖాయం. నాతో చదువుకున్న యీ చవట యింత వాడెలా అయినాడు అనేదే ఆశ్చర్యం. ఇంతకు ముందుకూడా నాకు తెలుసు. అతనిలో ఏదో గొప్ప శక్తి వుంది. అతన్ని ఎదిరించటం మనవల్ల కాదు."

గోపీ ఖచ్చితంగా చెప్పాడు: "నేను రేపు ఉదయం అతన్ని కలుసుకోను."

నారాయణ నాయరు కూడా అన్నాడు: "నేను అన్నింటినీ వదులుకున్నాను. నేను కూడా కలుసుకోను".

లూకోస్ ముందు హెచ్చరిక చేశాడు : "రేపు ఉదయం అతను మనల్ని మసి చేసేస్తాడు. అదంతా నిర్ణయించుకునే అతను మన దగ్గరకి వచ్చి వుంటాడు."

నారాయణ నాయరూ, గోపీ ఒక నిశ్చయానికి వచ్చారు. ముందు జరగబోయే వాటిని గురించి వాళ్ళకేమీ అనుమానం లేదు.

కలిసి మెలిసి కాలక్షేపం చేస్తున్నవాళ్ళు విడిపోయే సమయం సమీపించింది. వాళ్ళంతా ఒకేసారి కాంగ్రెసు నుంచి వేరయినారు. ఈనాటివరకు వాళ్ళు కలిసి పని చేస్తూ వచ్చారు. అడవిలో కలప కొట్టించటం నుంచి అన్ని పనులూ ఉమ్మడిగా చేస్తున్నారు. వేరువేరుగా పుట్టినా కలిసి మెలిసి వుంటున్నారు. ఎక్కడ చూసినా నలుగురూ ఒక చోటనే కనిపించే వాళ్ళు. ఈ రోజు వాళ్ళకు ఎడబాటు రాబోతూ వుంది.

లూకోస్ ఆ మాట బాహాటంగా అన్నాడు: "అయితే మనం లెక్కలు చూసుకుందాం."

మాత్యూ ఒక సలహా యిచ్చాడు: "ఆగు, ఆలోచించుకునేందుకు కొంత సమయమడిగితే?"

ఇంతలో ఏదో గదిలో నుంచి గర్జన చేస్తున్న ధ్వని వినిపించింది. వాళ్ళు బయటికి వచ్చారు. అన్ని గదుల్లో వాళ్ళూ బయటికి వచ్చి దీపం వెలిగించారు. చౌకీదారు లేచి పరుగెత్తుతున్నాడు.

కేశవపిళ్ళె గదిలో నుంచి గర్జన ధ్వని వినిపించింది.

కేశవపిళ్ళె నిద్రపోలేదు. తాగుతూ వున్నాడు. తెరిచివున్న కిటికీ దగ్గర ఎవరో నిలబడి వున్నట్టు అతని కనిపించింది. "ఎవరక్కడ?" అతను బిగ్గరగా కేక వేశాడు. ఆ ధ్వని అందరికీ వినిపించింది.

ఆయనకేదో కల వచ్చిందని ముందు అందరూ అనుకున్నారు. కానీ ఒక గదిలో ఉన్నాయన, ఎవరో ఒక మనిషి గోడదూకి వెళుతుంటే తను

చూశానన్నాడు. చప్పుడు విని అతనే ముందు బయటికి వచ్చాడు. అదే నిజమైతే ఎవరో కిటికీ దగ్గరకి తప్పకుండా వచ్చి వుంటారు. ఎవడో దొంగ వచ్చివుంటాడని మరి కొందరన్నారు.

ఏది ఏలావున్నా కేశవపిళ్ళై మాత్రం గది లోపల కదలకుండా నిలబడి వున్నాడు.

గదిలోకి తిరిగి వచ్చిన తర్వాత గోపీ అన్నాడు: "ఒకప్పుడు కాంగ్రెసులోనే ఒక తెగవాళ్ళు అతన్ని చంపాలని అనుకున్నారు గదా?"

ఎలాగో అధ్యక్షుడికి ఈ విషయం తెలిసి వారించాడు.

"పోనీ, నేనెక్కడినే చంపేస్తే ఎలా ఉంటుందని నేను కూడా అనుకున్నాను." అన్నాడు మాత్యూ.

"ఈనాడు కూడా ఎవరో కనిపెట్టి వుండి వుంటారు. అదే జరిగివుంటే మనం తప్పించుకునే వాళ్ళం" అన్నాడు లూకోస్.

"అది యెలా సాధ్యమవుతుంది? అతను పోయినా ప్రభుత్వం ఎక్కడికి పోతుంది?" అన్నాడు నారాయణ నాయర్.

"అది కాదోయ్. ఇతను కాలాంతకుడు. ఇంకెవరయినా మనం తప్పించుకోవచ్చు."

## ఇరవై ఒకటి

భారతదేశ విభజనను గురించి బ్రిటీష్ ప్రధాన మంత్రి ప్రకటన చేశారు. దానితో పాటు ఆంగ్లేయులు భారతదేశాన్ని వదలిపెట్టి వెళ్ళే తేదీ కూడా నిశ్చయమయింది. స్వతంత్ర తిరువితాంకూరు పేరిట ఒక సంస్థ ఏర్పడ్డ తర్వాత ప్రాంతీయ కాంగ్రెసులో నూతన చైతన్యం వచ్చింది. అంతవరకూ వాళ్ళకేమీ పనిలేకుండా వుంది. ప్రజలు దొంగతనం లాంటి దుండగాలను అన్నింటినీ మరిచిపోయినారు. దేశమంతా మేలుకున్నది. కఠిన ప్రతిక్రియ కోసరం ఊరేగింపులు ఆరంభమయ్యాయి.

పెద్ద ఎత్తున ఊరేగింపులూ, సమ్మెలూ పట్టణాల్లో, జిల్లాల్లో, రాజధానిలోనే కాక చిన్న చిన్న పల్లెల్లో కూడా ఆరంభమయినాయి. వికాసశాఖ మంత్రి మళ్ళీ రాజకీయ శాఖను పర్యవేక్షించవలసి వచ్చింది.

కొట్టాయంలో ఊరేగింపుకు నాయకత్వం వహించింది నారాయణ నాయరు. జల విద్యుత్ ప్రణాళికలో పని చేసే కొందరు ఆ వూరేగింపు మీద రాళ్ళు రువ్వారు. పోలీసు సాయంతోనే వాళ్ళు రువ్వారు. అలా రాళ్ళు వేసిన వాళ్ళలో చాలామందిని నారాయణ నాయరు గుర్తు పట్టాడు. వాళ్ళు లూకోస్ దగ్గర పని చేస్తారు. నారాయణ నాయర్ని చూసి వాళ్ళు దాక్కున్నారు. మాత్యూవి నాలుగు లారీలు కొంచెం దూరంలో నిలబడి వున్నాయి. ఆ లారీల్లోనే వీళ్ళంతా వచ్చారు. కొల్లంలో జరిగిన ఒక సమావేశంలో గోపీ వుపన్యసించాడు. అక్కడ పట్టు బట్టల వర్తకులకు సంబంధించిన వ్యక్తులు

కొంతమంది మేళతాళాలతో, రాళ్ళ వర్షాలతో ఆ సమావేశాన్ని చెడగొట్టారు. తగాదా వచ్చే లక్షణాలు కనిపించాయి. సమావేశంలో పాల్గొంటున్న ప్రజల్లో ఆవేశం చెలరేగింది. కొంచెం దూరంలో తుపాకులు పేల్చేందుకు పోలీసులు సిద్ధంగా నిలబడి వున్నారు. గోపీ వుపన్యాసం సాగుతూవుంది. ప్రజలకు నచ్చ చెప్పటంలో గోపీ కృతకృత్యుడయినాడు.

దేశమంతటా రాళ్ళ వర్షం, సమావేశాలను చెడగొట్టటం కొనసాగుతూ వుంది. కొన్ని చోట్ల తగాదాలు వచ్చాయి. లాఠీ ఛార్జీలు సాగాయి. ఒకటి రెండు చోట్ల కాల్పులు కూడా అయినాయి. చాలామంది చని పోయినారు.

ఈ విధంగా నారాయణ నాయరూ, గోపీ రణ రంగంలో ప్రవేశించారు. వాళ్ళ జీవితంలో ఏర్పడ్డ కళంకం మాసి పోయింది. ఈనాడు వాళ్ళు వీరయోధులు.

అనుకున్నట్టే అయింది. జలవిద్యుత్ ప్రణాళికను నిర్వహించే బాధ్యత గోపీ వహించాడు. మరి కొన్ని బాధ్యతలను కూడా అతను అంగీకరించాడు. పారిశ్రామిక యాజమాన్యంలోని కొన్ని లోపాలను సూచిస్తూ ప్రభుత్వం గోపీకి నోటీసు జారీ చేసింది. సమరభూమిలో దూకిన గోపీ దాన్ని నిరాకరించాడు. తన మూడు వేల రూపాయలు జప్తయినట్టు అతను ఖాయం చేసుకున్నాడు. కార్మికులకూ, మరికొంత మందికీ యిండ్లు కట్టించేందుకూ, ఆనకట్టలో కొంత భాగానికి నారాయణ నాయరు కంట్రాక్టు తీసుకున్నాడు. నారాయణ నాయరుకు కూడా నోటీసు వచ్చింది. నారాయణ నాయరు ఒక సివిల్ కేసుకు తయారవుతున్నాడు.

దేశమంతా శాంతించింది. ఆ పరిస్థితిలో ఇక్కడ సమ్మె జరిగింది. తిరువితాంకూరులో ఇలా సమస్య బయలుదేరుతుందని ఎవరూ అనుకోలేదు. మహారాజా పరిపూర్ణ పరిపాలన కింద బాధ్యతాయుత ప్రభుత్వం ప్రాంతీయ కాంగ్రెసును గురించి ఏదో దురాలోచన చేస్తున్నదని ఎవ్వరికీ తెలియదు. ఉన్నట్టుండి దేశంలో ఉపద్రవం చెలరేగింది.

కాంగ్రెసు సమరంలో పాల్గొన్న వేలకొలదీ సైనికుల యిండ్లలో కొన్ని సంవత్సరాలనుంచీ శాంతి నెలకొన్నది. తండ్రీ కొడుకులు, భార్యా భర్తలు, తల్లీ పిల్లలు కలిసి వుండటం వల్ల కొంచెం హాయిగా వుంది. చాలా చోట్ల ఆర్థిక వైషమ్యం ప్రబలింది. నిత్య జీవితంలో అష్టకష్టాలను అనుభవిస్తున్న కాపురాలు కూడా లేక పోలేదు. కాని ఖద్దరు మీద గౌరవం పెరిగింది.

ఇప్పుడు మళ్ళీ వేలకొలది కుటుంబాలు చెల్లాచెదరయ్యాయి. ఇల్లు వదిలి వెళ్ళిన భర్త, కుమారుడు, అన్నదమ్ములు, తండ్రి తిరిగి ఎప్పుడు వస్తారో తెలియదు. వాళ్ళిక రాకపోవటం కూడా జరగవచ్చు. ఎందుకంటే ప్రభుత్వం కాల్పులు జరిపించటానికి ఎదురు చూస్తూ వుంటుంది. లాఠీఛార్జీ మానేసి కాల్పులు జరిపించమని ఉత్తర్వు అయింది. అటో యిటో తేల్చుకొనే

పోరాటమిది. కాల్పుల్లో తప్పించుకున్నా జైలుకు వెళ్ళిన తర్వాత క్షేమంగా తిరిగి రావటం కష్టం. ప్రభుత్వం గట్టిగా పూనుకుంది.

ఈనాడు అన్నమ్మకు ఇల్లుంది. మంచి యిల్లు, కావలసినన్ని వస్తువులు, డబ్బు, కారు, బంధువులు అందరూ వున్నారు.

పిల్లలు చదువుకుంటున్నారు. ఉల్లాసంగా ఉత్సాహంతో కాలక్షేపం చేస్తున్నారు. అన్నమ్మకూ, మాత్యూకూ భవిష్యత్తును గురించి రకరకాల ఆలోచనలున్నాయి. దినదినానికీ వాళ్ళ కుటుంబం వృద్ధి పొందుతూ వుంది. మాత్యూ వల్ల కాంగ్రెసుకు చాలా డబ్బు వస్తూవుంది. స్వతంత్ర తిరువితాంకూరు ఆ కుటుంబాన్నీ పిల్లలనూ ఆశ్చర్యంలో ముంచి వేసింది.

ఆళ్వా బంగళాలో ప్రతిజ్ఞా పత్రం మీద మాత్యూ మరమనిషిలా సంతకం చేశాడు., నారాయణ నాయరూ, గోపీ తెల్లవారక ముందే వెళ్ళిపోయినారు. వాళ్ళను వెంబడించమని మాత్యూకు ఉత్తర్వు లభించింది. లూకోస్ అతన్ని పట్టుకున్నాడు. కుటుంబమనే దౌర్బల్యాన్ని అతను స్పృశించాడు. కాంగ్రెసు పేరిట డబ్బు సంపాయించి దాన్ని జీవనోపాధిగా అంగీకరించిన వాళ్ళ జాబితా అతని ముందు పెట్టాడు. స్వాతంత్ర్యమనే గొప్ప ఆదర్శం కోసరం వాళ్ళు తమ యౌవనాన్ని అంకితం చేశారు. కుటుంబాన్ని కష్టాల పాలు చేశారు. వాళ్ళ ఆదర్శం ఫలిస్తుంది. దేశసేవ అంటే కేవలం జెండా పట్టుకొని కేకలు వెయ్యటం కాదు.- ధన సేవ కూడా ఘన సేవే. డబ్బు పోగు చేసుకున్న తర్వాతనే కాంగ్రెసులో సభ్యుడుగా చేరటం సాధ్యమవుతుంది. కుటుంబ బాధ్యతను కాలదన్నటం న్యాయమా? అది యెలా కాదనగలం? స్వతంత్ర తిరువితాంకూరును నాశనం చేసేందుకు కూడా డబ్బు కావాలి కదా? అలా ఆలోచనలు సాగాయి. ఇంతవరకూ సంపాయించింది ఉపేక్షిస్తే కుటుంబ పరిస్థితి ఏమవుతుంది? అన్నమ్మ తన పాత యింట్లో తలదాచుకుంది. ఇప్పుడు కూడా అన్నమ్మ అక్కడికే వెళుతుందా? మాత్యూ పిల్లలకు అది స్వంత యిల్లయింది. అంతేకాదు, తన వదినె తనను ఇంట్లో అడుగు పెట్టనిస్తుందో, లేదో? మాత్యూ తెలివి తెల్లవారింది. ఇవన్నీ నిరాకరిస్తూ ఏమేమో చెప్పాలని అతనికుంది. కానీ యేం చెప్పాలో అతనికి తోచటం లేదు. ప్రతి మాటకూ అతను ఎదురు చెప్పాలి - పిల్లలకు సంబంధించిన విషయాల్లోనూ, భార్యకు సంబంధించిన విషయాల్లోనూ.

లూకోస్, కేశవపిళ్ళె చూస్తుండగానే మాత్యూని పట్టుకు వెళ్ళాడు. మాత్యూ ఒళ్ళు తెలియకుండా నిలబడి వుండటం కేశవపిళ్ళె చూశాడు. మాత్యూ ఎందుకు తికమక పడుతున్నాడో తనకు తెలుసునని కేశవపిళ్ళె అన్నాడు. ఆదర్శం కోసరం పాకులాడే వాడు మాత్యూ. వ్యావహారికమైన ఆదర్శంలో అతను ప్రవేశించాడు. ఈ ప్రతిజ్ఞా పత్రం మీద సంతకం పెట్టటమంటే వ్యావహారిక ఆదర్శాన్ని అర్థం చేసుకోవటం అని కూడా అతనన్నాడు.

మాత్యూకు ఏమీ అర్థం కాలేదు. అతను సంతకం చేసేశాడు. అతని చేతులు వణికిపోతూ వున్నాయి.

అలసి సొలసి మౌనంగా ఒళ్ళు తెలియని పరిస్థితిలో మాత్యూ ఇల్లు చేరుకున్నాడు. ఏదో ముంచుకు పోయినట్లు ఉన్నాడు. అన్నమ్మ, పిల్లలు ఆశ్చర్యపోయినారు. ఇల్లంతా అశాంతి పాలయింది. అతనేదో ఆలోచిస్తున్నట్లుగా, ఏదో గుర్తు చేసుకుంటున్నట్లుగా వున్నాడు. భార్య చాలా గట్టిగా అడిగిన మీదట 'నన్ను వేధించకు' అని మాత్రం అన్నాడు. పిల్లల్ని చూస్తే అతని కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. చివరకు రెండుమూడు రోజుల్లో దీవాన్‌జీ 'స్వతంత్ర తిరువితాంకూరు'ను ప్రకటించారు. దానికి సమ్మతించిన వాళ్ళ జాబితాలో మాత్యూ పేరు కూడా వుంది.

ఆ రోజు మాత్యూ మనస్సు చాలా వికలంగా వుంది. త్వరలో ప్రసవించబోయే చిరుతపులిలాగా అతను అన్నమ్మ మీదికి విరుచుకు పడ్డాడు. అతని కోపమంతా అన్నమ్మ మీదనే. ఆమే అతన్ని నాశనం చేసింది. ఆమె అతని జీవితంలో శాపం లాంటిది. అన్నమ్మను అతను పెళ్ళి చేసుకున్న నాటినుంచి అతని జీవితం ఇలా తయారయింది. అది పాము పిల్ల - ఇలా ఏ ఆడకూతురూ కూడా ఏ పరిస్థితిలోనూ ఎంత మాత్రమూ సహించలేని మాటలు మాత్యూ నోట వచ్చాయి. అన్నమ్మ ఏమీ అనలేక కన్నీరు కారుస్తూ వుంది.

ఆ కాపురంలో అంతకు ముందు ఇంతకు మించిన పరీక్షా సమయం అనేక పర్యాయాలు వచ్చింది. ఇంతకు మించిన మాటలు అనవలసిన పరిస్థితులేర్పడ్డాయి. జైలు నుంచి వచ్చి మాత్యూ అన్నమ్మను పిలిస్తే 'వచ్చేందుకు వీల్లేద'ని ఆమె అతని మొహం మీద చెప్పింది. అప్పుడు మాత్యూకు కోపం రాలేదు. 'వచ్చేందుకు వీల్లేద'నటానికి మాటకు కారణమేమిటో అతనికి తెలుసు. అన్నమ్మ ఆ మాట అన్నప్పుడు, అతను ఓర్పుతో విన్నాడు.

కోపం ఉడిగిన తర్వాత మాత్యూ ఏడ్చాడు. వెక్కివెక్కి యేడ్చాడు. అన్నమ్మ అతన్ని ఓదార్చింది.

అప్పటికి చాలా రోజుల క్రితం ... పెళ్ళయి ఎక్కువ సంవత్సరాలవలేదు. ఒక పిల్లవాడు పుట్టాడు. దాంపత్య జీవితంలోని మాధుర్యం బాగా అనుభవించవలసిన సమయం. తిరువనంతపురంలో సైన్సు కాలేజీ విద్యార్థులను పోలీసులు వెంటబడి కొట్టారని ఉదయం పత్రికల్లో వార్త వచ్చింది. తిరువితాంకూరు ప్రాంతీయ కాంగ్రెసు అప్పటికి ఏర్పడలేదు. ఆరోజు అన్నమ్మకు ఈనాటికి కూడా జ్ఞాపకం వుంది. మాత్యూ కాఫీ తాగుతున్నాడు. ఇంతలో పేపరు వచ్చింది. ఆ రోజు టిఫిను రొట్టె, గుడ్డు. రొట్టె పూర్తిగా తినను కూడా లేదు. వార్త వినగానే కాఫీ తాగి 'నేను

తిరువనంతపురం వెళుతున్నాను' అని చెప్పి అతను వెళ్ళి పోయాడు. అన్నమ్మ అది యింతవరకూ వస్తుందని అనుకోలేదు. కష్టపు రోజులు ఆరంభమవుతున్నాయనే విషయం ఆమె ఊహించలేక పోయింది. ఈ పరుగు జైలుకు దారి తీస్తుందని ఆమె అనుకోలేదు. ఆ తర్వాత ఆమే పడరాని పాట్లు పడింది. ఆడకూతురు తన భర్తను గురించి నానామాటలూ వినవలసి వచ్చింది. చుట్టాలూ, పక్కాలూ అతన్ని దూషించారు.

ఈరోజు మళ్ళీ అలాంటి పరిస్థితే వచ్చిందని అనుకుంది అన్నమ్మ. అంతకు మించిన పరిస్థితి ఏర్పడ వచ్చు. ఈ రోజు వెళితే మళ్ళీ తిరిగి రాక పోవచ్చు.

కానీ అన్నమ్మ ఇప్పుడు ఆనాటి యువతికాదు. చదువుకున్నది. అనుభవం వచ్చింది. భర్తను బలవంతం చేసి ఆపగలదు. ఎప్పుడు ఎలా ప్రవర్తించాలో ఆమెకు తెలుసు. భర్తను సరియైన దారిలో నడిపించేందుకు ఆమెకు పిల్లలు సాయం చేస్తారు. మాత్యూ కూడా మారిపోయినాడు. వెనకటిలాగా సగం రొట్టె తిని మిగిలినది నములుతూ వెళ్ళే వ్యక్తి కాదు. వేలకొలదీ సంకెళ్ళు అతన్ని బంధించి వున్నాయి.

ఆ విధంగా అన్నమ్మ మాత్యూని పట్టుకుని వుంది. రోజులు గడిచే కొద్దీ ఆ యిల్లాలికి ఇక్కట్లు తగ్గుతున్నాయి. స్వతంత్ర తిరువితాంకూరు సమ్మెలో ప్రత్యక్షంగా పాల్గొనకుండా వుండేందుకు ఆమె అనేక విధాల నచ్చ చెపుతూ వుంది. అంతకు ముందు లూకోస్ చెప్పిందే. మాత్యూ బయటికి వెళ్ళటం లేదు. మాత్యూని ఎవ్వరూ ఎదుటబడి ఏమీ అనలేకపోతున్నారు. మాత్యూలాంటి వాళ్ళను గురించి కాంగ్రెసు వాళ్ళు సామాన్యంగా అనుకునే మాటలే; అంతే.

నారాయణ నాయరుకూ, గోపీకి ప్రభుత్వం నోటీసు పంపింది. ఆ వార్త విని లూకోస్, మాత్యూ దగ్గరికి వచ్చాడు. ఇది చాలా గంభీరమైన విషయం.

మళ్ళీ వాళ్ళు లెక్కలు సరి చూసుకున్నప్పటికీ వాళ్ళిద్దరినీ వదులుకునేందుకు మాత్యూకూ, లూకోస్‌కూ మనసొప్పలేదు.

మాత్యూకు కొత్త విషయం ఎదురయింది. ఇది అతనికి చాలా ఓదార్పు కలిగించింది. తమకు ఇష్టమయిన ఆదర్శం కోసరం సర్వస్వం సమర్పించేందుకు సిద్ధమయిన ఆ యిద్దరు స్నేహితులకు సాయం చేయటమే అతని పని. ఇదంతా సేవ కిందనే లెక్క అని అతని అంతరాత్మ ఉపదేశం చేసింది. మాత్యూ ఉద్రేకంతో అడిగాడు: "నన్నేం చెయ్యమంటావ్, లూకోస్? ఏం చెయ్యమన్నా చేస్తాను. లూకోస్! నీవేం చెపితే అది చేస్తాను. ఏం చెయ్యటానికయినా నేను సిద్ధంగా వున్నాను. చెప్పు లూకోస్! నాకేమీ బోధపడటం లేదు. నాకు మనశ్శాంతి కావాలి."

లూకోస్ చిరునవ్వు చిందిస్తూ అన్నాడు: "మరి నేనెందుకు వచ్చాననుకుంటున్నావ్? మనశ్శాంతి కోసరమే నేనూ వచ్చాను. మనం చేసిన పని మంచిదని నాకనిపించటం లేదు. అంతరాత్మ చెప్పిన మాట మనం వినలేదు. వాళ్ళిద్దరూ దాన్ని అనుసరించారు. మనం వాళ్ళ కోరికలను తీర్చాలి. అది మన కర్తవ్యం."

"మరి దానికి మార్గమేమిటి? ఏమయినా ఆలోచించావా లూకోస్?" అడిగాడు మాత్యూ.

లూకోస్ ఏదో ఆలోచించాడు. ప్రభుత్వపు భోగట్టాను బట్టి నారాయణ నాయరూ, గోపీ తమ పేరిట కంట్రాక్టు తీసుకున్నారు. మాత్యూ, లూకోస్ పేరిట వున్న పనికూడా నారాయణ నాయర్, గోపీ దగ్గరనే వుంది. "ఆ పని మనమే చేసి పూర్తి లాభం, ఖర్చు వాళ్ళకు ముట్టజెప్పాలి." అన్నాడు మాత్యూ. "అదేమంత కష్టం కాదు." అన్నాడు లూకోస్.

"కాని అదంత పెద్ద మొత్తం కాదు. బహు కొద్ది."

"మరి మనమేం చెయ్యాలి" అని అడిగాడు మాత్యూ.

లూకోస్ ఆ మార్గాన్ని కూడా ఆలోచించాడు. నోటీసు ప్రకారం చెయ్యవలసిన పని అయిపోయింది. ప్రభుత్వం పగతీర్చుకునేందుకు నోటీసు పంపింది. ఈ సందర్భంలో మాత్యూ, లూకోస్ కలిసి చేసిన పనిని మళ్ళీ చెయ్యాలి. ఆ తర్వాత పూర్తి మొత్తం అడిగి తీసుకోవాలి. నారాయణ నాయరుకూ, గోపీకి వాళ్ళ లాభం, వాళ్ళ ఖర్చు వాళ్ళకే యిచ్చెయ్యాలి. ఇదీ లూకోస్ ఆలోచించిన మార్గం. అది మాత్యూకు నచ్చింది. "అలా చేస్తే ఎలా వుంటుంది?" అన్నాడు మాత్యూ వుత్సాహంతో.

"ఏమీ కంగారు లేదు. అందరికీ కొంత సొమ్ము ముడుతుంది. లాభసాటిగా వుంటుంది. వాళ్ళు హాయిగా బతుకుతారు."

మాత్యూ సమ్మతించాడు. అయితే అలాగే చెయ్యాలి. సొమ్ము ఖర్చు పెట్టేందుకు మాత్యూ సిద్ధంగా వున్నాడు. లూకోస్ ఉపదేశించాడు: "ఇలా సగం విని సగం వినకుండా ముందుకు రాకు. సాధక బాధకాలన్నీ చూసుకోవాలి. ఇదేం మామూలు విషయం కాదు."

మాత్యూ గమనించాడు. లూకోస్ మళ్ళీ ఆరంభించాడు: "నారాయణ నాయరూ, గోపీ చేసే పనులు కాక మనం చేసే పనికి రికార్డూ, లెక్కా వుండాలి. నిజానికి వాళ్ళ పనినే మనం చేస్తున్నాం. అలా అయితేనే ఇంజనీర్ల సహాయం లభిస్తుంది. ప్రభుత్వం కళ్ళు కూడా మూసెయ్యాలి. అవన్నీ ఆలోచించుకోవాలి."

మాత్యూ ఉద్రేకం కొంచెం తగ్గింది. మనస్సు పని చెయ్యసాగింది. "మేస్త్రీ నుంచి సూపర్వైజరు దాకా అందరికీ పుష్కలంగా ముట్టజెప్పాలి." అన్నాడతను.

"అది సరే, ఆ పని మనం చెయ్యవచ్చు. ఎట్టిచాకిరీ కదా యిది? కానీ ప్రభుత్వం అందరినీ కాపాడాలి. అతను!"

"మనవుద్దేశ్యం తెలుసుకుంటే కేశవపిళ్ళై మనల్ని మని చేసేస్తాడు. ఇప్పుడు నాయరు మీద, గోపీ మీద వున్నంత ఆక్రోశం అతనికి మరెవ్వరి మీదా లేదు." అన్నాడు మాత్యూ.

లూకోస్ ఈ అంతరాయాన్ని కూడా దాటేసేందుకు ఉపాయం ఆలోచించి పెట్టాడు. ఇది లాభసాటి మార్గమని మాత్యూ, లూకోస్ అతని దగ్గరికి వెళ్ళి చెప్పాలి. నాయరును, గోపీని నాశనం చేసే ఆలోచన లాగానే మాత్యూకు, లూకోస్‌కు మంచి చెయ్యాలని కూడా అతనికి వుంది. కావాలంటే కొద్ది పాటి లంచంకూడా ఇవ్వచ్చు. అదేమంత కష్టంకాదు. లూకోస్ అన్నాడు:

"పి.డబ్లియూ.డి సెక్రటరీ ఫిలిప్. అతను కేశవపిళ్ళైకు పరమ శత్రువు. కేశవపిళ్ళైను ఎలా పడగొట్టాలి, ఎలా చిక్కులో పడవెయ్యాలి, అని ఫిలిప్ ఆలోచిస్తున్నాడు. అసలతను మనసులో కాంగ్రెసువాడు. అతనివల్ల యీ సహాయం లభిస్తే నారాయణ నాయరుకూ, గోపీకి లాభకరంగా వుంటుందని తెలిస్తే అతను సాయం చేస్తాడు. కానీ మనం మోసగాండ్లమని, అతనికి మనమంటే గిట్టదు."

ఈ విషయం మాత్యూకు తెలుసు. ఇందులో చాలా గొడవవుంది. ఏదో విధంగా యీ పని సాధించాలని మాత్యూకు గట్టి కోరిక వుంది. ప్రస్తుతం అతను బయటికి వెళ్ళేందుకు వీల్లేదు. బయటికి వెళ్ళి తాను ఏపనయినా చెయ్యగలననే ధైర్యం, సామర్ధ్యం, చాకచక్యం, నమ్మకం అతనికి లేదు. అతనంతా లూకోసుకు అప్పగించాడు. గోపీ, నాయర్ల కుటుంబ కార్యకలాపాలను నిర్విఘ్నంగా జరిపించే బాధ్యత అతను తనమీద వేసుకున్నాడు.

నిజానికి మాత్యూకు ఇది చాలా బలం చేకూర్చింది. ఇప్పటికి ఇంత మాత్రం చెయ్యగలిగాడు. రాజ్యం కోసరం సిద్ధమైన ఇద్దరు వ్యక్తుల కోసరం అతను ఏదో కొంత చెయ్యగలుగుతున్నాడు.

స్వతంత్ర తిరువితాంకూరును సమర్ధిస్తూ, విరోధిస్తూ సమ్మెలు తీవ్రంగా సాగుతూ వున్నాయి. ఈ పరిస్థితుల్లో ప్రభుత్వపు అభివృద్ధి కార్యక్రమం కొంచెం మందగించింది. కానీ మళ్ళీ త్వరలోనే పనులు ఆరంభమయ్యాయి.

లూకోస్ - గోపీ, నారాయణ నాయరుల కోసరం ప్రయత్నం చేస్తున్నాడు. ఇంతలో గోపీ, నారాయణ నాయరూ జైలుకి వెళ్ళారు. మాత్యూ మాత్యూ కొండమీదికి వెళ్ళాల్సి వచ్చింది. అక్కడ సమ్మె అంత తీవ్రంగా లేదు. చెయ్యాల్సిన పని చాలా వుంది. బయటి ప్రపంచంతో అతనికి ఎక్కువ సంబంధం లేదు. మాత్యూకు మనశ్శాంతిగా వుంది. అన్నమ్మ, పిల్లలు తన దగ్గరే వున్నారు.

ఎక్కువ ఆలస్యం చేయకుండానే లూకోస్ తిరిగి వచ్చాడు. పని కొంచెం సానుకూలమయిందనే తృప్తితో తిరిగి వచ్చాడు. అతను చెప్పదగిన గొప్పవార్త తీసుకు వచ్చాడు. అదేమిటంటే - 'స్వతంత్ర తిరువితాంకూరు ఏర్పడ పోవడం లేదు' - అని.

ఈ వార్త మాత్యూకు చాలా సంతోషకరంగా వుంది. అది ఎలా జరిగింది? ఆ విషయం అతనికి ఎలా తెలిసింది? అన్నీ వివరంగా అతను తెలుసుకోవాలి.

లూకోస్ వివరంగా చెప్పాడు: "దేశంలో ఎవ్వరికీ స్వతంత్ర తిరువితాంకూరు అవసరం లేదు. యన్.యన్.యస్., యస్.యన్.డి.పి. మొదట అన్ని విధాలా సర్వనాశనం చేసి "రాష్ట్రీయం కాద"ని నినాదాలు లేవదీసి ప్రభుత్వంతో చేతులు కలిపి నిలబడ్డారు కదా? వాళ్ళంతా యీనాడు ఎదురు తిరిగారు. కొంతమంది రేషను వాళ్ళూ, మన లాంటి కంట్రాక్టర్లూ "స్వతంత్ర తిరువితాంకూరుకూ జయ్" అని కేకలు పెడుతూ రూకలు పోగు చేసుకుంటున్నారు. వాళ్ళ మనసుల్లో కూడా వేరే భావాలున్నాయి. అందరూ మనలాగే వున్నారు. కాని మనం సరియైన దారిలో వెళ్ళలేము. నేను పగలు బయటికి వెళ్ళేవాణ్ణి కాను. సిగ్గు వల్లనే కాదు. ఒక్కొక్కప్పుడు ప్రజలు పిచ్చికుక్కల్లాగా చావ గొట్టేందుకు పైకి దూకుతారు"

లూకోస్ తన అనుభవాలను గురించి చెప్పాడు: ఒకచోట పిల్లలు తనని అల్లరిచేసి తరిమేశారట. తనని వాళ్ళెలా గుర్తు పట్టారో తెలియదు. మరోచోట వెంటబడి గేలిచేశారు. ఒక హొటల్లో భోజనం లేదని వెళ్ళ గొట్టారు. తనతోపాటు హొటల్లో ప్రవేశించిన వాళ్ళకు భోజనం పెట్టారు".

లూకోస్ ఒక రహస్య వార్త చెప్పాడు: "కాంగ్రెసులో ఉన్నత పదవుల్లో ఉన్నవాళ్ళకెవరికీ మనతో విరోధం లేదు. కానీ మిగిలిన వాళ్ళు మనల్ని వదలరు. పట్టుబడితే గుక్కలో నమిలి మింగేస్తారు. నాయకులు అలా కాదు. వాళ్ళు కూడా తప్పించుకోలేక పట్టుబడ్డారు. అందరికీ ఏదో ఒక వ్యాసంగముంది. అది మరొకరి పేరిట వుంది".

మాత్యూకు చాలా విషయాలు తెలుసు కోవాలని వుంది. ఒక్కొక్కరిని గురించీ పేరు పేరు వరుసన కుతూహలంతో అతనడిగాడు. లూకోస్ అంతా వివరంగా చెప్పాడు. నిజానికి మాత్యూకు నెత్తిమీద బరువు తగ్గినట్టుంది అతని మనస్సు కుదుటపడింది. ఆరోజు మాత్యూ బాగా నవ్వగలిగాడు. "చెప్పు లూకోస్. జరిగిందంతా చెప్పు". అడిగాడు మాత్యూ.

అది చాలా పెద్దకథ: లూకోస్ కేశవపిళ్ళను కలుసుకున్నాడు. ఇంతలో అతనిలో ఎంత మార్పో వచ్చింది. అతనిలో వచ్చిన మార్పును చూసి తెలుసుకోవలసిందే కాని చెప్పటం కష్టమని లూకోస్ అంటాడు. అతని ముఖం రాక్షసుని ముఖంలా చూడగానే తెలిసిపోతుంది. అతను ఏం చేసేందుకు కూడా సందేహించడు. ఎవరిని ఏ సమయంలోనైనా ఏమి

చేసేందుకయినా అతను సిద్ధమే. హృదయం, మానవత్వం, స్నేహం అనేవి అతనిలో ఏ మాత్రం కనిపించవు. అతను గట్టి నిర్ణయం చేసుకున్నాడు. దీవాన్‌జీ కూడా అంత కఠోరంగా వుండరు.

లూకోన్ అన్నాడు: "అతను జిల్లా జడ్జిగాని, డి.యస్.పి. గాని, పోలీసు కమీషనరు గాని అయితే, పదిమంది ఒకచోట చేరితే కాల్పులు జరిపించమని తప్పకుండా ఉత్తర్వు చేస్తాడు. అతని సాహసం ముందు దీవాన్‌జీ ఎందుకూ పనికి రారనిపిస్తుంది".

"అయితే మరి స్వతంత్ర తిరువితాంకూరు జయప్రదమవుతుందని అతనికి నమ్మకముందా?" అడిగాడు మాత్యూ.

లూకోన్‌కు ఆ విషయం తెలియదు. ఇరవై నాలుగు గంటలూ కేశవపిళ్ళె ఊపిరి సలపకుండా పని చేస్తుంటాడు. దేశమంతటా జరిగే పనులన్నీ తనిఖీ చేస్తుంటాడు. స్వతంత్ర తిరువితాంకూరు నెరవేరుతుందనే నమ్మకం లేకుంటే యిలా పని చేస్తాడా?

లూకోన్ ఇంకా ఇలా అన్నాడు: "అతని యింటికి నలువైపులా పోలీసులున్నారు. తొంగి చూసేందుకు కూడా వీల్లేదు. గేటు దగ్గర పహరాదారు. గది వాకిలి దగ్గర పహరా. ఆ తర్వాత భద్రతా సిబ్బంది - ఇదీ పద్ధతి. అందరూ లోపలికి వెళ్ళేందుకు వీల్లేదు. పేరు చెప్పిన తర్వాత కూడా ఒక గంటసేపు ఆగాల్సి వచ్చింది. ఆ తర్వాత కూడా అక్కడవున్నవాళ్ళ చూపులు నాకు భయం కలిగించాయి. బాగా పరిశీలించికానీ చూసేందుకు వచ్చిన వాళ్ళను లోపలికి రానియ్యటంలేదని నాకు తోచింది. భక్తి విలాస్‌లో కూడా యింత కాపలా లేదు"

"ఆ రోజు ఆల్వా బంగళా కిటికీ నుంచి ఎవరో నక్కినక్కి చూశారు కదా! అలాగే ఎవరో అతన్ని చంపేందుకు చూస్తూ వుంటారు." అన్నాడు మాత్యూ.

ఆ సందేహం లూకోసుకు కూడా వుంది. అందరి దృష్టి కేశవపిళ్ళె మీదనే వుంది. ఎవరయినా చంపేస్తే పీడా వదిలి పోతుంది.

కేశవపిళ్ళె ఉద్దేశమేమయివుంటుందా అని మాత్యూ ఆలోచించాడు. స్వతంత్ర తిరువితాంకూరు వల్ల అతనికేం లాభం? దీవాన్‌జీ మెప్పు పొందేందుకా?

"ఈ దీవాన్‌జీ ఎన్నాళ్ళుంటాడు. ఈ లక్షణాలు చూస్తే దీవాన్‌జీ పరిస్థితి కూడా క్షేమకరంగా లేదు." అన్నాడు లూకోన్.

"ఆ విషయం తర్వాత ఆలోచిద్దాం" అన్నాడు మాత్యూ.

లూకోన్ తర్వాత కథ చెప్పసాగాడు.

"నేను ఎదురుగా వెళ్ళి చేతులు జోడించాను. అతని ముఖం చూస్తే భయం వేసింది. ఎంత క్రౌర్యం! పండ్లు బయటబెట్టి నవ్వాడు. నేను చెప్పవలసింది బాగా తయారు చేసుకుని వెళ్ళాను. మాకు నాలుగు డబ్బులు వచ్చేమార్గం.

పని సాగనిస్తే కొనసాగుతుంది. లాభముంటుందని చెప్పాను. అతని కళ్ళలో ప్రత్యేకమైన శక్తి వుంది. అతని తీక్షణమైన చూపుల్లో నాలోని రహస్యమంతా గమనించినట్టు కనిపిస్తూవుంది. నేను చెప్పవలసింది చెప్పిన తర్వాత గోపీ కోసం నాయరు కోసం నేను ఉపాయం ఆలోచించుకొని వచ్చానని అతని కర్థమయినట్టు నాకు నమ్మకం గలిగింది. అంతకు ముందు ఎన్నడూ ముఖం చూడని వాడితో మాట్లాడినట్టుగా అతను నా ముఖం వైపు చూసి "వీల్లేదు" అని ఒక్కమాటలో సమాధానం చెప్పాడు. కారణమేమీ చెప్పలేదు. కాని నేను వదల్లేదు. 'ఎందువల్ల?' అన్నాను. చివరకు నేను పర్సులో పెట్టుకొని వెళ్ళిన మూడు వేలరూపాయలు బయటికి తీసి బల్లమీద పెట్టాను. ఆ తర్వాత అతన్ని చూసి తీరాలి. మిస్త్రీ నుంచి సూపర్వైజరు వరకు నెలలో మనం ఎన్నిసార్లు ఇవ్వటం లేదు? అది వాళ్ళ హక్కు. పైకిమాత్రం 'అబ్బే, ఇదేమిటి? ఎందుకు? అక్కర్లేదు' అంటూవుంటారు. అంటూనే తీసుకుంటూ వుంటారు. ఆ తర్వాత 'లేదు, అందుకోసరం చెప్పలేదు' అని మనం అంటూ వుంటాం. కేశవపిళ్ళె ముఖ వైఖరిలో ఏమీ మార్పు కనిపించలేదు. ఒక్క అక్షరం కూడా అతను మాట్లాడలేదు. డబ్బు తీసుకుని డ్రాయరులో పెట్టుకున్నాడు. 'థాంక్సు' కూడా చెప్పలేదు. డబ్బు ఇచ్చినట్టు, తీసుకున్నట్టు ఏ భావమూ వ్యక్తపరచలేదు. స్వతంత్ర తిరువితాంకూరు కోసరం ఏం చేస్తున్నారని అడిగాడు. లారీల్లో జనాన్ని పంపించామన్న విషయం గ్రహించాడు. ఇంకా బాగా కృషి చెయ్యవలసిందని చెప్పాడు".

మధ్యలో మాత్యూ అడిగాడు: "డబ్బు తీసుకున్న తర్వాత కూడా ఆ విషయమేమీ చెప్పలేదా?"

"అరగంట మాట్లాడిన తర్వాత కూడా అతను ఏమీ చెప్ప లేదు. ఆ తర్వాత ఉన్నట్టుండి నాటకీయంగా 'నాకు పనుంది. మీరు వెళ్ళచ్చు' అన్నాడు ఆ తర్వాత మాట్లాడేందుకు నాకు భయమేసింది. అతను కూడా ఏమీ మాట్లాడ లేదు. మూడు వేల రూపాయలు బూడిదలో పోసినట్టు అయిపోయాయని నాకు బాధ కలిగింది. గుమ్మం దగ్గరకి వెళ్ళిన తర్వాత అతడన్నాడు: "ఇంజనీర్లతో అవినీతి పనులు చెయ్యవద్దు సరేనా?" అంతటితో నా మనస్సు కుదుట పడింది.

కథ సాంతం విన్న తర్వాత మాత్యూకు సందేహం కలిగింది: "డబ్బు తీసుకొని ఇంజనీర్ల మీద నేరం మోపి కృతఘ్నత చూపిస్తాడేమో?"

లూకోస్ సరిగ్గా చెప్పలేకుండా వున్నాడు ఆ రోజు అతని ప్రవర్తన చూస్తే అంతపనీ చేయ్యచ్చుననిపించింది. ఆ సొమ్ము మునిగిపోయినా పోవచ్చు. కానీ ఏదో మాట చెప్పాడు కదా అని ధైర్యం ఆ మాట కూడా చెప్పకుంటే?

లూకోస్ ఇప్పుడు చెయ్యవలసింది - ఫిలిప్సును పట్టుకోవటం. అతను అర్ధరాత్రివేళ ఒక కాంగ్రెసు నాయకుని యింటిలోకి దూరాడు. "ఎవరతను?" అడిగాడు మాత్యూ కుతూహలంగా.

"చెపుతాను. గాబరాపడకు. రెండు రోజులు అక్కడ దాక్కున్నాడు. రాత్రింబగళ్ళూ కాంగ్రెసు వాళ్ళు అక్కడికి వస్తూ పోతూ వుండేవాళ్ళు. నాలుగువైపులా సి.ఐ.డి. వాళ్ళు. ఎవరి కంటా పడకుండా ఆ రెండు రోజులూ కాపాడేందుకు మేం పడ్డ శ్రమ నాకు తెలుసు, ఆ భగవంతుడికి తెలుసు. నేను చాలా బాధ పడ్డాను. అతను నిన్ను గురించి అడిగాడు. మనం చేసిన సాయం తను మరిచిపోలేనని యెంతో వినయంగా చెప్పాడు. ఈ లోగా రెండు సార్లు ఫిలిప్సు దగ్గరికి వెళ్ళి చూశాను. అతనికి నేను ఉన్నదున్నట్టు నిజమంతా చెప్పాను. ఇది మంచి పని అని నాయకుడు అంగీకరించాడు. నాయరూ, గోపీ అంటే ఆయనకు చాలా గౌరవం. అతని కుటుంబం కోసరం, వాళ్ళ భావి భద్రత కోసరం ఎలాంటి అధర్మం చేసినా అది తప్పు కాదని ఆయన నమ్మకం. ఇందు కోసరం ఆయన ఏం చేసేందుకయినా సిద్ధమే. కాని ఒక నిర్ణయానికి వచ్చిన తర్వాత వెయ్యి రూపాయలు ఖర్చు తేలింది - సెక్రటరీ ఫిలిప్సుకు ఇచ్చేందుకు".

"మరి యిచ్చేశారా?" అడిగాడు మాత్యూ.

"ఇచ్చేశాం. ఇయ్యకపోతే పని ఎలా జరుగుతుంది? మూడు వేల రూపాయలు మునిగిపోయాయి. పని జరగద్దూమరి? నేను నేరుగా వెళ్ళేందుకు వీల్లేదు. నేను వెళ్ళితే ఫిలిప్సు గొడవ చేస్తాడు. అప్పుడిక పని సాగదు. మనం నీచులం, కుత్సితులం, విశ్వాస ఘాతకులం అని అతని అభిప్రాయం. ఏమయినా సరే తన చేతిలోవున్న పని తను చేస్తానని ఫిలిప్స్ చెప్పాడు. ఇక ఇంజనీర్లను లొంగదీసుకోవాలి". మాత్యూకు ఇది పెద్ద సమస్య అనిపించలేదు.

"కాదు కాదు" లూకోస్ అన్నాడు: "అలా అనకు. ఇందులో కొంత చిక్కుంది. కేశవపిళ్ళె, ఫిలిప్స్ వాళ్ళకు అడ్డురారని వాళ్ళకు నచ్చ చెప్పాలి. వాళ్ళు అడ్డుపుల్ల వేస్తే కథ అడ్డం తిరుగుతుంది".

ఆ నాయకుడెవరో తెలుసుకోవాలని వుంది మాత్యూకు.

"ఎందుకు నీకా విషయం?" అన్నాడు లూకోస్.

"నాకు తెలిస్తే ఏమవుతుంది?"

లూకోస్ ఆ నాయకుడి పేరు చెప్పాడు. మాత్యూ ముఖంలో రంగులు మారాయి. "అయితే మనం మోసపోయాం. ఫిలిప్స్ డబ్బు అడిగివుండడు. మన నాయకుడు ఇచ్చి కూడా వుండడు. ఆయన తన జేబులో వేసుకున్నాడు. ఎన్నికల కోసం పోగుచేసిన చందా డబ్బులు చటుక్కున

మింగేసిన మహానుభావుడు కదూ ఆయన? లెక్కాడొక్కా యేమీ వుండదు. అతను మొదటీ నుంచీ అంతే." అన్నాడు మాత్యూ.

"అయితే కానీ, మనక్కావలసింది మామిడి పండు తినటం. ముట్టెలు లెక్కపెట్టుకుంటే ఏం ఒరుగుతుంది?" అని సమాధానపరచాడు లూకోస్.

మాత్యూ మరో ప్రశ్న అడిగాడు: "ఫిలిప్స్‌కు మన విషయమంతా చెప్పినట్టు మనం నమ్మగలమా? ఆయన అతనితో ఈ విషయం చెప్పాడో లేదో?"

లూకోస్‌కు కూడా కొంచెం అనుమానం వేసింది. అయినా అతను నచ్చ చెప్పాడు: "అబ్బే! అలా వుండదు. అతను చెప్పివుంటాడు. పని అయిపోతుంది."

"అలా జరగకపోతే అందరి ముందూ నీవు అతన్ని చెంప దెబ్బ కొట్టగలవా?" అన్నాడు మాత్యూ.

"సందేహం లేదు. అతన్ని అలా వదిలిపెడతామా? కానీ మాత్యూ, అలా సందేహించకు. పని అయిపోతుంది" అన్నాడు లూకోస్ అణుమాత్రమైనా అపనమ్మకం లేకుండా.

మాత్యూకు మాత్రం అనుమానమే. అతను ఆ నాయకుడితో చాలా దగ్గరగా మసలిన వ్యక్తి.

లూకోస్ మనస్సులో మరో ఆలోచన కూడా వుంది. అలాచేసినా పని అవుతుంది - ఈ ప్రభుత్వం పడిపోతుంది. దానికి ఇంకెన్నాళ్ళో ఆయుష్షు లేదు. ఆ తర్వాత కాంగ్రెసు ప్రభుత్వం వస్తుంది. ఈ రోజు ఆనకట్టలు పడగొట్టి రికార్డుల్లోకి ఎక్కిస్తున్నారు. నిజానికి నాయరూ, గోపీ కలిసి సొంత ఖర్చుతో ఇవన్నీ తయారు చేశారు. కాంగ్రెసు నాయకులకు ఈ విషయం తెలుసు. ఈరోజు జరుగుతున్న అన్యాయానికి నష్టపరిహారం పొందేందుకు నాయరుకూ, గోపీకి అధికారం వుంది. వాళ్ళు నష్టపరిహారం అడగవచ్చు.

వినోద ప్రియుడైన మాత్యూకు ఈ విషయం బాగా నచ్చింది. ప్రభుత్వంలోకి వచ్చే మంత్రులు వాళ్ళను తప్పకుండా గౌరవిస్తారు.

## ఇరవై రెండు

కొన్ని రోజుల నుంచీ కేశవపిళ్ళను రమ్మని ఇంటినుంచి జాబులు వస్తూవున్నాయి. ఇంటికి వెళ్ళాలి - అనే ఆలోచన అతన్ని మిగిలిన ఆలోచనలను మరిపించే అంతగా వెన్నంటుతూవుంది. అంతటి ఆలోచన ఇంతవరకు అతని జీవితంలో రాలేదు. ప్రత్యేకమైన కారణమేమీ లేదు, కానీ వెళ్ళలేక పోయాడు. ప్రస్తుతం కేశవపిళ్ళై విశ్రాంతి లేకుండా పనిచేస్తున్నాడు.

ఒక రోజు ఉదయం కేశవపిళ్ళై ఇంటికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. అలా అనుకుంటుండగానే పోలీసులు వచ్చి అతను వెంటనే యిల్లు చేరాలని

తెలియపరిచారు. ఎందుకూ అనేది ముందు చెప్పలేదు. కాని బలవంతం చేసి అడిగిన తర్వాత అసలు విషయం తెలిసింది.

పప్పు పిళ్ళె చనిపోయాడు. ఎవరో అతన్ని చంపేశారు. అతను పట్టుబడలేదు. అతనెవరో ఎవరూ గుర్తుపట్టను కూడా లేదు. సాయంత్రం వేళ పప్పు పిళ్ళె జపం చేసుకుని ముంగిట్లో అటూ ఇటూ తిరుగుతున్నాడు. కుట్టి అమ్మ పక్కనే వుంది. హంతకుడు ఎక్కడి నుంచో పరుగెత్తి వచ్చి పప్పు పిళ్ళె మీదికి దూకాడు. మళ్ళీ మాట్లాడకుండా పప్పు పిళ్ళె వెల్లికిల పడిపోయినాడు. హంతకుడు పారిపొయ్యాడు. ఇదే జరిగింది. కుట్టి అమ్మ కూడా స్పృహతప్పి పడిపోయింది. ఆమెకు మళ్ళీ స్పృహ రాలేదు. హంతకుడు ఎవరో కాంగ్రెసువాడయి వుంటాడని పోలీసులకు అనుమానం. కేశవపిళ్ళెను చంపేందుకు కూడా ఎవరో వెంటాడుతున్నారు. ఆ ముఠాలోని మనుష్యులే ఈ హత్య కూడా చేసివుంటారని పోలీసులు తీర్మానించారు. ఆ సంఘాన్ని పట్టుకోవాలని భక్తివిలాస్ నుంచి కఠోరమైన ఉత్తర్వు జారీ అయింది. కాంగ్రెసు వాళ్ళో లేక కాంగ్రెసు సాయంతో కమ్యూనిస్టువాళ్ళో ఈ హత్యచేసి వుంటారు. ఇరవైనాలుగు గంటల్లోగా ఈ ముఠాను పట్టుకోవాలి.

పోలీసు రక్షణతో కేశవపిళ్ళె ప్రయాణం చేశాడు. అక్కడ వూళ్ళోవాళ్ళ పేరిట ముసలి కిట్టుమామ కాక పప్పు పిళ్ళె స్నేహితులు ముగ్గురు నలుగురున్నారు. అంతకు మించి మరెవరూ లేరు. కిట్టుమామ పప్పు పిళ్ళె శవం దగ్గర కూర్చుని కన్నీటి మాటున జపం చేసుకుంటూ వున్నాడు. ఇరుగు పొరుగు ఆడవాళ్ళు ముగ్గురు నలుగురు - గౌరియమ్మ, కాత్యాయని, అమ్మాయి విజయం - స్పృహతప్పి పడిపోయిన కుట్టియమ్మకు పరిచర్య చేస్తున్నారు. డాక్టరు వచ్చి వెళ్ళిపోయినాడు. ఇంకా స్పృహ రాలేదు. ఆ యింట్లోనే కాదు, ఊరంతటా పోలీసులు మామూలు దుస్తుల్లోనూ, ఉద్యోగపు దుస్తుల్లోనూ తిరుగుతూ వున్నారు.

ఆ రోజు అక్కడ పోలీసులదే ప్రభుత్వం. అక్కడి కాంగ్రెసు కార్యాలయాన్ని పోలీసులు సోదా చేశారు. చాలా రికార్డులు దొరికాయి. కమిటీ సభ్యుల్లో ఒకరిద్దరిని అరెస్టు చేశారు. ఇరుగు పొరుగు వాళ్ళల్లో చాలామందిని ప్రశ్నించేందుకు పోలీసు స్టేషనుకు తీసుకెళ్ళారు. కొన్ని యిండ్లల్లో కూడా సోదా చేశారు.

హంతకుడెవరు? ఎలా వచ్చాడు? ఎలా వెళ్ళాడు? అన్నీ తెలుసుకోవాలి. ఊళ్ళో వాళ్ళే ఎవరో ఆ పని చేసివుంటారని పోలీసుల నిర్ణయం. ఊళ్ళో వాళ్ళకు ఈ విషయం తెలుసు. కాని వాళ్ళు చెప్పరు. కొన్ని రోజుల కిందట స్వతంత్ర తిరువితాంకూరును ప్రతిఘటిస్తూ జరిగిన సమావేశంలో ఒక యువకుడు చెప్పిన వుపన్యాసంలోని కొన్ని మాటలు ఈ సందర్భంలో సార్ధకమయినాయి. ఈ విధంగా ఈ వూళ్లో పుట్టిన వ్యక్తులే ఈ హత్యకు

కారకులయినారు. "ఆ హంతకుని జన్మకు కారకులయిన తల్లిదండ్రులు సిగ్గు పడాలి. వాళ్ళు పాపాత్ములు". ఉద్రేకంతో ఆ యువకుడు ఇంకా ఏమేమో అన్నాడు. "ఎక్కడయినా కాల్పుల్లో మరణించిన వాని కుమారుడు తండ్రి మనస్సును ఎలా అర్థం చేసుకోగలడు?" అని అడిగాడు. "ఆ దుఃఖం ఎలా వుంటుందో కేశవపిళ్ళకు తెలియాలి" అన్నాడతను. ఆ సమయంలో సభాసదుల్లో ఒక డన్నాడు: "అతనికి హృదయం లేదు". ఆ తర్వాత చాలసేపు కరతాళధ్వనులు మోగాయి. ఆ వ్యక్తి రెండు రోజులనుంచి కనిపించటం లేదు. అతన్ని పోలీసులు వెతుకుతున్నారు. అందరి యిండ్లల్లో ఏడుపులూ, పెడబొబ్బలూ. పోలీసులు కొంతమందిని పట్టుకొని వాళ్ళతో చాలా కఠోరంగా ప్రవర్తించారు. కొంతమందిని నేరస్థులుగా నిరూపించారు. పోలీసు స్టేషనుకు వెళ్ళి నాలుగు మంచి మాటలు చెప్పే వాళ్ళే లేరు. మొత్తం మీద అక్కడి పరిస్థితి చాలా భయంకరంగా వుంది. ఏ యింట్లో కూడా ఆ రోజు పొయ్యి రాజెయ్యలేదు.

కేశవపిళ్ళ మొహంలో కాంతిలేదు. అతను ఏడవటం లేదు. కాని అతని మనస్సు భారంగా వుంది. ఉద్యోగపు దుస్తులు వేసుకున్న పోలీసులు అతనికి నమస్కారం చేశారు. పోలీసులు అతని పట్ల గౌరవం చూపించేందుకు మౌనంగా పక్కకు తొలిగారు. ఎవరి వైపూ చూడకుండా కేశవపిళ్ళ నేరుగా పప్పు పిళ్ళ కళేబరం దగ్గరికి వెళ్ళాడు. బట్ట తొలిగించి మొహంవైపు చూశాడు. కిట్టుమామ వెక్కి వెక్కి యేడ్చాడు. కేశవపిళ్ళ పెదవును బిగబట్టి లోపలి దుఃఖాన్ని బయటికి పొంగకుండా చూస్తున్నాడు.

ఆ తర్వాత అతను తల్లి దగ్గరికి వెళ్ళాడు. "అమ్మా! కళ్ళు తెరువు. కేశవును వచ్చాను ." అన్నాడు.

'కేశవ' నామం దివ్యమంత్రమయింది. కుట్టియమ్మ కళ్ళు తెరిచింది. "అమ్మా! నేనే". అన్నాడు కేశవ్.

ఉన్నట్టుండి సమాధానం వచ్చింది: "నీవు చంపావు. నీవే నాన్నను చంపేశావు. ఆ అమాయకుణ్ణి నీవెందుకు చంపావ్? నాతోడు నాకు దూరమయింది".

ఆమెకు మళ్ళీ స్పృహ తప్పి పోయింది. కేశవపిళ్ళ అక్కడ నిలబడ లేకపోయాడు. ఏడుపు ముంచుకు వచ్చింది. కళ్ళల్లో నుంచి రెండు బొట్లు రాలాలి. లేకుంటే గుండె బద్దలైపోతుంది.

కేశవపిళ్ళ పడమటింట్లో ఒంటరిగా నిలబడ్డాడు. పోలీసు వాళ్ళెవ్వరూ అతని దగ్గరకి వెళ్ళటం లేదు.

గౌరి అమ్మ, కాత్యాయనిని గదిలోకి పిలిచి చెప్పింది: "నీవు అతని దగ్గరకి వెళ్ళు. నేను అత్తయ్య తల నాఒళ్ళో పెట్టుకుంటాను".

"లేదు, ఇప్పుడు నేను వెళ్ళను. నేను కదిలితే అత్తయ్య ఆరోగ్యం మరీ చెడిపోతుంది".

ఎంతసేపో జరగలేదు. కుట్టియమ్మ కళ్ళు తెరిచింది. మంచినీళ్ళు తాగేందుకు నోరు తెరిచింది. కాత్యాయని నీళ్ళు పట్టింది. ఆ కళ్ళు శాశ్వతంగా మూతబడి పోయాయి.

లోపల కలకలం బయలుదేరింది. కేశవపిళ్ళె కంపించిపోయాడు. ఎంత ఆపుకున్నా ఏడుపు ఆగలేదు. తనకు తెలియకుండానే కళ్ళనీళ్ళు జారాయి. కానీ ఆ పరిస్థితిలో ఎక్కువసేపు ఉండటం కేశవపిళ్ళెకు ఇష్టం లేదు. దుఃఖం దిగమింగుకుని మామూలుగా ఉన్నట్టు కనిపించాడు. అయినా అతను ఏడ్చినట్టు స్పష్టంగా తెలుస్తున్నది.

పప్పు పిళ్ళె శవాన్ని డాక్టర్లు పరీక్ష చేశారు. ఇక్కడ కుట్టియమ్మ శవానికి పెరట్లో స్నానం చేయిస్తున్నారు. ప్రతిరోజూ చిన్న చిన్న విషయాలకు గంటల తరబడీ వాదించుకుని మరుక్షణమే కలుపుగోలుగా మాట్లాడుకునే ముగ్గురు నలుగురు ముసలమ్మలూ, గౌరి అమ్మ, కాత్యాయని మాత్రం అక్కడ వున్నారు. ఆ వూళ్ళో ఎవరన్నా చనిపోతే మరుక్షణం కుట్టియమ్మ అక్కడికి వెళ్ళేది. దహన సంస్కారాలు అయిన తర్వాతనే యింటికి వచ్చేది. ఇదంతా యెందుకు చేసినట్టు? దీన్ని గురించి ఆమె తండ్రి కొడుకులకు చెప్తూవుండేది:

"నేను చనిపోయిన తర్వాత నాకు స్నానం చేయించేందుకూ, నాకు గంధం, విభూతీ పూసేందుకూ, బట్ట కట్టేందుకూ ఊళ్ళో వున్న ఆడవాళ్ళు రావాలి. దహనానికి కట్టెలు కొట్టేందుకూ, నన్ను మోసేందుకూ, దహనం చేసేందుకూ ఊళ్ళోవున్న మగవాళ్ళు రావాలి. అందుకూ ఇదంతా. నీవూ, నీ వదినే ఉంటే సరిపోతుందా?" అనేది కోడలితో.

ఈ విధంగా అవసాన సమయంలో ఊళ్ళో వాళ్ళు - ఆడామగా - దగ్గరవుండేందుకు కుట్టియమ్మ జీవితాంతం చేసిన శ్రమ అంతా వ్యర్థమయి పోయింది. కాత్యాయనీ, గౌరి అమ్మా కుట్టియమ్మ శవాన్ని స్నానం చేయించేందుకు తీసుకెళ్ళారు. మిగిలిన ఆడవాళ్ళు ముసలివాళ్ళు.

పప్పు పిళ్ళె కూడా ఇలాగే అన్ని చోట్లకూ వెళ్ళేవాడు. వెళ్ళకపోతే కుట్టియమ్మ కోప్పడేది. "ఇలాంటి అవసరం అందరికీ వస్తుంది" - అనేది.

కానీ అటువంటి సమయంలో ఇక్కడ మగవాళ్ళూ లేరు, ఆడవాళ్ళూ లేరు. పోలీసులు మాత్రం చాలా మంది వున్నారు. ఇంకా ఎంతో మంది ప్రభుత్వోద్యోగులున్నారు. వాళ్ళె యింటికి దక్షిణం వైపున రెండు చితులు పేర్చారు. మామిడి కొయ్య కొట్టటం కూడా పోలీసులే చేశారు.

పప్పు పిళ్ళె ఉదయం లేచి పొలం వెళ్ళేప్పుడూ, తిరిగి వచ్చేప్పుడూ దారిలో అందరిండ్లల్లో క్షేమ సమాచారాలు అడుగుతూ వుండేవాడు. ఆయనకు అందరి మీదా ప్రేమే. అందరికీ ఆయన మీద ప్రేమ. ఆయన ఎవ్వరితో తగూలాడ

లేదు. ఆయనతో కూడా ఎవ్వరూ తగూలాడ లేదు. ఎవరయినా సరే, వాళ్ళకు సాయం ఛేసేందుకు పప్పు పిళ్ళె వెళుతూ వుండేవాడు. అదే విధంగా పప్పు పిళ్ళె బతికి వుండగా అతనికి సాయం చేసేందుకు ఊళ్ళోవాళ్ళు వచ్చే వాళ్ళు.

మరి అతను చేసిన తప్పేమిటి? కొడుకును కన్నాడు. అంతేనా? ఆ తల్లి ఆనందంగా చెప్పుకునేది - సూర్యుడి లాంటి కొడుకు అని అతను వూళ్ళోనే వుంటే బాగుండేది. కానీ అలాంటి ఆలోచనే వద్దు.

ఆ రెండు శవాలూ దహనమయ్యేప్పుడు మంటలు పై పైన కలుసుకున్నట్టు అందరూ చూశారు. కానీ వాళ్ళు ధన్యజీవులని చెప్పేందుకు అక్కడ ఎవ్వరూ లేరు. మర్నాటి నుంచీ పచ్చని శాలువా కప్పుకొని తలమీద కండువా చుట్టుకుని బెత్తం చేత పట్టుకుని పొలం గట్టుమీద పచార్లు చేసే ఆ మూర్తి కనిపించదు. ఎక్కడ ఎవరు కంటున్నారన్నా నడుముకు బట్టకట్టుకుని అక్కడ చొరబడే కుట్టి యమ్మ కూడా కనిపించదు.

చితిలో నుంచి మంటలు చెలరేగటం ఆగిపోయింది. కాత్యాయని గుండెలు బాదుకుంటూ 'అత్తయ్యా, మామయ్యా' అని ఏడుస్తూంటే ఆమె గుండెల్లో మండే మంటలు ఆ మంటలకు బదులుగా విజృంభిస్తూ వున్నాయి. ఇక బూడిద మిగులుతుంది.

పోస్టువాడు కేశవపిళ్ళె దగ్గరకి వచ్చి ఒక కవరు ఇచ్చాడు. ఆ వుత్తరం కేశవపిళ్ళె యింటి అడ్రసుకు వచ్చింది. అడ్రసు వ్రాసిన దస్తూరిని అతను గుర్తు పట్టలేక పోయాడు. కేశవపిళ్ళె కవరు తీసి ఉత్తరం చదువుకున్నాడు. ఆ వుత్తరంలో ఇలా రాసివుంది:

" ఈ వుత్తరం రాసే వాడిపేరు ముకుంద్. నా తండ్రి పేరు గోపాలన్ నాయర్. నీవు ఆయన్ని ఉరితీసి చంపించావు. ఒక పర్యాయం నా మీద తప్పుడు కేసుపెట్టి జైలుకు పంపించావు. నేను మీ తండ్రిని చంపాను. ఆ దుఃఖమెలాంటిదో నీకు తెలియాలని నేననుకున్నాను. నాలాగా నీవూ పితృవియోగాన్ని అనుభవించి వుంటావు. ఇప్పుడు నాకు తృప్తి కలిగింది. నీ తండ్రినిమరెవ్వరో చంపారని అనుమానించకు. చాలా రోజుల నుంచీ నేను నిన్ను చంపాలని వెంట వెంట తిరుగుతున్నాను. నా కదే యిష్టం. కాని నేనీ బరువును మోస్తూ తిరగ లేక పోయాను. అందువల్ల నీకు బదులుగా నీ తండ్రిని చంపేశాను. ఇక ముగిస్తున్నాను"

తనకు స్పృహ తప్పి పోతుందని అనిపించింది కేశవపిళ్ళెకు. అతను నిలబడ లేక పోయాడు. కాని పడిపోను కూడా లేదు. కొంత దూరంలో నిలబడి వున్న డి.యస్.పి.కి అతనా వుత్తరమిచ్చాడు. ఉన్నత పదవిలో వున్న మరికొందరు పోలీసు ఉద్యోగస్థులు కూడా అక్కడికి వచ్చారు.

ఎర్ర దారం పెరిగి పెరిగి అమాయకుడయిన పప్పు పిళ్ళె మెడలో కాలపాశంలా పడిపోయింది. సగం ఆఫీసుల్లో, తాలూకాఫీసులో, డివిజనల్

ఆఫీసులో, హుజూరు ఆఫీసులో - ఇలా అన్ని ఆఫీసుల్లో ఈ ఎర్రదారం ఎంతమంది యజమానులనే, అధికారులనే ఆఫీసులకు దూరం చేసింది. ఆ దారంలో కొంత భాగం గుమాస్తా కేశవపిళ్ళైకు కూడా సోకింది. ఇది యింకా పెరుగుతుందా?

ఇంటివెనక మేధావులయిన పోలీసువాళ్ళు కలిసి గంభీరంగా ఆలోచిస్తున్నారు. ముకుంద్ అనే యీ వ్యక్తిని గురించీ, అతని తండ్రిని గురించీ సెక్రటరీ కేశవపిళ్ళైకు చాలా విషయాలు తెలుసు. కాని ఆ సమయంలో అతనెలా చెప్తాడు?

ఆనాటి గోపాలన్ నాయర్ హత్యను గురించి ఒక ఇన్స్పెక్టరన్నాడు: అతను కాంగ్రెసువాడని ఎ.యస్.పి.కి తెలుసట. ఈనాడు ఈ వూళ్ళోవున్న కాంగ్రెసువాళ్ళ ప్రమేయం లేకుండా, ఎరుక లేకుండా ఇతనీపని చెయ్యలేడని అంటాడతను. ఇదంతా వాళ్ళు ముందుగా ఏర్పరచుకున్న కార్యక్రమం. కాంగ్రెసు నాయకులకు ఇదంతా తెలిసే వుంటుంది. వాళ్ళ సాయంతోనే ఆశీస్సులతోనే ఇదంతా జరిగి వుంటుంది. అందరూ ఇదే తీర్మానానికి వచ్చారు.

డి.యస్.పి.కి విచారం కలిగించే మరో సమస్య మిటం ముకుంద్ దాక్కున్నాడు. కనితీరకుండా తప్పించుకు పోయినాడు. అతని దృష్టి పిళ్ళమీదనే వుంది. అతన్ని పట్టుకుని తీరాలి.

అతనెంతో దూరం వెళ్ళి వుండడని ఎ.యస్.పి. అభిప్రాయం. ఈ వూళ్ళోనే లేక చుట్టు పక్కల గ్రామాల్లోనే అతనుంటాడు. దేశమంతా అతన్ని సమర్థిస్తున్నప్పుడు అతనికి తలదాచుకునేందుకు ఇబ్బందేముంటుంది?

ఉత్తరం ఆలప్పుళ గ్రామం నుంచి పోస్టులో వచ్చింది. రాష్ట్రంలోని పోలీసు స్టేషనులకన్నింటికీ యీ హత్యను గురించిన వార్తా వెంటనే అంది వుంటుంది.

ఈ హత్య రాష్ట్రాన్ని ఆశ్చర్యంలో ముంచివేసింది. ఎవ్వరికీ ఎలాంటి ద్రోహం తలపెట్టని మంచి వ్యక్తి మరణించాడు. ఈ హత్య ఆ రాష్ట్రంలో ముఖ్యమైన ఘటన. వార్తా పత్రికల్లో ఈ వార్త ప్రత్యేకంగా ప్రచురించారు. పోలీసు వాళ్ళు ఎక్కువ శ్రమపడకుండానే హంతకుడు కాంగ్రెసువాడనే వదంతి దేశమంతటా వ్యాపించింది. ఇందువల్ల కాంగ్రెసుకు పలుకుబడి తగ్గింది. పాపం ఆ ముసలాయన చేసిన తప్పేమిటి? అతన్ని ఎందుకు చంపినట్టు? అని అందరూ అంటున్నారు. ఆ తర్వాత తెలిసింది - చంపింది ముకుంద్ అని.

కాంగ్రెసు నాయకత్వం కింద ఒక తీర్మానం చేయబడింది. ఆ తీర్మానంలో - ఈ హత్యతో కాంగ్రెసుకేమీ సంబంధంలేదని స్పష్టంగా తెలియపరచటమయింది. ఆ తీర్మానంలో మరణించిన వ్యక్తి ఆత్మ శాంతి కోసం పరమాత్మను ప్రార్థించటం కూడా జరిగింది. ఆ సమయంలో జరిగిన కాంగ్రెసు సమావేశాలన్నింటిలో ఈ హత్యను తీవ్రంగా ప్రతిఘటించి పప్పు పిళ్ళై ఆత్మ

శాంతికి దేవుణ్ణి ప్రార్థించటం జరిగింది. హంతకుణ్ణి పట్టుకునేందుకు పోలీసులకు పూర్తి సహకారం అందజేస్తామని కాంగ్రెసు వాగ్దానం చేసింది. అయినా ప్రజలకు ఈ మాటల్లో నమ్మకం కుదరలేదు.

పప్పు పిళ్ళైకు, కుట్టియమ్మకు అంత్యక్రియలు జరిగాయి. పదమూడో రోజు తర్వాతనే కేశవపిళ్ళై వెళ్ళాడు. పూర్వాచారాన్ని అనుసరించి అన్ని పనులూ అతను యథావిధిగా జరిపిస్తున్నాడు. కిట్టుమామ కర్మకాండంతా సక్రమంగా జరిగేట్టు చూస్తున్నాడు. హత్యను గురించి, హంతకుణ్ణి గురించి పోలీసులు విచారణ చేస్తున్నారు. ఆ వూళ్ళో పోలీసులు అరెస్టు చేయని మగవాళ్ళు లేరు. కొంత మంది యింకా తిరిగిరాలేదు. ఇక ఆడవాళ్ళను కూడా విచారణ చేయాలని ఆలోచిస్తున్నారు. ఆడవాళ్ళు నిజం చెప్తారు. ఎనిమిది పదేళ్ళ పిల్లలను కూడా పోలీసులు వదిలిపెట్టలేదు.

ఆ వూళ్ళో అడుగు పెట్టినప్పటి నుంచీ కాత్యాయనికి ఆంతరంగికమైన వ్యక్తి కాలావురత్త నాణీకుట్టి. ఇద్దరూ ఒకరి రహస్యాలు ఒకరికి చెప్పుకుంటారు. ఏ కొంచెం అవకాశం దొరికినా నాణీకుట్టి కాత్యాయని దగ్గరికి వెళ్తుంది. రోజుకు కనీసం పదిసార్లు ఇద్దరూ కలుసుకుంటారు. అలా అంతు లేకుండా చెప్పుకునేందుకు ఏం కబుర్లు వుంటాయని చాలామంది అడుగుతుంటారు. ఇలాంటి ఆత్మీయులు మరి యిద్దరున్నారు. కేవలం కేశవపిళ్ళై భార్యగా కాత్యాయని ఆ వూరికి వచ్చి నప్పటినుంచీ, - తిరువితాంకూరు దీవాన్‌జీ ఆ స్థానంలో ఉన్నతోద్యోగి కేశవపిళ్ళై భార్య అయినా, వాళ్ళ సంబంధంలో ఏమీ మార్పు రాలేదు. ఇప్పుడు నాణీకుట్టి పరిస్థితి కొంచెం బాగాలేదు అయినాసరే. వెనకటిలాగా ఇప్పుడు కూడా వాళ్ళు 'ఏమే, రావే' అని పిలుచుకుంటారు.

నాణీకుట్టి భర్త అట్టే పెద్ద వుద్యోగం చేసే మనిషికాదు. కొద్దిపాటి పొలముంది. పెద్ద కూతుర్ని అలం పుషా ఎక్స్‌పోర్టు ఆఫీసులో పనిచేసే అతనికి ఇచ్చారు. వయలార్ పున్నప్రా సమ్మెలో అతను పాల్గొన్నాడు. కాని పట్టుబడకుండా తప్పించుకున్నాడు. అతను పూర్తిగా సామ్యవాది. తర్వాత కాంగ్రెసులో చేరాడంటారు. అతని పాత చరిత్రను పురస్కరించుకుని పోలీసువాళ్ళు సవాళ్ళు వేశారు. కాని యేమీ తెలియలేదు. అతనే చంపాడని అంటారు. పప్పు పిళ్ళై చనిపోయిన మర్నాడు నాణీకుట్టి అక్కడికి వెళ్ళింది. కష్టంలోవున్న తన స్నేహితురాలిని ఓదార్చింది. ఆ రోజు సాయంత్రం పాచ్చన్ పిళ్ళై (నాణీకుట్టి అల్లుడు పేరిది)ను పోలీసులు పట్టుకు పోయారు.

కాత్యాయనికి ఈ సంగతి చెప్పేందుకు ఆ రాత్రి నాణీకుట్టి బయలుదేరింది. కాని రాత్రిపూట పోలీసుల మధ్యకు వెళ్ళటం మంచిది కాదని కొందరు సలహా యిచ్చి ఆమెను ఆపేశారు. మర్నాడు ఉదయం నాణీకుట్టిని పోలీసులు పట్టుకెళ్ళారు.

ఊళ్ళో వాళ్ళెవ్వరూ కాత్యాయని యింటికి వెళ్ళటం లేదు. పోలీసులకు భయపడి రాలేదని కాత్యాయని అనుకున్నది. వార్తలు తెలుసుకునేందుకు కూడా వీల్లేకుండా వుంది. కిట్టుమామ రెండు మూడు రోజులు బయట తిరిగి ఊళ్ళో ప్రతి యింట్లో జరుగుతున్న సంగతులన్నీ కాత్యాయనికి చెప్పాడు. నాణీకుట్టిని పోలీసులు పట్టుకెళ్ళారనే సంగతి కూడా చెప్పాడు.

కాత్యాయని నివ్వెర పోయింది. "ఇక్కడి వాళ్ళకు తెలియకుండా వాళ్ళ ఆమోదం లేకుండా ఈ హత్య జరిగేందుకు వీల్లేదని పోలీసులంటున్నారు." అన్నాడు కిట్టుమామ.

కాత్యాయని ఉద్రేకంతో అన్నది: "అది అబద్ధం. పచ్చి అబద్ధం. మామయ్యను ఎవరు చంపిందీ మా నాణీకుట్టికి తెలుసంటారా మీరు?"

కిట్టుమామకు ఆ సంగతి యేమీ తెలియదు. బయట విన్నమాట చెప్పాడు. పోలీసు వాళ్ళు ఈ వూళ్ళో ఎవరినీ వదలరు. ఆడవాళ్ళనే కాదు, పిల్లలను కూడా తీసుకెళ్ళటం మొదలు పెట్టారు - అంటూ కిట్టుమామ ఆగిపోయాడు.

"నాణీకుట్టి అమాయకురాలు కావచ్చు. కాని ఆ పాచ్చన్ చెడ్డవాడు. నీకు తెలియదు. పున్నప్రాలో ఒకరిని బల్లెంతో పొడిచి చంపిన వాడతను."

కాత్యాయని నమ్మలేదు.

"కిట్టుమామా! నీవు ఏమయినా చెప్పు. ఈ వూళ్ళో పుట్టిన వాళ్ళల్లో ఏ ఒక్కడు కూడా మామయ్య మొహం చూసి యిలాంటి పని చెయ్యడు. మామయ్యతో ఎవ్వరికీ విరోధం లేదు. విరోధం తెచ్చుకొనే పని ఆయన యేం చేశాడు కనుక? మామయ్యకు కూడా ఎవరితో విరోధం లేదు. పోలీసువాళ్ళు యమదూతలు. అమాయకులయిన గ్రామస్థులను బాధిస్తూ వున్నారు."

"ఒక్క క్షణం ఆగి కాత్యాయని మళ్ళీ అంది: "వీళ్ళు ఏ పాపం ఎరుగని వాళ్ళని - ఈ ఊళ్ళో వాళ్ళని ఎందుకిలా వేధిస్తున్నారూ అని అడుగుతున్నాను. మామయ్య పోనే పోయినాడు. ఇక ఊళ్ళో వాళ్ళతో కూడా వైరం తెచ్చుకున్నట్టవుతుంది."

కేశవపిళ్ళె పాపను దగ్గర కూర్చో బెట్టుకుని వీపు నిమురుతున్నాడు. కాత్యాయని ధైర్యంగా అతని ముందుకు వెళ్ళి అడిగింది: "ఇదంతా యే వుద్దేశంతో చేస్తున్నారు?"

కేశవపిళ్ళె భార్య ముఖంవైపు చూశాడు. ఇలాంటి భావంతో ఇలాంటి కంఠంతో జీవితంలో ఒకేఒకసారి ఆమె బెదిరిస్తూ మాట్లాడింది. చాల సంవత్సరాల క్రితం తల్లిదండ్రులు తన అభివృద్ధికి ఆటంకంగా వున్నారని కేశవపిళ్ళె పొరబాటున అన్నప్పుడు, అలా యెందుకన్నారని కాత్యాయని అడిగింది. వాళ్ళ కాళ్ళ మీదపడి క్షమాపణ కోరమని అడిగింది. ఆ రోజు చదువురాని, లోకజ్ఞానం లేని, ఆధునిక జీవితంలోని మర్యాదలు, సంస్కారాలు

తెలియని ఆ పల్లెపడుచు తొలిసారి తన ఆజ్ఞా శక్తిని ప్రదర్శించింది. ఆ ఆజ్ఞాశక్తికి ఆధారభూతమైన వేదాంతం, సంస్కారం ఆమెకు సంప్రదాయ సిద్ధంగా సంక్రమించాయి. ఈ రోజు మళ్ళీ ఆ ఆజ్ఞాశక్తి, వ్యక్తిత్వం మేల్కొన్నాయి.

ఆ ప్రశ్న చెవిని పడగానే కేశవపిళ్ళె కొంచెం చిన్న బుచ్చుకున్నట్టు కనిపించాడు. ఆ ప్రశ్న నిశ్చింతగా సమాధానం చెప్పదగింది. "ఏ వుద్దేశంతో ఇదంతా చేస్తున్నారు?" మళ్ళీ అడిగింది కాత్యాయని.

శబ్దం చాలా కఠోరంగా వుంది. "ఆఁ, ఏమిటి?" అన్నాడు కేశవపిళ్ళె.

"ఈ వూళ్ళో అందరినీ చంపించ దలుచుకున్నారా?"

కేశవపిళ్ళెకు విషయం అర్థమయింది. అతను సమాధానం చెప్పగలడు. అతనికి ధైర్యం వచ్చింది.

"నీవు వెళ్ళి నీ పని చూసుకో. ఇది ప్రభుత్వానికి సంబంధించిన విషయం. దీనిలో నీవు జోక్యం కలుగజేసుకోకు."

జీవితంలో మొదటిసారి ఆమె అతనితో వాదించేందుకు సిద్ధమయింది. మరో విషయం, మరో సందర్భం అయినట్టయితే కాత్యాయని తనకు బోధపడదని, తనకు సంబంధించిన విషయం కాదని తన అసమర్థతను అంగీకరించి తన పని చూసుకోనేందుకు వెళ్ళి వుండేది. కాని యిది వూళ్ళో ఆడా మగా అందరికీ సంబంధించిన విషయం. తన నాణీ కుట్టికి సంబంధించిన విషయం. "ఈ పోలీసు వాళ్ళు చెప్పేది శుద్ధ అబద్ధం. ఊళ్ళో ఎవ్వరూ ఇలాంటి పని చెయ్యారు. అలాంటి ఆలోచనే పిల్లకు కలగదు. మామయ్య అంత మంచి జీవితం గడిపారు. అందరూ ఆయనతో మంచిగానే ప్రవర్తించారు."

కేశవపిళ్ళె ముఖంలో గాంభీర్యం వచ్చింది. ఆమె భర్త మీద అధికారం చలాయించే అధికారి అయింది.

"చాలు, నీవు నీ పని చూసుకో.

కాత్యాయని వదల్లేదు:

"కల్లాకపటం లేనివాళ్ళను ఇలా చిత్రవధ చేస్తే భగవంతుడి దగ్గర సంజాయిషీ చెప్పుకోవలసి వుంటుంది. కుటుంబానికి కూడా ఈ పాపం చుట్టు కుంటుంది. అది అందరూ అనుభవించాలి. అందుకనే ఇది నాకు సంబంధించింది."

కేశవపిళ్ళె ఆ మాట విన్నట్టు లేదు. తనలో తను అనుకున్నట్టు అన్నాడు: "మా నాన్న గారిని చాకుతో పొడిచి చంపి ..."

కాత్యాయని కేశవపిళ్ళెను అడిగింది: "ఆ పని ఎవరు చేశారో అతన్ని వేధించాలి, బాధించాలి. నాణీ చేసిందా? కల్యాణి చేసిందా?"

కేశవపిళ్ళై కోపంతో చూశాడు. వేధించే భార్యను బెదిరించే భర్త చూసినట్టు చూశాడు. ఆ చూపులకు కాత్యాయని కొంచెం భయ పడింది. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"నేను ఇక్కడికి వచ్చినప్పటినుంచీ నాణీ కుట్టీ, కల్యాణీ, కుంచికుట్టీ నా స్నేహితురాళ్ళు. మేము కలిసి మెలిసి వుంటున్నాం. ముగ్గురం మూడు కళేబరాలయినా, ఆత్మ ఒకటే. నాకు పొలం, వ్యవసాయం ఉన్నా వాళ్ళకు కష్టం తప్పలేదు. పాపం వాళ్ళకు నా మీద ప్రేమ వుండటంవల్ల వాళ్ళు కష్టాల పాలయినారు. పాపం నాణీకుట్టి జైల్లో వుంది--."

కాత్యాయని పూర్తిగా చెప్పలేక పోయింది. ఇంతలో భర్త కటువుగా ఆజ్ఞాపించాడు: "చాలుచాలు."

ఆమె ఆగిపోయింది. కాత్యాయని చెప్పదలుచుకుంది చెప్పలేకపోయింది.

ఆ పరిస్థితిలో మరో యిల్లాలయితే ఇలా చెప్పేదికాదు. ఆమెకు ఇలా చెప్పటమే చేతనవుతుంది. ఆమెకు సరిగ్గా చెప్పలేని భర్త కూడా కాదు. కాత్యాయనికి ఓడిపోయినట్లయింది. ప్రేమబంధాన్ని గురించి ఎలా చెప్పాలో ఆమెకు తెలియదు. ఆమె యేడుస్తూ అన్నది:

"నా వాళ్ళు ఎవరూ లేరు. అత్తా, మామా ఇద్దరూ పోయినారు. నా నాణీ, కల్యాణీ, కుంచి కుట్టీ నాకు శత్రువులయినారు. నేను ఇలాంటి దాన్నని వాళ్ళనుకుంటూ వుంటారు. ఇకముందు వాళ్ళు నన్ను చూసినా మాట్లాడరు. నామాట నమ్మరు. నా వాళ్ళెవ్వరూ లేరు."

ఆ నైరాశ్యం కూడా కేశవపిళ్ళైకు బోధపడ లేదు. అది బోధపడే విషయం కూడా కాదు. అతని జీవితం మాత్రం ఎలా అయిపోయింది? అతనికి కావలసిన వాళ్ళెవరున్నారు? ప్రేమించే తల్లిదండ్రులు - వాళ్ళ ప్రేమ, ఆదరం అతనెప్పుడూ అపేక్షించ లేదు. ప్రేమించే భార్య - ఆమె ఆదరాన్ని కూడా అతను వదిలిపెట్టాడు. ఇక ప్రపంచంలో అందరూ శత్రువులే కదా? మరి అతనికి ఎలా బోధపడుతుంది?

కాత్యాయని కాళ్ళు పట్టుకుని ప్రార్థించింది:

"నా నాణీని వదిలి పెట్టించండి - ఈ పసి కందును చూసి, పైనున్న తల్లి దండ్రులను స్మరించి."

"నీవూ, నీ నాణీ - ఈ చచ్చుపీనుగులతోనా నీకు సాంగత్యం?" అన్నాడు కేశవపిళ్ళై బిగ్గరగా.

నాణీతో ఆమెకు సంబంధం వుండటం కేశవపిళ్ళైకు ఇష్టం లేదు. దానికి సమాధానం చెప్పాలి కాబట్టి చెప్పింది:

"నేనిక్కడికి వచ్చినప్పుడు ఆమెతో నాకు పరిచయం ఏర్పడ్డది. మరెవ్వరూ నాకు దగ్గర కాలేదు. వాళ్ళకు కూడా నా మీద ప్రేమ. ఇది నా తప్పుకాదు. నేను వెదికి వెదికి వాళ్ళను చేరదీయలేదు."

అమానుషమైన కోపంతో కేశవపిళ్ళై అన్నాడు:

"మీ నాణీ కుట్టి జైల్లో బాధపడుతూవుంటే పడనీ, ఈ దేశమంతా అంతే."

కాత్యాయని నివ్వెరపోయింది. ఆశ్చర్యంతోపాటు ఆమె ఆత్మ మేలుకొంది. అప్రయత్నంగా ఆమె నోటినుండి ఒక ప్రశ్న వెలువడింది: "ఈ పొలం, ఈ డబ్బు, ఈ అధికారం - ఇదంతా దేనికి? దేనికి అని అడుగుతున్నాను"

కాత్యాయని ఆగలేదు:

"ఇదంతా మానవుల మంచి కోసమని మామయ్య చెబుతుండేవారు."

ఆ మాట చెప్పేప్పుడు చెప్పవలసింది సరిగ్గా చెప్పాననే తృప్తి కాత్యాయనికి కలిగింది. "భగవంతుడా? దీనికోసం ఏమేమి అనుభవించాలో నాకు తెలియకుండా వుంది." అంటూ కాత్యాయని బిగ్గరగా ఏడుస్తూ పెరట్లోకి వెళ్ళింది.

కేశవపిళ్ళై పచార్లు చేస్తున్నాడు. ఆయన ఆలోచనలో మునిగివున్నాడు. కొంచెం ఆగిన తర్వాత ఒక పోలీసు బంట్రోతును పిలిచి అడిగాడు: "ఒక స్త్రీ - పేరు బహుశా నాణీకుట్టి. ఆమెను ప్రశ్నించటం అయిందా?"

"అయిందండీ! ఆమెను పంపించేశాం:

"అలాగా! సరే!"

నాణీ కుట్టిని విడిపించారని వినగానే కాత్యాయనికి ఆమెను చూడాలనిపించింది. అది కేవలం అనిపించటమే కాదు, ఆవేశం ఉబికి వచ్చింది. ఆమెను చూడాలి, చెయ్యి పట్టుకుని అన్ని విషయాలూ ఆమెకు చెప్పాలి. ఆమె భర్త ఇలా చేశాడని ఆమెకు చెప్పాలి. నాణీకుట్టి భర్త కొచ్చుకుట్టన్ నాయరు అలాంటివాడు కాడు. కాత్యాయని చెప్పినట్టు అంత అమాయకుడు కూడా కాదు. స్నేహశీలి కూడా కాడు - అని అన్ని విషయాలూ చెప్పాలి. నాకివన్నీ తెలియవు. నేను విననే లేదని చెప్పాలి. నాణీ కుట్టి నమ్ముతుంది. కేశవపిళ్ళై చాలా మంచివాడు, ప్రేమగలవాడు - అని నాణీకుట్టి కాత్యాయన్ని ఓదార్చలేదా! కేశవపిళ్ళైను గురించి ఏదయినా చెప్పగూడని విషయం చెబితే అలా అనకని వారించేది నాణీ కుట్టి. ఇప్పుడు పొరబాటయిందని ఆమె అంటుంది."

కాత్యాయని భుజం మీద పైట వేసుకుని గేటువైపు వెళ్ళింది.

"ఎక్కడికి?"

మేఘగర్జనలాగా ఏదో ఆజ్ఞ కాత్యాయని చెవిని బడింది. ఆమె ఆగిపోయింది. అది కేశవపిళ్ళై ఉత్తర్వు.

"ఎక్కడికీ వెళ్ళద్దు. ఇటురా!" కాత్యాయని ఉన్నచోటు నుంచి కదలలేదు. ఆగిపోయింది. కొంచెం సేపయింది. "గుమ్మంలో అలా నిలబడకు, ఇలారా."

ఆమె కీలుబొమ్మలా తిరిగి వెళ్ళి అతని యెదుట నిలబడ్డది.

"ఇక్కడి నుంచి బయటికి వెళ్ళకు." అన్నాడతను ఆమెను ఆపాదమస్తకం పరిశీలించి.

కొంచెం సేపాగి కేశవపిళ్ళై అన్నాడు:

"మట్టు మర్యాద వదిలి అటూ యిటూ తిరగడం అలవాటయింది."

"నేనలా తిరిగే దాన్ని కాదు" అన్నది కాత్యాయని.

"ఆఁ, నీవెవరి భార్యవే తెలుసా?"

ఆమె యేమీ అనలేదు. "ఇకముందు నీవు వెనకటి లాగా, లేనివాళ్ళలాగా జుట్టు విరబోసుకుని దయ్యంలా తిరిగేందుకు వీల్లేదు. జరిగిందేదో మరిచిపో." అన్నాడు కేశవపిళ్ళై.

కొంచెం సేపు అంతా నిశ్శబ్దంగా వుంది. "ఒంటరిగా వెళితే ఎవరన్నా నిన్ను కత్తితో చంపేస్తే ఏంచెయ్యను?" అన్నాడు కేశవపిళ్ళై.

కాత్యాయని వెంటనే సమాధానం చెప్పింది: "నన్నెవ్వరూ ఏం చెయ్యరు. నేను నా నాణీని చూసేందుకు వెళ్తున్నాను".

"నా నాణీ! ఎవరామె?"

"ఇక్కడికి నేను రాగానే నన్ను ప్రేమతో దగ్గరకు తీసిన నాణీ! నా మనస్సు మండిన రోజున నన్ను ఓదార్చిన నాణీ! నా కోసం భగవంతుడికి మొక్కుతున్న నాణీ! అదే నా నాణీ! అంతకుమించి నాకు స్నేహితులెవరూ లేరు".

"చాలు. చాలు. ఆగు ఇకముందుకు వెళ్ళకు! ఇలా వచ్చేసేయ్." ఆజ్ఞాపించాడు కేశవపిళ్ళై.

కాత్యాయని ఆజ్ఞను పాలించింది.

ఆమె జీవితంలో తొలిసారి అలాంటి అనుభవం అది, అదే భావిజీవితానికి నాంది. ఆమె జీవితంలో అందరూ బంధువులే. తల్లి, తండ్రి, అత్త, మామ, ముగ్గురు స్నేహితురాండ్రు, కూతురు, వీళ్ళందరూకాక తిరువనంతపురంలో ఉన్నత పదవిలో దినదినాభివృద్ధి చెందుతున్న సూర్యుడిలాంటి భర్త. జీవితం అంతా హాయిగా ఆనందంగా గడిచింది. పిల్ల తల్లయిన తర్వాత కూడా పప్పు పిళ్ళై, కుట్టి యమ్మ ఆమెను ముద్దుబిడ్డగా చూస్తూ వచ్చారు - ఈనాటి వరకూ. ఈ విధంగా ఆమె ఆడుతూ పాడుతూ జీవితం గడుపుతూ వచ్చింది. సీతాకోక చిలుకలాగా నిశ్చింతగా తిరుగుతూ వుంది. పది నిమిషాలు తీరిక దొరికితే ఆమె నాణీ కుట్టి యింటికి వెళ్ళి కూర్చునేది, ఈమెరాగానే కల్యాణీ, కుంచికుట్టీ కూడా అక్కడికి చేరేవాళ్ళు. కాపురం నడిపించే బరువు బాధ్యతలు ఆమెకు తెలియవు. ఈ విధంగా కాలక్షేపం చేస్తూవుంటే అత్తా, మామా చనిపోయారు. స్నేహితురాండ్రు కూడా దూరమయినారు. కూతురుంది. దూరంగా వుండే భర్త దగ్గరకు చేరాడు. భర్త సమీపంలో వుంటే ఆమెకు కలిగిన అనుభూతి ఎంతో బాధాకరంగా వుంది.

ఇక భావిజీవితంలో అత్తా లేదు, మామా లేడు, చెలికత్తెలూ లేరు. కొత్తగా స్నేహితురాళ్ళను చేసుకునే అవకాశం కూడా లేదు.

వంటింట్లో ఒక మూలన కూర్చుని కాత్యాయని ఏదో జ్ఞాపకం చేసుకుంటున్నది. ఆమెకు అయిన వాళ్ళెవ్వరూ లేరు. కేశవపిళ్ళె నెమ్మదిగా ఆమె దగ్గరకి వెళ్ళాడు.

"ఇక ముందు ఈ తప్పుడు ముండలతో తిరిగి అపకీర్తి పాలు అయేందుకు వీల్లేదు"

"వాళ్ళు తప్పుడు మాటలు చేప్పేవాళ్ళు కాదు."

"కాకపోతే కాకపోనీ. ఆ అలికీవాళ్ళతో సంబంధం పెట్టుకోకు."

"మరి నేనెలా బతకటం? నా వాళ్ళెవరున్నారు?"

"ఆఁ" కేశవ పిళ్ళె వెళ్ళిపోయాడు.

ఇప్పుడు నాణీకుట్టి యేమనుకుంటూ వుంటుంది? కాత్యాయనికి ఆవేదనగా వుంది. ఆమెకు కోపం వస్తే రావచ్చు. ఆమె కష్టంలో వున్నప్పుడు తను దగ్గర లేదు.

కాత్యాయని కిట్టుమామ ద్వారా నాణీకుట్టిని ఇక్కడికి రప్పించే యేర్పాట్లు చేసింది. కాత్యాయని ఆమె కోసం ఉత్కంఠతో ఎదురుచూస్తూ వుంది. కొంత సేపటికి కిట్టు మామ తిరిగి వచ్చి "నాణీ కుట్టి రానే లేదు" అని చెప్పాడు.

"ఎందుకు కిట్టుమామా?"

దీర్ఘ నిశ్వాసతో కిట్టు మామ చెప్పాడు: "ఊళ్ళో వాళ్ళంతా కలిసి ఒక నిర్ణయానికి వచ్చారట. ఇక ముందు పసిపిల్లవాడు కూడా యీ యింటికి రాడు."

"అదికాదు కిట్టు మామా! నాణీకుట్టి యేమన్నది?"

"ఆమె కోపంలోవుంది. నీవు మారిపోయినావు - అంది. నీవు తలుచుకుంటే ఆమె జైలుకు వెళ్ళాల్సిన అవసరముండేదికాదట. కాని నీవు పట్టించుకోలేదట".

"కిట్టు మామా! మరినీవు చెప్పలే?"

"చెప్పానమ్మా. కానీ నమ్మేదెవరు?"

"ప్రేమ కొనసాగినంత వరకూ సాగింది. ఇక మమ్మల్ని బతకనియ్యండి అన్నదామె."

"అది రాదా మరి?"

"రాదు".

## ఇరవై మూడు

పప్పు పిళ్ళె మరణం ఒక విధంగా కేశవ పిళ్ళెకు లాభించింది. దీవాన్‌జీకి నిజంగా జాలి కలిగింది. పప్పు పిళ్ళె మరణం దేశాన్నంతా ఆశ్చర్యంలో ముంచివేసింది. దారుణమైన యీ హత్యతో కాంగ్రెసు కేమీ సంబంధం లేదని

ప్రజలకు నచ్చ చెప్పాల్సి వచ్చింది. తద్వారా కేశవపిళ్ళైకు వాళ్ళతో వున్న వైరం అంతరించి పోయింది. కేశవపిళ్ళైను చీఫ్ సెక్రటరీగా నియమించారు.

ఒక రోజు సాయంత్రం కేశవపిళ్ళైకు ఈ వార్తా అందింది. భక్తి విలాస్ నుంచి వార్త వచ్చింది. ఇంటికి వెళ్ళి అతను భార్యను దగ్గరకి పిలిచాడు. కాత్యాయనీ అమ్మ తిరువనంతపురం వచ్చి మూడు నాలుగు రోజులయింది.

"ఏమే కాత్యాయనీ! నాకు పెద్ద వుద్యోగం వచ్చింది. చీఫ్ సెక్రటరీ."

కాత్యాయని తల్లి ఏమీ బోధపడనట్టు నిలబడి పోయింది. కానీ ఏదో పెద్ద వుద్యోగం వచ్చినట్టు ఆమెకు అర్ధమయింది. ఆమె ముఖంలో కాంతి వచ్చింది. వెనకటిలా యిప్పుడామె మసిబట్టలు కట్టుకుని వంటింట్లో అసహ్యంగా కూర్చునే ఆడకూతురు కాదు.

"అంటే అర్ధం?" అని ఆమె అమాయకంగా అడిగింది.

ఈ వార్త విని కచ్చితంగా సంతోషపడే వ్యక్తి ఇప్పుడు ఒక్కరే - కాత్యాయనీ అమ్మ. ఆ వార్త చల్లబడేలోగా మరెవరికి చెప్పగలడు? మరో యిల్లాలయితే ఎంత సంతోషించేది? ఈవిడ కర్రలా నిలబడి అడుగుతున్నది - అంటే అర్ధం? అని.

కేశవపిళ్ళైలోని ఉల్లాసం కొంత తగ్గిపోయింది. "తెలియదా నీకు? వినలేదా?" అన్నాడు.

అదే అమాయకత్వంతో కాత్యాయనీ అమ్మ అన్నది: "నాకేం తెలుస్తుంది? నాకేమన్నా చెప్పారామరి?"

"దాన్ని గురించి వివరంగా చెప్పటం కష్టం. ఇప్పటి ఉద్యోగం కంటె పెద్దది" అన్నాడు కేశవపిళ్ళై.

"జీతం ఎంత ఎక్కువ వస్తుంది?" అని అడిగింది ఆ అమాయికపు ఇల్లాలు.

"రెండు వందలు".

ఆమె ముఖం మరి కొంత విప్పారింది. "ఇక ముందు ఇలా హింసించటం, కాల్పించటం అందరితో వైరం తెచ్చు కోనటం అవసరం లేదు కదా? ఈ వుద్యోగంలో అలాంటి పనులు చేయవలసిన పని లేదు కదా?" అని అడిగింది.

కఠోర హృదయుడని పేరు పడ్డ కేశవపిళ్ళైను ఎదుట నిలుచుని అలా అడిగినవాళ్ళు ఈనాటి వరకూ ఎవ్వరూ లేరు. వెనక పప్పు పిళ్ళై, కుట్టియమ్మ అలా అన్నారు. కాని వాళ్ళు కూడా ఇంత ఘాటుగా అనలేదు. ప్రజలను హింసించి, చంపించారన్న మాట రూఢి చేసుకుని అంటున్నది భార్య.

కేశవపిళ్ళై కాత్యాయనిని కోపంతో చూశాడు. ఆమెను ఏమనగలడు? అందరికంటె మిన్నయైన కాంగ్రెసు సభ్యుడు ఎదుట ఉన్నాడు. "సరే వెళ్ళు" అని ఆజ్ఞాపించాడు కేశవపిళ్ళై.

కాత్యాయనీ అమ్మకు తానేదో పొరపాటుగా మాట్లాడానని తోచింది. "అదికాదు, ఈ గందరగోళానికి దూరంగా వుండవచ్చు కదా అని. ఇక మనల్ని దూషిస్తూ వుపన్యాసాలివ్వరుకదా అని". అన్నదామె.

"సరే, చాలించు" అన్నాడు కేశవపిళ్ళె కొంచెం కటువుగా.

చేసుకున్న భార్య కూడా కాంగ్రెసు వాళ్ళ మాటలను నమ్ముతూ వుంది.

అభ్యుదయ శాఖలో వుద్యోగం వచ్చినప్పుడు కూడా కేశవపిళ్ళె తన అభ్యుదయాన్ని చూసి ఆనందించే వ్యక్తి కోసం నలువైపులా వెతుక్కున్నాడు. ఈనాడు కూడా అతను అలాంటి వ్యక్తి కోసం చూస్తున్నాడు.

చాలా మంది కేశవపిళ్ళెను అభినందించారు. కొందరు వుత్తరాల ద్వారా, మరి కొందరు సమక్షంలో తమ ఆనందాన్ని తెలియ పరిచారు. ఇదంతా కేవలం లాంఛన ప్రాయమైన అభినందన. చాలామంది అసూయపడుతున్నారు. కొంతమంది పండ్లు కొరుకుతున్నారు. కొంతమంది అభినందించటం తమ విధి అని అలా చేశారు. ఇదంతా కేశవపిళ్ళెకు అర్థమయింది. అయినప్పటికీ తన ఉన్నతి చూసి అచ్చమైన ఆనందాన్ని అనుభవించే వ్యక్తి కోసం అతను ప్రపంచంలో వెతుకుతున్నాడు. జీవితంలో తటస్థపడిన ఆత్మీయులయిన వ్యక్తులను ఒక్కొక్కరినీ గుర్తు చేసుకుంటున్నాడు. ఎవ్వరూ లేరు. కాత్యాయని నిజంగా సంతోషించేది. కానీ ఆమెకి విషయమే బోధపడలేదు. ఆమె ఎగిరి గంతులు వేస్తే ఎంతో బాగుండేది.

ఇది ఒక విధమైన లోటు. అంటే నిజమైన ప్రేమగల వ్యక్తి ఒక్కరూ లేరన్న మాట. అతను ఒంటరి వాడన్నమాట. కేశవపిళ్ళె తన ఉన్నతికి హృదయ పూర్వకంగా ఆనందించ లేకపోయాడు.

అక్కర్లేదు. నిజమైన ప్రేమగల వ్యక్తి అక్కర లేదు. దీనికి ప్రతికృతి ఆ మాత్రం చాలు. నిజమైన ప్రేమకు బాధ్యత యేమీ లేదు కదా!

ఒక రోజు హరిహర అయ్యరు, గోవిందన్ నాయరు వచ్చారు. హరిహర అయ్యరు చాలా ముసలివాడయినాడు. ఆ బ్రాహ్మణుడు రిటైరయి చాలా యేండ్లయింది. గోవిందన్ నాయరు కూడా రిటైరయినాడు. వాళ్ళు కేవలం తమ ఆనందం తెలియ పరిచేందుకే వచ్చారు. మరే వుద్దేశ్యంతోనూ రాలేదు. స్వామి ఏదో ప్రత్యేకంగా చెప్పాలను కున్నాడు:

"ఆ రోజు పార్కువ్యూలో మా డిపార్టుమెంటు నుంచి వెళ్ళేప్పుడు నేనన్నాను - చీఫ్ సెక్రటరీగా నిన్ను పార్కువ్యూలో చూస్తామని. అది నిజమయింది. ఇది చూచేందుకే నేను వచ్చాను."

గోవిందన్ నాయరు స్వామి మాటను ఖండించాడు. "చీఫ్ సెక్రటరీ అవుతాడని నీవు చెప్పలేదు. సెక్రటరీ వరకే నీవు చెప్పింది."

"లేదు. చీఫ్ సెక్రటరీ అవుతాడని నేను చెప్పాను."

"చీఫ్ సెక్రటరీ అవుతాడని నీవు చెప్పావా. నిజంగా?"

"నేను చెప్పలేదు. కానీ నాకు తెలుసు."

"అయితే సరే, నాకూ తెలుసు."

వాళ్ళ వాగ్వివాదం ఒకరినొకరు చిన్న బుచ్చేందుకు జరగటం లేదు. స్వామి తన పని సాధించుకునేందుకు అన్నాడు. కాబట్టి అతని మాట కాదనేందుకు గోవిందన్ నాయరు అనలేదు. ఇద్దరూ తమ ఆనందాన్ని తెలియబరచేందుకే అన్నారు.

"ఏది యెలా అయినా ఈ సుదినం మనం చూడగలిగాం. అదే చాలు". అన్నాడు గోవిందన్ నాయరు.

స్వామి అతనితో ఏకీభవించాడు.

కేశవపిళ్ళకు జీవితంలో తొలిసారి హృదయ పూర్వకమైన మాధుర్యం గోచరించింది. అతనిలోని ఉల్లాసం ఈ హార్దికతకు నిదర్శనం. కేశవపిళ్ళై అన్నాడు:

"స్వామీ! ఇదంతా నేను ఆలోచించ లేదు. ఫలానాచోట, ఫలానా సమయంలో ఫలానా పని జరిగి తీరాలని ఆలోచించి నేను పని చెయ్యలేదు. ఒకచోట పని దొరికింది. అప్పుడు దానికే సంతోషించాను. అంతకు మించిన మరో పదవి లభించింది. దానికీ సంతోషించాను. ఇన్ని మెట్లు ఎక్కుతానని ముందు ఊహించలేదు. నిజం చెప్తున్నాను. స్వామీ! ఒక్కొక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే ఇక్కడికి ఎలా చేరానా అనిపిస్తుంది."

స్వామి బాగా గమనిస్తూ వింటున్నాడు. "అంతా భగవంతుడి దయ" అన్నాడు.

గోవిందన్ నాయరు మరోమాట అన్నాడు:

"అనుభవించే వాళ్ళ అదృష్టం కూడా స్వామీ!"

కిట్టుమామ మాటలు కేశవపిళ్ళై చెవులలో మారు మ్రోగాయి : "ఆమె అదృష్టవంతురాలు."

ఆ మాటలు గోవిందన్ నాయరూ, స్వామీ కూడా విన్నారా అని కేశవపిళ్ళకు ఆశ్చర్యం వేసింది. ఆ మాట వాళ్ళిద్దరూ చాలా బిగ్గరగా అన్నారు. చాలా యేండ్ల కిందట చీఫ్ సెక్రటరీ మేనేన్‌ను కలుసుకునేందుకు పార్కువ్యూ గేటు దగ్గర తాను కాచుకుని వుంటే పోలీసులు తనని తరిమేశారు. ఆ విషయం కేశవపిళ్ళై గుర్తు తెచ్చుకున్నాడు.

"ఆమె అదృష్టవంతురాలు."

ఆ అదృష్టవంతురాలు ఆ పెద్ద భవనంలో ఒక గదిలో ఒదిగివుంది - కాత్యాయని - సాలీడులా బయటికి వచ్చేందుకు వీల్లేని కాత్యాయని.

"గోవిందన్ నాయర్! ఇతనిక్కడ ఆగిపోతాడనుకుంటున్నావా? భక్తి విలాస్‌లో ప్రవేశించడనుకుంటున్నావా?" అన్నాడు హరిహర అయ్యరు.

"ఏమంటావ్, స్వామీ! భక్తి విలాసా?" అన్నాడు గోవిందన్ నాయరు.

స్వామి గట్టిగా నొక్కి చెప్పాడు: "అవును, భక్తి విలాసే. గోవిందన్ నాయరుకు సందేహమా?"

"నాకేం సందేహం లేదు, స్వామీ! రాబోయే కాలంలో మంత్రులు వస్తారని అంటున్నారు".

"అవును నిజమే. మంత్రీ, దీవాన్‌జీ ఒకటే కదా!" అన్నాడు హరిహర అయ్యరు తల వూపుతూ.

"కానీ గోవిందన్ నాయర్! ఆరోజు చూసేందుకు నేను కాచుకుని వుంటాను" అన్నాడు హరిహర అయ్యరు.

"అది చూసేందుకు స్వామి ఉండడు - అని అనలేదు గదా!" అన్నాడు గోవిందన్ నాయరు.

హరిహర అయ్యరు తనకు తాను శతాయుస్సనుకుంటూ అన్నాడు: "అలాగే కానీయి".

ఆ తర్వాత కేశవపిళ్ళెకు మాతేవన్ పిళ్ళె అనే బంట్రోతు గుర్తుకు వచ్చాడు. ఎన్నో సంవత్సరాల తర్వాత అతను గుర్తుకు వచ్చాడు. ఇన్ని సంగతుల్లో అతను ఆ వ్యక్తిని గుర్తు పెట్టుకో లేకపోయాడు. పాపం, చనిపోయి ఉండవచ్చు. లేకుంటే యీనాడు అతను కూడా వచ్చేవాడు. హృదయ పూర్వకంగా అభినందించేందుకు ముగ్గురు ఉండేవాళ్ళు. తల్లిదండ్రులు జీవించివున్నా కాత్యాయనీఅమ్మలాగా వాళ్ళకు కూడా ఇదేమిటో అర్థమయ్యేది కాదు.

మర్నాడు కేశవపిళ్ళె చీఫ్ సెక్రటరీ ఛార్జి తీసుకోవాలి. అతను అయ్యప్ప కోవెలలో పూమాల సేవతోపాటు అన్ని ఆలయాల్లో పూజ చేయించాడు. జ్యోతిష్కుడి చేత ముహూర్తం పెట్టించుకుని ఛార్జి తీసుకున్నాడు.

ఆరోజు సచివాలయంలో చాలా హడావిడిగా వుంది. చీఫ్ సెక్రటరీ మారినప్పుడల్లా అలాగే వుంటుంది.

చీఫ్ సెక్రటరీ చూడవలసిన కాగితాలు టేబిలు మీద పెట్టి వుంచారు. కేశవపిళ్ళె భగవంతుణ్ణి స్మరించి కలం చేత పట్టాడు. అన్నిటి కంటే పైన వున్న ఫైలు చూశాడు. అది రాజీనామాకు అర్జీ. కేశవపిళ్ళె దాన్ని చదివాడు, నివ్వెరపోయినాడు.

అది తంకమ్మ రాజీనామా.

చీఫ్ సెక్రటరీ కొంచెం సేపు స్తంభించి పోయి కూర్చున్నాడు. చీఫ్ సెక్రటరీ బాధ్యత వహించిన తర్వాత మొట్టమొదట చెయ్యవలసిన పని యిదేనా? ఇది పర్సనల్ క్లర్కు చేసిన చాకచక్యమా? లేక అలా జరగాల్సి జరిగిందా? విషయమంతా తెలిసిన వ్యక్తి కావాలని అలా చేసినట్టు కేశవపిళ్ళెకు అనిపించింది. ఆ రాజీనామా అతన్ని అవమానం చేసి మనస్సుకు బాధ

కలిగించేందుకు వచ్చింది. ఆతను పర్సనల్ క్లర్కును పిలిచాడు. అతను యువకుడు. స్వయంకృషితో పైకి వచ్చినవాడు. అతన్ని ఆపాదమస్తకం చూశాడు కేశవపిళ్ళె. ఏదో పొరపాటు జరిగిందని అతను కంగారు పడ్డాడు. ఉన్నతి పొందే వుద్దేశంతో అక్కడ ప్రవేశించిన యువకుని కాళ్ళు నేలమీద నిలబడడం లేదు. కిందికి దిగజారిపోతున్నాడు. ప్రారంభంలో కేశవపిళ్ళె కూడా ఇలాగే భయంతో జంకుతో పనిచేసేవాడు. ఈ యువకుడు కూడా అలాగే పని చేస్తున్నాడు. పొరపాటేమిటో అతనికి తెలియలేదు. ముఖం పాలిపోయింది.

"మొట్టమొదటి వుత్తర్వు, రాజీనామాను ఆమోదించటమా?" అన్నాడు కేశవపిళ్ళె.

"నాకు తెలియదండీ" అన్నాడు అతను నిజం చెప్తూ.

"సరే, వెళ్ళు".

అతను వెళ్ళాడు.

కేశవపిళ్ళె యేమీ పని చెయ్యలేక పోయాడు. కొంచెం సేపు అలాగే కూర్చున్నాడు. దానికి వుద్యోగం అక్కర్లేకపోతే కొన్నాళ్ళ ముందే రాజీనామా యివ్వగూడదూ? కేశవపిళ్ళె ఆమె రాజీనామాకు అంగీకార ముద్ర వెయ్యాలా? బహుశా ఆమె పట్టుదల అదేనేమో!

కేశవపిళ్ళె తనవల్ల పొరపాటు ఏం జరిగిందని ఆలోచించాడు. ఆమెకి సంబంధించిన చరిత్రలో ప్రతి రోజూ, ప్రతి ఘటనా నెమరు వేసుకున్నాడు. అంతా స్పష్టమయింది. అంతా అతనికి గుర్తుంది. ఇది కావాలని చేసినపని. "నిన్ను నేను మొదటి మెట్టు ఎక్కించాను. ఆ తర్వాత నీవు ఎక్కగలిగే వాడివి కావు. ఒక్కొక్క మెట్టే యెక్కి యిప్పుడు చివరి మెట్టుకు చేరుకున్నావు. ఇప్పుడు నీకు అధికారముంది. నీవే నన్ను బయటికి పంపించు." ఆమె అలా అంటున్నట్టు ఆ వుత్తరంలో అతనికి గోచరించింది. గాయపడిన గుండెలా ఆ కాగితం అతని ముందు పడివుంది. దానిలోని అక్షరాలు గడగడ వణుకుతూ వున్నట్టు కనిపించాయి.

అతని మెదడు మొద్దు బారి పోయింది. ఆమె తనకు చేసినదంతా నెమరు వేసుకున్నాడు. వీల్లేదు! ఈ రాజీనామా అతనామోదించడు. ఉత్తర్వు రాసేందుకు అతనికి మాటలు దొరకటం లేదు.

ఉద్యోగం అక్కర్లేదని అలా రాసి వుంటుందా? మరి యెలా జీవిస్తుంది? ఆ యిల్లు కాక మరేమయినా ఆమెకున్నట్టు అతనికి తెలియదు. మరో ధనవంతుడెవరయినా దొరికాడేమో! బహుశా అతనే యిలా సలహా చెప్పివుంటాడు.

కేశవపిళ్ళె మరోసారి రాజీనామాను చూశాడు. అతని జీవితమనే కుండను అతని యెదుటనే ముక్కలు ముక్కలు చేసి నాశనం చేసేందుకు ఆమె

నిశ్చయించుకున్నట్లు అతనికి తోచింది. ఆ వాక్యాలు అలాగే వున్నాయి. జీవితంతో ఋణం తీరి పోయినట్టుగా అతనికి తోస్తూవుంది.

కేశవపిళ్ళై చాలా రోజులనుంచీ ఆమె సంగతి విచారించలేదు. ఆమెను గురించి ఏ వార్తా అతనికి అందలేదు. ఆ రోజు ఆ యువకుణ్ణి అక్కడ చూసి వచ్చిన తర్వాత అతను మళ్ళీ వెళ్ళలేదు. అది భావ్యమేనా అని కేశవపిళ్ళై తనను తను ప్రశ్నించుకున్నాడు. ప్రతిసారీ అవకాశం దొరికినప్పుడల్లా ఆమె తనని అవమానిస్తూనే వుంది. ఆమెకు కేశవపిళ్ళైతో అవసరం ఎప్పుడూ కలగలేదు. కేశవపిళ్ళై తనను తాను ప్రశ్నించుకొని తనకుతానే సమాధానం చెప్పుకున్నతీరు సరైనదికాదు. అతనికి తీరుబడి బొత్తిగా లేకుండా పోయింది. అలాంటి విషయాలను గురించి ఆలోచించేందుకు అతనికి అవకాశం లేకుండా పోయింది. అందుకని వెళ్ళలేదు. ఈ సమాధానంలో క్షమాపణ దాగివుంది.

ఈ మధ్య జరిగిన సంగతులన్నీ తెలుసుకునేందుకు కేశవపిళ్ళై చాలా తహతహలాడుతున్నాడు. ముందు ఏం జరుగబోతూందో?

అతను ఆ రాజీనామాను వేరుగా పెట్టాడు. టేబిలుమీద అతని ఉత్తర్వు కోసం ఎదురు చూస్తూ ఫైళ్ళు కొండలా పేరుకొని వున్నాయి. అతనేమీ చెయ్యలేక పోయాడు. అది ఛార్జి తీసుకున్న మొదటి రోజు. ఇది కేశవపిళ్ళైకు అపశకునంలా తోచింది. ఈ కుర్చీలో కూర్చుని యిలాగేనా అభివృద్ధికి రావలసింది? అన్ని విధాలా ఆలోచించి జ్యోతిష్యులు చెప్పిన మంచి రోజది.

గంటన్నరసేపు కేశవపిళ్ళై యేమీ పని చెయ్యకుండా అలాగే కూర్చుని ఆఫీసు నుంచి బయలు దేరి కారులో పార్కువ్యూకు వెళ్ళాడు. వీలయితే ఆ రాజీనామా అర్జీ తిప్పి పంపించాలి. మరేం కారణం లేదుకానీ అందుకతను సమ్మతించేందుకు బాధపడుతున్నాడు. కేశవపిళ్ళై ఆ పని యెందుకు చెయ్యలేక పోతున్నాడో బహుశా అతనికే తెలియదు.

కాత్యాయనీ అమ్మ ఒక గ్లాసు కాఫీ తెచ్చియిచ్చింది. కేశవపిళ్ళై తాగాడు. ఆ సమయంలో కేశవపిళ్ళై ఆఫీసునుంచి రావటం కాత్యాయనీ అమ్మకు ఆశ్చర్యకరంగా లేదు. ఆఫీసుకు ఎప్పుడు వెళ్ళాలి, ఎప్పుడు రావాలి ఆ యిల్లాలికి తెలియదు. ఆ జీవితంతో ఆమెకేమీ సంబంధం లేదు. కాఫీ యిచ్చి తిరిగి వచ్చిన బంట్రోతు ఆమెను అడిగాడు: "అమ్మగారూ! అయ్యగారు ఈ రోజు చాలా తొందరగా వచ్చేశారే? ఛార్జి తీసుకున్న రోజు కావటం వల్లనేమో!"

"ఎన్ని గంటలకు రావాలి?" కాత్యాయనీ అమ్మ అడిగింది.

"సాయంత్రం అయిదు గంటలకు"

భర్త యింటికి రావాల్సిన సమయం ఈ విధంగా ఆమెకు తెలిసింది.

కొంత సేపటికి గేటు దగ్గరవున్న జవాను వచ్చి యెవరో ఒక ముసలమ్మ అతన్ని కలుసుకునేందుకు వచ్చిందని చెప్పాడు. ఆమెను లోపలికి రమ్మని కేశవపిళ్ళై అనుమతి యిచ్చాడు.

ఆమె భాగీరథీఅమ్మ. తంకమ్మ తల్లి. అనుకున్నదానికి ఇది పూర్తిగా విరుద్ధంగా వుంది. భాగీరథీ అమ్మ బాధపడుతూ తన గాథ చెప్పటం ఆరంభించింది: "అబ్బాయ్, ఆ మాంత్రికుడు తన మంత్రశక్తితో దాన్ని ఒళ్ళు తెలియకుండా చేశాడు."

కేశవపిళ్ళైకు బోధపడ్డట్టు లేదు. ఆమె ముఖం వైపు చూస్తున్నాడు. "అది ఉద్యోగానికి రాజీనామా యిచ్చింది." అన్నది భాగీరథీ అమ్మ.

"అవును, చూశాను. రాజీనామా నా దగ్గరికి వచ్చింది" అన్నాడు కేశవపిళ్ళై.

"మరి అనుమతి యిచ్చావా?"

"లేదు, అసలు కారణమేమిటి?"

"ఆ రోజు నీవు ఒక కుర్రాణ్ణి చూడలా? అతనే కారణం. అతనిలో మంత్రశక్తి వుంది. తిరువనంతపురంలో ఉద్యోగస్థుల కుటుంబాలతో అతనికి సంబంధం వుంది. అందరినీ తన మంత్ర శక్తితో వశం చేసుకున్నాడు."

భాగీరథీ అమ్మ చెపుతున్న యీ కథ కేశవపిళ్ళైకు అర్థం కావటం లేదు.

"మంత్ర శక్తితో మచ్చు చల్లాడా?" అడిగాడు కేశవపిళ్ళై.

"అవును, అదే", ముసలమ్మ గట్టిగా చెప్పింది.

"అంటే అర్థం?"

"అతను భజనలతో, కీర్తనలతో, పూజలతో కాలక్షేపం చేస్తున్నాడు. అతడు ఒక గొప్ప స్వామికి శిష్యుడు. ఆ స్వాముల వారు మూడు నాలుగు పర్యాయాలు తిరువనంతపురం వచ్చాడు. ఆయన ఒక్కొక్క రోజు ఒక్కొక్క ఉద్యోగి యింట్లో అనుష్ఠానం చేస్తాడు. ఆయన ఆశీర్వదిస్తే ఉద్యోగం వస్తుందట, జీతం పెరుగుతుందట, పిల్లలకు పెళ్ళిళ్ళు అవుతాయట. ఆయన ఉత్తర దేశంవాడు. ఇక్కడ ఆడవాళ్ళనందరినీ ఇతనూ, ఈ స్వాములవారూ వశపరుచుకున్నారు"

కొన్నాళ్ళ క్రితం సెక్రటేరియట్‌లో కొంతమంది ఆడ సూపరింటెండెంట్లు, గుమాస్తాలు, ఉద్యోగస్థుల భార్యలు ఏదో పూజకు చందా కావాలని వచ్చారు. ఆ మాట కేశవపిళ్ళైకు జ్ఞాపకం వచ్చింది. అప్పుడు సమ్మె చాల తీవ్రంగా సాగుతున్నది. వాళ్ళు ఆనందన్ అనే వ్యక్తిని గురించి యేదో చెప్పారు. ఆ విషయం కేశవపిళ్ళైకు బాగా గుర్తు లేదు. ఇప్పటికి గూడా ఆనందన్ అనే వ్యక్తి భగవద్గీతను గురించి, ఉపనిషత్తులను గురించి ఉపన్యాసాలు చెప్పినట్టు వార్తా పత్రికల్లో అతను చదువుతున్నాడు. భాగీరథీ అమ్మ చెప్పేమాటలకూ, ఈ వార్తలకూ ఏదో సంబంధం ఉన్నట్టు అతనికి తోచింది.

"ఉద్యోగస్థుల భార్యలూ, ఉద్యోగం చేసే ఆడవాళ్ళూ అందరూ అతని వెంట తిరుగుతున్నారు. ఆయన ఒక రోజు అక్కడకూడా పూజ చేశాడు. ఆయన కళ్ళు మూసుకుని మధ్యలో కూర్చుంటాడు. ఆడవాళ్ళు చుట్టూ నిలబడతారు. వాళ్ళంతా పరవశించి పోయారు. పూర్తిగా ఒళ్ళు తెలియని స్థితిలోకి మారారు." అన్నది భాగీరథీ అమ్మ.

"ఆ రోజు కనిపించిన యువకుడు అక్కడే వుంటాడా?" అడిగాడు కేశవపిళ్ళై.

ఒక్కక్షణం ఆగి భాగీరథీ అమ్మ దానికి సమాధానం చెప్పింది:

"ఏం చెప్పమంటావబ్బాయ్! అభిమానం, మర్యాదా లేకుండా నేనక్కడ బతుకుతున్నాను. ఇలాంటి బతుకు నేనెప్పుడూ బతకలేదు. దానధర్మాలు చేసి నేనీ పిల్లను కన్నాను. కానీ అది లజ్జా, అభిమానం అన్నీ వదిలి పెట్టింది. అన్నీ చూస్తూ, వింటూ వున్నాను. ఆ పాడు పిల్లను వదిలెయ్యమని నా మగ పిల్లలన్నారు. అది వాళ్ళ చెల్లెలు కాదనుకొని వాళ్ళు వదిలేశారు. నా గర్భ వాసంలో పుట్టింది కనక నేను మగపిల్లల మాటకు వ్యతిరేకించి దానితోనే వుంటూ వచ్చాను. అన్నీ సహించాను."

"ప్రస్తుతం పరిస్థితి ఏమిటి?" అడిగాడు కేశవపిళ్ళై.

భాగీరథీ అమ్మ కథ ఆరంభించింది: "ఆ కుర్రవాడక్కడే వుంటాడు. కాని తిరువనంతపురంలో ఇంటింటికీ వెళ్తాడు. పూజకు ఒకరింటికి వెళ్తే వాళ్ళు అతన్ని వదిలిపెట్టరు. అప్పుడు తంకమ్మకు కోపం వస్తుంది. అతను రాగానే తగాదా ఆరంభమవుతుంది. ఇదీ అతని భక్తీ, పూజ. నేను మధ్యలో మాట్లాడేందుకు వీల్లేదు."

పాత పురాణం నెమరువేసుకుని భాగీరథీ అమ్మ అన్నది: "మొదట మర్యాదగా నిన్ను పెళ్ళి చేసుకోవాలని అది అనుకుంది. ఆ తర్వాత రామచంద్రన్ నాయరు వెంట వెళ్ళింది. అయినా నీవు మన్నించావు. కానీ యిలా అయిపోయింది. అయ్యో భగవంతుడా! ఇకముందు ఏం జరుగుతుందో నాకు తెలియదు. ఈ ఆడంగుల పూజలూ, పునస్కారాలూ ఇలా వున్నాయి."

"ఉద్యోగం వదిలిపెట్టటంలో దాని ఉద్దేశమేమిటి?" అడిగాడు కేశవపిళ్ళై.

"అదే తెలుసుకోవాలి, ఆ పెద్ద స్వాములవారు వచ్చి యిక్కడే తిష్ఠ వేస్తాడుట. తన యింటిని ఆయనకు ఆశ్రమంగా యిస్తున్నది. ఆ తర్వాత అది కూడా 'అమ్మ అనే పేరుతోనో మరో పేరుతోనో దీక్ష తీసుకుంటుందిట. పేరుకూడా మార్చుకుంటున్నది."

కేశవపిళ్ళై శిలా మూర్తిలా కూర్చుండి పోయాడు. భాగీరథీ అమ్మ చాలా విషయాలు చెప్పింది. చివరకు పర్యవసానంగా చెప్పింది : "దాని సన్యాస మెందుకో నాకు తెలుసు. కాషాయగుడ్డలు కట్టుకున్నా, జపమాలలు వేసుకున్నా, విభూతి పూసుకున్నా అది మామూలు వెనకటి మనిషే. 'నేనెలా

బతకను' అని నేను అడిగితే ఈ ఆశ్రమంలోనే వుండి కాషాయగుడ్డలు కట్టుకుని రుద్రాక్షమాల వేసుకుని వుండమన్నది. అది అక్కడ చేయరాని పనులు చేస్తూవుంటే నేను చూస్తూ వూరుకోలేను".

ఆమె జీవిత పరిణామాన్ని గురించి విని కేశవపిళ్ళె కొంచెం సేపు స్తంభించి పోయాడు.

భాగీరథీ అమ్మ అడిగింది: "పిళ్ళే! నీవు దాన్ని పిలిపించి అన్నీ అడుగుతావా?"

"దానివల్ల లాభం?"

కొంచెం సేపు ఆలోచించి భాగీరథీ అమ్మ అంది: "పిళ్ళె! ఈ మధ్య దానికి పిచ్చి పట్టింది. నిసలయిన పిచ్చి. లంబారాకో మరెక్కడికో పంపాలను కున్నాను. ఏమయిందో తెలుసా? ఉన్నట్టుండి దానికి ఒళ్ళు తెలిసేది కాదు. నవ్వేది. నవ్వు ఆపుకోలేక పోయేది. పీచు తీసిన కొబ్బరికాయకు చందనం, భస్మంపూసి కంటికి కాటుక పెట్టుకుని పక్కలో పండుకోపెట్టుకునేది. ఇదంతా అతని మాయాజాలం ఫలితం. అస్తమానం సెలవు పెడుతూవుండేది. ఇప్పుడు రాజీనామా పెట్టింది".

"ఇప్పుడు కూడా ఆ పిచ్చివుందా?" అడిగాడు కేశవపిళ్ళె.

అతనే ఆ పిచ్చి కుదిరించాడని చెప్పింది భాగీరథీ అమ్మ. కాని ఆమె ముఖంలో మార్పు వచ్చింది. ఇప్పుడు మాట్లాడటం మానేసింది.

"అది అతన్ని అక్కడ్నించి వెళ్ళనియ్యదు."

కొంచెం సేపు ఇద్దరూ తమతమ ఆలోచనల్లో మునిగిపోయారు. భాగీరథీ అమ్మ చెప్పిందే నిజమయితే ఆమెకు ఆ యిల్లు కట్టించి యివ్వటం పొరపాటని కేశవపిళ్ళెకు అనిపించింది. ఈరోజు అది మరో చేతిలోకి వెళ్ళి పోతున్నది. కాని దాన్ని గురించి ఆలోచించి బాధపడటం ఎందుకు? తన కర్తవ్యం తాను నెరవేర్చాడు. చేసిన మేలుకు బదులుగా తను ప్రతిఫలం ముట్ట జెప్పాడు. ఆ ప్రతి ఫలాన్ని ఆమె యెలా వుపయోగించుకుంది అనేది తనకనవసరం. కానీ కేశవపిళ్ళె హృదయంలో ఏదో మూలన చాలా బాధగా ఉన్నది.

పీచు తీసిన కొబ్బరికాయను కడిగి కంటికి కాటుక పెట్టుకొని చందనం, భస్మం పూసుకుని పక్కలో పండుకో బెట్టుకోవటం దేనికి? బహుశా సంతానం కోసం తల్లి అవటంకోసం తాపత్రయ పడుతూ ఉండి వుంటుంది.

భాగీరథీ అమ్మ యీ వార్త చెప్పేందుకే వచ్చిందా? కాదు, అంతకుమించి మరో వుద్దేశ్యం ఏదో వుంటుంది. అది ఆమె చెప్పలేదు. తంకమ్మను కలుసుకుని మాట్లాడమని చెప్పింది. కానీ అందువల్ల లాభంలేదని అతనికి వెంటనే అనిపించింది. ఆమెను బంధించే శక్తి సామర్ధ్యాలు తనలో లేవని అతనికి తెలుసు. ఇకముందు కూడా అంతే.

ఇద్దరూ కొంచెం సేపు మౌనంగా వున్నారు.

"ఇప్పుడు నేనేం చెయ్యను పిళ్ళై" అడిగింది భాగీరథీ అమ్మ.

బదులు చెప్పకుండా ఊరుకున్న అమ్మ కేశవపిళ్ళై వైపు చూస్తూ వుంది. తన కూతురి దగ్గర తను వుండలేనని ఆమె ఎన్నిసార్లో చెప్పింది.

"ముందుముందు అక్కడ వుంటే - ఆశ్రమంలో వున్నట్టుంటుంది. అంతకంటె యే భజన మందిరంలోనే చేరటం మంచిది. అక్కడ అనాధ శిశువులు, వితంతువులు, మనఃస్థిమితంలేని ఆడవాళ్ళను తీసుకొచ్చి పెడుతుంది. ఆ తర్వాత ఆ యిల్లు అతని పేరిట వ్రాస్తుంది. నేనుకూడా అనాధలాగా వాళ్ళతో ఉండాలి. అప్పుడక్కడి వాతావరణం ఎలా వుంటుందో యెవరికి తెలుసు? ఇలా నేను బతకలేను పిళ్ళై!"

కేశవపిళ్ళై ఆలోచనలో మునిగిపోయి గదిలో పచార్లు చేస్తున్నాడు. ఈ సమస్యకు సమాధానం కనిపించటం లేదు. వెనక శేఖర పిళ్ళై పార్కువ్యూకి వచ్చి చెప్పినమాటలన్నీ కేశవపిళ్ళై గుర్తు తెచ్చుకున్నాడు. అతని అవసాన కాలంనాటి దృశ్యం కూడా నెమరు వేసుకున్నాడు. కేశవపిళ్ళై తన జీవితంలో మరిచిపోలేని వ్యక్తి ఎవరయినా వుంటే అతను శేఖర పిళ్ళై. ఆ వ్యక్తి భార్య దిక్కులేని వితంతువుగా తనయెదుట నిలబడి వుంది. చనిపోయేప్పుడు శేఖరపిళ్ళై ఆమెను ఇతనికే అప్పజెప్పి పోయాడా? కేశవపిళ్ళైకు సరిగ్గా గుర్తు లేదు. ఈమెను కనిపెట్టి వుండమని తనకి చెప్పాడా? చెప్పేవుంటాడు. లేదు, అలాయేమీ చెప్పలేదు. అలాంటి బాధ్యత తను వహించలేదు. అయినా కొంత భాధ్యత వుంది కదా? దానికి సంబంధించిన బాధ్యత అంతా పూర్తి అయిపోయింది. పూర్తి అయిపోయిందని అతను భావించలేకుండా వున్నాడు.

"నన్నేం చెయ్యమంటావ్?" అన్నాడు కేశవపిళ్ళై.

"నాకు తెలీదు. నాకు మాత్రం కేశవపిళ్ళైను మించి మరో ఆశ్రయం లేదు. నీకు ఎలా తోస్తే అలా చెయ్యి పిళ్ళై" అన్నది భాగీరథీ అమ్మ గట్టిగా.

"కానీ నేను నీకు చాలా రోజులు భారంగా వుండను, ఎన్నాళ్ళో బతకను పిళ్ళై. భగవంతుడు నన్నెన్నాళ్ళో బాధపెట్టడు". అన్నదామె దిక్కులేని చూపులతో.

కేశవపిళ్ళై ఏం చెయ్యాలో నిర్ణయించ లేకుండా వున్నాడు. ఆమె కోసం తనేం చెయ్యాలో ఆమె చెప్పటం లేదు. "నెల కింతా అని యిస్తే సరిపోతుందా?" అని అడిగాడు.

"నేనెక్కడుంటాను, పిళ్ళై? నేను పిల్లలమీద అలిగి వచ్చాను. మళ్ళీ అక్కడికి వెళితే......."

"వాళ్ళు రానీయరా?"

"నాకేం తెలియదు."

"ఇక బంధువులెవరూ లేరా?" అడిగాడు కేశవపిళ్ళై.

"లేరని చెప్పలేను పిళ్ళే! కానీ వాళ్ళకు నా మీద ఆపేక్ష ఎందుకుంటుంది? డబ్బిచ్చి అన్నంతింటూ కాలం గడపవచ్చు." ముసలమ్మ చెప్పసాగింది.

"ఎక్కడైనా ప్రశాంతంగా వుండాలని వుంది. హాయిగా వుండేందుకు నాకు చోటు లేదు పిళ్ళే".

భాగీరథీ అమ్మకు తన దగ్గర వుండాలని వుందని కేశవపిళ్ళకు తోచింది. జీవితంలో నాకు ఒకడే అల్లుడని భాగీరథీ అమ్మ వెనక చెప్పిన మాటలు కేశవపిళ్ళకు గుర్తు వచ్చాయి. ఆ మాటలను ఆమె మూటగట్టుకుని వుంది. తన కూతుర్ని కేశవపిళ్ళ పెళ్ళి చేసుకోక పోయినా అతన్ని ఆమె తన అల్లుడిగానే భావిస్తున్నది. భాగీరథీ అమ్మ మనసులోని మాట కేశవపిళ్ళ గ్రహించాడు. ఆమె బహుశా మరుక్షణం ఇలా అనబోతూవుంది: "ఇది యింత పెద్ద యిల్లు కదా! ఇక్కడ ఏదో మూలన - మీ నౌకర్లతోపాటు - నేనూ తలదాచుకుంటాను. రెండు మెతుకులు పెడితేచాలు." ఈ మాటలు ఆమె నాలుక దాకా వచ్చాయి. కేశవపిళ్ళ ఏమయినా అడిగితే ఆమె యిలా అంటుంది.

ఏం చెయ్యటం? అతను తన దగ్గర ఉండేందుకు ఆమెను అనుమతించగలడు. అది న్యాయం కూడా. కాని యిప్పుడిక్కడ కాత్యాయని వుంది. వీల్లేదు. అలా అనుమతించేందుకు వీల్లేదు. కాత్యాయని, భాగీరథీ అమ్మా కలిసి ఒక యింట్లో వుండటం భావ్యం కాదు.

ఇంతలో కాత్యాయనీ అమ్మ వాకిలి దాకా వచ్చింది. భాగీరథీఅమ్మ నవ్వుతూ అంది: "మీ ఆవిడ ఇక్కడే వుందా? నాకు చెప్పలేదే? ఎప్పుడొచ్చింది?"

కేశవపిళ్ళ యేమీ మాట్లాడ లేదు. అతను కొంచెం కంగారు పడ్డట్టు నిలబడ్డాడు. "ఇదుగో వస్తున్నాను" - అని బాగీరథి అమ్మ లోపలికి వెళ్ళింది. ఇద్దరూ యింటి వెనక్కి వెళ్ళారు.

"వీల్లేదు" - అని కేశవపిళ్ళ పెదవుల దాకా వచ్చింది. కాని ఆ మాటలు బయటికి రాలేదు. ఎంత దుర్దినం!

## ఇరవై నాలుగు

ఆ ముసలిది కాత్యాయనీ అమ్మతో ఏమేం చెపుతుందో కేశవపిళ్ళ ఊహించలేదు. అతనికి చాలా ఆందోళనగా వుంది. వాళ్ళిద్దరి మధ్యకూ వెళ్ళి కూర్చుంటే యెలా వుంటుందని అనుకున్నాడు. అతను దగ్గరవుంటే ఆ ముసలిది అన్ని విషయాలూ చెప్పక పోవచ్చు. ఒకవేళ చెప్పటం మొదలు పెట్టినా ఆమె వైఖరి మారవచ్చు. కానీ అతని హృదయం ఏదో తప్పు చేసినట్టు బాధపడుతూ వుంది. వాళ్ళిద్దరూ మాట్లాడు కుంటూవుంటే ఎదుట నిలబడే ధైర్యం అతనికి లేదు. ఆ ముసలమ్మ ఎవరు, ఎందుకు వచ్చింది అని విచారించి అన్ని విషయాలూ తర్కించి తెలుసుకునే తెలివి తేటలు

కాత్యాయనికి లేవు. అదే కేశవపిళ్ళైకు తృప్తి. పల్లెటూరి పిల్లకు అన్ని తెలివి తేటలుండవు.

ఏది యెలాగున్నా చీఫ్ సెక్రటరీగా ఛార్జి తీసుకున్నరోజు అంత శుభదినం కాదు. ఈనాడు కేశవపిళ్ళై తన వ్యక్తిగత జీవితంలో గడ్డుసమస్యను ఎదుర్కొంటున్నాడు. ఎంత దురదృష్టం! అసలు విషయం పూర్తిగా తెలుసుకుని కాత్యాయనీ అమ్మ భద్రకాళిగా మారుతుందేమో? ఆమె నిజ స్వరూపం కనిపించబోతున్నది. నిజంగా ఆమె స్వరూపమేమిటో అతనికి ఇంతవరకూ తెలియదు.

గదిలో నిర్విరామంగా సంభాషణ జరుగుతూ వుంది. ఆ ముసలిదానికి చెప్పతగింది, చెప్పతగనిది అనే వ్యత్యాసమే లేదు. అరమరలేకుండా అడగకుండానే అది అన్నీ చెప్పేస్తుంది. బహుశా కాత్యాయనీ అమ్మకు తెలుసుకునేందుకు మరేమీ మిగలక పోవచ్చు.

కాత్యాయనీ అమ్మ ఆఫీసు గదిలోకి వచ్చింది. ఆమె ముఖంలో మరో భావమేమీ కనిపించలేదు. కేశవపిళ్ళై మనస్సు కుదుటపడింది.

"ఆ ముసలామె యిక్కడ ఉండవచ్చునా?" అడిగింది కాత్యాయని. ఆ ప్రశ్న విన్న కేశవపిళ్ళైకు నమ్మకం కుదరలేదు, అంటే కాత్యాయనికి ఏమీ అర్థం కాలేదనే గదా!

ఆమె మళ్ళీ అడిగింది: "మనం ఈ స్థితికి వచ్చామంటే దానికి కారణమేమిటో మనం గుర్తుంచుకోవాలి గదా! పునాదిని మరిచి పోకూడదు. భగవంతుడికి సమాధానం చెప్పాలి".

కేశవపిళ్ళై యేమీ మాట్లాడ లేదు. కాత్యాయనీ అమ్మ మళ్ళీ అడిగింది: "ఏమీ మాట్లాడరేం?"

అనుమతి కోసం ఎదురుచూస్తూ నిలబడివుంది కాత్యాయని. ఆమెకు తన చరిత్ర పూర్తిగా తెలిసి వుండదు. ఉన్నట్టుండి ఏం చెప్పాలో కేశవపిళ్ళైకు బోధపడలేదు. కానీ ఒక పై వుద్యోగి తన కింద పనిచేస్తున్నవాణ్ణి అధికార పూర్వకంగా అడిగినట్టు అడిగాడు: "నీవు బాగా ఆలోచించే అడుగుతున్నావా?"

"అవును, ఇందులో నేను ఆలోచించవలసిందే ముంది?" అభిమానంతో వెంటనే సమాధానం వచ్చింది.

"ఈ రోజు నీకు ఆ ముసలమ్మ మీద ఏర్పడ్డ కనికరం తరవాత కరిగిపోతే.... "

కేశవపిళ్ళై మాట పూర్తి కాకముందే కాత్యాయని అందుకుంది: "నేను చావగొట్టి బయటికి నెట్టను. నమ్మక ద్రోహం చెయ్యను. నాకంతా తెలిసి పోయింది. ఆ రోజు వాళ్ళంతా చెప్పింది నిజమే అని కూడా తెలిసింది."

కేశవపిళ్ళైకు ఒళ్ళు చల్లబడింది. అతను మొద్దుబారి పోయినాడు. కాత్యాయనీ అమ్మ అన్నది: "ఇదంత గొప్ప విషయం కాదు. ఇది మన బాధ్యత. ఆ ముసలమ్మకు నేను పరిచర్య చేస్తాను. నాకేమీ అభ్యంతరం లేదు."

అయినా కాత్యాయనీ అమ్మ భర్త అనుమతి కోసం నిలబడి వుంది. కేశవపిళ్ళైకు కాదనాలనిపించింది.. భాగీరథీ అమ్మ అక్కడవుండకూడదు. కేశవపిళ్ళైకు ఎందుకో భయంగా వుంది. కాని భార్య ముఖం చూస్తే భాగీరథీ అమ్మ అక్కడ వుండేందుకు వీల్లేదని చెప్పలేక పోతున్నాడు.

"నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి" కాత్యాయనీ అమ్మకు ఇలాంటి సమాధానంతో అవసరం లేదు. "అయితే ఇక్కడ వుండేందుకు వీల్లేదని చెప్పి పంపించనా?" అన్నది.

"నేనన్న మాటకు అదేనా అర్థం?"

"లేకుంటే మరేమిటి? నీ యిష్టం వచ్చినట్టు చెయ్యమంటే అర్థమేమిటి?"

"అయితే ఆమెను ఇక్కడ వుండనీ" - ఈ మాట కేశవపిళ్ళై నోట అప్రయత్నంగా వచ్చింది.

కేశవపిళ్ళై యింకా ఏదో చెప్పాలనుకున్నాడు. కాని అప్పటికే కాత్యాయని వెళ్ళిపోయింది. "కాత్యాయనీ!" అని పిలిచాడు.

'ఏమిటి?' అని వెనకనుంచి కాత్యాయని పలికింది. కొంచెం సేపటికి ఆమె తిరిగి వచ్చింది. ఆమె ముఖంలో తృప్తి, ఆనందం కనిపించాయి. కాని వాటి వెనక అసలు విషయం తెలుసుకున్న భార్యలోని గ్లాని కేశవపిళ్ళై గమనించలేక పోయాడు. ఆమెను పరిశీలించి చూశాడు. కాని ఆ పల్లె పడుచు గుండె లోతుల్లోకి తొంగిచూసే సామర్థ్యం ఆ వుద్యోగి కళ్ళకు లేదు.

"ఏం? నన్ను పిలిచారా?" అన్నది కాత్యాయనీ అమ్మ.

"ఏం లేదు. ఏం లేదు".

"ఏం లేదా?"

"ఆమెకు చెప్పేశావా?"

"చెప్పేశాను. ఏం?"

"ఊరికే అడిగాను."

"ఎంత హాయిగా వుంది! మనం చేయవలసింది అంతవరకే, అంతవరకూ చాలు. లేకుంటే......."

ఆ యిల్లాలు తొలిసారి భర్త ముఖంలోకి తీవ్రంగా చూసింది. ఆమె చెప్పవలసింది చెప్పింది. కేశవపిళ్ళైకు ఆమె చూపులను సహించేశక్తి లేదు. అతను మళ్ళీ భర్తగా అధికారం సంపాయించాడు. అధికారిగా ఉత్తర్వు జారీ చేశాడు.

"సరే వెళ్ళు"

కాత్యాయనీ అమ్మ వెళ్ళి పోయింది.

కేశవపిళ్ళె పడక కుర్చీమీద పడుకున్నాడు - కాదు, పడిపోయాడంటే సబబుగా వుంటుంది. కొన్ని యేండ్ల క్రితం ఇష్టం లేకుండా మెడలో మంగళ సూత్రం కట్టి చీర పెట్టి యింటికి తీసుకుని వచ్చి మరిచి పోయిన ఆ యిల్లాలిని ఈనాడు కేశవపిళ్ళె అర్థం చేసుకుంటున్నాడు. ఆమె తన కెప్పుడన్నా జ్ఞాపకం వచ్చిందా? ఆమె జీవితాన్ని అతనెప్పుడయినా యిలా స్పృశించాడా? తనకొక భార్య వుందనే విషయమే గుర్తు లేకుండా జీవితం గడిపాడు. ఎప్పుడన్నా యింటికి వెళ్ళి నప్పుడు తనకొక భార్య వుందనే విషయం గుర్తుకొచ్చేది. వివాహమయినా తన 'భార్య'ను గుర్తించక పోవడం వల్ల అతనికి తన భార్య ఎలాంటిదో అర్థం కాలేదు. నేను, నా భర్త అనుకొనే ఒక భార్య తనకోసం జీవితం గడుపుతున్నదనే భావం కేశవపిళ్ళె మనసులో ఎన్నడూ మెదల లేదు. ఇప్పుడా యిల్లాలు రక్త మాంసాలతో, నిండు చైతన్యంతో ఎదుట కనిపిస్తూవుంది. అతను తన భార్యను చూస్తున్నాడు. కాని అర్థం చేసుకోలేక పోతున్నాడు.

తను వివాహం ఎందుకు చేసుకున్నాడో కేశవపిళ్ళె ఇంతవరకు ఆలోచించలేదు. అలాంటి ప్రశ్న ఎవరయినా అడిగితే అతని దగ్గర ఒకే ఒక సమాధానం వుంది- "అమ్మా, నాన్నా చెప్పారు గనక." అంతకు మించి అతనికేమీ తెలియదు. కాని యీనాడు కేశవపిళ్ళెకు తన వివాహం అర్థవంతమనిపించింది. ఒక కొత్త జీవితం ఆరంభమవుతున్నది - భార్యతో భర్త కాపురం.

కేశవపిళ్ళె కుర్చీలో నుంచి లేచి విచారిస్తూ అటూ యిటూ తిరుగు తున్నాడు. తన భార్య తనను ఇంకా ఎన్నో ప్రశ్నలు అడుగుతుంది. వాటికి సమాధానం చెప్పితీరాలి. అమెకు అంతా పూర్తిగా తెలిసి పోయింది. తెలిసిన విషయాలు ఆమెను బాధిస్తాయి. ఆ విషయం కేశవపిళ్ళెకు గొప్ప రహస్యంగా గోచరించింది. బహుశా భార్య అంటే అలాగే వుంటుంది. సరే, పోనీలే!

మాత్యూ, లూకోస్ అనే యిద్దరు మనుష్యులు వచ్చారని పోలీసువాళ్ళు వచ్చి చెప్పారు. వాళ్ళను లోపలికి పంపించమని కేశవపిళ్ళె ఉత్తర్వు ఇచ్చాడు. కొంచెం సేపటిలో కేశవపిళ్ళె చీఫ్ సెక్రటరీగా రూపొందాడు.

మాత్యూ, లూకోస్ మరెందుకో రాలేదు. కేశవపిళ్ళెను కలుసుకుని అతని ఆమోదాన్ని పొందాలి. ఆ రోజు ఛార్జి తీసుకున్న వార్త వాళ్ళకు అందింది. ఆ రోజే కలుసు కోవాలని నిర్ణయించుకున్నారు. నాయరు, గోపి కంట్రాక్టుకు సంబంధించిన పని కేశవపిళ్ళె, తదితరుల సాయంతో చక్కబడిందని వాళ్ళు చెప్పారు. లూకోస్ అన్నాడు:

"అందువల్ల ప్రభుత్వానికేమీ నష్టం కూడా రాలేదు."

కేశవపిళ్ళై కొంచెంగా నవ్వాడు.

ఆ రోజు ముఖ్య వక్త లూకోస్. ఇప్పటికి కూడా ప్రభుత్వం పక్షాన వుండటం వల్ల అతను అష్టకష్టాలు పడాల్సి వస్తోంది. పెద్దపేరు కూడా పడుతుంటాడు. అవన్నీ లూకోస్ ఏకరువు పెట్టాడు. ఏమీ తెలియనివాని వలె చివరకు అన్నాడు:

"వీటన్నిటికీ పర్యవసానం ఏమిటో తెలియదు".

కేశవపిళ్ళై లూకోస్ ముఖం మీద కొట్టినట్టుగా అన్నాడు: "మిస్టర్ లూకోస్! నేను ఒట్టి దద్దమ్మనని అనుకోకు. నీవు ఏమీ తెలియనట్టు నటించినంత మాత్రాన నేను నిన్ను నమ్మేస్తానని కూడా అనుకోకు. నాకు నీ విషయం బాగా తెలుసు. తెలిసిందా?"

లూకోస్ కొంచెం ఖంగారు పడ్డాడు. క్షమాపణ కోరుతున్నట్టుగా అన్నాడు: "ఒహెూ! అదా?"

"అదే, అదే, నాకన్నీ తెలుసు. మనం ఇలాగే ముందుకు వెళ్ళాలి. నీ సంగతి తెలిసే నేనంటున్నాను." కేశవపిళ్ళై అతన్ని వారిస్తూ అన్నాడు.

"నేనేం చేశాను?" అన్నాడు లూకోస్.

"నీవేం తప్పు చెయ్యలేదు మిస్టర్ లూకోస్! నిన్ను గురించి నాకేమీ సందేహం లేదు." అన్నాడు కేశవపిళ్ళై.

కేశవపిళ్ళై అభిప్రాయం మాత్యూ గమనించాడు. "ఏమీ లేదు లూకోస్! ఆయన చెప్పింది నిజం. అదే సబబు. నీకు తెలియకుండా బాధపడుతున్నావు." అన్నాడు మాత్యూ.

ఈ విధంగా వాళ్ళ సంభాషణ ముగిసింది. ఇక వెళ్ళతామని సెలవు తీసుకునే సమయంలో లూకోస్ ఒక చిన్న పెట్టెను కేశవపిళ్ళై ముందు టేబిలు మీద పెట్టాడు.

"ఇది మా తరఫున చిన్న కానుక."

మామూలు లాంఛన ప్రాయంగా కేశవపిళ్ళై అన్నాడు: "ఎందుకిదంతా? మీరు వచ్చినందుకే నాకు సంతోషం."

మాత్యూ సమాధానం చెప్పాడు: "చీఫ్ సెక్రటరీ అయినందుకు మీకు మా అభినందన చిహ్నం. రోజూ ఇది చూస్తే మేం గుర్తు వస్తాంకదా!"

ఇది కూడా ఒక నటనే అనుకొని 'సరే అంగీకరిస్తున్నాను" అన్నాడు కేశవపిళ్ళై.

కేశవపిళ్ళై లూకోస్‌కు మరో విషయం తెలియపరచాలను కున్నాడు: "సమ్మె కొంచెం శాంతించినంత మాత్రాన సమసి పోయిందని భావించ కూడదు. అది మరో రూపంలో తిరిగి రాబోతున్నది. సరేలే, అది తర్వాత చెప్తాను"

వాళ్ళిద్దరూ సెలవు తీసుకుని వెళ్ళారు.

కేశవపిళ్ళై టేబిలు మీద పెట్టిన పెట్టె చేతులోకి తీసుకున్నాడు. అది సొమ్ముల పెట్టె. కేశవపిళ్ళై పెట్టె తెరిచి చూశాడు. ముత్యాలు పొదిగిన నెక్లేసు. విలువ గలది. చూడముచ్చటగా వుంది.

కేశవపిళ్ళై కాత్యాయనీ అమ్మను పిలిచాడు. కాత్యాయనీ అమ్మ భాగీరథీ అమ్మతో తీరిక లేకుండా మాట్లాడుతూ వుంది. "ఇదుగో, ఇలారా" అనే కేక ఆమెకు వినిపించింది.

ఆ ముత్యాల నెక్లేసు చేతులో పట్టుకుని కేశవపిళ్ళై నిలబడి వున్నాడు. కాత్యాయనీ అమ్మ భర్త దగ్గరకి వచ్చింది. "ఎక్కడిదిది? అమ్మాయికి బాగుంటుంది. దాని ఒంటిమీద చక్కగా అమరుతుంది."

తియ్యని చిరునవ్వుతో కేశవపిళ్ళై ఆమెను సమీపించి ఆమె మెడలో ఆ హారం వెయ్యబోతూ అన్నాడు:

"ఇది నీ కోసమే"

"నాకా? నాకక్కర్లేదు. ఈ దండ వేసుకోవటం సిగ్గుచేటు. నాకు సిగ్గు వేస్తుంది. నా కక్కర్లేదు."

కాత్యాయని కాదంటే కాదన్నది. ఆమె కేశవపిళ్ళై ముఖంవైపు చూసింది. తన భర్త యింత సంతోషంతో నవ్వటం ఆమె యింతకు ముందెప్పుడూ చూడలేదు. ఆయన కళ్ళల్లో ఒక విధమైన కామం కనిపించింది. ఆ ముఖ వైఖరి అదేలా వుంది.

"ఈ హారం నీవు మెడలో వేసుకుంటే నాకు చూడాలని వుంది."

"ఎందుకు?" అడిగింది కాత్యాయని అమ్మ.

"ఎందుకేముంది? నీవు హారం వేసుకుంటే చూడాలని వుంది. అంతే."

కాత్యాయనీ అమ్మ నిలబడిపోయింది. "ఈ ముసలితనంలో నాకు మీరిలా శృంగారం చేస్తారా?" అన్నది.

"ఇందులో తప్పే ముంది?"

"సిగ్గేస్తుంది. ఈ హారం పెట్టుకుని నేను లోపలికి వెళితే పాప నన్ను చూసి చప్పట్లు చరిచి నవ్వుతుంది."

కేశవపిళ్ళై ఆమె మెడలో హారం వేశాడు. కాత్యాయని రొమ్ము మీద వేలాడుతున్న ఆ హారాన్ని అతను చేతిలో పట్టుకుని వున్నాడు. నెక్లేసుతో నిగనిగలాడే తన భార్య అందాన్ని అతను చూస్తున్నాడు.

కాత్యాయనికి ఇది కొత్త అనుభూతి. కేశవపిళ్ళై ఆమెను చూసి ఇంత మధురంగా ఇంతకు ముందెప్పుడూ నవ్వలేదు. ఉద్రేకంతో పరిశీలించ లేదు; అలంకారాలు అమర్చనూ లేదు, చూసి చూసి మురిసి పోనూ లేదు. భర్త వైఖరి చూచి కాత్యాయనీ అమ్మ గగుర్పాటు చెందింది. తలవంచుకుంది. ఆమె ముఖం ఎర్ర బారింది.

కాత్యాయనీ అమ్మ సిగ్గుతో తలయెత్తి చూసింది. ఆమె కళ్ళల్లో ఎన్నడూ లేని అందం చిందులు తొక్కుతూ వుంది. ఆ స్నిగ్ధ సౌందర్యంలో ఏదో అభిలాష తొంగి చూస్తూవుంది. 'నా కిది కావాలి' అని ఆమె జీవితంలో ఎప్పుడూ అడగలేదు - వాక్కు ద్వారా గానీ, మనసారా గానీ అడగలేదు. ఈ రోజు అడుగుతూ వుంది. ఎర్ర-బారిన ముఖం, సిగ్గు చిందే మందహాసం, ఉద్రేకంతో చిన్న బారిన కళ్ళు - అలాంటి కాత్యాయనిని కేశవపిళ్ళె ఎన్నడూ చూడలేదు. కాత్యాయనిలో అందం వుంది. స్ఫూర్తి వుంది. స్త్రీ సహజమైన ఆకర్షణ వుంది. కాత్యాయని కోరేది యేమిటో కేశవపిళ్ళెకు బోధపడింది.

చాలా కాలం క్రితం సచివాలయంలో రెవిన్యూ శాఖలోని గదిలో పెద్ద అల్మారా వెనక ముద్దు కోసం మురిసిపోయిన ముఖ ముద్రను అతను చూశాడు. ఆ ముఖవైఖరే ఇప్పుడు యీ ముఖంలో వుంది. అదొక విధమైన దాహం. బహుశా మగువలందరూ ముద్దును ఇలాగే అర్థిస్తారు కాబోలు! ఆ రోజు చుంబనం కోరిన ఆ ముఖం ఈ రోజు చుంబనం కోసం ఎదురు చూస్తున్న యీ వదనం - రెండింటినీ కేశవపిళ్ళె అప్రయత్నంగా పోల్చుకున్నాడు. అనుకోకుండానే అలా అయింది. 'చూడు, అల్మారా వెనక కనిపిస్తున్న ఆ ముఖం చూడు' - అని కేశవపిళ్ళె మనసులోపల ఎవరో అంటున్నట్టు అతనికి తోచింది. ఆ ముఖం కనిపించకుండా వుండేందుకు కేశవపిళ్ళె కళ్ళు మూసుకున్నాడు. మాయమై పోతున్న తంకమ్మ ముఖ మది. ఎవరో అంతస్సులో చేరి అడుగుతున్నారు - సుందరి యెవరని.

ఆ పరిస్థితిలో వున్న వ్యక్తికి అది చాలా చిక్కు ప్రశ్న - ఇద్దరు ఆడవాళ్ళపయినా మనసు నిలపలేక ఇచ్ఛాశక్తిని కోల్పోయి దిగజారి పోవటం, ఒక స్త్రీ మీద విసుగు పుట్టికూడా ఆమెను గుర్తు తెచ్చుకోవటం.

కాత్యాయని ముఖంలో నైరాశ్యం అలుముకున్నట్టు అతను గమనించాడు. ఆమె తన కోరిక తీర్చుకునేందుకు ఎంత సేపటినుంచో వేచియున్నది. 'ఇయ్యరా' అని కాత్యాయనీ అమ్మ అడుగుతున్నట్టు అతనికి తోచింది. కేశవపిళ్ళె రెండు చేతులూ చాచి ముందుకు వచ్చాడు.

పార్కువ్యూ ఆఫీసు గదిలో తలుపు చాటున చాచిన చేతుల మధ్య కాత్యాయనీ అమ్మ కేశవపిళ్ళె రొమ్ముకు హత్తుకుని పోయింది. కాత్యాయని అమ్మ కోరిక తీరింది. ఏండ్ల తరబడి సాగుతున్న వాళ్ళ దాంపత్య జీవితంలో ఆమె మామూలు ముద్దుకూడా ఎప్పుడూ కోరలేదు. కోరకపోయినా లభించి వుండ వచ్చు. కాని అడిగితే దొరకదని ఆమె అనుకుంటూ వచ్చింది. ఇప్పుడు కోరగానే లభించినందుకు ఆమెకు చాలా ఆనందంగా వుంది.

అయినా కేశవపిళ్ళెకు ఏదో కొరతగా వుంది. తన చేతుల్లో ఒదిగిపోయి ముఖంలో ముఖం పెట్టి నిలబడ్డది కాత్యాయని. కాని, ఒక్క నిమిషం కళ్ళు మూసుకుంటే ఆమె తంకమ్మగా మారిపోతుంది. ఆమె పెదవులకు తన

పెదవులు తగిలిన సమయంలో తంకమ్మను ముద్దు పెట్టుకుంటున్న దృశ్యం గుర్తుకు వస్తుంది. కాత్యాయనీ అమ్మను తన చేతులతో హత్తుకునే వేళ కేశవపిళ్ళైకు భయం వేస్తూంది. వెనక, అలాంటి భయంతోనే కేశవపిళ్ళై దిగజారిపోయాడు.

తన దాంపత్య జీవితంలో తంకమ్మ అలా చొచ్చుకుపోయింది. ఇకముందు ఆమె తమ మధ్యకు రాకుండా ఆపేందుకు ఈనాడతను ప్రయత్నిస్తున్నాడు.

పెండ్లయిన చాలా యేళ్ళకు భర్తకు 35 ఏండ్లు వయసు వచ్చిన తర్వాత కాత్యాయని పార్కువ్యూలో తన శోభనపు రాత్రి, వేడుకగా జరుపుకుంటూవుంది. ఆ రోజు సాయంత్రం కాత్యాయని తలలో పూలు పెట్టుకుంది - కేశవపిళ్ళై చెప్పినందు వల్లకాదు. చాలా రోజుల క్రింద పెండ్లయిన తర్వాత తొలిసారి, కేశవపిళ్ళై యింటికి వచ్చిన రోజు పూలను గురించిన చర్చ వచ్చింది. ఆ విషయం గుర్తుకు వచ్చి ఆమె మల్లెపూల దండ తలలో పెట్టుకుని వుంటుంది. పక్కమీద కూడా మల్లెపూలు చల్లింది. మల్లెపూలు భార్యాభర్తల మధ్య ప్రేమ భావాన్ని పరిమళింప జేస్తాయని కాత్యాయనీ నమ్మకం. ఆరోజు కాత్యాయని అమ్మ బాగా ముస్తాబయింది.

ఆ శోభనపు రాత్రికి ఒక ప్రత్యేకత వుంది. ఆ రోజు భార్యా భర్తల మధ్య చాలా సంభాషణ జరిగింది. గంట కొట్టినట్టు విరగబడి నవ్వటం, సరస సల్లాపాలే కాదు. ఆ రోజు కొన్ని విషయాలు తేల్చుకోవలసి వుంది. కాత్యాయనీ అమ్మకు చాలా విషయాలు తెలిసి పోయాయి. ఆ విషయం కేశవపిళ్ళైకు తెలుసు. కాత్యాయనీ అమ్మ తప్పకుండా చాలా ప్రశ్నలు అడుగుతుంది. వాటికి సరియైన సమాధానం యిచ్చి తీరాలి. కేశవపిళ్ళై ఒక నిర్ణయానికి రావాలి. నిజానికి వాళ్ళ దాంపత్యం ఆ రోజున ఆరంభమవుతున్నది.

కాత్యాయని అమ్మకు, భాగీరథీ అమ్మ మీద సానుభూతి వుంది. ఆమె మనస్సు మంచిదని కాత్యాయని అభిప్రాయం- పల్లెత్తి మాట్లాడదు. పాపం ఈ ముసలి తనంలో ఆమెకు ఇలాంటి కష్టం వచ్చింది, అన్నదామె. "ఎప్పటికీ అలాగే వుండాలి నీఅభిప్రాయం. తర్వాత భాగీరథీ అమ్మ టక్కరి, చెడ్డది అనకూడదు." అని హెచ్చరిక చేశాడు కేశవపిళ్ళై.

ఈ హెచ్చరికను నెమరు వేసుకుంటున్నట్టు కాత్యాయని అమ్మ కొంచెం సేపు కదలకుండా నిలబడ్డది. కేశవపిళ్ళై మంచం మీద కూర్చున్నాడు. ఆమెకు ఆలోచించుకునే వ్యవధి యిస్తున్నట్టు వాలకం పెట్టాడు.

కాత్యాయని అమ్మ యథార్థం తెలుసుకునేందుకు భర్త అంతఃకరణాన్ని ప్రశ్నించింది:

"నేనొక విషయం అడుగుతాను. నిజం చెప్తారా?"

"అడుగు, నిజం చెప్తాను" కేశవపిళ్ళై సమాధానం చెప్పాడు. "ఊఁ, ఏమిటది?"

కొంచెం సేపటివరకూ కాత్యాయనీ అమ్మ యేమీ మాట్లాడ లేదు. బహుశా ఎలా అడగాలా అని ఆమె ఆలోచిస్తూ వుంది.

"మీకు నా అవసరం లేదు కదూ?"

ఘాటయిన ప్రశ్న. నిజంగా కేశవపిళ్ళై యిలాంటి ప్రశ్న ఊహించలేదు. అది తలక్రిందులు చేసే ప్రశ్న. 'నీ పెళ్ళి నిశ్చయించాం' అని తండ్రి ఆజ్ఞాపించి నప్పుడు 'కావాలి', 'అక్కర్లేదు' అని యీనాటి వరకు కేశవపిళ్ళైకు అనిపించలేదు. అలాంటప్పుడు సమాధానం ఎలా చెప్తాడు?

కేశవపిళ్ళై సమాధానం ప్రశ్న రూపంలో వెలువడింది: "అంటే?"

"అంటే - నా అవసరం లేదన్న మాట. పెళ్ళి కూడా యిష్టం లేకుండా చేసుకున్నారు కదా! వదిలిపెట్టేందుకు మాత్రం ఇబ్బందేముంది?"

ఒక్క క్షణం ఆగి మళ్ళీ అన్నది : "నేను చనిపోయినా మీకు దిగులుండదు. నేననేదాన్ని ఒకతెను ఉన్నానని మీకు గుర్తు కూడా వుండదు."

కాత్యాయనీ అమ్మ భర్త కళ్ళల్లో కళ్ళు పెట్టి అడిగింది. కేశవపిళ్ళై సమాధానం చెప్పాడు:

"ఏమిటి నీవు పిచ్చి మాటలు మాట్లాడుతున్నావ్?"

"పిచ్చి మాటలు కావు, నిజం మాట్లాడుతున్నాను. నిజం. నాకు స్వానుభవంలో దొరికిన నిజం. ఇది నిజం కాదా? చెప్పండి."

"అదే నిజమయితే ఈనాడు నీవిలా పక్క మీద పడుకుని వుంటే నేనిలా కూర్చుని వుంటానా?"

కాత్యాయనీ అమ్మ వెంటనే సమాధానం చెప్పింది. అచ్చం పల్లెటూరి పడుచు నమ్మకం నుంచి బయటబడ్డ సమాధానమది - "అలా అనకండి. అది నొసట రాసిన రాత. విధి, దాని నెవ్వరూ తప్పించలేరు."

కేశవపిళ్ళై పక్క లెగరేస్తున్నాడు. ఇద్దరూ కొంచెం సేపు మౌనంగా వున్నారు. ఆ తర్వాత కాత్యాయనీ అమ్మ అన్నది:

"నేను నా అనుభవాన్ని గుర్తు తెచ్చుకుంటున్నాను."

"అది యిప్పుడు గుర్తు తెచ్చుకుంటున్నావా?"

"లేదు. అప్పుడు ఇలా ఆలోచించలేదు. కానీ నా దగ్గరికి ఎందుకు రావటం లేదు- అని ఆలోచించే దాన్ని. పని ఒత్తిడివల్ల రావటం లేదని అందరూ అనేవాళ్ళు. నిజమే కాబోలునని సమాధాన పరుచుకునే దాన్ని. బయటపని చేసేవాళ్ళు, భార్య కోసం దిగులు పెట్టుకుని కూర్చుంటారా అనుకునే దాన్ని. ఏదో పొరపాటు ఉందని అప్పుడప్పుడూ అనిపించేది. ఇప్పుడు నాకంతా తెలిసిపోయింది."

కేశవపిళ్ళె ఆమె చెప్పిందంతా సారహీనమని తేల్చేందుకు తల వంచి కాత్యాయని చెక్కిలి మీద చిటికె వేసి అన్నాడు:

"ఏమిటి నీకర్థమయింది? లేనిపోని మాటలతో మనస్సు బాధపెట్టుకోకు."

"అయితే బడాయిలు కొట్టటం, తమాషా చెయ్యటం కూడా చేతనవునన్న మాట." అన్నది కాత్యాయని అమ్మ.

కేశవపిళ్ళె దాన్ని కూడా పరిహాసంగా భావించి అన్నాడు: "ఒసి పిచ్చిదానా? నీ చెంప గిల్లేందుకు కూడా నాకు హక్కు లేదా?"

కాత్యాయనీ అమ్మ సమర్థిస్తూ అంది: "నేను అలా అనుకో లేదు. అందరూ ఏమేమో అంటున్నా నేను మాత్రం నమ్మలేదు. పెళ్ళి అయిన తర్వాత ఒక్కసారి కూడా నా వైపు ఎందుకు చూడలేదో నాకిప్పుడు బోధపడింది."

"ఆ ముసలిది వచ్చి అంతా తారుమారు చేసి నట్టుంది."

కాత్యాయనీ అమ్మ వారిస్తూ అన్నది: "లేదు లేదు. ఆమె యేమీ అనలేదు. ఆమెను ఏమీ అనవద్దు. ఆమె అమాయకురాలు. హృదయం మంచిది."

హృదయాన్ని బాధించే సంగతులు కాత్యాయనికి చాలా తెలిసి పోయాయి. ఆమె మనస్సు బాధపడుతున్నది. ఆ విషయం కేశవపిళ్ళెకు తెలుసు.

క్షణాలు భారంగా గడుస్తున్నాయి. కాత్యాయనీ అమ్మ కదలకుండా పండుకుని వుంది. కొత్తగా తెలిసిన విషయాలను బట్టి ఆమె తన వెనకటి జీవితాన్ని నెమరు వేసుకుంటూ వుంది. ఆ రోజుల్లో కేశవపిళ్ళెను గురించి విన వచ్చిన దుర్వార్తలన్నీ ఒక్కొక్కటీ ఆమె స్మృతిపథంలో మెదులుతూ వున్నాయి. పెళ్ళినాడే, పెళ్ళి కూతుర్ని ఒక్కసారి కూడా చూడకుండా పెళ్ళి కొడుకు వెళ్ళి పోవటం - ఎక్కడయినా వుందా? కాత్యాయని యెంతమంది పెళ్ళిండ్లనే గుర్తుకు తెచ్చుకుంది. ఇలా యెక్కడా జరగలేదు. ఇదివరకు కూడా కాత్యాయనీ అమ్మ - అప్పుడప్పుడూ యిలా ఆలోచించేది. అయినా సమాధాన పడేది. తిరువనంతపురంలో పని చేసే వాడుకదా! నౌకరీ పోకుండా చూసుకోవాలి కదా! మామగారూ, కిట్టుమామా అదేమాట చెప్పుండేవాళ్ళు. కాని యిప్పుడు కొత్త విషయాలు తెలిసిన తర్వాత పాత సంగతులను నెమరు వేసుకుంటూవుంది. 'తన అవసరం ఆయనకు లేదు' - నిజమే, ఇష్టం లేకుండా చేసుకున్న వివాహం. ఎన్ని నెలల తర్వాతనో వచ్చాడు. ఇరుగు పొరుగు వాళ్ళు ఏదో ఊహించి అనేవాళ్ళు. ఇప్పుడదంతా నిజమని తెలిసింది. 'అక్కడ తిరువనంతపురంలో అతనికి ఒక ప్రియురాలు వుంది' - అని చెరువు దగ్గరా, అక్కడక్కడా అమ్మలక్కలు అంటుండేవాళ్ళు. అవన్నీ చెవుల్లో మారు మోగుతూ వున్నాయి. పాపం అత్తయ్య, వాళ్ళతో గంటకు నలభై సార్లు తగులాడుతూ వుండేది.

కాత్యాయనీ అమ్మ ఆలోచనలు వప్పు పిళ్ళ, కుట్టి అమ్మ వైపు ప్రసరించినాయి. అత్తయ్య అత్తయ్యే. మామయ్య మామయ్యే. వాళ్ళను తలుచుకుంటే ఆమెకు వాళ్ళ అనురాగమే గుర్తుకు వచ్చింది. 'అమ్మాయీ' అంటూ వాళ్ళు పిలవటం ఇప్పటికి ఆమె చెవుల్లో వినిపిస్తూ వుంది. అది పరిపూర్ణమైన వాత్సల్యం. ఆ తల్లి తనను తన గర్భవాసంలో నుంచి కనలేదు. అంతే భేదం. ఆ ముసలి దంపతులు ఎంత అన్యోన్యంగా వుండేవాళ్ళు. భార్యా భర్తల మధ్య ఒక అనుబంధం. రోజుకు కనీసం పదిసార్లు 'పాడు ముండా', 'నీ బండ బడా' అని తిట్టుకునేవాళ్ళు. పెద్దగా కేకలు వేసుకునేవాళ్ళు. కాని మరుక్షణంలోనే 'ఎవరక్కడ?' 'ఆకూవక్కా తీసుకురా' అని మామయ్య అనగానే అత్తయ్య ఆకూవక్కా తీసుకుని తయారయ్యేది. ఒక్కొక్కప్పుడు గంటల తరబడి యిద్దరూ కూర్చుని మాట్లాడుకునే వాళ్ళు. భార్యా భర్తల మధ్య అలా అంత సేపు మాట్లాడుకునేందుకు ఏం మాటలుంటాయని కాత్యాయనికి అనిపించేది. మామయ్య వెనక అత్తయ్య ఎప్పుడూ కనిపిస్తూ వుండేది. వెనక భార్య కనిపించకపోతే మామయ్య పిలిచేవాడు. ఆ అన్యోన్యానురాగంలో తరుగుపోని నురుగు కనిపించేది. వయసులో కూడా వాళ్ళిలాగే వుండేవాళ్ళా అని కాత్యాయని అనుకునేది. నిండు వయసులో భార్యా భర్తలు ఇలా అన్యోన్యంగా వుంటారా అని ఆమెకు చాలా సార్లు సందేహం ఏర్పడేది.

అయినా వెనక్కి తిరిగి చూస్తే ఆ జీవితంలో చీకూ చింతా లేదని అనిపించింది కాత్యాయనీ అమ్మకు. అత్త మామ అండదండల్లో జీవితం హాయిగా గడిచింది. దిగులు లేదు. కొరత లేదు. పెళ్ళికాక ముందు వున్న ఆప్యాయం అలాగే కొనసాగింది. ఏలోటూ లేకుండా పొలం, ఇల్లు, వాకిలి, డబ్బు అన్నీ పుష్కలంగా వుండేవి. ఇప్పుడు తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. వాళ్ళు చనిపోయిన తర్వాత ఆమెకు ఆవేదన ఆరంభమయింది. ఈనాడు ఆమె చాలా ఉద్రేకంతో వుంది. తనది దిక్కులేని జీవితమయిందని పించింది కాత్యాయనీ అమ్మకు.

దిగులుతో కేశవపిళ్ళ, పక్కనే కూర్చుని వున్నాడు. కాత్యాయనీ అమ్మ కేశవపిళ్ళ వైపు చూసింది. కేశవపిళ్ళ ఆ విషయం గమనించలేదు. ఈ కూర్చున్న వ్యక్తి ఆమెకు సంరక్షకుడు, జీవిత సర్వస్వం. అతను విలుకోలేడా? తనకు కాత్యాయని అవసరమన్నట్టుగా అతనెప్పుడూ ప్రవర్తించలేదు. ఈ రోజు మాత్రమే హారం మెడలో వేసి ప్రేమతో చూశాడు. బుగ్గ గిల్లాడు. చాలసేపు మాట్లాడాడు.

తన భర్త తనను ఇంత బిగువుగా ఎప్పుడూ కౌగిలించుకోలేదు. ఇంత ప్రేమగా ముద్దు పెట్టుకోలేదు. అది ఒక అనుభూతి. తంకమ్మ అనే ఆవిడను.

కూడా ఆయన ఇలాగే కౌగిలించుకుని వుంటాడా? మెడలో దండవేసి వుంటాడా? చాలా సేపు కబుర్లు చెప్పి వుంటాడా?

ఇలాంటి ప్రశ్నలు వరుసగా ఏరికోరి ఆమె మనస్సులో ఉబికి వచ్చాయి.

"ఆ తంకమ్మ యిలాగే పండుకొని వుంటే ఆమె పక్కన ఇలాగే కూర్చునే వారా?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

"అవును" వెంటనే సమాధానం వచ్చింది. తన తప్పు ఒప్పుకుంటున్నట్టుంది ఆ సమాధానం.

"నన్ను చేసుకున్న తర్వాత కూడానా?"

కాత్యాయనీ అమ్మ చెయ్యి తన చేతిలోకి తీసుకుని నలుపుతూ అన్నాడు కేశవపిళ్ళై: "కాదు, అంతకు ముందు జరిగిందంతా నీకు నిజం చెప్తాను. అదంతా నీవు మరిచి పోవాలి. నన్ను నమ్ము. నాకు నీవు ఒక్క దానివే. నీవు తప్ప మరెవ్వరూ లేరు."

కేశవపిళ్ళై ఆలోచిస్తున్నాడు - ఈ నూతన జీవితం ఎలా ఆరంభించాలని. జరిగిందంతా దాచాలా? చెప్పేయ్యాలా? ఆ వ్యక్తిగత జీవితం వైపు వెనక్కి తిరిగి చూశాడు. ఈనాటి వరకూ తనని ప్రేమించిన వ్యక్తి ఒక్కరే కనిపించారు. అవసానకాలంలో గొంతులో నీళ్ళు పోసే వ్యక్తి ఒక్కరే. అదే కాత్యాయని. మరెవ్వరూ లేరు. ఆ మార్గంలో మరెవ్వరూ కూడా రారు. ఆమె మాత్రం అతన్ని వెన్నంటి వస్తూవుంది - పిలిచినందువల్లకాదు, తనంతట తానే. ఆమె దగ్గర దాపరికమెందుకు? అంతా తేటతెల్లంగా చెప్పేస్తాను. ఆమె క్షమిస్తుంది.

"నీకు నా మీద నమ్మకముందా?" అడిగాడు కేశవపిళ్ళై.

'నమ్మకముంది' - అన్నట్టుగా కాత్యాయనీ అమ్మ తల వూపింది. "అయితే అడుగు. నీవడిగిందల్లా చెప్తాను" అన్నాడు కేశవపిళ్ళై.

"ఏమడగాలో నాకు తెలియదు. మీరే చెప్పండి, చెప్పవలసిందంతా."

కేశవపిళ్ళై తనకు తెలిసిన యధార్థం చెప్పాడు: "దానికి నా మీద ప్రేమ లేదు."

ఈ విషయం కాత్యాయనీ అమ్మకు తెలిసి పోయింది. ఆమె తెలుసుకోవలసిన విషయం ఇదికాదు. తన భర్తకు ఆమె మీద ప్రేమ ఉన్నదా అనే విషయం ఆమెకు కావాలి. ఇది గడ్డు ప్రశ్న. ప్రేమ వుందా? లేదా? ఏమీ చెప్పేందుకు వీల్లేదు.

"నీ పెళ్ళికి ముందు మేము పక్కపక్కన కుర్చీల్లో కూర్చునే వాళ్ళం. నాలో ఒక ఉద్రేకం, ఆవేశం వుండేది."

"పెళ్ళి తర్వాత అది లేదా?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

"లేదు."

కాత్యాయనీ అమ్మకు నమ్మకం కుదరలేదు. కృత్రిమంగా నవ్వుతూ, కృత్రిమంగా కులుకుతూ ఆమె అన్నది:

"అరే అరే మళ్ళీ అబద్ధం చెప్తున్నారే? ఆ తర్వాత దాని దగ్గరకి వెళ్ళలేదా?"

కేశవపిళ్ళె చిలకపలుకులు పలికాడు: "చాలా రోజుల నుంచీ అంటే పెండ్లి తర్వాత నేను దాని దగ్గరకి వెళ్ళ లేదు. అది రామచంద్రన్ నాయర్ అనే ఆయన దగ్గరికి వెళ్ళింది. మరో విషయం. అది రాక్షసి. పిశాచి. నీకో విషయం చెప్తాను. అది నన్ను అసంతృప్తితో విదిలించి పంపేసింది. ఆ తర్వాత నేను వెళ్ళలేదు."

కాత్యాయనీ అమ్మ నమ్మ లేదు. కేశవపిళ్ళె ఆ సంఘటనను గురించి వివరించాడు. కాని కాత్యాయనీ అమ్మకు అదంతా అబద్ధంగా తోచింది. అయినా కాత్యాయనీ అమ్మ నమ్మినట్టే నటించింది." మళ్ళీ అక్కడికి వెళ్ళారు గదూ?" అన్నది కాత్యాయనీ.

కేశవపిళ్ళె సమాధానం చెప్పాడు: "అవును, వెళ్ళాను. చాలా రోజుల తర్వాత. అప్పుడు నేను అసిస్టెంట్ సెక్రటరీని. శేఖర పిళ్ళె అవసాన సమయంలో నేనక్కడికి వెళ్ళాను. అది నా కర్తవ్యం. శేఖర పిళ్ళె చాలామంచి వ్యక్తి. ఈనాడు మనమిక్కడ వున్నామంటే దానికి కారణం శేఖర పిళ్ళె, లేకుంటే ఈనాడు నా జీతం సుమారు వందరూపాయలే వుండేది. అలాంటి వ్యక్తిని మనం మరిచి పోగలమా?"

"ఆ వ్యక్తి మనకు ఇంత ఉపకారం ఎందుకు చేసినట్టు? అమ్మాయినిచ్చి చేసేందుకేగా?" అన్నది కాత్యాయని అమ్మ.

"అవును, కాని తంకమ్మకు నేను నచ్చలేదు. అది రామచంద్రన్ నాయరుతో వెళ్ళింది. అదృష్టవశాత్తు అది మంచిదే అయింది. నిజానికి కిట్టుమామ చెప్పిన మాట నిజం. నీవు అదృష్టవంతురాలివి. మిగిలిన జ్యోతిష్కులు కూడా ఆ మాటే చెప్పారు."

కాత్యాయని అమ్మకు ఈ మాటలు అంత రుచించలేదు. "అయితే?" అని అడిగింది.

"అయితే యేముంది?"

కేశవపిళ్ళె పసి పిల్లవాడిలాగా కాత్యాయని ముక్కు పట్టుకుని ముద్దాడాడు.

"దానికి యిల్లు కట్టించి యిచ్చిన సంగతేమిటి?" అని అడిగింది కాత్యాయని అమ్మ.

"శేఖర పిళ్ళె చనిపోయాడు. మనకు చేసిన మేలుకు బదులుగా నేనా యిల్లు కట్టించి యిచ్చాను. ఆయన ఋణం తీర్చుకునేందుకు ఏమీ చెయ్యలేదనే కొరత నా మనస్సులో వుండేది."

"అయినా అక్కడికి వెళుతూ వున్నమాట?"

ఇలా ఆమె ప్రశ్న తర్వాత ప్రశ్న అడుగుతూ వుంది. ఈ చదువురాని పిల్ల అంత తెలివి తక్కువదిగాదు. ఇంకా అడుగుతుంది. భార్యగా ఆమెకు అడిగేందుకు హక్కుంది. తేలికగా నవ్వుతూ కేశవపిళ్ళె సమాధానం చెప్పాడు: "ఊరికినే వెళ్ళాను. నీవిక్కడ వున్నదెప్పుడు గనక? నేను మగవాణ్ణి గదా! అప్పుడప్పుడూ తమాషాగా కబుర్లు చెప్పేందుకు వెళ్ళాను. అది రాక్షసి. అమ్మయ్యో! కాని అలాంటి ఆడవాళ్ళుంటారు. భయంకరమైన వాళ్ళు: తృప్తి లేని స్త్రీ."

"ఊరికే తమాషాగానా? అంతేనా?" అడిగింది కాత్యాయని అమ్మ.

"అవును."

కాత్యాయని అమ్మ నమ్మలేదు. ఆ మాట యే ఆడదీ నమ్మలేదు. "ఊరికే తమాషాకు" అని భర్త అంటే యే భార్య సహిస్తుంది?

కేశవపిళ్ళె చెప్పాడు: "అవన్నీ పోనీ, అదంతా గడచిన కాలం. కేశవపిళ్ళె అవన్నీ మరిచి పోయినాడు. అదికూడా సన్యాసం తీసుకోబోతున్నది. మనం కట్టించి యిచ్చిన యిల్లు ఆశ్రమం కాబోతూ వుంది. అన్నీ గతించాయి. నేను నీవాడిని. నీవు నా దానివి. అంతే. అంతకు మించి మరెవ్వరయినా వున్నారా?"

కేశవపిళ్ళె తల వంచి తన ముఖాన్ని కాత్యాయని అమ్మ ముఖంతో చేర్చాడు. కాత్యాయని అమ్మ ఆ చుంబనంలోని వెచ్చదనాన్ని గమనించకుండానే పండుకొని వుంది - నిశ్చలంగా.

కాత్యాయని అమ్మ తెలుసుకోవలసిన విషయాలన్నీ తెలుసుకుంది కేశవపిళ్ళె చెప్పవలసినవన్నీ చెప్పేశాడు. ఇక మిగిలింది బహుశా ఒక్కటే - ఈ వ్యాపారంలో మిగిలిన లాభం. అది తేలితే కాత్యాయని అమ్మ అన్నీ మరిచి పోయి క్షమించ గలుగుతుంది.

ముఖంలో ముఖం పెట్టి కేశవపిళ్ళె నిజం బయట పెట్టాడు: "మనం ఈ స్థితికి వచ్చాం. చాలా పొలం సంపాయించుకున్నాం. ఇదంతా నాదికాదు, నీది. నా కంటె ముందు ఉద్యోగంలో ప్రవేశించినవాళ్ళు, నా కంటె సమర్థులు, తెలివిగల వాళ్ళు చాలా మంది వున్నారు. ఈ నాటికి కూడా వాళ్ళు నూటయాభై రూపాయల జీతంతో కాలక్షేపం చేస్తున్నారు. ఇవన్నీ మనకు లభించాయి. నీ పట్ల నేను గొప్ప అపరాధం చేశాను. కాని అది అభివృద్ధికోరి చేశాను. నా హృదయేశ్వరీ, నన్ను క్షమించవా?"

కేశవపిళ్ళె కాత్యాయని అమ్మ ముఖం మీద ముద్దుల వర్షం కురిపించాడు. ఆమె కదలకుండా పండుకుని వుంది. అవన్నీ ఆమెకు పట్టలేదు. "నన్ను క్షమించవూ?" అన్నాడు కేశవపిళ్ళె మరోసారి.

కేశవపిళ్ళె కాత్యాయనీ అమ్మ ముఖంవైపు జాగ్రత్తగా చూశాడు. "దానితో హాయిగా కాలక్షేపం చేసేందుకేగా నన్ను తిరువనంతపురం తీసకురాంది?" అన్నదామె.

మరో కొత్త విషయం తట్టింది. కాత్యాయనీ అమ్మకు ఆ విషయం చెప్పి తీరాలి. ఆ విషయం ఆమె తెలుసుకుని తీరాలి. ఆ విషయం కేశవపిళ్ళె చెప్పాడు: "లేదు. నీవు పొరపాటు పడుతున్నావు. నీవు అమాయకురాలివి. నీకేమీ తెలీదు. అభివృద్ధి కోసం నేనా నాటకం ఆడాను. కావాలనే నిన్ను తీసుకురాలేదు. ఈ రోజు మనం పడుకున్న పడకగది వుందే, దానికే నాలుక వుంటే యెన్ని కథలు చెపుతుందో? నీకు తెలియదు."

కేశవపిళ్ళె యేదో గొప్ప విషయం చెప్పబోతున్నాడు. కొంచెం అపనమ్మకంతో కాత్యాయనీ అమ్మ అడిగింది: "చెప్పండి, ఏమిటది?"

"ఇక్కడికి నేను చీఫ్ సెక్రటరీకి పర్సనల్ క్లర్కుగా వచ్చినప్పుడు ఎన్నో విషయాలు చూశాను. దీవాన్‌జీకి ఒక పర్సనల్ సెక్రటరీ వుండేవాడు. ఈ రోజు అతను లేడు. అతను ప్రతిరోజూ పగలే యిక్కడికి వచ్చేవాడు. వచ్చి - రామరామ! ఏమేమో చూశాను. భయం వేసేది."

కేశవపిళ్ళె భగవతి కుట్టి అమ్మ జీవితాన్ని గురించి వర్ణించాడు. కృష్ణన్ నాయరు అభివృద్ధికి కారకురాలు భగవతి కుట్టి అమ్మ. ఆ తర్వాత చాలామంది ఉద్యోగస్థుల భార్యలను గురించి కేశవపిళ్ళె చాలా కథలు చెప్పాడు.

"నేను ఉన్నదున్నట్టు చెప్పేస్తున్నాను. అప్పుడు నిన్నిక్కడికి తీసుకు రాకపోవటానికి కారణం నా భయం. నా భార్య పవిత్రంగా వుండాలని నా ప్రబల వాంఛ. నేను ఆడే నాటకంలో బహుశా నీవు కూడా నిన్ను ఆపుకో గలిగే దానివి కావేమో! ఇక్కడ పై వుద్యోగాలు, ఉన్నతి అంతా భార్యల వల్లనే సాధ్యమవుతాయి. కింద వుద్యోగస్థుని భార్య మీద, పై వుద్యోగస్థుని దృష్టిపడిందంటే - ఇక ఆమె చిక్కులో పడ్డట్టే. అందరి జీవితాలను ఒకసారి చూస్తే వాళ్ళ భార్యల చాకచక్యం తెలుస్తుంది."

ఈ కదలన్నీ వింటుంటే కాత్యాయనీ అమ్మకు కొంచెం భయం వేసింది. "అయితే మరి నన్ను ఇలాంటి చోటుకు ఎందుకు తీసకొచ్చారు?" అని అడిగింది.

కేశవపిళ్ళె నవ్వుతూ అన్నాడు: "పిచ్చిదానా! భయపడకు. ఇప్పుడు నిన్ను ఎవ్వరూ బాధించరు. నా స్థితి అప్పటికి ఇప్పటికీ చాలా మారింది. తన భర్త అభివృద్ధికి రావాలంటే, నీవు కొచ్చమ్మవు కావాలని నీకు లేదుగదా?"

"బాబూ! నాకవన్నీ యేమీవద్దు. పల్లెటూళ్ళో వంటింట్లో పప్పు, కూర వండుకుంటూ చీకట్లో కూర్చోటం మేలు. ఇక్కడికి వచ్చినప్పటినుంచి నాకు నిద్ర పట్టటంలేదు. నన్ను మళ్ళీ అక్కడికి పంపిస్తే చాలు. నేను కొచ్చమ్మనూ కాను, నాకు పెద్ద పెద్ద లోగిళ్ళూ అక్కరలేదు. పోలీసుల కాపలా మధ్య వుండాలని నాకు లేదు."

కాత్యాయనీ అమ్మను రేకెత్తిస్తూ కేశవపిళ్ళై అన్నాడు: "కుట్టి నాటి రైతు భార్యగా వుండాలని వుందా?"

కాత్యాయనీ అమ్మ నిండు హృదయంతో సమాధానం చెప్పింది: "కుట్టినాటి రైతు భార్యకావాలని నాకు లేదు. నా కూతురి తండ్రి కుట్టినాటి రయితైనా నాకు తృప్తే."

"చీఫ్ సెక్రటరీ భార్య కావాలని లేదా?" అన్నాడు కేశవపిళ్ళై.

"లేదు లేదు. ఉద్యోగస్థుడి భార్యగా ఉండటం నాకు తెలియదు. ఇలాంటి వుద్యోగాలు చేసే వాడి భార్యగా ఎలా వుండాలో నాకు తెలియదు."

ఒక్క క్షణం ఆగి కాత్యాయనీ అమ్మ మళ్ళీ అన్నది: "అందుకేనా అలాంటి అడదాన్ని వెతుక్కుంటూ వెళ్ళారు?"

దీర్ఘంగా నిట్టూర్పు విడుస్తూ కాత్యాయనీ అమ్మ అన్నది: "ఇక ముందు వెళ్ళరని నమ్మకం మాత్రమేముంది?"

"లేదు కాత్యాయనీ, లేదు."

కాత్యాయనీ అమ్మ వెక్కి వెక్కి యేడ్చింది. ఇంతవరకూ ఆ ఆడ కూతురు ఏడుపు ఆపుకుంది.

కేశవపిళ్ళై యేమేమో చెప్పి ఆమెను ఓదార్చుతున్నాడు. "ఉన్నదున్నట్టు అంతా చెప్పటంవల్లనే యీ ముప్పు వచ్చినట్టుంది" అన్నాడు దిగులుగా.

## ఇరవై అయిదు

మరునాడు కేశవపిళ్ళై మొట్టమొదట చేసిన పని - తంకమ్మ రాజీనామా ఆమోదించి ఆమెను ఉద్యోగం వదులుకునేందుకు అనుమతించటం. అలా ఉత్తర్వు జారీ చేసేప్పుడు అతని చేతులు వణకలేదు. మనస్సుకు బాధకూడా కలగలేదు. మామూలుగా ఉత్తర్వు ఇచ్చినట్టేవుంది. చీఫ్ సెక్రటరీ అయిన తర్వాత కేశవపిళ్ళై చేసిన మొదటి ఆఫీసు పని యిదే. మనస్సుకు బాధ కలిగించే తోటి వ్యక్తి ఒకరు విడిపోతే కలిగే హాయి అతనికి కలిగింది.

ఆ రోజే ఒక సూపరింటెండెంటు, ఒక ఆఫీసు మేనేజరు రాజీనామాలు కూడా ఆమోదించవలసి వుంది. వాళ్ళిద్దరూ కూడా మహిళలే. వాళ్ళుకూడా సన్యాసం తీసుకోబోతున్నారు.

వార్త విని భాగీరథీ అమ్మ చాలా విలపించింది. ఆమెను ఎలా ఓదార్చాలో కాత్యాయనీ అమ్మకు తెలియలేదు.

కేశవపిళ్ళై వ్యంగ్యంగా అన్నాడు: "ముసలమ్మతో మసలటం కష్టంగా వుందా?"

కాత్యాయనీ అమ్మ తగిన సమాధానం చెప్పింది: "అత్తగారు, దగ్గర వుండటం మీకు ఇష్టంగదా! అది దాచుకునేందుకే యిలా అడుగుతున్నారు."

కేశవపిళ్ళై విధిలేక అన్నాడు: "నీ యిష్టం వచ్చినట్టు అను. అన్నీ విని సహిస్తుంటాను."

ఇలాంటి సంభాషణ అక్కడ అప్పుడప్పుడూ జరుగుతూ వుంటుంది. కేశవపిళ్ళై అన్నింటికి సర్దుకు పోతూ వున్నాడు. అయినా అది మంచి కుటుంబం. తల్లి, తండ్రి, కూతురు ఆనందంగా కాలం గడుపుతున్న సత్కుటుంబం. దూరంగా వుండి భాగీరథీ అమ్మ యిలాంటి మనోహరమైన దృశ్యాన్ని చూస్తూ వుంటుంది. అందులో చొరబడేందుకు ఆమెకు అధికారం లేదు. అందువల్ల ఆమె అక్కడికి వెళ్ళదు. అక్కడ వుండవలసింది తంకమ్మ. అలా ఆమెకు అనిపిస్తూ వుంటుంది. తన కూతురు చేతులారా తన జీవితం పాడు చేసుకుందని అనుకుంటుందామె.

ఈలోగా భక్తి విలాస్‌లో ఒక రహస్య సమావేశం జరిగింది. భారత దేశం స్వాతంత్ర్యాన్ని పొందేందుకు మరెంత కాలమో పట్టదు. స్వతంత్ర తిరువితాంకూరుకు సంబంధించిన తుది ప్రయత్నాలు సాగుతూ వున్నాయి. హైదరాబాదు, మైసూరు లాంటి రాజ్యాలను గురించి ప్రభుత్వం ఆలోచిస్తూ వుంది. ఆ తుది ప్రయత్నాల రూపు రేఖలు తయారవుతున్నాయి.

తిరువితాంకూరు స్వాతంత్ర్యాన్ని పురస్కరించుకుని మరికొన్ని ప్రాంతీయ రాజ్యాలతో ప్రభుత్వం సంప్రతింపులు జరుపుతూ వుందని దేశంలో గాలివార్తలు వినబడుతూ వున్నాయి. కొత్తగా ఏర్పడబోతున్న పాకిస్తాన్‌తో వ్యాపార సంబంధాలను గురించీ, తిరువితాంకూరు స్వతంత్ర ప్రతిపత్తిని గురించి ఒప్పందం జరిగింది. ప్రాంతీయ పరిపాలనను గురించీ యేమీ ఏర్పాట్లు చేయకుండా ఆంగ్లేయులు వెళ్ళిపోతే ప్రభుత్వం అన్ని విధాలా లాభం పొందేందుకు నిర్ణయించుకుంది. దేశమంతా తహతహలాడుతూవుంది. ఆగస్టు 15 నుంచీ తిరువితాంకూరు భారతదేశం నుంచి వేరు పడితే? - ప్రజలు ఈ పరిస్థితిని ఊహించ లేకుండా వున్నారు

ఆరోజు కూడా రేషను దుకాణం వాళ్ళు, కంట్రాక్టర్లు 'స్వతంత్ర తిరువితాంకూరుకూ జై' అని కేకలు పెడుతూ వెళ్తున్నారు. వాళ్ళకు కూడా ఒక జెండా వుంది. పోలీసులూ, జాతీయ జీవితంలో దెబ్బతిన్న వాళ్ళూ వాళ్ళకు నాయకత్వం వహిస్తూ వున్నారు.

ప్రాంతంలోని విద్యాసంస్థలన్నీ మేల్కొన్నాయి. దేశమంతటా విద్యార్థులు స్వతంత్ర తిరువితాంకూరును ప్రతిఘటిస్తూ సమ్మెలు చేశారు. పోలీసులు తయారు చేసిన రౌడీలు, కావాలని శాంతికి విఘ్నం చేకూరుస్తున్నారు. ప్రభుత్వ బాధ్యత అంతా చీఫ్ సెక్రటరీ మీదనే వుంది. అనేక సమ్మెలను ఎదుర్కొన్న అనుభవం కేశవపిళ్ళైకు వుంది. ఆ కర్తవ్యాన్ని అతను కాదనలేడు. ఆ హడావిడిలో కేశవపిళ్ళై విచారిస్తూ వున్నాడు.

పార్కువ్యూ పై కిటికీ నుంచి జంతుప్రదర్శన శాల దారిలో అంతులేని బారులలో సాగిపోతున్న సమ్మెల వూరేగింపులు కాత్యాయనీ అమ్మ చూస్తూవుంది. విశాలమయిన బాహ్య జగత్తులో ఏదో అలజడి చెలరేగు

తున్నట్లు ఆమె గమనించింది. వెనక, యింట్లో వున్నప్పుడు కాంగ్రెసు అల్లరులను గురించి ఆమె విని వున్నది. ఇప్పుడు కూడా కాంగ్రెసు ఆందోళన జరుగుతూనేవుంది. అందులో సందేహం లేదు. ఒకరోజు బిగ్గరగా వినిపించిన నినాదం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. "చీఫ్ సెక్రటరీ కేశవపిళ్ళకు ఉరిశిక్ష వేయించండి."

పిల్లలు కేకలు పెడుతున్నారు. వేల కొలదీ కంఠాలు నినాదంలో పాల్గొంటున్నాయి. దగ్గరగా వచ్చేకొద్దీ కేకలు మరింత బిగ్గరగా వినిపిస్తున్నాయి. కాత్యాయనీ అమ్మకు వినిపించాలని కాబోలు - "చీఫ్ సెక్రటరీ కేశవపిళ్ళకు ఉరిశిక్ష వేయించండి." అని నినాదాలు చేశారు.

కేశవపిళ్ళె వీళ్ళకేమి అపకారం చేశాడు?

కాత్యాయనీ అమ్మకు భయంవల్ల అనేక రకాల అనుమానాలు వేశాయి. కారులో వెళ్తున్నా ప్రజలు తన భర్తను గాయపరచవచ్చు కదా? మామ గారిని చంపిన వ్యక్తిని ఇంతవరకూ పట్టుకో లేక పోయారు. వీళ్ళ మధ్యలోనే అతను లేడని యెలా చెప్పగలం? ఉండవచ్చు. తగిన అవకాశం కోసం చూస్తూ వుండవచ్చు. ఇంట్లో మాత్రం భద్రత యేముంది?

కూతురు విజయమ్మ స్కూలు నుంచి తొందరగా వచ్చింది. ఏదో ముఖ్యమైన విషయం చెప్పాలని వచ్చింది. ఈరోజు విద్యార్థులంతా క్లాసు వదిలి పెట్టి బయటికి వచ్చారు. "కాలేజీలో చదువుకునే ఒక విద్యార్థి, స్కూలులో చదువుకునే పిల్లలనందర్నీ బయటికి లాగాడు. ఫుట్‌బాల్ గ్రౌండులో ఒక సమావేశం జరిగింది. అతనే గంటసేపు మాట్లాడాడు. ఎలా మాట్లాడాడో! అందరూ నిద్రలేచినట్లు వూరేగింపుగా తయారయి బయలుదేరారు." అని చెప్పింది.

"తల్లీ! నీవు కూడా వెళ్ళావా?" అడిగింది కాత్యాయని అమ్మ.

"రాధా, త్రేస్యా, నేనూ అందరం వూరేగింపులో చేరాం. అందరూ వెళుతుంటే నేనెలా వూరుకోను? త్రేస్యా నన్ను బలవంతంగా చెయ్యి పట్టుకుని లాక్కెళ్ళిందమ్మా! "అన్నది విజయమ్మ.

తల్లి కంగారు పడుతూ అడిగింది: "వాళ్ళు కేకలు వేసినట్టే నీవు కూడా కేకలు వేశావా?"

విజయమ్మకు అర్థమయింది.

"ఆ కేకలు నేను వెయ్యలేదు. త్రేస్యా నన్ను కూడా కేకలు వెయ్యమని బలవంతం చేసింది. కాని నేను కేకలు వెయ్యలేదు.

"ఎవరే ఆ త్రేస్యా?"

"సెక్రటరీ ఫిలిప్స్ గారి అమ్మాయి."

ఆ తర్వాత విజయమ్మ అడిగింది: "అమ్మా, నాన్న యిలాంటి పని యెందుకు చేస్తున్నారే? నీవడిగి కనుక్కో"

"ఏం చేశారమ్మా నాన్న?"

"మన దేశాన్ని పతనానికి తీసుకుని పోయే పనిలో నాన్న చెయిచేసు కుంటున్నారు. ఉపన్యాసం విన్న తరవాత అతను చెప్పిందంతా సరిగ్గానే వుంది అనిపించింది. నాన్న తప్పు పని చేస్తున్నారని తెలిసింది."

కాత్యాయనీ అమ్మ కూతురు నోరు మూసింది: "తప్పమ్మా, అలా అనకు. అది ధర్మం కాదు. నాన్న చేసింది తప్పనకూడదు."

విజయమ్మ ఆగలేదు. "స్వతంత్ర తిరువితాంకూరు కావాలని అమ్మ కూడా అంటూందా?" అన్నది.

కాత్యాయనీ అమ్మకు తనకు తెలియనిది తెలియదని చెప్పటం చిన్నతనమనిపించలేదు.

"అది నాకు తెలియదమ్మా. కానీ నాన్న మీద నేరాలు మోపటం మంచిది కాదు. అలా అనకూడదు."

విజయమ్మ ఏమీ అనలేదు. కాత్యాయనీ అమ్మ అన్నది. "మీ నాన్నకు ఉరిశిక్ష వేయించమంటున్నారు వీళ్ళు. మీ నాన్నకు ఉరిశిక్ష వేయించాలని కేకలు వేసేవాళ్ళతో మా అమ్మాయి వెళ్ళటం క్షేమమేనా?"

విజయమ్మ సమాధానం చెప్పింది: "ఆ త్రేస్యా పోరు పడలేక నేను వూరేగింపులో చేరాను. లేకుంటే వెళ్ళేదాన్ని కాదు. వాళ్ళు అలా కేకలు మొదలెట్టే సరికి నేను ఇలా యింటికి వచ్చేశాను."

విజయమ్మ తెలుసుకోవాల్సినవి, అడగాల్సినవి, చెప్పాల్సినవి - చాలా విషయాలున్నాయి. ఆ అమ్మాయికి హైస్కూల్లో చదువుతూ వుంది. మొదట వల్లెటూళ్ళో హైస్కూల్లో చదువుతూ వుండేది. వాళ్ళ అమ్మతో తిరువనంతపురం వచ్చిన తర్వాత ఇక్కడ హైస్కూల్లో చేర్చారు. అమ్మాయి మనస్సు సహజంగా విప్పారింది. తల్లి దగ్గర వున్నంత చనువు ఆ అమ్మాయికి తండ్రి దగ్గర లేదు. ఇప్పుడిప్పుడే చనువు ఏర్పడుతూ వుంది. వెనకటి జీవితం అలాంటిదే కదా!"

సాయంత్రం కేశవపిళ్ళె ఆఫీసు నుంచి వచ్చాడు. కాత్యాయనీ అమ్మ ఆయన కోసం ఎదురుచూస్తూ వుంది. ఆమెకు చాలా ఆందోళనగా వుంది. ఆ రోజు ఒక విచిత్రమయిన సంఘటన జరిగింది. కేశవపిళ్ళె కారు దిగే సమయానికి కాత్యాయనీ అమ్మ కారు దగ్గరకి వెళ్ళింది.

"విన్నారా, వాళ్ళ కేకలు?" అని అడిగింది.

కేశవపిళ్ళె 'ఊఁ' అన్నాడు.

"ఎంత మాట విన్నాం! ఇది మామూలు విషయమా?" అన్నది కాత్యాయనీ అమ్మ.

కాత్యాయని ఆందోళన కేశవపిళ్ళెకు అర్థమయింది. "నేను కొంచెం బట్టలు మార్చుకుని వస్తాను. ఇవాళ, రోజూ యిచ్చే కాఫీ కూడా లేదా?" అన్నాడతను.

అప్పుడు గుర్తొచ్చింది కాత్యాయనీ అమ్మకు -- భర్తకు కాఫీ తెచ్చియ్యలేదని. ఆమె వంటింట్లోకి వెళ్ళింది.

కేశవపిళ్ళె కాఫీ తాగుతూవుంటే కాత్యాయని అమ్మ ఆరోజు చూసిన వూరేగింపును గురించి చెబుతూ వుంది. "ఆ తర్వాత నాకు చాలా భయమేసింది. గేటు దగ్గర కాపలావుండే పోలీసులు, తోటమాలి, డ్రైవరు అందరినీ చూసి నాకు భయమేసింది. వీళ్ళను మాత్రం ఎలా నమ్మటం? ఇలా కేకలు వేసేవాళ్ళల్లో వీళ్ళ పిల్లలు కూడా వుండచ్చు." అన్నదామె.

ఉండచ్చు-- అన్నట్టుగా కేశవపిళ్ళె తల వూపాడు. అమాయకంగా కాత్యాయని అడిగింది. "మీరు మాట్లాడరేం? ఇదేమన్నా మామూలు విషయమా? చెప్పండి. ఏదన్నా మాట్లాడుదురూ?" .

"ఒక వేళ చేప్తే నీ కర్థమవుతుందా?" అన్నాడు కేశవపిళ్ళె చిరునవ్వుతో.

తన మాట భర్తకు కటువుగా తోచ వచ్చుకానీ, ఆయినా దిక్కుతోచనట్టు కాత్యాయని అమ్మ అన్నది: "నాకు ఇవన్నీ నేర్పితేగా? ఊరికే నాకు ఎలా అర్థమవుతాయ్?"

కాత్యాయని అమ్మ అమాయకత్వం కేశవపిళ్ళెకు బోధపడింది. అతనేమీ మాట్లాడ లేదు. కాత్యాయనీ అమ్మ కూతురి సంగతి చెప్పటం మొదలు పెట్టింది: "మన అమ్మాయి కూడా వీళ్ళల్లో చేరింది. త్రేస్యా అనే అమ్మాయి "ఉరిశిక్ష వేయించండి" అని కేకలు పెట్టింది. కాని మన అమ్మాయి కేకలు పెట్టలేదు."

కేశవపిళ్ళెకు ఇది కొత్త వార్తగా తోచింది. విజయమ్మను పిలిచి కేశవపిళ్ళె జరిగిందంతా తెలుసుకున్నాడు. ఆ తర్వాత, వెళ్ళి చదువుకోమని చెప్పాడు. కాత్యాయని అమ్మ భర్త నడిగింది: "అమ్మాయిని ఏమీ అనలేదేమండీ? ఇక ముందు ఇలాంటి అలజడికి దూరంగా వుండమని చెప్పద్దూ? ఆ మాటయినా చెప్పలేదు. ఏమిటండీ?" దానికి సమాధానంగా కూడా కేశవపిళ్ళె కేవలం తలవూపి "ఊఁ" అని వూరుకున్నాడు.

కేశవపిళ్ళె మనస్సు భారంగా వుంది. ఇంత భారాన్ని అతనెప్పుడూ అనుభవించలేదు. ఆ బరువుతో అతని వుత్సాహం కరిగి పోయింది. అంతేకాదు, అతను దిగజారి పోయినాడు. ఆవేశం మాట అటుంచి కోపం కూడా రాలేదు. తెలివి తక్కువ దద్దమ్మలాగా కేశవపిళ్ళె చతికిల బడిపోయినాడు. ఏం చెయ్యాలో కూడా తోచని, ఆలోచించలేని అసమర్థుడిలా కూర్చున్నాడు.

తన తెలివి తేటలమీద తనకు నమ్మకం లేక, ఎదుర్కొనే సామర్థ్యం లేక వెనక ఒకసారి అతను ఇలాగే నివ్వెరపోయినాడు. ఆ రోజు అతను నిందల పాలయినాడు. ఆ తర్వాత ఎన్నికల్లో పనిచేసే అవకాశం దొరికిన తర్వాత, అతనిలో నూతన చైతన్యం వచ్చింది. ఇనుమడించిన వుత్సాహంతో

దుమారంలాగా అతను దేశమంతటా పని చేశాడు. అప్పుడు చేసిన పనులన్నీ బాగా ఆలోచించి చేశాడు. ఏదీ గురి తప్పలేదు. బెదిరింపులకు తను భయపడలేదు. భవిష్యత్తును గురించి అతను ఆలోచించనే లేదు. తను ఏం చెయ్యాలో తనకు బాగా తెలుసు. ఇది తన కర్తవ్యమని భావించాడు. మెలకువతో, నిలకడతో ఒక పద్ధతిలో అతను పని చేశాడు. చివరకు విజయం సాధించాడు.

ఈనాడు అతని తెలివితేటలు మందగించాయి. శక్తి క్షీణించింది. నూతనోత్సాహం రావటం లేదు. కొన్ని యేండ్ల క్రితం రహదారిలో నిలబడి కేశవపిళ్ళై యీ కుర్చీని చూశాడు. ఆ కుర్చీ యిప్పుడతనికి లభించింది. ఆ సమయంలో అభ్యుదయకాములు చూపించిన కుర్చీ కూడా యిదే. ఆ పట్టుదల తీరింది. ఇకముందు చూడవలసినది లేదు. అదే ఉత్సాహానికీ, పరాక్రమానికీ ఆధారం.

కాత్యాయనీ అమ్మ ప్రశ్నమీద ప్రశ్న అడుగుతూ వుంది. కేశవపిళ్ళై ఒక్కదానికీ సమాధానం చెప్పలేదు. ఆ ప్రశ్నలు కేశవపిళ్ళైను చిరాకు పరచటం కూడా లేదు. ఈ స్వతంత్ర తిరువితాంకూరు అంటే యేమిటి, అనేది ఆమెకు తెలియాలి. ప్రజల్లో ఇంత అలజడి యెందుకు చెలరేగింది? ఈ విషయాలన్నీ కాత్యాయనీ అమ్మకు తెలిసి వుంటే కేశవపిళ్ళైకు కొంత వాదోడు లభించి వుండేది.

తనవాళ్ళంటూ యెవ్వరూ లేరనే కొరత కేశవపిళ్ళైకు ఈ రోజు ఎక్కువగా అనిపిస్తున్నది. మనస్సులోని బరువును మరొకరికి చెప్పి తగ్గించుకొనే మార్గం కనిపించటం లేదు. ఇన్నాళ్ళు జీవితం గడిచినా ఆప్తమిత్రులు ఎవ్వరూ ఏర్పడలేదు. ఉన్నమాట ఉన్నట్టు చెప్పుకొని ఉపాయం ఆలోచించుకొని ఓదార్పు పొందేందుకు మరోవ్యక్తి ఏర్పడలేదు. బంధువుల్లో కూడా అలాంటి వాళ్ళెవ్వరూ లేరు. ఇలాంటి పరిస్థితి వస్తుందని అతను ఎన్నడూ అనుకోలేదు. సన్నిహితమైన సంబంధం గల వ్యక్తి ఎవ్వరూ లేరు. భార్య మీద మాత్రం నమ్మకం వుంది. ఆత్మీయత వుంది. కాని ఆమెకు ఈ విషయాలు అర్థం కావు. ఆమెకు అర్థమయ్యేటట్టు అతను చెప్పివుండాల్సింది. అది గొప్ప పొరపాటయింది. ఆ అవకాశం చేజారిపోయింది. ఆమెకు సరియైన గౌరవం ఇయ్యనందువల్ల జరిగిన అనర్థం కేశవపిళ్ళైకు ఇప్పుడర్థమయింది. ఇప్పుడు ఆ తప్పు దిద్దుకొనటం సాధ్యం కాదు.

టేబిలు మీద పెట్టివున్న గోప్యమైన ఫైలులో, ఎవరికయినాసరే భీతిని కలిగించే రిపోర్టు ఒకటి వుంది. బయటి కంటె లోపల భూగర్భంలో చాలా గంభీరమైన విషయాలు జరుగుతూ వున్నాయి. ఈ సమ్మె మంచి చెడ్డలు కేశవపిళ్ళై చాలా రోజుల నుంచి గమనిస్తూ వున్నాడు. ఇప్పుడది పెరిగి పెరిగి విరాట్ స్వరూపాన్ని తాల్చి తన యెదుట నిలిచి వుంది.

కాత్యాయనీ అమ్మ తెలుసుకోవాలని ఒక ప్రశ్న అడిగింది... "వీళ్ళంతా ఉరిశిక్ష వేయించాలని కేకలు వేస్తూ ఎందుకు తిరుగుతున్నారు?"

ఇలాంటి ప్రశ్న భార్య నోటినుంచి వస్తే యిలాగే వుంటుంది. అసలు అడగదలచిన ప్రశ్నయిది. "వీళ్ళంతా ఉరిశిక్ష వేయించాలని కేకలు పెడుతూ తిరుగుతున్నారే, అసలది సాధ్యమవుతుందా?" అని.

కాత్యాయని అమ్మ లాంటి భార్య అలాంటి ప్రశ్న అడగదు. ప్రశ్నలోని అంతర్యాన్ని గమనించి కేశవపిళ్ళై సమాధానం చెప్పాడు: "అవును సాధ్యమే. అంతకు మించి కూడా కావచ్చు."

ఈ విషయాన్ని గురించి కేశవపిళ్ళై తొలిసారి సమాధానం చెపుతున్నాడు.

కాత్యాయనీ అమ్మ గొల్లుమని ఏడ్చింది. ఆమె దిగజారిపోయింది.

"ఛీ, ఏడవకు. అందుకే నేను ముందే చెప్పాను -- నీకేమీ అర్థం కాదని. నీకేమీ చెప్పేందుకు వీల్లేదు."

కాత్యాయనీ అమ్మకు ఒక తరణోపాయం తట్టింది: "ఈ వుద్యోగం వదిలిపెట్టి మనం మన వూరు వెళ్ళిపోదాం" అన్నది.

కేశవపిళ్ళై నవ్వుతూ అన్నాడు: "ఈ వుద్యోగం వదిలి యెక్కడ తలదాచుకున్నా క్షేమంగా ఉండగలమని చెప్పలేము."

'ఎందుకని?' అన్నట్టుగా కాత్యాయని అమ్మ కేశవపిళ్ళై ముఖం వైపు చూచింది.

"ఇంతకు ముందు మన వూళ్ళో కూడా ప్రజలు ఇలా కేకలు పెడుతుంటే వినలేదా?"

"విన్నాను, జైల్లో పెట్టండని కేకలు వేస్తుంటే విన్నాను. అలా కొంత మంది సమావేశల్లో ఉపన్యాసాలు కూడా యిచ్చారు."

"అందుకనే అక్కడైనా క్షేమకరం కాదని నేనన్నాను."

అంటే ఎక్కడికి వెళ్ళినా ఆపద తప్పదన్నట్టు కాత్యాయనీ అమ్మకు బోధపడింది. కేశవపిళ్ళై ధైర్యం చెప్పాడు: "భయపడకు. అలా జరుగుతుందనే విషయమే మరిచిపో. వీళ్ళిలా కేకలు వేస్తూనే వుంటారు. నాకు ఉరిశిక్ష వేయాల్సి వుంటే నాతోపాటు ఎంతమంది వుద్యోగస్థులకో వెయ్యాల్సి వుంటుంది. ఈ కేకలు వేసేవాళ్ళకు ఆ అధికారముందా యేమిటి? ఏమవుతుందో ముందు ముందు గాని తెలియదు."

కాత్యాయని అమ్మకు విషయం పూర్తిగా బోధపడలేదు. ఒక్కవిషయం మాత్రం ఆమెకు అర్థమయింది. ఉరిశిక్ష పడితే ఒకరికి కాదు, చాలా మందికి పడుతుందని తెలిసి పోయింది. అంతటితో ఆమె ఆందోళన తగ్గలేదు. కేశవపిళ్ళై ప్రేమతో భార్యకు ధైర్యం చెప్పాడు:

"నీవివన్నీ పట్టించుకోకు. మాట్లాడకుండా కూర్చో. కంగారు పడకు."

మళ్ళీ కొంచెం సేపటికి అన్నాడు: "నీవు అదృష్టవంతురాలివి కదా! నాకు అపద యెలా వస్తుంది?"

"బాగానేవుంది అదృష్టం! ఇలాంటి అదృష్టం మరెవరికుంటుంది? చాలా బాగుంది!" అన్నది కాత్యాయనీ అమ్మ విసుగ్గా.

కేశవపిళ్ళె ధైర్యం చెప్పాడు: "నీవు తెలివి తక్కువ దానివి. ఇంత పోటీలో నెగ్గి పైకి వచ్చిన నాకు ఉరిశిక్ష వేస్తారా? వాళ్ళంటే నీవు నమ్మావా?"

ఆ తర్వాత యీ కేకలన్నీ పనికిరానివని చెప్పేందుకు అతను చాలా కారణాలు చెప్పాడు. ఒక్కమాట అతను కచ్చితంగా చెప్పాడు. కాంగ్రెసు వాళ్ళను విరోధించే వుద్యోగస్థుల్లో మొదటివాడు కేశవపిళ్ళె. ఎప్పుడూ ముఖాముఖిన వాళ్ళను ఎదిరించేవాడు అతనే. అందువల్ల ఏమన్నా పొరపాటు వుంటే వుండవచ్చు. ఉద్యోగం పోతే పోవచ్చు. కొంచెం కష్టపడవలసి వుండవచ్చు అంతే. కాని కాత్యాయని అమ్మకు ఇది అంత గౌరవప్రదమయిన విషయంగా తోచలేదు. "ఈ తికమకలన్నీ నాకేమీ తెలియవు. నాకు చాలా భయమేస్తున్నది." అన్నది.

కేశవపిళ్ళె కాత్యాయని అమ్మకు ధైర్యం చెప్పాడు. కాని తను మాత్రం చాలా దిగులుతో వున్నాడు. పోలీసు కమీషనరుకు ఫోను చేసి పార్కువ్యూలో ఎక్కువ భద్రతకు సంబంధించిన యేర్పాట్లు చేయించవలసిందని చెప్పాడు. కొంచెం సేపటికి సాయుధ పోలీసు దళం పార్కువ్యూ చేరింది.

జీవితంలో ఒక ఆట ఆడాడు. ఆ ఆట ఇంత వరకూ ఫలించింది. కాని యిప్పుడది నిప్పుతో చెలగాటంగా మారింది. కేశవపిళ్ళె దాన్ని గురించి జాగ్రత్త పడుతున్నాడు.

ప్రాంతీయ కాంగ్రెసు బయలు దేరిన తర్వాత యీ సమరం ఇంతవరకూ సాగుతుందని కేశవపిళ్ళె అనుకోలేదు. అప్పుడే ఆర్పితే ఆరిపోయే మంట లాంటి దనుకున్నాడు. దాన్ని ఎదుర్కొనేందుకు తను నియామకమయినప్పుడు, ఈ పని బాగుందని తోచింది. డబ్బుకు డబ్బు, అధికారానికి అధికారం -- అన్ని విధాలా లాభించింది. అన్ని రకాల అభివృద్ధి సదుపాయాలూ కేశవపిళ్ళెకు లభించాయి. ప్రాంతీయ కాంగ్రెసు సమసి పోతుందని అనుకున్నాడతను. దాన్ని అణచి వెయ్యగలననుకున్నాడు. అందుకు బదులు వాళ్ళకు తనమీద ద్వేషం, వైరం హెచ్చయ్యాయి. కేశవపిళ్ళె ఆపని ఆనాడు నిండు మనసుతో చేశాడు. తన అంచనా తప్పయిపోయిందనే విషయం అతనికి తర్వాత తెలిసింది - తరుణం మించిన తర్వాత. సరిచేసుకునే మార్గం చేయిజారి పోయింది.

ఆంగ్లేయులు భారతదేశం వదలి పెట్టేందుకు నిర్ణయించుకున్న తర్వాత స్వతంత్ర తిరువితాంకూరు అనే ఆలోచన ఉదయించింది. ఆ అలోచన కేశవపిళ్ళెకు వచ్చింది. కాంగ్రెసు గెలిచింది. కాని జయించిన కాంగ్రెసును

కార్యరంగంలో ఓడించి స్వాధీనం చేసుకునేందుకు కేశవపిళ్ళై యీ పన్నాగం పన్నాడు. స్వతంత్ర తిరువితాంకూరుకు జయం చేకూరుతుందని కేశవపిళ్ళై భావించాడు. ప్రాంతీయ కాంగ్రెసు నిలకడకూ, స్వతంత్ర తిరువితాంకూరుకూ ఏమీ విరోధం లేదు. 'మహారాజు ప్రభుత్వం క్రింద బాధ్యతాయుత పరిపాలన' - అదే ప్రాంతీయ కాంగ్రెసు యొక్క లక్ష్యం. స్వతంత్ర తిరువితాంకూరును అంగీకరించి తీరాలి.

కాని కొన్ని రోజుల తర్వాత కేశవపిళ్ళైకు అనుమానం వేసింది. స్వతంత్ర తిరువితాంకూరు ఫలిస్తుందా? స్వతంత్ర తిరువితాంకూరుకు విరుద్ధంగా అతని ఆలోచనా శక్తి యింత తీవ్రంగా పరిణమించింది. స్వతంత్ర తిరువితాంకూరును గురించిన వివిధ విషయాలు ఒక్కొక్కటి స్పష్టంగా తేలేసరికి ఇది సరియైన ఆలోచనేనా అని కేశవపిళ్ళైకు అనుమానం వేసింది. ఎవరో అతనిలో ప్రవేశించి "ఇది సరియైన ఆలోచన కాద"ని చెప్పినట్టు తోచింది. దానితో అతని అనుమానం మరీ గట్టి పడింది.

కాని యిలాంటి అనుమానం అతను బయటికి చెప్పగలడా? బయటికి చెప్పేస్తే దీవాన్‌జీకి అప్రియుడయిపోతాడు. సూక్ష్మ దృష్టిగల ఆ పరిపాలనా దక్షుడి ఆగ్రహానికి గురి కాకుండా తప్పించు కోవటంలోనే నేర్పువుంది. ఈనాటి వరకూ దీవాన్‌జీకి అతని మీద ఎలాంటి అనుమానమూ లేదు.

కేశవపిళ్ళై మరి కొందరు ఉద్యోగస్థులను గురించి కూడా ఆలోచించాడు. దీవాన్‌జీకి చాలామంది మీద నమ్మకం లేదు. కొంతమందిని మాటి మాటికి బదిలీ చెయ్యటం జరుగుతూ వుంది. పోలీసు కమీషనర్లు కూడా కొద్ది రోజుల్లో ఎంతమందో వచ్చారు. అతనికి అన్నివేళలా నమ్మకస్థుడయిన వ్యక్తి తను ఒక్కడే. ఆసంగతి తనకు తెలుసు.

ప్రాంతీయ కాంగ్రెసు సమరంలోనూ, స్వతంత్ర తిరువితాంకూరు విషయంలోనూ తన యజమాని యిచ్చిన ఉత్తర్వులను అనుసరించవలసిన ఉద్యోగస్థుని కంటె తను కొంచెం ముందుకు సాగానేమోనని అతనికి అనుమానం వేసింది. అంత దూరం వెళ్ళవుండ గూడదు. భవిష్యత్తులో పయనించవలసిన దూరాన్ని, వేగాన్ని గమనించి లెక్క ప్రకారం నిలబడి వుండవలసింది. ప్రభుత్వపు పనిని తను సొంత పనిగా భావించి చేశాడు. అందువల్లనే తను ఈ స్థితికి రాగలిగాడు కూడాను. మరే వుద్యోగస్థుడు కూడా ఇంత ముందంజ వేయలేదు. వాళ్ళంతా ఒక మెట్టుకు వచ్చి యుక్తిగా తప్పుకున్నారు.

ఎప్పుడయినా సమాధానం చెప్పవలసివస్తే ఏం చెపుతాడు? ఆనాటి పరిపాలనా తంత్రంలోని యంత్రంలా తను యజమాని ఆజ్ఞను పాలించానని చెప్తే సరిపోతుందా? దానికి విలువ ఉంటుందా అని ప్రశ్నించుకుంటే తన అంతస్సు కూడా ఆ సమాధానాన్ని అంగీకరించదని అనిపించింది కేశవపిళ్ళైకు. మరి యేం చెయ్యటం?

పడకగది నుంచి కాత్యాయనీ అమ్మ వచ్చింది.

"చాలా పొద్దు పోయింది. నిద్ర పోకూడదూ?"

"చాలా పని వుంది" అని సమాధానం చెప్పాడు కేశవపిళ్ళై. కేశవపిళ్ళై పక్కన ఒక కుర్చీలో కూర్చుని తియ్యని చిరునవ్వుతో కాత్యాయనీ అమ్మ అన్నది: "మీరు ఏం పని చెయ్య లేదు. నేను చూశానుగా. చాలా సేపటి నుంచి ఏదో ఆలోచిస్తున్నారు. మధ్య మధ్యలో చివుక్కున లేచి నలువైపులా కంగారుగా చూస్తున్నారు. వెనక చేతులు కట్టుకుని తిరుగుతూ వున్నారు. ఇదీ మీరు చేస్తున్నపని."

"అయితే మరి నువ్వు కూడా నిద్రపోలేదన్న మాట"

"లేదు, నాకూ నిద్ర పట్టలేదు. భయంగా వుంది. మనస్సులో ఆందోళనగా వుంది."

"నాకు ఉరిశిక్ష పడుతుందనే భయమా?"

"అవును." అని కాత్యాయని యింకా యిలా అంది:

"భయం నాకే కాదు. మీరుకూడా భయంతో అటూ యిటూ చూస్తున్నారు గదా!"

"భయమెందుకు? ఇక్కడ పోలీసు కాపలా వుంది గదా?"

"ఈ పోలీసుల్లో కాంగ్రెసు వాళ్ళు కూడా వుండవచ్చుగా" అన్నది కాత్యాయనీ అమ్మ వెంటనే.

కేశవపిళ్ళైకు వెంటనే సమాధానం స్ఫురించలేదు. కొంచెం సేపాగి అన్నాడు: "వాళ్ళలా చెయ్యరు."

కాత్యాయని అమ్మ అక్కడి నుంచి ఊరికి వెళ్ళటం మంచిది అనుకున్నాడు కేశవపిళ్ళై.

"అయితే నువ్వు ఊరికి వెళ్ళు." అన్నాడు.

"అలా జరగదు. అందరమూ ఒకసారే వెళదాం."

అలా వీల్లేదు - అన్నట్టుగా కేశవపిళ్ళై తల వూపాడు. ఈ పదవిలో వున్నంత సేపే భద్రత. ఇప్పుడే కాదు. ఇకముందు కూడాను.

"ఊరికి వెళితే మాత్రం క్షేమమా? ముందు కూడా ఇక్కడ వుంటేనే క్షేమం." అన్నాడు అతను.

ఊరికి వెళితే ఊళ్ళో వాళ్ళతో విరోధం రెండు రోజుల్లో సమసి పోతుంది, వాళ్ళన్నీ మరిచిపోతారు అంటుంది కాత్యాయని.

"పాపం ఆడవుగా అందరూ చాలా మంచివాళ్ళు. ఇక్కడ తిరువనంతపురంలో వేషాలు వేసుకుని తిరిగే మోసగాళ్ళ లాగా కాదు. ఇక్కడ ఎవ్వరినీ నమ్మేందుకు వీల్లేదు."

కేశవపిళ్ళై ఆ మాట ఒప్పుకున్నాడు. కాని అతని మనస్సులో మరో అనుమానం వుంది: "అక్కడి వాళ్ళకు కూడా ప్రేమ నీ మీదనేగాని, నా మీద ఎందుకుంటుంది?"

"కాదు, కాదు. నా మీద ప్రేమ వుంటే నా భర్తమీద కూడా ప్రేమ వున్నట్టే. నమ్మకం లేకపోతే అక్కడికి వెళ్ళి కొద్ది రోజులు వుండి చూడండి."

"అయితే నేను భార్య అండ దండల్లో మెలగాలన్న మాట!" అన్నాడు కేశవపిళ్ళై నవ్వుతూ.

కాత్యాయనీ అమ్మ తగిన సమాధానం చెప్పింది: "బాగా బతకాలంటే మరి అంతే. ఎవరికీ ద్రోహం చెయ్యకుండా."

కేశవపిళ్ళై నవ్వాడు. కాత్యాయనీ అమ్మ కూడా నవ్వింది.

కొంచెం సేపటి వరకూ ఎవరూ ఏమీ మాట్లాడ లేదు. బహుశా కేశవపిళ్ళై, భార్య చెప్పింది ఎంతవరకు నిజమని ఆలోచిస్తూ వున్నాడు. కేశవపిళ్ళై ఆలోచనల ఆకాశంలో తండ్రి సంగతి మెరుపు తీగలా మెరిసింది. ఆయన జీవితంలోని చరమ దశ కాత్యాయనీ అమ్మ చెప్పిన నిజానికి మినహాయింపు కదా! ఎవరికీ కీడు చెయ్యకుండా, అందరికీ మేలును తలపెడుతూ ఆయన కుట్టనాటి ముసలి తనపు జీవితం గడిపాడు. కాని అతని జీవితం అలా యెందుకు ముగిసింది? ఆ ప్రశ్న కాత్యాయనీ అమ్మను అడుగుదామని కేశవపిళ్ళై ముందుకు సాగాడు. కాని ఆ ప్రశ్న అతని నోటి నుంచి బయటికి రాలేదు. కారణం, దానికి వచ్చే సమాధానం చాలా కటువుగా వుండ బోతుంది. ఆ ముసలాయన ఒక్క తప్పు చేశాడు. తనలాంటి కొడుకును కనటమే ఆ తప్పు. లేకుంటే అలా అయ్యేది కాదు. తను కొడుకుగా పుట్టకుంటే ముకుంద్ అతన్ని హత్య చేసేవాడా?

నిప్పులు రాలినట్టు కేశవపిళ్ళై మనస్సు భగ్గుమన్నది. తండ్రి మరణాన్ని గురించి ఇన్నాళ్ళూ తను ఈ విధంగా ఆలోచించ లేదు. జీవితాన్నంతా సమగ్రంగా పరిశీలించటంలో ఆ రాత్రి యీ విషయం ఆకాశంలో మెరుపులాగా స్ఫురించింది. కాని తప్పు తనదే ననిపించింది కేశవపిళ్ళైకు. గోపాలన్ నాయరుకు తానేమీ ద్రోహం చెయ్యలేదు. అయినా, తను తప్పించుకునేందుకు వీల్లేదు.

కాత్యాయని అమ్మ వేసిన ఒక ప్రశ్న ఆ మౌనాన్ని భంగపరచింది. "ఈ స్వతంత్ర తిరువితాంకూరు అంటే ఏమిటసలు? మహారాజు అక్కర్లేదని అంటాం. అంతేనా?"

ఆ విషయం కాత్యాయని అమ్మకు వివరంగా తెలియజెప్పాలనుకున్నాడు కేశవపిళ్ళై. ఆమెకు అర్థమయ్యేలాగా సులువైన మాటల్లో కేశవపిళ్ళై వివరించాడు. ఆమె జాగ్రత్తగా విని అర్థం చేసుకుంది. "అంటే మనం

తిరువితాంకూరు ప్రజలం స్వతంత్రంగా జీవించాలన్న మాట! అంతేనా?" అని అడిగింది.

"అవును."

"అంటే కొచ్చిన్, గురువాయూరు కూడా మనం వెళ్ళ కూడదన్న మాట."

"తర్వాత ఇరుగు పొరుగు రాజ్యాలతో మనం చేసుకునే ఒడంబడికను బట్టి అన్ని స్థలాలకూ మన రాకపోకలుంటాయి."

"కాశీ, రామేశ్వరం?"

"అక్కడికి కూడా అంతే."

"అరే, ఇదేం చిత్రం! గురువాయూరూ, కాశీ వెళ్ళేందుకు వీల్లేకపోతే చాలా కష్టమే. మామగారూ, కిట్టుమామా కలియుగం వచ్చిందని చెప్పుండేవారు. అందుకనే యీ గొడవ. భాగవతంలో వర్ణించిన కలియుగంలాంటి పరిస్థితులు వచ్చాయని భాగవతం చదివిన వాళ్ళు చెప్పేవాళ్ళు. అలా అయితే మనకు స్వతంత్ర తిరువితాంకూరు అక్కర్లేదు. కాంగ్రెసు చెపుతున్నది నిజమే."

మాట్లాడవద్దని కేశవపిళ్ళె సంజ్ఞ చేశాడు. కాత్యాయనీ అమ్మ మెల్లగా చెప్పింది: "మన అమ్మాయికూడా యీ మాటే అంటున్నది. ఒక్క మన నాన్నేనమ్మా స్వతంత్ర తిరువితాంకూరు కావాలని చెప్తూ తిరిగేవాడు అంటుంది."

'ఖర్మ' అనుకుని కేశవపిళ్ళె చేతులతో తల బాదుకున్నాడు. ఆ తర్వాత అంతా మన ఖర్మ అని చేతులతో సంజ్ఞ చేశాడు.

కాత్యాయనీ అమ్మ అడిగింది: "ఏమిటది?"

"ఈ ఆటంతా యెందుకాడాననుకుంటున్నావు?"

"ఎందుకు?"

"నీ కోసం కాకుంటే మరెవరికోసం.

అందులో కాత్యాయనీ అమ్మకు ఏమీ సందేహం లేదు. ఈ నాటకం మరెవరి కోసమూ కాదు. దిగులుతో దిగజారిన ఆమె హృదయం కనికరంతో కరిగి పోయింది. తన యెదుట కూర్చున్న వ్యక్తి చేసిన ప్రతిపనీ తనకూ, తన కూతురికీ సుఖం చేకూర్చేందుకే. చెమర్చిన కళ్ళతో కేశవపిళ్ళె దగ్గరికి వెళ్ళి అప్యాయంగా అతని గడ్డం పట్టుకుని ముఖం పైకెత్తి కాత్యాయనీ అమ్మ అన్నది:

"ఇవన్నీ లేకుంటే నాకు వచ్చే నష్టమేముంది? నాకివన్నీ అక్కర్లేదు. నాకు పిడికెడు బియ్యం తెచ్చిస్తే అవి కాచి మీకు అన్నం పెట్టి నేను గంజి తాగుతాను. అదే సుఖం! నాకెలాగయినా సుఖమే. నేను పేచీ పెట్టను. నాకేమీ పెట్టక పోయినా నాకు సంతోషమే. తిండి లేకున్నా సరే పస్తులుంటాం. నాకు డబ్బక్కర్లేదు. నాకు అది కావాలి, ఇది కావాలి అని ఎప్పుడయినా మిమ్మల్ని వేధించానా? 'ముందు ముందు ఆస్తి పాస్తులు వస్తాయి, ఇక్కడికి వచ్చి

వుంటాం' అనుకొని మీ చేత మెళ్ళో మంగళసూత్రం కట్టించుకున్నానా? ఇవన్నీ పోయినా నాకేమీ బాధ లేదు. నాకు కావలసింది నా స్వామి నా భార్త. అంతే."

తల్లి చెప్పే మాటలు వినే పిల్లవాడిలా కేశవపిళ్ళై కూర్చుని వింటున్నాడు.

"అన్నీ పోనీ. మనకేమీ అక్కర్లేదు. ఆనందంగా ఉంటే చాలు." అన్నది ఆ క్షణంలో తల్లిలా అగుపిస్తున్న కాత్యాయని.

కేశవపిళ్ళై తన చేతులను కాత్యాయనీ అమ్మ మెడమీద వేశాడు. తల కిందికి దించుకున్నాడు. వాళ్ళిద్దరూ ఒకరి ముఖాన్ని ఒకరు దగ్గరకు చేర్చుకున్నారు.

అలా వాళ్ళు ఎంత సేపు కూర్చున్నారో తెలియదు. ఆ హాయిలో కేశవపిళ్ళై తన కష్టాల నన్నింటినీ మరిచి పోయినాడు.

కాత్యాయనీ అమ్మ భర్త చెవిలో మెల్లిగా చెప్పింది. "రాత్రి చాలా పొద్దు పోయింది. మీరు నిద్రపోలేదు కూడా."

పసిపిల్ల వాడిలాగా అతను ఏదో అన్నాడు.అన్నీ పసిపిల్లల మాటలే.

"నాకు నిద్ర పట్టటంలేదు. పట్టదు కూడాను."

"మనం వెళ్ళి నిద్ర పోవాలి. మిమ్ములను నేను నిద్ర పుచ్చుతాను."

కాత్యాయనీ అమ్మ కేశవపిళ్ళైను లేవదీసింది.

"అంతా నీకు చెప్పేద్దామని వుంది." అన్నాడు కేశవపిళ్ళై.

"మరి చెప్పరాదూ? చెప్పేందుకు నేను తప్ప మరెవరున్నారు?"

కేశవపిళ్ళై ఒప్పుకున్నాడు: "నీకే చెప్తాను. నీవు తప్ప నాకు మరెవ్వరూ లేరు."

"మరి?"

"నీకు భయమేస్తుంది."

"లేదు, నాకు భయం వెయ్యదు."

"ఇక్కడ ఇప్పుడు నా కందరూ శత్రువులే."

"అధైర్య పడకండి ఫరవాలేదు."

ఆ ఓదార్పులో హాయిలో కేశవపిళ్ళై చిలకలా సమాధానం చెప్పాడు: "ఇదంతా యిలా అవుతుందని నేననుకోలేదు."

భర్త దిగులుకు కారణం తెలుసుకోకుండానే కాత్యాయనీ అమ్మ అన్నది: "ఫరవాలేదు. మన మీద అపవాదేమీ రాదు. లేనిపోని అనుమానాలతో మనస్సు పాడు చేసుకోకండి."

కేశవపిళ్ళై తన తెలివి తక్కువతనాన్ని గురించి చెబుతున్నాడు: "నేను కూడా మహాపురుషుడిలా సేవచేసి, పని చెయ్యకుండా టలాయిస్తే బాగానే వుండే వాణ్ణి. అలాకాక నిండు మనస్సుతో నేను పని చేశాను. అదే నేను చేసిన తప్పు."

"తప్పేమీ చెయ్యలేదు. రండి నిద్ర పోదురు గాని."

కాత్యాయనీ అమ్మ కేశవపిళ్ళెను తీసుకెళ్ళి మల్లెపూలు పరచిన పక్కమీద పడుకో బెట్టింది.

తల్లి కౌగిలిలో ఒదిగి పడుకొనే పసివాడిలాగా కాత్యాయని చేతుల ప్రేమగా ఒదిగి కేశవపిళ్ళె పడుకున్నాడు. కాత్యాయనీ అమ్మ అతని తలనూవీపునూ నిమురుతోంది. చాల యేండ్ల కిందట అతను ఈ విధంగా తన తల్లి దగ్గర ఒదిగి పడుకునేవాడు. కొంత సేపటికి కాత్యాయనీ అమ్మ లేచి చూసింది. కేశవపిళ్ళె నిద్ర పోతున్నాడు. అతని ముఖం మీద చిరునవ్వు చిందుతూ వుంది. అలా భర్తను ఆమె నిద్ర పుచ్చింది.

కేశవపిళ్ళె నిద్రలో ఏదో కలవరించాడు. కాత్యాయనీ అమ్మ పసిపిల్లవాడికి చిచ్చి కొట్టినట్లు అతని వీపుమీద మెల్లగా నిమిరి నిద్రపుచ్చింది. అతనికి బాగా నిద్ర పట్టింది.

అణు మాత్రంగా దీపం వెలుగుతున్న ఆ గదిలో హాయిగా నిద్ర పోతున్న తన భర్తను చూసుకొని కాత్యాయని ఆనందించింది.

## ఇరవై యారు

ధన్యానందాశ్రమానికీ, అనాధ మందిరానికి ప్రారంభోత్సవం త్వరలో జరగబోతూవుంది. ధన్యానంద స్వాముల అద్భుత శక్తులను గురించి వార్తా పత్రికల్లో వ్యాసాలు అచ్చయినాయి. ఆశ్రమంలో, మందిరంలో జరగబోయే కార్యక్రమాలను గురించి కూడా సంగ్రహ వివరణ అచ్చయింది. ప్రారంభోత్సవం వైభవోపేతంగా జరిపించేందుకు నిర్ణయించారు. తంకమ్మతో పాటు మరి ముగ్గురు స్త్రీలు, నలుగురు పురుషులు ఆ రోజు స్వామిజీ చేతులతో కాషాయ వస్త్రాలు పుచ్చుకుని సన్న్యాసదీక్ష స్వీకరిస్తారని అంటున్నారు. కాని పూజ్యపాదులు విచ్చేసిన తర్వాతనే అది నిర్ణయమవుతుంది.

ఆశ్రమానికీ, అనాధ మందిరానికి చందాలు పోగుచేసే పని ఆరంభమయింది. తిరువనంతపురంలో పని జాతీయ నాయకులేకాక సంఘ సేవకుల భార్యలు కూడా - అందరూ కలిసి జట్లు జట్లుగా ఇంటింటికి చందా కోసం వెళ్ళ సాగారు. ఇలా యిల్లాండ్లు కలిసి పని చేసేందుకు ఒక అవకాశం దొరికింది. అది మంచిదే అయింది. పోలీసు కమీషనరు భార్య, ప్రాంతీయ కాంగ్రెసు ప్రధాని భార్య కలిసి సాంఘికమైన పని చేస్తున్నారు. మంచివాళ్ళు ఇది మంచి పని అని భావిస్తున్నారు.

తంకమ్మ యిల్లు మారుస్తున్నది. అక్కడ కమిటీ తాత్కాలిక కార్యాలయం వుంటుంది. రోజూ చందా పోగు చేసేందుకు నియమించిన మహిళా దళాలు ఆఫీసుకు వచ్చి లెక్క చెప్తారు. ఇది నిత్య కృత్యం.

మధ్యలో ఒక రోజు పార్కువ్యూలో చందా వసూలు చేసేందుకు ఒక జట్టు వెళ్ళింది. ఈ జట్టు ఒక వార్త తీసుకుని తిరిగి వచ్చింది. ఇద్దరు సెక్రటరీల

భార్యలు, ఒక ప్రాంతీయ కాంగ్రెసు నాయకుని భార్య ఆ జట్టులో వున్నారు. మిగిలిన జట్లు వచ్చేలోగానే యీ జట్టు ఆఫీసుకు చేరుకుంది.

మరో మూడు నాలుగు చోట్లకు వెళ్ళగలిగి వుండే వాళ్ళమని విద్యా శాఖ సెక్రటరీ భార్య విశాలాక్షమ్మ అభిప్రాయ పడింది. రెవిన్యూ సెక్రటరీ భార్య భానుమతీ అమ్మ అన్నది: "అక్కడికి వెళ్ళగానే నా మనస్సు చెడిపోయింది. అదేం రూపమే విశాలాక్షీ!"

విశాలాక్షీ అమ్మ తన అభిప్రాయం చెప్పింది: "అడవి మనిషి. అది మనుష్యులను ఎప్పుడూ చూడలేదేమో. ఎలా ప్రవర్తించాలో తెలియదు. ఒట్టి అడవి మృగం."

భానుమతీ అమ్మ జాలి పడుతూవుంది: "ఆ బంగళాలో ఎవరెవరో వుండేవాళ్ళు. కృష్ణన్ నాయర్ భార్య భగవతికుట్టి యమ్మ, ఆ తర్వాత అమ్మయ్యార్ అనుకుంటాను, సైమన్ భార్య కూడా చాలా తెలివి గలది. ఎవర్ని చూసినా గౌరవించేది. వాళ్ళంతా అక్కడ ఉండేందుకు తగిన వ్యక్తులు. అయ్యో పద్మనాభస్వామీ! ఈమెను తెచ్చి యిక్కడ స్థాపించావా?"

కాంగ్రెసు నాయకుడి భార్య జానకి అమ్మకు ఈ సందర్భంలో చాలా విషయాలు చెప్పాలని వుంది.

"ఆ జాతిలో ఆడవాళ్ళు ఎప్పుడూ అలాగే వుంటారు. మట్టూ, మర్యాద అనేది లేదు. వంటిల్లు దాటి యెప్పుడూ బయటికి రారు. మాటా, మంచీ వాళ్ళకు తెలియనే తెలియదు. వాళ్ళు అలాంటి వాళ్ళు ." అన్నదామె.

"ఇలాంటి వాళ్ళు పార్కువ్యూలో వచ్చి యెందుకుంటారు? అది వాళ్ళకు తగిన స్థలం కాదు." - అన్నది భానుమతీ అమ్మ విసుక్కుంటూ.

"ఇందుకు మనమొక నియమం పెడదాం" అన్నది విశాలాక్షీ అమ్మ నవ్వుతూ.

భానుమతీ అమ్మ దాన్ని నవ్వులాట అనుకోలేదు. నిజంగా అలాంటి నియమం ఉండాలనే ఆమె కోరిక. ఆ బంగళా గౌరవం నిలపాలి.

అప్పటికి మరో రెండు జట్లు వచ్చాయి- కన్సర్వేటరు భార్య నాయకత్వంలోది ఒకటి, సెక్రటరీ భార్య రుక్మిణీ అమ్మ నాయకత్వంలోది మరొకటి.

"భానుమతీ, ఎందుకు కోపంగా ఉన్నావు?" అని అడిగింది కన్సర్వేటరు భార్య.

"ఇవ్వాళ చందా బాగా వసూలు కాలేదని కాబోలు కోపం?" అన్నది రుక్మిణీ అమ్మ: "శకునం బాగా లేదని బయలు దేరింది భానుమతీ అమ్మ."

"నిజమే, ఈ రోజు అనుభవం అలాగే వుంది" అన్నది భానుమతి అమ్మ.

"ఈ రోజు చందా యెంత వసూలయింది" అని అడిగింది కన్సర్వేటరు భార్య.

"అంత తక్కువేం కాదు". అన్నది జానకి అమ్మ.

"మరెంతా?" అడిగింది రుక్మిణీ అమ్మ.

విశాలాక్షి అమ్మ ఆ కథ మొదలు పెట్టింది: "రుక్మిణీ అమ్మా! ఈ రోజు మాకు ఒక అనుభవం అయింది."

అందరూ ఆమె వైపు కుతూహలంతో తిరిగి చూచారు. విశాలాక్షి అమ్మ కథ ఆరంభించింది:

"ఇవాళ మేము పార్కువ్యూకు వెళ్ళాము. అక్కడ డ్రాయింగు రూంలో కాసేపు నిలబడ్డాం. ఎవ్వరూ కనిపించలేదు. బహుశా యింటి యజమానురాలు ఇక్కడ లేదేమోనని మాకు అనుమానం వేసింది. ఇంతలో తోట పని వాడు వచ్చాడు. అతన్నడిగితే అమ్మగారు ఇక్కడే వుందని చెప్పాడు. అతను చాలా తెలివిగలవాడు. అమ్మగారు అనవసరంగా ఇక్కడికి రారని చెప్పాడు. అయినా పిలుచుకు వస్తానని చెప్పి వెళ్ళాడు. మేం ఎదురు చూస్తున్నాం. ఇంతలో ఒక ఆమె వచ్చింది."

విశాలాక్షి అమ్మ అందాకా చెప్పేసరికి మధ్యలో భానుమతి అమ్మ అందుకుంది: "ఆమె ఆ యింట్లో వంట మనిషేమో అనుకున్నాను."

విశాలాక్షి అమ్మకు ఆ విషయం స్పష్ట పరిచేందుకు అవకాశం లభించాలి. భానుమతి అమ్మకు కోపం వచ్చింది. అందువల్ల ఆమె చెప్తే సరిగ్గా వుండదు. విశాలాక్షి అమ్మే చెప్పాలని రుక్మిణీ అమ్మ తీర్మానించింది. భానుమతి అమ్మ పరధ్యానంలో ఆ తీర్మానాన్ని ఆమోదించింది.

కథాప్రవాహంలో అంతరాయం వచ్చినందువల్ల విశాలాక్షి అమ్మ కాసేపు మౌనం వహించింది. అందరూ కుతూహలంతో కూర్చుని వున్నారు. విశాలాక్షి అమ్మ ఆరంభించింది: "వంట మనిషిలాగా నాకు కనిపించ లేదు. వంటమనిషి మెడలోనూ, చేతులకి అంత బంగారం ఎక్కడ వుంటుంది? చెవులకు పెద్ద పెద్ద కమ్మలు. వాటినే టాప్సు అంటాం. చేతులకు బరువయిన గాజులు, మెడ నిండా బంగారం. రుద్రాక్షమాలలాగా పెద్ద ముత్యాల హారం. అదికాక తోలులాంటి మరో చిన్న హారం. తోలులాంటి ఆ దండమధ్య చిన్న మంగళ సూత్రం గట్టిగా ముడివేసి వుంది. అన్ని సొమ్ములు వంట మనిషి దగ్గర వుంటాయా?"

జానకి అమ్మకు ఉత్తరాది వాళ్ళ సొమ్ములను గురించి చెప్పాలని వుంది. ఆమె ఉత్తర దేశమంతా తిరిగి వచ్చింది.

"వాళ్ళ దగ్గర చాలా బంగారం వుంటుంది. ఒక్క దండ కూడా పని తనంతో కూడి వుండదు."

విశాలాక్షి అమ్మ తన వుపన్యాసం ఆరంభించింది: "తెల్ల చీరె కట్టుకుంది. జంపరు వేసుకుంది. దాన్ని జంపరు అనేందుకు కూడా వీల్లేదు. మో చేతి

కింది దాకా జంపరు అంచు వుంది. నడుము దాకా పొడుగుంది. చేతుల బనీను లాగా వుంది ఆ జంపరు. శాలువా వేసుకోలేదు."

భానుమతి అమ్మ ఆమె మాట మార్చి చెప్పింది: "కాత్యాయనీ అమ్మను చూస్తే వంట మనిషిలాగానే వుంటుంది." ఈ మాట నొక్కి చెప్పటమే ఆమె ఉద్దేశ్యం.

"తెల్ల చీరె అని చెప్పేందుకు వీల్లేదు. మాసిన చీరె. ఒక తట్టు మసి, మరో వైపు మరకలు, పసుపు ఏవేవో వున్నాయి. చెంప మీద కూడా కొంచెం మసి వుంది."

"అయితే మీరు చాలా జాగ్రత్తగా గమనించారన్న మాట?" అన్నది కన్సర్వేటరు భార్య.

అందరూ విని నవ్వుకునే విషయమది.

"ఏది యెలాగున్నా వంటింట్లో వున్న మాట నిజం" అన్నది విశాలాక్షి అమ్మ.

"లావుగా వుందా? సన్నగా వుందా?" అడిగింది రుక్మిణి అమ్మ.

భానుమతి అమ్మ సమాధానం చెప్పింది: "అంత లావు కాదు గానీ బొద్దుగానే వుంటుంది. బాగానే వుంటుంది. ఎగతాళి చెయ్యకూడదు."

మధ్యలో మరెవరో అడిగారు: "తెలుపా? నలుపా?

జానకి అమ్మ సమాధానం చెప్పింది: "రెండూ, కదూ విశాలా?

"సరే కాని ఎంత పెద్ద జుట్టో. బరువు లేదేమో? జడ వేసుకుంటే చెవుల మీదికి వస్తుంది. ఇంత జుట్టు ఎలా వుందా అనుకున్నాను. అంత బరువెలా మోస్తుందో? పలువరుస బాగా వుంది."

"ఇక మీ అనుభవం చెప్పండి." అడిగింది కన్సర్వేటరు భార్య.

విశాలాక్షి అమ్మ చెప్పటం ఆరంభించింది: "మేమలాగే నిలబడ్డాం. మమ్మల్ని చూసి ఉలిక్కిపడి స్తంభంలా అలాగే నిలబడి పోయింది. మొహం పాలి పోయింది. నోట మాట రాలేదు. మర్యాదకు నవ్వనన్నా నవ్వ లేదు. నివ్వెరపోయి చూసింది."

"ఆమె యెప్పుడన్నా మనుష్యులను చూస్తేగా? మనని చూసేసరికి అడవి మృగంలా ఆశ్చర్యపడిపోయింది. కొంచెం సేపు మేమలాగే వుంటే వంటింట్లోకి పారిపోయేది. తిరిగి వచ్చేది కాదు."

జానకి అమ్మ చెప్పదలుచుకుంది పూర్తిగా చెప్పేసింది: "పల్లెటూరి వాళ్ళు అలాగే వుంటారు." అంది.

విశాలాక్షి అమ్మ మనస్ఫూర్తిగా మళ్ళీ సంభాషణ సాగించింది.

"చాలా సేపు మేము కూడా మాట్లాడలేదు. ఆమె అలాగే మావైపు చూస్తూ నిలబడి పోయింది. చాలా సేపు గడిచింది. అలాగే నిలుచుని వుంది. ఇక వెనక్కి తిరిగి వెళ్ళి పోతుందేమో అనిపించింది. అప్పుడు జానకి అమ్మ

అసలు విషయం చెప్పింది - మేము ధన్యానందాశ్రమం తరఫున అనాథ వనితా మందిరానికి ప్రారంభోత్సవం చేసేందుకు చందా కోసం వచ్చాం. ఆ మాట ఆమెకు అర్థమయినట్లు అనిపించలేదు. బొమ్మలాగా ఆమె అలాగే నిలబడిపోయింది."

మధ్యలో ఎవరో అడిగారు: "మర్యాదకు ఏమయినా అననుకూడా లేదా? కూర్చోమని కూడా అనలేదా?"

"ఒక్క అక్షరం కూడా మాట్లాడ లేదు. కూర్చోమని కూడా అనలేదు."

"మీరే కూర్చొని వుండవలసింది" ఎవరో అన్నారు.

"నా కలాగే అనిపించింది." అన్నది భానుమతి అమ్మ.

విశాలాక్షి అమ్మ అన్నది: "పై అధికారి యిల్లు గదా? కూర్చోమనకుండా ఎలా కూర్చుంటాం? నిజంగా నాకు అలాగే అనిపించింది. ఎవరయినా అసిస్టెంటు సెక్రటరీ భార్యగాని, సూపరింటెండెంటు భార్య గాని మన యింటికి వస్తే యిలాగే కూర్చో మనకుండా కూర్చుంటుందా?"

"మీరెవరో ఆమెకు అర్థమయిందా?" అడిగింది కన్సర్వేటరు భార్య.

"అర్థమయిందో లేదో యెవరికి తెలుసు?" అన్నది విశాలాక్షి.

జానకి అమ్మ: "ఆమెకు వినపడేవుంటుంది. లేకుంటే తత్తరపాటులో చెవులు మూసుకుపోయినాయేమో, చెప్పలేము."

"ఆమెకు అమాయకత్వమైనా అయివుండాలి. లేకుంటే గర్వమయినా అయి వుండాలి" అన్నది భానుమతి అమ్మ.

ఆమె అమాయకురాలని జానకి అమ్మ అభిప్రాయం. గర్వమనేందుకు అవకాశం లేదు. కానీ కచ్చితంగా అలా చెప్పేందుకు వీల్లేదని మరో ఆవిడ అభిప్రాయ పడ్డది. ఎక్కడో మారుమూల పల్లెటూరిలో కూపస్థ మండూకంలా పడివుండే ఆవిడకు ఇవన్నీ చూస్తే గర్వం రావచ్చు కూడా. లేకుంటే అన్ని సొమ్ములు పెట్టుకొని తిరుగుతుందా? భగవతికుట్టి అమ్మకు ఎన్నో సొమ్ములుండేవి. కాని ఒక్కటి కూడా పెట్టుకొని తిరిగేది కాదు. భానుమతి అమ్మకు భగవతి కుట్టి యమ్మను ఇంకా ప్రశంసించాలని వుంది: "నిజానికి అలాంటి ఆడవాళ్ళే పార్కు వ్యూలో ఉండదగిన వాళ్ళు. ఆమె ఆ బంగళాకు అలంకారంగా వుండేది. నేను ఎన్నిసార్లో అక్కడికి వెళ్ళాను. ఎంత మంచి ప్రవర్తన! రీవి, యోగ్యత - అన్నీ ఆమెలో వున్నాయి."

రుక్మిణి అమ్మ పెద్ద నిట్టూర్పు విడిచింది: "మీరేమయినా చెప్పండి అక్కడ వుండే అదృష్టం ఆ పల్లెపిల్లకూ పట్టింది."

భానుమతి అమ్మ గొణిగింది: "ఏమదృష్టమే అది రుక్మిణీ! అదేనా అదృష్టం".

మధ్యలో ఎవరో "అవును, అదృష్టం కాదామరి" అన్నట్టు అడిగారు. భానుమతి అమ్మ అంతటితో ఆగలేదు:

"ఆ వుత్తరాదివాడు అక్కడ పరిచర్య చేసి పైకి వచ్చాడు. లేకుంటే యేముంది? అదేనా అదృష్టం? భక్తి ఎలాన్ సేవ. లేకుంటే ఇంకెవరయినా ఆ స్థానంలో వుండేవాళ్ళు. ఎవరు ముందు ఎవరు వెనక అనేది కూడా చూడలేదు. మా పిల్లల తండ్రి నూవరింటెండెంటుగా పని చేసేప్పుడు కేశవపిళ్ళై పదిహేను రూపాయల జీతం తీసుకునే గుమాస్తాగా పని చేసేవాడు. ఎంతమంది తలలు దాటో పైకి వచ్చాడు. విశాలాక్షి అమ్మ ఆ ఘట్టాన్ని పూర్తి చేస్తూ అంది: "దీనికంతా పునాది వేసింది యెవరు? కృష్ణన్ నాయరూ, భగవతి కుట్టి అమ్మ."

అప్పుడు కన్సర్వేటరు భార్య ఒక ప్రశ్న వేసింది:

"ఇప్పుడక్కడ ఎవరు ఉండి వుండవలసింది?" ఇది చాలా గంభీరమైన ప్రశ్న. ఒక్కక్షణం అందరూ నిశ్శబ్దంగా వున్నారు. ఆ నీరవత్వంలో నుంచి ఒక శబ్దం వినవచ్చింది: "తంకమ్మ!"

భానుమతి అమ్మకు ఉత్తేజం కలిగింది: "అవును, అతను ఆమెకు ఎంతో ద్రోహం చేశాడు? పెళ్ళి చేసుకుంటానని నమ్మించి పార్క్యుప్యాలో చొరబడి పెద్ద వుద్యోగం సంపాయించాడు. చివరకు మోసం చేశాడు."

అప్పుడు మరో ఆవిడ మెల్లగా తన అభిప్రాయం చెప్పింది: "అందువల్ల ఆమెకు వచ్చిన నష్టమేముంది? ఒక విధంగా మంచిదే అయింది. ఆత్మకు ముక్తిని ప్రసాదించే మార్గంలో పడింది. అలజడితో కూడిన వాతావరణం నుంచి తప్పించుకుంది."

ఈనాడు తంకమ్మ సర్వస్వం వదలి యీ మార్గంలో ప్రవేశించేందుకు ఈ నైరాశ్యమే కారణమని విశాలాక్షి అమ్మ అభిప్రాయం. తంకమ్మ ప్రేమించింది. ఆ ప్రేమ భగ్నమయ్యేసరికి ఇలా ద్వేషం ప్రబలింది.

ఆ తర్వాత కొంత సేపు మళ్ళీ నిశ్శబ్దం. ప్రేమవల్ల ఏర్పడ్డ నైరాశ్యాన్ని గురించి అందరూ కథలు చెప్పుకున్నారు. కొంత ప్రపంచ జ్ఞానంగల కన్సర్వేటరు భార్య ఆ నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ అన్నది: "అసలీ ఉత్తరాది వాళ్ళను నమ్మకూడదు. వాళ్ళు నమ్మకద్రోహులు. వెనక ఉత్తరాది నుంచి చదువుకునేందుకు వచ్చే కుర్రవాళ్ళు చాలా నెమ్మదిగా వుండేవాళ్ళు. ఇప్పుడు మారిపోయినారు."

"ఇది చాలా పెద్ద ద్రోహం" అన్నారెవరో.

భానుమతి అమ్మకు మరో విషయం చాలా ఆశ్చర్యం కలగజేసింది: "తంకమ్మను వదిలి పెట్టి యీ మండూకిని కట్టుకోవటం చాలా ఆశ్చర్యంగా వుంది."

అందరినీ నవ్వించే మాట యెవరో అన్నారు: "అతనే నరమండూకం. మండూకానికి మండూకి నచ్చటంలో ఆశ్చర్యంలేదు."

అసలు కథ పూర్తి కాలేదని వాళ్ళల్లో యెవరో అన్నారు. విశాలాక్షి అమ్మ కథ కొన సాగించింది: "మేమక్కడికి వెళ్ళిన సంగతి జానకి అమ్మ ఆమెకు విపులంగా చెప్పింది. అనాధమందిర మంటే యేమిటి? ధన్యానందాశ్రమమంటే యేమిటి? అంతా చెప్పింది. ఎలాంటి భావప్రకటన లేకుండా ఆమె అంతా విన్నది. ఒక్కమాట కూడా మాతో మాట్లాడలేదు. చివరకు చందా యియ్యమని అడిగాము."

"ఇదంతా నిలబడే మాట్లాడారా?" ఎవరో అడిగారు.

"అవును. ఆమె చాలా సేపు ఏమీ మాట్లాడలేదు. అక్కడ ఎక్కువసేపు ఉండేందుకు వ్యవధి లేదు. జానకిఅమ్మ చందా అడిగే సరికి "వాళ్ళ నాన్న వస్తారు" అని నెమ్మదిగా అన్నది. . అంతే. మేము మరి కొంతసేపు ఆగాము. ఆమె కదల్లేదు. నోరు కదల్చలేదు. చివరకు 'ఇక మేం వెళ్తాం' అని చెప్పి అక్కడినుంచి కదిలాం."

"అయితే ఆమె చీఫ్ సెక్రటరీ భార్య అయివుండదు. ఎవరో వంట మనషే అయివుంటుంది. తెలివిగల వంటమనిషి." అన్నది యెవరో హాస్యప్రియ.

భానుమతి అమ్మకు ఒక కొరవ ఉంది. దానికి ఆమె చాలా బాధపడింది. దాహంతో తపనతో వాళ్ళు అక్కడికి వెళ్ళారు. ఒక్క గ్లాసు నీళ్ళు కూడా వాళ్ళకు దక్కలేదు."

"అరే, పోనిస్తూ, మమ్మల్ని పని చెయనియ్యండి" - అన్నది కన్సర్వేటరు భార్య.

ఇంతలో బయటికి వెళ్ళిన తంకమ్మ వచ్చింది. డబ్బు వసూలు చేసి ఒకచోట పెట్టే బాధ్యత ఆమెది. ప్రతిజట్టూ వసూలు చేసిన డబ్బు ఆమెకు అప్ప జెప్పారు.

ఇక పార్కువ్యూలో జరిగిన ఉదంతం చూడాలి- ఈ వార్త భర్తకు చెప్పేందుకు కాత్యాయని ఎదురు చూస్తూ వుంది. కేశవపిళ్ళై ఆఫీసు నుంచి రాగానే కాత్యాయనీ అమ్మ అన్నది: "ఈ రోజు ఒక ప్రత్యేకమైన వార్త వుంది."

"నీ ప్రత్యేక వార్త నేను బట్టలు మార్చుకుని కాఫీ తాగిన తర్వాత చెప్పచ్చులే" అన్నాడు కేశవపిళ్ళై.

"లేదు, నిజంగా ఒక ప్రత్యేకమైన వార్త వుంది."

కాత్యాయనీ అమ్మ మనస్సు కూడా నిలకడగాలేదు. చందాకోసం వచ్చిన ఆడవాళ్ళతో తను సరిగ్గా ప్రవర్తించిందో లేదో అని ఆమెకు అనుమానంగా వుంది. ఎక్కడో ఏదో పొరపాటు జరిగిందని ఆమె భయం. అలా జరిగివుండ కూడదు. భర్త కోప్పడతాడేమో. కానీ యేంచెయ్యాలో కూడా ఆమెకు తెలియలేదు. కాఫీ తాగుతూ సాయంత్రంపూట కేశవపిళ్ళై అడిగాడు: "ఇప్పుడు చెప్పు, ఆ ప్రత్యేకమైన వార్త యేమిటో?"

"లేదు, నిజంగానే విశేషముంది. నేను ఊరికే చెప్పలేదు." అన్నది కాత్యాయనీ అమ్మ.

కాత్యాయని కంఠాన్ని అనుకరిస్తూ కేశవపిళ్ళె మళ్ళీ అడిగాడు: "నిజంగా విశేషమయితే చెప్పండి."

ఆ రోజు కేశవపిళ్ళె చాలా హుషారుగా వున్నాడు. పసిపిల్లలాగా కాత్యాయనీ అమ్మ అన్నది. "ఒక వేళ పొరపాటు జరిగివుంటే కోప్పడరుకదూ!"

ఆ కుట్టినాటి యిల్లాలికి భర్తను వశపరచుకోవడం తెలుసు ఎలా వలవెయ్యాలో తెలుసు. ఎవరూ నేర్పింది కాదు. ఆత్మరక్షణ జన్మజాతమయిన విద్య.

"తప్పో, ఒప్పో, కోపం రావాలో, అక్కర్లేదో - అంతా అసలు విషయం తెలిసిన తర్వాత గదా తీర్మానించేది?" అన్నాడు కేశవపిళ్ళె.

"అయితే నేను చెప్పను "అన్నది కాత్యాయనీ అమ్మ బుగ్గలు లావు చేసుకుని.

"చెప్పు, నేను కోప్పడను. సరేనా?"

కాత్యాయని అమ్మకు పూర్తిగా నమ్మకం కుదరలేదు. జంకుతూ ఆమె చెప్పసాగింది: "ఈ రోజు ఇక్కడికి ముగ్గురు ఆడవాళ్ళు వచ్చారు."

"వచ్చారూ?" అన్నాడు కేశవపిళ్ళె వంత పలుకుతూ.

"ఎగతాళి చెయ్యకండి. నన్ను చెప్పనియ్యండి. ఇద్దరు తళుకు బెళుకులతో ముస్తాబు చేసుకుని వున్నారు. మరొకరు మామూలుగా వున్నారు."

"ఆమెకు ముస్తాబు లేదా?"

"అంతే కాదు. ఆ యిద్దరివీ తెల్ల వెంట్రుకలు. జుట్టు అట్టే యెక్కువ లేదు. అయినా ఎరువు తెచ్చుకున్న జుట్టుముడి పెట్టుకోవటం వల్ల కొప్పు లావుగానే కనిపిస్తూవుంది. తల మీద మూడు నాలుగు పాయలు కలిసి ఏడు పాయలుంటాయి. కను బొమ్మలు తీర్చినట్టున్నాయి. కళ్ళల్లో కాటుక పెట్టుకొని బయటికి ఒక గీతకూడా గీసుకున్నారు. మొహం నిండా పౌడరు, పెద్ద బొట్టు, పల్చటి చీరె, సిగ్గు లేదు కాబోలు. అంతకంటె విడిచి తిరగటం మేలు. వాళ్ళ రవికె ఇంతకంటె విచిత్రంగా వుంది. సన్నపాటి గుడ్డ, చంకలు కనిపిస్తూ వున్నాయి. చేతుల్లేని జాకెట్టు. రొమ్ము కింది భాగం కూడా కనిపిస్తూవుంది. గంటలాంటి సంచి కదులుతూ వుంది. ఇద్దరూ పాలిపోయినట్టున్నారు. రక్తం బొత్తుగా లేదు. ఒకావిడ పెదిమలకు ఎర్రరంగు వేసుకున్నట్టుంది. కాలిమడమలు పైకి కనిపించే చెప్పులు వేసుకుని వచ్చింది. మూడో ఆమె అలా లేదు. ఆమె ఖద్దరు కట్టుకుంది."

కాత్యాయని అమ్మ చేసే వర్ణన కేశవపిళ్ళె ఆసక్తితో వింటున్నాడు.
"వాళ్ళెందు కొచ్చారు?" అని అడిగాడు.

"ఏదో ఆశ్రమానికి డబ్బు కావాలని వచ్చారు."

"మరి?"

"మరేముంది? పిల్లతండ్రి వచ్చిన తర్వాత అడగమన్నాను."

"సెబాష్!"

"ఏం?"

"ఎవరెవరు వచ్చారు?"

"ఇద్దరూ ఉద్యోగస్థుల భార్యలు. వాళ్ళు ఫ్యాషనుగా వున్నారు. మరో ఆమె గ్రామ నాయకుని భార్య."

"ఉద్యోగస్థుల భార్యలా? ఏం వుద్యోగం?"

"సెక్రటరీల భార్యలట. వాళ్ళను చూడగానే నాకు కోపం వచ్చింది. కాళ్ళు వణికినాయి."

కేశవపిళ్ళె కొంచెం సేపు మౌనంగా వున్నాడు. తన వల్ల ఏదో తప్పు జరిగిందని తోచింది కాత్యాయనీ అమ్మకు.

"ఎందుకు మౌనంగా వున్నారు?" అని అడిగింది.

కాత్యాయనీ అమ్మ ముందే ఒట్టు పెట్టుకుని చెప్పింది: "అమ్మాయి విజయం తోడు. నేను వాళ్ళ నేమీ అనలేదు. ఆడవాళ్ళు ఇంటికి వస్తే వాళ్ళ నేమన్నా అనేందుకు నేను పిచ్చిదాన్నా? నేను ఒకటే మాట అన్నాను. "వాళ్ళ నాన్న వస్తే" అని. అంతకు మించి నేనేమీ అనలేదు. మాట్లాడకుండా నిలబడ్డాను."

"వాళ్ళను కూర్చోమనిగానీ, కాఫీ తాగమని కానీ అనలేదా?" అన్నాడు కేశవపిళ్ళె.

"లేదు, వాళ్ళక్కడే నిలబడ్డారు. నేను నిలుచున్నాను. వాళ్ళు చెప్పవలసింది వాళ్ళు చెప్పారు. నేను చెప్పవలసింది నేను చెప్పాను. వాళ్ళు వెళ్ళి పోయినారు."

కేశవపిళ్ళెకు నవ్వు వచ్చింది. కోపం రాలేదు.

"ఎందుకు నవ్వుతున్నారు?" అన్నది కాత్యాయనీ అమ్మ.

"ఊరికే నవ్వాను. అంతే, ఇంటికెవరన్నా వస్తే మర్యాద చెయ్యాలి గదా?"

కాత్యాయనీ అమ్మ వెంటనే సమాధానం చెప్పింది: "నేనేమీ అమర్యాద చెయ్యలేదు గదా? డబ్బియ్యలేదు అంతే. దానికి తగినవాళ్ళు మీరు. మీరే ఇస్తారని అనుకున్నాను."

"ఇంట్లో డబ్బుంది, తాళపు చెవి నీ దగ్గరే వుంది. అయిదో, పదో లేకుంటే వంద రూపాయలయినా సరే యిస్తే నేను కాదంటానా?"

కాత్యాయనీ అమ్మ దగ్గర దానికి సమాధానం సిద్ధంగా వుంది: "ఇంత వరకూ నేను అలా డబ్బు ముట్టుకోలేదు. ఇంట్లో కూడా డబ్బు విషయం మామగారే చూసుకొనేవారు. అత్తయ్య కూడా డబ్బు ముట్టుకునేది కాదు. డబ్బు ఇయ్యటం, తీసుకోవటం ఎక్కడన్నా ఆడవాళ్ళు చేస్తారా? నాకు తెలీదు. ఇంతవరకు నేను చెయ్యలేదు. ఇక ముందు చెయ్యను. అదంతా మగవాళ్ళ పని."

కాత్యాయనీ అమ్మ తన అనుభవంలోకి వచ్చిన విషయాలు చెప్పింది. ఆమె చూసింది, విన్నది, జీవించిన విధానం అదే. కేశవపిళ్ళై, ఆమెకి బదులు చెప్పలేక పోయాడు: "వాళ్ళను కూర్చోమని కూడా అనలేదా?" అన్నాడు.

"లేదు, వాళ్ళు నిలబడి మాట్లాడి వెళ్ళిపోయారు."

"నీవు కూడా అలా యెక్కడికయినా వెళితే నిన్ను వాళ్ళు కూర్చోమనక పోతే నీకు కోపం రాదూ?" అని అడిగాడు కేశవపిళ్ళై.

"ఎందుకు? నాకేం కోపం రాదు. మనవూళ్ళో ఇరుగు పొరుగు వాళ్ళ యిండ్లకు వెళ్ళేదాన్ని. ఎవరూ నన్ను కూర్చోమనీ, వండుకోమనీ యేమీ అనేవాళ్ళు కాదు. మన ఇంటికి కూడా ఎంతమందో ఆడవాళ్ళు వచ్చే వాళ్ళు. వాళ్ళను కూడా కూర్చోమని అనేది కాదు అత్తయ్య."

కాత్యాయనీ అమ్మ మనస్సులో నాణీ కుట్టీ, కుంజీ కుట్టీ ఉన్నారు. కానీ వాళ్ళ పేర్లు చెప్పలేదు.

కొంచెం సేపాగి కాత్యాయనీ అమ్మ తన అభిప్రాయం తెలియపరచింది: "కాని ఒక విషయముంది. ఆడవాళ్ళు కాలి మీద కాలువేసుకుని కుర్చీల్లో కూర్చోవటం సిగ్గు చేటు. మంచి కుటుంబంలో పుట్టి పెరిగిన వాళ్ళెవరూ అలా కూర్చోరు. వాళ్ళు గణాచార్లు. కూర్చుంటే కూర్చోవచ్చు."

అప్పుడు కూడా కేశవపిళ్ళై కేవలం నవ్వి వూరుకున్నాడు. కాని అది తెలివి తక్కువ వల్ల వచ్చిన నవ్వు. బహుశా అతను తనను తాను ప్రశ్నించుకుంటున్నాడు : "ఈ పరిస్థితికి బాధ్యులెవరు? తనను తాను దూషించుకోటం భావ్యమేమో?"

కాత్యాయని అమ్మకు కొంచెం చిరాకుగా వుంది. తనకు అనుకూలంగానే అన్ని విషయాలూ చెప్పింది. కాని తనవల్ల ఏదో లోపం, పొరపాటు జరిగినట్టు ఆమెకు అనిపించింది. ఆమెకు కూడా విచారంగా వుంది. భర్తకు చెడ్డ పేరు తెచ్చానేమోనని ఆమె అనుకున్నది.

"సరే కాని, యేమన్నా పొరపాటు జరిగిందా?" అని అడిగింది.

"అయ్యోరామ! పొరపాటు లేదూ, ఏమీ లేదు. నాతో పని చేసే వాళ్ళ భార్యలు కదా! వాళ్ళకు నిన్ను గురించి కొంత అపోహ ఏర్పడి వుంటుంది."

"అంతేకదా! నేను మంచిదాన్ని కాదని వాళ్ళనుకుంటే మరేం పరవాలేదు. పిల్ల తండ్రి వల్ల పొరపాటేమీ లేదుగదా!"

కేశవపిళ్ళై నవ్వి ఊరుకున్నాడు. తప్పనీ కాదనీ యేమీ చెప్ప లేదు.

ఆ తర్వాత కొద్ది రోజుల్లో ఆశ్రమం ప్రారంభోత్సవాన్ని గురించి వార్తా పత్రికల్లో ఎక్కువగా వార్తలు వచ్చాయి. కేశవపిళ్ళై ఆ విషయం గమనించాడు. అది ఆ పట్టణంలో ముఖ్యమైన సంఘటన. దాని కోసమే చందా అడిగేందుకు ఆడవాళ్ళు వచ్చివుంటారని కేశవపిళ్ళై అనుకున్నాడు. వాళ్ళు అవమానంతో తిరిగి వెళ్ళి వుంటారని అతను ఊహించాడు.

హిందూ మతానికి సంబంధించిన ఉద్యోగస్థులు, ప్రముఖ పౌరులు, నాయకులు ఈ పనిలో తిరుగుతున్నారు. ప్రాంతీయ కాంగ్రెసు నాయకులందరూ ఆ కార్యక్రమాన్ని నడిపిస్తున్నారు. ఆ కార్యక్రమంలో తాను ఎలా ప్రవేశించాలా అని కేశవపిళ్ళై ఆలోచిస్తున్నాడు.

కాంగ్రెసు నాయకుల్లో ఎవరితో కూడా కేశవపిళ్ళైకు వ్యక్తిగతమైన సంబంధం లేదనే చెప్పవచ్చు. కలిగించుకునే అవకాశంకూడా దొరకలేదు. కాంగ్రెసు గెలిచే రోజులు. ఆంగ్లేయులు వెళ్ళిపోయే తేదీకూడా నిశ్చయమయింది. తిరువితాంకూరులో స్వతంత్ర తిరువితాంకూరు నినాదం ఒక్కటే మిగిలిపోయింది. గట్టిగా అనకపోతే అది కూడా నశించిపోతుంది. కాంగ్రెసు అధికారంలోకి వస్తుంది.

కాంగ్రెసు దృష్టిలో తొలి శత్రువు కేశవపిళ్ళై. అతనికి ఉరిశిక్ష వేయించటమే వాళ్ళ నినాదం. అతన్ని వూరికే వదిలి పెట్టే పరిస్థితి లేదు. ఉరిశిక్ష తప్పినా రాబోయే కాలం అతనికి చాలా కష్టమయింది. జ్యోతిష్యులు కూడా అదే చెప్తున్నారు. కాంగ్రెసు వాళ్ళతో ఏదయినా వ్యక్తిగత సంబంధం ఏర్పడితే అతనికి నిలకడ వుంటుంది. ఇది దానికి సరియైన సమయం.

కాని ఆ కార్యక్రమంలో ఎలా ప్రవేశించటం? ఆశ్రమం తంకమ్మ యింట్లో వుంది. తను కట్టించిన యింట్లో. అందులో పాల్గొంటే మళ్ళీ తంకమ్మతో సంబంధం ఏర్పడుతుంది. ఇప్పుడిప్పుడే కుదుటపడుతున్న తన సంసారం మళ్ళీ చిక్కుల్లో పడుతుంది. ఈ రోజు అతని మీద ప్రేమగల వ్యక్తి ఒక్క కాత్యాయని మాత్రమే. తన కష్టాలతో ఆమె పక్కన అతను హాయిగా నిద్రించగలడు. స్వేచ్ఛగా నవ్వగలిగింది ఆమె సరసనే. ఇప్పుడు మళ్ళీ అది పోగొట్టు కోవటమా? ఉత్సాహంతో ఉబికిపోయే ఆమెను దుఃఖాలపాలు చెయ్యటమా?

ఒక రోజు కేశవపిళ్ళై కాత్యాయనీ అమ్మతో అన్ని విషయాలూ స్పష్టంగా చెప్పేశాడు. ఆ సంభాషణలో అతను నూరుసార్లు ఒట్టుపెట్టుకొని ఒకమాట చెప్పాడు. అదేమిటంటే – ముందుముందు తంకమ్మతో కాపరం చెయ్యాలని తను ఇలా చెయ్యటంలేదు. తనకు ఆమె మీద వాంఛ లేదు. ఆమెతో తనకు ప్రయోజనమూ లేదు. ఇది తన ఉనికి కోసం అంతే.

కాత్యాయనీ అమ్మ వాడిపోయిన ముఖంతో కొయ్యలాగా పడుకొని పోయింది. ఒక్క మాట కూడా ఆమె నోటి నుంచి రాలేదు. మాట్లాడే ఓపిక కూడా ఆమెకు లేదు. నోరు, నాలుక ఎండి పోయినాయి. తను ఇలా చెప్పివుండ గూడదని అనిపించింది కేశవపిళ్ళెకు. ఆమెలోని వుత్సాహం, ఆనందం ఇంత త్వరగా తరిగి పోతాయని అతను అనుకోలేదు. బహుశః అతని అభిప్రాయాన్ని కాత్యాయనీ అమ్మ గ్రహించలేక పోయింది. చాలా మంది కాంగ్రెసు వాళ్ళతో వ్యక్తిగత సంబంధం ఏర్పరచుకున్నందువల్ల ప్రయోజన మేమిటి? అనేది ఆమెకు బోధపడి వుండదు.

కాత్యాయనీ అమ్మ దిగజారిపోవటమే కాదు, ఆమె నోటి నుంచి మాట రావటం లేదు. ఆమె పెదవులు బిగుసుకు పోయాయి. అనుమతి అడగటమే పొరపాటయిందని అనుకున్నాడు కేశవపిళ్ళె.

చివరకు కాత్యాయనీ అమ్మ అన్నది: "నన్నెందుకడుగుతారు? మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి. నేను ఇక్కడ ఏదో మూలన ఆ ముసలమ్మ దగ్గరనే లేదా మన వూళ్ళో మన యింట్లోనే వుండి పోతాను."

తెలివి తేటలతో పని చేస్తామని కేశవపిళ్ళె నచ్చ చెప్పాడు. ఉద్యోగస్థులందరూ ఇలాగే ఏదో వుద్దేశ్యంతోనే దగ్గర చేరతారు కాబోలు. ఇలా దూరంగా వుంటే పొరపాటు జరగవచ్చు. ఒట్టు పెట్టుకొని కేశవపిళ్ళె అన్నాడు: "నాకూ ఆమెకూ ఇప్పుడేం సంబంధంలేదు. అలాంటి సంబంధం నాకు అక్కర్లేదు కూడాను."

అప్పటికీ కాత్యాయనీ అమ్మ తనవెనకటి సమాధానమే మళ్ళీ చెప్పింది. ఆమె చెప్పదలుచుకుంది అదొక్కటే.

కేశవపిళ్ళె తన అభిప్రాయం మార్చుకున్నాడు. ఆ కార్యక్రమంతో ఏమీ సంబంధం పెట్టుకో కూడదని నిర్ణయించుకున్నాడు. భవిష్యత్తు ఎలావుంటే అలా వుండనీ. కాంగ్రెసు అధికారంలోకి వస్తే, తనకు ఎవరి అండా లేకుంటే బయటికి గెంటేస్తే గెంటెయ్యనీ. కాత్యాయనీ అమ్మ మనశ్శాంతికి అతను ప్రాముఖ్యమిచ్చాడు. ఆమె వల్ల తనకు లభిస్తున్న ఉపచారం, ఓదార్పు-వీటికి మించింది మరేమీ లేదని అతని కనిపించింది.

ఇకముందు కేశవపిళ్ళె కాత్యాయనీ అమ్మకు చెందిన వాడు, కేవలం ఆమె వాడు, పూర్తిగా ఆమెకు ఆత్మీయుడు.

## ఇరవై యేడు

కొంత కాలం నుంచి కేశవపిళ్ళె బుద్ధి మందగించి పోతూవుంది. ఏదయినా పని తలపెట్టి ముందంజ వేసే సామర్థ్యం అతనిలో తగ్గిపోయినట్టు అతనికే అనిపిస్తున్నది. దిగులు పడుతూ వుంటాడు. ఆ విషయం స్పష్టంగానే తెలుస్తూవుంది. ఓడి పోయిన వ్యక్తిలాగా మాటిమాటికీ భయ పడుతూ, భవిష్యత్తును గురించి ఆలోచిస్తున్నాడు.

భర్తలో వచ్చిన యీ మార్పు కాత్యాయనీ అమ్మ దృష్టిని తప్పించుకోలేక పోయింది. "ఎందుకింత దిగులు పడుతున్నారు?" అని అడిగేది.

కాత్యాయనీ అమ్మకు సరియైన సమాధానం లభించేది కాదు. విషయం అర్థం కాకపోయినా ధైర్యం చెబుతూ అడిగేది: "ఇంత దిగులు పడవలసిన విషయం ఏమిటి? నాకేమీ బోధ పడటంలేదు."

మళ్ళీ అడిగేది: "ఉద్యోగాన్ని గురించా? అదే అయితే, దాన్ని గురించి దిగులే లేదు. ఉద్యోగం పోయినా భగవంతుడి దయవల్ల మనకేమీ యిబ్బంది లేదు."

కానీ కేశవపిళ్ళై ఆ పరిస్థితిని అంగీకరించలేక పోతున్నాడు. ఒక విధమైన జీవితానికి అలవాటు పడ్డాడు కదా!"

తన వుద్యోగం పోయే ప్రమాదం వుందని కేశవపిళ్ళై ఆందోళన పడుతున్నాడు. తిన్నని రాజమార్గం ఈ రోజు వంకరటింకరగా మసకమసకగా మారిపోయింది. ఏదీ కచ్చితంగా చెప్పేందుకు వీల్లేదు. అలాంటి అనిశ్చిత పరిస్థితి అతనికి గోచరిస్తూ వుంది.

కాంగ్రెసు అధికారంలోకి వస్తుంది. ఈనాటి పరిపాలనా యంత్రాంగం మారుతుంది. అది తనకు చాలా చిక్కు సమస్య అవుతుంది. ఆ చిక్కుల్లో తను తన పదవికి దూరం కావచ్చు. అలాంటి పరిస్థితి యేర్పడితే తనకి చేయూత యిచ్చే వాళ్ళెవ్వరూ లేరు. మిగిలిన వాళ్ళు ఎవరికి తోచిన వాళ్ళను వాళ్ళు ఆశ్రయించారు. ఆధారం గట్టిపరుచు కున్నారు. తను ఒక్కడే అలా జాగ్రత్త పడనివాడు. ఏ కాంగ్రెసు నాయకుణ్ణీ చూసి అతను నవ్వలేదు. వాళ్ళను తిన్నగా కలుసుకొనే అవకాశమే అతనికి లేదు. ఒక్క కాంగ్రెసు నాయకుడితో కూడా అతనికి పరిచయం లేదు. అలాంటి పరిస్థితిలో అతని తరఫున మాట్లాడేందుకు ఎవరున్నారు? ఎవ్వరూ లేరు.

కేశవపిళ్ళై తన గడచిన జీవితాన్ని ఒక్కసారి తలుచుకున్నాడు. ఉద్యోగం కోసం తిరువనంతపురం వచ్చి నందన కోటలోని 'శివమయం లక్ష్మి హోటల్'లో బసచేసి చీఫ్ సెక్రటరీ మేనోన్ కృప సంపాదించుకునేందుకు ప్రయత్నించిన నాటి నుంచి యీనాటి వరకు జరిగిన వృత్తాంతాన్ని జ్ఞాపకం చేసుకున్నాడు. నిజంగా ఇది అదృష్టం లీల. కాని ముందు చూపు లేకుండా, పునరాలోచన లేకుండా చేసిన ఉద్యోగ పర్వం ఈ కథలో ఇమిడివుంది. తన జీవితంలో తను ఎవరికీ ఉపకారం చెయ్యలేదనే విషయం గుర్తు తెచ్చుకున్నాడు. ఎవ్వరికీ ఏమీ చెయ్యలేదు. మరెవరికోసం పని చేసినట్టు - దీవాన్‌జీ కోసం, కేవలం దీవాన్‌జీ కోసం. ఇంతవరకూ తాను ఎవరి ప్రేమకూ పాత్రుడు కాలేదు. కాంగ్రెసువాళ్ళ మాట అటుంచి యితరుల్లోనైనా ఒక్కవ్యక్తి కూడా అతని స్మృతి పథంలో లేడు. ఏదయినా ఆపదవస్తే 'అయ్యో పాపం' అని ప్రేమతో అనే వ్యక్తి ఎవరయినా వున్నారా? అలాంటి వ్యక్తి కోసం

కేశవపిళ్ళై తనస్మృతి పథంలో వెతుకుతున్నాడు. ఎవరూ కనిపించలేదు. అందరూ 'అలాగే కావాలి' అనే వాళ్ళే.

చేయరాని పనులు తానెన్నో చేశానని అనిపించింది కేశవపిళ్ళైకు. రాజకీయ సెక్రటరీగా పనిచేసిన సుదీర్ఘ కాలాన్ని స్మరించుకున్నాడు. తెలివి తేటలు అప్పుడు శూన్యంగా వుండేవి. తర్వాత కూడా అంతే. కాంగ్రెసుతో అలా విరోధం పెట్టుకోటం భావ్యమేనా? తర్వాత విచారించి లాభమేముంది? తను ఒంటరివాణ్ణి అయిపోయినాననే యీ భావం అతనికి భీతిని కలగజేసింది.

సచివాలయంలోనే కాదు, దేశమంతటాకూడా ఉద్యోగస్థులందరూ ఈ మార్పుకు సిద్ధమై వున్నట్టు కేశవపిళ్ళైకు తోచింది. తనకు తెలిసిన ఉద్యోగస్థులో ఒక్కొక్కరిని గురించి ప్రత్యేకంగా ఆలోచించాడు. అందరికీ కాంగ్రెసు మిత్రులున్నారు, బంధువులున్నారు, ప్రేమపాత్రులున్నారు. వాళ్ళు కొత్తకొత్త సంబంధాలు ఏర్పరుచుకుంటున్నారు. ధన్యానంద్రాశమం స్థాపించేందుకు కాంగ్రెసు వాళ్ళకు సహాయం చెయ్యవద్దని ఉద్యోగస్థులంతా విజ్ఞప్తిని ప్రకటించారు. చీఫ్ సెక్రటరీ తప్ప మిగిలిన వాళ్ళందరూ నూతన సన్నివేశానికి తయారవుతున్నారు. అంతకు మించి మరేం కావాలి?

నగరంలో ప్రతి వుద్యోగస్థుని యింట్లో స్వాముల వారికి పూజా పునస్కారం, దానం ధర్మం ప్రతిరోజూ జరుగుతూ వున్నాయి. వీళ్ళంతా తికమక పడ్డరాజకీయాలను మరిచి పోయినట్టున్నారు. ఈ కార్యక్రమం వైభవోపేతంగా కొనసాగుతూవుంది. అందరూ అందులో పాల్గొంటున్నారు. స్వాముల వారు అభీష్టదాత అనీ, త్రికాల జ్ఞాత అనీ అందరూ చెప్పుకుంటున్నారు. నగరమంతా ఆయన ఆధ్యాత్మిక తేజస్సులో మైమరచి వున్నారు.

స్వామి ఆశీస్సులు అందరికీ కావాలి. కాంగ్రెసు నాయకుడొకాయన ఆయనకు పూజ చేయించాడు. కొంతమందిని స్వామీజీ హృదయపూర్వకంగా ఆశీర్వదించారు. అలాంటి వాళ్ళల్లో ఒకరు గోవిందన్ పిళ్ళై. నిజానికి కేశవపిళ్ళైకు ఉద్యోగంలో వచ్చిన అభివృద్ధిని చూసి గొణుగుకొనే వ్యక్తి గోవిందన్ పిళ్ళై.

స్వామీజీని దర్శించిన వుద్యోగస్థులు తమ మనస్సులో వున్న కోరికలు నెరవేరేందుకు కానుకలు అర్పిస్తున్నారు.

కేశవపిళ్ళైకు ఇదంతా తెలుసు. గతకాలంలో తనజీవితానికి ఏర్పడ్డ కళంకాన్ని కడుగుకునేందుకు ఇది మంచి అవకాశం. స్వామీజీని పిలిపించి పెద్ద యెత్తున పూజ, దానం చేయిస్తే ఎలా వుంటుందని కేశవపిళ్ళై చాలా సార్లు ఆలోచించాడు. అలాచేస్తే వచ్చే లాభాన్ని గురించి కూడా అతను అంచనా వేశాడు. కానీ ఆ పూజా కార్యక్రమంలో తంకమ్మ వుంటుంది. తుదిసారి శేఖర విలాస్‌కు వెళ్ళినప్పుడు కనిపించిన ఆ యువకుడు కూడా వుంటాడు.

తంకమ్మ యీ రోజు ఆ తంకమ్మ కాదు. ఆమె కాషాయ వస్త్రాల్లో వున్న జోతిర్మయి మాతగా మారింది. ఆ యువకుడు చిదానందుడయినాడు. బహుశా తంకమ్మలో మార్పు వచ్చి వుండవచ్చు. ఆమె స్వభావమే మారి వుండచ్చు. ఇలాంటి మార్పు వచ్చేందుకు ఎంతో కాలం పట్టదు. భాగీరథీ అమ్మ ఆ యువకుని గురించీ, తంకమ్మను గురించీ చెప్పిన మాటలు నిజంకాక పోవచ్చు. ఆమె చెప్పినట్టు ఇదంతా రంకు బొంకుల పటాటోపమే అయితే, ఇంతమందిని ఈ వ్యవస్థ ఎలా ఆకర్షిస్తూవుంది?

కానీ తంకమ్మను మాతృ దేవతగా భావించి పూజించాలి. అది యెలా సాధ్యం? అందులో అతనికి పూర్తిగా అనుమానమే. కాని అంతస్సులోనుంచి యేదో ప్రేరణ వస్తుంది. మాతృ భావనతో ఎందుకు పూజించకూడదు? అది నమ్మకం మాత్రమే కదా! నిజానికి ఈ పరిస్థితికి కారణం ఎవరు? కాని - అది పెద్ద సందేహం. ఇంతవరకు లభించని సౌఖ్యం, ధైర్యం అతనికి ఇప్పుడు దొరికాయి. ఇప్పుడు భయపడవలసిన పనిలేదు.

పూజాపురస్కారాల సంగతి స్కూళ్ళకు కూడా పాకింది. విజయమ్మతోపాటు వాళ్ళ స్కూల్లో, వాళ్ళ తరగతిలోనే చదువుకొనే పిల్లల యిండ్లల్లో ఇలాంటి పూజ జరిగింది. వాళ్ళంతా స్కూలుకు వచ్చి దాన్ని గురించి చెప్పుకుంటున్నారు. విజయమ్మగారి యింట్లో పూజ ఎప్పుడు జరుగుతుందని కొంతమంది పిల్లలడిగారు. అది ఆ అమ్మాయికి తెలియదు.

ఒకరోజు ఆ అమ్మాయి నాన్నగారి కుర్చీ వెనక నిలబడి మొహం ముందుకుపెట్టి తన కోరిక తెలియపరచింది:

"నాన్నగారూ! మనయింట్లో కూడా స్వామీజీకి పూజ చేయించరూ? స్వామీజీ చాలా గొప్పవారు నాన్న గారూ!"

చిరునవ్వుతో తలయెత్తి కూతురివైపు చూచి కేశవపిళ్ళె అడిగాడు: "మా అమ్మాయికి ఆ కోరిక వుందా?"

విజయమ్మ అవునన్నట్టు తల వూపింది.

"అమ్మనడిగి కనుక్కో. అలాగే చేయిద్దాం" అన్నాడు కేశవపిళ్ళె.

విజయమ్మ వెళ్ళింది. క్షణంలో కేశవపిళ్ళె కూర్చున్న చోటు కదులుతున్నట్టు తోచింది. అతను ఉలిక్కిపడ్డాడు. కాత్యాయనీ అమ్మ మండిపడుతూ కేశవపిళ్ళె యెదుట నిలబడింది. అతను తన భార్యను ఈ రూపంలో ఎప్పుడూ చూడలేదు. నిజానికి అతనికి జంకుగా ఉంది. తప్పు తనదనే భావం అతనిలో వుంది.

కేశవపిళ్ళె తప్పుకున్నట్టుగా నవ్వాడు.

"ప్రియురాలిని యింటికి పిలిపించు కునేందుకు తల్లి అనుమతి కోసం పిల్లను పంపారా?" అన్నది కాత్యాయనీ అమ్మ.

కేశవపిళ్ళై చాకచక్యంగా సమాధానం చెప్పాడు: "అలా కోప్పడకు. అలా భద్రకాళిలాగా భూమిని బద్దలు చేస్తూ పిచ్చి గంతులు వేస్తూ ఎందుకు వచ్చావ్? నేను భయ పడ్డాను."

కాత్యాయనీ అమ్మ చలించలేదు: "వీల్లేదు. ఎంత మాత్రం వీల్లేదు. నా గొంతులో తడి వున్నంతవరకు ఇది జరిగేందుకు వీల్లేదు. స్వామీజీ, మాతాజీ అందరూ మంచివాళ్ళే. నన్ను చంపేసి వాళ్ళను పూలతో పూజ చెయ్యండి, మరేమన్నా చెయ్యండి."

"ఏమనుకొని యిలా కోప్పడు తున్నావు?" అడిగాడు కేశవపిళ్ళై.

కాత్యాయనీ అమ్మకు మరేమీ చెప్పేంత ఓపిక లేదు. ఏ క్షణంలోనయినా ఆమె గొల్లు మనవచ్చు. ఒళ్ళు తెలియని పరిస్థితిలో కాత్యాయనీ అమ్మ అన్నది: "దాన్ని ఇక్కడికి తీసుకు రావాలా? నేను దాని కాళ్ళు కడగాలా? ఆ ముసలిది చాలా చోట్ల పూజలు జరుగుతుంటే చూసి వచ్చి నాకు చెప్పింది. గొప్ప గొప్ప వాళ్ళు దాని కాళ్ళు కడుగుతారట. వాళ్ళిద్దరి కాళ్ళూ కడిగి ఆ నీళ్ళు నేను తాగాలా?"

"నన్ను ఇంటి దగ్గర వదిలి పెట్టి రండి" అన్నది కాత్యాయనీ అమ్మ ఒక్కక్షణం శ్వాస బిగబట్టి నిలుచుని.

మరు క్షణం కాత్యాయనీ అమ్మ గొల్లుమన్నది. వెక్కి వెక్కి యేడ్చింది.

"అక్కడా నావాళ్ళెవ్వరూ లేరు. ఇద్దరుంటే ఇద్దరూ పోయినారు."

కాత్యాయనీ అమ్మ దిగజారిపోయి పక్కనున్న సోఫా మీద విరుచుకొనిపడి యేడుస్తూ వుంది.

కేశవపిళ్ళై లేచి ఆ గదిలో అటూ యిటూ తిరుగుతున్నాడు. ఇలా అక్కడ ఒక దృశ్యం తయారయింది. కాత్యాయనీ అమ్మను ఓదార్చాలా అక్కర్లేదా అని కేశవపిళ్ళై బహుశా ఆలోచిస్తున్నాడు. అతని మొహంలో, నిర్ణయించలేని మానసిక నీడలు కనిపిస్తూ వున్నాయి. బహుశా అతని చెవుల్లో కిట్టు మామ చెప్పిన మాటలు - 'ఆ అమ్మాయి అదృష్టవంతురాలు' - మారు మ్రోగుతూ ఉండి వుంటాయి.

అలా కొంత సేపు గడిచింది. అతను కొంచెం గంభీరంగా అన్నాడు: "ఇది అసహ్యంగా లేదూ? ఎందుకలా యేడవటం?"

కాత్యాయనీ అమ్మ ఏమీ మాట్లాడలేదు. ఏడుస్తూవుంది. బహుశా ఆమె తన యేడుపును ఆపుకో లేకుండా వుంది.

కేశవపిళ్ళై కాత్యాయనీ అమ్మ దగ్గర కూర్చుని ఆమెకు అనేక విధాల ధైర్యం చెపుతున్నాడు. బోర్లపడుకున్న ఆమె ముఖం తన వైపు తిప్పుకొని చూశాడు. ఆమె ముఖం కన్నీళ్ళతో నిండి వుంది. "ఇంత యేడ్చేందుకు ఏమయింది?" అని అడిగాడు.

ఆ యిల్లాలు తన మనస్సులో మాటను దాచుకో లేక పోయింది. ఉన్న దున్నట్టు అనేసింది: "ఇంకా ఆ కోరిక పోలేదు కదూ!"

అతను జాలిగా సమాధానం చెప్పాడు: "ఆ విషయమంతా నీకు విడమరచి చెప్పాను గదా? నేనేమీ దాచుకోలేదు. అయినా నీకు నమ్మకం కుదరలేదు మరి? ఏం చేస్తాం?"

"మరి పూజ చేయించట మెందుకు?"

"దాని మీద మమకారం వల్ల చేయిస్తున్నాననా నీవుద్దేశ్యం? అదినాకు మాత్రం ఇష్టమా? అయ్యోరామ!"

కాత్యాయనీ అమ్మకు నిజమైన సందేహం వుంది. "లేకుంటే మరి ? ఈ పూజలు, భజనలు అన్నీ బూటకం. వీటి వెనక బోలెడంత అవినీతి వుంది. అందుకే ఆ స్వామిజీ, ఆయన శిష్యులూ తిరుగుతుంటారు. ఆ ముసలమ్మ నడగండి. ఆమె చాలా భజనలూ, పూజలూ చూచింది. దాన్ని ఇక్కడికి పిలిపించు కోవాలని మీకోరిక అందుకేగా పూజ చేయించాలంటున్నారు?" అన్నదామె.

కేశవపిళ్ళ గట్టిగా అన్నాడు: "కాదు. దానితో నాకేమీ సంబంధం లేదు. నేను దాన్ని మరిచిపోయాను. నామాట నమ్ము."

కాత్యాయనీ అమ్మ భర్త ముఖం వైపు తదేక దృష్టితో చూచింది. ఆమె నమ్మేందుకు సిద్ధంగా వుంది. నమ్మకం కుదుర్చు కునేందుకే రోజూ ప్రయత్నం చేస్తూవుంది. కానీ నమ్మకం కుదరక పోవటానికి ఏదో కారణం వుంది. అది గమనించేందుకే ఆమె భర్త ముఖంవైపు చూపును ప్రసరింప జేసింది. భర్త హృదయంలోని లోతుల్లో దిగి దాన్ని వెతకాలి. భార్య మాత్రమే అలా చూడగలదు.

కేశవపిళ్ళ ఈ మధ్య తన మనస్సును బాధిస్తున్న విషయాలనన్నిటినీ వివరించి భార్యను సమాధానపరుస్తున్నాడు. దీవాన్‌జీ ప్రభుత్వం అంతరించి పోతుంది. కాంగ్రెసు పరిపాలన ఆరంభమవుతుంది. కాంగ్రెసు వాళ్ళకు దీవాన్‌జీ తర్వాత తనే ప్రబల శత్రువు. కాంగ్రెసు వాళ్ళల్లో ఒక్కవ్యక్తితో కూడా తనకు పరిచయం లేదు. ఈ విధంగా కేశవపిళ్ళ తనను బాధిస్తున్న విషయాల నన్నిటినీ ఏకరువు పెట్టాడు. అది ఒకవిధంగా వాగ్వాదంలాంటిది. చివరకు అతనన్నాడు: "నాకు ఏదయినా ఆపదవస్తే 'అయ్యో పాపం!' అనే వాళ్ళు కూడా ఎవ్వరూ లేరనే విషయం నీకు తెలుసా?"

ఇది చాలా ముఖ్యమైన విషయమని గమనించినట్టుకూడా లేదు కాత్యాయనీ అమ్మ. ఇంత సేపటి నుంచి కేశవపిళ్ళ చెపుతున్న సంగతులు కాత్యాయని బుర్రలోకి కాకపోయినా కనీసం చెవుల్లో కయినా ప్రవేశించినట్టు లేదు. ఆమె కేశవపిళ్ళ ముఖంలోకి చూపులు ప్రసరింపజేసి కొయ్యలా

నిలుక్కొని పండుకొని వుంది. "ఇదంతా నీకు అర్థమవుతున్నట్టు లేదు" అన్నాడు కేశవపిళ్ళె.

సంభాషణ సాగించేందుకు కాత్యాయనీ అమ్మ వూంకరించింది. మనస్సులోని భావాన్ని కప్పిపుచ్చేందుకు తన భర్త కథలల్లి చెప్తున్నాడని ఆమె భావం. తన కష్టాలు ఎవరితో చెప్పుకుంటున్నాడో, ఆ వ్యక్తి పెడచెవిని బెట్టి వింటున్నదని అనిపించింది కేశవపిళ్ళెకు. అతను చెప్పిందంతా కంఠశోష అయింది. ఇక అతను చెప్పవలసింది కూడా ఏమీ లేదు. తన కష్టాలు చెప్పుకునేందుకు ఒక మనిషి వుందని అతను నమ్ముకుంటూ వచ్చాడు. తనకు ధైర్యం చెప్పే ఒక వ్యక్తి ఉన్నదని అతను అనుకున్నాడు. కాని యిప్పుడా నమ్మకం కూడా వమ్మయింది. కేశవపిళ్ళె మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"మరి?" అన్నది కాత్యాయని అమ్మ.

"మరేముంది? నీకు నేను చెప్పేది అర్థమేకాదు. అర్థం చేసుకోవాలని కూడా నీకు లేదు. నా మాటలమీద నీకు బొత్తిగా నమ్మకమే లేదు."

కాత్యాయనీ అమ్మ దానికి సమాధానం చెప్పలేదు. "ఇప్పుడు ప్రేమించేవాళ్ళు లేరని ప్రియురాలిని తీసుకొచ్చు కుందామను కున్నారా?" అన్నది.

కేశవపిళ్ళె చిన్న బుచ్చుకున్నాడు. "నీకు ఎలా తోస్తే అలా అనుకో. నేను చెప్పవలసింది యేమీ లేదు." అన్నాడు.

కేశవపిళ్ళె లేచి వెళ్ళ బోతున్నాడు. కాత్యాయని అమ్మ అతన్ని పట్టుకొని ఆపింది. "మనసులో బాధ యేమిటో చెప్పండి" అని అడిగింది.

"ఏమీ లేదు. నాకేమీ బాధలేదు" అన్నాడు కేశవపిళ్ళె బాధతో.

కాత్యాయనీ అమ్మ భర్త చేతిని గట్టిగా పట్టుకుంది. ఆమెకూడా కేశవపిళ్ళెను వదల్లేదు.

"ఉద్యోగం పోతుందనా? పోతే పోనీయండి. దానికింత దిగులు పడవలసిందేముంది? భగవంతుడి దయవల్ల మనకు కావలసినంత ఆస్తి వుంది. ఒక్కగాను ఒక్క కూతురు. మనకా ఆస్తి చాలు."

కొంచెం సేపాగి మళ్ళీ అన్నది: "మాట్లాడరేం? ఈ ఆస్తి చాలదా? ఇంకా కావాలని కోరిక యెందుకు?"

కేశవపిళ్ళెకు సమాధానం తోచలేదు. కాని ఆ ప్రశ్నలు అతని హృదయాన్నీ, మనసునూ గాయపరిచాయి. ఆ యిల్లాలు కచ్చితంగా అడిగిన ప్రశ్నలవి. అందులో కల్లాకపటం లేదు. ఆ తర్వాత ఆమే అన్నది:

"అయినా ఆ దొంగ నక్కలను తీసుకొచ్చి పూజించాలంటే పూజించండి. నేనేం అడ్డు చెప్పను."

తన కర్మకు సమాధానపడినట్టుగా కాత్యాయనీ అమ్మ అన్నది: "దాని కాళ్ళు గూడా కడిగి తాగుతాను. ఆ స్వాముల వారి కాళ్ళు గూడా కడిగి తాగుతాను. కాని-కాని మిగిలిన చోట్లలాగా ఆ స్వామి ప్రసాదం తీసుకునేందుకు ఆయన ఒంటరిగా కూర్చున్న చోటికి నేను ఒంటరిగా వెళ్ళను. నాకు ఆయన అనుగ్రహం, ప్రసాదం అక్కర్లేదు."

ఆ మాటలు సహించలేక కేశవపిళ్ళై అన్నాడు: "ఏమిటి నీవనేది?"

"నేను ఉన్నదున్నట్టు అంటున్నాను. పూజ చేయించాలంటే చేయించండి. నేను మాత్రం అడ్డురాను. అమ్మాయి మీద ఒట్టు పెట్టుకొని నిజం చెప్తున్నాను."

"చాలు చాలు", కేశవపిళ్ళైకు కోపం వచ్చింది.

కాత్యాయని కూడా వదల్లేదు: "నా మీద మీకు కోపం వస్తుందని నాకు తెలుసు."

కేశవపిళ్ళై అక్కడి నుంచి లేచి ఆఫీసుగదిలోకి వెళ్ళాడు.

ఆ దాంపత్య జీవితంలో ఇది తొలి కలహం. కాత్యాయనీ అమ్మ యెప్పుడూ బతి మాలుతూ వుండేది. ఇప్పుడు ఎదురు తిరిగింది. భార్య లాగా ఎదురు తిరిగింది.

కొంచెం సేపాగి ఆమే ఆఫీసు గదిలోకి కూడా దూరింది. అక్కడ కూడా ఇదేమాట చెప్పింది: "పూజ చేయించండి. నేను కాదనను."

"నీవు నన్ను ప్రశాంతంగా ఉండ నియ్యవా?"

దానికి సమాధానం ఇది: "నాకు తెలుసు-నేను మిమ్మల్ని ఎప్పుడూ వేధిస్తూనే వున్నానని."

ఇలా రెండు మూడు రోజుల వరకూ కాత్యాయనీ అమ్మ పేచీ పెడుతూనే వుంది. అది భార్య స్వభావం. అలాంటి స్వభావమే లేకుంటే ఆడది యిల్లాలు కాలేదేమో?

ఈ మధ్యలోనే కేశవపిళ్ళైకు సి.ఐ.డి. ద్వారా చాలా గంభీరమైన విషయాలు తెలిశాయి. కాంగ్రెసులో ఒక శాఖకు సంబంధించిన వాళ్ళు నాయకత్వం లేకుండా, అనుమతి లేకుండా, ఎవ్వరికీ తెలియకుండా ఆయుధాలు పెట్టుకొని వున్నారు. మరో శాఖవాళ్ళు సి.ఐ.డి.కి బోధపడని కొన్ని రహస్య విషయాలను గురించి పరామర్శ చేస్తున్నారు. ఎంత శ్రమపడ్డా సి.ఐ.డి. వాళ్ళకు బోధపడటం లేదు. ఈ భోగట్టా అంతా నమ్మదగిందే.

ఉన్నట్టుండి కేశవపిళ్ళైలో వస్తున్న మార్పులను కాత్యాయనీ అమ్మ కూడా గమనించ గలిగింది. ఆయన దిగులు పడటం లేదు, నిరుత్సాహంగా లేడు. ప్రభుత్వ కార్యంలో ఇంత ఉత్సాహం ఈమధ్య ఆయన ఎప్పుడూ కనబరచ లేదు. ఆయన ఉన్నట్టుండి మేలుకున్నట్టు అనిపించింది - చాలా గౌరవప్రదమైన పని చేసేందుకు.

తరవాత నాలుగయిదు రోజుల్లో దేశంలో చాలామంది కాంగ్రెసు ప్రముఖులను అరెస్టు చేశారు. చాలా మంది నాయకులను బయటికి పంపించారు. ఈ అరెస్టులు ఎందుకు చేశారో ఎవరికీ బోధపడలేదు. ధన్యానందాశ్రమాన్ని గురించి అంతకు ముందు జారీ చేసిన ఉత్తర్వులను గుర్తుకు తెస్తూ మరోసారి కఠోరమయిన ఉత్తర్వులు జారీ చేశారు. అక్కడ పూజలూ, దానాలూ త్వరలోనే ఆగిపోయాయి. ఆ పుత్తర్వులను అతిక్రమించేందుకు ఎవ్వరికీ ధైర్యం చాలలేదు.

ఒకరోజు ఆఫీసు నుంచి వచ్చి విశ్రాంతి తీసుకునే సమయంలో కేశవపిళ్ళై భార్యను పిలిచాడు: "చూడు, నీవు చెప్పినట్టు నేను చేస్తున్నాను."

కాత్యాయనీ అమ్మకు అర్థం కాలేదు. ఇటీవల కొన్ని రోజుల్లో జరిగిన సంఘటనలను గురించి కేశవపిళ్ళై వివరించాడు: "నాలుగు వందల మంది ప్రతిపక్షాలవారిని అరెస్టు చేశాం. కొంతమంది కనబడకుండా పారి పోయినారు. వాళ్ళను పట్టుకొని తెచ్చేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. రెండు రోజుల నుంచీ ధన్యానందస్వామి పూజలు ఆగిపోయాయి. ఇప్పట్లో యిక ఆరంభంకావు."

"ఇదంతా చెయ్యమని నేను చెప్పానా?" అని అడిగింది కాత్యాయనీ అమ్మ.

"లేదు, నీవు చెప్పలేదు. కానీ, పుద్యోగం పోతే పోనీయండి, మనకు కావలసినంత ఆస్తి వుందని చెప్పావు గదా?"

"అవునూ" అని కాత్యాయనీ అమ్మ ఒప్పుకుంది. ఆ మాట ఆమే చెప్పిన మాట నిజం. "బహుశా అలాగే జరుగుతుందని నేను దానికి తయారవుతున్నాను" అన్నాడు కేశవపిళ్ళై.

"దానికేం, పుద్యోగం పోతేపోనీయండి. ఏమీ నష్టంలేదు." అన్నది కాత్యాయనీ అమ్మ నిర్లిప్తంగా.

"కాని యింత మందిని పట్టుకొని జైళ్ళల్లో ఎందుకు పెడుతున్నారు?" అని అడిగిందామె

"అది నా డ్యూటీ".

"ఉద్యోగం పోతుందను కుంటూ, వెళ్ళేప్పుడు ఇలా చెయ్యట మెందుకు?"

"కాంగ్రెసు వాళ్ళతో విరోధం హెచ్చింది. వాళ్ళు అధికారంలోకి వస్తే నన్ను గెంటేస్తారు."

ముక్కుకు సూటిగా వెళ్ళే ఆ యిల్లాలు అడిగింది: "పగ తీర్చుకునేందుకేనా వీళ్ళందరినీ జైల్లో పెట్టటం?"

"అంతే అనుకో" అన్నాడు కేశవపిళ్ళై, యిక అంత కంటె వివరంగా చెప్పటం కష్టమనుకొని.

"అయ్యో అలా చెయ్య కూడదు. వెళ్ళే ముందు అనవసరంగా వైరం పెంచుకోవట మేందుకు?"

"ఎలుకను పట్టుకునేందుకు ఇంటికి నిప్పంటించటం" అనే భావంతో కేశవపిళ్ళె చెప్పలేదు. వెళ్ళేప్పుడు మంచిగా వెళ్ళటం శ్రేయస్కరమనే విషయంతో అతను ఏకీభవించాడు. జీవిత పథంలో అతని దృష్టి ఇంత వరకే ప్రసరించింది. మాతేవన్ పిళ్ళె లాంటి శ్రేయోభిలాషులు ఇంతవరకే సూచించారు. ఈ మజిలీలో మరికొంత కాలం హాయిగా గడపటం మంచిది. కాని ఈమజిలీ వరకు చేరుకుంటానని కాని, చేరుకోవాలని కాని ఆలోచించి జీవిత యాత్ర ఆరంభించలేదు. చేరుకున్నాడు, అంతే. ఇక్కడే హాయిగా కాలక్షేపం చేద్దామనే ఆలోచనను అతను మానేశాడు. చివరకు కాంగ్రెసు ప్రభుత్వం వస్తే తను వెళ్ళి పోతాడు. వెళ్ళకుండా వుండాలనే ఆలోచనను అతను వదిలేశాడు.

కాంగ్రెసును ప్రతిఘటించటం వల్లనే అతను పార్కువ్యూలో ప్రవేశించ గలిగాడు. జీవిత పర్యంతం వాళ్ళకు శత్రువుగానే వున్నాడు. వాళ్ళ మాటలమీద అతనికి నమ్మకం కుదర లేదు. అది న్యాయమా కాదా అని ఆలోచించేందుకు అతను ప్రయత్నించను కూడా లేదు. కాంగ్రెసును నాశనం చేసేందుకే అతను ప్రయత్నిస్తూ వచ్చాడు. ఇక ముందు కూడా వాళ్ళ కాళ్ళు పట్టుకోవటం మంచిది కాదు. అలా జరిగితే ఇంకా ఎంతమంది కాళ్ళు కడిగి కళ్ళకద్దుకోవలసి వస్తుందో? అది వాంఛనీయం కాదు. కాత్యాయనీ అమ్మ చెప్పిన మాటలను అతను ఏ మాత్రం ఆక్షేపణ లేకుండా అంగీకరించాడు.

"ఉద్యోగం పోతే పోనీయండి. దానికింత దిగులు పడవలసిన పనేముంది? భగవంతుని దయవల్ల మనకు కావలసినంత ఆస్తి వుంది. అది చాలు" అన్నది కదా కాత్యాయని.

నిజమే. ఉద్యోగం పోతుందనే భయం తనకి అక్కర్లేదు. ఈ విధంగా కేశవపిళ్ళెలో నూతనోత్సాహం, నూతన శక్తి వచ్చాయి.

కేశవపిళ్ళె భావిజీవితాన్ని గురించి భార్యను అడిగాడు: "ఇక్కడినుంచి మనం వెళ్ళి పోతే ఎక్కడుండటం నీ కిష్టం?"

అది నిశ్చయించ వలసిన విషయమే. మువాట్టుపుళలో వుండాలా? నాచిన్నాటులో వుండాలా? లేకుంటే స్వగ్రామంలో వుంటే సరిపోతుందా? మిగిలిన స్థలాలతో అతనికి పరిచయం లేదు. "అక్కడ వుండటం ఇష్టం లేదా?" అని అడిగాడు.

నిజానికి కేశవపిళ్ళెకు అక్కడ వుండటం అంత యిష్టం లేదు. దానికి కారణం కూడా వుంది. అతను నవ్వుతూ అన్నాడు: "మీ నాణీకుట్టి, కుంజీకుట్టి అందరూ అక్కడే వున్నారు. ఊళ్ళోవాళ్ళందరికీ నీ వంటే యిష్టం. కాని నాకెవరున్నారు?"

"అవును" అని అభిమానంతో అన్నది కాత్యాయనీ అమ్మ.

"అది నా జన్మభూమి కదా! ఇంతమంది తెలిసిన వాళ్ళు మరోచోట దొరకరు." అన్నది.

"నిజమే, కాని నా సంగతి యేమిటి?" అన్నాడు కేశవపిళ్ళై.

కాత్యాయని అమ్మకు ఆ విషయంలో పట్టుదల యేమీ లేదు.

"ఎక్కడైనా సరే, ఈ తిరువనంతపురంలో తప్ప మరెక్కడయినా నాకు స్నేహితులు, అయిన వాళ్ళు దొరుకుతారు."

మువాట్టుపుళలో ఒక పెద్ద యిల్లు కట్టించేందుకు ఏర్పాట్లు అయినాయి. కొట్టయం పేష్కారుకూ, మువాట్టుపుళ తహసీల్దారుకూ, కొట్టయం శాఖ ఇంజనీరుకూ ఈ బాధ్యత అప్ప చెప్పారు. వారాని కొకసారి కాత్యాయని మువాట్టుపుళ వెళ్ళి యింటి పని చూస్తూ వుంది. ఉద్యోగం నుంచి విరమించుకునే లోపల మరోపని కూడా పూర్తి చెయ్యాలని కేశవపిళ్ళై ఆలోచన. దాన్ని గురించి అతను ఆలోచిస్తున్నాడు. ఒక రోజు అతను తన భార్యతో ఆ విషయం ప్రస్తావించాడు- చీఫ్ సెక్రటరీగా వుండగానే విజయమ్మకు వివాహం చెయ్యాలి అని. కాత్యాయనీ అమ్మకు అది చాలా ఆనందకరమైన విషయం.

"పదిహేడేండ్ల వయస్సులో నాకు పెళ్ళి అయింది. ఇప్పుడు అమ్మాయి వయుస్సు పదహారేండ్లు. అదే నేనూ ఆలోచిస్తున్నాను. కాని చదువుకుంటున్నది గదా అని ఆవిషయం గురించి మీతో అన లేదు."

"కాని పిల్లవాడెక్కడ?" అని అడిగిందామె.

"వెతకాలి".

తుపాకీ గుండులాగా ఒక ప్రశ్న కేశవపిళ్ళై చెవుల్లోకి దూసుకుపోయింది."ఎవరన్నా వుద్యోగస్థుణ్ణి వెతుకుతున్నారా?"

"అవును, ఏం? ఉద్యోగస్థుడు బాగుండడా?" అన్నాడు కేశవపిళ్ళై. ఆమె దానికి సమాధానం చెప్పకుండా మరోప్రశ్న అడిగింది: "తిరువనంతపురంలోనా?"

"తిరువనంతపుర మయితే ఏమయింది? పిల్లవాడు మంచి వాడయితే చాలదూ?"

కాత్యాయనీ అమ్మ కచ్చితంగా చెప్పింది: "ఒద్దు, ఒద్దు. ఉద్యోగస్థుడూ అక్కర్లేదు. తిరువనంతపురం వాడూ అక్కర్లేదు. నా కూతురుకి నాలాంటి అనుభవం ఒద్దు."

"ఏమయింది నీకు అనుభవం?"

కాత్యాయనీ అమ్మ ముఖంలో రంగులు మారాయి. "అదంతా నాకు జ్ఞాపకం చెయ్యొద్దు. అవన్నీ నాచేత చెప్పించవద్దు."

కేశవపిళ్ళై తమాషాగా మాట దాటించాడు: "లేదులే లేదు. నీచేత అవన్నీ చెప్పించను. నాకు తెలుసు, పోనీలే. అల్లుడు ఎలాంటి వాడు కావాలో నీ అభిప్రాయం చెప్పు."

కాత్యాయనీ అమ్మ కొంచెం సేపు ఏమీ మాట్లాడలేదు. బహుశా ఆమె ఆ విషయాన్ని గురించే ఆలోచిస్తూ ఉండి వుంటుంది. కేశవపిళ్ళై అడిగాడు: "నీవు దాన్ని గురించి ఏమయినా ఆలోచించావా?"

మనోహరమైన మందహాసంతో కాత్యాయనీ అమ్మ అన్నది: "దాన్ని గురించి నేను ఎందుకు ఆలోచించను? కాన్పు కాగానే ఆడపిల్ల పుట్టిందని దాది చెప్పగానే తల్లికి అల్లుడు ఎలా వుండాలా అనే ఆలోచన వస్తుంది. కూతురు ఆడటం పాడటం మొదలు పెట్టగానే ఆ అబ్బాయి పలకా బలపంతో ఎక్కడ చదువుకుంటున్నాడో అవి తల్లి అనుకుంటుంది. తల్లులందరూ అలాగే అనుకుంటారు. మరి నేను మాత్రం ఎందుకనుకోను?"

విప్పారిన మెరిసే కళ్ళతో కలలు కంటూ దూర దృష్టితో చూస్తున్నట్లు కాత్యాయనీ అమ్మ అన్నది: "అతను నా కళ్ళ యెదుట కనిపిస్తూ వుంటాడు."

"నాకు కనిపించడే? ఎందుకని? ఎక్కడున్నాడతను?" అన్నాడు కేశవపిళ్ళై. నవ్వుతూ.

అవును, మీకు కనిపించడు. "కారణాలు చాలా వున్నాయ్. చెప్పమంటే చెప్తాను. కోపం రాకుండా వుంటే."

"లేదు, చెప్పు" అన్నాడు కేశవపిళ్ళై ఆమోదిస్తూ.

కాత్యాయనీ అమ్మ లెక్కపెడుతూ చెప్పింది: "భార్య మీద నిజమైన ప్రేను వుండాలి. ప్రేమ వుంటే పిల్లలు పుట్టాలని వుంటుంది. అది ఒక ఆశ. ఆశ ఫలించి పిల్లలు పుడితే, అందులో ఆడపిల్ల పుడితే, ఆ ఆడపిల్లకు భర్త ఎలా వుండాలో మనస్సుకు పొడగడుతుంది. అలాంటి తండ్రికే అల్లుడు కనిపిస్తాడు సరేనా."

చెప్పదలుచుకుంది చక్కగా చెప్పాననే గర్వంతో కాత్యాయనీ అమ్మ ముక్కు విరుచుకుంది.

"మరిమన జీవితంలో అలా జరిగిందా? జ్ఞాపకం తెచ్చుకోండి. సంవత్సరానికి ఒక్కసారి వచ్చేవారు. గదిలో మూల పండుకొని ఉండేది ఒక ఆడది. పరధ్యానంతో వచ్చినా పండుకొన్న ఆడది కనిపించేది కదా - నే నన్నానని కాదు. జ్ఞాపకం చేసుకోండి."

తప్పు చేసిన కేశవపిళ్ళై మొహమాటం లేకుండా ఒప్పుకున్నాడు: "నీ వేమయినా చెప్పు నేను వింటాను. నేను నీకు దాసోహమయిపోయినాను గదా?"

కాత్యాయనీ అమ్మ చెప్పుకుంటూ పోయింది: "అలా అనకండి. అలా అనటం తప్పు. నామాట నిజమేనా అని ఆలోచించండి. కొంతమంది మగవాళ్ళకు రహస్యంగా పిల్లలు పుడతారు. వాళ్ళేమన్నా ఆపిల్లల్ని గుర్తు పెట్టుకుంటారా?

కాత్యాయనీ అమ్మకు ఇంకా ఏమేమో చెప్పాలని వుంది. మాట మార్చేందుకు కేశవపిళ్ళె అన్నాడు:

"అది సరేగాని, నీ వుద్దేశ్యంలో అల్లుడు ఎలా వుండాలి? అతను వుద్యోగస్థుడయివుండ గూడదు, తిరువనంతపురం వాడయి వుండగూడదు, మరి యెలా వుండాలి."

"అతనెవరయినా సరే, ఫరవాలేదు. తల్లి అనుభవం కూతురికి రాకూడదు."

ఒక్కక్షణం ఆగి మళ్ళీ అన్నది : "నాకు తెలుసు ఆ తల్లికి ఏం తక్కువయిందని మీరడుగుతారని – 'డబ్బు లేదా? పొలం లేదా? నీ తోటివాళ్ళల్లో ఎవరికి ఇంత ఐశ్వర్యం అబ్బింది' అని మీరంటారు అది కాదు ప్రధానం. మన అమ్మాయిని ప్రేమతో చూసుకొనే వాడు కావాలి. ఎవరయినా సరే. ఏం ఫరవాలేదు."

"మరి రైతు కావాలా?" అన్నాడు కేశవపిళ్ళె.

"అయితే తప్పేముంది? ఉద్యోగస్థుడి కంటె నయమే. ఉద్యోగస్థుడిలో మంచితనం, నిజాయితీ ఏమీ లేదు. అతను అబద్ధాలు చెప్పి అపకీర్తిపాలు కావచ్చు. రైతు అలాకాడు."

"చదువు సంధ్యల్లేని పిల్లవాడా?" అన్నాడు కేశవపిళ్ళె.

"ఇప్పుడలాంటి వాళ్ళు లేరు."

"ప్రేమతో చూసుకుంటాడా లేదా అని పరీక్షించి, నమ్మకం ఏర్పడ్డ తర్వాత పిల్లవాడిని తీసుకరావటం ఎలా జరుగుతుంది? అలాంటి రైతును నేనెక్కడ పట్టుకొస్తాను? ఉద్యోగస్థుణ్ణి ఎవరినయినా అయితే సులభంగా తీసకురాగలను. అదే నావల్ల అయ్యే పని." అన్నాడు కేశవపిళ్ళె విసుగుతో.

మనస్ఫూర్తిగా నవ్వుతూ కాత్యాయనీ అమ్మ అన్నది: "అదంతా అలా ఉండ నియ్యండి. అతన్ని తీసుకురండి. నేను చూసి చెప్తాను."

ఒకవేళ కేశవపిళ్ళెను ఉద్యోగంలో నుంచి తీసేసినా నిశ్చింతగా ఊరికి వెళ్ళి పోయేందుకు అతను తన మనస్సును సిద్ధపరుచుకుంటున్నాడు. ఉద్యోగి జీవితం నుంచి విడుదల లభిస్తే ఏమాత్రం దిగులు లేకుండా అతను పార్కువ్యూ వదిలిపెట్టి వెళ్ళి పోతాడు. పార్కువ్యూ లాంటి యింట్లో అతనుండగానే. పిల్లకు పెండ్లి చేసేస్తే అతని జీవితంలో పెద్ద బాధ్యత తీరిపోతుంది.

కేశవపిళ్ళె తన వృత్తి జీవితంలో ఇలాంటి నిర్ణయం, కావాలని చేసుకున్నాడు. ఇప్పుడున్న అనుకూల పరిస్థితి అతనికి కావలసిన శక్తి సామర్థ్యాలను చేకూర్చింది. కాంగ్రెసును ప్రతిఘటించి అతను ఉద్యోగ రంగంలో ప్రవేశించాడు. అలాగే కాంగ్రెసు విరోధిగానే తన ఉద్యోగ జీవితాన్ని ముగించాలని అతను నిర్ణయించుకున్నాడు. ఇకముందు కాంగ్రెసు వాళ్ళ ముందు నవ్వును నటిస్తూ తలగోక్కుంటూ చాకిరీ చెయ్యవలసిన పని లేదు. అలా చేస్తే తప్పేమిటని ఒకసారి అనిపించింది. కానీ ఆ ఆలోచన గతంలోనే కరిగిపోయింది.

మళ్ళీ కాంగ్రెసు వాళ్ళు జైలుకు వెళ్ళటం ఆరంభమయింది. ఒకరిద్దరు జైల్లోనే మరణించారు. కాంగ్రెసు వాళ్ళు గొడవ చేశారు. కేశవపిళ్ళె దానికి చలించలేదు. ప్రబల శత్రువుగా రూపొందాలనే, అతని సంకల్పం. అన్ని విషయాల్లోనూ అతను ముందంజవేసి పని చేశాడు. అతను చేసిన ప్రతిపనినీ దీవాన్‌జీ మెచ్చుకున్నారు. ఉద్యోగజీవితంలో చివరి రోజులు రహస్యంగా గానీ, బహిరంగంగా కానీ సింహంలాగా ఠీవిగా ప్రవర్తించాడు. కుక్కలాగా నక్కినక్కి నడవలేదు. ఇకముందు కాంగ్రెసు ప్రభుత్వం వస్తే, ఒక సింహం అక్కడి నుంచి వెళ్ళిపోవాలి.

ఇంతలో ఒక సంఘటన జరిగింది. దీవాన్‌జీ మీద ఎవరో దాడి చేశారు. అతని కంఠం వైపు గురిపెట్టి యెవరో దెబ్బకొట్టారు. కాని మొహం మీద తగిలింది. ఒక బహిరంగ సభలో ఇది జరిగింది. దాడిచేసిన వాడు పట్టుబడలేదు. మర్నాడు దేశంలో చాలామందిని అరెస్టు చేశారు. సి.ఐ.డి.కి కూడా అంతు పట్టని రహస్య సమావేశాల ఫలితం యీ సంఘటన.

దీవాన్‌జీ తిరువితాంకూరు వదిలి పెట్టి వెళ్ళి పోయినాడు. ఇది మాత్రం కేశవపిళ్ళె జీవితంలో ముఖ్యమైన ఘటన. తను దిక్కులేని వాడయినట్టు అతనికి తోచింది. ఆంగ్లేయులు భారతదేశాన్ని వదిలిపెట్టే రోజు సమీపిస్తూవుంది. ప్రస్తుతం రాజభవనంలో తాత్కాలికంగా ఎవరినో దీవాన్‌జీగా నియమించటం జరిగింది. కనీసం ఈ కొద్దికాలం కేశవపిళ్ళె ఛీఫ్ సెక్రటరీగా చలామణీ కావచ్చు. ఆ తర్వాత?

## ఇరవైయొనిమిది

తిరువితాంకూరు ఇండియన్ యూనియన్‌లో కలిసి పోయింది. స్వతంత్ర తిరువితాంకూరు అనే ఆందోళన పూర్తిగా సద్దుమణిగిపోయింది. ఆగస్టు 14 వ తేదీ అర్ధరాత్రి వేళ సచివాలయం మీద యూనియన్ జాక్ జెండాను దించి భారత జాతీయ జెండాను ఎగుర వేస్తారు. దేశమంతటా యీ పుణ్య దినం ఎలా జరిపించాలి అనే విషయం చర్చించేందుకు ప్రముఖ కాంగ్రెసు నాయకులు, ఛీఫ్ సెక్రటరీ, తాత్కాలికంగా నియమింపబడిన దీవాన్‌జీ,

ప్రముఖ శాఖాధికారులు, ప్రజా ప్రతినిధులు - అందరూ సమావేశమయినారు. ఈ సమావేశాన్ని ఏర్పాటు చేయవలసిన బాధ్యత కేశవపిళ్ళె మీద వుంది. ఆ సమావేశంలో - అన్ని ప్రాంతాల్లో ఈ వుత్సవం జరిపించే బాధ్యత కేశవపిళ్ళెకు అప్పగించారు.

ఆరోజు కేశవపిళ్ళె చాలా సంతోష పడుతూ పార్కువ్యూ చేరాడు. ఆమె పరుగెత్తు కుంటూ వచ్చింది. భర్త ఇంత సంతోషంగా వుండగా ఆమె యెప్పుడూ చూడలేదు. అసలు విషయం తెలుసుకోకుండానే కాత్యాయని ముఖం ఆనందంతో కళకళలాడింది. ఏదో శుభవార్త వుంటుందని ఆమెకు అనిపించింది. అదేమిటో అర్ధం కాలేదు.

"ఈ రోజు నేను కాంగ్రెసు ప్రముఖులనందరినీ కలుసుకున్నాను", అన్నాడు కేశవపిళ్ళె.

"అయితే" కాత్యాయని కుతూహలంతో అడిగింది.

"అయితే ఏముంది? ఏమీ లేదు." అన్నాడు.

"వాళ్ళేమన్నా అన్నారా?"

"ఎవరూ ఏమీ అనలేదు. నేను గెలిచినట్టే, అవును. నేను గెలిచినట్టే."

పాంటు, కోటు, టై లిప్పుకునే సమయంలో కాత్యాయనీ అమ్మ సాయం చేస్తుంటే అతను ఆమె బుగ్గమీద ప్రణయ ముద్రను వేశాడు. బహుశా కిట్టుమామ మాటలు అతని చెవిలో మారుమోగుతూ ఉండి వుంటాయి - "అమ్మాయి అదృష్టవంతురాలు."

కాఫీ తాగుతూ అన్నాడు : "అబ్బ! ఈ రోజు జరిగిన సమావేశం సంగతి నీకు చెప్పి తీరాలి. నీకర్థం కాదు కదూ?"

కాత్యాయనీ అమ్మ ఒప్పుకోలేదు.

"కొంచెం చెప్పి చూడండి. అర్థమయిందే లేదో తెలుస్తుంది. ఇలా నన్ను మరీ తెలివి తక్కువ దాన్ని చెయ్యకండి."

అప్పుడు మృదుమధురంగా కేశవపిళ్ళె అన్నాడు:

"అమ్మో! నీవు తెలివి తక్కువ దానివా? అలా అనకు అందరినీ అదరగొడుతూ, ఇంతవరకూ ఎవరికీ చిక్కని ఈ ఛీఫ్ సెక్రటరీని చిటికేన వేలి కింద అదిమిపట్టి వుంచుకున్న నీవు, తెలివి తక్కువ దానివా?"

కేశవపిళ్ళె యింకా ఏమేమో చెప్పేవాడు. కాని కాత్యాయనీ అమ్మ అడ్డు తగిలింది: "చాలు, చాలు, అలా అంటే నేను కూడా చాలా అనగలను. ఒక్కమాట వినండి. నాకు మీ యుక్తులన్నీ తెలిశాయి."

ఈ సంభాషణ ఇలాగే సాగితే తప్పుదారి పట్టవచ్చని అనిపించింది కేశవపిళ్ళెకు. కేశవపిళ్ళె ఆనాటి ఉల్లాస వృత్తాంతం చెప్పసాగాడు. అది విజయగాథ.

"ఆగస్టు పదిహేను ఉత్సవాలు జరిపించేందుకుగాను ఆఫీసరు దీవాన్‌జీ ఒక ఉత్తర్వు జారీ చేశారు. ఆ కార్యక్రమమంతా చూసి ఛీఫ్ సెక్రటరీ కంగారు పడ్డాడు. మొట్టమొదటగా కాంగ్రెసు వారిని ఆహ్వానించే సభకదా కాంగ్రెసు సభ్యులందరూ హాజరయితీరాలి. ఈ విధంగా చాలా స్వల్ప వ్యవధిలో ఏర్పాటు అయిన సమావేశమది." ఇంతలో కాత్యాయనీ అమ్మ అడిగింది:

"అంటే యికముందు ప్రభుత్వానికీ, కాంగ్రెసుకూ మధ్య తగాదా యేమీ వుండదన్న మాట!"

కేశవపిళ్ళై ఆ కథంతా చెప్పబోతున్నాడు. ఈ ప్రశ్న వినే సరికి కథ చెప్పాలనే వుత్సాహం తగ్గిపోయింది. అంత తేటతెల్లంగా చెప్పవలసిన అవసరం లేదనుకున్నాడు. కాత్యాయనీ అమ్మకు అర్థమయినా ఆమె మాటల్లో వుండే గౌరవ లాఘవాలను గమనించలేదు. అందుకని కథ క్లుప్తంగా చెప్పటమే మంచిది. కేవలం సారాంశం చెపితే చాలు. అయినా జీవితంలో ఒక గొప్ప బెడద సులువుగా తప్పి పోయింది. అందుకని చెప్పకుండా వుండేందుకు కూడా వీల్లేదు. ఆ కనిపించిన భూతం నిజంగా భూతం కాదు, గాలిలో కదులుతున్న ఆకు నీడ మాత్రమే. అతను కథ కుదించి చెప్పాడు: "మనం అనవసరంగా భయపడ్డాం. పూర్తిగా అనవసరమే."

"ఎందువల్ల?"

"కాంగ్రెసు పార్టీ అంత పెద్ద విషయం కాదు."

అన్నాడు కేశవపిళ్ళై.

కాత్యాయనీ అమ్మకు ఏమీ తెలియక పోయినా శ్రద్ధగా వింటూ వుంది.

"నీకేమీ అర్థం కాలేదు. అయినా భయపడవలసిన పని లేదులే."

"వాళ్ళ ప్రభుత్వం వస్తే మనకు ప్రమాద మేమీ లేదా?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

"ఏమీ లేదు. నేను వీళ్ళను దగ్గరగా జాగ్రత్తగా గమనించ లేదు. వాళ్ళతో మాట్లాడ లేదు కూడా. చూసేందుకు భయంకరంగా వుండే వాళ్ళు. ఇవాళ నేను చాలా భయంతో నిలబడి వున్నాను. వాళ్ళకు స్వాగతం ఎలా చెప్పాలి, ఎలా తృప్తి పరచాలి - అని ఆలోచిస్తూ నిలబడ్డాను. నేను చాలా కంగారు పడ్డాను. పరిపాలన మారగానే వాళ్ళే మంత్రులై వస్తారు. అదీ కాక నేను వాళ్ళకు గర్భశత్రువును. వాళ్ళు ముందే వచ్చేశారు. నా కళ్ళకు చీకట్లు కమ్మాయి. నేను చేతులెత్తి నమస్కారం చేశాను. దీవాన్‌జీ వచ్చినట్టు కంగారు పడ్డాను. కాని అంత భయపడవలసిన పని లేదని తర్వాత తెలిసింది. వాళ్ళ వాగ్వైఖరి, భావ భంగిమ అంతా సామాన్యంగా ఉంది. వాళ్ళల్లో చాలామంది నా దగ్గర కూర్చోలేదు. వాళ్ళు కూర్చున్న చోటికి నేను వెళ్ళగానే ఉలిక్కిపడి లేచేవాళ్ళు - సూపరింటెండెంటు, అసిస్టెంటు సెక్రటరీ లాగా.

సెక్రటరీలకున్నంత ధైర్యం కూడా లేదు. పాపం! ఉపన్యాసం ఇచ్చేందుకు లేవగానే చప్పట్లు విని వణికి పోయారు."

"ఆ తర్వాత ఏమయింది?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

"ఏమవుతుంది? ఏమీ అవలేదు. వాళ్ళల్లో ఒకరిద్దరు తప్ప మిగిలిన వాళ్ళందరూ నా చుట్టూ నిలబడ్డారు. నన్ను కలుసుకునేందుకు అందరూ ఇక్కడికే వస్తారని చెప్పారు. ఈ రోజు అందరితో నాకు పరిచయం మయింది. ఇది పరిచయం చేసుకునేందుకు అవకాశంగా భావించినట్టున్నారు వాళ్ళు."

కాత్యాయనికి కథ పూర్తిగా వినాలని వుంది. వినే అవకాశం కూడా కనిపిస్తూ వుంది. ఆమె అడిగింది.

"అలా రాని యిద్దరు వ్యక్తు లెవరు?"

"వాళ్ళు కాంగ్రెసు అధ్యక్షుడూ, ఉపాధ్యక్షుడూ."

"అంటే కాంగ్రెసు పార్టీ అంతా యింతేనా?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

కేశవపిళ్ళైకు కూడా అదే అనుమానం వేసింది. "నాకూ అదే అనుమానంగా వుంది. ఇవాళ వచ్చిన వ్యక్తులను చూస్తే అలాగే అనిపించింది. పెద్దపెద్ద నాయకుల్లో కొంతమందికే శక్తి సామర్థ్యాలున్నాయి."

కాత్యాయనీ అమ్మ స్పష్టంగా అడిగింది: "అయితే మరి దేశమంతటా అంతమందీ, వీళ్ళ మాట విని అలా చిందులు తొక్కటమేమిటి?"

కేశవపిళ్ళైకు కూడా అదే ఆశ్చర్యంగా వుంది. తరతరాలుగా వస్తున్న దేశభక్తి, ఉద్యోగస్థుల పట్ల గౌరవం, నియమపాలన - అన్నీ మరిచిపోయి ప్రజలందరూ వీళ్ళ వెంబడి పడి యెలా వెళ్ళారా అనేది కేశవపిళ్ళైకు కూడా ఆశ్చర్యంగానే వుంది. అతను ఒక్క వుపన్యాసం మాత్రమే విన్నాడు. ఇంగ్లీషువాళ్ళు వెళ్ళి పోవాలని అందరికీ వుంది. తిరువితాంకూరు ప్రజలు కూడా అదే కోరుతున్నారు. ఈ కోరికను పురస్కరించుకొని నాయకులు జయించారు. "దీవాన్‌జీ మొదటే ఈ విషయం కొంచెం పట్టించు కున్నట్టయితే, ఇక్కడ ఇంత రాద్ధాంతం జరిగేది కాదు." అన్నాడు కేశవపిళ్ళై.

"ఆయన చాలా తెలివిగలాయన. దూరదృష్టికల వాడు - అని చెప్పేవారు గదా?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

"అవును. అందులో సందేహం లేదు. కాని ఆయనకు మాత్రం పొరపాట్లు రావా? అదే జరిగింది. ఈ నాయకుల్లో చాలామంది ఉద్యోగాల కోసం దరఖాస్తులు పెట్టారు. అప్పుడు వాళ్ళకు ఉద్యోగాలు ఇచ్చివుంటే ఇదంతా జరిగేది కాదు." అన్నాడు కేశవపిళ్ళై ధైర్యంగా.

కాత్యాయనీ అమ్మకున్న సామాన్యమైన బుద్ధికి ఒక సమాధానం తట్టింది. అది ఒక ప్రశ్న రూపంలో బయటికి వచ్చింది: "అలా అయితే మిగిలిన

వాళ్ళు చాలామంది కాంగ్రెసు వాళ్లయ్యే వాళ్ళేమో? అందరికి వుద్యోగం ఇయ్యటం సాధ్యమవుతుందా మరి?"

కేశవపిళ్ళె దానికి సమాధానం చెప్పలేక పోయాడు. "ఏది ఎలావున్నా బెడద వదిలింది గదా?" అన్నది కాత్యాయనీ అమ్మ.

"అవును. బెడదవదిలింది. భయం పోయింది. కానీ ముందు చాలా పని చెయ్యవలసివుంది. పరవూరు నుండి కన్యాకుమారి దాకా తిరగాలి. ఉత్సవ కార్యక్రమాలు ఏర్పాటు చెయ్యాలి. చేసేందుకు చేతి నిండా పని దొరికింది."

కాత్యాయనీ అమ్మ నవ్వుతూ అన్నది: "ఇదివరకు కాంగ్రెసు వద్దని పరుగెత్తారు. ఇప్పుడు కాంగ్రెస్ కోసం పరుగులు తీస్తున్నారు. ఎవరన్నా అడిగితే యేం చెప్తారు?"

"ఇప్పుడు స్వాతంత్ర్య దినం జరిపించాలి అని చెప్తాను." అన్నాడు కేశవపిళ్ళె.

"అవునవును సిగ్గులేదు. స్వాతంత్ర్యం వద్దని అప్పుడు కాంగ్రెసును ఎదిరించలా?"

చిరుకోపంతో కేశవపిళ్ళె అన్నాడు : "పోవే, ఇవన్నీ నీకేం తెలుస్తాయి?"

"అవునవును, సిగ్గులేకపోతే సరి. నేనయితే ఈ వుద్యోగం వదిలేసేదాన్ని. ప్రజలకు ఏం జవాబు చెప్తారు. ఇది వరకు ఒకమాట చెప్పారు, అలా చేశారు. ఇప్పుడు మాట మారుస్తున్నారు."

"మొదట చెప్పిందానికి, చేసిందానికి ఇప్పుడు చెప్తున్నదానికి, చేస్తున్న దానికి ఏమీ భేదం లేదు." అని స్పష్టీకరించేందుకు కేశవపిళ్ళె ప్రయత్నించాడు. అందువల్ల ప్రయోజనం లేదని అతనికి తెలుసు. అనవసరమైన కంఠశోష. చివరకు అతనడిగాడు:

"మరి యీ వుద్యోగం మానెయ్య మంటావా?"

కాత్యాయనీ అమ్మకు సమాధానం చెప్పేందుకు ఎంత సేపో పట్టలేదు: "నాకు సంబంధించినంత వరకూ ఈ రెండిటికీ ఏమీ భేదం లేదు. ఉద్యోగం మానేసినా ఫరవా లేదు. గొడవలు లేకుండా వుంటే చాలు."

"గొడవలు ఏమీ లేవు. నీవేమీ కంగారు పడవద్దు. నేను మరో నాటకం ఆడబోతున్నాను, చూడు." అన్నాడు కేశవపిళ్ళె.

"అదేమిటి?" అన్నట్టుగా కాత్యాయని భర్తవైపు చూచింది.

"నేను ఖద్దరు ధోవతి కట్టుకుని, చొక్కా వేసుకుని గాంధీ టోపీ పెట్టుకొని తిరుగుతాను. వచ్చేప్పుడు ఖద్దరు బట్ట కొని చొక్కా కుట్టేందుకు ఇచ్చి వచ్చాను."

జంకు లేకుండా కాత్యాయనీ అమ్మ అన్నది: "తరవాత ఒక జెండా పట్టుకొని 'కేశవపిళ్ళెకు ఉరిశిక్ష వేయించండి' అని కేకలు పెడతారా? సిగ్గు విడిస్తే ఏ పనయినా చెయ్యొచ్చు."

"ఇందులో సిగ్గు పడేందుకేముందే?" అని నవ్వాడు కేశవపిళ్ళై.

"ఏముంది. ఏమీ లేదు."

"చూస్తూ వుండు నేనేం చేస్తానో?"

కేశవపిళ్ళైలో ఎన్నడూలేని ఉత్సాహం వచ్చింది. సామర్థ్యం జాగృతమయింది. రాజమార్గం మళ్ళీ ఎదురయింది. వంకరటింకరలు లేకుండా తిన్నగా నడిచే మార్గం స్పష్టంగా కనిపిస్తూ వుంది. సూటిగా వెళితేచాలు. ఒకటే మార్గం. ఎగుడు దిగుళ్ళు లేవు. మధ్య అంతరాయం లేదు. సమతలమైన మార్గం. కాని ముందు చేరవలసిన గమ్యం ఏమిటి? ఏదో ఒక స్థలం కనిపిస్తూ వుంది. దాని పేరేమిటో తెలియదు. చీఫ్ సెక్రటరీ వరకే స్పష్టంగా తన సంకల్పం వుండేది. ఆ తర్వాత దీవాన్‌జీ కావచ్చు. కాని యిప్పుడు - దీవాన్‌జీ పదవి తీసేస్తున్నారు. ఇక్కడి నుంచి పై పదవి యేం లభిస్తుంది? తెలియదు. కానీ ముందు జీవితంలో చాలా మెట్లు కనిపిస్తున్నాయి. బహుశా అవి పదవికి సంబంధించినవి కాకపోవచ్చు. ఐశ్వర్యానికి సంబంధించినవి అయివుండచ్చు.

స్వాతంత్ర్య దినోత్సవం జరిపించేందుకు చీఫ్ సెక్రటరీ ఖద్దరు ధోవతీ, ఖద్దరు చొక్కా వేసుకుని దేశమంతటా తిరుగుతున్నాడు. ప్రతి జిల్లాలో ముఖ్య పట్టణం, ముఖ్యమైన గ్రామాలు, ప్రాంతాలు అన్నీ తిరుగుతున్నాడు. ముందు ఏర్పాటు చేసుకున్న కార్యక్రమం ప్రకారం ఆయన వెళ్ళగానే ఆయన సూచనలు అందుకునేందుకు కాంగ్రెసు వాళ్ళు, కాని వాళ్ళు - అందరూ ఆయన కోసరం ఎదురు చూస్తూ వున్నారు. కొద్ది రోజుల్లోనే కేశవపిళ్ళైకు కాంగ్రెసు వాళ్ళతో బాగా పరిచయం ఏర్పడి పోయింది. వాళ్ళ ప్రేమకు పాత్రుడయినాడు. ఈ విధంగా చీఫ్ సెక్రటరీతో సన్నిహిత సంబంధం ఏర్పడటం వాళ్ళకు కూడా సంతోషకరంగా వుంది. నిజానికి వుద్యోగస్థుల కంటె కాంగ్రెసు కార్యకర్తలే చీఫ్ సెక్రటరీ చేసిన సూచనలను కార్యరూపంలో పెట్టేందుకు ఎక్కువ ఆసక్తిని చూపిస్తున్నారు. కేశవపిళ్ళైతో వాళ్ళకు ఆత్మీయత ఏర్పడింది.

ఈ గౌరవం అతను అనుకున్నది కాదు. కేశవపిళ్ళైకు ఆశ్చర్యం వేసింది. అతను నమ్మలేక పోతున్నాడు. కాంగ్రెసు వాళ్ళు చీఫ్ సెక్రటరీని గౌరవించటం - ఎంత ఆలోచించినా అతనికి అర్థం కావటం లేదు.

కేశవపిళ్ళై యీ అవకాశాన్ని పూర్తిగా వుపయోగించుకోవాలని నిర్ణయించుకున్నాడు.

అయినా దేశమంతటా పర్యటన చేసిన తర్వాత కొన్ని పత్రికల్లో, సభల్లో, దోషారోపణలు, ఆక్షేపణలు వచ్చాయి. అవి బాధ్యతారహితులు అనే మాటలు అని మొదట కేశవపిళ్ళై అనుకున్నాడు. వాళ్ళల్లో ఎక్కువమంది సామ్యవాదులు, వాళ్ళ అనుచరులు. కాని కాంగ్రెసు వాళ్ళల్లో కూడా చాలా

మందికి అతనంటే గిట్టదనే విషయం తర్వాత తర్వాత కేశవపిళ్ళైకు తెలిసింది. కేశవపిళ్ళై ప్రజాశత్రువు. స్వాతంత్ర్య సమరంలో ప్రవహించిన ప్రజారక్తానికి ఎవరయినా బాధ్యులయితే అతను కేశవపిళ్ళై. కాంగ్రెసు ఆందోళనలో కనిపించిన ప్రబల శత్రువు కేశవపిళ్ళై అనికూడా అందరూ అంటున్నారు. వెనక స్వాతంత్ర్య సమరంలో వినబడిన నినాదాలు మళ్ళీ వినబడుతూవున్నాయి:

"కేశవపిళ్ళైను జైల్లో పెట్టండి. - ఉరిశిక్ష వేయించండి."

ఈ మట్టిలో పుట్టిన మనుష్యులను మరిచిపోయి పరమనీచానికి పాల్పడి స్వాతంత్ర్య సమరాన్ని అణగ దొక్కిన ఆ మనిషే యీ నాడు స్వాతంత్ర్య దినోత్సవం జరిపించేందుకు నిర్విరామంగా తిరుగుతున్నాడని ప్రజలు అతన్ని పరిహాసం చేశారు. ఈ కృషి అంతా డబ్బు పోగు చేసుకునేందుకే నని వెనకటి విషయాలను బట్టి ప్రజలు తీర్మానం చేస్తున్నారు.

వాళ్ళ వాదాన్ని అందరికంటె మిన్నగా కేశవపిళ్ళై అర్థం చేసుకోగలిగాడు. అంతా నిజమేనని అర్థం చేసుకోగల వ్యక్తి అతనొక్కడే. అందువల్లనే అతనికి భయం కూడా వేసింది. అది కాదని సమర్థించి చెప్పమని అతన్ని ఎవరయినా అడిగితే అతను చెప్పగలిగింది యేమీ లేదు. దాన్ని నిరాకరించే మార్గం అతనికి ఏమీ స్ఫురించటం లేదు. ఆత్మరక్షణ కోసం ఏదయినా తర్కసమ్మతమైన సమాధానం చాలా రోజులనుంచి వెతుకుతున్నాడు కేశవపిళ్ళై. ఈ ఆరోపణలకు సమాధానంగా ఎవ్వరూ ఒక్కమాట కూడా చెప్పటం లేదు. శత్రువుల సంఖ్య పెరుగుతూ వుంది. వాదించేవాళ్ళ సంఖ్య కూడా పెరుగుతూవుంది. ఇది ఒక ఉద్యమం లాగా తయారు కావచ్చునని కేశవపిళ్ళైకు అనుమానం వేసింది.

ఒక రోజు కేశవపిళ్ళై తన భార్యకు అంతా చెప్పాడు. మరి ఎవరికి చెప్పగలడు? ఆమెలో ప్రశాంతత వుంది, కంగారు లేదు. ఉద్యోగం పోతే పోనీ. దానికింత భయపడాల్సిన పనేముంది? అదే మొదటినుంచీ ఆమె వాదం-

"భగవంతుడి దయవల్ల మన జీవితానికేమీ కొరతలేదు. ఈ ఉద్యోగాన్ని పట్టుకుని ఊగులాడటమెందుకు? పోతే పోనీ."

ఆ మార్గాన్ని అవలంబించటం మంచిది. అదే శ్రేయస్కరం. కాని ఆ ధైర్యం కేశవపిళ్ళై అంతస్సులోకి ప్రవేశించటం లేదు.

కాత్యాయని అడిగింది : "ఒకవేళ యీ నెపంతో ఉద్యోగం నుంచి తీసేశారనుకోండి. అంతటితో చచ్చి పోతామా?" మనం బతకలేమా?

"అది మాత్రమే కాదు, అయినా-"

"అలా యెందుకు ఆలోచిస్తారు?" అన్నది కాత్యాయని

వెనకటిలాగా కేశవపిళ్ళైకు మళ్ళీ ధైర్యం వచ్చింది. ఏమయినా సరే, యీ ఆటకూడా ఆడి చూద్దాం. జీవితంలో తృప్తికి చాలా కారణాలున్నాయి.

ఇంతవరకూ వచ్చాను, చాలు. ఆ తృప్తి వుంటుంది. కానీ రిటైరయ్యేలోగా ఉద్యోగం పోవటం అవమానకరంగా వుంటుంది.

తన విరోధులు చాలామంది తనకు వ్యతిరేకంగా ప్రయత్నం చేస్తున్నారనటంలో కేశవపిళ్ళెకు ఏమీ సందేహం లేదు. లేకుంటే యిలా ఒకదాని మీద ఒకటి నేరాలు మోపటం జరగదు. సెక్రెటరీ ఫిలిప్ లాంటి వాళ్ళకు కాంగ్రెసులో మంచి పలుకుబడి వుంది. ఉద్యమ కాలంలో కేశవపిళ్ళె కావాలనుకుంటే ఫిలిప్‌ను బాధించగలిగి వుండేవాడు. కాని అనవసరంగా బాధించటం ఎందుకులే అని అతను పట్టించుకోలేదు. తను గొప్ప తప్పు చేశానని కేశవపిళ్ళెకు ఇప్పుడనిపిస్తూ వుంది. ఈ గొడవలన్నీ సచివాలయం నుంచే ఆరంభమవుతున్నాయి. కేశవపిళ్ళెను అవమానపరిచి అతన్ని ఉద్యోగంలో నుంచి తీసివేయగలిగితే వాళ్ళకు ఆనందంగానే వుంటుంది. ఒకసారి వాళ్ళు ప్రయత్నించారు. కానీ ప్రయత్నం ఫలించలేదు. మరోసారి దొరికిన అవకాశాన్ని ఉపయోగించుకుంటున్నారు. ఇది కూడా మంచి అవకాశమే.

ఈ పరిస్థితి నుండి ఎలా తప్పించు కోవటం అనేదే అతని ఆలోచన. ఉద్యోగం పోతుందనే భయం అతనికిప్పుడు లేదు. కానీ యిలా గెంటించి పంపించే పరిస్థితి రాకూడదు, రానియ్య కూడదు. కాత్యాయనీ అమ్మకు ఇప్పుడన్ని విషయాలూ అర్థమయినాయి. కొద్ది రోజుల్లోనే కేశవపిళ్ళె ఆమెకు అన్ని విషయాలూ తెలియ జెప్పాడు. అయినా ఆమెకు ఏమీ పట్టుదల లేదు. ఉద్యోగం పోతే నష్టమేమిటంటుంది ఆమె. అదేమంత పెద్ద విషయమా?

జీవితంలో తను ఒంటరి వాడిననే విషయం, కేశవపిళ్ళెను చాలా బాధిస్తూ వుంది. తనకు సానుభూతి చూపిస్తూ ఆలోచించేవారు, తనమాట వినేవారు ఎవ్వరూ లేరు. భార్యకు తనకున్న ఆలోచనా శక్తి లేదు. బాగా ఆలోచించే వ్యక్తి కోసం అతను చూస్తున్నాడు. కానీ ఎవ్వరూ దొరకలేదు. ఇప్పుడు కనీసం తన బరువును దించుకొనేందుకు ఒక మనిషి ఉన్నది గదా అనే తృప్తి వుంది. అది నిజంగా చాలా తృప్తినిచ్చే విషయం. కాని భార్య వల్ల అతను ఇంతకంటె ఎక్కువ అపేక్షిస్తున్నాడు. ఈ వయస్సులో కూడా కాత్యయనీ అమ్మకు ఉత్సాహంలో తక్కువలేదు. ఎప్పుడూ ఆనందంగా వుంటుంది. హాయిగా నిద్రపోతూంది. నిద్ర పట్టక ఆయన అటూ ఇటూ దొర్లుతూ వుంటే తను నిద్రపోతూనే మధ్యలో లేపినట్టు లేచి "నిద్ర పట్టటం లేదా? ఎందుకలా బాధపడతారు?" అని అంటూంటుంది.

మరుక్షణం ఆమె గాఢనిద్రలో మునిగి పోతుంది. తన భార్య నిద్రపోతున్నదని కేశవపిళ్ళెకు కోపం రాదు, కానీ చిరాకు వేస్తుంది.

కాత్యాయని అమ్మ అడుగుతుంది: "మరేం చెయ్యమంటారు? నేను కూడా నిద్ర మానేసి కూర్చుంటే మన పని నెరవేరుతుందా? అలా కేకలు వేసేవాళ్ళ నోరు ఎలా మూయించాలో నాకు తెలియదు. మరి నిద్ర మానేసి నేను కూర్చున్నందువల్ల లాభమేముంది?"

కేశవపిళ్ళె ఆ మాట కాదనలేక పోయాడు. కాని భార్య హాయిగా నిద్రపోయేందుకు కూడా అతను ఒప్పుకొనే స్థితిలో లేడు.

కాత్యాయనీ అమ్మ విషయం అడిగింది.

"ఇప్పుడు వాళ్ళే మంటారు?"

"నన్ను వుద్యోగం నుంచి తొలగించమని"

తెలివిగల వ్యక్తిలా కాత్యాయనీ అమ్మ ప్రశ్నిస్తున్నది. స్వరమూ, భావమూ అంతా అలాగే వుంది. సలహా కోరే వ్యక్తిలా కేశవపిళ్ళె సమాధానం చెప్తున్నాడు.

ఉన్నట్టుండి కాత్యాయనీ అమ్మకు ఉన్న సామాన్యమైన బుద్ధి నుంచి ఒక విషయ్యం ప్రశ్న రూపంలో వెలువడింది:

"అయితే కాంగ్రెసువాళ్ళను ఎదిరించిన పోలీసు అధికారులనూ, మిగిలిన వుద్యోగస్థులను కూడా ఉద్యోగం నుంచి తొలగించాలిగా?"

"అలాగే చెయ్యాలి. కాని నన్ను తొలగిస్తే చాలని అంటారు వాళ్ళు." అన్నాడు కేశవపిళ్ళె.

"బాగుంది! ఇదేం న్యాయం?"

"న్యాయం కాదు."

"అన్యాయాన్ని చూసి మనం భయపడటం ఎందుకు?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

"ఏం చెయ్యను? బయటికి పంపిస్తే?"

కాత్యాయని అమ్మ వెనకటి తృప్తిని మళ్ళీ చేరుకుంది: "అన్యాయంగా మనల్నే బయటికి పంపిస్తే పంపించనీ. ఏం చేస్తాం?"

ఒక్క క్షణం ఆగి ఆమె మళ్ళీ అన్నది: "ఇప్పుడు దీవాన్‌జీ వెళ్ళిపోయారు. ఇక కాంగ్రెసు వస్తుంది - అన్నారు గదా మీరు. కాంగ్రెసు వాళ్ళకు సామ్యవాదులు శత్రువులు. కాంగ్రెస్ అధికారంలోకి వస్తే వాళ్ళూ ఇలాగే అల్లరి చేస్తారు. ఆ తర్వాత సామ్యవాదం అధికారంలోకి వస్తే కాంగ్రెసు ప్రభుత్వంలో వాళ్ళను ఎదిరించిన వాళ్ళ నందర్నీ ఉద్యోగంలో నుంచి తీసేయాల్సిందేనా? ఆ లెక్కకు వస్తే ఏ వుద్యోగస్థుడూ మామూలుగా రిటైరు కాడు. ఇక ముందు అలాగే జరుగుతుందా?"

"అలా జరగదు".

"మరి?"

కేశవపిళ్ళె మెదడులో ఒక మెరుపు మెరిసింది. "కాని మనల్ని గురించి అలా చెప్పేవాళ్ళెవరున్నారు?" అన్నాడతను.

కాత్యాయనీ అమ్మ అడిగింది: "ఆ మాట ఎవరన్నా చెప్పాలా యేం? ఇది మరీ బాగుంది! కొంత మంది "పంపించేయండి" అని కేకలు పెడుతుంటే మరి కొంత మంది "అలా చెయ్యకండి" అని కేకలు పెడుతూ తిరగాలి కాబోలు!"

"కాలం అలాంటిది."

"బాగానేవుంది కాలం. మనవైపు న్యాయముంది. దీవాన్‌జీ చెప్పిన మాట విన్నాం. ఇప్పుడు కాంగ్రెసు మాటా వింటున్నాం. తప్పేముంది? నిశ్చింతగా వుండండి. హాయిగా నిద్రపోండి."

కాత్యాయనీ అమ్మ కప్పుకొని పడుకుంది. పడుకోగానే నిద్ర పట్టింది. కేశవపిళ్ళెకు నిద్ర రాలేదు. ఇప్పుడు అతనికి వాదనకొక ఆధారం దొరికింది. భేషయిన ఆధారం. దాన్ని గురించి ఆతను ఆలోచిస్తున్నాడు. ఒకప్పుడు, దీవాన్‌జీ అధికారంలో వున్నప్పుడు ఆయన చెప్పినట్టు పని చేశాడు. ఇప్పుడు కాంగ్రెసు చెప్పినట్టు చేస్తున్నాడు. ఇక ముందు మరో పార్టీ ప్రభుత్వం వస్తే ఆ ప్రభుత్వం కింద పని చేస్తాడు. ఇందులో తప్పేముంది?

నలువైపులా చెలరేగిన అలజడిని ఆపేందుకు అడ్డులేని సమాధానం ఇది. వాళ్ళ కేకలు, వాదనలు అన్నీ యీ సమాధానంతో సమసిపోతాయి. మానసికంగా ఎలాంటి బాధా లేకుండా కాత్యాయనీ అమ్మ నిద్రపోతున్నది. ఆ స్త్రీ తన భాషలో ఈ వాదనను వివరించింది. ఇంత చదువుకొని, ఇంత అనుభవం ఉన్న తనకి మాత్రం ఆలోచన తట్టలేదని అనుకున్నాడు కేశవపిళ్ళె.

కేశవపిళ్ళె కాత్యాయనీ అమ్మను చూస్తున్నాడు. ఆయన కళ్ళు ఆశ్చర్యంతో ఆ దృశ్యాన్ని చూస్తున్నాయి. ఆ రోజు పెండ్లి పందిరిలో చూచిన ఆ నల్లపిల్ల, క్షయ రోగంతో క్షీణించినట్టు సన్నగా బలహీనంగా పండ్లు బయటికి వచ్చి, చిన్నజుట్టుతోవున్న ఆ పిల్ల యిదేనా? ఆరోజు ఆమె చెయ్యి పట్టుకొనేందుకు మనస్కరించలేదు. ఈమెలో ఎంత ఆశ్చర్యకరమైన రహస్యగుణాలున్నాయి. ఈ శక్తి అంతా ఈమెలో ఆనాడు కూడా వుందా? కేశవపిళ్ళె నమ్మలేక పోయాడు. ఈమె ఆమేనా? కేశవపిళ్ళెకు చాలా సందేహం వేసింది. ఒక్కొక్క క్షణం గడిచే కొద్దీ అతనికి ఆశ్చర్యం ఎక్కువవుతూ వుంది. ఆమె అంతు చిక్కని చిక్కు సమస్యగా మారుతూవుంది.

కాత్యాయని నిద్రపోతూ వుంది. చీకూచింతా లేకుండా హాయిగా నిద్రపోతూ వుంది. ఇప్పుడు ఆమె నలుపు కాదు, పండ్లు బయటికి వచ్చిలేవు, బలహీనంగా కూడా లేదు. ఆమె మొహంలో కాంతి వుంది. తన భార్య సౌందర్యవతి. ఆమె తనది, కేవలం తనది. తనకోసమే ఆమె జుట్టు

పెంచుకుంది. రంగుమారి వన్నె తేరింది. మొహంలో కాంతి వచ్చింది. శరీరం పుష్టిగావుంది. ఆమె యింత ఆకర్షణీయంగా రూపొందింది మరెవరి కోసమో కాదు. కేశవపిళ్ళై కోసమే. ఆమె తనను గురించి యింత శ్రద్ధ వహించటం కేవలం కేశవపిళ్ళై కోసమే. అతనికి ఎంతో తృప్తిగా వుంది. ఆమె దగ్గర పడుకుంటే పీడకల రాదు. ఆమె బెదిరిస్తుంది, బతిమాలుతుంది, తప్పు పడుతుంది; తప్పు చెబుతుంది, సలహా చెపుతుంది, అమాయకంగా వుంటుంది, ధైర్యం చెపుతుంది, వేధిస్తుంది, హాయినిస్తుంది, మనసును మథింప జేస్తుంది, వెంటపడుతుంది, ఆజ్ఞాపిస్తుంది. సేవిస్తుంది, శాసిస్తుంది. మనస్సు ప్రశాంతంగా వుంటుంది, బయటికి ఆరాట పడుతున్నట్టుంటుంది. ఆమె పూర్తిగా తనది, మరెవరిదీ కాదు.

తన కష్టాలన్నిటినీ మరిచిపోయి కేశవపిళ్ళై ఆమె ముఖంలో ముఖం పెట్టాడు. కాత్యాయని కళ్ళు తెరిచి చూసింది. ఎంత తియ్యని కాంతిమంతమైన చిరునవ్వే అది! భార్య మొహం మీద చిరునవ్వు! కాత్యాయని తన చేతులు అతని మెడచుట్టూ వేసింది. అదుముకొని పడుకున్న సమయంలో "దిగులు పడకండి, హాయిగా నిద్రపొండి" అన్నది.

తల్లి పిల్లవాడిని చిచ్చికొట్టి నట్టు ఆమె మెల్లగా అతని వీపు నిమిరింది. చెవిలో ఊదినట్టు చెప్పింది: "మనల్ని ఎవరూ ఏమీ అనరు".

వాళ్ళిద్దరి శరీరాలూ, ఆత్మలూ ఏకమయినాయి. ఆస్థితిలో ఉత్కంఠలేదు, బాధలేదు, దిగులు లేదు.

చాలా రోజుల నుంచీ లేని ఉల్లాసంతో కేశవపిళ్ళై మేల్కొన్నాడు. అతనిలో ఏదో శుభ సంకల్పం ఉదయించింది. ఏదో మార్గం కనిపిస్తూంది. కాత్యాయని చాలా ధైర్యంగా చెపుతూ వుంది. అతనికి పూర్తిగా నమ్మకం వుంది.

ఆ రోజు కూడా వార్తా పత్రికల్లో కేశవపిళ్ళైకు వ్యతిరేకంగా వ్యాసాలూ, ఉపన్యాసాలూ, విమర్శలూ అచ్చయినాయి. కానీ యీ రోజు కేశవపిళ్ళైకు ఉద్వేగం కలగలేదు.

"కాంగ్రెసు వర్కింగ్ కమిటీ ఉపాధ్యక్షులు కలుసుకునేందుకు వచ్చారు" అని గేటు దగ్గరి పోలీసు బంట్రోతు వచ్చి చెప్పాడు. కేశవపిళ్ళై అయన్ని లోపలికి రమ్మని గదిలో కూర్చోబెట్టి మర్యాదలు చేయించాడు. లోపలికి వెళ్ళి తను బట్టలు మార్చుకున్నాడు.

ఆ విశిష్ట అతిథి కాంగ్రెసు కమిటీలో రెండో స్థానంలో వున్నా చాలా పలుకుబడిగల వ్యక్తి. కొంచెం సేపట్లో కేశవపిళ్ళై ఖద్దరు బట్టలు వేసుకొని అతన్ని ఆహ్వానించాడు. కుశల ప్రశ్నల తర్వాత వాళ్ళు ఆగస్టు పదిహేను ఉత్సవాలను గురించి చర్చించుకున్నారు. కేశవపిళ్ళై తను చేసిన యేర్పాట్లను గురించి విపులంగా చెప్పాడు. చివరకు ఇలా ముగించాడు:

"దాదాపు ప్రతి యింట్లో, ప్రతి వూళ్ళో వుత్సవం జరుగుతుందని అనుకోవచ్చు. ఉత్సవ కార్యక్రమం పూర్తిగా ప్రభుత్వేతర సంస్థలకే అప్పగించటం జరిగింది. కార్యక్రమం ఆమోదించేందుకు మరో రెండు సమావేశాలు ఏర్పాటు చెయ్యవలసివుంటుంది."

"ఏర్పాట్లు పెద్దయెత్తునే జరుగుతున్నాయని ఉపాధ్యక్షుడు కూడా అభిప్రాయ పడ్డాడు. "చిన్నచిన్న గ్రామాలకు కూడా సంచాలకులు వెళ్ళినట్టు తెలుస్తున్నది" అన్నాడు.

ఇది కేశవపిళ్ళైకు అభినందన. సంచాలకుడు మరెవరో కాదు, అతనే. సంచాలకుడు అన్నాడు: "చాలా రోజులనుంచి టూరులో తిరుగుతున్నాను. వెళ్ళ గలిగినంతవరకూ వెళ్ళాను."

ఈ విధంగా ఆ విషయాన్ని గురించిన సంభాషణ ముగిసింది. మాట్లాడేందుకు మరేమీ విషయం లేదన్నట్టుగా ఇద్దరూ కాస్సేవు కూర్చున్నారు. మాట్లాడేందుకు ఇద్దరికీ చాలా విషయాలున్నాయి. ఇంటి యజమాని కేశవపిళ్ళై కదా! "మరి మీరేదో పని మీద వచ్చినట్టున్నారు?" అని అడిగాడు.

ఒక్కసారి నవ్వి ఉపాధ్యక్షుడు సమాధానం చెప్పాడు. ఏదో పని మీద అతను వచ్చిన మాట స్పష్టంగానే కనిపిస్తున్నది.

"కొంత నా సొంతపని, కొంత పార్టీ పని"

ఆ పనియేమిటో తెలుసుకునేందుకు కేశవపిళ్ళై చాలా కుతూహలంతో కూర్చుని వున్నాడు. ఉపాధ్యక్షుడు అన్నాడు: "పార్టీ పని చాలా పెద్దది. సమ్మె సమయంలో చాలా మందికిచెందిన ఆస్తి జప్తు చేయటం జరిగింది. ప్రభుత్వం వల్ల రావలసిన డబ్బు ఇంకా రాలేదు. ఈ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో ఎవరికి ఎంత డబ్బు రావాలో, ఎంత పొలం రావాలో వాళ్ళకు అవి వచ్చేటట్టు కేసులు తీర్మానం చేస్తే బాగుంటుంది. ఇది మా పార్టీ అభిప్రాయం."

కేశవపిళ్ళై కొంచెం సేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు. కాంగ్రెసు నాయకుడు మళ్ళీ మొదలు పెట్టాడు: "ఈ విషయంలో చాలా పని చేయవలసి వుంది. కేసులు కూడా చాలా వున్నాయి. పెన్షను కూడా ఆపేశారు. ఇలాంటి కేసులను పోగు చేయటమే కష్టం. అవన్నీ నాకు తెలుసు. కాని మీరు అలా చేస్తే బాగుంటుంది. అంతేకాదు, మీరే ఈపని చెయ్యాలని మా అభిప్రాయం."

కేశవపిళ్ళై యీ విషయంలో చాలా ఆసక్తిని చూపిస్తున్నట్టు అడిగాడు: "తాత్కాలిక దీవాన్‌జీని అడిగి చూశారా?"

"లేదు. ఈ విషయాన్ని గురించి ముందు మీఅంతట మీరే ఆలోచించటం మంచిది గదా! ఈ ప్రభుత్వం తనంతట తనే యీ పని చేసినట్టవుతుంది. ఆ పేరు మీకే దక్కుతుంది."

"అవును, అందులో సందేహంలేదు" అన్నాడు ఛీఫ్ సెక్రెటరీ, ఆయన మాటకి ఎదురు చెప్పకుండా.

ఒకసారి నవ్వి మళ్ళీ ఇలా అన్నాడు: చాలా కేసులు నా వుత్తర్వు మీదనే అయివుంటాయి. కాబట్టి ఆ మూట విప్పటం నాకు సంతోషకరంగానే వుంటుంది. చేతులు కడుక్కుని ప్రాయశ్చితం చేసుకున్నామనే తృప్తి కూడా నాకు వుంటుంది. నేనే యధార్థం చెప్తాను- నా మనస్సు చాలా బాధపడుతూ వుంది. ఎవ్వరూ నమ్మరు. నేను కూడా ఈ దేశంలో పుట్టి పెరిగిన వ్యక్తిని. ఇక్కడ రెండు గజాల నేల మీదనే హాయిగా కాలం గడపాలని నా కోరిక. కానీ యీ ప్రభుత్వోద్యోగి తన కర్తవ్యం నెరవేర్చాలి కదా! ముందు ముందు కాంగ్రెసు పరిపాలన సాగుతుంది. ప్రభుత్వపు పరిపాలనా కార్యక్రమాన్ని అమలు పరచటం ఉద్యోగస్థుల కర్తవ్యం. వాళ్ళు ఎప్పుడూ చలించ కూడదు. అదే నా సిద్ధాంతం. అది సరియైనది కానీ, కాకపోనీ, ఉద్యోగస్థులు చలిస్తే సర్వనాశనమవుతుంది. అధికారం శక్తిమంతంగా వుండాలి. మరి ఆసంగతి ఎవరి కర్థమవుతుంది? నా సంగతి కూడా యధార్థం ఎవరికీ తెలియదు."

కేశవపిళ్ళె చెప్పిన తార్కిక ధోరణిని కాంగ్రెసు నాయకుడు అంగీకరించాడు. అది నిజమేనని ఆయన ఒప్పుకున్నాడు.

కేశవపిళ్ళె అన్నాడు: "చూశారా, వార్తా పత్రికల్లో ఏమేం రాస్తున్నారో? ఏవేవో వుపన్యాసాలు! ఇవాళ కూడా వచ్చాయి."

"వాళ్ళంతా సామ్యవాదులు" అన్నాడు రోజూ అవన్నీ చదువుతూ వుండే నాయకుడు.

"లేదు. సామ్యవాదులు కాదు. కాంగ్రెసు వాళ్ళు కూడా చాలామంది వున్నారు. నాయకులు కూడా వుపన్యాసాలిస్తున్నారు."

కాంగ్రెసు నాయకుడు తటాలున బుజాలు తడుము కున్నాడు. అలా వుపన్యాసాలిచ్చే ముగ్గురు నలుగురి పేర్లు కేశవపిళ్ళె చెప్పాడు.

"నేనివన్నీ పట్టించుకోను. నా పనేదో నేను జాగ్రత్తగా చూసుకుంటాను. కానీ మీరా ప్రస్తావన యెత్తారు కాబట్టి నాకు తృప్తిగా వుంది. త్వరలోనే నేనా విషయం చక్కబెట్టేందుకు చూస్తాను. ఈలోగా మీరో పని చేస్తే బాగుంటుంది. దీవాన్‌జీతో కూడా ఈ విషయం ప్రస్తావించండి. నేను అధికార రీత్యా చెప్తాను". అన్నాడు కేశవపిళ్ళె.

కేశవపిళ్ళెకు మనస్సు కుదుట పడింది. అతనికి ఇంత మనశ్శాంతి యెప్పుడూ కలగలేదు.

నాయకుడు ఈ విషయం దీవాన్‌జీతో చెప్పేందుకు బాధ్యత వహించాడు.

"మరి మీ సొంత పని?" కేశవపిళ్ళె చనువుగా అడిగాడు.

"అది కూడా దీనికి సంబంధించిందే. మా బావమరిది ఒక అడవిని కంట్రాక్టుకు తీసుకున్నాడు. కొలతల్లో అతను మరోచోటి నుంచి ఒక చెట్టు

కొట్టించినట్టు తేలిందని కన్సర్వేటరు గొడవ చేశాడట. అతను చాలా నష్టపడ్డాడు. ఆ కలపను ఇంతవరకు తీసుకెళ్ళలేక పోయాడు. ఇది అతని అర్జీ. ఇది తొందరగా చూడండి. జాతీయ పోరాటంలో పాల్గొనటం వల్ల, మా కుటుంబం కూడా అతని మీదనే ఆధారపడి వుంది. ఇది మా బతుకు తెరువుకు సంబంధించిన సమస్య అయింది."

కేశవపిళ్ళై అర్జీ తీసుకున్నాడు. త్వరగా దానికి సంబంధించిన ఫైలు పంపించవలసిందని ఉత్తర్వు చేశాడు. "ఇది నేను చెయ్యగలిగిన పని. మీరు దిగులు పడకండి. ఒక్క వారంలో పని అయిపోతుంది." అన్నాడు.

ఆ తర్వాత మేనేజర్లను గురించి, ముఖ్యంగా కన్సర్వేటరును గురించి అతను ఆక్షేపణ చేశాడు.

"కొంచెం అటూ యిటూ అయితే ఈ అటవీ శాఖ వాళ్ళు మీ బోటి వాళ్ళను అనవసరంగా ఇబ్బంది పెడుతుంటారు. అది నాకు నచ్చలేదు."

ధన్యవాదాలు చెప్పి ఉపాధ్యక్షుడు వెళ్ళేందుకు అనుమతి కోరాడు. క్షణంలో కేశవపిళ్ళై మనస్సులో ఒక ఆలోచన మెరిసింది. కేశవపిళ్ళై మనస్సులో తనకు తాను ధన్యవాదాలు చెప్పుకున్నాడు.

"జప్తు చేసిన వస్తువులను గురించి మొదట చెప్పారు చూడండి. ఆ విషయంలో ఒక పని చేస్తే చాలా బాగుంటుంది. కాంగ్రెసు కార్యాలయంలో పని చేసే బంట్రోతుల ద్వారా ఒక ప్రకటన జారీ చెయ్యండి - సమ్మెలో ప్రభుత్వం వల్ల సొమ్ము నష్టపడ్డ వాళ్ళందరూ నేరుగా ఛీఫ్ సెక్రటరికి అర్జీ పెట్టవలసిందని. ఆ అర్జీలో వివరాలన్నీ వుండాలి. స్థిరాస్తి, చాలా సొమ్ము నష్టపోయిన వాళ్ళు ఛీఫ్ సెక్రటరీని వ్యక్తిగతంగా కలుసుకొని అర్జీ యిస్తే మంచిది. అర్జీ తీసుకొని అర్జీ తెచ్చిన వాళ్ళతో సమక్షంలో మాట్లాడి చేయదగింది నేను చేస్తాను. ఈ పనిలో చాలా రోజులు పట్టినా నాకేం ఇబ్బంది లేదు. చేసిన పాపానికి ఇది సరియైన ప్రాయశ్చిత్తమని నేను మళ్ళీ మనవి చేసుకుంటున్నాను. అంతేకాదు. అర్జీలు ఎక్కువగా వస్తే దీన్ని ఒక సమస్యగా భావించి నేను దీవాన్‌జీని వ్యక్తిగతంగా కలుసుకోగలను."

కేశవపిళ్ళై తెలివితేటలతో ఉపాధ్యక్షుడు ఆలోచించి చెప్పిన ఆ మార్గాన్ని ఆనందంగా అంగీకరించాడు. ఆ రోజే ప్రకటన జారీ చేస్తానని ఆయన మాట యిచ్చాడు.

దేశంలో కాంగ్రెసు నాయకులకందరికీ ఏదో రకమైన నష్టమయింది. ఈ విషయం మిగిలిన వాళ్ళ కంటె కేశవపిళ్ళైకు ఎక్కువగా తెలుసు. వాళ్ళల్లో స్థిరాస్తి, చరాస్తి పోగొట్టుకున్నవాళ్ళూ, కేసు పెట్టేందుకు అనుమతి కోరినందువల్ల ఉద్యోగాలు పోగొట్టుకొన్న వాళ్ళూ ఎక్కువ. వాళ్ళంతా అర్జీ తీసుకొని ఛీఫ్ సెక్రెటరీ దగ్గరికి వచ్చి తీరాలి. అందులో కేశవపిళ్ళైకు సందేహం లేదు. అలా ఒక మంచిపని మొదలు పెట్టిన తరవాత -

దేశమంతటా మారుమోగుతున్న యీ విమర్శలు, ఆక్షేపణలు సమసిపోతాయి. వాళ్ళ పొలాలు, స్థలాలు, ఆస్తి పాస్తులు, ఉద్యోగ సద్యోగాలు-అన్నీ కేశవపిళ్ళె కలం పోటు మీద ఆధారపడి వుంటాయి. ఇక అతనికి వ్యతిరేకంగా వుపన్యాసం ఎవరిస్తారు? పత్రికల్లో ఎవరు రాస్తారు? ఎవరికంత ధైర్యముంటుంది? ఊపలలో ఎవరు చిక్కుకోరు?

ఉపాధ్యక్షుడు వెళ్ళిపోయిన తర్వాత పసిపిల్లవాడిలా గంతులేస్తూ కేశవపిళ్ళె భార్య దగ్గరికి వెళ్ళి అన్నాడు:

"కాత్యాయనీ, నీ నోటి మాట ఫలించింది. మనకేమీ ప్రమాదం లేదు."

1947 ఆగస్టు 15వ తేదీ. ఈ పుణ్యదినం ఉత్సవం ఇంటింటా, ఊరూరా బ్రహ్మాండంగా జరిగింది. కేశవపిళ్ళె చేసిన యేర్పాట్లు నూటికి నూరుపాళ్ళూ జయప్రదంగా కొనసాగాయి. అది చీఫ్ సెక్రటరీకి కచ్చితంగా విజయ సూచకం.

తిరువనంతపురంలో తాత్కాలిక దీవాన్‌జీ అధ్యక్షత క్రింద ఆ రోజు జరిగిన గంభీర సభలో కాంగ్రెసు ప్రముఖ నాయకుడు మహోపన్యాసం చేశాడు. స్వాతంత్ర్య సమరాన్ని జయప్రదంగా సాగించి సాధించిన ఆ మహా వీరుడు స్ఫూర్తితో ఆవేశంతో ఉపన్యసించటంలో ఆశ్చర్యం లేదు. అలాగే వుండాలి. కాని ఆ వుపన్యాసంలో దానిని మించిన గాంభీర్యం, సార్థక్యం వుంది. ముందు ముందు ఇక్కడ కాంగ్రెసు ప్రభుత్వమే వుండబోతుంది. అందులో సందేహం లేదు. ఆ ప్రభుత్వంలో సర్వోన్నతమైన స్థానాన్ని అలంకరించబోయే వ్యక్తి అలాంటి మహత్తరమైన రోజున రాబోయే రాజ్యాంగాన్ని వివరిస్తూ ఉపన్యసించటం సహజం. అది ఒక విధంగా రాజకీయ పరిపాలనా ప్రకటన.

గతించిన ఉద్యమ చరిత్రను సింహావలోకనంగా పరామర్శించి ఆనాటి ప్రాశస్త్యాన్ని వివరిస్తూ ఆయన భవిష్యత్తును గురించి భాషించాడు. వయసు వచ్చిన వాళ్ళ వోటింగు హక్కు ప్రకారం తిరువితాంకూరుకు ఒక పరిపాలనా సమితిని ఎన్నుకుంటామని ఆయన ప్రకటించారు. తిరువితాంకూరులో ఎలాంటి ప్రభుత్వం వుండాలి అనేది ఆ సమితి నిర్ణయిస్తుంది. ఆ మాట చెప్తూ ఆయన ప్రాచీన కాలం నుంచి మన దగ్గర స్థిరమైన ప్రభుత్వ విధానముంది అనే విషయం చెప్పారు. ఈనాటికి కూడా మన పరిపాలన గట్టి పునాదుల మీద నిలబడి వుంది. ఇది మనకు లభించిన అనుగ్రహం. వెనక దీవాన్‌జీ చండ శాసనం జరిపించే రోజుల్లో ఆయన ఆజ్ఞలను అమలు పరిచే వుద్యోగస్థులను స్వాతంత్ర్య సమరంలో మనం మనకు విరోధులుగా భావించి వాళ్ళను ఎదుర్కోవలసి వచ్చింది. మనతో సరిసమానంగా పోరాడిన యోధులను పోలీసులు చావగొట్టారు. మన కాళ్ళూ చేతులూ లాఠీ దెబ్బలకు నుసినుసి అయిపోయాయి. ఈ వుద్యోగస్థులందరూ మనకు గర్భశత్రువులుగా నిలబడ్డారు. వాళ్ళు అలా ప్రవర్తించకుండా వుంటే

బాగుండేదని అనుకున్నాం. వాళ్ళను మనం అసహ్యించుకున్నాం. అలా అసహ్యించుకుని వాళ్ళకు వ్యతిరేకంగా మనం నినాదాలు లేవదీశాం. కాని యీనాడు మనం కూడగట్టుకొని ఆలోచించవలసిన విషయం ఒకటి వుంది. ఆనాడు మనకు అసహ్యం వేసిన మాట నిజం. అందువల్ల మనం పగతీర్చు కోవాలని అనుకున్నాం కూడా. కాని ఆ ఆలోచనతోనే మనం ముందుకు సాగాలా? ఆ పోలీసులనూ, ఉద్యోగస్థులనూ ఉద్యోగాల నుంచి తొలగించాలా? వాళ్ళు క్రూరంగా ప్రవర్తించారని మనం అనుకోటంలో తప్పులేదు. అది మానవులకు సహజ లక్షణం. కాని ఆ విరోధాన్ని ఇంకా రెట్టించటమా అనేది ప్రశ్న. మనం మన ఉద్రేకాన్ని అదుపులో పెట్టుకోవాలి. మన వివేకం, మన వ్యవహారబుద్ధి మనకు తోడ్పడాలి. ఉద్రేకానికి లొంగిపోయి మనం పురోగమించటం భావ్యమా? నా వుద్దేశ్యం అది భావ్యం కాదని. రేపు కాంగ్రెసు ప్రభుత్వం రాబోతూ వుంది. తిరువితాంకూరులో శతాబ్దాల నుంచి ఉద్యోగస్థుల సంప్రదాయం ఒకటి ఏర్పడివుంది. వాళ్ళంతా యోగ్యులు, సమర్థులు, బుద్ధిమంతులు. రామయ్యన్‌దలవా నుంచి రాజ వేలుతంపి వరకూ వస్తున్న సంప్రదాయాన్ని ఒక్కసారి చూడండి. కాంగ్రెసుకు ఈనాడు ఈ ప్రపంచ జ్ఞానంగల పరిపాలనా దక్షుల సేవ లభించింది. వీళ్ళంతా దీవాన్‌జీ చండశాసనంలో ఆయన ఆజ్ఞలను పాలించారని వాళ్ళను వదలిపెట్టటం న్యాయమేనా? కాంగ్రెసు పరిపాలనలో ప్రజాతంత్ర నియమాలను ఉల్లంఘించి ఏకాధిపత్యాన్ని విశ్వసించే వాళ్ళు బయలు దేరారనుకోండి, ఈ ఉద్యోగస్థులు వాళ్ళను కూడా ఎదుర్కోవలసి వస్తుంది. అలా చెయ్యక తప్పదు. స్థిరమైన ప్రభుత్వాన్ని బలహీన పరచకూడదు. వాళ్ళ జవసత్వాలను నశింప జేయకూడదు. ప్రతి దేశానికి స్థిరత్వం ప్రసాదించేది ఆదేశంలోని పరిపాలన. ప్రజాతంత్రంలో ప్రభుత్వం మారుతూ వుంటుంది. కాని పరిపాలనా యంత్రాంగం స్థిరంగా వుండాలి.

నేను ఇంతగా చెప్పవలసివచ్చినందుకు కారణాలున్నాయి. మనం మన వుద్యోగస్థులను చూసి అసహ్యించు కోకూడదు. ఉరితీయించండి, జైల్లో పెట్టండి - అని వెనక మనం కేకలు వేశాం. కాని ఉద్రేకాతిశయం వల్ల అలా చేశాం. ఈనాడు కూడా అలాంటి నినాదాలు అక్కడక్కడా వినిపిస్తున్నాయి. అందుకు నాకు చాలా విచారంగా వుంది. ఏ వుద్యోగస్థుడికి కూడా ఉరిశిక్ష వెయ్యడం, వుద్యోగం నుంచి తొలగించటం మన వుద్దేశ్యం కాదు. వ్యవహార బుద్ధితో మనం ముందుకు సాగాలి - అని ఆయన అనగానే,

చాలా సేపు హర్ష ధ్వనులూ నినాదాలతో ఆకాశం మారుమ్రోగింది.

కేశవపిళ్ళె ప్రసన్న వదనంతో సభావేదికపై కూర్చుని వున్నాడు. ఫిలిప్సు, సెక్రటరీలు తలవంచుకుని కూర్చున్నారు.

## ఇరవై తొమ్మిది

చీఫ్ సెక్రటరీ టేబిలు మీద బంట్రోతు ఒక అచ్చు కాగితం తీసుకువచ్చి పెట్టాడు. అది ఒక పరిచయ పత్రం. కేశవపిళ్ళై దాని వైపు చూశాడు:

"దేవి జ్యోతిర్మయీ మాత". కేశవపిళ్ళై ఉలిక్కిపడ్డాడు. జ్యోతిర్మయీ దేవి తనని కలుసుకునేందుకు వచ్చింది.

ఇప్పుడు తను ఏం చెయ్యాలి అని చీఫ్ సెక్రటరీ ఒక్క క్షణం ఆలోచించాడు. ఇప్పుడు కలుసుకునేందుకు వీల్లేదని పంపించి వెయ్యటమా? లేకుంటే లోపలికి రమ్మని అనుమతించటమా? అతను చిక్కున పడ్డాడు. ఏదో దౌర్బల్యం, అసమర్థత! ఏమీ నిర్ణయించలేని నిర్వీర్య పరిస్థితి.

"దేవి జ్యోతిర్మయీ మాత!"

ఆమె ఎలా వుంటుంది అని కేశవపిళ్ళై ఒక్క క్షణం ఆలోచించాడు. ఆమె కళ్ళల్లో ఇప్పుడు కూడా అగ్ని కనిపిస్తుందా? ఆమె బుగ్గ ఇంకా సొట్టబోతుందా? ముఖంలో మైకం కమ్మించే మాదకత వుంటుందా? ఇవన్నీ కాషాయ వస్త్రంలో దాగివుంటాయేమో?

ఆమెను మళ్ళీ కలుసుకోవలసి వస్తుందని కేశవపిళ్ళై అనుకోలేదు. ఆమె కలుసుకునేందుకు వస్తుందని కేశవపిళ్ళైకు నమ్మకం లేదు. ఆ అధ్యాయం ఒక విధంగా ముగిసిపోయిందని అతను రూఢిపరుచు కున్నాడు. అందువల్ల అతని మనస్సు కుదుటపడింది కూడా. ఆమె ఎందుకు వచ్చి వుంటుంది? ప్రశాంతంగా వుండనియ్యదా యేం? సన్యాసం తీసుకున్న తర్వాత ఆమెకు సచివాలయం రావలసిన పని యేముంది?

ఆత్మజ్ఞానం లభించిన తర్వాత ఆ సన్యాసిని తనలో వచ్చిన మార్పును తెలియ పరచేందుకు వచ్చి వుంటుందేమో? అయినా కేశవపిళ్ళై ఆమె విశ్వరూపాన్ని చూసేశాడు. లేకుంటే మరోదారి లేక వచ్చిందేమో? ఇలా సచివాలయంలోకి వచ్చేందుకు ఆమెకు సిగ్గు లేదా? వెనకటి సంబంధాన్ని గుర్తు తెచ్చి అతన్ని అవమాన పరిచేందుకు ఎవరయినా ప్రేరేపిస్తే ఆ పన్నాగంలో ఇది ఒక భాగమేమోనని కూడా కేశవపిళ్ళై అనుమానించాడు.

తంకమ్మ చీఫ్ సెక్రెటరీని కలుసుకునేందుకు వచ్చింది - అనేది ఒకవార్తగా తయారవుతుంది. అందరికీ ఇది సంభాషణకు ఆధారమవుతుంది. వెనకటి సంబంధాన్ని గురించి తెలిసిన వాళ్ళు అలా అంటారు. తెలియని వాళ్ళు జాగ్రత్తగా వింటారు. ఆ తర్వాత వాళ్ళ వాళ్ల ఆలోచనలను బట్టి విరోధివర్గానికి నేరారోపణ చేసేందుకు ఒక విషయం చిక్కుతుంది.

బంట్రోతును పంపించి ఆమె రాకకు కారణమేమిటో కనుక్కుందామనుకున్నాడు కేశవపిళ్ళై. అధికార రీత్యా, ఆమె వచ్చిన వుద్దేశ్యం తెలుసు కోవటంలో. తప్పేముంది? ఇంతలో అతని అంతఃకరణ అలా చేయటం మంచిది కాదని ఉపదేశించింది. ఈ పదవిలో వుండి ఆమెను

గురించి ఆలోచించేందుకు ఏమీ ఆధారం లేదు. ఆమె తనని కలుసుకునేందుకు వచ్చిన వుద్దేశ్యం తెలుసుకున్న తర్వాత కలుసుకుంటానని చెప్పటం బాగుంటుందా? ఆమె కేవలం పరాయి ఆడదా? జీవితంలో తను ఆమెను మరిచి పోగలడా? ఆమె మీద తనకు అనురాగం లేదని చెప్పేందుకు వీల్లేదు. అది విచారించవలసిన విషయం. ఆ రోజులు కేశవపిళ్ళై స్మృతి పటలం మీద ప్రతిబింబించాయి. రకరకాల అనుభవాలు!

ఆమెను ఎలా కలుసుకోవటం? ఆమెను ఏమని పిలవాలి? మాతా అనా? వీల్లేదు, అలా పిలవటం సాధ్యం కాదు. తంకమ్మా అనిపిలవగలనా? ఈనాడు ఆమె వెనకటి తంకమ్మేనా? ఆమెతో ఎలా ప్రవర్తించాలి? ఇలాంటి పరిస్థితి జీవితంలో ఎదురవుతుందని అతను ఊహించలేదు.

బంట్రోతు ఛీఫ్ సెక్రెటరీ ఆజ్ఞకోసం నిలబడి వున్నాడు. ఆ బంట్రోతు ధన్యానందస్వామి భక్తుడిలాగా కనిపిస్తున్నాడు. "కొంచెం సేపాగి" అన్నాడు కేశవపిళ్ళై.

"చిత్తం"

బంట్రోతు ఆ విషయం చెప్పేందుకు వెళ్ళిపోయాడు.

అలా ఎందుకు చెప్పి పంపించానా? అని అనుకున్నాడు కేశవపిళ్ళై. ఆమె కనిపెట్టుకొని వుండటం ఎందుకు? ఇది భావ్యమేనా?

కేశవపిళ్ళై బంట్రోతును మళ్ళీ పిలిచి అన్నాడు: "ఏమీ చెప్పకు". కాని లోపలికి రమ్మని ఉత్తర్వు కూడా ఇవ్వలేదు. బంట్రోతు అలాగే కాచుకొని వున్నాడు. అతను బహుశా ఛీఫ్ సెక్రెటరీలోని కంగారును - అవును, కంగారును-గమనించి వుంటాడు.

ఎందుకు నేనిలా కంగారు పడుతున్నాను? ఇప్పుడు కలుసుకునేందుకు వీల్లేదనన్నా చెప్పాలి. లేకుంటే లోపలికి రావచ్చునని అనుమతించాలి. కలుసుకునేందుకు వీల్లేదని చెప్పేందుకు మనస్సు అనుమతించటం లేదు. కలుసుకునేందుకు అనుమతించే సామర్థ్యం కూడా లేదు. ఈ దౌర్బల్యానికి కారణమేమిటో తెలియటం లేదు.

అప్పుడు మరో ప్రశ్న బయలుదేరింది. ఈ పరిస్థితికి కారణం ఎవరు? ఆమేనా? 'అవును' అని నిరూపించాలని కేశవపిళ్ళైకు వుంది. తను కాత్యాయనిని తనలో తాను తర్కించుకున్నాడు. అతను పెండ్లి చేసుకోకపోతే యింతకంటె ఎక్కువ ప్రమాదం జరిగేది. ఆమె శీలాన్ని పూర్తిగా పరిశీలిస్తేనేకదా ఆమెలో తప్పు తెలిసేది. కాని తన తప్పు లేదని తలపోసే సామర్థ్యం కూడా కేశవపిళ్ళైలో లేదు.

"వీడి తస్సదియ్యా! ఈ బంట్రోతుకు అన్నీ తెలుసు,

రమ్మని చెప్పు అని ఉత్తర్వు చేశాడు కేశవపిళ్ళై.

కేశవపిళ్ళె కుర్చీలో కుదురుగా కూర్చున్నాడు. గోడవైపు తదేక దృష్టితో చూస్తున్నాడు. ఆలోచనల్లోని అంతర్యుద్ధాన్ని దాచుకునేందుకు. అది కేవలం నెపం మాత్రమే. ఆ ప్రయత్నంలో అతను పూర్తిగా నెగ్గినట్టే అనిపించింది.

ఆమె జుట్టు ఇంకా దట్టంగానే వుంది. ఒకటి రెండు చోట్ల తెల్లబారిందేమో! అంతకు మించి ఆమె ముఖంలో ఎక్కువ మార్పు రాలేదు. చీరె, రవిక కాషాయ రంగులో వున్నాయి. చేతులకి మెడలోనూ సొమ్ములేమీ లేవు.

కేశవపిళ్ళె ఒక కుర్చీ చూపించి కూర్చోమన్నాడు. దేవి జ్యోతిర్మయి మాత కూర్చున్నది. కేశవపిళ్ళె ముఖం నిర్వికారంగా వుంది. మాటలు లేకుండా కొన్ని క్షణాలు గడిచాయి.

జ్యోతిర్మయి మాతలో కంగారు లేదు. కాని పరిచయం లేని వ్యక్తి యెదుట కూర్చున్న భావం కూడా కనిపించలేదు. ఒక ఆఫీసరును కలుసుకునేందుకు వచ్చిన వ్యక్తి తానే సంభాషణ ఆరంభించాలి గదా? "ఎందుకు వచ్చారు?" అని అధికారి అడగాలా? అవసరం వుండి వచ్చిన వాళ్ళే సంభాషణ ఆరంభించాలి గదా? కాని జ్యోతిర్మయి మాత కూర్చున్న వాలకం చూస్తే కేశవపిళ్ళే అడగాలనే భావం స్ఫురిస్తున్నది.

కేశవపిళ్ళె గోడవైపు ఎంత సేపో చూడలేక పోయాడు. అనుమతి పొంది వచ్చిన అభ్యర్థి మౌనంగా కూర్చుంటే "ఎందుకు వచ్చారు?" అని అడగవచ్చు. అలా అడగాలి కూడాను. కాని అలా ప్రశ్నించేందుకు కేశవపిళ్ళెకు ధైర్యం లేదు. ఆయన కాగితం మీద కలంతో ఏదో రాస్తున్నాడు. అతని మనస్సులో ఏదో వుంది. అది ఆమే ఆరంభించాలి.

జ్యోతిర్మయి మాత ఆ మౌనాన్ని భంగం చేస్తూ అన్నది: "నేను ఆశ్రమం పనిమీద వచ్చాను."

కేశవపిళ్ళె తలయెత్తి చూశాడు. అతను దీర్ఘంగా నిశ్వసించాడు. అతనేదో మాట్లాడాలి. సంభాషణకు అది సరియైన సన్నివేశం.

జ్యోతిర్మయి మాత మళ్ళీ అన్నది: "కరకులంలో కొంత భూమి ఆశ్రమం కోసం రిజిష్టరు చెయ్యాలి. అక్కడ ఆశ్రమం స్థాపించాలి. ఖర్చులు లేకుండా రిజిష్టరు చేయగలిగితే బాగుంటుంది."

కేశవపిళ్ళె కొంచెం కష్టం మీదట ఉన్నతాధికారిగా ముఖం పెట్టి అన్నాడు: "నియమానుసారం అర్జీ వస్తే దాన్ని గురించి ఆలోచిస్తాను."

ఆ మాట అనగానే తన ముఖం ముడుచుకుపోయినట్టు అనిపించింది కేశవపిళ్ళెకు. అతనిలోని కంగారు బయటికే కనిపిస్తూ వుంది. అతనికి కొంచెం సిగ్గు వేసింది. అలా ప్రవర్తించి వుండ కూడదు. మరియెలా ప్రవర్తించాలి? తెలియదు. కాని అదే స్థితిలో స్థిరంగా వుండాలని నిర్ణయించుకున్నాడు. తన వుద్యోగధర్మాన్ని మార్చుకో కూడదను కున్నాడు.

జ్యోతిర్మయి మాత కొంచెం దరహాసం చేసింది. తన వుద్యేగపు ఠీవి అంతా నీటి బుడగలాగా చితికిపోయినట్టు కేశవపిళ్ళెకు అనిపించింది. అయిన నష్టాన్ని తిరిగి పూడ్చుకోవాలి. కోల్పోయిన దాన్ని మరల పొందాలి.

జ్యోతిర్మయి మాత అన్నది: "నియమ మేమిటో నాకు తెలుసు, అలాగే అర్జీ పంపించటం జరుగుతుంది".

వెంటనే 'అలాగే, దానిమీద ఆ విషయం ఆలోచిస్తాను' అని కేశవపిళ్ళె చెప్పవలసింది. అలా చెప్పేందుకు కేశవపిళ్ళె ప్రయత్నించాడు. కాని అతనికి సిగ్గువేసింది. అలా చెప్తే ఆమె విరగబడి నవ్వుతుంది. ఆమె నిజంగా నవ్వకపోయినా నవ్వినట్టు ఆ ధ్వని అతని చెవుల్లో మారుమ్రోగింది.

చీఫ్ సెక్రటరీ తనకు ఏం పని చేసి పెట్టాలో జ్యోతిర్మయి మాత చెప్పలేదు. "అప్పుడు దాన్ని గురించి ఆలోచిస్తాను" అని కేశవపిళ్ళె అననూ లేదు. అలా యిద్దరిలో ఎవరయినా ఒకరు అని వుంటే బహుశా ఆ విషయం అంతటితో ముగిసేది. ఇప్పుడా సంగతి అంతరిక్షంలో వ్రేలాడుతూ వుంది. జ్యోతిర్మయిమాత యింకా ఏమో చెప్పబోతూ వున్నట్టుంది.

"కేవలం హిందువులకే కాదు, అందరి ఆత్మోన్నతి కోసం ఈ ఆశ్రమం ఏర్పడుతూ వుంది" అన్నదామె.

"అవునవును. ఆత్మోన్నతికోసమే. దాన్ని గురించి నేను చాలా వరకూ విన్నాను." అన్నాడు కేశవపిళ్ళె అనుకోకుండా పరిహాస ధోరణిలో.

"ఎందుకలా అంటున్నారు?" అడిగింది జ్యోతిర్మయి మాత.

"నేనంతా విన్నాను" అన్నాడు కేశవపిళ్ళె గట్టిగా.

"మీరోసారి వచ్చి ఆశ్రమం చూడాలి. అక్కడి అనుష్ఠానంలో ఒకరోజు పాల్గొంటే మీకు అర్ధమవుతుంది. ఇతరులు అసూయతో చెప్పిన విషయాలను నమ్మకండి."

కేశవపిళ్ళెకు చెప్పేందుకు సంగతులు దొరికాయి: "నా చేత ప్రాయశ్చిత్తం చేయించి ఆశ్రమవాసుల్లో కలుపుకోవాలని చూస్తున్నావా?"

"లేదు. ఆశ్రమంలో శిష్యునిగానే భక్తునిగానే చేర్చుకునేందుకు రాలేదు. ఒక సత్కార్యానికి సాయం చేయమని కోరేందుకు వచ్చాను. అది మంచి కార్యమని తెలుసుకునేందుకు ఒక మార్గం సూచించాను. అంతే". అన్నది జ్యోతిర్మయి మాత.

కేశవపిళ్ళె కొంచెం జుగుప్సాకరంగా నవ్వుతూ అన్నాడు: "ఆ యింటికి మంచి ముహూర్తంలో శంకు స్థాపన జరగలేదు. అందువల్లనే యిలాంటి వన్నీ జరుగుతున్నాయి."

ఆ తర్వాత కొంచెం ఠీవిగా అన్నాడు: "ఆ యిల్లు నేను నీ స్వైరవిహారం కోసరం కట్టిఇయ్యలేదు. ఆ ముసలమ్మ కోసం అంటే మీ అమ్మకోసం ఏర్పడిందది. ఆమె అక్కడి నుంచి వెళ్ళి పోయింది. ఇక ముందు ప్రభుత్వపు

భూమి కూడా నీకూ, నీలాంటి దారి తప్పిన స్వైరవిహారుల కోసరమూ ఇయ్యమంటావా?"

కేశవపిళ్ళై అలాంటి భావంతో అలాంటి మాటలు మాట్లాడతాడని జ్యోతిర్మయీ మాత అనుకోలేదు. అతను ఇలా నిర్మోహమాటంగా అడుగుతాడని ఆమె ఊహించను కూడా లేదు. జ్యోతిర్మయీ మాత నేరుగా వెళ్ళి చీఫ్ సెక్రెటరీని అడిగితే ఆయన కాదనడని ఆశ్రమవాసుల నమ్మకం. వెనకటి వృత్తాంతం తెలియని వాళ్ళెవరున్నారు? జ్యోతిర్మయీ మాతకు కూడా నమ్మకమే. ఆ వ్యక్తి తంకమ్మకు ఎంతో బాగా తెలుసు. కేశవపిళ్ళైలో ఇంత వైరాగ్య భావం తంకమ్మ ఎప్పుడూ చూడలేదు. తనని బయటికి గెంటి వేసినప్పుడు, తప్పుచేసినప్పుడు, అసహ్యించుకున్నప్పుడు, అవమానపరచి నప్పుడు-ఎలాంటి పరిస్థితుల్లో కూడా అతను ఇలా యెందుకు ప్రశ్నించలేదు? ఈనాడు ఆ తంకమ్మ మరో రూపంలో వచ్చింది. ఈ మార్పును ఎలా నమ్మటం? ఒక్కక్షణం జ్యోతిర్మయీ మాతకు సమాధానం స్ఫురించ లేదు.

కేశవపిళ్ళై జ్యోతిర్మయి ముఖంవైపు దృష్టిని ప్రసరింపజేసి అడిగాడు: "నీ పేరిట యిల్లున్నంత మాత్రాన అది కేవలం నీదే అనుకుంటున్నావా?"

జ్యోతిర్మయీ మాతకు ఏమీ సమాధానం స్ఫురించినట్టు లేదు. బహుశా ఆమెకు ఆ ప్రశ్న కూడా అర్థమయి వుండక పోవచ్చు.

"ఆ యిల్లు నేను మీ తల్లి కోసరం కట్టించాను."

"అమ్మ అక్కడినుంచి వెళ్ళి పోయింది. నేను వెళ్ళ గొట్టలేదు. వెళ్ళమని చెప్పనూ లేదు". అన్నది జ్యోతిర్మయీ మాత దానికి సమాధానంగా.

"అవును, ఆమె అక్కడెలా వుంటుంది? సహించ లేక వెళ్ళి పోయింది. సరే, అది అలా ఉండనీ. ఆ యింటిని నీవు ఎవరినడిగి ఆశ్రమంగా మార్చావు?"

"నా...నా... ఆత్మగతి కోసం."

"అలాగా? నీవు ఎలాంటి ఆత్మగతిని పొందుతున్నావే, నేనూ చూశాను. ఆ రోజు చూసిన యువకుడేగా నీకు ఆత్మగతిని ప్రసాదిస్తున్నది?"

జ్యోతిర్మయి కేశవపిళ్ళైను జాగ్రత్తగా చూసింది. కేశవపిళ్ళై అలా మాట్లాడటం ఆమె యెప్పుడూ వినలేదు. బహుశా అందుకే ఆమె కేశవపిళ్ళైను అంత జాగ్రత్తగా చూస్తూ వున్నది. జ్యోతిర్మయీ మాతకు బహుశా అనుమానం వేస్తూ వుండవచ్చు - తన ఎదుట వున్నవ్యక్తి ఒకానొకప్పుడు తన ప్రియుడయిన కేశవపిళ్ళైనా అని. కేశవపిళ్ళైకు ఎప్పుడూ కోపం వచ్చేది కాదు. అంత గాంభీర్యం కూడా వుండేది కాదు. అధికారాన్ని గురించి అతనికి బొత్తిగా ఏమీ తెలియదు. బెదిరించటమంటే ఏమిటో తెలియని వ్యక్తి. అన్నింటినీ సహించే అమాయకుడు!

జ్యోతిర్మయి బుజాలు తడుము కుంది.

కేశవపిళ్ళె ఆగలేదు. కొంచెం మందర స్వరంలో అతనడిగాడు: "ఆ సన్యాసి నీకు గురువు కదా? అతన్ని కలునుకున్నంత మాత్రాన నీ ఆత్మతృప్తి పడిందా?"

జ్యోతిర్మయి వినుక్కుంటూ అన్నది: "ఏమిటి మీరనేది?"

కేశవపిళ్ళె క్రూర సంతుష్టితో పళ్ళు కొరుకుతూ అన్నాడు: "అదే, అదే అంటున్నాను. నీవు తృప్తి పడ్డావా అని"

"ఒరి పాపిష్టి!"

జ్యోతిర్మయి రెండు చెవులూ మూసుకొని అన్నది: "నేనిక్కడికి వచ్చి వుండగూడదు".

కేశవపిళ్ళె క్రూర సంతృప్తితో అన్నాడు: "అవును, నిజమే. నీవు ఇక్కడికి వచ్చి వుండగూడదు-నీ రహస్యమంతా తెలిసిన ఒక వ్యక్తి దగ్గరికి! నీది పొరపాటే!"

దేవి జ్యోతిర్మయీ మాత సహించలేక పోయింది. ఆత్మ సంయమనం పూర్తిగా కోల్పోయి అన్నది: "మీరే కదా నన్ను చెడగొట్టింది? నన్ను చెడగొట్టింది మీరొక్కరే".

కేశవపిళ్ళె ఆమె మాటను తృణీకరిస్తూ అన్నాడు: "అలాగా? అదా సంగతి?"

"కాదా? కొంచెం జ్ఞాపకం చేసుకోండి."

"నేను కూడా అదే అంటున్నాను మాతాజీ!"

"మీరే నన్ను చెడగొట్టారు. నా వల్లనే మీరు ఉద్యోగంలో పైకి వచ్చారు."

"అలాగే అను. నూరు సార్లను. అయితే?"

"మీరు కృతఘ్నులు."

"అయితే"

"మీరు నన్ను చెడగొట్టారు."

హీన స్వరంతో కేశవపిళ్ళె యికిలించాడు. ఆ మాట నూరు సార్లు అను - అని మళ్ళీ అన్నాడతను. మొహం బిగించి అతనడిగాడు: "నన్ను చెడగొట్టారు, చెడగొట్టారు అని అనటమేకాని ఎప్పుడు ఎలా చెడగొట్టానో చెప్పగలవా?"

"మీరీ కుర్చీ మీద ఎలా కూర్చోగలిగారో, కొంచెం ఆలోచించండి."

"అదా! అది నీవల్ల జరగలేదు. మీ తండ్రివల్ల. మీ అమ్మవల్ల. వాళ్ళకు నేను కృతజ్ఞుణ్ణి. వాళ్ళపట్ల నేను నా విధిని నిర్వర్తించాను. ఆ యిల్లాలు ఇప్పుడు కూడా కష్టం లేకుండా జీవితం గడుపుతూవుంది. ఆమెను నేను అవసాన దశవరకూ పోషిస్తాను."

కేశవపిళ్ళెకు ఇంకా తృప్తిగా వున్నట్టు లేదు. ఇంకా చాలా విషయాలు అడగాలి. అది సహజమే. వెనక ఒకసారి అతనామెను ముద్దు పెట్టుకున్నాడు. అందుకోసం ఆమె రాత్రిళ్ళు నిద్రకాచి వేచివుండేది. ఇవన్నీ జీవితంలో వ్యర్థంగా పోవు. అవి వాటి ఆధిపత్యాన్ని నిలబెట్టుకుంటాయి. ఆమె కూడా వాటికి జవాబు చెప్పి తీరాలి.

కేశవపిళ్ళె ప్రశ్నలకు సమాధానం చెప్పేందుకు జ్యోతిర్మయికి నాలుగయిదు నిమిషాలు పట్టింది.

"మా...... మా....... నాన్న మీకు ఉద్యోగం ఇప్పించారు. ఎందుకు? నేను మిమ్మల్ని ప్రేమించాను గనక."

"ప్రేమించావా? ఏమన్నా పిచ్చి పట్టిందా?" అన్నాడు కేశవపిళ్ళె.

"అవును, ప్రేమించాను" అనేంత ధైర్యం జ్యోతిర్మయికి లేదు. ఆమె తదేక దృష్టితో చూస్తున్నది. రెప్పవాలిస్తే కన్నీళ్ళు బొటబొట కారేట్టున్నాయి.

"నీకు ఏడవటం కూడా తెలుసా?"

కాషాయ వస్త్రపు కొంగుతో జ్యోతిర్మయి కళ్ళు తుడుచుకుంది. అయినా ఆమె 'నీవు నన్ను చెడగొట్టావు' అన్న మాటను- అంటి పట్టుకునే వుంది. 'ఎలాగా?' అని అడిగాడు కేశవపిళ్ళె. "నీఅంతట నీవే చెడిపోయినానుఅను సరిపోతుంది. నేను నిన్ను చెడగొట్టానని అనకు. లేకుంటే ఎలా జరిగిందో స్పష్టంగా చెప్పు".

"నేను చెప్పవలసిందేమీ లేదు."

"అయితే సరే. కాని నీవు, నీ స్వాములవారు, ఆయన అనుచరులు అందరూ యీ కాషాయ వస్త్రాలను ఎందుకు అపవిత్రం చేస్తున్నారు? లేకుంటే నేను ఇన్ని మాటలు అనే వాణ్ణికాను. మనుష్యుడు తన యిష్టప్రకారం ఎన్ని రకాల జీవితాలనయినా గడపవచ్చు. అది అలా వుంచు. కాని నీవు భవిష్యత్తును గురించి ఆలోచించావా? ఏ వుద్దేశ్యంతో నీవీ కాషాయగుడ్డలు కట్టుకున్నావు? నీవు నీ సర్వస్వం అర్పించావా?"

జ్యోతిర్మయి ఏమీ మాట్లాడలేదు. శిలా విగ్రహంలాగా కూర్చుని వుంది. కేశవపిళ్ళెకు ఇలా కఠోరంగా మాట్లాడటం వినోదంగా వుంది. ఎంత చెప్పినా చెప్పినట్టు లేదు. ఆమె మనస్సుకు బాధకలిగినా అంతా చెప్పినట్టు అనిపించటం లేదు. అతనికి చాలా తృప్తిగా మాత్రం వుంది. వినోదంగా వుంది. విచారంగా వుంది.

కేశవపిళ్ళె మళ్ళీ అడిగాడు. జ్యోతిర్మయి మీద అనురాగంతో అడిగినట్టు వుంది ఆ ప్రశ్న ధోరణి: "నిజం చెప్పు. నీకు సవతుల మీద అసూయగా లేదా?"

జ్యోతిర్మయికి ఆ వాక్యం పూర్తిగా అర్థమయినట్టు లేదు. ఆ ప్రశ్న మళ్ళీ అడగండని అన్నట్టుగా ఆమె కేశవపిళ్ళె వైపు చూచింది.

అన్నీ తెలిసినట్లు కేశవపిళ్ళై సానుభూతితో ఆ విషయం విశదీకరించాడు.

"నీతో రాజీనామా చేసిన వాళ్ళు, చెయ్యనివాళ్ళు మరి కొందరు సన్న్యాసినులున్నారుగదా? మీలో మీరు తగూలాడుకోరా? మీలో మీకు అసూయ వుండదా?"

"నేను మాతను. అందరూ నా కిందివాళ్ళే" అని సమాధానం చెప్పింది జ్యోతిర్మయి.

"అవును, అందుకనే అడుగుతున్నాను. తగాదా జరుగుతూ వుంటుందా లేదా అని. రాజీనామా చేసిన ఆమె నీకంటె పై వుద్యోగస్థురాలుగదా? వాళ్ళంతా నిన్ను మాతాజీగా ఒప్పుకుంటారా?"

"అదంతా తెలిసే నేను మాతనయినాను, వాళ్ళకు కాషాయ బట్టలు ఇవ్వలేదు. వాళ్ళు నన్నేమీ చెయ్యలేరు." అని తేల్చి చెప్పింది జ్యోతిర్మయి.

"అయినా నీవు మాతవయినావని వాళ్ళకు మనస్సులో కోపంగా వుండదూ? అది సహజమేగా?"

"కావచ్చు. కాని నేను మాతను" అన్నది జ్యోతిర్మయి ఏదో మాయాజాలంలో చిక్కుకుని పోయినట్లు.

కేశవపిళ్ళై పారుష్యం మానేశాడు. ఆమె మంచి కోసం నిర్మోహమాటంగా అడగవలసింది అడిగి అతను సానుభూతిని చూపించాడు. ఆ తర్వాత ఆమె ఉన్న విషయం అంతా చెప్పేస్తుంది. పాపం! ఒట్టి అమాయకురాలు.

"నేను నీతో కొంచెం కటువుగా మాట్లాడానేమో? నీకలా అనిపించిందా?" అన్నాడు కేశవపిళ్ళై మూడునాలుగు నిమిషాల తర్వాత.

జ్యోతిర్మయి ఏమీ మాట్లాడలేదు. ఆమె తలవంచుకుని చేతి బొటనవేలితో ఆ చేతి గోటినే గిల్లుకుంటూ వున్నది. ఆమె యేడ్చేందుకు సిద్ధంగా వుందని కేశవపిళ్ళైకు అనుమానంగా వుంది. అతనన్నాడు: "నిన్ను అడిగేందుకు, బెదిరించేందుకు నాకు అధికారం వుందనుకునే నేనివన్నీ అడిగాను. బెదిరించట మేమిటి? దాని ఫలితం కూడా అనుభవానికి వస్తూవుంది. నీ భాగ్యరేఖను గుర్తు తెచ్చుకుంటే నీ మీద జాలి వేస్తూవుంది.

"అందరూ నన్ను మోసం చేశారు."

ఆకాశవాణిలాగా ఆ మాటలు కేశవపిళ్ళై చెవిలో మారుమోగాయి. దానికి సమాధానం అతని అంతస్సు నుండి కంఠందాకా వచ్చింది. కాని అతను దానిని లోపలనే ఇముడ్చుకున్నాడు. బయటికి రాలేదు. "నీ వందరినీ మోసం చేశావు" అని అతని సమాధానం.

కేశవపిళ్ళై బయటికన్నాడు: "అవునవును, అందరూ నిన్ను మోసం చేశారు."

"ప్రేమ అనేది నాకు ఎక్కడా దొరకలేదు."

దానికి సమాధానం అణచుకోలేకపోయాడు. అప్పుడు నటిస్తున్న భావాన్ని మార్చే సమాధానమది. అందులో సందేహం లేదు. అయినా కేశవపిళ్ళై అన్నాడు: "అవునవును. నీవు ప్రేమను వెతుక్కుంటూ తిరిగావు. పోనీలే, అదంతా ఇప్పుడెందుకులే."

ఆ తర్వాత మళ్ళీ అతనన్నాడు: "వున్నదున్నట్టు చెప్పు. నా దగ్గర దాపరికమేమీ వద్దు. ఈనాడు నిన్ను ప్రపంచం తల్లిగా భావిస్తున్నది. బాగుంది. నీకు గౌరవం కూడా వుంది. దివ్యత్వమూ వుండవచ్చు. బహుశా ముందు ముందు ప్రపంచానికి మేలు కూడా చేయవచ్చు. నీవు అవలంబించిన జీవితానికి లక్ష్యం చాలా గొప్పది. అదంతా నాకు తెలుసు. కాని నాలాగా మరెవ్వరికీ నీరహస్యం తెలియదనుకో. ఈ కాషాయ బట్టలతో నన్ను నీవు మోసం చెయ్యలేవు. ఈ కాషాయం వెనకవున్న తంకమ్మ నాకు తెలుసు. దేవి జ్యోతిర్మయీ మాతతో ఇలా ఎవ్వరూ మాట్లాడలేరు. ఎవరికయినా అంత ధైర్యం ఉంటుందని నేననుకోను. ఆ నమ్మకంతోనే నేనడుగుతున్నాను. అసలు యధార్థం నాకు కావాలి. నీవు దాపరికం లేకుండా చెప్తావా?"

"ఏం తెలుసు కోవాలి?" అన్నది జ్యోతిర్మయి తలయెత్తి.

జ్యోతిర్మయీ మాత కళ్ళల్లో నిప్పులు చెలరేగుతున్నట్టు అనిపించింది కేశవపిళ్ళైకు. "అంతా కర్మ" అన్నదామె.

ఆ వాక్యంలో, వాగ్వైఖరిలో బాధ, నైరాశ్యం కనిపిస్తూ వుంది - అవును, కొట్టి పచ్చినట్టు కనిపిస్తూ వుంది. ఆమె అన్నదానికి సారాంశం ఏమిటి? ఈ కాషాయ బట్టలు కట్టుకోవటం కర్మ. కేశవపిళ్ళైకు ఆశ్చర్యం వేయలేదు.

"ఇల్లు-వాకిలి, ఉద్యోగం-సద్యోగం వదిలి యీ వేషం వేసుకునే ముందు బాగా ఆలోచించుకునే యీ పని చేశావా?" అన్నాడతను.

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పేందుకు జ్యోతిర్మయి ఏమీ తికమక పడలేదు.

"ఏదో వుద్యోగం చేసుకుంటూ, నెలజీతం తీసుకుంటూ, దిట్టంగా తినితిరుగుతూ, సొమ్ములు పెట్టుకుని రోజులూ, వారాలూ, నెలలూ గడుపుతున్నందువల్ల లాభమేముంది? ఇలాకూడా బతకచ్చు. ఇదే చాలు. ఏదో ఒకరోజు రాలిపోతాను. ఆ జీవితానికి విలువేముంది?"

కేశవపిళ్ళై ఒక్క క్షణం ఉక్కిరి బిక్కిరయ్యాడు. జీవితం నిష్ప్రయోజనం అని చెప్పేందుకు జ్యోతిర్మయి ఇంకా ఏమేమో చెప్పబోతూ వుంది.

"నాకూ ఒక ఇల్లుంది జీతం వస్తుంది. డబ్బుంది. వీటితో ఏం లాభం?" ఆమె అతన్ని ప్రశ్నిస్తున్నది.

"అయితే నీవు జీవితం నిరుపయోగకరమని కాషాయ బట్టలు వేసుకున్నావన్న మాట!"

జ్యోతిర్మయి దీనికి ఎదురు ప్రశ్న వేసింది:

"జీవితం నిరుపయోగకరమే అయింది కదా?"

కేశవపిళ్ళై దానికి సమాధానం చెప్పకుండా మరో ప్రశ్న వేశాడు: "నాకు నీ సంగతి తెలుసు. బాగా తెలుసు. నీ సంగతి నీవే మరిచిపోయే వెర్రిదానివి. నిజం చెప్తాను. నేనెందుకు అడుగుతున్నానో నీకు అర్థమయి వుంటుంది. ఆ వెర్రితనంలో కొట్టుకొని పోయి చివరకు ఎక్కడికి చేరుకున్నావో తెలియకుండా పోయింది. ఇలా ఒక స్త్రీ జీవితం వ్యర్థమయి పోయిందంటే నాకుదాని అర్థం బోధపడటం లేదు. నీకు నష్టమయింది యేమిటని నీవనుకుంటున్నావ్?"

ఆ ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పలేదు జ్యోతిర్మయి. బహుశా ఆ ప్రశ్న ఆమెకు బోధపడి వుండదు. బోధపడ్డా సమాధానం తట్టివుండదు. జ్యోతిర్మయి అన్నది: "నా కోసం శేఖర విలాస్ కట్టించి యిచ్చారు. అరమర లేకుండా నా పేర రాసేశారు. అది మంచి యిల్లు. అంత మంచి యిల్లు వుంటే ఎవరికయినా ఆనందంగా వుంటుంది. అది మంచి ఆస్తి అనటంలో సందేహంలేదు. కాని మీకు గుర్తుంటుంది – అందువల్ల నాకెక్కువ సంతోషం కాని ఉల్లాసం కాని కలగలేదు. ఆ యింటిని గురించిన ప్రణాళిక వేసిన రోజు మీకు గుర్తు వుండుంటుంది. నా అభిప్రాయం అడిగారు. నేనేమన్నా అన్నానా? అందువల్ల నాకు ఎక్కువ ఆనందమూ కలగలేదు. అది వున్నా లేకున్నా నాకు ఒకటే. అది మాత్రం నిజం. నేను వూరికే అనటం లేదు. కాని యెవ్వరూ నమ్మరు."

ఊపిరి తీసుకునేందుకు కాసేపు ఆగి జ్యోతిర్మయి మళ్ళీ అన్నది: "ఆ పరిస్థితిని జీవితంలో సహించలేక పోయాను. నా మీద నాకే అసహ్యం వేసింది. ఉదయం లేవటం తయారవటం, ఆఫీసుకు వెళ్ళటం, తిరిగి రావటం. ఆ తర్వాత మీరు కూడా వచ్చివెళితే అంతటితో కార్యక్రమం ముగిసినట్టు. ఆ తర్వాత నిద్రపోవటం. నిద్ర పోవటం కూడా ఒక పనే. అప్పుడు నా కనిపించేది – ఇలా జీవించినందువల్ల లాభమేమిటని. నిజం చెప్పాలంటే చనిపోవాలని నేను చాలాసార్లు ప్రయత్నించాను."

కేశవపిళ్ళై ఆమె మాటలను శ్రద్ధగా విన్నాడు. అదంతా నిజమే. అప్పుడామె నిర్లిప్తంగా వుంది. మొహం మీద నవ్వులేదు. ఆమెలో స్త్రీత్వం కనిపించలేదు. ఆరోజుల్లో ఆమె ఆవలిస్తూ తన కోసం ఎదురుచూస్తూ వుండటం కేశవపిళ్ళై గుర్తు తెచ్చుకున్నాడు. మరోపని పూర్తి చేసినట్టు వుండేది ఆమెకు. ఆ సంభాషణ చాలా విషయాలను బయటికి లాగుతూవుంది. అందులో చాలా విషయాలు చాలామందికి తెలియవు. కేశవపిళ్ళైకు కూడా తెలియవు. ఆమెది భగ్న జీవితం. ఆమెకు ఉల్లాసం కలిగించేది జీవితంలో ఏమీ లేదు. ఆమెను గిలిగింతలతో నవ్వించిన వాళ్ళెవ్వరూ లేరు. ఆమెను నవ్వించాలని ఎవరూ అనుకోలేదు. అలాంటి

కోరికే యెవరికీ లేదు. ఆమె కేవలం అంతులేని విషయవాంఛల నిలయం. అది కదిలితే కట్టలు తెగిపోతాయి. ఎల్లలు దాటుతాయి. దానికి తృప్తి అవసరం. కాని ఆమె తృప్తి గురించి ప్రపంచంలో ఎవరికీ పట్టలేదు. అలాంటి పరిస్థితిలో ఆ స్త్రీ ఆత్మహత్య చేసుకునేందుకు ప్రయత్నించటంలో ఆశ్చర్యం లేదు. అది సహజం. పాపం! ఆమెను నిర్మించిన మట్టిలో ఇంత వికారాన్ని ఎందుకు కూరినట్టు!

నిజమైన జాలితో కేశవపిళ్ళై అడిగాడు: "తంకమ్మా! నీ వెప్పుడైనా ఒక శిశువును కందామనుకున్నావా? నీ కడుపున సంతానం కలగాలి - అనే కోరిక నీకెప్పుడయినా కలిగిందా?"

"అది నాకు ప్రాప్తం లేదు - అది దైవ నిర్ణయం."

కేశవపిళ్ళై ఆ తర్వాత మరో ప్రశ్న అడిగాడు. దానికి జ్యోతిర్మయి చలించలేదు. ఆమెలో ఏ విధమైన వికారం, ఉపద్రవం, దుమారం రాలేదు.

"అయితే మరి నిన్ను ఆ పరిస్థితి నుంచి రక్షించిన వాడు ఆనాడు నేను చూసిన ఆ యువకుడేనా? అతని పేరేమిటి? చిదానందా?"

జ్యోతిర్మయి జంకు లేకుండా సమాధానం చెప్పింది: "అవును. అతను నా జీవిత యాత్రను మరో దిక్కుకు మరలించాడు. మరో మార్గం లేక ఆ ప్రపంచంలో ప్రవేశించాను. అతను నన్ను ప్రవేశ పెట్టాడు."

"ఈ నూతన జీవితంలో నీకు తృప్తి ఎలా లభిస్తుందో నీవు గమనించావా?" అన్నాడు కేశవపిళ్ళై.

తంకమ్మ యీ విషయాలను గురించి ఇంతకు ముందే ఆలోచించినట్టుంది. అందువల్లనే ఆమె వెంట వెంటనే సమాధానం చెప్పగలిగింది.

"నేను భగవన్నామస్మరణం చేసుకుంటాను. నాలాంటి దిక్కులేని వాళ్ళు నాకు తోడవుతారు. దిక్కులేని ఆడవాళ్ళకూ, పిల్లలకూ ఆశ్రయమిస్తాను. ఇలాంటి పనులే చేస్తాను. ఈ జీవితాన్ని మరో విధంగా సార్థకం చేసుకోలేనని నాకు తోచింది."

"అయితే .... మరి .... ఒక ప్రశ్న సూటిగా అడగనా? నీవేమీ అనుకోవు గదా?"

"లేదు. ఏమయినా అడగండి."

అడగదలచుకున్న ప్రశ్న ఎలా అడగటం అని కేశవపిళ్ళై తికమక పడుతున్నాడు. ఆ ప్రశ్నకోసం జ్యోతిర్మయి ఎదురు చూస్తూ వుంది. కేశవపిళ్ళై అడగదలుచుకుంది యేమిటో జ్యోతిర్మయికి తెలుసు. ఆమె కేశవపిళ్ళై అవస్థ గమనించింది. "నేనే చెప్పనా? నాకు తెలుసు - మీరేమి అడగాలను కుంటున్నారో. నేను దాపరికం లేకుండా చెప్పేస్తాను. ఆ వ్యక్తి నన్ను మటుమాయం చేసి ఒక్కరోజులో మార్చివేయ లేదు. అతను నన్ను

అర్థం చేసుకున్నాడు. నన్ను కాపాడాడు. నాకు సరియైన మార్గం చూపించాడు." అన్నది జ్యోతిర్మయి.

కేశవపిళ్ళె మళ్ళీ అడిగాడు: "అది నా కర్థమయింది. నాకు కావలసింది అదికాదు. ఆ యువకుడి వల్ల ఇలా మార్పు చెందేందుకు నీవు అవలంబించిన మార్గం - ఉపదేశమా? లేక తృప్తి చెందని నీ స్త్రీత్వమా?"

జ్యోతిర్మయి మొహం ఎర్రబారింది. ఇక ఆమె సమాధానం అక్కర్లేదనుకున్నాడు కేశవపిళ్ళె. అసలతను ఇలాంటి ప్రశ్న అడిగి వుండకూడదు. తప్పు చేసిన భార్య తన తప్పు భర్త దగ్గర ఒప్పుకున్నది. ఆమె చెడిపోయింది. అయినా భర్తకు తృప్తిగా లేదు. ఆమె చేసిన తప్పును అతను పూర్తిగా తెలుసుకోవాలి అన్నట్టుంది కేశవపిళ్ళె పరిస్థితి.

ఆమె అడిగింది: "నన్ను ఇంకా చెడగొట్టాలని వుందా? ఇప్పటికి తృప్తిగా లేదా?"

"నేను నిన్ను చెడగొట్టానా?"

"అవును. మీరే, మీరే చెడగొట్టారు." ఎలా చెడగొట్టాడు అనేది జ్యోతిర్మయి ఆవేశంతో వివరించింది: "మీరు నన్ను ఎప్పుడూ కోప్పడలేదు. నన్ను అదుపులో పెట్టుకో లేదు. నేను మీ స్వాధీనంలో వున్నాను. కాని మీరు నన్ను నయానా భయానా అదిరించి బెదిరించి చెడ్డదారి పట్టకుండా కాపాడలేదు. ఒకరి అండ దండల్లో వుండాలని నా కోరిక. అంటే మీలో ఎవరూ కూడా నన్ను సానుభూతితోనూ, ప్రేమతోనూ చూడలేదు. గుర్తు తెచ్చుకోండి."

ఆమె చెప్పింది నిజమేనని తోచింది కేశవపిళ్ళెకు. ఆమె అలాగే చెప్పుకుపోతూవుంది.: "అలా జరిగివుంటే నేనక్కడికి చేరేదాన్ని కాదు. నాకో యజమాని అవసరమనిపించింది. దండించే నాథుడు కావాలి. నన్ను మీరెప్పుడన్నా కోప్పడ్డారా? నన్ను అదుపులో పెట్టుకున్నారా? కొంచెం జ్ఞాపకం చేసుకోండి. నాకు దిక్కు లేకుండా పోయింది. నన్నెవ్వరూ ప్రేమించలేదు. ప్రేమకోసం నేను దప్పిగొన్నాను. ఇంతకు ముందు మీరు చెప్పినట్టు నేను ప్రేమను వెతుక్కుంటూ వెళ్ళాను. నన్ను ఏలుకునే ఒక వ్యక్తి కోసం." ఒక్క విషయం కేశవపిళ్ళెకు బోధపడలేదు.

"అయితే ప్రేమించటం అంటే, దండించటం, బెదిరించటం, శాసించటం అన్నమాట?" అని అడిగాడు.

"అవును, అంతే. దండించకపోతే ఎలా? ప్రేమలేనివాడు దండిస్తాడా? బెదిరిస్తాడా?" అన్నది జ్యోతిర్మయి.

ఇద్దరూ కాసేపు ఏమీ మాట్లాడ లేదు. గతించిన రోజులను గురించి కొత్తగా తెలియ వస్తున్న విషయాలను పురస్కరించుకొని కేశవపిళ్ళె తనలో తాను

ఆలోచించుకుంటున్నాడు. జ్యోతిర్మయి తన నూతన మార్గాన్ని గురించి ఆలోచిస్తూవుంది.

ఆ స్త్రీ మళ్ళీ మరో చిక్కు ప్రశ్నలా కేశవపిళ్ళె యెదుట కనిపించింది. ఆమెకు కావలసింది అండదండలు. ఆ సమయంలో తను ఆమెను కోప్పడి వుండవలసింది. దండించి వుండవలసింది. ఆమెను శాసించి వుంటే సరిపోయేది. యౌవనంతో కూడిన తన జీవితమంతా అసమర్థుని చేతుల్లో పడి నశించిపోయిందని యిప్పుడు జ్యోతిర్మయికి అనిపిస్తూవుంది.

పెద్ద నిట్టూర్పు విడుస్తూ కేశవపిళ్ళె అన్నాడు: "మనం చాలా సేపటి నుంచీ మాట్లాడుతున్నాం కదూ?"

"అవును."

"సచివాలయంలో అందరికీ మన పూర్వ వృత్తాంతం తెలుసు. ఇక్కడ ఏం జరుగుతున్నదేనని అందరూ కుతూహలంతో చూస్తూ వుంటారు."

"అవును, ఇది కొత్త అపవాదుకు కారణం కావచ్చు".

"నిజమే" అన్నాడు కేశవపిళ్ళె. జ్యోతిర్మయి వెళ్ళేందుకు సిద్ధమై లేచింది. అప్పుడు కేశవపిళ్ళె భావ బంధురమైన హృదయంతో అన్నాడు: "నాకు ఇన్ని సంగతులు తెలియవు, తంకమ్మా! నిన్ను ఇలాగే సంబోధిస్తుంటాను. ఇప్పటికీ నిన్ను నేను పూర్తిగా అర్థం చేసుకోలేకుండా వున్నాను. నేను చెప్పవలసింది ఒకటే మాట. నీకు జీవితంలో నీవు కోరిన తృప్తి, హాయి లభించాలి. ఇదే హృదయ పూర్వకమైన నా కోరిక. నీకు నేను చేయవలసిందంతా చేశాననే నేననుకుంటూ వచ్చాను. కాని అది పూర్తికాలేదని ఇప్పుడనిపిస్తూ వున్నది. తప్పు నాది. నీ కోసం ఇంకా చేయవలసింది వుందని అనిపిస్తూంది. నీకు నా శుభాకాంక్షలు అందజేస్తున్నాను."

జ్యోతిర్మయి వెళ్ళి పోయింది. ఆమె వెళుతూ వుంటే కేశవపిళ్ళె కిటికీలో నుంచి ఆమెను చూస్తూ వున్నాడు. ఓడిపోయిన కాషాయ బట్టల మూట వెళు తున్నట్టుంది. కేశవపిళ్ళె చాలా సేపు విచారిస్తూ నిలబడ్డాడు.

చాలా రోజులు గడవలేదు. ఒక రోజు భాగీరథి అమ్మ వున్నట్టుండి స్పృహతప్పి పడిపోయింది. మళ్ళీ లేవలేదు. పిల్లలు ఆమెను పార్కువ్యూ నుంచి తీసుకు వెళ్ళారు.

మర్నాడు భాగీరథి అమ్మ మరణించింది. కాత్యాయనీ, కేశవపిళ్ళే అంత్యక్రియలకు వెళ్ళారు.

జ్యోతిర్మయి చివరి దశలోకానీ, అంత్యక్రియలకు కానీ రాలేదు. ఆమె ఆశ్రమం పనిమీద ఎక్కడికో చాలా దూరం వెళ్ళి పోయింది.

## ముప్పై

కాంగ్రెసు ప్రెసిడెంటుకు ఛీఫ్ సెక్రెటరీతో చాలా సన్నిహితమైన సంబంధం ఏర్పరచుకోవలసి వచ్చింది. వయసు వచ్చినవాళ్ళకు ఓటు చేసే

హక్కుకు సంబంధించిన ప్రకటన జరిగింది. రాష్ట్రంలో ఎన్నికలు జరగబోతూ వున్నాయి. ప్రతి రోజూ ప్రెసిడెంటు ఛీఫ్ సెక్రటరీ సలహా తీసుకుంటూ వుంటాడు. ఛీఫ్ సెక్రటరీ చదువుకున్నవాడూ, తెలివికలవాడూ అని ప్రెసిడెంటుకు నమ్మకం ఏర్పడ్డది. నిజాయితీని గురించి కూడా ఏమీ అనుమానం లేదు. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికను గురించి ఒకసారి ప్రెసిడెంటు కేశవపిళ్ళె అభిప్రాయం అడిగాడు. ఆ సమయంలో దీనికి సంబంధించిన చర్చల్లో కాంగ్రెసు మధ్యనే చాలా భిన్నాభిప్రాయాలు వచ్చాయి. కేశవపిళ్ళె వినయంగా ప్రెసిడెంటుతో అన్నాడు: "నేను మామూలు ప్రభుత్వోద్యోగిని. నా అభిప్రాయం.... " అని కేశవపిళ్ళె ఆగాడు. ప్రెసిడెంటు కొంచెం మెతక పడ్డాడు. కేశవపిళ్ళె ఆ విషయం గమనించాడు. బహుశా కేశవపిళ్ళె కోరుకున్నది అదే అయివుండచ్చు. ప్రెసిడెంటు అన్నాడు: "మీరు ఉద్యోగస్థులే కాదు, ఈ రాష్ట్రంలో ప్రముఖ పౌరులు కూడానూ. కేవలం ఆదృష్టితో నేనడగటం లేదు, స్నేహ భావంతో అడుగుతున్నాను. నా స్వంత విషయంలో మీ అభిప్రాయం అడుగుతున్నాను."

కేశవపిళ్ళె చిరునవ్వుతో అన్నాడు: "కాంగ్రెసు కమిటీలో ఆలోచించి నిర్ణయించవలసిన విషయంలో నేనేం చెప్పగలను?"

"అయినా పరిపాలనతో పరిచయం వున్నందువల్ల మీ అభిప్రాయానికి మంచి బలముంటుంది."

ఏదో కాగితం మీద రాసుకుంటూ కేశవపిళ్ళె అన్నాడు: "నేను కొన్ని సామాన్య విషయాలు చెపుతాను. రాబోయే ప్రభుత్వం ఎలా వున్నా నా అభిప్రాయం ఇదే. నా ఆలోచన నేను చెప్పటంలో తప్పు లేదనుకుంటాను."

మధ్యలో ప్రెసిడెంటు అన్నాడు:

"అంతేకాదు, మరే విషయమయినా మీరు స్పష్టంగా చెప్పచ్చు".

"ఎన్నికల్లో రాష్ట్రంలోని అత్యుత్తమ వ్యక్తులు నిలబడాలి. ఆత్మాభిమానం, పేరు ప్రతిష్ఠలు, ప్రపంచ జ్ఞానంగల వ్యక్తులు కావాలి. అలాంటి వాళ్ళతో మంత్రి సభ ఏర్పడాలి."

ప్రెసిడెంటుకు అందులో అనుమాన మేమీలేదు. కేశవపిళ్ళె తర్వాత విషయం చెప్పాడు:

"నేను ఇలా చెప్పటంలో ఒక విశేషముంది. నిర్మొహమాటంగా చెప్తున్నాను. తప్పుంటే క్షమించండి."

చెప్పదలుచుకుంది నిర్భయంగా చెప్పవలసిందని ప్రెసిడెంటు అనుమతించాడు.

కేశవపిళ్ళె నిర్భయంగా తన అభిప్రాయం చెప్పాడు:

"సమ్మెల్లో గాయపడ్డ వాళ్ళూ, చాలా రోజులు జైళ్ళల్లో వున్నవాళ్ళూ, ప్రజల మనస్సులను మార్చే వుపన్యాసాలు ఇవ్వగలిగిన వాళ్ళూ చురుకయినవాళ్ళే. అలాంటి వ్యక్తులు కాంగ్రెసులో ఉన్నత స్థాయినందుకున్నారు. వాళ్ళకు ప్రజల్లో పలుకుబడి వుంటుంది. కానీ పరిపాలన విషయం వేరు. అందుకు, నేను చెప్పిన ఆత్మాభిమానం, పరిపాలనా తంత్రంతో పరిచయం, పేరు ప్రతిష్ఠలూ కల వ్యక్తులు అవసరం."

ఆ విషయంలో కూడా ప్రెసిడెంటుకు వేరే అభిప్రాయం లేదు. కేశవపిళ్ళై స్పష్టంగా చెప్పాడు:

కాంగ్రెసులో కుటుంబాన్ని పోషించుకోలేని వాళ్లు, డబ్బు లేకపోతే ఎందుకూ కొరగాని వాళ్ళూ చాలామంది వున్నారు. పరీక్షలు ప్యాసయి వుద్యోగం కోసం తిరిగే వాళ్ళు కూడా వున్నారు. ఆవేశపరులు కూడా వున్నారు."

స్వరం కొంచెం తగ్గించి కేశవపిళ్ళై అన్నాడు: "ఇలా ఉన్నదున్నట్లు నేను అనకూడదు గాని మీరే ఆలోచించండి - ఈ పళియన్లు, పులయన్లు పరిపాలన చేయగలరా?"

కాంగ్రెసు ప్రెసిడెంటు దానితో కూడా ఏకీభవించాడు.

"నిజమే. వాళ్ళకేమీ తెలియదు".

"అదేమరి, నిన్నటివరకూ బిచ్చమెత్తుకుంటున్న వాళ్ళను ఏమీ ఆధారం లేకుండా బలవంతంగా తీసుకొచ్చి మంత్రుల్ని చేస్తే పరిపాలనా విధానం దెబ్బతింటుంది. అలా చెయ్యకూడదు."

కేశవపిళ్ళై మరో సూచన ఆరంభించాడు:

"ఈ రాష్ట్రంలో యోగ్యులయిన వ్యక్తులున్నారు. వాళ్ళకు పేరు ప్రతిష్ఠలున్నాయి. మంచి సంప్రదాయం, కలవాళ్ళు. మంచి వంశంలో వాళ్ళు. కాంగ్రెసు ఉద్యమం రోజుల్లో మానసికంగా వాళ్ళు ఉద్యమాన్ని హర్షించారు. ఈ భూమిలో పుట్టిన వాళ్ళ కెవరికయినా అందుకు వ్యతిరేకమయిన ఆలోచనలు వస్తాయా? ఈ రాష్ట్రాన్ని మనమే పాలించుకోవాలి. మా వుద్యోగస్థుల సంగతి చూడండి. నిజానికి కాంగ్రెసు కార్యకర్తలను పోలీసులు నానా హింస పెట్టారు, కాళ్ళ మీద కర్రలతో బాదారు, రొమ్ముమీద తుపాకులు పేల్చారు. ఇలాంటి పని చేయవలసి వచ్చినప్పుడు పోలీసువుద్యోగస్థులు మనస్సులో ఎంతో బాధపడి వుంటారు. మీరు చెపితే నమ్మకపోవచ్చు. ఇలాంటి పని చేసేప్పుడు గుండెలు బద్దలయిపోతూ వుండేవి. చేతులు వణికి పోయేవి. అంతఃకరణ అంతరాత్మను క్షమాపణ కోరుకునేది. ఈ వుద్యోగం లేకుంటే బాగుండునని అనిపించిన సందర్భాలు చాలావున్నాయి. జన్మ భూమి కోసం ఏమీ చెయ్యలేక పోయాం సరికదా పై పెచ్చు అపచారం చెయ్యవలసి వస్తున్నదని

కష్టపడేవాళ్ళం. మాకు దేశ భక్తి లేక కాదు. పరిస్థితికి మేము లొంగిపోయాం."

ఇప్పుడు ప్రెసిడెంటు కొంచెం వాచాలుడయినాడు:

"మీరు కూడా దేశానికి సేవ చేశారు. ప్రజాప్రభుత్వం ఏర్పడే సమయంలో మీరు పరిపాలనా యంత్రాంగాన్ని కాపాడారు. అది కూడా సేవే. జెండా పట్టుకొని కేకలు పెట్టటమే ప్రజా సేవకాదు. అంతటా నేనిదేమాట చెప్తుంటాను."

కేశవపిళ్ళె యిక ముఖ్య విషయంలోకి దిగాడు:

"అదే నేనూ చెప్తున్నాను. ఆ రోజుల్లో రాష్ట్రంలోని ప్రముఖులు కొందరు కాంగ్రెసులో చేరలేదు. దానికి కారణం వాళ్ళ లక్ష్యాలు. మిగిలిన వాళ్ళలాగా వాళ్ళు రంగంలోకి దూకిరాలేక పోయారు. ఆస్తిపాస్తులు, పెట్టుబడితో కూడిన వ్యాపారం, వుద్యోగం - ఇలాంటి వాటికి కట్టుబడి వుండటం చేత మా బెదిరింపులకు లొంగి యేమేమో చేసి వుంటారు. అప్పుడు కూడా మాకివన్నీ అయినా తెలుసు. వాళ్ళను రాజద్రోహులని పరిగణించుకోకూడదు."

కాంగ్రెసు ప్రెసిడెంటుకు ఈ విషయంలో కూడా భేదాభిప్రాయం వున్నట్టు కనిపించలేదు. ఆయన శ్రద్ధగా వింటున్నాడు. కేశవపిళ్ళె చెప్పుకు పోతున్నాడు:

"ఉద్యమం సమాప్తమయింది. ఇక కాంగ్రెసు, ప్రభుత్వం ఏర్పాటు చేసుకునే ప్రయత్నంలో వుంది. జరిగిపోయిన దాన్ని గురించి మనస్సులో అసంతృప్తి పెట్టుకోకూడదు. కాంగ్రెసు కవాటం బాహాటంగా తెరిచి వుంచాలి. రాష్ట్రంలోని గౌరవనీయులు, పేరు ప్రతిష్ఠలు గల పెద్దలు అందులో ప్రవేశించేందుకు అవకాశం ఉండాలి. వాళ్ళను చేరదియ్యాలి. వాళ్ళు ప్రవేశిస్తే తక్కువ స్థాయి వాళ్ళు వెళ్ళి పోతారు. ఈనాడు యోగ్యులయిన వాళ్ళు ముందంజ వేసేందుకు వెనుదీస్తున్నారు. దానికి కారణం వాళ్ళ బిడియం. వాళ్ళ మీద నేరాలు మోపగూడదు. కాంగ్రెసును బాగు చేయాలని నా అభిప్రాయం. అసమర్థుల్నీ, స్వార్థపరుల్నీ తొలగించి సామర్థ్యమూ, పరువూ, ప్రతిష్ఠాగలవాళ్ళతో దాన్ని కట్టుదిట్టం చెయ్యాలి. వాళ్ళే రాష్ట్రంలో పరిపాలన సాగించగలుగుతారు."

కేశవపిళ్ళె తన అభిప్రాయాన్ని అరమరిక లేకుండా చెప్పేశాడు. ప్రెసిడెంటు ఆయన వాదాన్ని నిరాకరించలేదు. కానీ చాలా యిబ్బందులున్నాయి. కాంగ్రెసు కోసం జీవితమంతా ధారపోసిన వాళ్ళు చాలామంది వున్నారు. వాళ్ళు నిరంతరం అతనికి అండగా నిలబడ్డారు. వాళ్ళను కాదని ప్రతి రోజూ కాంగ్రెసును వ్యతిరేకించిన వాళ్ళ భుజాలమీద చెయ్యి ఎలా వెయ్యటం? కాంగ్రెసులో ఏర్పడబోయే వైమనస్యం ముందు ముందు ఎలా పరిణమిస్తుంది? ప్రెసిడెంటు అన్నాడు:

"కొంతమంది ధైర్య సాహసాలు కలవాళ్ళు కాంగ్రెసుకు దూరమయిపోతారు. వాళ్ళు ప్రజల మధ్య పని చేశారు."

కేశవపిళ్ళెకు అదంత గొప్ప విషయంగా అనిపించలేదు.

"వెళితే వెళ్ళ నియ్యండి. దూరమయితే కానియ్యండి. కాంగ్రెసును శుద్ధి చేసేందుకు అది చాలా అవసరం. పాలనూ, నీటినీ వేరు చేసి తీరాలి. అందులో భయపడవలసిందేముంది?"

"ఎన్నిక పోటీగా పరిణమిస్తుంది." అన్నాడు ప్రెసిడెంటు అందుకు కూడా కేశవపిళ్ళెకు ఏమీ భయం లేదు.

"పోటీ వస్తే రానియ్యండి. కాంగ్రెసు గెలవదని మీకేమన్నా భయమా?"

"అలాంటి భయమేమీ లేదు."

కేశవపిళ్ళె ధైర్యంగా అన్నాడు :

"నేను కాంగ్రెసు అభ్యర్థులనందరినీ గెలిపిస్తాను. ఎన్నికల వ్యూహం నాకు తెలుసు."

"అది నాకు కూడా తెలుసు" అన్నాడు ప్రెసిడెంటు నవ్వుతూ.

"అయితే సరే, నాకు కూడా ఏమీ భయం లేదు. అలా గాక యస్.యన్.డి.పి. లాంటి సంస్థలనూ, రాష్ట్రంలోని యోగ్య వ్యక్తులనూ తొలగించి కాంగ్రెసు ఎన్నికల్లో ప్రవేశిస్తే - పని తక్కువ అవుతుంది. అదే నా భయం".

ప్రస్తుతం వున్న వైమనస్సంలో కేశవపిళ్ళె చేసిన సూచనలను ఆమోదిస్తే సంస్థ పరిస్థితి ఎలా వుంటుంది - అని కాసేపు ప్రెసిడెంటు ఆలోచించాడు. కాంగ్రెసులో ఎవరెవరు ప్రవేశించ బోతారా? ఒక్క క్షణంలో అతనికి చాలామంది నాయకులు స్ఫురించారు. కాంగ్రెసు ఆరంభించినప్పటి నుంచి ఖద్దరు గుడ్డలు వేసుకుని కార్యసాధన కోసం దీవాన్‌జీ వెంట తిరిగే కొందరు పెద్ద మనుష్యులు అతని కళ్ళకు కట్టారు. మతం పేరిట కాంగ్రెసును విడదీసేందుకు చేసిన ప్రయత్నాలు కూడా అతనికి గుర్తుకు వచ్చాయి. వర్గ వ్యవస్థ ద్వారా ఊరూరా, యింటింటా జరిగిన ప్రయత్నాలను అతను మరవలేక పోతున్నాడు. వర్గవ్యవస్థ కాంగ్రెసులో ప్రవేశిస్తే - కాంగ్రెసులో యన్.యస్.యస్; యస్.యన్.డి.పి., క్యాథలిక్ కాంగ్రెసు ద్వారా నినాదాలు ఉచ్చస్వరంలో వినిపిస్తాయి. వాళ్ళంతా ఎవరి పని వాళ్ళు చూసుకుంటారు.

ప్రెసిడెంటు కొంచెం దీనంగా అన్నాడు: "అలా అయితే కాంగ్రెసు వ్యక్తిగతమయిన ప్రయోజనాలు నెరవేర్చుకునేందుకు ఒక రంగస్థలంగా మారుతుందేమో?"

దానికి కేశవపిళ్ళె సులువుగానే సమాధానం చెప్పాడు:

"అందరినీ కూడగట్టుకొని ముందుకు సాగాలి. అది మీ బాధ్యత. ఈ పని సాధించేందుకు నాలో ధైర్యం వుంది. ఆ సామర్థ్యం మీకూ వుంది. మీ వ్యక్తిత్వం బాగా పరిణతి చెందింది."

కేశవపిళ్ళె ఇంకా యిలా అన్నాడు :

"ఇప్పుడు ఈ సమస్య ఉత్తరార్థం చూడండి. ఈ రాష్ట్రంలోని ప్రజల్లో నాయర్లు, క్రైస్తవులు, ఈళ్వాలు అందరూ వున్నారు. వాళ్ళ సంస్థల లక్ష్యాలను మన్నించటమంటే ప్రజాలక్ష్యాన్ని ఆదరించినట్టే కదా?"

ఎందుకోకాని కాంగ్రెసు ప్రెసిడెంటుకు ఈ విషయంలో అంత నమ్మకం కుదరలేదు. ఇందులోనే యేదో పొరపాటు వుందని అతని అనుమానం. బహుశా జాతీయ పరివర్తన చరిత్ర చాలా సుదీర్ఘ మయింది కావటం వల్ల అతనికి అలా అనిపించి వుంటుంది. పొరపాటు ఎక్కడ వుందో అతనికి బోధపడలేదు. అది సరిగ్గా లేదని మాత్రం అతనికి అనిపిస్తూవుంది. ఈ విషయం గురించి ఇలా ఆలోచించివుండగూడదని అతని భావం.

ప్రెసిడెంటు ఆలోచనను కేశవపిళ్ళె పసిగట్టాడు. తమ చర్చ, లక్ష్యాన్ని అతిక్రమించి వెళుతున్నదని అతనికి అనుమానం వేసింది. కేశవపిళ్ళె కొంచెం భిన్నమైన మరో మార్గాన్ని అనుసరించాడు:

"లేదు. ఉన్నతమైన ఆదర్శంతో ఆలోచిస్తే యిది సరిపోదు. మతం పోతుంది, పోవాలి. కాని ఒక్క దెబ్బతో దాన్ని పోగొట్టగలమా? ఈ సమయానికి అనుకూలమైన వ్యవహార మార్గాన్ని నేను సూచించాను. అంతే."

ఆ క్షణంలో ప్రెసిడెంటు తన పాత అనుభవాన్ని పురస్కరించుకొని ఒక మాట అన్నాడు:

"సంస్థలో కులాన్ని పురస్కరించుకొని ఎప్పుడూ తగాదా వుంటుండేది. సంస్థ యెన్నికల్లో, సంచాలనంలో, కార్యకలాపాల్లో ఈ విషయం తలయెత్తుతూ వుండేది. అది తప్పనిసరి అయ్యేది. కానీ ఒక్క విషయం చెప్పితీరాలి. ఈనాటి మన పరిపాటిని అంగీకరిస్తే విడిపొయ్యే వాళ్ళు మతంలోని కుళ్ళును కులవ్యవస్థలో వుండే ప్రతిఘటించారు. వ్యవహార దృష్టిలేని ఆదర్శం వాళ్ళకు ఆరాధ్యం అవుతుంది. ఆ శుద్ధిని వాళ్ళే బలపరిచారు. వాళ్ళే వేరయిపోతున్నారు."

ఒక్క క్షణం ఆగి కలగంటున్నట్టు ఆయన అన్నాడు : "అలా వాళ్ళు విడిపోవటం నా కళ్ళయెదుట కనిపిస్తూవుంది."

కేశవపిళ్ళె నవ్వాడు. "వ్యవహార దృష్టి లేనివాళ్ళను వెళ్ళ నియ్యండి. మళ్ళీ తెలివి తెచ్చుకొని వాళ్ళే తిరిగి వస్తారు." అన్నాడు.

కొంచెం ఆగి అతను మళ్ళీ అన్నాడు:

"మీరు ఎందుకు బాధ పడుతున్నారో అర్థం చేసుకోవడం కష్టంకాదు. అష్టకష్టాలకు ఓర్చి ఏండ్ల తరబడి మీ చెప్పు చేతల్లో మీతోపాటు పని చేసిన

వాళ్ళు మీనుంచి వేరయి పోతున్నారు. వాళ్ళలో కొందరు మీ అనుచరులు, కొందరు ఇష్టులు. వాళ్ళ స్థానంలో వచ్చేవాళ్ళు మీకు వ్యతిరేకులయి వుండవచ్చు. వాళ్ళను నమ్మటం అంత సులభం కాదు. ఈ కొత్త పద్ధతిలో గెలుస్తామో ఓడిపోతామో అనే ఆందోళన, ముందుకు సాగేందుకు ఎన్నో యిబ్బందులు. ఈ పరిస్థితిలో ఎవరికయినా బాధగానే వుంటుంది."

ప్రెసిడెంటు పరిస్థితిని జాగ్రత్తగా గమనించి చేసిన యీ సూచన అతని మనస్సులో ఎక్కడో నాటుకొని పోయింది. అతని మీద సానుభూతితో చెప్పిన ఒకవ్యక్తి కంఠం అతని భాషలో పలికింది. మరో వ్యక్తి చెప్పింది కాదు.

"అవునవును. ఇది ఆలోచించవలసిన విషయం, నాకు ధైర్యం చాలటం లేదు." అన్నాడు ప్రెసిడెంటు.

కేశవపిళ్ళె ధైర్యం చెప్తూ అన్నాడు:

"మీరు ఎంత విషమ పరిస్థితినయినా సహించగలరు. మీరు ఎప్పుడూ చప్పబడలేదు. ధైర్యంతో ముందంజ వెయ్యాలి. నిర్ణయించే సామర్థ్యం మీకు సహజలక్షణం."

కొంచెం సేపు ఎవరూ ఏమీ మాట్లాడ లేదు. ప్రెసిడెంటు దిగులుగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. కేశవపిళ్ళె ఆయన్ని జాగ్రత్తగా గమనిస్తున్నాడు. ప్రెసిడెంటు ఆలోచన నుంచి మేల్కొన్నాడు : "అరే! చాలా టయిమయింది. మీ సమయాన్ని నేను చాలా వ్యర్థ పరచాను."

"లేదు. మనం మనరాష్ట్రాన్ని గురించి మాట్లాడు కుంటున్నాం. ఇది నా పని. బహుశా ఈ సమయంలో నేను చాలా ఫైళ్ళు చూసుకొని వుండేవాణ్ణి. అంతకంటె ముఖ్యమైన పని నేను పూర్తి చేశాను." అన్నాడు.

ప్రెసిడెంటు కృతజ్ఞత చెప్తూ అన్నాడు: "అవును, మీకు నేను చాలా కృతజ్ఞుణ్ణి. నాకు వెలుగు కనిపించింది. ఈ విషయాన్ని గురించి ఇంతసేపు నేనెప్పుడూ ఆలోచించలేదు. ఏరోజు కారోజు ఈ సమస్యను దాటేస్తూ వస్తున్నాను. నేను గుర్తు పెట్టుకొని ఆలోచించవలసిన విషయం ఇది. ఏదైనా తగాదా తలయెత్తు తుందేమో అని నాకు అనిపించేది. ఆ బెడద మీరు తొలగించేశారు. ఇక దీన్ని గురించి ఆలోచిస్తాను. దారి చూపించారు మీరు."

ఒక్క క్షణం ఆగి మళ్ళీ అన్నాడాయన: మిస్టర్ కేశవపిళ్ళె! నేను ప్రశంసిస్తున్నానని అనుకోవద్దు. నిజానికి మీకు అన్ని విషయాలూ తెలుసు. మీకు ఎక్కువగా శ్రమ యివ్వను. కానీ మీరు ఎప్పుడూ నాకు సలహాదారుగా ఉండాలని నా కోరిక."

కేశవపిళ్ళె ఏమీ మాట్లాడలేదు. వినయంతో అతను మౌనం వహించాడు.

ప్రెసిడెంటు సెలవు తీసుకొని వెళ్ళాడు. కేశవపిళ్ళెకు ఎన్నడూలేని తృప్తి కలిగింది. గెలిచాననుకున్నాడు. దీవాన్‌జీ వెళ్ళి పోయారు. కాంగ్రెసు అధికారంలోకి వస్తున్నది. అయితే నేం? ఈ సంధికాలంలో తన ఆందోళన,

పరుగులు అన్నీ తలుచుకొని కేశవపిళ్ళై నవ్వుకున్నాడు. అప్పుడెంత భయ పడ్డాడో! ఇది మరో నాటకం. దానికి కావలసిన ధైర్యం కేశవపిళ్ళై సంపాయించుకున్నాడు.

ఎన్నికలముందే జాతీయ ఖైదీలనందరినీ విడుదల చెయ్యాలని కాంగ్రెసు కమిటీ తీర్మానించింది. దీనికి ప్రభుత్వం ఏమీ అభ్యంతరం చెప్పలేదు. కాని కేశవపిళ్ళై ఒక సందేహం తెలియపరచాడు. హత్యలాంటి నేరాల మీద జైల్లో పెట్టిన వాళ్ళను కూడా జాతీయ ఖైదీలుగా భావించవచ్చునా అని అతని సందేహం. అలా అయితే ప్రతి కేసును వేరు వేరుగా విచారించి నిర్ణయించవలసి వుంటుంది. అది పెద్ద సమస్యగా తయారవుతుంది. కేశవపిళ్ళై కావాలని యీ సమస్య లేవదీస్తున్నాడని కాంగ్రెసులో కొంతమంది అభిప్రాయ పడ్డారు. ఏ ఫలితాన్ని ఆశించి వాళ్ళు తమ సర్వస్వం వదులుకొని కారాగృహంలో ప్రవేశించారో, ఆ ఫలితం వాళ్ళకు దక్కకుండా పోతుందని వాళ్ళ వాదం. దీవాన్‌జీ వెళ్ళి పోయి స్వాతంత్ర్యం వచ్చి నందువల్ల లాభమేమిటని వాళ్ళడుగుతున్నారు. పడవ యీ నాటికీ తిరునక్కరాలోనే వుంది. ఇది రాబోయే కాలాన్ని సూచిస్తున్నదని విప్లవవాదులన్నారు. ఛీఫ్ సెక్రటరీ అలా భావించటంలో ఏదో వుద్దేశ్యముంటుందని ప్రెసిడెంటు నమ్మకం. ఛీఫ్ సెక్రటరీ అనవసరంగా అభ్యంతరం పెట్టే వ్యక్తికాదు. కేశవపిళ్ళై తెలివితేటలను గురించీ, దూరదృష్టిని గురించీ ప్రెసిడెంటుకు బాగా తెలుసు. అందువల్ల ఈ విషయం గురించి ప్రెసిడెంటు, ఛీఫ్ సెక్రటరీ బాగా చర్చించుకున్నారు.

ఈ నీతిని గురించి ప్రెసిడెంటుకు నచ్చ చెప్పటం కేశవపిళ్ళైకు అంత కష్టమయిన పనికాదు. పేరు ప్రతిష్ఠలూ, నిలకడాగల ప్రభుత్వం ఒకటి రూపొందించి దాన్ని ప్రజల చేతుల్లో పెట్టాలి. నీతీ, నిజాయితీ, శక్తీ, సామర్థ్యం లేని ప్రభుత్వం ప్రజలకు బరువు చేటవుతుంది. అలాంటి ప్రభుత్వం విచ్ఛిన్నమై పతనం కావచ్చు. శిక్షాస్మృతి ననుసరించి అవినీతి లాంటి నేరాలను పురస్కరించుకొని దండింపబడిన వాళ్ళను జాతీయోద్యమం పేరిట ఊరికనే వదిలిపెట్టటం ఎంతవరకు న్యాయం? అని కేశవపిళ్ళై ప్రశ్నించాడు. న్యాయ నిర్వహణ అనేది ప్రభుత్వం, ముందు ముందు కూడా అనుసరించవలసి వుంటుంది. కొంతమంది మీద నిరాధారంగా నేరాలు మోపి ఆ రోజుల్లో జైల్లో పెట్టిన మాట నిజమే. ఒప్పుకుంటాను. అలాంటప్పుడు ప్రతి కేసునూ ముక్తసరిగా విచారించాలి గదా?

"కాంగ్రెసు పరిపాలన ఆరంభమయితే పేరు ప్రతిష్ఠలుగల ప్రభుత్వ సంప్రదాయం ఒకటి ఏర్పడాలి. కాంగ్రెసును దృష్టిలో వుంచుకొనే నేను ఇలా నిర్ణయించాను. నేనంటే అందరికీ ద్వేషం ఉండచ్చు. కాని నేను చేసిన

పనులను ముందు ముందు అందరూ అభినందిస్తారు. అదినాకు తెలుసు. ఉద్యమం లేవదీయటం పరిపాలన కాదు."

ఈ విషయంలో మరో కిటుకు వుందని కేశవపిళ్ళె రహస్యంగా చెప్పాడు. ఈ వుపాయాన్ని అనుసరిస్తే కాంగ్రెసులో వున్న చాలా తగాదాలు సమసిపోతాయి. కాంగ్రెసుకు వ్యతిరేకంగా పనిచేసే చాలామంది, ఎన్నికల సమయంలో లోపలనే వుంటారు. వాళ్ళు విప్లవ వాదులు. ఖైదీల పేర్ల జాబితాను కేశవపిళ్ళె పరిశీలించి చూశాడు. అహింసా వాదులు, అక్రమాలకి దూరంగా వుండేవాళ్ళు, నీతినీ, న్యాయాన్నీ గౌరవించే వాళ్ళు, నియమాన్ని ఉల్లంఘించని వాళ్ళు – ఇలాంటి వ్యక్తిత్వంగల పెద్దలంతా బయటికి వస్తారు. కేశవపిళ్ళె తను చెప్పదలుచుకున్న విషయాన్ని ఇలా ముగించాడు:

"నేను బాగా ఆలోచించే యీ కార్యక్రమాన్ని తయారు చేశాను. ఎన్నికలు పూర్తి కానియ్యండి. కొత్త ప్రభుత్వం చాలా మంచిది అనే నమ్మకం కలిగించేందుకు అందరినీ విడుదల చేస్తాం. ఇప్పుడా ఉపద్రవ కారులకు అవకాశమియ్యట మెందుకు?"

"అలా ఉపద్రవం కలిగించేవాళ్ళు చాలామంది వున్నారా?" అని అడిగాడు ప్రెసిడెంటు.

"చాలామంది వున్నారు. అంత ఉపద్రవమేమీ కలిగించలేరు. కాని వాళ్ళను నెత్తి నెక్కించుకొని తిరిగే వాళ్ళు చాలామంది వుంటారు. వాళ్ళంతా కమ్యూనిస్టులు. కావాలని అవినీతికి పాల్పడే వాళ్ళు కూడా వున్నారు."

కేశవపిళ్ళె వాదాన్ని బాగా అర్థం చేసుకొనే ప్రెసిడెంటు వెళ్ళి పోయాడు.

మర్నాటి నుంచి ఒక్కొక్కరే జాతీయ ఖైదీలు విడుదల అవటం ఆరంభమయింది. రాష్ట్రమంతటా జైళ్ళ నుండి విడుదల అయివచ్చే వాళ్ళకు ప్రజలు ఉత్సాహంగా స్వాగతం చెప్తున్నారు. రోజుకు ముగ్గురు నలుగురు బయటికి వస్తున్నారు. అది చాలా ఆలోచించి చేసిన సరియైన ప్రణాళిక. జైలునుంచి వచ్చిన వాళ్ళకు స్వాగతం చెప్పటంలో జైల్లో పడివున్న వాళ్ళను గురించి ప్రజలు మరిచిపోతున్నారు. కాని రాష్ట్రంలో అక్కడక్కడ చాలా మంది తమ స్వజనులు, ఇష్టులు ఇవాళ వస్తారు, రేపు వస్తారు అని ఎదురు చూస్తున్నారు. వాళ్ళు స్వాతంత్ర్య సమరంలో చాలా ఆవేశంతో పాల్గొని వుంటారు. లేకుంటే యీనాడు కూడా ఆవేశంతోనే జీవిస్తూ వుంటారు. లేదా రాబోయే ప్రభుత్వం మంచితనానికి బలి అయిపోతారు.

గోపీ, నారాయణ నాయరు ఇంకా విడుదల కాలేదు. వాళ్ళకు ఛీఫ్ సెక్రటరీ వ్యక్తిగతంగా తెలుసు. మాత్యూ వాళ్ళను గురించి అప్పుడప్పుడు జాలిపడుతుంటాడు. లూకోస్‌కు అతనీ విషయం చెప్తూ వుంటాడు. అవినీతి, దురాచారం కారణంగా వాళ్ళకు శిక్ష విధించారు. అందువల్ల మామూలుగా విడుదల అవటం కొంచెం అనుమానం. కొంచెం ప్రయత్నించందే

పని కాదని లూకోస్ అభిప్రాయం. మాత్యూ అడిగాడు: "మనం కొంచెం ప్రయత్నిస్తే?"

"ప్రయత్నిద్దాం" అన్నాడు లూకోస్.

"బహుశా ...."

"ఆఁ, బహుశా? ఏమిటి?"

"వాళ్ళు కొంచెం విప్లవ వాదులు కదా? వాళ్ళను గురించి మనకు బాగా తెలుసు కదా?"

"దానికేం లూకోస్? మనమంతా ఒకచోట కలిసి వుండేవాళ్ళం. వాళ్ళ డబ్బు కూడా మన దగ్గరవుంది కదా? ఒక విధంగా మనం వాళ్ళ ప్రతినిధులం. మన ప్రతినిధులుగా వాళ్ళు జైలుకు వెళ్లారని అనుకో గూడదూ?"

తెలివిగల లూకోస్ అన్నాడు: "అవును. నేను ఒప్పు కుంటాను. కాని నిర్మోహమాటంగా చెప్పాలంటే వాళ్ళు ఒక రకం మనుష్యులు. వాళ్ళు బయటికి వస్తే చూడు."

"అయితే కానీ, ఏమవుతుంది? ఈ డబ్బుకు లెక్కచెప్పి వాళ్ళకు అప్పజెప్పి మనం వెళ్ళి పోవచ్చు. మనం చెయ్యాల్సిన పని అదేగా?"

లూకోస్ ఒప్పుకున్నాడు. కాంగ్రెసు ప్రెసిడెంటును కలుసుకున్నందు వల్ల ఈ పని కాదు. ప్రతి కేసూ ఛీఫ్ సెక్రటరీ చూస్తున్నాడు. ఆయన్ని కలుసు కోవాలి. అందులో ఒక ఇబ్బంది వుంది. ఆయన్ని కలుసుకుంటే కానుక సమర్పించాల్సి వస్తుంది."

"మనకా విషయం తెలుసుగా?" అన్నాడు లూకోస్.

"అవసరమయితే యివ్వాలి."

"వాళ్ళ డబ్బులో ఇది తగ్గిద్దాం. అంతేగా?"

"అంతే."

అందుకు సిద్ధమై లూకోస్, మాత్యూ ఛీఫ్ సెక్రటరీని కలుసుకున్నారు. ఇదివరకటి కంటె ఎక్కువ ప్రేమతో ఆయన వాళ్ళకు స్వాగతం చెప్పాడు. ఛీఫ్ సెక్రటరీ వెనకటికంటె ఎక్కువ ఉత్సాహంతో వున్నాడు. క్షేమసమాచారాల తర్వాత, వచ్చిన కారణమడిగాడు. లూకోస్ చెప్పాడు. ఆయన శ్రద్ధగా అడిగాడు:

"ఇప్పుడే చెయ్యాలా?"

లూకోస్ మాత్యూ వైపు చూశాడు. మాత్యూ కోరిక తెలుసు కోవాలి. మాత్యూ అన్నాడు :

"ఇంకా చిన్న మొత్తం బాకీ వుంది. అది మీరే చెప్పి ముగించండి."

కేశవపిళ్ళె తన అభిప్రాయం చెప్పాడు:

"అలాగే చేస్తాను, కాని గొడవ అవుతుంది. ముందే చెప్తున్నాను."

అర్ధ గాంభీర్యంతో అతనింకా వివరంగా చెప్పాడు:

"మాత్యూకే ప్రమాదం రావచ్చు."

కాని మాత్యూ దానికి లెక్క చేయలేదు. ఎంత చిన్న పనయినా చెప్పగానే చేస్తానని చెప్పటం కేశవపిళ్ళైకు ఇంత వరకు చేతకాదు. బహుశా పరిస్థితిలో వచ్చిన మార్పువల్ల అతనలా ఒప్పుకున్నాడని లూకోస్, మాత్యూ అనుకున్నారు.

ఆ తర్వాత వాళ్ళు రాజకీయాలు మాట్లాడారు. ఆ మాటల్లో నుంచి మాత్యూ, లూకోస్ స్వంత విషయాల్లోకి వచ్చారు. వాళ్ళకు ప్రస్తుతం ఏమీ పని లేదు. కొత్త ప్రభుత్వం ఏర్పడేవరకూ పని దొరుకుతుందనే ఆశ కూడా ఏమీ లేదు. జల విద్యుత్ ప్రణాళికలో అయిన పనంతా సరియైన పర్యవేక్షణ లేక చెల్లా చెదరయి పోయింది. దాన్ని మళ్ళీ ఆరంభించాలి.

"అదంతా యిప్పుడు అరణ్యమయి పోయింది. పెట్టిన డబ్బంతా వృధా అయిపోయింది. ఏం చేద్దాం?" అన్నాడు లూకోస్.

"ఏం చేద్దాం? ప్రభుత్వం పని గదా?" అన్నాడు కేశవపిళ్ళై.

ఆ పని మళ్ళీ ఆరంభించే విషయంలో లూకోస్, మాత్యూలకు కొంత అభిప్రాయముంది. కొంచెం స్థలం మార్పు చెయ్యాలి. మొదటి రెండు పర్యాయాలు దాని డిజైను తయారు చెయ్యటంలో ఇంజనీర్లు తప్పు చేశారు. సమర్థులను పిలిపించి మళ్ళీ పని ప్రారంభించాలి.

కేశవపిళ్ళై కొంచెం నవ్వుతూ మాత్యూతో అన్నాడు: "అదంతా నీవు యం.యల్.ఏ. అయిన తర్వాత ఆలోచిస్తాను. లేకుంటే మంత్రివే కావాలి."

మాత్యూ, లూకోస్ ఏమీ మాట్లాడలేదు. ఛీఫ్ సెక్రటరీ పరిహాసం చేస్తుంటే దానికి సమాధానంగా ఏమనాలో వాళ్ళకు తోచలేదు.

కేశవపిళ్ళై మళ్ళీ అన్నాడు: "లేదు, నేను తమాషాగా అనటం లేదు. యం.యల్.ఏ. అయి తీరాలి. మంత్రి అయితే మాత్రం తప్పేముంది?"

మాత్యూ ఇలాంటి ఆలోచన ఎప్పుడూ చెయ్యలేదు. అతనికి అంత పెద్ద అభిలాష కూడా లేదు.

కేశవపిళ్ళై గంభీరంగా అన్నాడు :

"ఎందుకవగూడదు, మాత్యూ? నీకు మంత్రి అయ్యే యోగ్యత లేదా?"

మాత్యూ సిగ్గుపడి తన విషయం చెప్పుకున్నాడు:

"ఈ విషయం నేను జీవితంలో ఎన్నడూ అనుకోలేదు. నేను కాంగ్రెసు కార్యకర్తగా వున్నాను. ఏదో వుద్దేశ్యం మనస్సులో పెట్టుకొని నేనా సంస్థలో చేరలేదు."

"కావచ్చు. కాని అందుకని యం.యల్.ఏ. కాకూడదా?" అన్నాడు కేశవపిళ్ళై.

లూకోస్ తన అభిప్రాయం చెప్పాడు:

"యం.యల్.ఏ.లు మంత్రులు అయ్యే వాళ్ళు మాత్యూ కంటె గొప్పవాళ్ళు కారు. ఇప్పుడు కొంతమంది పేర్లు వింటున్నాం. వీళ్ళందరూ అభ్యర్థులయితే మాత్యూ వాళ్ళ కంటె చాలా మిన్న."

కేశవపిళ్ళై యీ అభిప్రాయంతో ఏకీభవించాడు. మాత్యూలో కోరిక అనే చీడపురుగు చేరినట్టుంది. తనదేమీ లేనట్టు మాత్యూ అన్నాడు:

"నన్ను అభ్యర్థిగా కాంగ్రెసు ఆమోదిస్తుంది? ప్రభుత్వం చుట్టూ తిరిగే వాణ్ణి కదా? నా పేరు సిఫారసు చేసే వాళ్ళెవరు?"

కేశవపిళ్ళై విరగబడి నవ్వాడు: 'అదా నీ యిబ్బంది. కాంగ్రెసు నిన్ను అభ్యర్థిగా నిలబెట్టేందుకు తయారయిందనుకో, నీవు నిలబడేందుకు తయారుగా వున్నావా?"

మాత్యూకు నమ్మకం దొరక లేదు. ఇదంతా పరిహాసమని అతని నమ్మకం. చీఫ్ సెక్రటరీ ఏదో హుషారుగా వుండి తమాషాగా మాట్లాడు తున్నాడు, అంతే, అనుకొని మాత్యూ అన్నాడు:

"ఆఁ, ఇదంతా అయ్యేది కాదు."

"ఒరే పెద్ద మనిషీ! నేను నిజంగా అడుగుతున్నాను."

లూకోస్ మాత్యూను ప్రోత్సాహిస్తూ అన్నాడు:

"నీకు ఇష్టమయితే చెప్పేసేయ్. అయ్యగారు ఊరికే తమాషాగా అంటారా? ఆయన స్వభావం మనకు తెలీదూ?"

కొంచెం బిడియపడుతూ నవ్వుతూ నమ్మకం లేక పోయినా మాత్యూ అన్నాడు: "నా కిష్టమే".

కేశవపిళ్ళై గంభీరంగా అన్నాడు :

"అయితే నీవు గెలువును పొందే నియోజకవర్గం నుంచి కాంగ్రెసు అభ్యర్థివి."

మాత్యూ, లూకోస్ ఏమీ మాట్లాడలేదు.

కేశవపిళ్ళై మళ్ళీ చెప్పాడు: "ఏమిటి? నమ్మకం లేదా?"

"లేదు - ఉంది, నమ్మకముంది".

కేశవపిళ్ళై కచ్చితంగా చెప్పాడు:

"అయితే నీవు ఏర్పాట్లు చూసుకో. చేతిలో కొంచెం డబ్బుండాలి. అంతే."

"ఎంత వుండాలి?" అడిగాడు లూకోస్.

"ఎంతయినా సరే, పోగు చేస్తాం" అన్నాడు మాత్యూ కొంచెం ధైర్యం తెచ్చుకొని.

లూకోస్‌కు దాన్ని గురించి స్థూలంగా తెలుసుకోవాలని వుంది. కేశవపిళ్ళై చెప్పాడు:

"డబ్బు సంగతి వస్తే లూకోస్ వెనకంజవేస్తాడు. ఏం ఫరవా లేదు. కొరవపడితే నేనిస్తాను."

నిజానికి లూకోస్‌కూ, మాత్యూకూ ఏమీ బోధపడలేదు. చీఫ్ సెక్రటరీ కాంగ్రెసు అభ్యర్థిని నిర్ణయించటమా? ఇదేదో ఇంద్రజాలమే!

"అయితే యిష్టమే గదా?" అని అడిగాడు కేశవపిళ్ళై.

"అవును, ఇష్టమే" అన్నారు లూకోస్, మాత్యూ ఒకేసారి.

"కాని యీ సంగతి పరమ రహస్యంగా వుంచాలి." అన్నాడు కేశవపిళ్ళై.

ఇద్దరూ ఒట్టు పెట్టుకొని ఒప్పుకున్నారు.

మాత్యూ, లూకోస్ సెలవు తీసుకొని రెండు అడుగులు ముందుకు వేసేసరికి కేశవపిళ్ళై వెనక నుంచి అన్నాడు : "బహుశా మాత్యూ మంత్రి అవుతాడు. లూకోస్ తిరువితాంకూరు కాంగ్రెసుకు ప్రెసిడెంటు."

మాత్యూ, లూకోస్ తిరిగి వెళుతూ కాస్సేపు ఏమీ మాట్లాడుకో లేదు. మాత్యూ మంత్రి అవుతానని, లూకోస్ ప్రెసిడెంటు అవుతానని కలలు కంటున్నారు.

కానుక తీసుకెళ్ళి ఇయ్యకుండా తిరిగిరావటం అది తొలిసారి. ఇచ్చేందుకు అవకాశమే దొరకలేదు.

కొంచెం సేపాగి లూకోస్ అడిగాడు:

"గోపికి, నాయరుకు ఎంత డబ్బివ్వాలి?"

"ఇర్వై అయిదు వేలు."

"అవును" అని తలవూపాడు లూకోస్.

## ముప్పై ఒకటి

కొన్ని నెలలు గడిచాయి. ఈలోగా చాలా చారిత్రక సంఘటనలు జరిగాయి. తిరువితాంకూరులోని వయస్కులు తమతమ ప్రతినిధులను ఎన్నుకున్నారు. ప్రథమ ప్రజాప్రభుత్వం పరిపాలనా భారం వహించింది. మిస్టర్ మాత్యూ ప్రభుత్వ నిర్మాణ కార్య శాఖకు మంత్రి. చీఫ్ సెక్రటరీ తన బాధ్యత నెరవేర్చాడు.

మిస్టర్ మాత్యూ అధికార గృహంలో ఒక రోజు ఉదయం ఒకరు కలుసుకునేందుకు వచ్చారు. కిందవుండే ప్రైవేటు సెక్రటరీని అతనడిగాడు - మంత్రిగారిని ఇప్పుడు కలుసుకునేందుకు వీలుంటుందా అని. పేరు రాసియ్యమని అతనడిగాడు. ఆ వ్యక్తి తన పేరు ఒక చిన్న కాగితం మీద రాసి యిచ్చాడు. ఆ పేరు - "గోపి".

బంట్రోతు పై అంతస్తుకు వెళ్ళాడు. ఆ సమయంలో మంత్రిగారు కాఫీ తాగుతూ వున్నారు. కుర్చీ అంచుమీద కూర్చొని ఆయన భార్య కాఫీ తిరగబోస్తూ వుంది. ఆమె అలాకూర్చొని వుంటే చూసి బంట్రోతు లోపలికి వెళ్ళలేదు. అతను కిందికి దిగివచ్చి 'కొంచెం సేపు ఆగండి" అని చెప్పాడు.

గోపి కొంచెం సేపు ఆగాడు. అదే సమయంలో ఖద్దరు బట్టలతో ముగ్గురు నలుగురు నాయకులు కారులో దిగారు. ఆఫీసులో అందరూ గౌరవంతో

నిలబడ్డారు. వాళ్ళు ప్రభుత్వంలో ప్రముఖులుగా కనిపించారు. వాళ్ళల్లో ఒకరు "పైన ఉన్నారా?" అని అడిగారు. "అవును" అన్నాడు ప్రైవేటు సెక్రటరీ వినయంగా. వాళ్ళు పరిచయ పత్రం ఇయ్యకుండానే పైకి వెళ్ళారు.

గోపీకి ఒళ్ళు మండింది. ఆ పరిస్థితికి అనుగుణంగా రెండు నినాదాలు అతని గొంతుదాకా వచ్చాయి. అయినా తన్నుతాను ఆపుకున్నాడు. కొంచెం సేపటికి తన ఆవేశాన్ని ఆపుకొని "వాళ్ళెవరు?" అని అడిగాడు. క్షమాపణ కోరుకుంటున్నట్టుగా ప్రైవేటు సెక్రటరీ అన్నాడు: ఆయన ఇప్పుడు కాంగ్రెసు ప్రెసిడెంటు ఉల్లట్టన్నన్. ఇంతకు ముందతను క్యాథలిక్ కాంగ్రెసుకు ప్రెసిడెంటు."

ఉల్లట్టన్నన్! పేరు గోపీ విన్నాడు. చాలా ఆస్తిపరుడు. సమ్మె రోజుల్లో పేరుమెట్టు కాంగ్రెసు సమావేశాన్ని ఛిన్నాభిన్నం చేశాడు. తన 'ఎస్టేటు'లో పని చేసే తమిళ కూలీలచేత రాళ్ళు రువ్వించాడు. ఆ రోజు ఒక రాయి గోపీకి కూడా తగిలింది. మిస్టర్ ఉల్లట్టన్నన్ను గురించి యింకా చాలా విషయాలు గోపీకి తెలుసు. స్వతంత్ర తిరువితాంకూరు కావాలని అంత గంభీరంగా మరెవ్వరూ వాదించలేదు.

మరి కొన్ని క్షణాలు గడిచాయి. గోపీ ప్రైవేటు సెక్రటరీ దగ్గరకి వెళ్ళి 'నా చీటీ పంపిస్తే బాగుంటుంది.' అని అన్నాడు.

ప్రైవేట్ సెక్రటరీ వినయంగా సమాధానం చెప్పాడు:

"లోపలికి వెళ్ళిన వాళ్ళు బయటికి వస్తేనే గానీ మరొకర్ని పంపించేందుకు వీలుండదు."

ఇంతలో బంట్రోతు గోపీకి సలహా చెప్పాడు:

"ఈ రోజు వదిలెయండి. వీళ్ళు వస్తే తొందరగా వెళ్ళరు. రేపు ఉదయం రండి. బాగుంటుంది."

ప్రైవేటు సెక్రటరీ కూడా అదే సలహా చెప్పాడు. కాని గోపీ మాత్రం ఎంతసేపైనాసరే కాచుకొని ఉండి ఆయన్ని కలుసుకున్న తర్వాతనే వెళదామని నిశ్చయించుకున్నాడు. ఆమాటే వాళ్ళతో అన్నాడు. "అయితే కూర్చోండి" అని బంట్రోతు కొంచెం నిర్లక్ష్యంగా అన్నాడు.

ప్రతిరోజూలాగా ఆ వచ్చిన అతిథులు ఎక్కువసేపు ఉండలేదు. త్వరగానే తిరిగి వచ్చారు. బంట్రోతు గోపీ యిచ్చిన కాగితం తీసుకొని పైకి వెళ్ళాడు.

"గోపీ!"

మాత్యూ కొంచెం కంగారు పడ్డాడు. అది పూర్తిగా భయం కాదు గాని, భయానికి సంబంధించిన కంగారు. ఇక ముందు ఎప్పుడయినా గోపీని కలుసుకొని అతన్ని ఎదుర్కొనే సందర్భం ఏర్పడుతుందని అతను

అనుకోలేదు. అంటే అతనికి అలాంటి దిగులు ఎప్పుడూ లేదు. వాళ్ళిద్దరూ ఎన్నడూ కలియని రెండు మార్గాల్లో పయనిస్తున్నారు.

జైలు నుంచి విడుదల అయిన తర్వాత నాయరునూ, గోపీనీ మిస్టర్ మాత్యూ ఎప్పుడూ కలుసుకోలేదు. అందుకు అవకాశం కూడా దొరకలేదు. జైలు నుంచి విడుదల అయిన రోజే వాళ్ళిద్దరూ తమ ధాటి చూపించారు. వాళ్ళు కాంగ్రెసును చాలా కటువుగా విమర్శించారు. ఆ తర్వాత ఎన్నికల్లో వాళ్ళు కాంగ్రెసును వదిలేసి విప్లవ వాదుల్లో చేరి ఇద్దరూ అభ్యర్థులుగా నిలబడ్డారు. మిస్టర్ మాత్యూ నియోజక వర్గంలో గోపీ చాలా అంతరాయాలు కల్పించాడు. అతని వ్యక్తిత్వాన్ని విమర్శిస్తూ చాలా వుపన్యాసాలు ఇచ్చాడు. చిన్న వ్యాసాలు వ్రాశాడు. తనకు చేతనయినంతవరకు, మాత్యూలో నిజాయితీ లేదని నిరూపించటానికి ప్రయత్నించాడు. అది వ్యక్తిగత విరోధమేమో అన్నంతగా యీ విమర్శ పెరిగిపోయింది. ఎన్నికల సమయంలో అందరికీ అతని మీద నమ్మకం పోయింది. ఆనాడు గోపీ అంతగా వైషమ్య విషాన్ని వెళ్ళగక్కటం మంచిదే అయింది. అయినా మాత్యూ చాలా బాధపడ్డాడు. ఆ మాట తలుచుకొని అతను ఏడ్చాడు కూడాను. మాత్యూను వేధించటం గోపీకి జీవితంలో ప్రధాన లక్ష్యమయిందేమో అనిపించింది. ఎంత ఆలోచించినా వ్యక్తిగతమైన ఆ విరోధానికి కారణం ఎవరికీ బోధపడలేదు.

నాయరుకూ, గోపీకి వాళ్ళకు రావలసిన డబ్బు వాళ్ళకియ్యలేదు. ఆ డబ్బు ఇయ్యకూడదని లూకోస్ నిర్ణయించుకున్నాడు. ఆ డబ్బు అతనికి ముట్టజెప్పటం తన గొంతు కోసేందుకు తనే కత్తి అందించినట్టని లూకోస్ అభిప్రాయం. బహుశా అతన్ని నేరుగా కలుసుకొని ఆ డబ్బిచ్చేసివుంటే ఆ విరోధం సమసిపోయేదని మాత్యూ చాలాసార్లు అనుకున్నాడు. గోపీ తన వ్యాసాల్లో, ఉపన్యాసాల్లో అతన్ని దోపిడిగానిగా చిత్రించాడు.

మాత్యూకు కంగారు కొంచెం తగ్గింది. తనపాత స్నేహితుణ్ణి రెండు చేతులూ చాచి ఆలింగనం చేసుకుంటే ఎలా వుంటుందనిపించింది. బహుశః ఒక్క కౌగిలింపుతో విరోధమంతా మరిచి పోవచ్చు. జాతీయ పోరాటంలోని భేదాభిప్రాయాలు అటుండనీ. వాటివల్ల ఏమవుతుంది? ఆ డబ్బు కూడా ఇచ్చెయ్యాలి. అంత మొత్తం ప్రస్తుతం దగ్గర లేకపోతే త్వరలో ఆ డబ్బు అతనికి ముట్టజెప్పాలి....... వెంటనే మరో ఆలోచన అతన్ని గాఢంగా ఆవరించింది. అది ఎన్నికల సమయంలోని అనుభవంలో ఉత్పన్నమయింది. ఆ వైరం జాతీయ విషయాల్లో భిన్నాభిప్రాయం వల్ల రాలేదు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కాంగ్రెసులో ప్రవేశించిన స్వప్రయోజనకారులలో స్వార్థపరులలో మొదటివాడు మాత్యూ అని గోపీ అన్నాడు కూడా. ఈ విరోధం కేవలం వ్యక్తిగతమైనది. జాతీయమైన అభిప్రాయ భేదాలను వ్యక్తిగత విరోధాలను వేరు వేరుగా విడదీసి చెప్పేందుకు వీల్లేదని గోపీ చాలాసార్లు

చెప్పాడు. అలాంటప్పుడు తన అలింగనం మీద నమ్మకం ఎలా కుదురుతుంది? ఆ కౌగిలింతలో శౌర్యా చరిత్రలోవలె కత్తి దూసుకుని రావచ్చు గదా? కలుసుకునేందుకు వచ్చిన వ్యక్తి కేవలం చిరకాల పరిచితుడే కాక సన్నిహిత మిత్రుడయినప్పుడు అతన్ని పంపించి వెయ్యటం సమంజసమా?

బంట్రోతు ఎదురు చూస్తూ వున్నాడు. లూకోన్ ఒక హోటల్లో వుంటున్నాడు. పిలిపించి అడిగితే ఎలా వుంటుంది. మంత్రి ఫోను చేశాడు. లూకోన్ అక్కడలేడు. గోపీని లోపలికి రానియ్యటమా లేదా వెంటనే నిర్ణయించాలి. అతనెందుకు వచ్చివుంటాడు? డబ్బుకోసం వచ్చాడా? లేకుంటే ఏదన్నా దురుద్దేశంతో వచ్చాడా? ఏదన్నా ఆయుధం దుస్తుల్లో దాచుకొని వుండచ్చు. జాతీయావేశంతో అతను పిచ్చెక్కివుంటాడు. ఒకవేళ డబ్బుకోసం వచ్చి వుంటే అంత డబ్బు పోగు చేయటం కష్టం. అంతేకాదు. అతనికి డబ్బు ఇవ్వకూడదని లూకోన్ నిర్ణయించాడు. తను కూడా ఆ నిర్ణయంతో ఏకీభవించాడు.

"ఇప్పుడు కలుసుకునేందుకు వీల్లేదు".

మంత్రి నోటి నుంచి వచ్చింది యీ వాక్యం.

వాక్యం బయటికి వచ్చింది. కాని మరుక్షణమే అలా అని వుండకూడదని అతనికనిపించింది. అది తప్పు మాట. లేకుంటే అతనికలా ఎందుకనిపిస్తుంది ? గోపీ ప్రవర్తన యెన్నటికీ మరుపురానిది. ఇక ముందు అతన్ని కలుసుకోవాలనే ఆలోచన కూడా తనకి లేదు. ముందు ముందు కూడా అలాఉంటేనే మంచిది. అతనికి లెక్కతేల్చి యిచ్చెయ్యాలి. లేదు, అతనికి లెక్క తేల్చక్కర్లేదు. ఏ లెక్క ప్రకారం అతనికి డబ్బు రావాలి? నియామకంగా చూస్తే ఒక్క పైసా కూడా ఇవ్వక్కర్లేదు.పోనీ స్నేహభావంతో అనుకుంటే అతను దానికి పాత్రుడు కాడు. ధైర్యంగానే చెప్పచ్చు - కలుసుకునేందుకు వీల్లేదని. కాని ఒక ప్రమాదం వుంది. గోపీ చాలా విచిత్రమైన వ్యక్తి. భయంకరమైన శత్రువు, సాహసికుడు. అతనితో ఏర్పడ్డ విరోధం నలువైపులా ఎలా వ్యాపిస్తుందో చెప్పలేము. అనుకోని మార్గాన్ని కూడా అతను అనుసరించవచ్చు. పామును రెచ్చగొట్టినట్టయింది.

మంత్రి మనశ్శాంతి చెడిపోయింది. లూకోన్ను కలుసుకుంటేనే గాని మనస్సు శాంతించదు. గంట కొట్టి బంట్రోతును పిలిచాడు. ఆ వచ్చిన మనిషి వెళ్ళి పోయాడు. ఏమీ అనకుండా అతను వెళ్ళిపోయాడు. ఈ ప్రపంచంలో తనతో వైరం ఏర్పరచుకొన్న ఒక వ్యక్తి ఉగ్రరూపం ధరించినట్టు మాత్యూకు తోచింది.

మాత్యూకు అది దుర్దినంగా పరిణమించింది. జలవిద్యుత్ ప్రణాళిక వెనకటి స్థానం నుంచి మరో స్థానానికి మారేందుకు అనుమతికోసం ఎదురు చూస్తున్నది. అతని సంతకం తప్ప దానికి మరేమీ ఆలస్యంలేదు. కాని అది

కూడా అనుమానమే. సాయంత్రం లూకోన్ మాత్యూ బంగళాకు వచ్చాడు. లూకోన్ అన్ని విషయాలూ శ్రద్ధగా విన్నాడు. మాత్యూ చివరకు ఇలా అన్నాడు:

"లూకోన్! చెప్పాను గదూ? ఈ రోజు నాకు బొత్తిగా మనశ్శాంతి లేకుండా పోయింది. మనస్సులో ఆందోళన పెరిగిపోయింది. ఏం చెయ్యాలో తెలియటంలేదు. మనశ్శాంతి పూర్తిగా చెడిపోయింది."

దానికంత ప్రాధాన్యం ఇవ్వకుండా లూకోన్ అన్నాడు: "ఏమిటి చెయ్యమంటావు నీవు? నాకేమీ అర్థం కావటం లేదు. అతను డబ్బుకోసం వచ్చి వుంటాడు. లేకుంటే మరేదన్నా పనిమీద వచ్చి వుంటాడు. ఈరోజు కలుసుకునేందుకు వీల్లేదు - అనేగా చెప్పింది? దానికింత ఆలోచించ వలసిన పనేముంది? అనవసరంగా దిగులుపడకు. ఒకవేళ మళ్ళీ వస్తాడనుకో. వీలుంటే రమ్మని చెప్పు. డబ్బు సంగతి అడిగితే 'ఏం డబ్బు?' అని ధైర్యంగా అడుగు. ఏదయినా పనిని గురించి అడిగితే వెనకటి వైరమంతా మరిచిపోయి చేయదగిందయితే చేసేసెయ్. అంతే."

మాత్యూకు ధైర్యం చెప్పగలిగానని లూకోసుకు అనిపించలేదు. లూకోన్ చెప్పినట్టు అతను చేస్తాడు. కాని అతనికి మనశ్శాంతి మాత్రం వుండదు. మాత్యూ ఎందుకు బాధపడుతున్నాడో లూకోసుకు కూడా బోధపడటం లేదు. భయమా? పశ్చాత్తాపమా?

మర్నాడు వార్తా పత్రికల్లో మాత్యూ, వెనక చేసిన అక్రమ చర్యలను గురించి గోపీ రాసిన వ్యాసం ఒకటి వచ్చింది. ఏండ్ల తరబడీ చేసిన పనిని వదిలేసి కొత్త జలవిద్యుత్ ప్రణాళిక ఆరంభించవలసిన అవసరం ఏమిటని విమర్శించటం జరిగింది. అది కూడా అచ్చపు అవినీతి. రచయిత ప్రభుత్వాన్ని ధైర్యంగా నిరసించాడు. తనకూ, నారాయణ నాయరుకూ రావలసిన డబ్బును మాత్యూ స్వతంత్ర తిరువితాంకూరులో చేరి కాజేశాడని కూడా. రచయిత వాదించాడు. అన్నింటికీ నిదర్శనాలు చూపించాడు. ప్రభుత్వానికి ధైర్యముంటే ఎదుర్కొనవచ్చని సవాలు చేశాడు.

ఈ సంఘటన ప్రభుత్వ రంగంలో భయోత్పాతాన్ని సృష్టించింది. రాష్ట్రంలో లంచగొండి తనం, అవినీతి కొత్త విషయాలు కావు. కాని ప్రజాప్రతినిధుల్లో వున్న అక్రమం, అన్యాయం సామాన్య మానవులకు కూడా తెలిసి పోతున్నాయి. ఇంతకు ముందు ప్రజాప్రతినిధులు పరిపాలన చెయ్యలేదు. అవినీతిని అరికట్టేందుకు మంత్రులు అధికారంలోకి వచ్చారు. మంత్రుల పరిపాలనలో ఇది మొట్టమొదటి అవినీతి. కాబట్టి యిది అవినీతికి నాందిగా ప్రాధాన్యం వహిస్తుంది. ఏదో పోనీలే అని దీన్ని వదిలిపెట్టేందుకు వీల్లేదు.

ఏవేవో విమర్శలు వార్తా పత్రికల్లో వస్తూనే వున్నాయి. ప్రభుత్వం ఏదో ఒక సమాధానం ఇచ్చి తీరాల్సిన పరిస్థితి యేర్పడింది. గోపీ అనే వ్యక్తి

కమ్యూనిస్టు అనేది మొదటి సమాధానం. గోపీ చేసిన విధ్వంసాత్మకమయిన పనుల జాబితా ఒకటి ప్రభుత్వం తయారు చేసింది. ప్రజాప్రభుత్వాన్ని అపకీర్తిపాలు చేసేందుకు ఇది ఒక నీచ కృత్యమని ప్రభుత్వం ఒక ప్రెస్సు విజ్ఞప్తి ద్వారా తెలియజేసింది. కాని ప్రజలకు ఆ మాట మీద అంత నమ్మకం కుదరలేదు.

మిస్టర్ మాత్యూ ఏర్పరచిన సంకేత స్థలంలో ఛీఫ్ సెక్రటరీ, మాత్యూ లూకోస్‌లతో సంప్రదింపులు చేశాడు. ఈ దోషారోపణ తీవ్రతను తగ్గించేందుకు ఒకే ఒక మార్గం వుంది. అది ఛీఫ్ సెక్రటరీ చెప్పేశాడు. నాయరును వెతికిపట్టుకొని అతని చేత ఇదంతా నిరాధారమని నిరాకరింపజేయాలి. అయితే ముందు నాయరు పరిస్థితి యేమిటో తెలుసుకోవాలి.

"ఎన్నికల్లో అతను వాళ్ళ సాయంతోటే నిలబడ్డాడు. కాబట్టి వాళ్ళంతా కూడగట్టుకొనే వుంటారు." అన్నాడు మాత్యూ.

లూకోస్‌కు నాయరుమీద కొంచెం నమ్మకం వుంది. ఏది యెలావున్నా, నాయరు గోపీలా కమ్యూనిస్టుకాడు. వెంటనే అతన్ని కనుక్కొని ప్రయత్నించాలని అందరూ తీర్మానించుకున్నారు. ఆ ప్రయత్నం ఎంత వరకూ ఫలిస్తుందో యెవరికీ నమ్మకం లేక పోయినా ప్రయత్నించేందుకు మాత్రం అందరూ నిర్ణయించుకున్నారు. దాని బాధ్యత లూకోసుకు అప్పజెప్పారు.

గోపీ చూపించిన నిదర్శనాలకు ఎదురులేదు. ఆ నిదర్శనాలకు అనుగుణంగానే నిష్కర్ష చేయటమయింది. కాని ఈ నిదర్శనాలూ, ఈ భోగట్టాయింత కచ్చితంగా, సవివరంగా గోపీకి ఎలా తెలిశాయి అనేది ఆలోచించవలసిన విషయం. ప్రభుత్వంలోని రహస్య విషయాలు ఇలా బహిరంగం కాకూడదు. "రేపు మంత్రివర్గ సమావేశంలో ఈ విషయం లేవదీస్తావా మిస్టర్ మాత్యూ?" అన్నాడు కేశవపిళ్ళె.

"తప్పకుండా ఇలా రహస్యాలు బయట పడుతుంటే ప్రభుత్వం ఎలా సాగుతుంది?"

ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. లూకోస్, కేశవపిళ్ళె మౌనంగా కూర్చున్నారు. ఆనాడు తన తోటి వాళ్ళను కాపాడే సదుద్దేశంతో ముందంజవేసి లూకోస్ లేవదీసిన ఉద్యమం అది. ఎవరికోసం అతనిదంతా చేశాడో, అతనే యీనాడు శత్రువయినాడు. దాని ఫలితం అతననుభవించలేదు. ఆ రోజుల్లో తను ఏమేం చేశాడో లూకోస్ ఒక్కసారి గుర్తు చేసుకున్నాడు. కేశవపిళ్ళె ముఖంలో ఎక్కడలేని గాంభీర్యం కనిపిస్తూ వుంది. అతని కళ్ళు పాము కళ్ళలాగా తారట్లాడుతూ వున్నాయి. అతనేదో ఆలోచిస్తున్నాడు.

"ఎవరూ ఏమీ మాట్లాడటంలేదే?" అన్నాడు మాత్యూ.

లూకోస్ నవ్వుతూ అన్నాడు: "ఇందులో నేను చెప్పేదేముంది? మీరే ఆలోచించుకొని నిర్ణయించుకోవాలి."

కేశవపిళ్ళై చాలా గంభీరంగా అన్నాడు: "నాకు తెలుసు - ఇది ఎలా బయటు పడిందో. ముందు నేరస్థులను శిక్షించే విషయం ఆలోచించకుండానే అవసరమైన చర్య తీసుకుని వుండవలసింది. నాకా అధికారం ఈనాటికీ వుంది. కాని నూతన పరిపాలనా విధానంలో నేనా అధికారాన్ని వుపయోగించు కోవటం లేదు. అలా యెందుకు చేయటమని నా ఆలోచన."

"ఎందుకలా వెనక్కు వెళుతున్నావ్?" అన్నాడు మాత్యూ.

కేశవపిళ్ళై గాంభీర్యం వదలకుండానే నవ్వుతూ అన్నాడు: "నేను వెనక్కి వెళ్ళటం లేదు. నా అధికారాన్ని నేను వుపయోగిస్తే ఫలితం అనుభవించేదెవరంటే - లేదు, నేనేమీ చెప్పను."

"రేపు మంత్రి మండలిలో ఈ విషయం నిర్ణయించుకుంటే?" అని అడిగాడు మిస్టర్ మాత్యూ.

"దాన్ని ఆమోదించేవాణ్ణి నేనే. నేను తగినచర్య తీసుకుంటాను."

"అతనెవరు సార్?" అడిగాడు లూకోస్.

"నాకు తెలియదు. ఎవరయితే నాకేం?"

ఆ నాటి నుంచీ లూకోస్ తనకు అప్పచెప్పిన పని ప్రారంభించాడు.

కాంగ్రెసు నుంచి విడిపోయిన విప్లవ వాదులతో కలిసి నాయరు ఎన్నికల్లో పోటీ చేశాడు. ఒక ముఖ్యమైన కాంగ్రెసు కార్యకర్తతో అతను పోటీ చేశాడు. ఆ పోటీలో నాయరు చిత్తుగా ఓడిపోయాడు. నాయరుకు యాభైఅయిదు వోట్లు మాత్రమే వచ్చాయి. ఆ పరాజయం అతన్ని చాలా బాధించింది. అతను ఉన్నట్టుండి చప్పబడి పోయినాడు. గోపీకి విరోధం ఏర్పడ్డది. ఎన్నికలయిన తర్వాత నాయరుకు మరో విషయం బోధపడింది. కాంగ్రెసు నుంచి వేరయిపోయిన విప్లవ వాదులు కమ్యూనిస్టు పార్టీలో చేరారు. నాయరుకు అది బొత్తిగా గిట్టలేదు. అందుకు చాలా కారణాలున్నాయి. 1942 ఆగస్టులో అన్నీ మరిచి స్వాతంత్ర్య సమరంలో దూకిన వ్యక్తి అతను. జీవితంలో మరుపురాని, మన్నింప వీలుగాని యిద్దరు స్నేహితులు అతన్నీ, అతని స్నేహితులనూ పోలీసులకు అప్పగించారు. అలాంటి కమిటీ తీర్మానించిన కార్యక్రమాన్ని నాయరు అమలు పరచలేక పోయాడు. మోసగించింది కమ్యూనిస్టులు. ఆ విషయం గుర్తు వస్తే యిప్పటికీ నాయరుకు గుండె ఆగినంత పనవుతుంది. అతను కమ్యూనిస్టులను ఎన్నడూ క్షమించలేనని అంటాడు. భారతదేశ స్వాతంత్ర్యం కోసం పోరాటం జరిగినప్పుడు రెండవ ప్రపంచ యుద్ధం జనసంగ్రామంగా పరిణమించిందని చెప్పే కమ్యూనిస్టుల వాదం నాయరుకు ఈనాటికీ బోధపడలేదు. ఆనాడు వాళ్ళు ఆంగ్లేయుల పక్షంలో వున్నారు. అన్ని విషయాలూ అలా వుంచి ఒక

సమావేశంలో కమ్యూనిస్టులు సుభాష్ చంద్రబోసును కుక్క, పంది అని దూషించారు. ఆ రోజు నాయరు మైమరచి సమావేశంలో అలజడి చేశాడు. దానికి ఫలితంగా అతను ఆరునెలలు జైల్లో వున్నాడు. రాష్ట్రాన్ని స్వర్గంగా మారుస్తామని వాళ్ళు ఎంత చెప్పినా తనకు నమ్మకం లేదని అంటాడు నాయరు. వాళ్ళతో తనకు స్నేహం ఏమీ లేదంటాడు.

ఇలా తనతోటి వాళ్ళంతా ఒక ప్రవాహంలో పడిపోయి కమ్యూనిస్టు పార్టీవైపు ప్రవహిస్తూ వుంటే నాయరు నిలబడి చూస్తున్నాడు. ఆ దృశ్యం చూసి అతను క్షణక్షణానికీ, గంటగంటకూ, దినదినానికి నీరసించి దిగజారి పోతున్నాడు. ఆ దృశ్యాన్ని అతను సహించలేక పోతున్నాడు. వాళ్ళంతా ఎక్కడికి వెళ్తున్నారు? పాత చరిత్ర పరిశీలించి చూస్తే వాళ్ళంతా చేరబోతున్న గూడు ఏమిటి? అతనికి భయం వేసింది. గోపీ కూడా అటే పరుగెత్తుతున్నాడు.

ఎక్కడి నుంచి వచ్చాడో అక్కడికే వెళ్ళాలనుకున్నా అక్కడ కూడా కమ్యూనిస్టు గూడు లాంటి భయంకరమైన స్థలం కనిపిస్తున్నది నాయరుకు. అందులో ఇప్పుడు చాలా అడవి మృగాలున్నాయి. తిరిగి అక్కడికి వెళ్ళటం సిగ్గుచేటు!

నాయరు ఏవిధంగా కూడా సామాన్య రాష్ట్ర జీవితంలో మిళితం కాలేకపోయాడు. స్వాతంత్ర్యోద్యమాన్నీ, గాంధీజీనీ ఎదిరించిన పెద్ద మనుష్యులే యిప్పుడు ఖద్దరు కట్టుకుంటున్నారు. గాంధీ టోపీ పెట్టుకుంటున్నారు. కాంగ్రెసు వాళ్ళుగా చలామణీ అవుతున్నారు. ఎలుగెత్తి కాంగ్రెసును కీర్తిస్తున్నారు. రాష్ట్రంలో అంతటా కాంగ్రెసు వాళ్ళే. భయపెట్టే కమ్యూనిస్టుల ప్రాబల్యం హెచ్చుతూ వుంది. నాయరు ఎటూ వెళ్ళలేక పోతున్నాడు.

స్నేహితులనేవాళ్ళు లేక బాధపడుతున్న ఆ వ్యక్తి రాష్ట్రంలో అక్కడక్కడా తిరుగుతూ ఎక్కడో కనిపించవచ్చు. అతనికి పనీ పాటూలేదు. స్నేహితులతో పని లేదు. ఎవరిని చూసినా అతనికి అసహ్యమే. ఒక్కపూట భోజనం కూడా అతనికిప్పుడు పెద్ద సమస్య. బహుశా వ్యర్థంగా గడిచిపోయిన జీవితంవైపు అతను వెనక్కు తిరిగి చూస్తూ వుంటాడు. తన సర్వస్వం అతను ధారపోశాడు. కాని గడించిందేమిటి అని అతను బహుశా ఆలోచిస్తుంటాడు. అందువల్ల ప్రయోజన మేముంది? తన శక్తి సామర్థ్యాలన్నీ గుల్లయి పోయినట్టు అతనికి తోచింది. ఒకపూట భోజనం సంపాదించుకునే శక్తి కూడా అతనిలో నశించిపోయింది.

వెతికి వెతికి లూకోస్, నాయరును పెరుంపావూరులో చూశాడు. అతను పెరుంపావూరు వెళ్ళిన కారణమేమిటని అడిగితే సమాధానమేమీ రాలేదు. కానీ నాయరుకు మతి చెడలేదు. తెలివిగల లూకోస్, నాయరుతో సరిగ్గా ప్రవర్తించాడు.

కొన్నాళ్ళ తర్వాత వార్తా పత్రికల్లో గోపీకి సమాధానం చెప్తూ నాయరు రాసిన వ్యాసం అచ్చయింది. కమ్యూనిస్టు శిబిరాల్లో తలదాచుకుంటున్న గోపీని కమ్యూనిస్టుల సేవకునిగా భావించ కూడదని ఆ వ్యాసంలో వివరించటం జరిగింది.

గోపీ మీదా, కమ్యూనిస్టు పార్టీ మీదా నాయరుకు ఉన్న ద్వేషాన్ని లూకోస్, మాత్యూ, కేశవపిళ్ళై స్వలాభానికి పూర్తిగా వినియోగించుకుంటున్నారు.

ఈలోగా రాష్ట్రమంతటా సమావేశాలు జరుగుతున్నాయి. సామాన్య ప్రజలను పోగుచేసి కమ్యూనిస్టు పార్టీ, సమావేశాలు జరుపుతున్నది. కాంగ్రెసు కూడా అవకాశాన్ని వదల్లేదు. వాళ్ళు కూడా సమావేశాలు ఏర్పాటు చేశారు. వాళ్ళ సమావేశాల్లో మంత్రులు, నాయకులు, వక్తలు. కాని కమ్యూనిస్టుల సమావేశాల్లో, సంరంభాల్లో ఉద్రేకం ఎక్కువగా వుండేది. సమావేశాలతో పాటు నాటకాలు, ఆటలు మొదలయిన కార్యక్రమాలు ఏర్పాటు చేసే వాళ్ళు. మంత్రులను ఆక్షేపిస్తూ నాటకాలు ఆడేవాళ్ళు. మంత్రుల భార్యలను నాటకాల్లో పాత్రలుగా రూపొందించారు. రాష్ట్రమంతటా ఎన్నికల లాంటి అలజడి చెలరేగింది.

మంత్రివర్గం ఏక కంఠంతో ప్రభుత్వ రహస్యం బయట పెట్టిన వ్యక్తిని కనుక్కొనేందుకు నిర్ణయించింది. ఆ బాధ్యత చీఫ్ సెక్రటరీకి అప్పగించారు. ఈ విధంగా రహస్యాన్వేషణ జరిగిన తర్వాత మరో మంత్రి మీద అవినీతి నేరారోపణ చేశారు. మంత్రి మిస్టర్ కురుప్, ఆహారశాఖకూ, రవాణాకు ప్రధానమైన వ్యక్తి. ఆ ప్రాంతంలో అవసరమయిన పనికి ఉపయోగించవలసిన ద్రవ్యంలో చాలా భాగం అతను జేబులో వేసుకున్నాడు. అలాగే బస్సు కొనటంలో బ్రోకరేజీ కూడా అతని జేబులో చేరింది. విధాన సభకు చెందిన కాంగ్రెసు సభ్యుడే యీ నేరం మోపాడు. అతని వెనక ఆరేడుగురు సభ్యులు కూడా వున్నారు. శత్రువులు పని సాధించేందుకు నియమాలనూ, లాంఛనాలనూ అతిక్రమించారని ఆ మంత్రి వాదం. ఆ పని నెరవేరక పోయేసరికి వాళ్ళిలా నేరారోపణ చేశారట. అలా అయితే మంత్రి చేసిన అవినీతిని గురించి బహిరంగంగా విచారణ జరిపించాలని కమ్యూనిస్టు పార్టీ వాదం.

అమాయకపు ప్రజలు! వాళ్ళకు ఈ విచారణను గురించి యేమీ తెలియదు. ప్రతి గ్రామంలో, ప్రతి నగరంలో, విచారణ జరిపించాలని గోడలమీద ప్రకటనలు అంటించారు.

ప్రభుత్వ రహస్యాలు బయట పెట్టిన ఆచూకీ కనిపెట్టి తొలి నివేదిక అర్పించటం జరిగింది. తొలి విచారణవల్ల తప్పు చేసింది మిస్టర్ ఫిలిప్ అనే సెక్రటరీ అని తేలింది. పూర్తిగా విచారణ చేసి పర్యవసానం తేల్చేవరకూ ఆ వుద్యోగిని సస్పెండు చెయ్యాలని కూడా ఉత్తర్వు జారీ చేయబడింది. మరో

వుద్యోగి కూడా యీ నేరంలో ఇరుక్కుని వున్నాడు. జల విద్యుత్ ప్రణాళికలో బాధ్యతగల ఇంజనీరు మిస్టర్ కామిల్ కూడా ఈ రహస్యం బయటికి చేరెయ్యటంలో భాగస్వామి. అతన్ని కూడా సస్పెండు చెయ్యాలి. కొత్త ప్రణాళిక తయారు చేసేందుకు మరో ఇంజనీరును పిలిపిస్తే మిస్టర్ కామిల్‌కు దానికి సంబంధించిన మంత్రితో విరోధం రావచ్చుననీ, అందువల్ల శత్రువులకు రహస్యాలు చేరవేసే అవకాశం ఉందనీ ఆ రిపోర్టులో వుంది.

మంత్రివర్గం ఒక విధంగా విషమ పరిస్థితిలో ఉంది. మంత్రి వర్గంలో భయంకర వైషమ్యం బయలుదేరుతుందనటంలో సందేహం లేదు. మిస్టర్ ఫిలిప్‌కు అనుకూలమైన వ్యక్తి మిస్టర్ ఉమ్మన్. ఆయన చాలా పలుకుబడిగల వ్యక్తి. అదీకాక మిస్టర్ ఫిలిప్, కాంగ్రెసు ప్రెసిడెంటు మిస్టర్ ఉలట్టనత్నునుకు దగ్గర బంధువు. అందరూ మిస్టర్ ఫిలిప్‌నే సమర్థిస్తారు. మిస్టర్ కామిల్ యన్.యస్.యస్‌కు సంబంధించిన వ్యక్తి. మిస్టర్ కామిల్ తరఫున వాదించేందుకు మంత్రి వర్గంలో యన్.యస్.యస్. ప్రతినిధులున్నారు. ఆ వ్యవస్థ, వాళ్ళ ప్రతినిధులు, యం.యల్.ఏలు కూడా అతన్ని ఉపేక్షించరు. ఏమయినా సరే యీ విషయంలో చాలా గట్టిగా నిలదొక్కుకోవాలని ముఖ్యమంత్రి అభిప్రాయం. మంత్రి వర్గమేకాదు, కాంగ్రెసు పార్టీ అధికారవర్గం కూడా ఛిన్నభిన్న మయ్యే పరిస్థితి యేర్పడ్డది.

లూకోసుకు బొత్తిగా మనశ్శాంతి లేదు. అతను ఎన్నో అభిలాషలు పెట్టుకుని వున్నాడు. అన్నీ చిందర వందర అయ్యే పరిస్థితి వచ్చింది. అతను కేవలం కేశవపిళ్ళె మీద ఆధారపడి వున్నాడు.

"అయ్యా! ఇప్పుడేం చేద్దాం? అంతా ఛిన్నాభిన్నమై పోయే పరిస్థితి వచ్చింది." అన్నాడు లూకోస్.

కేశవపిళ్ళె చెయ్యూపాడు. లూకోసుకేం తెలియదు. అతను తెలుసుకోవలసిన విషయం ఒక్కటే. అది మాత్యూ తొలగిపోవాలా అక్కర్లేదా అని.

"మంత్రి వర్గం విచ్ఛిన్నమయితే తొలగాల్సి వుంటుంది." అన్నాడు కేశవపిళ్ళె.

నిరాశతో నిస్సహాయుడయిన లూకోస్ అన్నాడు: "బాగా లేదు. మాత్యూకు తన సామర్థ్యం చూపించే అవకాశమే రాలేదు. కేంద్రంలో పంచవర్ష ప్రణాళిక తయారు కాబోతూవుంది."

"అవును" అన్నాడు కేశవపిళ్ళె. కోట్ల రూపాయలతో కూడిన ప్రణాళిక. తను సహించలేనంత కష్టం నష్టం తన నెత్తిమీద పడ్డట్టు లూకోస్ బాధపడుతున్నాడు.

"అయ్యగారు కొంచెం ఆలోచిస్తే అంతా చక్కబడి పోతుంది." అన్నాడు లూకోస్.

"నా ఆలోచనవల్ల లాభమేముంది?" అన్నాడు కేశవపిళ్ళె.

"అప్పట్లో ఫిలిప్ గారు ఎవరికి నష్టం లేకుండా పనిచేసి పెట్టేవారు. ఇంజనీరు క్యామిల్ కూడా అలాగే చేశాడు.

అదంతా యిప్పుడు వాళ్ళకే ముప్పుగా తయారయింది."

ఒక్క క్షణం ఆగి లూకోస్ అన్నాడు: "అయ్యగారు ఆలోచిస్తే అన్నీ చక్కబడతాయి. ఈ విషమ పరిస్థితి నుంచి బయటపడచ్చు."

కేశవపిళ్ళెకు ఈ విషయంలో ఒక రకమైన రాక్షస తృప్తి కలుగుతోంది. చాలాకాలం నుంచి అతను ఫిలిప్పుకు గుణపాఠం చెప్పాలని అనుకుంటున్నాడు. అతను ఎప్పుడూ కేశవపిళ్ళెకు ద్రోహం తలపెట్టే వ్యక్తి. ఎన్నికల ముందు ఆ పెద్ద వుద్యమంలో ఫిలిప్ జోక్యం కలగజేసుకున్నాడు. ఇప్పుడు కూడా గోపీ ద్వారా యీ అవినీతిని బట్టబయలు చేయించి దుమారం లేవదీసింది మరెవరో కాదు. అతనే. క్యామిల్ కూడా తమతో తాత్కాలికమైన విరోధాన్ని పురస్కరించుకొని అతనికి తోడ్పడ్డాడు. అందువల్లనే తనకి పగతీర్చుకో గలననే తృప్తి యేర్పడుతూవుంది.

కానీ యీ తృప్తితోపాటు మనస్సులో ఏదో ఆందోళన, భయం ఏర్పడ్డాయి. తృప్తి వల్ల సుఖంలేదు. ఒక వ్యక్తిమీద పగతీర్చుకోవాలనే భావం కేశవపిళ్ళె మనస్సులో తొలిసారి ఉదయించింది. ఇంతకు ముందు అతనికి ఇలాంటి ఆలోచనే లేదు. ఉద్యోగరీత్యా తప్పుచేసిన ఉద్యోగస్థులను పనినుంచి తొలగించటం, సస్పెండు చేయటం, ప్రొమోషను ఆపి వేయటం - ఇలాంటి వుత్తర్వుల మీద సంతకం పెట్టి అలాంటి విషయాల్లో నిర్ణయం చేయవలసిన సందర్భాలు ఎన్నోవచ్చాయి. కాని అలాంటి సమయాల్లో ఎవరి మీదా ఎలాంటి విరోధమూ లేదు. అలాంటి వుత్తర్వుల మీద సంతకం చేసేప్పుడు 'ఇది బాగా లేద'ని మాత్రం అనిపించేది. అంతేగాని ఆనందం, తృప్తి అనుభవించే వాడు కాదు. కాని మిస్టర్ ఫిలిప్‌కు సంబంధించిన తొలి నివేదిక రాసేప్పుడు అతనికి చాలా సంబరం వేసింది. ఆ సంబరం, సరదా తప్పు అనే విషయమే కేశవపిళ్ళెకు భీతి హేతువయింది. "నీ వింత గొప్పవాడివయినావా?" అని ఎవరో అతని లోపల కూర్చుని బెదిరిస్తున్నట్టు తోచిందతనికి.

కాని కేశవపిళ్ళె దగ్గర దీనికి సమాధానం కూడా వుంది. "అతను నన్నెప్పుడూ వేధిస్తూ వుంటాడు" - అనే యీ సమాధానం సరియైనది గాదు.

మంత్రి వర్గం ఛిన్నాభిన్నమై పోవటం, కాంగ్రెసు పార్టీలో చీలిక లేర్పడటం - ఇలాంటి విషయాలు కేశవపిళ్ళెకు పెద్ద సమస్యలు కావు. వాటిని గురించి అతనేమీ ఆలోచించటం కూడా లేదు. ఈ మంత్రి వర్గం పోతే మరొకటి వస్తుంది. దానికేం ఫరవాలేదు.

ఆ రోజు సాయంత్రం కేశవపిళ్ళె కాత్యాయనీ అమ్మను దగ్గరకి పిలిచి అన్ని విషయాలూ వివరంగా చెప్పాడు. ప్రభుత్వ రహస్యం బయట పడింది,

బయట పెట్టిన వాళ్ళను కనుక్కున్నాం - ఇవన్నీ ఆమె కర్థంకావు. కానీ కేశవపిళ్ళె అన్ని విషయాలూ వివరంగా చెప్పాడు. ఆమె సలహాకోరి అలా చేశాడు. కేవలం అదే అతని వుద్దేశం. మరెవరిని అడుగుతాడు? అన్నీ విని కాత్యాయనీ అమ్మ అడిగింది: "వాళ్ళను ఉద్యోగం నుంచి తొలగించవలసిన పరిస్థితి యేర్పడిందా?"

"వెంటనే తొలగించవలసిందని నేను మంత్రులకు రాసి యిచ్చాను."

"వాళ్ళు అలా చేస్తారా?"

"ఈనాటి వరకూ నా అంతట నేను ఎవరినీ దండించవలసిందని చెప్పలేదు."

"మరి యిప్పుడలా చెప్పాలని యెందుకు తోచింది?"

"అతను ఎప్పుడూ మనకు విరోధంగానే వున్నాడు."

"అయితే దండించేందుకు మనమెవరం?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

కేశవపిళ్ళె సమాధానం చెప్పలేదు. అతనిలో కూర్చునివున్న ఒకవ్యక్తి యెవరో అదే ప్రశ్న అడుగుతున్నాడు. దానికి సమాధానం ఒకటే ఒకటివుంది. న్యాయమూర్తి యెదుట నిలబడి సమాధానం చెప్తున్నట్టుగా కేశవపిళ్ళె తన తప్పు ఒప్పుకుంటూ అన్నాడు: "ఇది ప్రభుత్వ కార్యం. అలా నేను చేసి తీరాలి. అది నా కర్తవ్యం. అందుకనే అలా చేశాను."

ఆ సమాధానం ఆ న్యాయమూర్తికి ఏమీ అర్థం కాలేదు. "ప్రభుత్వ కార్యం - అది ఒకరికి ద్రోహం చేసేందుకు కాదు. కొంచెం జ్ఞాపకం చేసుకోండి. ఏదో ఒక వుద్యోగం దొరికింది. ఆ వుద్యోగంలో ఉన్నత పదవి లభించింది. ఏదో విధంగా మన పని మనం చేసుకొని వెళ్ళి పోవాలి. అంతే. ఇతరుల శాపం మనకు తగల గూడదు."

మౌనంగా కూర్చుని వున్న కేశవపిళ్ళెను కాత్యాయనీ అమ్మ అడిగింది: "ఇన్ని సంవత్సరాల నుంచి మీరు చేసిందంతా సక్రమమేనా?"

కేశవపిళ్ళె తలయెత్తి చూచాడు.

అది సమాధానం కోరి అడిగిన ప్రశ్న కాదు.

దానికి సమాధానం కాత్యాయని అమ్మే చెప్పింది: "కాదు. అదంతా సరియైనది కాదు. అలాంటప్పుడు ఎవరో తప్పు చేస్తే వాళ్ళను శిక్షించటమెందుకు?"

"నేను ఈ రాష్ట్రంలో ముఖ్యమైన అధికారిని. నా మీద ఆ బాధ్యత వుంది. నేరస్థులను శిక్షించే అధికారం నాకు వుంది. పక్షపాతం పనికి రాదు." అన్నాడు కేశవపిళ్ళె

కాత్యాయనీ అమ్మ కచ్చితంగా దాన్ని నిరాకరించింది: "ఒకరి శాపాన్ని మీ మీదికి తెచ్చుకోకండి."

కాని కేశవపిళ్ళైలో తిష్ఠవేసుకున్న ప్రతీకారభావం వుండి వుండి తలయెత్తుతూ వుంది.

మర్నాడు మిస్టర్ ఫిలిప్సు ఛీఫ్ సెక్రటరీని కలుసుకున్నాడు. అది లూకోస్ చాకచక్యం. ఫిలిప్ పూర్తిగా ఓడిపోయినాడు. అతను పరాజిత వ్యక్తి. అలా వచ్చిన వ్యక్తికి కేశవపిళ్ళై గౌరవంగా స్వాగతం చెప్పాడు. మిస్టర్ ఫిలిప్ తను చేసిన తప్పులను బేషరతుగా ఒప్పుకునేందుకు సిద్ధంగా వున్నాడు. కాని కేశవపిళ్ళై దానికి సమ్మతించలేదు.

"మిస్టర్ ఫిలిప్! నేను ఇక్కడ వుండటం చాల ఆశ్చర్యకరమైన విషయం. ఇదంతా అదృష్టమనే అనుకోవచ్చు. అందువల్ల ఒకరు ఒకరిని క్షమాపణ కోరవలసిన పని లేదు." అన్నాడు కేశవపిళ్ళై.

తలుపు చాటున నిలబడివున్న కాత్యాయనీ అమ్మ అందుకు ఆమోదం తెలియపరిచింది - తల వూపుతూ. ఆ మాట ఆమెకు బాగా నచ్చింది.

ఫిలిప్ ఏవేవో చెప్పాలనుకొని అన్నాడు: "నావల్ల పొరపాటు జరిగింది."

కేశవపిళ్ళై అతన్ని ఎక్కువగా చెప్పనియ్యలేదు. "నీవేమో చేశావనుకోకు. ఒకవేళ నీవేమన్నా చేసినా, నేనా విషయమేమీ అనుకోలేదు. దాన్ని గురించి విచారించవలసిన పనిలేదు. అన్నీ మరిచిపో" అని చెప్పాడు కేశవపిళ్ళై. ఈ విధంగా వాళ్ళ మధ్య వాదం ముగిసిపోయింది.

నిజానికి కేశవపిళ్ళైకు అంతటితో కొంత ఓదార్పు కలిగింది. మనసులోని బాధ తొలిగిపోయింది. అలా తన భర్త సరిగ్గా ప్రవర్తించినందుకు కాత్యాయనీ అమ్మ అతన్ని అభినందించింది.

ఈసారి మంత్రి వర్గ సమావేశం స్నేహ సౌజన్యాలతో జరిగేట్టు లేదు. సమావేశం కొంచెం ఆలస్యంగా ఆరంభిస్తే బాగుంటుందని అనిపించింది కేశవపిళ్ళైకు. అతను మంత్రివర్గానికి సెక్రటరీ కూడాను. మంత్రులందరూ కోరేది కూడా అదే. ఈలోగా లూకోస్ అటూ ఇటూ తిరిగి చాలా హడావిడి చేశాడు. కాథలిక్ కాంగ్రెసు ప్రెసిడెంటుగా కూడా పని చేసే కాంగ్రెసు ప్రెసిడెంటు ఒక ప్రకటన చేశాడు. అందులో కొంత బెదిరింపు ఉంది. దానికేం ఫరవాలేదు. నాయర్, సర్వీస్ సొసైటీ ప్రెసిడెంటు. తన పదవికి రాజీనామా యిచ్చి కాంగ్రెసు ప్రెసిడెంటయినాడు. అతను కూడా బెదిరిస్తూ ఒక ప్రకటన చేశాడు. మంత్రులు, ఉద్యోగస్థులు ఎందుకూ పనికిరాని వాళ్ళని యెవరూ అనుకోకూడదని కూడా అందులో ధ్వనిస్తూవుంది. కాని దానికి విమర్శలూ, ప్రతి విమర్శలూ ఏమీ రాలేదు. ఫిలిప్సుకూ, కేశవపిళ్ళైకూ సఖ్యత ఏర్పడ్డ తర్వాత కాంగ్రెసు ప్రెసిడెంటూ, సెక్రటరీ యిద్దరూ కలిసి ఛీఫ్ సెక్రటరీని కలుసుకున్నారు. వాళ్ళు కూడగట్టుకొని ఐక్యంగా వుండే పరిస్థితి యేర్పడింది. మంత్రి కురుప్పును ఎదిరించి అతనిమీద ఆరోపణలు చేసిన యం.యల్.ఏ.లు కూడా కొంతవరకు శాంతించారు. మంత్రి కురుప్పుతో

వాళ్ళకు సఖ్యం కుదిరింది. ఆరోపణ కర్తలయిన యం.యల్.ఏలకు బస్ రూట్ స్వాయత్తం కావాలి.

కాని ముఖ్యమంత్రి మొండి పట్టు పట్టాడు. అవినీతి అనేది కనిపిస్తే దాని అంతు కనుక్కొని తీరాలని అతని అభిప్రాయం. తప్పు చేసిన వుద్యోగస్థులు - వాళ్ళు ఎవరయినా సరే - శిక్ష అనుభవించి తీరాలి. ఆ కారణంగా విధానసభ విచ్ఛిన్నం కావలసి వస్తే కానీ. అందుకు విచారించవలసిన పని లేదు. అంటాడు.

ముఖ్యమంత్రి మనస్సులో ఏముందో యెవరికీ తెలియదు. ఆయన్ని కూడా తమవైపు తిప్పుకునేందుకు అందరూ కష్టపడి ప్రయత్నించారు. కాని యేమీ లాభం లేకపోయింది. చివరకు ఛీఫ్ సెక్రటరీ, మిగిలిన మంత్రులు, కాంగ్రెసు ప్రెసిడెంటు - అందరూ కలిసి ఒక నిర్ణయానికి వచ్చారు. ముఖ్యమంత్రి, తమతో ఏకీభవించకపోతే పోనీ. రాజీనామా యిస్తే ఇయ్యనీ. మరో ముఖ్యమంత్రిని ఎన్నుకోవచ్చు. ఆయన తన తోటిమంత్రులను ఎన్నుకుంటారు. ఇప్పుడు మంత్రి వర్గంలో వున్న మంత్రులందరూ నూతన మంత్రివర్గంలో కూడా వుంటారు.

కేశవపిళ్ళె చాలా నేర్పుతో ఆ మంత్రివర్గ సమావేశాన్ని నిర్వహించాడు. తన మార్గానికి ఏమీ అంతరాయం లేకుండా, ఏవిధమయిన అలజడీ జరగకుండా అతను పూర్తిగా జాగ్రత్త పడ్డాడు. ఛీఫ్ సెక్రటరీ ఏ మాత్రం పక్షపాతం లేని వాడనీ, చాలా నిజాయితీ కలవాడనీ అందరికీ అనిపించింది. కానీ ముఖ్యమంత్రి రాజీనామా యిచ్చాడు.

మర్నాడు పత్రికల్లో, ఈ వార్త పెద్దపెద్ద అక్షరాల్లో ప్రకటింపబడింది. వెంటనే ముఖ్యమంత్రిని ఎన్నుకునేందుకు మంత్రివర్గం సభ్యులనందరినీ సమావేశపరిచింది. మంత్రి వర్గంలోని కొందరు సభ్యులు ముఖ్యమంత్రితోపాటు బయటికి వెళ్ళారు. అయినా కాంగ్రెసుకు విధాన సభలో మెజారిటీ లభించింది. వాళ్ళు కొత్త నాయకుణ్ణి ఎన్నుకున్నారు. పార్టీలో కొంత వైమనస్యం ఏర్పడ్డది. చాలామంది ముఖ్యమంత్రి పదవికోసం పాకులాడారు. ఏమయినా సరే, లంచగొండితనం ఆరోపింపబడ్డ వ్యక్తులు మంత్రి వర్గంలో వుండకూడదనే వాదానికి వార్తా పత్రికల్లో స్థానం వచ్చింది. కొత్త మంత్రుల పేర్లు కూడా విన వచ్చాయి.

నూతన నాయకుడు తనతోటి మంత్రులపేర్లు ప్రకటించాడు. వెనకటి మంత్రులందరూ నూతన మంత్రి వర్గంలో అలాగే వున్నారు. ముఖ్యమంత్రి మాత్రం మారాడు.

లూకోసుకు మనసు కుదుటపడింది. ఇక కొంచెం విశ్రాంతి తీసుకోవచ్చునని అనిపించిందతనికి.

## ముప్పై రెండు

ఎక్కడ చూసినా అవినీతిని గురించే ప్రజలు చెప్పుకుంటున్నారు. ఇదే కొత్త విషయంగా ప్రచారంలోకి వచ్చింది. ఇంతవరకూ తిరువితాంకూరు ప్రజలకు బొత్తిగా తెలియని కొత్త విషయం ఒకటి యిప్పుడందరికీ అనుభవంలోకి వచ్చినట్లయింది. అందరూ అదే మాట అనుకుంటున్నారు.

ప్రభుత్వం ఈ విషయం పట్టించుకోకుండా ఉండే పరిస్థితి దాటిపోయింది. ప్రభుత్వపు ఉత్తర్వు ప్రకారం కేశవపిళ్ళై అవినీతి నిరోధక ప్రణాళికను రూపొందించాడు. ప్రభుత్వపు ఆమోదంతో ఆ ప్రణాళికను అమలు పరచటం కూడా జరిగింది.

అవినీతి పరులయిన ప్రభుత్వోద్యోగుల పట్ల ఎలాంటి దయా దాక్షిణ్యాలూ చూపించటం జరగదని ప్రభుత్వం తరఫున ప్రతి మూడు నెలలకూ ఒక ప్రకటన ప్రచురింపబడుతూ వుంది. చాలా మంది వుద్యోగస్థులు దాన్ని అట్టే పట్టించుకోలేదు.

ఈ విషయం కేశవపిళ్ళై తన భార్యకు తెలియజెప్పాడు. అన్ని విషయాలూ జాగ్రత్తగా విని కాత్యాయనీ అమ్మ అన్నది: "అయితే దేవీకులంలో మన ఏలక్కాయల తోటకు ఈనాటి నుంచీ మనమే ఖర్చు పెట్టాలన్న మాట."

అలాగే చెయ్యాలన్నాడు కేశవపిళ్ళై. కాత్యాయనీ అమ్మ తన భర్త తెలివితేటలను గుర్తించినట్టుగా అడిగింది: "అయితే యీ నియమాలన్నీ మన తోటపని పూర్తయిన తర్వాత ఏర్పరచి వుండాల్సింది."

బదులుకు బదులు సమాధానం చెప్పే అవకాశం కేశవపిళ్ళైకు లభించింది–

"మనకున్నది మనకు చాలదా అని అంటుండే దానివి గదా? ఇప్పుడిలా ఎందుకనిపిస్తున్నది?"

కాత్యాయనీ అమ్మ నోరు మూయించగల ప్రశ్న కాదది. "నిజమే. నా కెప్పుడూ తృప్తే. ఉన్నదానితో నేను తృప్తి పడతాను. కానీ అలా అని యింతకంటె ఎక్కువ అక్కర్లేదని కాదు. నేను కూడా ఆడకూతుర్ని. ఏలక్కాయల తోట మనకుంటే సంతోషమే. లేకున్నా ఫరవాలేదు, అంతే." అన్నదామె.

ఆమెకు ఒక ప్రశ్న అడగాలని వుంది. అది అవినీతికి సంబంధించిన ప్రశ్న. ఈ అవినీతిలో అన్యాయం, అక్రమం ఎక్కడ వుందో ఆమెకు బోధపడటం లేదు. "సముద్రం ఒడ్డున కూర్చుని జీతం బత్తెం లేకుండా అలలు లెక్కపెడుతూ వుండమన్నా హాయిగా జీవితం గడపగలనని అనే వారు మామగారు. నేనే ప్రశ్న అడుగుతాను. ఎవరయినా పని సానుకూలమయిన తర్వాత నాలుగు డబ్బులిస్తే అందులో తప్పేమిటి? పని

సానుకూలవుయిన తర్వాతనే కదా అతనినన్నాడు? ఊరికే యిస్తున్నాడా యేమిటి?" అన్నదామె.

అతను వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. నిజానికి కేశవపిళ్ళై తన ముఖ్యమైన రాజ్యానికి సర్వోన్నత అధికారి. ఆ ప్రశ్నకు సమాధానం అతనికి తెలియదని చెప్పేందుకు వీల్లేదు. అలాంటి సన్నివేశం ఒకటి తీసుకొని అందులో అన్యాయం ఎక్కడ వుందీ, అది అవినీతి ఎలా అవుతుందీ అనే విషయాలు ఆయన క్షుణ్ణంగా చెప్పగలడు. అవినీతి ఎన్ని రకాలుగా వుంటుందో, అతనికి బాగా తెలుసు. కానీ అవన్నీ చెప్పటం అతనికి చేతకావటం లేదు. చెప్పటం మొదలు పెడితే న్యాయాన్ని గురించి, నీతిని గురించి, పరిపాలనను గురించి అన్నీ చెప్పాల్సి వస్తుంది. అది సముద్రాన్ని మించిన ఇతివృత్త మవుతుంది. అదే అతని చేతగాని తనం.

"మాట్లాడకుండా కూర్చున్నారేం? నేనడిగిందానిలో తప్పేమీ లేదు గదా?" అని అడిగింది కాత్యాయని అమ్మ.

కచ్చితంగా తప్పని చెప్పేందుకు కేశవపిళ్ళైకు మనస్కరించలేదు. కేశవపిళ్ళై కూడా వందల సంవత్సరాల నుంచీ వస్తున్న సామూహిక న్యాయ నియమావళి నుంచి ప్రాదుర్భవించిన ఒక వ్యవస్థకు వారసుడని చెప్పవచ్చు. అవినీతి అనబడేది అంతా తప్పనిగాని పాపమని గాని కేశవపిళ్ళై కూడా చెప్పలేడు. ఈ మార్పును అతను యథాతథంగా ఆమోదించ లేదు కూడా. కాని అవినీతిని ఖండిస్తూ అతను పాఠం వల్లెవేసిన విద్యార్థిలాగా వాదించగలడు. మధ్యలో ఏదయినా చెప్పవలసి వస్తే పాఠం మరిచిపోయిన విద్యార్థిలాగా అతని వాక్సూత్రం కూడా మధ్యలో తెగిపోతుంది. అవినీతీ, లంచగొండితనం పాపమనే ఆలోచన అతనికెప్పుడూ రాలేదు. అలాంటి ఆలోచన కలగజేసే క్రమశిక్షణ కూడా అతనికి లభించలేదు. లంచం తీసుకునేప్పుడు ఎవరూ చూడకుండా వుండాలి. అంతే. కేశవపిళ్ళై వెనకటి వుద్యోగస్థుల్లాగా జీవనోపాధి కోసం పదిహేను రూపాయల నెల జీతంతో నౌకరీలో చేరాడు. ఆ నెల జీతంతో పాటు పద్మనాభస్వామి ప్రసాదంలాగా కొద్దో గొప్పో పై సంపాదన వుంటుందనే నమ్మకంతోనే అతను వుద్యోగంలో ప్రవేశించాడు. కేవలం పదిహేను రూపాయలకోసం కాదు. పైసంపాదన కోసం పాకులాడటం అన్ని పదవుల్లో వుంటుంది. ఉద్యోగస్థుల్లో గుసగుసలూ మరోరకంగా వుంటాయి. మరి చాకచక్యంతో నేర్పుగా పని చెయ్యాలనటం దేనికి? అందుకే... ఈ పరంపరకు చెందిన అధికారి కేశవపిళ్ళై అవినీతిని గురించి అదే ధోరణిలో చెప్పవచ్చును గదా? నూతన విధానానికి లొంగిపోయిన కేశవపిళ్ళై అన్నాడు: "అందరికి వాళ్ళ వాళ్ళ అభిప్రాయం చెప్పే అధికారం వుంది. దుర్మార్గులూ, రౌడీలూ ఎన్నుకొన్న వ్యక్తులే సాధారణంగా పరిపాలనలో ప్రవేశిస్తారు. ఆ దుర్మార్గులే, రౌడీలే, దొంగలే యిక్కడ ప్రభువులు."

తను తగిన సమాధానం చెప్పాననే అతనికి అనిపించింది. పరువు ప్రతిష్ఠలుగల ధనవంతుల బలవంతుల కాలం పోయింది.

"అలా అయితే ధరలు పెరుగుతున్న యీ రోజుల్లో పైసంపాదన ఏమీ లేకుంటే జీవితం ఎలా జరుగుతుంది?" అన్నది కాత్యాయనీ అమ్మ.

"ఉద్యోగం కాపాడుకోవాలంటే ఎలాగో జీవించి తీరాలి."

"బాగుంది."

కాత్యాయనీ అమ్మ మరో ప్రశ్న అడిగింది:

"లంచం తీసుకుంటున్నారని చెప్పి కొంతమందిని పదవుల నుంచి తొలగించి వాళ్ళ భార్యా బిడ్డల వుసురు పోసుకోబోతున్నారా?"

"అవసరమయితే తప్పేదేముంది?" అన్నాడు కేశవపిళ్ళె.

"లేదు, అలా చెయ్యటం తప్పు" - ప్రతిఘటించింది కాత్యాయనీ అమ్మ.

అలా వుద్యోగం పోయిన కుటుంబాల కష్ట సుఖాలను గురించి ఆలోచించవలసిందని కాత్యాయనీ అమ్మ భర్తకు చెప్పింది.

కొత్తగా ఏర్పడ్డ అవినీతి నిరోధక నియమాలకు మొదట బలిఅయిన వ్యక్తి పెరుంబావూరులో ఒక బంట్రోతు - నాణు నాయరు. ఎవరికో సర్టిఫికేటు తిరిగి యిచ్చి నందుకు అతను పది పైసలు తీసుకున్నాడు. ఇచ్చిన వ్యక్తి కాంగ్రెసుకు చెందిన ధనవంతుడు. అతనికి తన నష్టాన్ని గురించి యేమీ విచారించవలసిన పని లేదు. కాని గాంధీ మార్గావలంబిగా అతని అభిప్రాయంలో ఇక్కడ పరిపాలన అంతా అవినీతి రహితంగా జరగాలి. ఆయన తిన్నగా మంత్రికి అర్జీ పంపించాడు. మంత్రి దానికి సంబంధించిన వుద్యోగస్థులకు ఆ అర్జీని పంపించాడు.

నాణు నాయరు రిటైరయ్యేందుకు దాదాపు రెండు సంవత్సరాలున్నాయి. ఆ సమయంలో అతనికి ఈ దెబ్బ తగిలింది. మామూలుగా ఒక సర్టిఫికెటు తీసుకునేందుకు రిజిస్ట్రారు ఆఫీసులో ఫీజు పధ్నాలుగు పైసలు. నాణు నాయరు పద్దెనిమిదేండ్ల వయస్సులో వుద్యోగంలో ప్రవేశించాడు. అప్పుడతను రిజిస్ట్రారుగారింట్లో వంటమనిషిగా పని చేసేవాడు. అయ్యగారి దయవల్ల అతనికి వుద్యోగం దొరికింది. అతను వుద్యోగంలో ప్రవేశించిన రోజుల్లో సర్టిఫికేటు ఇచ్చినందుకు బంట్రోతుకు రెండు పైసలిచ్చే వాళ్ళు. అది క్రమంగా హెచ్చి పధ్నాలుగు పైసలయింది. అలా పైసలడగటం తప్పని నాణునాయరుకు అనిపించలేదు. రిజిస్ట్రారాఫీసులో సర్టిఫికేటు రాయించుకునేందుకు అయ్యే ఖర్చు లాంటిదే యిది కూడా అనుకొని పాపం తనూ తీసుకున్నాడు.

పెరుంబావూరు రిజిస్ట్రారు ఆఫీసులోని బంట్రోతు నాణునాయరు మెడకాయ ప్రభుత్వపు నీతీ నిజాయితీ అనే యినుప సంకెళ్ళలో చిక్కిపోగానే మిగిలిన వాళ్ళకు కళ్ళు తిరిగాయి. ఎవరికి వాళ్ళు తప్పించుకునేందుకు

జాగ్రత్త పడసాగారు. 'ఎనాత్తు పార్వత్యం వర్గీస్, తాన్నివకోట హెడ్ కాన్‌స్టేబుల్ కుట్టన్ పిళ్ళె, చేర్తలా మున్సిఫ్ కోర్టు బంట్రోతు – ఇలా జాబితా పెరిగిపోతూ వుంది. పత్రికల్లో యీ వార్త తాటికాయల్లాంటి పెద్ద పెద్ద అక్షరాల్లో ప్రచురింప బడింది. అవినీతిని నిర్మూలించేందుకు ప్రభుత్వ కార్యక్రమం నిర్దాక్షిణ్యంగా సాగిపోతూ వుంది. అక్కడక్కడా జరిగే సమావేశాల్లో మంత్రులు ఇలా చెప్తున్నారు:

"అవినీతి నిర్మూలన కార్యక్రమం ఆరంభమయింది. ఇది యిలా సాగుతూనే వుంటుంది. కొన్ని సంవత్సరాలకు ఈ అవినీతి మన రాష్ట్రంలో పూర్తిగా రూపుమాసి పోతుంది."

కేవలం బంట్రోతులే కాక కొంతమంది ఉన్నతోద్యోగులు కూడా ఇందులో చిక్కుకున్నారు. ఒక ఫారెస్టరు, ఒక రెవెన్యూ ఇన్స్పెక్టరు, హవల్దారు – ఇలా మరి కొంతమంది యీ జాబితాలో చేరారు. కేవలం లంచం తీసుకోవటమే కాక, స్వజన పక్షపాతం, ప్రభుత్వానికి నష్టం కలిగే పనులు చెయ్యటం – ఇలాంటి అవినీతి కూడా వుంది. అన్ని రకాల మనుష్యులనూ పట్టుకున్నారు. వాళ్ళల్లో చాలామందిని ఉద్యోగాలలో నుంచి తీసి వేశారు.

ఆ రోజు, మంత్రివర్గంలో అలజడి చెలరేగక ముందు – గోపీ చేసిన ఆరోపణలకు సమాధానం రాసిన తర్వాత నారాయణ నాయరు ఎక్కడికి బయటికి రాలేదు. అలా రాకుండా వుండటం సమంజసమా కాదా అని నాయరు తనను తానే ప్రశ్నించుకునే వాడు. గోపి చెప్పిందంతా నిజమే. కానీ దానికి ప్రమాణమేమీ లేదు. నాయరు చెప్పిన దానికి ప్రభుత్వపు కాగితాలు నిదర్శనంగా వున్నాయి. అయినా నిజం మాత్రం అటు వైపు చూసి వెక్కివెక్కి యేడుస్తూ వుంది. నిష్కళంకమైన సుదీర్ఘ జాతీయ సేవ ఎవరి మనస్సునయినా నీతి సమ్మతమైన మార్గం వైపు మరల్చలేదా?

ఏది యేమయినా నాయరుకు ఇతరులను చూసేందుకు ముఖం చెల్లటం లేదు. చేయకూడని పని చేశానని అతనికి బాధగా వుంది. ఏమీ చెయ్యకుండా, ఎవరికీ కనిపించకుండా అతను గుహలో కూర్చుని వున్నాడు. అయినా నాయరుకు ఒక విధంగా మనశ్శాంతిగా వుంది. కమ్యూనిస్టుల అసలు రంగు బయట పెట్టేందుకు ఆ వ్యాసం ఉపకరించింది. అదే అతనికి తృప్తి. ఆ రోజున అతనికి కొంత డబ్బు కూడా వచ్చింది. దురవస్థలో వున్నందువల్ల అతను డబ్బు తీసుకున్నాడు. జైలు నుంచి బయటికి వచ్చిన రోజు అతనికి కట్టుకునేందుకు ధోవతి కూడా లేదు. ఒకపూట భోజనానికి కూడా మార్గం కనిపించలేదు. ఉద్యమం కొనసాగిన రోజుల్లో ఇలాంటి సమస్యలు ఎక్కడా ఎన్నడూ లేవు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఒక్కపూట భోజనం కూడా కరువయింది. అందరూ ఉద్యమం నాటి మాటలు చెప్పుకుంటూ వుంటారు.

"అన్నం తిన్నావా?" అని అడిగేవాళ్ళు లేరు. అన్నం కావాలని అడగటమంటే ఆ ధర్మవీరునికి నామోషి.

ఈ పోరాటంలో ప్రవేశించి వుండకూడదని అనిపిస్తుంది అప్పుడప్పుడూ నాయరుకు. తన పని తాను చూచుకుంటూవుంటే కాలక్షేపం జరిగేది. జీవితమంతా వ్యర్థమయిపోయింది. ఏమీ సాధించలేక పోయినాడు. పది పైసలు సంపాదించుకొనే మార్గం ఏమయినా వుందా అంటే అదీ లేదు. నిజానికి, నాయరు మెదడు పని చెయ్యటం మానేసింది. లూకోస్ ఇచ్చిన డబ్బు ఖర్చయిపోతున్నది. ఒక్కొక్క రూపాయి లెక్కపెట్టి ఖర్చుపెడుతున్నాడు.

చిక్కులో ఇరుక్కున్న ఒక తహసీల్దారు ఎలాగో కనుక్కుని నాయరు దగ్గరికి వచ్చాడు. పేష్కారు విచారించి ప్రభుత్వానికి నివేదిక పంపించాడుట. తర్వాత ఏమవుతుందో తెలియదు. నాయరుకు అతని విషయం ఏమీ తెలియదు. తహసీల్దారు కూడా అలా వదిలే వ్యక్తి కాదు-

"నీవు తలుచుకుంటే నన్ను కాపాడగలవు. లేకుంటే నేనూ నా కుటుంబమూ ఆకలితో మలమల మాడిపోతాం. తప్పు చెయ్యకుండానే నేను శిక్ష అనుభవించవలసి వస్తుంది." అన్నాడు. ఆ కథ సాంతం వినాలనిపించింది నారాయణ నాయరుకు. తప్పులేకుండా శిక్ష విధించటం తప్పుకదా! అతని ధర్మబుద్ధి మేల్కొన్నది. తహసీల్దారు, తన మీద నేరారోపణ చేసిన కథంతా, నాయరుకు చెప్పాడు. "ఇది కొత్త రిజిస్ట్రేషనుకు సంబంధించిన విషయం. పతనంతిట్ట జిల్లాలో ఒక కొండను తక్కువ ధరకు రిజిస్టరు చేయించవలసిందని యం.యల్.ఎ తమ్ముడు కోరాడు. అది ఒప్పుకొన దగిన కోరిక కాదు. ఈ లోగా యం.యల్.ఎ. తమ్ముడు కొండను ఆక్రమించేందుకు ప్రయత్నించాడు. తహసీల్దారు దాన్ని ఆటంకపరచవలసి వచ్చింది. మరో దరఖాస్తు దారుకు అది రిజిస్టరు చేయటం జరిగింది. ఈ విషయంలో ఆ యం.యల్.ఏ జోక్యం చేసుకున్నాడు - 'నీకు గుణపాఠం చెప్తాను' అని బెదిరించి వెళ్ళాడు. మరో సందర్భంలో మరో వ్యక్తి దగ్గర నేను లంచం అడిగానని నా మీద నేరం మోపారు. ఆ తర్వాత ఆ యం.యల్.ఏను గురించి తహసీల్దారు చాలా కథలు చెప్పాడు. ఉద్యోగస్థులందరూ ఆయన చెప్పినట్టు చెయ్యాలిట. లేకుంటే బదిలీలు, ప్రామోషన్లు రాకపోవటం వగైరాలు తప్పవు. ఇప్పుడీ అవినీతి నిర్మూలనం ఆరంభమయిన తర్వాత ఇతని వుద్యోగం పోయింది.

"ఏ విషయంలో నయినా యం.యల్.ఏకు కావలసిన వ్యక్తిని ఎవరైనా అరెస్టు చేస్తే ఆయన వెంటనే విడుదల చేయిస్తాడు. అతనికి గిట్టనివాళ్ళ మీద పోలీసులు కేసు నడిపించితీరాలిట. అతనికి ఇష్టం లేనివాళ్ళకు ఎలాంటి న్యాయం జరగకూడదు - ఇదీ అతని వ్యవహారం. రెవెన్యూ,

గృహమంత్రి అతనికి బంధువు. గృహమంత్రి ఆ వైపు వస్తే అతను ఆయన కూడానే వుంటాడు."

"నీ కేసు నిదర్శనాలెలాంటివి?" అడిగాడు నాయరు.

"నిదర్శనాలన్నీ తప్పుడువే. అన్నీ కల్పితాలే. యం.యల్.ఏ. కల్పించిన తప్పుడు సాక్ష్యాలు." అన్నాడు తహసీల్దారు.

అన్నీ విన్న తర్వాత ఆ విషయంలో జోక్యం కలుగ జేసుకుందామనిపించిందతనికి. నాయరులో నిద్రాణమయిన తిరుగుబాటుతనం మేల్కొన లేదని చెప్పేందుకు వీల్లేదు. చాలామంది ప్రజాప్రతినిధులను గురించి అతనిలాంటి కథలు విన్నాడు. కొన్ని కథలు అర్థం చేసుకునే అవకాశం కూడా అతనికి దొరికింది. కాబట్టి తహసీల్దారు చెప్పిన కథలో కూడా నిజం లేకపోదు. "ఈ విషయాలను ఆధారంగా తీసుకొని నేనొక వ్యాసం వ్రాయనా? అది ప్రజలలో బాగా నాటుకుపోతుంది." అన్నాడు నాయరు.

"అలా చెయ్యకండి" అన్నాడు తహసీల్దారు వెంటనే. తహసీల్దారు మరో మార్గం సూచించాడు: "మీరు నాతోపాటు తిరవనంతపురం దాకా రండి చాలు. అక్కడ ఒకరిద్దరి దగ్గరకి వెళ్ళి చెబుదాం."

ఎక్కడ ఎవరితో ఏం చెప్పాలో తెలియక నారాయణ నాయరు అడిగాడు: "ఎవరితో చెప్పాలి? ఏం చెప్పాలి?"

"ఛీఫ్ సెక్రటరీతో చెప్పాలి. ఇలాంటి కాగితాలు ఆయనే చూస్తాడు."

నాయరు ఉలిక్కిపడి అడిగాడు : "ఛీఫ్ సెక్రటరీతోనా? అతను చాలా యుక్తిపరుడు."

"అతను చాలా తెలివిగలవాడు. ఆ విషయం అందరికీ తెలుసు. అందుకే అతన్ని కలుసుకోవాలన్నాను. ఈ గొడవను సరిచేయగల వ్యక్తి అతనే. ఏ యం.యల్.ఏ కూడా అతన్నేమీ చేయలేడు. పైగా ఆ యం.యల్.ఏ నే అతను బుట్టలో వేసుకుంటాడు."

వెనకటి విషయాలు నాయరుకు జ్ఞాపకం వచ్చాయి. "అతను పెద్ద లంచగొండి. ఇప్పుడతనికి ఈ విషయం చెబితే కాలం మారిందని అనుకోక వెంటనే చెయి జాపుతాడు." అన్నాడు నాయరు.

తహసీల్దారు వెనుతీయలేదు. "దానికేం? ఆయన హెూదాకు తగినట్టుగా ఏదో సమర్పించుకుంటాం." అన్నాడు.

ఈ విధంగా తహసీల్దారూ, నారాయణ నాయరూ ఒక నిర్ణయానికి వచ్చారు.

కేశవపిళ్ళె నారాయణ నాయరుకు ఘనంగా స్వాగతం పలికాడు. అతని ప్రవర్తనలో వ్యంగ్యం కాని, జుగుప్సకాని వుంటుందని అనుకున్నాడు నాయరు. కాని అలాంటిదేమీ లేదు. ఎందుకు వచ్చారని అడిగాడు ఛీఫ్ సెక్రటరీ.

నాయరు నిర్మొహమాటంగా చెప్పాడు. అన్ని సంగతులూ విన్న తర్వాత తాను చేయగలిగిందేమీ లేదని చెపుతూ ఆయన సమాధానం చెప్పాడు:

"ఈ విషయంలో నేనేమీ చేయలేననుకుంటానేయ్ మిస్టర్ నాయర్! ఇలాంటి విషయాల్లో నిర్దాక్షిణ్యంగా వ్యవహరించవలసిందని ఉత్తర్వు. నేనేమన్నా చేస్తే అది న్యాయ సమ్మతమైనా నీతియుక్తమయినా నమ్మక ద్రోహమవుతుంది. అదీకాక ఈ విషయంలో యం.యల్.ఏకు చాలా ఆసక్తి వుంది. పరిషత్తులో ఛీఫ్ సెక్రటరీ అవినీతి పరుడని కేకలు పెడితే నా పరిస్థితి యేమవుతుంది? ఏమంటావ్? అతనలా అనడంటావా?"

"కావచ్చు" అని ఒప్పుకున్నాడు నారాయణ నాయరు.

ఛీఫ్ సెక్రటరీ వివరంగా చెప్పాడు: "కొంచెం ఆలోచించండి, వీళ్ళందరిని గురించి విచారణ చెయ్యకపోతే ఏమవుతుంది? అవినీతి నిర్మూలన కార్యక్రమాన్ని సక్రమంగా కొనసాగించే బాధ్యత నామీద వుంది. నేను దయతలిస్తే బాగుంటుందా?"

"బాగుంటుంది" అనలేక పోయినాడు నాయరు. అతని కంత ధైర్యం లేకపోయింది. అయినా అతనన్నాడు: "నిజానికి తహసీల్దారు నేరస్థుడు కాదు. అతనికి యం.యల్.ఏ తో విరోధం ఏర్పడ్డందువల్ల ఈ కేసు కల్పించబడింది. నేరం చెయ్యని వాడికి శిక్ష విధించటం..."

"తప్పు, అక్రమం" అన్నాడు కేశవపిళ్ళె నారాయణ నాయరు వాక్యం పూర్తి చేయకముందే అతనితో ఏకీభవిస్తూ. "నీవు చెప్పిన ప్రకారం అంతా అబద్ధమే. కాని కాగితపు దాఖలాలు అందుకు విరుద్ధంగా వున్నాయి. నిజానికి నేరం కల్పితమయినా నిజమనే భావించబడుతుంది."

ఒక్క క్షణం ఆగి ఛీఫ్ సెక్రటరీ అడిగాడు: "ఇలాంటి పనులు సాధించేందుకు సాక్ష్యాలు వెతుక్కోవలసిన పని లేదు. ఒక్క గోపీ చేసిన ఆరోపణే చాలు. గోపీ చేసిన ఆరోపణలు నిజం కావంటావా? ఇలాగే ప్రతిరోజూ అన్ని పనులూ జరుగుతూ వున్నాయి."

నారాయణ నాయరు కొంచెం సందేహించాడు. ఛీఫ్ సెక్రటరీ కొంచెం ఆగి అన్నాడు: "ఒక్క విషయం చెప్తాను. ఎన్ని వలల్నో తప్పించుకున్న చేప ఒక పాతవలలో చిక్కుకుంటుంది. ఈ తహసీల్దారు ఈ కేసులో నేరస్థుడు కాకపోవచ్చు. కాని యింతకు ముందు తప్పులు చేసి వుండచ్చు."

బహుశా చేసి వుండచ్చని నారాయణ నాయరు ఒప్పుకున్నాడు. కాని యీ పని నావల్ల కాదని తప్పించుకునేందుకు నాయరుకు మనస్కరించలేదు. అది ఒక లోపం. దానికి ఎన్నో కారణాలున్నాయి. తనతోటి కార్యకర్తలూ, కాంగ్రెసును ఎదిరించిన వాళ్ళూ ఈనాడు యం.యల్.ఏలుగా ప్రెసిడెంటుగా డబ్బు సంపాదిస్తున్నారు. ఈ విషయం నాయరు కళ్ళారా చూస్తున్నాడు, గమనిస్తున్నాడు. తాను అలా ఎందుకు చెయ్యలేక పోతున్నాననే ఆలోచన

అతని మనస్సులో కొంచెం ప్రవేశించింది. అందులో తప్పేముంది? రాష్ట్రమే అతనికి తిండి పెట్టాలి.

"మరి దీనికి మార్గమేమిటి? ఎలాగయినా సరే, మీరీ పనిచేసి తీరాలి. మీరే నాకు శరణ్యం. వేరే దిక్కు లేదు." అన్నాడు నాయరు దిక్కులేని వాడిలా.

తహసీల్దారును గురించీ, అతని కుటుంబం యొక్క దయనీయ స్థితిని గురించీ నాయరు వివరంగా చెప్పాడు. అన్నీ ఓపికగా విని కేశవపిళ్ళై అన్నాడు:

"నన్నేం చెయ్యమంటావ్? ఇలా చెయ్యమని చెప్పు చేస్తాను. నాకేమీ ప్రమాదం రాకూడదు. ఇలాంటి కేసుల్లో చిక్కుకున్న కుటుంబాల స్థితి నేను చూస్తూ వున్నాను. అందువల్ల ఎవరికీ ద్రోహం తలపెట్టకుండా - మా ఆవిడ మాటల్లో చెప్పాలంటే - ఎవరి ఉసురూ తగలకుండా రిటైరవాలని వుంది. అందువల్ల ఆ తహసీల్దారుకు సాయం చేయటం నాకు ఇష్టమే."

చీఫ్ సెక్రటరీ పూర్తిగా పట్టుబడకుండా నిలబడ్డాడు. అలా నిలబడ్డందుకు కారణం వెనకటి అనుభవాన్ని పురస్కరించుకొని నాయరు వూహించాడు. పట్టుబడేందుకు చెయ్యి జాపి తీరాలి. వెంటనే మాట్లాడకుండా నాయరు ఒక కవరు బయటికి తీసి టేబిలు మీద పెట్టాడు.

"ఇదేమిటి?" అన్నాడు చీఫ్ సెక్రటరీ.

నాయరు సిగ్గుతో మౌనంగా కూర్చున్నాడు. ఏమీ మాట్లాడలేదు.

"అక్కర్లేదు. ఇందుకోసం నేను మాటలు పెంచలేదు. అది నేను మానేశాను. అవినీతి నిర్మూలనకు బాధ్యత వహించిన వ్యక్తిని, నిన్ను చూసి యీ తప్పును మన్నిస్తున్నాను." అన్నాడు చీఫ్ సెక్రటరి.

"అది తీసుకో మిస్టర్ నాయర్." అన్నాడు మళ్ళీ, ఆజ్ఞాపిస్తున్న ధోరణిలో.

నాయరు సందేహించాడు. కేశవపిళ్ళై అదే ధోరణిలో మళ్ళీ ఆజ్ఞాపించాడు: "ఊ! తీసుకో".

నాయరు ఆ కవరును తీసుకున్నాడు. "ఇది ఎక్కడి నుంచి తీశావో అక్కడే పెట్టుకో" అన్నాడు కేశవపిళ్ళై.

నాయరు అలాగే చేశాడు. ఒక క్షణం ఆగి చిరునవ్వుతో కేశవపిళ్ళై అన్నాడు : "ఆందోళన పడకు. సిగ్గు పడవలసిన పని కూడా లేదు. ఇది సరియైన పని కాదని నాకనిపించింది. అంతే. ఎప్పటిలాగా మనం మాట్లాడుకోవచ్చు."

నాయరుకు మాట్లాడే ధైర్యం వచ్చేందుకు కొంతసేపు పట్టింది. అప్పటికి కూడా అతను చెప్పతలుచుకుంది ఒక్కటే: "ఏదో మార్గం చూపించాలి. చూపించి తీరాలి."

చిరునవ్వు నవ్వుతూ ఛీఫ్ సెక్రటరీ అన్నాడు: "ఏం మార్గం చూపించను నేను?"

"లేకుంటే నేనిక్కడి నుంచి వెళ్ళను. మీరు ఆలోచిస్తే ఏదో మార్గం దొరుకుతుంది."

కొంచెం సేపు ఆలోచించి కేశవపిళ్ళై మెల్లిగా అన్నాడు: "నేనో మార్గం చెప్తాను. ప్రయత్నిస్తావా?"

"తప్పకుండా, లేకుంటే మరి చేసేదేముంది?"

"సరే. మంత్రి ఉమ్మన్‌తో నీకేమయినా పరిచయముందా?"

నాయరుకు అంత పరిచయం లేదు. ఉమ్మన్ సమ్మేలకు సంబంధించిన వ్యక్తి కాదు.

"అయితే మాత్యూను గట్టిగా పట్టుకో. ఆయన చేత ఉమ్మనుకు చెప్పించు. మిస్టర్ ఉమ్మన్ ఈ కేసు తేల్చమని నాకు చెబితే చాలు." అన్నాడు ఛీఫ్ సెక్రటరి.

"మాత్యూ వింటాడా?" అన్నాడు నాయరు.

"అది నాకు తెలియదు. నీవు చెప్తే కాదంటాడా?"

"అతను ఒప్పుకోకపోతే?" అడిగాడు ఆలోచించి నాయరు.

"అలా అవుతుందా? అయితే లూకోసును పట్టుకోవాలి."

"ఇంత చేసినా కేసు తీర్మానించవలసింది మీరేగా?" అన్నాడు నాయరు.

"మంత్రిగారు చెప్తే నేనెలా కాదనగలను? ఈ మాత్రం నీవు చేసి తీరాలి."

నారాయణ నాయరు ఒకదారి దొరికిందిగదా అని కృతజ్ఞతతో వెళ్ళాడు.

రిజిస్ట్రారాఫీసులో బంట్రోతు నాణు నాయరును నౌకరీనుంచి తీసేశారు. రిజిస్ట్రేషన్ డైరెక్టరుకు ఆ అధికారముంది. పత్రికల్లో ఈ వార్త పెద్ద పెద్ద అక్షరాల్లో వచ్చింది. గ్రామాధికారి వర్గీసును ముందుగా రిటైరు చేసి తీసేసినట్టు భూమి శిస్తు కమీషనరు కార్యాలయం నుంచి ఉత్తర్వు జారీ అయింది. పప్పు మీద కేసు నడుస్తూ వుంది. అన్వేషణాధికారి కేసులో ప్రమాదమేమీ లేదు. ఆయన తిరువనంతపురంలో వుంటాడు. ఆయనకు అక్కడ బాగా పలుకుబడి వుంది.

ఉద్యోగస్థులందరూ భయపడ్డారు. కాని ఒక మార్పు మాత్రం వచ్చింది. ఆఫీసుల్లో ఎవరూ ఏమీ పొరపాటు చెయ్యటం లేదు. ప్రభుత్వ విధానం అంతా నియమబద్ధంగా జరుగుతున్నది. ఏదయినా అవసరమైన పని కోసం ఎంత పాకులాడినా సాధించటం కష్టమవుతున్నది. ఏదయినా పొరపాటు జరిగితే కేసవుతుంది. తకలా తాలూకా కచ్చేరి గుమాస్తా, ఆలప్పుళా ఇంజనీరింగు ఆఫీసులో ఒక ఉద్యోగస్థుడూ, ఆల్వా మెజిస్ట్రేటు కోర్టులో కాపీయిస్టు - వీళ్ళందరి మీద విచారణ జరుగుతూ వుంది. వాళ్ళు సరియైన సమాధానం చెప్పాలి. అక్కడక్కడా బంట్రోతులనూ, గుమాస్తాలనూ అవినీతి నిర్మూలన

కార్యక్రమం క్రింద పట్టుకుంటున్నారు. కాంగ్రెసు నాయకులూ, మంత్రులూ ఇప్పుడు తమ వుపన్యాసాల్లో ఈ కార్యక్రమాన్ని గురించి ప్రత్యేకించి చెపుతున్నారు.

నారాయణ నాయరు మంత్రి మాత్యూను కలుసుకున్నాడు. మాత్యూ నాయరును మరిచిపోలేదు. కాని యీ విషయం ఉమ్మనుకు ఎలా చెప్పటం? ఉమ్మన్‌కు అతనంటే ప్రేమ. కాని అవినీతి నిర్మూలన జయప్రదంగా సాగాలి. అందరు కోరేదీ అదే. మరో విషయమైతే అతను చెప్పేవాడు. ఉమ్మన్‌తో ఈ విషయం ఎలా చెప్పటం అని మాత్యూ ఆలోచిస్తున్నాడు. నారాయణ నాయరు వదిలేట్టు లేడు.

ఇలా ఒకటి రెండు రోజులు గడిచాయి. మంతనాలు ఎంతవరకు వచ్చాయని కేశవపిళ్ళై రోజూ అడుగుతున్నాడు. నాయరు ఉన్నదున్నట్టు అంతా చెప్తున్నాడు.

"నీవు గట్టి పట్టు పట్టాలి. నీ పట్టు అంత గట్టిగా ఉన్నట్టు లేదు. అదే కారణం." అంటున్నాడు ఛీఫ్ సెక్రటరీ కేశవపిళ్ళై.

ఇంతకంటె గట్టి పట్టు ఎలా పట్టాలో నారాయణ నాయరుకు తెలియటం లేదు. మాత్యూ భార్య కూడా మంత్రిని ఒత్తిడి చేస్తూ వుంది. ఇంతవరకూ ఆమె ప్రభుత్వానికి సంబంధించిన యే విషయంలో కూడా జోక్యం కలగ జేసుకోలేదట.

రెండు రోజులాగి ఛీఫ్ సెక్రటరీ నిర్మోహమాటంగా చెప్పేశాడు: "నాయర్, ఈ కేసు నేనింక ఆలస్యం చేసేందుకు వీల్లేదు."

నాయరు చిక్కున పడ్డాడు: "అయ్యో, అలా అనకండి. ఒక వారం గడువివ్వండి. నేనంతా చూసుకుంటాను." అన్నాడు.

"ఫైలు దగ్గర పెట్టుకుని ఆలస్యం చేసేందుకు నాకేమీ కారణం కనిపించటం లేదు. ఎవరన్నా అడిగితే యేం చెప్పాలి?"

"అలాంటి పరిస్థితి రాదు."

ఈ పని యెలాగయినా సానుకూలమయేట్టు చూడాలని ఛీఫ్ సెక్రటరీకి కూడా గాఢంగా వున్నట్టుంది.

మర్నాడు ఛీఫ్ సెక్రటరీ నారాయణ నాయరుకు ఒక శుభవార్త చెప్పాడు. అతనికో మార్గం స్ఫురించింది. ఉపయోగించుకోదలిస్తే వుపయోగించుకోవచ్చు. అది ఒక రహస్యం. తహసీల్దారు లాగా ఒక ఫారెస్టాఫీసరు కూడా చిక్కున పడ్డాడు. అతను లంచం తీసుకొని అడవిలో చెట్లు కొట్టించి అమ్మించాడు. దాని మీద కేసయింది. అది పూర్తిగా రుజువయింది. ఆ కేసు నిజమయిందనే అనిపిస్తూ వుంది. కాని యీ విషయంలో అతన్ని రక్షించాలని మిస్టర్ ఉమ్మన్ ఛీఫ్ సెక్రటరీని పిలిచి చెప్పాడు.

"ఇప్పుడే చెప్పాడు. పది నిమిషాలయింది. నా వుద్దేశ్యంలో నీ కేసులాగా యీ కేసులో కూడా మార్గం ఏమీ లేదు. ఆ మాట నేను స్పష్టంగా చెప్పాను. ఎలాగయినా అతన్ని కాపాడాలని మంత్రిగారి అభిప్రాయం."

నారాయణ నాయరుకు ప్రాణం లేచి వచ్చింది.

"ఉమ్మన్‌తో ఈ విషయం ఎలా చెప్పటమనేదే మాత్యూకు సందేహం. ఇలాంటి పరిస్థితిలో మాత్యూ ఈ విషయం ఆయనకు ఎందుకు చెప్పగూడదు?"

ఛీఫ్ సెక్రటరీ దానికి సమ్మతించాడు.

"అవును. అదే నేనూ అడిగేది."

నారాయణ నాయరు వెళ్ళి పోయేప్పుడు ఛీఫ్ సెక్రటరీ అతన్ని గట్టిగా హెచ్చరించాడు:

"ఈ మాట నేను నీకు చెప్పానని ఉమ్మనుకు తెలియకూడదు. నీకి విషయం మాత్యూ వల్ల తెలిసిందనే సూచన కూడా వుండ కూడదు. అలా చెప్తే నన్ను నేను రక్షించుకునేందుకు తహసీల్దారును నేను సతాయిస్తాను. ఆ మాట నేను ముందే చెప్తున్నాను. ఏ మాత్రం కనికరం చూపించను."

నారాయణ నాయరుకు సాయం చేయాలనే వుద్దేశ్యం మంత్రి మాత్యూకు వుంది. ఆయన తన బాధ్యతను ఇంత త్వరగా మరిచిపోయే వ్యక్తి కాదు. ఆయన కొంచెం మొహమాటపడి ఆగిపోయాడు. అంతవరకే. ఈ విషయం తెలిసేసరికి ఆయనకు ధైర్యం వచ్చింది. "మన పనికూడా నెరవేరితే తప్పేముంది?" అన్నాడాయన నారాయణ నాయరు లాగానే.

కాని అందులో కూడా ఒక చిక్కుంది. తహసీల్దారు కేసులో ముఖ్యమైన వ్యక్తి యం.యల్.ఏ. అతనికి నచ్చ చెప్పాలి. లేకుంటే ఆయన అసెంబ్లీలోనూ, బయట దేశమంతటా గొడవ చేసేందుకు తయారవుతాడు. ఈ మాట ఛీఫ్ సెక్రటరీ స్వయంగా మంత్రి ఉమ్మనుకు, మంత్రి మాత్యూకూ చెప్పాడు. దానికి మార్గం కూడా ఛీఫ్ సెక్రటరీయే చెప్పాలి.

తహసీల్దారు యం.యల్.ఏను శరణు కోరాలి. కాని క్షమాపణ కోరటంతో ఆయన తృప్తి పడడు. ఈనాడు అతని తమ్ముని భూమి రిజిస్ట్రేషను లేకుండా పడివుంది. పత్తనంతిట్టలోనే మంచి భూమి అతని పేరిట రిజిస్టరు చెయ్యాలి. దానికేం ఫరవాలేదు. అలా చేసేందుకు ఛీఫ్ సెక్రటరీ ఒప్పుకున్నాడు. కేసులో మామూలు సాక్ష్యాలున్నాయి. ఒకటి రెండు సాక్ష్యాల కోసం ఆయన కేసును కిందికి పంపిస్తాడు. ఫారెస్టాఫీసరు కేసులో కూడా ఇలాంటి పద్ధతే అవలంబించటం జరుగుతున్నది. అప్పుడు కేసు తన దగ్గరికి వచ్చేసరికి ఆకుకూ, ముల్లుకూ దెబ్బ తగలకుండా వ్యవహారం తీర్మానం చేస్తాడు.

ఇలా రెండు మార్గాలూ ఆలోచించాడు. కాని ఆ మార్గాలలో వెళ్ళే ప్రయత్నం మిగిలి వుంది. ఒక నెలలో అన్నీ సానుకూలమయ్యాయి. ఫారెస్టాఫీసరు, తహసీల్దారు నిర్దోషులని వుత్తర్వులు జారీ అయ్యాయి. తహసీల్దారుకు అయిదు వేల రూపాయలు ఖర్చయ్యాయి. అయినా ఫరవాలేదు. ఇలా ఖర్చవుతుందని తెలిసే అతన్ని దేవకులానికి బదిలీ చేశారు. కొంచెం ఇబ్బంది అవుతుంది. దానికి ఓర్చుకోవాలి. అంతే, ఆ మొత్తం తిరిగి రాబట్టుకునేందుకు రెండు నెలలు కూడా పట్టదు.

నారాయణ నాయరుకు కష్ట భూయిష్టమయిన జీవితంలో తొలిసారి విజయం లభించింది.

కేశవపిళ్ళైకో? ఆయన వుద్దేశం కూడా నెరవేరింది. మంత్రులు కూడా అవినీతి నిర్మూలనను నిరుపయోగం చేసేందుకు ఆయన దగ్గరకి వచ్చారు. అంతకుమించిన విశేషం కేశవపిళ్ళైను గురించి మంత్రి ఉమ్మన్‌కు మంచి అభిప్రాయమేర్పడ్డది.

యం.యల్.ఏకు అయిదు వందల ఎకరాల భూమి తక్కువ ధరకు రిజిస్టరయింది. అందువల్ల ఆయన కూడా ఛీఫ్ సెక్రటరీకి కృతజ్ఞత చెప్పుకున్నాడు.

## ముప్పై మూడు

సుకేశిని అనే టైపిస్టుకు, పద్మావతి అనే క్లర్కు రెండు చెంప దెబ్బలు వేసింది. సచివాలయం సింహ ద్వారం దగ్గర ఇది జరిగింది. మధ్యాహ్నం పూట సుకేశిని వచ్చే సమయానికి పద్మావతి ఆమెను కొట్టే అవకాశం కోసం పొంచి వుంది. దగ్గరకి రాగానే ఆమె కొట్టింది. ఆ తర్వాత ఏమీ జరగనట్టుగా పద్మావతి అక్కడినుంచి వెళ్ళి పోయింది. అనుకోకుండా జరిగిన యీ సంఘటన ఒక్క క్షణంలో జరిగింది. సుకేశిని చెంపమీద ఎర్రగా వేళ్ళ ముద్రలు పడ్డాయి.

సుకేశిని పంచవర్ష ప్రణాళికా శాఖలో పనిచేస్తున్నది. పద్మావతి మిసలేనియస్‌లో వుంది. ఇంతకు ముందు ఆమె కూడా పంచవర్ష ప్రణాళికలోనే వుండేది. ఆరోజు మధ్యాహ్నం తర్వాత ఏ శాఖలోనూ ఏమీ పనికాలేదు. అది ఒక అసాధారణమైన సంఘటన. ఒక ఆడకూతురు మరో ఆడకూతుర్ని కొట్టింది. అది కూడా చెంప దెబ్బ. అందరూ ఈ విషయమే చెప్పుకుంటున్నారు. కారణమేమయి వుంటుందని మొట్టమొదటి ప్రశ్న. పద్ధతి శాఖలో పని చేసేవాళ్ళకు మాత్రం కారణం చూచాయగా తెలుసు. కరుణాకరన్ నాయరు అనే వ్యక్తి పద్ధతి శాఖలో గుమాస్తాగా పని చేస్తున్నాడు. అతను పద్మావతిని ప్రేమించాడు. పద్మావతి వెళ్ళి పోయిన తర్వాత అతను సుకేశిని ని ప్రేమించాడు. చక్కగా తిరుచూరు వేష భాషలో వుంటుంది సుకేశిని. ఇద్దరికి మధ్య వాగ్వాదం జరిగిందట. బహుశా అదే కారణమయి

వుంటుంది. సచివాలయంలోని గుమాస్తాలందరూ పద్ధతి శాఖలకూ, వివిధ శాఖకూ వస్తూ పోతూ వుండేవాళ్ళు.

సుకేశిని స్వస్థలం కొచ్చిన్. తిరువిల్వామల లేదా దేశమంగళం పరిసరాల్లో ఆమె యిల్లుంది. పద్ధతి శాఖలో పనిచేసే కొచ్చిన్ వాళ్ళంతా వెంటనే సమావేశమయి దీన్ని గురించి చర్చించుకున్నారు. తిరువనంతపురంలో నానాటికీ అరాచకత్వం పెరిగి పోతూ వుంది. ఆ విషయం వాళ్లు ప్రతిరోజూ అనుకుంటూ వుండేవాళ్ళు. ఇప్పుడు దెబ్బలాటల దాకా వచ్చింది. వేరు వేరు శాఖల్లో పనిచేసే తిరువితాంకూరు వాళ్ళు కూడా పోగయి చర్చలు జరిపారు. కొచ్చిన్ వాళ్ళు సుకేశిని ద్వారా కంప్లైంటు చేయించి, ఆమెను ఎలాగో అలా కాపాడేందుకు వాళ్ళు ఆలోచన చేశారు. ఇలాంటి చర్చలు కేవలం ఆ రెండు శాఖల్లోనేకాక సచివాలయమంతటా జరిగాయి. కొచ్చిను వాళ్ళు కూడా బతకాలి గదా? కొచిన్ తంపురాన్, కొచిన్‌ని తిరువనంతపురానికి అర్పించాడు. అది తలుచుకుంటేనే వాళ్ళకెలాగో అయిపోతుంది. ఆ రాష్ట్రంలో పనులన్నీ ఎంత చక్కగానే జరిగేవి. తిరువితాంకూరు వాళ్ళ ఆక్షేపణ అది కాదు. వాళ్ళకంటె తక్కువ జీతం తెచ్చుకునే వాళ్ళు తెల్లవారేసరికి వాళ్ళతో సరిసమానులయిపోరు. అంతకు మించిన పై పదవుల్లో ప్రవేశించారు. వాళ్ళు వచ్చినందువల్ల వీళ్ళకు పై పదవులు వచ్చే అవకాశాలు ఆగి పోయాయి. తిరువితాంకూరులో ఆ భూభాగం ఎందుకు కలిసినట్టు? కొంత మంది నపుంసకులు జొరబడ్డారు. ప్రతి రోజూ రెండు శాఖల వాళ్ళూ పై పదవుల కోసం, జీతాల కోసం కీచులాడుకుంటూ వుంటారు. ప్రభుత్వానికి అర్జీలు పెడుతుంటారు. అప్పుడప్పుడూ తగూలాడు కుంటుంటారు. కొచ్చిను వాళ్ళు ఎందుకూ పనికి రాని వాళ్ళంటారు - తిరువితాంకూరుకు చెందిన వుద్యోగస్థులు. తిరువితాంకూరు వాళ్ళు లంచగొండి వాళ్ళు, ద్రోహులు, దొంగలు అంటారు కొచ్చిన్ వాళ్ళు. ఈ తగాదాలు ఇలావుండగా సుకేశినికి చెంపదెబ్బ తగలటం కూడా జరిగింది.

ఆ రోజే పద్మావతికి సుకేశిని చేత చెంప దెబ్బ వేయించి వుండవలసిందని పద్ధతి శాఖలోని కుంజిపాలు అభిప్రాయం. అంత గట్టిగా దెబ్బ కొట్టి వుండకూడదట. అరవిందాక్షన్ ఈ అభిప్రాయంతో ఏకీభవించ లేదు. అతనంటాడు: "మనమిక్కడ జీవించాలి కదా? తిరువనంతపురమంతా ఏకమై మనల్ని ఒక్కొక్కర్ని మింగేస్తారు."

కంప్లైంటు చేసి తీరాలని అటవీ శాఖలోని సేతు మాధవన్ అభిప్రాయం. విషయం అంతటితో ఆపి వేయటం మంచిదని ఉణికండ వారియర్, అప్పుకుట్టి పోతువాల్ అభిప్రాయం. కాని పోతువాల్‌కు మరో అభిప్రాయం కూడా వుంది: "ఇది మంచి అవకాశం. కొచీన్ వాళ్ళందరూ కలిసి ఒక

సంఘంగా ఏర్పడాలి. ఈ మాట నేను రోజూ చెపుతున్నాను. ఇప్పుడందరికీ మెలకువ వచ్చింది. ఏమంటావ్ వారియర్?"

వారియర్ అభిప్రాయం కూడా అదే. అలా చెయ్యకపోతే కొచీన్ వాళ్ళు జీవించటం దుర్భరమవుతుంది.

కుంజిపాలు కూడా ఆ అభిప్రాయంతో ఏకీభవించాడు. "అయితే దానికి కార్యక్రమ మేమిటి?" అని అడిగాడతను.

"ఆమె నడుగు ఆ విషయం" అన్నాడు పోతువాల్.

కుంజిపాలు సుకేశిని దగ్గరకి వెళ్ళాడు. సుకేశిని ఏమీ నిర్ణయం చెయ్యలేదు.

ఉణికండ వారియరుకు అందుకు కారణం తెలుసు.

"ఆ నాయరు ఆ రోజు సెలవులో వున్నాడు. దీనికంతా కారణమతనే కదా? అతను వచ్చిన తర్వాత ఏదయినా తేల్చుకోవాలని కూర్చుంది సుకేశిని."

సుకేశిని కంప్లెయింటు చెయ్యకపోతే తానే చేసేందుకు సిద్ధంగా వున్నాడు కుంజిపాలు. అతని అభిప్రాయాన్ని అందరూ ఎదిరించారు. కంప్లెయింటు చేస్తే ఛీఫ్ సెక్రటరీ యిద్దరినీ పట్టుకుంటాడు.

"ఛీఫ్ సెక్రటరీ అక్షరాల్లా తిరువాంకూరువాడు" అని సేతు మాధవన్ తన అభిప్రాయం చెప్పాడు.

కుంజిపాలు ఎందుకూ పనికిరాని కొచీన్ మంత్రిని చెడామడా తిట్టాడు.

పద్ధతి శాఖకు సెక్రటరి కుంజి శంకరమేనేన్. ఆయన కొచీన్ తంపురాన్‌కు నాలుగో తరం బిడ్డ.

కుంజి శంకరమేనేన్‌కు తన డిపార్టుమెంటులో జరిగిన యీ అలజడిని గురించి యేమీ తెలియదు. భోంచేసిన తర్వాత కాసేపు నిద్రపోయే అలవాటాయనకు. ఇది యీనాటి అలవాటు కాదు. ఎర్ణాకులంలో ఆరోజుల్లో అతన్ని ఎవరూ వేధించేవాళ్ళు కాదు. కాని తనను ఆదుకొనే వాళ్ళెవరూ లేకపోవటం వల్ల తిరువనంతపురంలో ఆయనకు సరిగ్గా నిద్రపట్టేది కాదు. తన డిపార్టుమెంటులో ఎవరూ తనను కదిలించక పోయినా ఇతర శాఖలనుంచి అప్పుడప్పుడూ ఛీఫ్ సెక్రటరీ, మంత్రీ లాంటి వాళ్ళు టెలిఫోను చేసేవాళ్ళు. ఆ రోజు కూడా అలాగే జరిగింది. నిర్మాణ శాఖ సెక్రటరీ ఆయన్ని పిలిచాడు. మర్నాడు మంత్రి వర్గ సమావేశం వుంది. జలవిద్యుత్ ప్రణాళికకు సంబంధించిన ఫైలు మంత్రివర్గ సమావేశంలో చర్చించేందుకు తయారయిందో లేదో కనుక్కునేందుకు ఆయన ఫోను చేశాడు. మేనేన్ గారు కొంచెం ఉలిక్కి పడ్డాడు. కొన్నాళ్ళ క్రితం మినిస్టర్ మాత్యూ ఆ విషయమై అతనికి ప్రత్యేకంగా చెప్పాడు. పంచవర్ష ప్రణాళిక, ప్రభుత్వ నిర్మాణ కార్యక్రమం ఆయన అధీనంలో వున్నాయి. మేనేన్ ఆ విషయం మరిచి పోయాడు.

ఆయన నిద్ర నీరయిపోయింది. ఆయన సహాయక కార్యదర్శిని పిలిపించాడు. గుమాస్తా వారియర్ను కూడా పిలిపించాడు. అందరూ మరిచి పోయిన ఫైలది.

మేనేన్‌కు స్పృహ తప్పినంత పనయింది. రాజతీవితో ఆయన 'ఫైలెక్కడ?' అని అడిగాడు.

వారియరు ఫైలు వెతికేందుకు పరుగెత్తాడు. ఆ సమయంలో సుకేశిని విషయం అందరూ మరిచి పోయారు. సహాయక కార్యదర్శి వ్యక్తిగత రిజిస్టరు వెతుకుతున్నాడు. కొంచెం ఆలోచించేసరికి సూపరింటెండెంటుకు జ్ఞాపకం వచ్చింది. ఆయన భయపడుతూ కుంజి శంకర మేనేన్‌తో అన్నాడు : "ఇంటికి పంపించినట్టుందండీ!"

వ్యక్తిగత రిజిస్టరులో కూడా అలాగే వ్రాసి వున్నదని అన్నాడు సహాయక కార్యదర్శి. దానితో వారియరు మనస్సు కుదుట పడింది. అయినా మేనేన్ వదల్లేదు. "మీరందరూ బలే బాధ్యత వహించారు!" అన్నాడు.

కాని ఆ ఫైలు ఇంట్లో వుందో లేదో అని మేనేన్‌కు భయం. ఇంట్లో ఫైళ్ళు కుప్పలు కుప్పలుగా పడివున్నాయి. ఆ ఫైలు వాటిల్లో వున్నట్టు అతనికి గుర్తు లేదు. ఒకవేళ వున్నా రేపటికి దాన్ని ప్రభుత్వ నిర్మాణ శాఖకు తను అందించగలనా అని అతనికి సందేహం. ఈ ప్రణాళిక పంచవర్ష ప్రణాళికతో ముడిపడి వున్నదన్న విషయం అతనికి తెలుసు. కాని దాని పాత చరిత్రను గురించి అతనికేమీ తెలియదు. పంచవర్ష ప్రణాళికలో చాలా పెద్ద మొత్తం సార్వజనిక నిర్మాణ కార్యక్రమానికి కేటాయించబడి వుంది. ఏం చెయ్యాలో అతను నిర్ణయించ లేకుండా వున్నాడు. ఈ రాత్రి నిద్ర పట్టదు.

మేనేన్ మనస్సులో ఆందోళనగా వుంది. ఉద్యోగంలో ఒడుదుడుకులు రావచ్చునని అతనికి భయం వేసింది. చీఫ్ సెక్రటరీ యిప్పటికి రెండు సార్లు హెచ్చరిక చేశాడు. మరోసారి కూడా చెయ్యబోతున్నాడు. ముందు కూడా హెచ్చరికలతోనే సరిపోతుందా? - అనేదే ఆయన భయం. ఎర్ణాకులంలో హాయిగా వుండేది. అక్కడ ఆఫీసు పని సక్రమంగా జరుగుతూ వుండేది. కార్య భారం అనిపించేది కాదు. ఏదయినా తప్పు జరిగితే అది ఎలాగో సర్దుబాటయ్యేది. అక్కడి పద్ధతి అలాంటిది. నాన్నగారు ఇంకా బతికే వున్నారు. కాని ఆయన ఏం చెయ్యగలరు? 'ఫలానా ఆయన కుమారుడు' అనే భావం అందరిలో వుండేది. ఇక్కడ అలాంటి అండ యేముంది?

చీఫ్ సెక్రటరీ ఫోను చేయవచ్చునని అతనికి భయం వేస్తున్నది. అది ఏ క్షణంలోనయినా జరగవచ్చు. అడిగితే యేం చెప్పాలి?

డిపార్టుమెంటులో సుకేశిని సమస్య కొంతవరకు సమసిపోయింది. అది అలా వుంచి ఆఫీసుపని చెయ్యవలసిందని సూపరింటెండెంటు పద్మనాభన్

ఆజ్ఞాపించాడు. సుకేశిని టైపు చేస్తూ వుంది. కుంజిపాలు, గొణుగుతూ వున్నాడు. పోతువాల్, సంఘ నిర్మాణాన్ని గురించి ఆలోచిస్తున్నాడు. వారియరు మనస్సు కుదుటపడింది. కాని రిజిస్టరు చూస్తూనే వున్నాడు. ఏదన్నా అయితే సంజాయిషీ చెప్పుకోవలసి వస్తుందని అతని భయం.

మేనేన్‌గారు సహాయక కార్యదర్శిని పిలిపించారు. తిరువితాంకూరులో వుద్యోగం చేస్తూ సహాయక కార్యదర్శి అయిన వ్యక్తి మిస్టర్ రామకృష్ణన్ నాయర్. తిరువితాంకూరు వాళ్ళను నమ్మరాదని మేనేన్ అభిప్రాయం. అయినా అభిప్రాయం అడుగుదామనుకొన్నాడు. అడిగాడు - "నాయర్! ఈ ప్రణాళికను గురించి నాకేమీ తెలియదే. అసలా కథ యేమిటి?"

రామకృష్ణన్ నాయర్ ఆ వృత్తాంతమంతా వివరంగా చెప్పాడు. మేనేన్ శ్రద్ధగా విన్నాడు. "ఇక ఆ పాత ఫైలు చూడవలసిన పని లేదు" అని అతని మనస్సు కుదుట పడింది.

"అది సార్వజనిక నిర్మాణ శాఖలో వుంది."

"భేష్, ఇంకేం? విచారించవలసిన పని లేదు."

అయినా అంతహాయిని అనుభవిస్తున్నట్టు కాకుండా రామకృష్ణన్ నాయర్ అన్నాడు: "ప్రస్తుతం అక్కర్లేదు. అంతే. ఆర్థిక శాఖ వాళ్ళు ఈ ఫైలును గురించి మనల్ని వేధిస్తారు."

"వాళ్ళకేం పట్టింది? చూద్దాంలే అప్పటి మాట"

ఒక్క క్షణం ఆగి మేనేన్ అన్నాడు: "అయితే ఆ ఫైలు రేపు సార్వజనిక నిర్మాణ శాఖకు పంపించాలన్న మాట?"

"అవును."

కొంచెం ఆలోచించి మేనేన్ అన్నాడు: "వాళ్ళకిప్పుడేం కావాలో రహస్యంగా కనుక్కునే మార్గమేమయినా వుందా?"

"దానికి అనుమతి కావాల్సి వుంటుంది." అన్నాడు రామకృష్ణన్ నాయర్.

కుంజి శంకర మేనేన్‌కు నమ్మకం కుదరలేదు. కాదన్నట్టుగా తల వూపాడు.

"కాదు, కాదు, చాలా ఖర్చవుతుంది. వెనక మనం పంపించిన సారంగ సాగుబడి ప్రణాళిక యింకా అమలు కాలేదు. ఇప్పుడిది మరోటి? ఇందులో ఏమీ లేదు - వట్టి మోసం "

"ఏమయినా సర్లే, నిద్రపోయేందుకు వీల్లేదు. రేపు మనం ఫైలు పంపించేద్దాం." అన్నాడు మేనేన్.

రామకృష్ణన్ నాయర్ తిన్నగా సార్వజనిక నిర్మాణ శాఖకు వెళ్ళాడు. ఆ శాఖకు సహాయక కార్యదర్శి మిస్టర్ సుగతన్. కుంజి శంకర మేనేన్ కొన్ని నిర్ణయాలు చేసుకున్నాడు. ఏ రోజు ఫైళ్ళు ఆరోజే కచ్చితంగా చూసి తీరాలి. తన పాత అలవాటు మార్చు కోకపోతే ఈ వుద్యోగానికి ముప్పు వస్తుంది.

దినచర్య అతను ఆలోచించుకొని నిర్ణయించుకున్నాడు. రేపటి నుంచీ దాన్ని అమల్లో పెట్టి తీరాలి.

కొంచెం సేపటికి రామకృష్ణన్ నాయర్ తిరిగి వచ్చాడు. సార్వజనిక నిర్మాణ శాఖలో కొన్ని విషయాలు తెలుసుకొని వచ్చాడు.

ఫైలంతా చూసి, "సరిచేయవలసిన అవసరం లేదనిపిస్తున్నది" అని రామకృష్ణన్ నాయర్ మేనేన్‌కు చెప్పాడు.

ఇది శుభవార్త. మేనేన్ ఇంకా కొన్ని విషయాలు తెలుసు కోవాలను కున్నాడు. సహాయక కార్యదర్శి ఇలా అన్నాడు: "ఇక్కడి నుంచి మనం పంపించిన పద్ధతి కార్యక్రమాల్లో కొన్నింటిని ఆపేసి ప్రణాళికను తొలిదశ నుంచి ఆరంభించాలని అనుకుంటున్నారు."

మేనేన్‌కు విషయం పూర్తిగా బోధపడలేదు. సహాయక కార్యదర్శి దాన్ని వ్యాఖ్యానించాడు:

"జల విద్యుత్ ప్రణాళిక తొలిచరణంలో మరోచోట రాకపోకల సౌకర్యం వుంది. ఆ పని వెంటనే ఆరంభమవుతున్నది."

మేనేన్ తనకి విషయంలో ఏమీ తెలియదని ఒప్పుకున్నాడు: "ఏమయినా నేనసలీ ఫైలు చూడలేదు."

"నేనంతా చూసి నోట్సు రాసి పంపించాను."

ఆపి వెయ్యాలని నిర్ణయించిన పనులేమిటని అడిగాడు మేనేన్. ఆహారోత్పత్తికి సంబంధించిన కొన్ని పనులని చెప్పాడు రామకృష్ణన్ నాయర్. జలవిద్యుత్ ప్రణాళికను గురించి కూడా కొంత వరకు తెలుసు నాయరుకు. ఆ విషయం కూడా అతను తన సెక్రటరీకి చెప్పాడు. మరోచోట ఆ పని జరుగుతూ వున్నది. దానికి సమీపంలో ఈట్టి కాటుంకొండ వుంది. ఆ కొండలో నుంచి ఒక దారి వెయ్యాలి. కాంగ్రెసు సమ్మె సమయంలో అవస్థలు పడ్డ వాళ్ళకు ఒక్కొక్కరికి అయిదెకరాలు చొప్పున ఆ కొండను పంచిపెట్టాలని నిర్ణయమయింది. అందువల్ల ప్రణాళికలోని మొదటి పని ఆరంభించాలని నిర్ణయం చేయటమయింది.

"ఇదంతా యేదో తంత్రంలా వుందే నాయర్?" అన్నాడు వింటూ వింటూ అప్రయత్నంగా మేనేన్.

రామకృష్ణన్ నాయర్ కొంచెం నవ్వుకున్నాడు. అవునని గాని, కాదనిగాని చెప్పలేదు. మేనేన్‌కు తన మనస్సులో మాట ఉన్నదున్నట్టు చెప్పటం అలవాటు. కాంగ్రెసు వాళ్ళకు కొండ రిజిస్టరు చేయాలని నిర్ణయమయిందని వినగానే తనలో నుంచి వెలువడిన రోషధార అతని నోట యిలా పలికింది: "దేశాన్ని నాశనం చేసేవాళ్ళకా యీ దానం? బాగుంది కథ! ఈ ప్రణాళిక పేరిట రోడ్డు కూడా వేసి యివ్వాలట? చాలా బాగుంది."

రామకృష్ణన్ నాయర్ నేర్పుతో అన్నాడు: "అది తొందరగా పూర్తి కాకుండేందుకు మార్గం వుంది."

"ఏమిటా మార్గం?" అన్నాడు మేనేన్ కుతూహలంతో.

"ఆపి వేసిన పనులను ఆరంభించాలి. అందువల్ల వ్యవసాయాభివృద్ధి దెబ్బతింటుందని చెప్పే అధికారం మనకుంది."

"మంత్రి మండలి కాదంటేనే? లేక అలాగే నిశ్చయిస్తే?" అన్నాడు మేనేన్.

రామకృష్ణన్ నాయరు దగ్గర చెప్పవలసిన విషయాలు ఇంకా చాలా వున్నాయి.

"అవసరమయితే ఆర్థిక శాఖ ద్వారా అంతరాయం కలిగించవచ్చు."

మేనేన్ కొంచెం ఆలోచించాడు. అతని మనస్సులో మార్పు వచ్చినట్టనిపించింది.

"చేస్తే చెయ్యనీ. మన మెందుకు జోక్యం కలగ జేసుకోవటం?"

కార్య నిర్వహణ బాగా తెలిసిన రామకృష్ణన్ నాయర్ అన్నాడు: "అందు కోసం వాళ్ళకు దారి చూపించాలి. అప్పుడంతా సులువై పోతుంది."

మేనేన్ మనస్సు మారిపోయింది.

"నాశనం కానీ నాయర్, నాశనమయిపోనీ. మనకెందుకు లేని పోని బాధ. ఏమయితే మనకేం?"

రామకృష్ణన్ నాయర్ ఏమీ అనలేక కృత్రిమంగా నవ్వాడు. వాళ్ళ సెక్రటరీ చేయూత లేకుండా దిగజారిపోతున్నాడు. ఏదో ప్రమాదంలో పడిపోతున్నట్టు తోచిందతనికి. ఈట్టి కాటుంకొండకు రోడ్డు వేసే పని ఆపి వెయ్యమని తనకు తన సహాయ కార్యదర్శి చెప్పాడని అతను తన తోటి సెక్రటరీలకు చెప్పినా చెప్పవచ్చు. అలా అయితే చాలా గొడవ వస్తుంది. ఈ విషయంలో సెక్రటరీ చేత ఏదో కొంత చేయించాలని వుంది రామకృష్ణన్ నాయరుకు. మరో విషయం చెప్పాలని వుంది అన్నాడు.

"ఏమిటది?" అని అడిగాడు మేనేన్.

"ఈ ప్రణాళిక ఎన్నేండ్లో సాగదు."

"ఎందుకని?" అని అడుగుతున్నట్టుగా మేనేన్ రామకృష్ణన్ నాయరు వైపు చూచాడు. రామకృష్ణన్ నాయర్ అన్నాడు: "ఆ కొండనిండా చాలా చెట్లున్నాయి. ఆ చెట్లను కొట్టి నది మీదగానే తీసుకురావాలి. చెట్లు కొట్టటం మొదలు పెట్టిన తర్వాత అన్ని చెట్లూ కొట్టక ముందే వంతెన కట్టటం అసంభవం. చెట్లు కొట్టించేందుకు పెద్ద పెద్ద కాంగ్రెసు నాయకులు కంట్రాక్టు తీసుకుంటారు. వాళ్ళ వల్ల పని కాదు."

అదేమంత గొప్ప విషయం కాదన్నట్టుగా మేనేన్ అన్నాడు: "కాకపోతే నష్టమేముంది? ఎన్ని సంవత్సరాల నుంచో అలా పడి వున్నది మరివంద సంవత్సరాల వరకు కాకుంటే తప్పేముంది?"

రామకృష్ణన్ నాయర్ చెప్పవలసిందేమీ లేదు. మేనేన్ అన్నాడు: "నాయరుదేంపోయింది? ఇదేమన్నా స్వంత విషయమా? తన తిండిలో మట్టి పడకుండా చూచుకుంటే చాలు."

తనవల్ల ఏదో పెద్ద తప్పు జరిగినట్లుగా రామకృష్ణన్ నాయర్ ఆఫీసునుంచి బయటికి వచ్చాడు. అలా వున్నదున్నట్లు చెప్పి వుండ కూడదు. సెక్రటరీకి మరో రకమైన అభిప్రాయం ఏర్పడ్డది. మాటల్లో చెప్ప గూడనిది కూడా చెప్పేశాడు. మరో రకంగా చూస్తే, అవి నిజంగా చెప్ప గూడని మాటలా? ఇలా అవినీతిని ప్రోత్సహించటం సమంజసమేనా? ఒక వుద్యోగస్థునిగా తనకు రాష్ట్రం, రాష్ట్ర ప్రజల పట్ల బాధ్యత యేమీ లేదా? కాని ప్రస్తుత వ్యవస్థలో అలాంటి బాధ్యతను గుర్తించటం ఆక్షేపణీయం. అందువల్ల చాలా ప్రమాదం జరగవచ్చు. ఇకముందు ఈ సెక్రటరీతో, ఆలోచించి జాగ్రత్తగా మాట్లాడాలని నిశ్చయించు కున్నాడు రామకృష్ణన్ నాయర్.

ఆఫీసు నుంచి బయటికి వచ్చిన తర్వాత కుంజి శంకరమేనేన్ చాలా దూరం నడిచి వెళ్ళాడు. అది ఆయన అలవాటు. ఆ రోజు కూడా అలాగే వెళ్ళాడు. రాత్రంతా నిద్ర లేకుండా పని చెయ్యాలి. అదే అతనికి చిరాకు. రామకృష్ణన్ నాయర్‌తో తనకు జరిగిన సంభాషణను మేనేన్ ఒక్కక్షణం జ్ఞాపకం చేసుకున్నాడు. కావాలంటే అడ్డు పెట్టవచ్చునన్నాడు రామకృష్ణన్ నాయర్. దానికి మార్గం కూడా చెప్పాడు. అలా యెందుకన్నా డాయన? అడ్డు పెట్టాలనే వుద్దేశ్యం అతనికి ఎందుకు కలిగింది? అతను తిరువితాంకూరు వాడు. అతన్ని నమ్మవచ్చునా? అతన్ని దగ్గర చేర్చటం కొరివితో తల గోక్కున్నట్లు కాదని నమ్మకమేముంది? మేనేన్ ఆలోచనలు ఇలా సాగాయి. తిరువితాంకూరు వుద్యోగస్థులు మోసగాళ్ళు. వాళ్ళ వుద్దేశం కనిపెట్టటం కష్టం. బహుశా యిది పొడుగాటి తాడయి వుంటుంది.

మేనేన్ గారికి కాంగ్రెసంటే యెప్పుడూ ప్రేమలేదు. ఆయనవల్లనే కొచ్చిన్ రాజవంశపు రాజ్యమంతా నాశనమై పోయింది. ఆయన తండ్రి కనీసం మరి రెండు సంవత్సరాలు పాలించగలిగేవారని వాళ్ళమ్మ రోజూ అంటుండేది. ఆయన అలాంటి కాలపు కలలుగన్నాడు. కాంగ్రెసు కార్యకలాపాలకు అడ్డుతగలట మంటే అతనికి చాలా ఇష్టం. కాని పరిపాలన వాళ్ళ చేతిలో వుంది. వాళ్ళకు కోపం తెప్పించకుండా వుండటమే శ్రేయస్కరంగదా?

మేనేన్ ఇంటికి వెళ్ళే సరికి ఆయన పిల్లలు ఆయన కోసం ఎంతో ఆతురతతో ఎదురు చూస్తున్నారు.

"నాన్నకు గుర్తు లేదేమో?" అన్నది వాళ్ళ అమ్మాయి.

"ఏమిటి?"

"సినిమాకు వెళ్ళాలి. తొందరగా వస్తానన్నావుగా?"

"సినిమా! సినిమా! ఇవాళకాదు. నాకు పనుంది. లేకుంటే వుద్యోగం వూడుతుంది."

పారుకుట్టి అమ్మ గుమ్మందాకా వచ్చింది.

"ఏమిటే అమ్మాయ్! నాన్నగారు రోజూ నా వుద్యోగం పోతుంది, వుద్యోగం పోతుంది అంటారు?"

మేనోన్ గంభీరంగా జవాబు చెప్పాడు: "ఒసి పారుకుట్టి! ఈ రోజు అలాకాదు. ఉద్యోగం పోతుంది అంటే ఉద్యోగం తప్పకుండా పోతుందన్న మాటే. ఇప్పుడు నాకు అండగా నిలబడేందుకు దేశమంగళత్తూ నంబూదరి అంటే మీ నాన్నగారు - లేరు గదా?"

"మా నాన్నగారి సంగతి యెందుకొచ్చింది?"

"అదేమరి. ఇవాళ ఫైళ్ళు చూడాలి. చాలా గంభీరమైన విషయం."

మేనోన్ అంతా వివరంగా చెప్పాడు. ఇక పారుకుట్టి అమ్మ మరో విషయం చెప్పాలి.

"ఇప్పుడే యిక్కడికి ఆ పోతువాల్, వారియర్, కుంజిపాలు - అందరూ వచ్చారు. ఆఫీసులో ఒక టైపిస్టు వుందా? ఎవరామె? సుకేశిని. ఆమెను తిరువనంతపురం ఆమె - ఒక గుమాస్తా, కొట్టిందట."

"ఎప్పుడు? ఎక్కడ?" మేనోన్ ఆశ్చర్యంగా అడిగాడు.

"మధ్యాహ్నం. సింహద్వారం దగ్గర."

"వాళ్ళు నాకు చెప్పలేదే?"

అప్పుడు మీరు నిద్రపోతున్నారట."

"ఎందుకు కొట్టిందట?"

"ఏదో ప్రేమ."

కొంచెం సేపు కుంజి శంకరమేనోన్ ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆ తర్వాత చాలా గంభీరంగా అన్నాడు: "అదే వరస. తప్పదు మరి. ఈ తిరువనంతపురం వచ్చి నందుకు కొచ్చిన్ వాళ్ళకు తప్పదు మరి. దెబ్బలు తింటారు. సందేహం లేదు. కొచ్చిన్ ప్రజలకు తంపురాన్ ద్రోహం చేశాడు. ఈ కాంగ్రెసు అలాంటి పరిస్థితిని ఏర్పరచింది. ఇది ప్రారంభం. ఇక ముందు అందర్కి వుద్యోగాలూ ఇరుకున పడతాయి."

"ఎందుకలా?" అడిగింది పారుకుట్టి అమ్మ.

"అదంతే. ఇప్పుడు. సహాయక కార్యదర్శి నన్ను ఇరికించాలని చూస్తున్నాడు. అతను చాలా యుక్తిపరుడు. నాకన్నీ తెలుసు. అతని యుక్తి వుందే? శివశివా! ఏమయినా భగవంతుడు సరియైన దారి చూపించాడు. అమ్మయ్యా! తొందరగా నీళ్ళు తోడు. అన్నం పెట్టు. పారుకుట్టి! రాత్రికి నిద్రపోను."

సినిమాకు మర్నాడు వెళదామని చెప్పి పారుకుట్టి అమ్మ పిల్లలను సమాధాన పరిచింది.

వెతికేందుకు కొంచెం సేపు పట్టినా ఆ ఫైలు ఇంట్లోనే వుంది. ఫైలు తాడు వూడదీసి ఆయన భార్యతో చాలా కటువుగా అన్నాడు: "పారు కుట్టీ! ఇప్పుడే చెప్తున్నాను. రాత్రి ఎంత పొద్దు పోయినా సరే ఇక్కడికి వచ్చి గొడవ చెయ్యకు. ఇవాళ నేను ఈ ఒక్కపనే కాదు, ఉన్న పనంతా పూర్తి చేసి తీరతాను. పొద్దుపోయింది పడుకోండి, అని వేధించకు, నీవు హాయిగా నిద్రపో."

మేనేన్ గారి శాస్తమంగళ్ పై భాగంలో రాత్రంతాలైటు వెలుగుతూ వుంది. ఫైలు దగ్గర పెట్టుకుని ఆయన నిద్రపోవటం లేదు. మనసుపెట్టి పని చేశాడు. ఆ రాత్రి ఆయన చాలా ఫైళ్ళు చూశాడు.

కుంజి శంకర మేనేన్ ఎంతో తృప్తితో ఆఫీసుకు వెళ్లాడు. ఆయన చాలా ఫైళ్ళు చూచి పంపించాడు. రామకృష్ణన్ నాయరునూ, సూపరింటెండెంటునూ పిలిపించాడు. తను చాలా గొప్పపని చేసినట్టు వాళ్ళతో అన్నాడు:

"ఓయి నాయరూ! ఇదంత గొప్ప విషయం కాదు. రెండు రోజులు అదే పనిగా కూర్చుంటే పనంతా పూర్తి చేసేయచ్చు అంతే. ఈ రోజు నేను నిశ్చయించుకున్నాను. కాని ఒక్కవిషయముంది. కళ్ళు మండుతూ వున్నాయి. రెప్పవాల్చ లేదు."

ఏదయినా సమాధానం చెప్పాలని రామకృష్ణన్ నాయరు అన్నాడు: "పాత ఫైళ్ళు పూర్తి చెయ్యాలని నిశ్చయించుకుంటే అదంత కష్టమయిన పని కాదు."

మేనేన్ ఏకీభవించాడు. "మీ యింట్లో కూడా పాత ఫైళ్ళున్నాయా?" అని అడిగాడు.

"ఎక్కువ లేవు."

మేనేన్ తన శాఖను నియమ బద్ధం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

"అవన్నీ యీ రోజు పూర్తి చేసుకుని తీసుకురా. మన శాఖలో ఒక్క ఫైలు కూడా మిగిలిపోకూడదు. ఎప్పటి పని అప్పుడు చక్కగా సమగ్రంగా చూచుకోవాలి. పాత ఫైళ్ళు పూర్తి చెయ్యటం అంత పెద్ద పనికాదు. ఒక్క కాగితం కూడా వదిలిపెట్టద్దని అందరికీ చెప్పు. నేను వచ్చి రిజిష్టరు చూస్తాను. మిగిలిపోయిన ఫైళ్ళు కనిపిస్తే వదిలి పెట్టను."

ఈ విధంగా ఆయన అంతా నియమ బద్ధం చేశారు.

ఇలా మనస్ఫూర్తిగా నూతన నిర్ణయం చేసేప్పుడు మేనేన్‌కు ఒక ఆలోచన తట్టింది. ప్రణాళిక ఫైలు తీసుకుని చీఫ్ సెక్రటరీ దగ్గరికి వెళితే ఎలా వుంటుందీ అనుకున్నాడు. ఆ తర్వాత సార్వజనిక నిర్మాణ శాఖకు పంపించవచ్చు. మరుక్షణం అలా నిర్ణయించుకుని ఆయన వెళ్ళాడు.

ఛీఫ్ సెక్రటరీ దగ్గరికి వెళ్ళగానే ఇక్కడికి రాకుంటే బాగుండేదనిపించిందతనికి. మరేం కారణం లేదు. ఆయన ప్రవర్తనలోగాని, వైఖరిలో గాని అలాఅనిపించేదేమీ లేదు. అయినా ఎందుకు వచ్చావని అడిగితే యేం చెప్పాలి.? ఛీఫ్ సెక్రటరీ సరిగ్గా అదే ప్రశ్న వేశాడు.

"ఏం మిస్టర్ మేనేన్? ఏమిటి విశేషం?"

"విశేషమేమీ లేదు. ఒక సందేహం - ఈ ప్రణాళికను గురించి."

"ఏమిటది?"

తను చాలా నేర్పుతో ఏదో పని చేశానన్న భావంతో మేనేన్ అన్నాడు: "ఈ ప్రణాళికకు చాలా డబ్బు కావాలి. నేను దాన్ని నాలుగు భాగాలు చేశాను. ముందు ఆ కొండ నుంచి రాకపోకల సౌకర్యం. ఆ తర్వాత మిగిలినవి. సిఫారసు చేసేది నేనొక్కణ్ణే కాదుగదా?"

ఇందులో ఇంత నేర్పు ఏమున్నదన్నట్టుగా ఛీఫ్ సెక్రటరీ అన్నాడు: "అవును, అలాగే చెయ్యాలి. రాకపోకలు సరిగ్గా లేకపోతే ఆ కొండలో, అడవిలో మరేం పని సాగుతుంది?"

మేనేన్ కొంచెం చిన్న బుచ్చుకున్నాడు. దాన్ని కొంచెం వ్యాఖ్యానించేందుకు ప్రయత్నిస్తూ అన్నాడు:

"మరి పూర్తి పనికి అంచనా వెయ్యాలా వద్దా అని."

"దానికేం? మొదటి నుంచీ చేద్దాం. నీవు సమగ్రంగా అంచనా తయారు చెయ్యి".

"అంతకు ముందు రోజు రామకృష్ణన్ నాయర్ చెప్పిన మాటల్లో ఏదో తంత్రం వుందని తోచింది మేనేన్‌కు. మోసగించేందుకు అలా చెప్పివుంటాడు. మేనేన్ తన అదృష్టానికి తాను మురిసి పోయినాడు. కొంచెం ఆగి అతనన్నాడు: "ఇక్కడికి నేను అందుకోసం రాలేదు. పంచవర్ష ప్రణాళిక, సార్వజనిక నిర్మాణం, ఆర్థిక శాఖ - అందరినీ సమావేశ పరిచి ఛీఫ్ సెక్రటరీ ఏదో ఒక సమయంలో సంప్రతింపులు జరిపితే ఒక ఆలోచన రూపొందవచ్చు."

"మంచి ఆలోచనేయ్, మిస్టర్ మేనేన్! ప్రభుత్వం దీన్ని గురించి ఆలోచిస్తున్నది" అన్నాడు ఛీఫ్ సెక్రటరి.

కాంగ్రెసు వాళ్ళకు ఈట్టి కాటుంకొండ రిజిస్టరు చేసే విషయాన్ని గురించి ప్రస్తావించి వుండవలసిందని అనిపించింది మేనేన్‌కు తిరిగి వెళ్ళేప్పుడు. అది కూడా పంచవర్ష ప్రణాళిక సెక్రటరీ గమనించవలసిన విషయం. రిజిస్టరు చేసిన తర్వాత ప్రణాళిక పని ఆగిపోతుంది. అందువల్ల దాన్ని గురించి అడగక పోవటం మంచిదేననిపించింది మేనేన్‌కు వెంటనే. ఏమయినా రామకృష్ణన్ నాయరు ఉద్దేశం మంచిది కాదనే విషయంలో ఇప్పుడు మేనేన్‌కు సందేహమేమీ లేదు. అతను చెప్పిన వన్నీ బాగానే వున్నాయి. కాని

ప్రభుత్వం ఆసక్తితో చేస్తున్న పనిలో అంతరాయం కల్పించమని యెందుకు చెప్పినట్టు? అంతరాయానికి సంబంధించిన గమనికగాని సిఫారసుగాని పంపిస్తే దానికి పర్యవసానం ప్రభుత్వం యొక్క ఆగ్రహమేకదా? ప్రభుత్వానికి నా మీద కోపం తెప్పించటమే నాయరు ఉద్దేశమా? ఏమయినా సరే, రామకృష్ణన్ నాయరును నమ్మకూడదని మేనేన్ నిశ్చయించుకున్నాడు.

మేనేన్, చీఫ్ సెక్రటరీ దగ్గరకి వెళ్ళినప్పటి నుంచి రామకృష్ణన్ నాయరుకు మనస్సులో ఆందోళనగా వుంది. గట్టితనం, దృఢసంకల్పం లేని ఆ వాగుడు పిట్ట కిందటి రోజు తను చెప్పిందంతా చీఫ్ సెక్రటరీతో చెప్పివుంటాడు. అదే రామకృష్ణన్ నాయరు భయం. లేకుంటే యిప్పుడు చీఫ్ సెక్రటరీ దగ్గరికి ఎందుకు పరుగెత్తి కెళ్ళినట్టు? రామకృష్ణన్ నాయర్ తన దౌర్బల్యాన్ని తానే నిరసించుకుంటున్నాడు. మనశ్శాంతి కోసం అతను సార్వజనిక శాఖ సహాయక కార్యదర్శి మిస్టర్ సుగతన్ దగ్గరకి పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. సుగతన్ రామకృష్ణన్ నాయర్ని చీవాట్లు పెట్టాడు.

"నీకు తెలిసివుండేందుకు గాను నీకా విషయాలు చెప్పాను. అవన్నీ నీవా చవటకెందుకు చెప్పావ్?"

రామకృష్ణన్ నాయర్ తన తప్పు ఒప్పుకున్నాడు.

"ఏదో జరిగిపోయింది. ముఖ్యమైన అభ్యుదయ ప్రణాళిక చెడిపోతుందనే భయంతో అలా చెప్పాను."

"దేశభక్తి కదూ?"

"అయినా ఉంట్టికాటుక కొండ మీద మనమందరం కలిసి టీ గార్డెన్ వేసుకుందామనే మాట చెప్పకపోవటం మంచిదయింది. ఆ మాట కూడా చెప్తే చాలా గొడవయ్యేది. అది కూడా ఆయనకు చెప్పేవాడు." అన్నాడు నాయరు.

"నీవలా గాబరా పడవలసిన అవసరం లేదు. మోసం చేసేందుకు అతను కావాలని అబద్ధం చెప్పడు. అతను వట్టి తెలివి తక్కువ దద్దమ్మ. ఏం చెప్పచ్చు, ఏం చెప్పకూడదు అని గుర్తించే తెలివి తేటలు అతనికి లేవు. ఆ తెలివి మన పట్నవాసులకే వుంది. అంత భయపడకు. నేను చూస్తాను లే" అన్నాడు సుగతన్ ధైర్యం చెబుతూ.

సుగతన్ నిజం చెప్పాడు. రామకృష్ణన్ నాయర్ అన్నాడు : "ఈ తెలివి తక్కువ కొచ్చిన్‌వాడి దగ్గర పని చెయ్యటం తప్పిపోతే బాగుండును. డిపార్టుమెంటంతా గందరగోళం. గుమాస్తాలు ఏమీ పని చెయ్యరు."

"మంచి డిపార్టుమెంటంటూ ఏముంది మరి? అన్నీ ఒకటే. కొచ్చిన్ వాడి దగ్గర పని చెయ్యటం అదృష్టమనుకో. తెలివి తక్కువ వాళ్ళవటం వల్ల

కావాలని వేధించరు: మరొకరయితే? ఆ గుమాస్తాల సంగతి చూడు. పోచుకోలు కబుర్లు చెప్పటం తప్ప వాళ్ళకు మరో పని లేదు."

"ఓపిక పట్టు. 'సెక్రటరీ చెప్పివుంటాడ'ని భయపడవలసిన పని లేదు." అన్నాడు సుగతన్ కొంచెమాగి.

రామకృష్ణన్ నాయరు ఒక నిశ్చయానికి వచ్చాడు:

"అతనే మన్నా హడావిడి చేస్తే ఒకటి మాత్రం తప్పదు. అతను తప్పించుకునేందుకు వీలు లేకుండా అతన్ని వలలో వేసుకుంటాను. అది మాత్రం ఖాయం."

## ముప్పై నాలుగు

కొట్టయం జిల్లా కాంగ్రెసు సమితి కార్యాలయం పెద్ద భవనం. బయట పది పదిహేను కార్లు నిలబడి వున్నాయి. ఆఫీసులో రోజూకంటె ఎక్కువ హడావిడిగా వుంది. జనసమ్మర్దంగా వుంది.

సమ్మె సమయంలో దెబ్బలు తిన్న వాళ్ళూ, జైళ్ళకు వెళ్ళిన వాళ్ళూ, ఇలాగే ఏవేవో కష్టాలు సహించిన వాళ్ళ సహాయం కోసం ప్రభుత్వం ఒక కార్యక్రమాన్ని తయారు చేసింది. ఈట్టికాటుం కొండ మీద ఒక్కొక్కరికి అయిదయిదు ఎకరాల పొలం రిజిష్టరు చేయించాలి. అందుకోసం జిల్లా కాంగ్రెసు కార్యాలయంలో అర్జీ యివ్వాలి. అలాంటి అర్జీల మీద జిల్లా కాంగ్రెసు ప్రెసిడెంటు తన అభిమతం తెలియపరచాలి. అందుకోసం అభ్యర్థులు వస్తూ పోతూ వున్నారు.

బాగా అలసి పోయి దగ్గుతూ వున్న ఒక అభ్యర్థి అక్కడికి వచ్చాడు. ఇన్ని మోటరు కార్లు చూచేసరికి అతనికి కొంచెం ఆశ్చర్యం వేసింది. లోపలికి వెళితే ఖద్దరు కట్టుకున్న వాళ్ళు చాలామంది కనిపించారు. వాళ్ళల్లో ఎవరితోనూ అతనికి పరిచయం లేదు. అందరూ కాంగ్రెసు వాళ్ళే. అందులో సందేహం లేదు. కొంత మంది గాంధీ టోపీ కూడా పెట్టుకొని వున్నారు.

ప్రాంతీయ కాంగ్రెసు ప్రారంభించినప్పటి నుంచీ అతను గట్టిగా పోరాడాడు. రోజూ జెండా పట్టుకొని కేకలు వేసే దృఢమైన యోధుడు. అతని పేరు శంకర పిళ్ళె. అతను మీనాచ్చిల్ తాలూకా నివాసి. చాలా సార్లు జైలుకు వెళ్ళాడు. జైలు లోపలా బయటా దెబ్బలు తిన్నాడు. ఎంత కొట్టినా యేడ్చేవాడు కాడు. 'భారత మాతాకీ జై' అని అరిచేవాడు. ఇప్పుడు ఒంట్లో బలం లేదు. చిన్న యిల్లు మాత్రం వుంది. ముసలి తల్లి, జాతీయోద్యమంలో అతని వెంట వున్న తమ్ముడూ వున్నారు. ఏ విధమైన సహాయానికయినా పాత్రుడు శంకర పిళ్ళె.

హాల్లో ఒకమూల బెంచి మీద కూర్చున్న శంకరపిళ్ళె వచ్చేపోయే వాళ్ళను జాగ్రత్తగా గమనిస్తున్నాడు. వాళ్ళల్లో, ఒక్కరు కూడా జైలుకు వెళ్ళి కష్టాలు అనుభవించినట్టుగా లేరు. ఎవ్వరూ ఒక్క దెబ్బ తిన్నట్టుగా కూడా లేరు.

ఎంతో వుత్సాహంగా వున్నారు. ఆడుతూ పాడుతూ తిరుగుతూ వున్నారు. పని సానుకూలం చేసుకోవాలన్న భావమే అందరిలో కనిపిస్తున్నది. ఎవ్వరూ ఎన్నడూ కష్టపడ్డట్టు కనిపించటం లేదు. కొంచెం సేపటికి అతని పాత స్నేహితుడొకడు అక్కడికి వచ్చాడు. ముహాట్టు పుళా వాస్తవ్యుడు రామన్ ఇలయత్. అతను కూడా సమ్మె ఆరంభించినప్పటి నుంచి ధర్మం కోసం పోరాడిన సేనాని. జైల్లో ఇద్దరూ కలిసి వున్నారు. ఇలయత్, శంకర పిళ్ళై దగ్గరకి వచ్చాడు.

ఇలయత్, శంకర పిళ్ళై లాగా బలహీనంగా లేడు. కుశల ప్రశ్నల తర్వాత శంకరపిళ్ళై అడిగాడు :

"వీళ్ళంతా యెవరు?"

"వీళ్ళంతా అర్జీలిచ్చేందుకూ, సిఫారసుల కోసమూ వచ్చారు. ఇంతకు ముందు నేనేసారి వచ్చాను - మన నారాయణ నాయరు ఉత్తరం తీసుకుని. అప్పుడు కూడా ఇక్కడ చాలా గుంపుంది. సాయంత్రం దాకా కాచుకుని వున్న తర్వాతనే ప్రెసిడెంటును కలుసుకోగలిగాను." అన్నాడు ఇలయత్.

కొంచెం దగ్గుతూ శంకర పిళ్ళై అన్నాడు: "మరి వీళ్ళంతా చొరబడి యెలా వెళ్తున్నారు?"

"వీళ్ళందరికీ సిఫారసు, చనువు వుంది. మనం కూడా మన పని చూసుకోవాలి గదా?"

శంకర పిళ్ళై తన ఆశ్చర్యాన్ని ఒక ప్రశ్న రూపంలో తెలియపరచాడు: "ఇలయత్! వీళ్ళల్లో ఎవరినయినా నీవు వూరేగింపులోగానీ, జైల్లో గానీ చూచావా?"

ఇలయత్ కూడా అదే ఆలోచిస్తున్నాడు. అతను ఒక్కర్ని కూడా అలాంటి స్థితిలో చూడ లేదు.

మరి వీళ్ళు అవస్థ పడ్డవాళ్ళలా అయినారు?

పూర్తిగా వ్యవహార కుశలుడయిన వ్యక్తిగా ఇలయత్ అన్నాడు: "అరే మిత్రమా! వాళ్ళను గురించి ఏమీ అడక్కు, ఏమీ అనకు. ఇప్పుడు మనపని నెరవేరుతుందో కాదో చూసుకుంటేచాలు."

ఇలయత్, శంకర పిళ్ళై చెవిలో మెల్లగా అన్నాడు: "సమ్మె సమయంలో ఈ ప్రెసిడెంటు ఎక్కడున్నాడో మనకు తెలియదూ? ఈనాడు గాంధీ టోపీ పెట్టుకొని తిరుగుతున్నాడు. అప్పట్లో సారాయి దుకాణానికి కంట్రాక్టరు గదా? గూండాలకు సారాయి పోసి వాళ్ళ చేత సభలను చెల్లా చెదరు చేయించిన వ్యక్తి కదూ? అలాంటి సభల్లోనే లాఠీ దెబ్బలతో నా చెయ్యి విరిగిపోయింది."

ఇలయత్ అవలంబించిన మార్గాన్ని శంకర పిళ్ళై ఒప్పుకోలేదు. అతని రక్తం ఉడికి పోయింది. ఎవరినన్నా కొంచెం ఎదిరించి వాదిద్దామని

అనిపించిందతనికి. ఏవేవే చెప్పాలనుకున్నాడు. అందువల్ల అతనికి తీవ్రంగా దగ్గు వచ్చింది. ఆ దగ్గు చుట్టు పక్కల వున్న జనాన్ని దగ్గరకు లాగింది. ఇలయత్, కనికరంతో అతని వీపు నిమిరాడు.

జనం ఇంకా వస్తూనే వున్నారు. పైన ప్రెసిడెంటు గదిలోకి వెళ్తున్నారు. పని అయిందనే వుత్సాహంతో వెళ్తున్నారు. ఇదివరకు జిల్లా కాంగ్రెసు కార్యాలయం ఎంత నిర్జనంగా వుండేదో శంకర పిళ్ళై జ్ఞాపకం చేసుకున్నాడు. అక్కడ చాలా రోజులు అతను ఒంటరిగా వుండేవాడు. అప్పుడు అక్కడికి తిన్నగా వచ్చేందుకు అందరికీ భయం వేసేది.

"నీవు ముందే అర్జీ యిచ్చావు కదా?" అడిగాడు ఇలయత్.

"ఇచ్చాను. ఒక పర్యాయం ప్రెసిడెంటు పాలా వచ్చాడు. అప్పుడతన్ని కలుసుకున్నాను. కాని నా విషయంలో ఒక చిక్కుంది." అని సమాధానం చెప్పాడు శంకర పిళ్ళై.

"చిక్కా? నీకా? నీకే చిక్కుంటే మరెవరికి చిక్కు లేకుండా వుంటుంది?"

"అదే పరిస్థితి మరి."

"ఎందువల్ల?"

శంకర పిళ్ళై అసలు విషయం చెప్పసాగాడు:

"నాకో తమ్ముడున్నాడు - చంద్రన్. అతన్ని నీవు చూచే వుంటావు. కాంగ్రెసులో పని చేశాడు. ఇప్పుడు సామ్యవాది, వక్త కూడా. సామ్యవాదుల్లో మంచి కార్యకర్త."

"అందువల్ల నీకేమయింది?" అడిగాడు ఇలయత్.

"అలా మనకనిపిస్తుంది. ఆ రోజు ప్రెసిడెంటును కలుసుకున్నప్పుడు కూడా ఆయన యిదే మాట అడిగాడు."

ఇలయత్ తన అభిప్రాయం చెప్పాడు: "ఇప్పుడు వాళ్ళు చాలా అల్లరి వాళ్ళయ్యారు. రహస్యంగా బాధలు పెడుతున్నారు కూడాను."

"ఏం చేస్తాను నేను? వాడికి చాలా వరకు చెప్పి చూచాను. కోప్పడ్డాను కూడా. ఇంటి నుంచి వెళ్ళి పొమ్మని కూడా అన్నాను." అన్నాడు శంకర పిళ్ళై నిస్సహాయత తెలియ పరుస్తూ.

శంకర పిళ్ళైను గురించీ, అతని తమ్ముణ్ణి గురించీ ఇలయత్‌కు బాగా తెలుసు. ఇలయత్ అన్నాడు: "ఎవరి నమ్మకం వాళ్లది. ఒకరి ఆలోచన తప్పని యెలా అనగలం? నా సంగతే చూడు. ప్రాంతీయ కాంగ్రెసులో చేరేప్పుడు మా నాన్నగారు నన్ను కులం నుంచి వెలేశారు. తొలిసారి జైలు నుంచి బయటికి వచ్చి నప్పుడు తలదాచుకునేందుకు ఇల్లు లేదు. మళ్ళీ నేను ఇంటికి వెళ్ళగలనా? నాకు సంగీతం టీచరుగా వుద్యోగం ఇస్తామని మాట యిచ్చారు. నీకు కూడా ఏదో వుద్యోగం ఇస్తామన్నారు. మరి మనం మన మార్గాన్ని వదిలి వెళ్ళగలమా?

శంకరపిళ్ళై ఒప్పుకున్నాడు: "చంద్రన్ తనపట్టు మీద గట్టిగా నిలబడి వున్నాడు. సమ్మె సమయంలో మా అమ్మ పడ్డ కష్టాలను నేను సరిగ్గా వూహించలేక పోయాను."

"అది జ్ఞాపకం తెచ్చుకుంటే యీనాడు నా కష్టాలను లెక్క చేయని చంద్రన్‌ను నేనేమీ అనలేకుండా వున్నాను. అప్పుడప్పుడూ వెనకటి విషయాలు గుర్తు తెచ్చుకుంటూ వుంటాను."

శంకర పిళ్ళై ఆ కథ అంతటితో ముగించాడు.

"అయితే ఆ రోజు పాలాల్లో ప్రెసిడెంటును కలుసుకున్నప్పుడు ఆయన ఏమన్నాడు? వీల్లేదని అన్నాడా?" అని అడిగాడు ఇలయత్.

శంకర పిళ్ళై ఆ సన్నివేశాన్ని వర్ణించాడు:

"అలా అనలేదు. 'నీతమ్ముడు సామ్యవాది కావటం పెద్ద ఆటంకం. అయినా ప్రయత్నిస్తాను" అన్నాడు."

ఈ విషయంలో తమ్ముడి సంగతి వాళ్ళెందుకు అడుగుతారో అని ఇలయత్ ప్రశ్న. ఈ విషయం అతనికి బోధపడటం లేదు.

"ఆ విషయం ఎవరడుగుతారు? ఎవరి నడుగుతారు?" అన్నాడు శంకర పిళ్ళై.

ఇప్పుడు శంకర పిళ్ళై వచ్చిన వుద్దేశం - తన విషయంలో ఏమయినా నిర్ణయం అయిందా లేదా అని ప్రెసిడెంటును అడగాలని. ఇంతవరకూ ఏమీ నిర్ణయం కాకపోతే ఇప్పుడు అందుకు అనుకూలమయిన పరిస్థితి ఏర్పడింది. శంకర పిళ్ళై సజల నేత్రాలతో అన్నాడు : "నేను - నేను మా తమ్ముణ్ణి ఇంటి నుంచి వెళ్ళ గొట్టాను."

శంకర పిళ్ళై వెక్కి వెక్కి యేడ్చాడు. దానితో అతనికి మళ్ళీ దగ్గు వచ్చింది.

అతనికి జీవితంలో తన వాడని చెప్పుకోదగిన వ్యక్తి - అతని తమ్ముడొక్కడే. అతన్ని పెంచి పెద్ద చేశాడు. ఈ అయిదెకరాల పొలం కోసం అతన్ని వదులు కుంటున్నాడు. ఆ దిగులుతో ఆ రోగి గుండె పగిలి పోతున్నది.

శంకర పిళ్ళై ఆ సన్నివేశాన్ని వర్ణించేందుకు ప్రయత్నిస్తున్నాడు. తుమ్ము రావటంతో అతనేమీ మాట్లాడలేక పోయాడు.

"వద్దు శంకర పిళ్ళై! వద్దు. చెప్పొద్దు. నా కర్థమవుతూంది." అన్నాడు ఇలయత్.

శంకర పిళ్ళైకు కొన్ని విషయాలు తప్పకుండా చెప్పాలని వుంది: "అతను సామ్యవాది అయినా - ఆపేక్షగల వ్యక్తి. నా యెదట వాడేమీ మాట్లాడడు. ఒక రోజు వాడు లోపలికి రాగానే 'వెళ్ళు బయటికి వెళ్ళు. గుమ్మంలోకి రాకు' అన్నాను. అలా అనేందుకు నాకు నోరెలా వచ్చిందో నాకే తెలియదు.

కారణమేమీ లేదు. అలా అనాలని నేను అనుకోను గూడా లేదు. అయినా అనేశాను. వాడు ఏడుస్తూ వెళ్ళి పోయాడు. ఇలయత్! మా వాణ్ణి నేనిలా కొట్టి బయటికి గెంటేశాననే సంగతి నేనే నమ్మ లేకుండా వున్నాను."

శంకర పిళ్ళైకు - ఇంకా ఏమేమో చెప్పాలని వుంది. కాని చెప్పేందుకు ఓపిక లేదు. అతన్ని ఎలా ఓదార్చాలో తెలియక ఇలయత్ తికమక పడుతున్నాడు.

శంకర పిళ్ళై మళ్ళీ మొదలు పెట్టాడు: "ఇక నాకెవరూ లేరు. ఒంటరివాణ్ణి. నాకు భయంగా వుంది. రెండు రోజులు వాళ్ళ ఆఫీసుకు వెళ్ళి విచారించాను. నిజమో అబద్ధమో తెలియదు. కానీ అతనెక్కడ వున్నాడో తెలియదన్నారు ఆఫీసు వాళ్ళు. ఇక ప్రభుత్వం ఇచ్చే యీ భూమి ఎవరికోసం? అని నా ఆలోచన."

"అలా ఎందుకనుకుంటావ్? చచ్చి పోయే వరకు బతకాలి గదా? ఇది కూడా బిచ్చమడగటం లాంటిదే? నిజమే. కష్టమే. కాని మనలాంటివాళ్ళకు మరో మార్గమేముంది?" అన్నాడు ఇలయత్.

శంకరపిళ్ళై మరో నిర్ణయానికి వచ్చాడు.

"ఈ సమ్మెలు, సామ్యవాదం అంతా సమసిపోయిన తర్వాత అతను చేతులు జాడించుకుంటూ దగ్గుతూ తుమ్ముతూ కట్టుకున్న గుడ్డలతో యిల్లు చేరతాడు. అప్పుడతన్ని చూచేవాళ్ళు ఎవ్వరూ వుండరు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మనం చతికిల బడ్డట్టు తను ఇంటికి వస్తే తినటానికి ఏదో కొంత కనిపించాలి కదా? అందుకే నడవ లేక పోయినా ఈ పని కోసం యింత దూరం వచ్చాను."

ఒక్క క్షణం ఆగి శంకరపిళ్ళై చిరాకుతో అన్నాడు: "మా వాణ్ణి నేను కొట్టి బయటికి పంపించాను. వాడు పట్టి మొండివాడు. చిన్నప్పటి నుంచీ అంతే. ఎలాగయినా వాణ్ణి మళ్ళీ ఒకసారి చూస్తే చాలు."

రామన్ ఇలయత్‌కు చెప్పేందుకు ఏమీ లేదు. ఆ అన్నగారి దుఃఖం చూడలేక చతికిల బడ్డాడు. ధైర్యం చెప్పేందుకు ఇలయత్ అన్నాడు: "అలా దిగజారిపోవద్దు. అతను వస్తాడు."

"వస్తే రానీ. అతను వస్తే ఏదో చూపించాలి. ఇప్పుడు మాత్రం నేను నా తమ్ముణ్ణి ఇంటి నుంచి గెంటేశానని చెప్పేందుకు ఇక్కడికి వచ్చాను. అలాంటి తోడబుట్టినవాడు నాకు లేడని నానేటి మీదుగా చెప్పాలి. ఆ మాట ఎలా చెప్పను? ఇంతవరకూ నేను మనస్సును మభ్యపెట్టి యేమీ చెప్పలేదు. ఖద్దరు గుడ్డలతో ఈ మాట చెప్పాలి. వీళ్ళు నా చేత అలా చెప్పిస్తున్నారు."

శంకరపిళ్ళై కళ్ళల్లో నీళ్ళు నిండాయి. చాలాసేపు ఆ యిద్దరు మిత్రులూ ఏమీ మాట్లాడలేదు. బాధితులు, వాళ్ళను వెంటపెట్టుకొని వచ్చిన

నాయకులు మాత్రం వస్తూ పోతూ వున్నారు. మొత్తం మీద ఇదంతా అన్యాయంగా తోచింది ఇలయత్‌కు.

మొహం తుడుచుకుని శంకరపిళ్ళె అడిగాడు:

"నీవు అర్జీ యిచ్చావా?"

"ఇచ్చాను."

"ఆటంక మేమీ లేదు కదా?"

"లేనట్టే తోస్తున్నది. నారాయణ నాయరు లేడూ? గుర్తుందా? ఈ మధ్య అతను జగడవాడి కంట్రాక్టరయినాడు. ఆ తర్వాత స్వతంత్ర తిరువితాంకూరు సమయంలో తిరిగి వచ్చాడు."

శంకరపిళ్ళె అతన్ని గుర్తు చేసుకున్నాడు.

"ఒకసారి నే నతనిచేత చెప్పించాను" అన్నాడు ఇలయత్.

"అలాంటి వాణ్ణి ఒకణ్ణి నేను సంపాయించలేక పోయాను" అన్నాడు శంకర పిళ్ళె నిరాశతో.

కాని నారాయణ నాయర్ని కలుసు కోవాలంటే చాలా ఖర్చవుతుంది. అసలతను దొరకటమే కష్టం. గొప్ప గొప్ప కంట్రాక్టర్లు, ఉద్యోగస్థులూ వచ్చి అతన్ని కార్లల్లో తీసుకువెళ్తారు అతని దగ్గరకి వెళితే చాలు, పని అయిపోతుంది. అతని రోజులలాంటివి. అతనికి బృహస్పతి దశ నడుస్తూవుంది. 'పని అవుతుంది కాని ఇంత డబ్బు కావాలంటాడు. దాపరిక మేమీ లేదు. ఇస్తే పనవుతుంది. అతనికి మంచి రాబడి." అన్నాడు ఇలయత్.

"నీవేమన్నా యిచ్చావా?" అని అడిగాడు శంకరపిళ్ళె.

"ఇయ్యందే పని జరగదు. నన్ను గురించి, నా పనిని గురించి బాగా తెలుసు కాబట్టి యాభైరూపాయలతో సరిపోయింది. ఈ పనికి అసలతని ఫీజు రెండువందల రూపాయలు. అదీకాక కారు ఖర్చు. మొత్తం మీద నేను డెబ్భైఅయిదు రూపాయలు ఖర్చు పెట్టాను."

ఒక పెద్ద నిట్టూర్పు విడిచి శంకరపిళ్ళె 'కాంగ్రెసు ప్రభుత్వం!' అన్నాడు.

ఇలయత్‌కు నారాయణ నాయరును గురించి మరి కొన్ని విషయాలు చెప్పాలని వుంది: "విను శంకర పిళ్ళే! నాయరు చెప్పేది ఒక విధంగా న్యాయ సమ్మతంగానే తోస్తుంది. అందరూ ఎవరికి దొరికిన అవకాశాన్నీ, పదవినీ వారు ఉపయోగించుకొని లాభం పొందుతున్నారు. ఆదర్శమని చెప్పి ఒకమూల కూర్చోటం తెలివి తక్కువ. ఒక విధంగా ఆలోచిస్తే అది నిజమే అనిపిస్తుంది. ఒకరిద్దరు ఇలా ఆదర్శం కోసం పాకులాడితే లాభమేముంది?"

"నారాయణ నాయరుకు ఇంత స్వేచ్ఛ వుందన్నమాట." అన్నాడు శంకర పిళ్ళె.

"అవును. ఎక్కడికి వెళ్లినా స్వేచ్ఛే. తిరుకొచ్చిన్ కాంగ్రెసు ప్రెసిడెంటుకు అతను కుడి భుజం."

ఇలయత్ మెల్లగా చెప్పాడు: "ఈ ప్రెసిడెంటును కుర్చీలో కూర్చో బెట్టింది యెవరనుకున్నావ్? నారాయణ నాయరే కారకుడు. లూకోస్‌ను ప్రెసిడెంటును చేసేందుకు విశ్వప్రయత్నం చేశాడు."

ఇలయత్ చెప్పుకు పోతున్నాడు : "అంతటా మంచి చొరవుంది. ఛీఫ్ సెక్రటరీకి అంతరంగిక వ్యక్తి. ఇప్పుడు ఛీఫ్ సెక్రటరీ కూతురికి సంబంధం వెతుకుతున్నాడు."

ఇలయత్ నారాయణ నాయరును గురించి యేదేదో వాగుతున్నాడు. అంతేకాదు. అతన్ని సమర్థించేందుకు ప్రయత్నిస్తున్నాడు. శంకరపిళ్ళై ఆ విషయం గమనించక పోలేదు. భూమి యిప్పించేందుకు అతను చేసిన సహాయమే దీనికి కారణమని శంకర పిళ్ళై అనుమానించాడు.

"ఇలయత్! నీకు అతనంటే చాలా ఇష్టం అనుకుంటాను." అన్నాడు.

"అంత యిష్టమేమీ లేదు. కాని లేదని చెప్పేందుకు కూడా వీల్లేదు. కొంత మంది చిన్న చిన్న పనుల కోసం నా దగ్గరకి వచ్చారు. తిరువనంత పురంలో పేష్కారు, సూపరింటెండెంటు దగ్గరికి వెళ్ళి నేను ఏర్పాటు చేశాను. వాళ్ళ పని కూడా సానుకూలమయింది. వాళ్ళు కోరిన డబ్బు కూడా యిచ్చారు."

శంకర పిళ్ళైకు ఇలయత్ మీద గౌరవం కొంత తగ్గిపోయింది. ఈ సిఫారసుల్లో, అవినీతిలో అతనికి కూడా కొంత భాగముంది. శంకర పిళ్ళై కొంచెం వ్యంగ్యంగా అడిగాడు:

"నీకు కూడా ఈ వ్యాపారంలో ఏమన్నా దక్కిందా?"

అది కొంచెం ఘాటుగా తగిలింది. "ఓహో! ఏమిటి నీవడిగేది? నేను జీవితమంతా ఖద్దరే కట్టాను." అన్నాడు. "ఈ నోటితోనే నేను 'మహాత్మాగాంధీ కి జై', 'వందేమాతరం' అని కేకలు పెట్టాను.

"లేదు, ఊరికే అడిగాను" అన్నాడు శంకరపిళ్ళై తన పొరపాటు సరిదిద్దుకుంటున్నట్లుగా.

"విను శంకర పిళ్ళై ! ఇద్దరు ముగ్గురు సహాయం కోసం నా దగ్గరికి వచ్చారు. వాళ్ళని అతని దగ్గరకి తీసుకెళ్ళాను. ఏదో సాయం చేద్దామనే వుద్దేశంతో ఆ పని చేశాను. వీళ్ళ దగ్గరకి తిన్నగా వెళితే ఏమన్నా పనవుతుందా? ఏదన్నా ఒక కాగితం పంపిస్తే మామూలు ధోరణిలో పని కాదు. ఈ చివరి నుంచి ఆ చివరి వరకూ అంతా అదే వరుస. ఆదర్శం కోసం కూర్చుంటే ఏ పనీ కాదు. ప్రపంచమంతా అలాగే వుంది." - ఊపిరి పీల్చుకొని ఇలయత్ మళ్ళీ ఇలా అన్నాడు: "నాకేమీ లాభం దొరకలేదని చెప్పేందుకు వీల్లేదు. యాభై రూపాయలకు నా పని చేస్తానని యెందుకు చెప్పాడనుకున్నావ్? నామీద ప్రేమవల్ల అలా అన్నాడనుకోకు. నేను మాటి

మాటికి జైలుకు వెళ్ళి పడరాని కష్టాలు పడ్డానని కూడా కాదు. నావల్ల అతనికి చాలా డబ్బు ముట్టింది. అదే కారణం. ఈ విధంగా నాకందులో భాగం వుందని నీవు అనుకుంటే అనుకోవచ్చు."

ఇలయత్ కొంచెం నవ్వాడు. శంకరపిళ్ళైకు నవ్వు రాలేదు. అతను తన దీన దశను వర్ణించాడు: "డెబ్బై ఐదు రూపాయలు కాదు కదా, డెబ్బై అయిదు పైసలు కూడా నా దగ్గర లేవు. కాని నేను బాధలు పడ్డాను. నాకు ఏమయినా ఇస్తారో లేదో చూడాలి. ఇయ్యకపోతే పోనీ."

పావం ఇలయత్‌కు ఏమి చెప్పేందుకూ తోచలేదు. శంకరపిళ్ళై బెదిరిస్తున్నాడు. దానికి ఇలయత్ ఏమి సమాధానం చెప్పగలడు? శంకరపిళ్ళైకు భూమి దొరికితే ఇలయత్ సంతోషిస్తాడు.

వచ్చి చాలా సేపయింది. ఇలా కూర్చుంటే కూర్చుని పోవటమే అవుతుంది. సాయంత్రంలోగా శంకరపిళ్ళై యిల్లు చేరాలి. అందువల్ల అతను ప్రెసిడెంటు గదిలోకి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. అవసరమయితే ఆ రోజు అక్కడే వుండేందుకు తయారయి వచ్చాడు ఇలయత్. పని కావాలంటే ప్రెసిడెంటును తీరికగా కలుసు కోవటమే మంచిదని అతనికి తెలుసు. శంకరపిళ్ళై లోపలికి వెళ్ళి ప్రెసిడెంటుతో తగూలాడతాడని భయం వేసింది. ఇలయత్‌కు. శంకరపిళ్ళై వాలకం అలాగే వుంది.

"ఇప్పుడే వెళ్తావా? కొంచెం గుంపు తగ్గిన తర్వాత వెళ్ళటం మంచిదేమో?" అన్నాడు ఇలయత్.

"ఇక్కడ గుంపు తగ్గే లక్షణాలేమీ కనిపించటం లేదు. ఎప్పుడో ఒకప్పుడు కలుసుకోవాల్సిందే కదా? యిప్పుడే కలుసుకుంటే సరిపోతుంది."

శంకరపిళ్ళై ఇక ఎక్కువగా మాట్లాడకుండా పైకి వెళ్ళేందుకు మెట్లెక్క సాగాడు.

ప్రెసిడెంటు పనిలో వున్నాడు. టేబిలు చుట్టూ నాలుగు వైపులా నలుగురయిదుగురు పెద్ద మనుష్యులు కూర్చుని వున్నారు. వాళ్ళ వెనక కొంత మంది నిలబడి కూడా వున్నారు. గుమ్మంలో ప్రవేశించగానే శంకరపిళ్ళై మాసి పోయిన గాంధీ టోపీ తలమీద పెట్టుకున్నాడు. పూర్తిగా స్వాతంత్ర్య యోధుడిలా ప్రెసిడెంటు ఎదుట పడాలనుకున్నాడు.

శంకరపిళ్ళై లోపలికి వెళ్ళగానే ప్రెసిడెంటు తప్ప అందరూ అతన్ని చూచారు. అతను బాధితుడని చూస్తేనే తెలుస్తున్నది. ప్రెసిడెంటు ఒక అర్జీ మీద తన అభిప్రాయం రాస్తున్నాడు.

కొంత సేపటికి ప్రెసిడెంటు తలయెత్తి చూచాడు. శంకరపిళ్ళై చేతులు జోడించి "జైహింద్" అన్నాడు.

ప్రెసిడెంటు ప్రత్యభివాదనం చెయ్యలేదు. 'జైహింద్' అనేందుకు సందేహించాడు. బహుశా ఆ శబ్దాన్ని ఉచ్చరించేందుకు అతని నాలుక ఎప్పుడూ నేచుకొని వుండదు.

శంకరపిళ్ళ టేబిలు దగ్గరికి వెళ్ళాడు. శంకరపిళ్ళను ఆయన గుర్తించలేదు. అందుకు శంకరపిళ్ళ విచారించలేదు. తన పరిచయం తానే చేసుకున్నాడు.

"నేను మీనచ్ వాస్తవ్యుణ్ణి. బాధితుణ్ణి. ఆది నుండీ కాంగ్రెసులో చేరి పోరాడాను. పదిహేడు సార్లు జైలుకు వెళ్ళాను. దెబ్బలు తిన్నందువల్ల తొమ్మిది సార్లు ఆస్పత్రిలో చేరాను. నా పేరు శంకర పిళ్ళ."

అంతా శంకర పిళ్ళ ఒక్క గుక్కలో చెప్పాడు. చెప్పవలసిందంతా చెప్పుకోవాలి గదా?

"అర్జీ పంపించావా?" అడిగాడు ప్రెసిడెంటు.

"అవునండీ, అర్జీ ముందే పంపించాను. పాలా లో ఒకసారి మిమ్మల్ని కలుసుకొని చెప్పుకున్నాను కూడా."

ప్రెసిడెంటుకు గుర్తు వచ్చింది. "అవునవును. నాకు గుర్తు వచ్చింది. మీ తమ్ముడొకడు సామ్యవాది కదూ!"

"అవును" అన్నాడు శంకరపిళ్ళ.

దానితో అక్కడున్న వాళ్ళందరూ కుతూహలంతో చూచారు. శంకరపిళ్ళ వైపు ఆసక్తితో చూచారు. ఇంత వరకూ వాళ్ళు సామ్యవాదిని చూడలేదు. సామ్యవాది సోదరుడు ఎదురుగా నిలబడి వున్నాడు. ఇతను చాలా విచిత్ర వ్యక్తి అయివుండాలి."

ప్రెసిడెంటు తన అసమర్థతను తెలియపరుస్తూ అన్నాడు: "నన్నేం చెయ్యమంటారు? మీకు సాయం చేయాలనే నాకుంది. కాని యేం చెయ్యను?"

"వాణ్ణి నేను ఇంటినుంచి వెళ్ళ గొట్టాను" అన్నాడు శంకరపిళ్ళ.

ఆ మాట తన నోటినుంచి రాగానే శంకరపిళ్ళకు గుండెల్లో కుంపటి రాజేసి నట్టయింది.

"నన్ను అపార్థం చేసుకోవద్దు. నాకు మీరంటే విరోధమేమీ లేదు." ప్రెసిడెంటు మళ్ళ తన అసమర్థత తెలుపుకున్నాడు.

"ఆ నమ్మకంతోటే నేనిక్కడికి వచ్చాను."

"మీ అర్జీ మీద నేను నా అభిప్రాయం రాసి పంపిస్తాను. కాని అందువల్ల ప్రయోజనమేమీ లేదు. పోలీసులు విచారణ చేసి 'ఇతని తమ్ముడు సామ్యవాది' అని రాసి పంపిస్తారు. నిన్న కూడా ఒక ఉపన్యాసంలో అతను చెప్పాడు - మంత్రుల రక్తంతో నేను బొట్టు పెట్టుకుంటానని." అన్నాడు ప్రెసిడెంటు

"పోలీసు రిపోర్టా?" అన్నాడు శంకరపిళ్ళై నివ్వెరపోతూ.

"అవును. ఈ అర్జీ పోలీసు రిపోర్టు కోసం పంపిస్తాం. వాళ్ళు విచారణ చేస్తారు. అప్పుడు మీ తమ్ముణ్ణి గురించి రాస్తారు. ఇక్కడినుంచి వెళ్ళిన రిపోర్టూ, పోలీసులు పంపించే రిపోర్టుకూ వ్యత్యాసముండ కూడదు కదా?" అన్నాడు ప్రెసిడెంటు.

అసహ్యం, కోపం, నైరాశ్యంతో శంకరపిళ్ళై అడిగాడు: "ఇంకా మమ్మల్ని గురించి పోలీసు విచారణ, సి.ఐ.డి. రిపోర్టు కావాలా?"

ఆ ప్రశ్నలో అంతర్గతమైన బాధ ప్రెసిడెంటుకు బోధపడలేదు. పోలీసు విచారణ, సి.ఐ.డి. రిపోర్టు అంటే ఏమిటో అతనికి తెలియక పోవటమే అందుకు కారణం. సమ్మె సమయంలో అతను ఇవన్నీ అనుభవించలేదు. "గవర్నమెంటుతో కూడిన వ్యవహారం గదా? వాళ్ళ పద్ధతులూ, నియమాలూ ఏవో ఉంటాయి". అన్నాడాయన.

"అయితే ఈ పద్ధతులూ, నియమాలూ ఆ పనికికూడా కావాలా?"

కొంచెం కోపంతో అడిగిన ప్రశ్న అది. ప్రెసిడెంటు శంకరపిళ్ళై వైపు తేరిపార చూచాడు. "నీవు వాదించేందుకు వచ్చావా?" అని అడిగాడాయన.

శంకరపిళ్ళై జంకకుండా జవాబు చెప్పాడు: "అవును, అవసరమయితే తప్పదు మరి. నా విషయం చెప్పుకునేందుకు నేను తప్ప మరెవ్వరూ లేరు. నాకు లంచమిచ్చేందుకు డబ్బు లేదు. నాకు సిఫారసు చేసే-వాళ్ళూ ఎవరూ లేరు."

ఒక్క క్షణం ఆగి శంకరపిళ్ళై ఊపిరి పీల్చుకుని అన్నాడు: "ఇవన్నీ నిర్మూలించేందుకు ఆరోగ్యకరమైన శరీరం, అంతఃకరణ శుద్ధిగల నాలాంటి కొంతమంది తమ జీవితాలనే నాశనం చేసుకొని ఈ రోజు ఇలా దగ్గుతూ నిలబడే స్థితికి వచ్చారు. అందువల్లనే ఆత్మస్థైర్యంతో అడుగుతున్నాను - ఈ పద్ధతులూ, నియమాలూ ఇప్పుడు కూడా అవసరమా అని?"

"అవన్నీ మీరు ఎక్కడ అడగాలో, అక్కడ అడగండి. ఇక్కడ కాదు." అన్నాడు ప్రెసిడెంటు.

వ్యంగ్య సూచకంగా పెదిమలు విరిచి శంకరపిళ్ళై సమాధానం చెప్పాడు: "అవును, ఇలాంటి అసంబద్ధపు మాటలు నీవు అనగలవు. ఈ వాతావరణంలో కూర్చునే సరికి అందులో నీవు లీనమై పోయావు. దీనిని తయారు చేసేందుకు ఒక్క చెమట బొట్టు కూడా నీ ఒంటి నుంచి కారలేదు."

అతని ధోరణి శ్రుతిమించి రాగాన పడ్డది. ప్రెసిడెంటు సహించలేక పోయాడు. ఆయన తను కూర్చున్న కుర్చీని వెనక్కినెట్టి లేచి నిలబడ్డాడు: "ఛీ, బయటికి వెళ్ళు."

అక్కడ కూర్చున్న వాళ్ళు కూడా కొంచెం తయారవుతున్నారు. శంకరపిళ్ళై మళ్ళీ అన్నాడు: "నీవు సారా అంగళ్ళకు కంట్రాక్టరుగా వున్న రోజుల్లో

గూండాలను పోగుచేసి కాంగ్రెసు సమావేశాలను చెల్లా చెదరు చేయించావు. నాకు తెలుసు. ఇప్పుడు కూడా నీవు అలాంటి వాళ్ళనే పిలిపించగలవు."

అక్కడ కూర్చున్న ఒకవ్యక్తి శంకరపిళ్ళైకు బిరుదిచ్చాడు: "ఇతను సామ్యవాది అని."

"నీవు కూడా బాధితుడవా?" అన్నాడు శంకరపిళ్ళై అతనివైపు మళ్ళి.

ఆ వ్యక్తి ఖద్దరు బట్టలు కట్టుకొని వున్నాడు. అతని మొహం కొంచెం పాలిపోయింది. శంకరపిళ్ళై అతన్ని అడిగాడు:

"నీవు జైలుకు వెళ్ళావా? దెబ్బలు తిన్నావా? ఏం చేశావు నీవు?"

ఏదో సమాధానం చెప్పక తప్పదని అనిపించిందతనికి.

"నేను - నేను - కనపడకుండా వున్నాను."

"ఓహెూ!" అన్నాడు శంకరపిళ్ళై.

ప్రెసిడెంటు శంకరపిళ్ళైను బయటికి వెళ్ళవలసిందని మరోసారి హెచ్చరించాడు. "ఇక్కడ నీవిలా అల్లరి చేశావంటే పోలీసులను పిలవాల్సి వస్తుంది. ముందే చెప్తున్నాను."

శంకరపిళ్ళై ఏ మాత్రం కంగారు పడలేదు.

'అదే యిక మిగిలింది. అది కూడా కానీ. అప్పుడు నాకు రావలసిన అయిదెకరాలూ ఆ కనబడకుండా వున్న కాంగ్రెసు వాళ్ళకి ఇచ్చెయ్యొచ్చు."

శంకరపిళ్ళై శ్వాస తీవ్రమయింది. కోపానికి తట్టుకునే శక్తి అతనికి లేదు. "నీవు పోలీసులను పిలవనక్కర్లేదు. నేనే వెళ్తాను. కాని ఒక్క విషయం నీకు చెప్పాలి. నేను సామ్యవాదిని కాదు. కాలేను కూడా."

శంకరపిళ్ళై వెళ్ళి పోయాడు. గుమ్మం దాకా వెళ్ళి ఏదో చెప్పేందుకు అతను వెనక్కి తిరిగాడు. అప్పుడు ప్రెసిడెంటు అన్నాడు: "కొంచెం జాగ్రత్తగా వుండండి, అర్థమయిందా?"

శంకరపిళ్ళై దీనంగా అన్నాడు: "ఇంక జాగ్రత్త దేనికండీ?"

జీవితంలో దారి తెలియని ఆ వ్యక్తి కొంత సేపు తన గతాన్ని గుర్తు చేసుకుని విలువ కట్టుకున్నాడు. జీవించేందుకు ఏ మార్గమూ కనిపించకపోవటం అలా వుంచి ఈనాటికీ బెదిరింపులే వెన్నంటుతూ వున్నాయి. కాని అది వాళ్ళ తప్పుకాదని అతనికనిపించింది. వాళ్ళేం చేశారు? జీవితమంతా దారుణమయిన పోటీ. అవకాశాన్ని దుర్వినియోగం చెయ్యనివాళ్ళు బుద్ధిమంతులు. దేశ స్వాతంత్ర్యం కోసం పాటు పడ్డారు. ఆ రోజు ఈ అయిదెకరాల భూమి కోసం అందులో ప్రవేశించారా? ఏదో లాభం కోరి యిదంతా చెయ్యలేదు. అది ఆత్మ పిలుపు. ఏ మాత్రం ప్రతిఫలంకానీ లాభం కానీ ఆశించి చెయ్యలేదు. వాళ్ళు తమ బాధ్యత నిర్వహించారు. కాంగ్రెసు ఉద్యమం కేవలం కాంగ్రెసు నాయకుల కోసం, కార్యశూరుల కోసం సాగలేదు. సమస్త రాష్ట్రానికి స్వాతంత్ర్యం సంపాయించేందుకు సమరం

సాగించాం. ఈ ప్రెసిడెంటూ, ఇక్కడ వున్న వాళ్ళూ అందరూ ఈ దేశవాసులే. తనకు ప్రత్యేకంగా అధికారం కావాలను కోవడం ఈ టోపీని, ఈ దుస్తులనూ అపవిత్రం చేసినట్టు. ఉద్యమంలో పాల్గొన్న వాళ్ళు ఒక ప్రత్యేకమైన అధికారవర్గంగా రూపొందటం న్యాయం కాదు. స్వాతంత్ర్యం వచ్చింది యీ మట్టిలో పుట్టిన బిడ్డల కోసం. కేవలం దాని కోసం పాటుపడ్డవాళ్ళ కోసం కాదు. ఎదిరించిన వాళ్ళకు కూడా అందులో హక్కుంది. తను అన్న మాటలు అంత బాగులేవని అనిపించింది శంకరపిళ్ళైకు.

కొంచెం దూరం వెళ్ళి శంకరపిళ్ళై వెనక్కితిరిగి చూచాడు. కాంగ్రెసు కార్యాలయం మీద త్రివర్ణపతాకం ఎగురుతూ వుంది. ఆ జెండా చేతులో పట్టుకొని అతను స్వాతంత్ర్య సమరంలో ప్రవేశించాడు. కాని ఆ జెండాలో రంగులు మారాయి.

చంద్రన్ ఎక్కడ వున్నాసరే వెతికి తీసుకు రావాలనిపించింది శంకరపిళ్ళైకు సామ్యవాది అయేందుకు కాదు, అన్నదమ్ముల మధ్య ఆప్యాయాన్ని నిలబెట్టుకునేందుకు. కర్ణకఠోరంగా అతను గర్జిస్తున్నట్టు శంకరపిళ్ళై చెవుల్లో ధ్వని వినిపించింది: "విప్లవం - వర్ధిల్లాలి."

ఒకనాడు అతను కూడా అలాగే గర్జించాడు. అది కొంతమందికి కర్ణకఠోరంగా వినిపించింది.

శంకరపిళ్ళై నడుస్తూ నడుస్తూ చాలా దూరం ముందుకు సాగాడు.

గదిలో కూర్చున్న వాళ్ళతో ప్రెసిడెంటు అన్నాడు:

"చూడండి. ఎంత ఉగ్రంగా వున్నాడో. ఎంతటి దారుణమైన పనులు చేస్తున్నాడో?"

"పాపం, అతను చాలా కష్టాలు పడ్డట్టువున్నాడు. బలహీనం వల్ల కోపం వచ్చి వుంటుంది" అన్నాడొక దయానిధి.

మరొక వ్యక్తి తన అభిప్రాయం ఇలా చెప్పాడు: "అతనికి ఎలా ప్రవర్తించాలో తెలియదు. అలాంటప్పుడు దెబ్బలు తిని జైలుకు వెళ్ళాడంటే ఆశ్చర్యమేముంది?"

మూడో వ్యక్తి అభిప్రాయం మరోలా వుంది:

"అతను దెబ్బలు తిన్నందుకు కారణం కాంగ్రెసు ఉద్యమం అయివుండదు. నేరు మంచిది కాకపోవటం అయివుంటుంది. అలా చూస్తే అతను బాధితుడు కాదు."

అందరూ నవ్వుకున్నారు. ప్రెసిడెంటు తన అభిప్రాయం చెప్పాడు: "బాధితులమని చెప్పుకొని వచ్చే యీ పాతకాంగ్రెసు వాళ్ళంతా యింతే. తెలివితక్కువ వాళ్ళు. నాలుగు అంటించాలనిపిస్తుంది. అదే వాళ్ళకు తగిన శిక్ష."

మరొకడన్నాడు: "ఆ రోజుల్లో కాంగ్రెసులో చెడ్డవాళ్ళూ తెలివితక్కువ వాళ్ళూ వుండేవాళ్ళు కాదు. అందరూ పరువు ప్రతిష్ఠగల వాళ్ళు. వేడి రక్తపు కుర్రవాళ్లుకూడా వుండేవాళ్ళు."

వీళ్ళందరూ సామ్యవాదులని ప్రెసిడెంటు అభిప్రాయం. "ఇలాంటి వ్యక్తులను తొలగించి పార్టీని పవిత్రం చెయ్యాలి." అన్నారాయన.

## ముప్పై అయిదు

ఆశ్రమంలో నలుగురు సన్న్యాసినులున్నారు. అందులో ముఖ్యురాలు మాతా జ్యోతిర్మయీదేవి. మరో ఆవిడ ప్రభావతీదేవి. నిత్యానందమయి, తేజస్వరూపిణి అని మరో యిద్దరున్నారు.

ప్రతి రోజూ పూజా, భజనా జరుగుతాయి. సాయంత్రం భజనకు చాలామంది వస్తారు. వారానికి ఒకటి రెండు రోజులు ప్రత్యేకంగా ఆధ్యాత్మిక చర్చలు, వేదాంత చర్చలు, అఖండనామ సంకీర్తన, గీతా ప్రవచనం లాంటివి ఏవో కార్యక్రమాలుంటాయి. అప్పుడప్పుడూ సన్న్యాసులు కూడా ఆశ్రమానికి వస్తూ వుంటారు. ఆశ్రమం తరఫున పెద్ద పెద్ద మత సమావేశాలు కూడా జరుగుతూ వుంటాయి. క్లుప్తంగా చెప్పాలంటే తిరువనంతపురంలో ఉద్యోగస్థులకూ ధనవంతులకూ ఆధ్యాత్మిక జీవిత కేంద్రం చిదానందాశ్రమం.

భక్తి భావంతో నిండిన స్తోత్రాలూ, సంకీర్తనలూ జరుగుతూంటే పరిసరప్రాంతాలు ఆధ్యాత్మిక చైతన్యంతో విలసిల్లుతూ వుండేవి. కానీ కొంచెం దూరంగా నిలబడి జాగ్రత్తగా గమనించి చూస్తే ఆ బృహద్భవనం దీర్ఘంగా నిశ్వసిస్తున్నట్టు కనిపించేది. 'ఇది యిందు కోసరం ఏర్పడలేదు' అని గద్గద కంఠంతో అనాలని అనిపిస్తుంది. ఆశ్రమం కోసరం అది నిర్మింపబడ లేదు. మరో ప్రయోజనం కోసం దానికి పునాదులు లేచాయి. ఒక మంచి మనిషి జ్ఞాపకార్థం ఆ భవనం అంకితమయింది. ఆ దారిలో వెళ్ళే వాళ్ళు ఆ కథ చెప్పుకుంటూ వుండవచ్చు. "ఈ భవనం ఎవరు కట్టారో తెలుసా, చెప్తాను విను" అన్నట్టుగా వాళ్ళు కథ మొదలు పెట్టే వాళ్ళు. ఎవరి స్మృతి చిహ్నంగానే ఆ యింటికి 'శేఖర విలాసం' అని పేరు పెట్టారు. ఆ పెద్ద మనిషి శేఖర పిళ్ళె యీనాటి యీ స్థితిని చూచి సంతోషిస్తాడా?.

ఈ యిల్లు 'నివాసం కోసరం కట్టబడింది. ఏదో యింట్లో వుండేందుకు కాదు - భార్యా భర్తలకు లేక ప్రేయసీ ప్రియులకు ప్రేమ శృంగార సదనంగా అది భావించబడింది. అందులో మంచి మంచి పడక గదులున్నాయి. పిల్లలు కూర్చుని చదువుకునేందుకు కూడా గదులున్నాయి. ఆ యిల్లు కట్టించిన వాళ్ళకు అందులో పిల్లలుండాలని వుంది కాబోలు. మామూలు ఇండ్లల్లో ఉండని సదుపాయం ఒకటి అందులో వుంది. వెనక నుంచి వచ్చి పోయేందుకు ఒక దొడ్డిదారి వుంది. ఆ యిల్లు కట్టించిన వ్యక్తి తన ప్రత్యేకమైన అవసరాన్ని దృష్టిలో పెట్టుకొని అలా కట్టించి వుంటాడు.

కేశవపిళ్ళై ఎవ్వరికీ తెలియకుండా కనబడ కుండా ఆ దారిలో వచ్చి పోతూ వుండేవాడు. ప్రతిరోజూ ఆ దారిని వెళ్ళే వాళ్ళు కనీసం పదిమంది ఆ కథ చెప్పుకుంటూ వుంటారు.

అది భార్యకు భర్త కట్టించి యిచ్చిన యిల్లు కావచ్చు. లేదా ప్రేయసికి ప్రియుడు కట్టించి వుండవచ్చు. ఏమయినా సరే, ఆ యింటి యజమానురాలికి తన యిష్టుణ్ణి ఉంచుకోవటం న్యాయమేనా? అన్నీ యెలా వున్నా అది లంచంగానే, ఉపకారానికి ప్రత్యుపకారంగా సమర్పించిన కానుకగానే అలా రూపొందింది. కాని యిప్పుడది యేమిటో అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది - అది ఆశ్రమం. వెనకటి తంకమ్మ జీవితం ప్రస్తుతం సన్న్యాసినిగా మారినట్టుంది.

ఆ మార్పును ప్రశంసించే వాళ్ళూ వున్నారు. ఆ యిల్లు పావన మయిందనీ, తంకమ్మ జ్యోతిర్మయిగా మారిపోవటం ఆమె పురాకృత సుకృతమని భావించే వాళ్ళూ వున్నారు. అందుకు భిన్నంగా ఆ పాత చరిత్రను వల్లె వేసే బాటసార్లు కూడా వున్నారు. అయినప్పటికీ, ఆ భవనం దీర్ఘంగా నిశ్వసిస్తూ వుంది. ఆ యింటి పునాది రాయి చిరుచెమటలతో చిరాకుపడుతూ వుంది.

నిత్యానందమయీ దేవిని 'ఏడుపు తల్లి' అని అంటారు. ఆమెకా పేరు ఊరికే రాలేదు. మంత్రాలు వినగానే ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండేవి. భక్తి గీతాలు వినగానే ఆమె చెక్కిళ్ళు కన్నీళ్ళతో తడిసిపోయేవి. భజన ముగియగానే ఆమె రెండు చేతులతో మొహం దాచుకొని వెక్కివెక్కి యేడ్చేది. భజన గానీ, అఖండ సంకీర్తన గానీ అయిపోయిన తర్వాత కూడా ఆమె అలాగే కూర్చుని వుండేది. కన్నీరు కారుస్తూ గద్గద కంఠంతో ఆమె యేమేమో ప్రార్థన చేసుకుంటూ వుండేది. ఆమె అలా ప్రార్థిస్తూనే వుండేది. ఆమె ఆ ప్రార్థనలో తన స్వంత విషయాలు ఏమేమో చెప్పుకుంటూ వుండేది. ఆ విషయాలు ఏమిటో యింతవరకూ ఎవరికీ వినపడలేదు. భగవంతుని చరణ సన్నిధిలో ఆమె తన సర్వస్వం అర్పించేది. అందరూ వెళ్ళిపోయినా ఆమెకు తెలిసేది కాదు. తేజస్వరూపిణి, ప్రభావతి - యిద్దరిలో ఎవరో ఒకరు వచ్చి ఆమెను లేపేవాళ్ళు. అప్పటికి గాని ఆమె మొహం తుడుచుకుని లేచేది కాదు. ఆ సమయంలో ఆమె మొహం ఎర్రగా కాషాయ రంగులో వుండటం ఎవరయినా చూచిన వాళ్ళు చూచినట్టే నిలబడి పోతారు.

వేదాంత చర్చలు, ఉపన్యాసాలు జరిగే సమయంలో కూడా ఆమె కళ్ళల్లో నీళ్ళు వచ్చేవి. ఆ కన్నీటితో ఆమెలో చైతన్యం వచ్చేది. అది అప్పుడప్పుడూ కొంచెం శృతి మించుతుందని అంటుంది ప్రభావతి. అది కేవలం అభినయమని కూడా ఆమె అభిప్రాయం. కన్నీటితో తడిసిన మొహం కప్పుకొని ప్రార్థించేప్పుడు ఆమెను చూస్తే ప్రభావతీదేవికి చాలాసార్లు

సిగ్గువేసేది. అందరితోపాటు అందరిలా ఉండకుండా లేనిపోని నటన చేస్తూ వుంటే సిగ్గువేస్తుంది మరి. ఎత్తు పళ్ళతో కాటిక నలుపుగా నిగనిగలాడే తేజస్వరూపిణి మాత్రం నిత్యానందమయీ దేవితో సానుభూతిగా వుండేది. ఆ కన్నీటిని చూస్తూ పెదవులు కదిలిస్తూ పళ్ళ మధ్య నుంచి ఏవో పాటలు మాటలు పలికే సమయంలో తేజస్వరూపిణి మనస్సు స్తోత్రం, భజన, వేదాంతం మీద వుండేది కాదు. నిత్యానందమయిని గురించే ఆమె ఆలోచిస్తూ వుండేది. ఆమెను చూస్తూ కూర్చుని వుండేది. ఆమెకు కూడా కన్నీళ్ళు వచ్చేవి. బహుశా అవి సానుభూతి కన్నీళ్ళయి వుంటాయి.

ఈ ప్రకారం 'ఏడ్పేతల్లి'కి తోడుగా వుండేది తేజస్వరూపిణి. జ్యోతిర్మయీ మాత కూడా నిత్యానందమయిని కనిపెడుతూ వుండేది. కాని ఆమె యెప్పుడూ దయార్ద్ర భావంతో ఆమె వైపు చూడలేదు.

నిత్యానందమయి సౌందర్యవతి. యౌవనంలో బహుశా ఆమె యింకా అందంగా వుండేది. ఆమెకు తగిన భర్త కూడా లభించాడు. ఆనందంగా జీవితం గడిపేందుకు అన్ని రకాల సదుపాయాలూ వున్నాయి. జీవితంలోని సారస్యాన్ని చవి చూడటం ఆరంభించగానే విధి నిషేధించింది. భర్త సర్వస్వం వదిలి సన్న్యాసం తీసుకున్నాడు.

ఈ సంగతి జనానికి కొంచెం కొంచెం తెలుసు. జ్యోతిర్మయీ దేవికి, ప్రభావతికి దానిని గురించి చాలా బాగా తెలుసు. వాళ్ళేమీ అడగలేదు. ఆమె భర్త అలా సన్యసించేందుకు నిత్యానందమయి అపరాధమే కారణమని వాళ్ళకు అనుమానం. అందుకనే వాళ్ళేమీ అడగలేదు. ఆ నల్లని నీడ అలాగే వుండటం మంచిదని వాళ్ళనుకున్నారు. అందువల్లనే ప్రభావతీ దేవికి ఆమె మీద అట్టే సానుభూతి లేదని అందరికీ అనుమానం.

పాపం తేజస్వరూపిణీ దేవి సంగతి వేరు. ఆమెను ఎన్నడూ ఎవ్వరూ ప్రేమించ లేదు - ఆమె ప్రేమించేందుకు సిద్ధంగా వున్నాసరే. ఒక్క మగవాడు కూడా ఆమెవైపు తిరిగి చూడలేదు. లోబరచుకోలేని లోచనాలు, చిరునవ్వుకు నోచుకోని పెదిమలు ఒకప్పుడు చాలా తిప్పలుపడి వుంటాయి. ఏమయినా, ప్రభావతీ దేవికి ఆమె మీద కూడా అసహ్యామే. ఈశ్వర సృష్టిలోని గొప్పతనం ఆకార సౌష్ఠవం, లేదా చైతన్యం అయివుండాలి. అదే ప్రపంచ ధర్మం.

తేజస్వరూపిణీ, నిత్యానందమయి మొదటి నుంచీ అదేలా వుండేవాళ్ళు. దానికి ప్రత్యేకమైన కారణమేమీ లేదు. జీవిత రహస్యాలను వాళ్ళు ఒకరితో ఒకరు చెప్పుకున్నారు. ఇద్దరికీ చెప్పవలసిన విషయాలు చాలా వున్నాయి. ఒకరికి ఒకరు నమ్మకంగా, చెప్పుకోతగ్గ విషయాలు చెప్పుకున్నారు. ఒకరి విషయం ఒకరు తెలుసుకున్నారు. తేజస్వరూపిణి ప్రేమకు నోచుకోలేదన్న విషయం నిత్యానందమయి అర్థం చేసుకుంది. ఆమె స్త్రీత్వం ఫలించలేదు. నిత్యానందమయి నిర్దోషి అనే విషయం తేజస్వరూపిణికి బాగా తెలుసు. భర్త

సన్న్యాసం తీసుకునేందుకు భార్య కారణం కాదనీ, భార్యమీద విరక్తి కూడా కారణం కాదనీ ఆమెకు తెలుసు. కాని మిగిలిన వాళ్ళు ఆ విషయం నమ్మరు. ఆయన సన్యాసం తీసుకున్న కారణాన్ని గురించి అనేకులు అనేక రకాలుగా చెప్పుకుంటారు.

నిత్యానందమయి ఈ విధంగా ధ్యానంలో లీనమై యెందుకు ప్రార్ధన చేస్తుందో తేజస్వరూపిణికి తెలుసు. వచ్చే జన్మలో ఇలాంటి అనుభవం కలగకూడదని ఆమె ప్రార్ధిస్తూ వుంటుంది. తేజస్వరూపిణి యేమని ప్రార్థిస్తుందో నిత్యానందమయికి తెలుసు. మరుసటి జన్మలో ఇలాంటి అనుభవం వద్దని ఆమె ప్రార్ధన.

ఒకరోజు రాత్రి గదిలో చీకటిని చీల్చుకుని తేజస్వరూపిణి చెవుల్లో ఒక ప్రశ్న ప్రవేశించింది. అది నిత్యానందమయి ఆత్మ నుంచి వెలువడింది: "భార్యాభర్తలు సన్న్యాసం తీసుకుని ఒకచోట కలిసి వుంటే తప్పేమిటి?"

వెంటనే దానికి సమాధానంగా ఒక వాక్యం వెలువడింది: "సన్న్యాసం తీసుకున్న తర్వాత కూడా భర్త మీద అనురాగంతో భర్తకు పరిచర్య చేస్తూ కామవాసనకు లొంగకుండా భార్య మెలగవచ్చు."

ఘంటానాదంలాగా ఆ ప్రశ్న తేజస్వరూపిణి అంతఃకరణలో సంచలనం కలగజేసింది. ఆమె వెంటనే సమాధానం చెప్పలేకపోయింది. నిత్యానందమయి సమాధానం కోసం ఎదురు చూస్తున్నది. తేజస్వరూపిణికి ఆమెకు తెలియకుండానే దానికి ఒక సమాధానం స్ఫురించింది. "కావచ్చు. రామకృష్ణ పరమహంసతో శారదామణిదేవి మెలగ లేదా?"

నిత్యానందమయి ఆత్మలో నూతన చైతన్యం ఉదయించింది. ఇది సాధ్యం: "నేనందుకోసం ప్రయత్నిస్తాను. నేను సన్న్యాసం ఎన్నటికీ వదలను" అన్నదామె.

ఆ తర్వాత తేజస్వరూపిణిలో కూడా ఆశలు అంకురించాయి. ఒక సన్న్యాసి సన్న్యాసినిని పెండ్లి చేసుకో వచ్చునా? ఈ కోరికలు ప్రశ్నలుగా రూపొందాయి. కాని వాటికి సమాధానం మరెవ్వరో యివ్వవలసిన అవసరం లేక పోయింది. ఆమె తనంతట తానే వాటికి సమాధానం చెప్పుకుంది: "చేసుకునేందుకు వీల్లేదు."

సన్న్యాస ధర్మం వేరు. వివాహ ధర్మం వేరు. సన్న్యాస ధర్మంలో వివాహానికి తావులేదు. కాని వైవాహిక జీవితంలో సన్న్యాసం నిర్వహించవచ్చు. అందుకనే తేజస్వరూపిణి వచ్చే జన్మ కోసం ప్రార్ధిస్తూ వుంది. నిత్యానందమయి చాలా రోజులు ఈ జన్మకోసం ప్రార్థించింది. ఆ తర్వాత వచ్చే జన్మకోసం ప్రార్ధించ సాగింది.

అది చాలా పాత కధ.

ప్రభుత్వోద్యోగంలో సహాయ కార్యదర్శి పదవి దాకా ఎదిగిన ప్రభావతీ దేవి సామాన్య స్త్రీ కాదు. ఆమె మంచి తెలివి తేటలు గలది. తాను అధిష్ఠించిన పదవిని మర్యాదగా నిర్వహించి ఎలా పై పదవిని పొందాలో ఆమెకు తెలుసు. గంభీరంగా నేర్పుతో మాట్లాడుతుంది. ఆమెలో అధికారం చలాయించి అదుపులో పెట్టుకునే శక్తి వుంది. ఆమె స్థితికి, పదవికి తగిన ఆడకూతురు ఉంటే ఆమెతో చెప్పుకునేది - తానెందుకు ప్రార్థిస్తున్నదో. ఈ రోజు ఆ విషయం ఎవరికీ తెలియదు.

మాతా జ్యోతిర్మయీ దేవి అక్కడే వున్నా ఉద్యోగస్థాయిలో ఆమె ఒక మెట్టు తక్కువ ఆమె అండర్ గ్రాడ్యుయేటు. ప్రభావతీదేవి బి.యే. ఆమెప్రభావతి కింద పనిచెయ్యలేదు, ఒకవేళ అలా జరిగి వుంటే జ్యోతిర్మయి, ప్రభావతి చెప్పు చేతల్లో పనిచేసి వుండేది. ఉద్యోగరీత్యానే కాకుండా ఇతరత్రా కూడా ఆ స్థాయీ భేదం వుంది.

వెనకటి తంకమ్మను గురించి అందరికీ తెలుసు. అన్నిస్థాయిల ఉద్యోగస్థులలోనూ అది చర్చనీయాంశంగా వుండేది. ఈనాటికి కూడా చాలా మంది ఆ విషయాలు చెప్పుకుంటూ వుంటారు. ప్రభావతీ దేవి ప్రతిరోజూ ప్రతిక్షణం ఆ విషయం గుర్తు చేసుకుంటుంది. దానికి కారణం లేకపోలేదు. ఆశ్రమానికి పెద్ద జ్యోతిర్మయీ దేవి. అన్ని విషయాలూ నిర్ణయించే అధికారం ఆమెకేవుంది. ఇతరులు కేవలం సూచనలు చేస్తారు. నిశ్చయించేది జ్యోతిర్మయీ దేవి. ఆహారం దగ్గర నుంచీ అన్ని విషయాలూ ఆమె యిష్టం. ఆమె సర్వాధికారిణి. చిన్నస్వామి మాట ప్రకారం స్వామి తిరువడికళ్ అలా నిర్ణయం చేశారు. బహుశా ఆ భవనం ఆ స్థలం ఆమెవల్ల లభించటం అందుకు కారణం కావచ్చు. అయినప్పటికీ ప్రభావతికి చాలాసార్లు తన అధికారం కూడా నిలబెట్టుకోవాలని అనిపించింది. ఆమెకు కూడా కొంత అధికార బలం వుంది. స్వయం కృషితో సంపాదించిన పదివేలరూపాయలు ఆమె దానం చేసింది. ఆ ధనం మరో విధంగా వచ్చింది కాదు. ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగా కానీ అందులో ఒక పైసకూడా మరెవ్వరూ ఇచ్చింది కాదు. అందువల్ల ప్రభావతీ దేవికి కూడా అనేక పర్యాయాలు తనకు కూడా అధికారం వుందనిపిస్తుంది. కాని ఆశ్రమం పేరు చెడకూడదని ఆమె చాలావరకు తనను తాను అదుపులో పెట్టుకుంటూంది. అప్పుడప్పుడూ అక్కడి పరిస్థితి చూచి ఆమె బాధ పడుతూంటుంది.

ఆశ్రమ మాత ఎప్పుడూ ఆ పదవిలో అలాగే వుంటుందని ప్రభావతీదేవికి నమ్మకం లేదు. పాత చరిత్రను బట్టి అలా వూహించిందని చెప్పలేము. అసలామె అలాంటిది. సన్న్యాసం తీసుకున్న తర్వాత కూడా ఆమె ప్రవర్తన కాషాయ గుడ్డలకు అనుగుణమయింది కాదు. అంతే కాదు. ఆమె తన స్థితి తాను మరిచిపోయి తీరుతుంది.

అందుకని ఆమె జ్యోతిర్మయిని ఒక కంట కనిపెడుతూ వుంటుంది. అందుకు కారణం లేక పోలేదు. ఆమెకు ప్రతిరోజూ అనుమానం వేస్తూ వుంటుంది. ఈనాటికి కూడా ఆ స్త్రీలో యౌవనపు పొంగు తగ్గలేదు. ఆశ్రమమాత ధరించే కాషాయ బట్టలు పట్టువి. పట్టు గుడ్డలు కట్టుకుంటే కట్టుకోవచ్చు. కాని యెందుకూ అని? పౌడరు వూసుకోదు. బొట్టు పెట్టుకోదు. ఇవన్నీ బాగానే ఉన్నాయి. ఉదయం స్నానం చేసిన తర్వాత అందరిలాగా విభూతి పెట్టుకుంటుంది. అంతా యింతా కాదు, చేతికి వచ్చినంత విభూతి తీసుకొని పెట్టుకుంటుంది. ఆశ్రమమాతకు ఈ విధంగా విభూతి ధారణచేసేందుకు అర్ధగంట పడుతుంది. ఆ విభూతి కూడా ప్రత్యేకంగా తయారు చేయబడింది. నిలువుటద్దం ఎదురుగా నిలబడి అలంకరించు కుంటుంది. ఇంతసేపు ఏం చేస్తుందని ప్రభావతీ దేవి పళ్ళు కొరుకుతూ తనను తాను ప్రశ్నించుకుంటుంది. అలా అనుకోటంలో ఆశ్చర్యం లేదు.

ఉదయం తడిసిన జుట్టు చివరలు ముడివేసుకుని వీపు మీద జుట్టు వేలాడుతూ వుంటే పట్టుబట్ట కట్టుకొని విభూతి బొట్టు పెట్టుకొని ఆశ్రమమాత అలా నిలబడివుంటే ఆమెలో ప్రత్యేకమైన తేజస్సు కొట్టవచ్చినట్టు కనిపిస్తూ వుంటుంది. గుమ్మంలో ఆమె అలా ఎందుకు నిలబడ్డట్టు? వచ్చే పోయేవాళ్ళను ఆకర్షించేందుకా?

తప్పదియ్యా! ఏ ఆడకూతురుకయినా ఇంత జుట్టు వుంటుందా? జుట్టు పెంచుకునేందుకు ఆశ్రమ మాత రహస్యంగా ఏదో మందువాడుతుందని ప్రభావతీదేవి నమ్మకం. లేకుంటే జుట్టు ఇంత ఎక్కువగా పెరుగుతుందా! ఆమెజుట్టు చిక్కు తీసుకునేందుకు ఒక గంట పడుతుంది కాని చిక్కు తీసుకునేందుకు సన్న్యాసిని యింత సమయం వ్యర్థం చేయటం సమంజసమేనా? సన్న్యాసినికి జుట్టు అంత ముఖ్యమా? దాని మీద ఇంత శ్రద్ధ వహించటం న్యాయమా?

జ్యోతిర్మయీ మాత కావాలని అలా ముస్తాబవుతుందని అనిపించదు. జడవేసుకోవటంలో ఆమె కొంత అలక్ష్య భావాన్ని కనబరుస్తుంది. కాని ఆ అలక్ష్యమే ఆమెకు అలంకారం. తలకట్టు నుంచి బయటపడ్డ రెండు మూడు ముంగురులు ఎంతో ముచ్చటగా వుంటాయి. ఉదయం ఆమె ముఖం విరిసిన పువ్వులా విప్పారి వుంటుంది. అందులో ఒక నవ్యత్వం, దివ్యత్వం తొంగిచూస్తూ వుంటుంది. ఉదయాహ్నికం అయిన తర్వాత ఆమె బయటికి వచ్చినప్పుడు ఆమె ముఖంలో అదేరకమైన చైతన్యం కనిపిస్తుంది. ఆమె కులాంగన. మధ్యాహ్నం జ్యోతిర్మయి ఒక ప్రౌఢాంగన వలె కనిపిస్తుంది. సాయంత్రం భజన తర్వాత ఆమె ముఖం ఎంతో ఆకర్షణీయంగా కనిపిస్తుంది. భక్తబృందంలో పురుషులందరూ ఆమెను ఆసక్తితో చూస్తూ కూర్చుంటారు.

ఆ సమయంలో ప్రభావతీదేవి పురుషుల హావభావాలను జాగ్రత్తగా గమనిస్తూ వుంటుంది. వాళ్ళు మాతాజీని ఎలాంటి దృష్టితో చూస్తున్నారో గమనించటమే ఆమె పని.

ఆశ్రమంలో మాతాజీ అలా వుండకూడదని ప్రభావతి అభిప్రాయం. అది తప్పు. ఆశ్రమమాత తన అందచందాలు చూపించి అందరినీ మురిపిస్తూ వుంది. అందుకోసం ఆమె కావాలని ప్రయత్నిస్తూ వుంది. అంతకంటె ముఖ్యమైన మరో విషయం ప్రభావతీ దేవికి తెలుసు. ఆశ్రమంలో ఏర్పాటయ్యే ప్రతి కార్యక్రమం మగవాళ్ళను పోగుచేసేందుకే జరుగుతూంది. ఇవాళ కాకపోతే రేపయినా ఆశ్రమ మాత తప్పటడుగు వేస్తుంది. ప్రభావతీదేవి, ఆశ్రమం దొడ్డి వాకిలిపైన రాత్రిపూట నిఘాపెట్టి వుంది. అలా ఆమె చాలా రోజుల నుంచీ చూస్తూ వుంది. కానీ విసుగు పుట్టలేదు. ఏదో ఒక రోజు ఆ వాకిలి తెరుచుకుంటుందనీ, ఆమె పట్టుబడుతుందనీ ప్రభావతికి గట్టి నమ్మకం. ఆశ్రమ మాత నిజస్వరూపం ప్రపంచానికి చూపించేందుకు ప్రభావతీ దేవి ఆ రోజు కోసం ఎదురు చూస్తూ వుంది. ఆ భవనం నిర్మించటంలో ముఖ్యమైన వుద్దేశం దొడ్డి వాకిట్లోనే వుంది. ఆ భవనంలో ప్రవేశించేందుకు ముఖ్య ద్వారం కూడా అదే. అది యేదో ఒకనాడు తెరుచుకుంటుంది.

భజనలూ, ప్రార్థనలూ, పురాణాలూ, పారాయణాలూ జరిగేప్పుడు ఆశ్రమ మాత మనస్సు వాటిలో లయం కావటం లేదని మాత్రం స్పష్టంగా తెలుస్తుంది. ఆమె వూరికే చూస్తూ వుంటుంది. వాటిలో తన్మయత్వం పొందదు. తీరిక సమయంలో పుస్తకం చేతికి తీసుకొని ఏదో ఆలోచిస్తూ కూర్చుంటుంది. ఆమె అలోచనలు ఎక్కడెక్కడ ఎలా సంచరిస్తుంటాయో ఎవరికి తెలుసు? నిజానికి ఆమె ఆశ్రమ మాత కాకపోతే, ఆమెను అజమాయిషీ చేసేవాళ్ళు ఎవరయినా వుంటే "ఏమిటలా ఆలోచిస్తున్నావ్?" అని ఎవరయినా తప్పకుండా అడిగివుండేవాళ్ళు.

ఆమెను అడిగేవాళ్ళు ఎవరూ లేరు. అందువల్ల ఎవరూ అడగలేదు.

ఇలావుండగా ఒకరోజు ఆశ్రమం వాకిలి దగ్గరకి వచ్చి యెవరో బిచ్చగత్తె బిచ్చమడిగింది. మాతాజీ అక్కడేవుంది. ఆ బిచ్చగత్తెకు ఎక్కువ వయస్సు లేదు. చూడగానే ఆమెలో ఏదో ప్రత్యేకత కనిపిస్తుంది. ఆ ప్రత్యేకత మాతాజీ కనిపెట్టింది. ఆశ్రమ మాత ఆమెను లోపలికి పిలిచింది.

ఆమె పేరు సావిత్రి. ఆశ్రమమాత ఆమెను స్నానం చెయ్యమన్నది. కట్టుకునేందుకు మంచి బట్టలు యిచ్చింది. కడుపు నిండా తిండి పెట్టింది. అంతటితో ఆమె మారిపోయింది. బిచ్చగత్తె యిప్పుడు బిచ్చగత్తెగా లేదు. ఇంతలో ఎంతో మార్పు వచ్చింది. ఆమెను అందగత్తె అనవచ్చు. జ్యోతిర్మయీ మాత ఆమె వృత్తాంతం అడిగింది.

సావిత్రి యేదో కథ చెప్పింది. ఆ కథ నిజంకాదని అందరికీ అనిపించింది. ఆమె చాలా విషయాలు దాచేసింది. చాలా సంగతులు వదిలేసింది. కొన్ని విషయాలను వక్రమార్గంలో తప్పుదారి పట్టించింది. మరికొన్ని విషయాలు అనుభవానికి విరుద్ధంగా వున్నాయి. జ్యోతిర్మయీ దేవి ఆమెతో నిర్మోహమాటంగా అన్నది: "నీవు అబద్ధం చెప్తున్నావు. ఇలా జరిగివుండదు. భర్త అయినవాడు అలా వదిలిపెట్టి వెళ్ళడు."

సావిత్రి ఒట్టు పెట్టుకుని, చెప్పిన విషయాలను నచ్చ చెప్పేందుకు ప్రయత్నించింది. జ్యోతిర్మయీ దేవి అవన్నీ నమ్మేందుకు సిద్ధంగా లేదు. సావిత్రి జీవితంలోని రహస్యమంతా తెలుసుకున్న దానిలా మాతాజీ ఒక ప్రశ్న వేసింది: "నీవు నిజం చెప్తావా? నిజం చెప్తే నీకు మేలు కలుగుతుంది, తెలిసిందా?"

"నేను చెప్తున్నది నిజమే మాతాజీ!"

"కాదు" అన్నట్టుగా మాతాజీ తలతిప్పింది. ఆ తర్వాత నిజం కనిపెట్టినట్టుగా చిరునవ్వుతో ఆమె అన్నది : "నీ భర్త అమాయకుడు. ఒట్టి అమాయకుడు. అతనికి నీ మీద చాలా ప్రేమ. యుక్తితో, మోసంతో నీవు అతన్ని వదిలేశావు. అంతే కదూ?"

సావిత్రి తెల్లబోయింది. నిజం బయటపడ్డట్టు కంగారు పడింది. ఆమె పెదిమలు మెల్లగా వణుకుతున్నాయి.

"చెప్పు, నిజం చెప్పు. అదేమంచిది." అన్నది మాతాజీ.

సావిత్రి యేమీ చెప్పలేక పోయింది. అన్నీ తెలిసినట్టు మాతాజీ వ్యాఖ్యానం సాగించింది: "ఆ యుక్తి నిన్ను మోసగించింది. నీవు దిక్కులేని దానివయినావు. ఇలా వీధుల పాలయినావు. అంతే కదూ?"

సావిత్రి ముఖం కప్పుకొని యేడుస్తున్నది. ఆమె చేసిన తప్పులన్నీ తొలిసారి ఒక ఆడకూతురు నిర్లిప్తంగా చెబుతూ వుంది. మాత జ్యోతిర్మయీ దేవి ఓదారుస్తూ అన్నది: "ఏడవకు. ఇందులో ఏడ్చేందుకు ఏముంది? ఇది నిజమే గదా?"

"అవును మాతాజీ అవును. ఆయన పాపం నన్ను బంగారంలా ఏలుకునేవాడు. నాకు ఆయన మీద అసహ్యం వేసేది. ఆయన్ని నేను ఎదిరించేదాన్ని. ఒకసారి ఆయన మీద ఉమ్మికూడా వేశాను. పాపం ఆయన అన్నిటికీ ఓర్చుకున్నాడు. ఆ తర్వాత ఆయన్ని వెతకబోతే అప్పటికే ఆయన చనిపోయాడు. మాతాజీ, నేను చాలా తప్పు చేశాను." అని సావిత్రి ఒప్పుకున్నది.

మాతా జ్యోతిర్మయీ దేవి కుతూహలంతో అడిగింది: "నిన్ను మురిపించి లేవదీసుకు పోయిన వాడో?"

కొంచెంసేపు ఆగి సావిత్రి సమాధానం చెప్పింది:

"అతను మొదట నన్ను చాలా ప్రేమించేవాడు. ఆ తర్వాత నన్ను కొట్టటం మొదలు పెట్టాడు. నేను అన్నింటికి ఓర్చుకున్నాను. మాతాజీ! నేను నిజం చెప్తున్నాను. అతన్ని నేను ప్రేమించాను. కాని అతను నన్ను వదిలిపెట్టి వెళ్ళాడు. ఇప్పుడతను ఎక్కడున్నాడో నాకు తెలియదు."

ఇదంతా తన దురదృష్టం అన్నట్లుగా ఆమె చెప్పసాగింది: "ఇదంతా నేను అనుభవించవలసి వుంది. ఆ అమాయకుణ్ణి నేను బాధపెట్టాను. అందుకు ప్రతిఫలంగా ఇదంతా నేననుభవిస్తున్నాను. నేను పాపం చేశాను."

మాత జ్యోతిర్మయీ దేవికి సానుభూతి కంటె కుతూహలం ఎక్కువగా వుంది. ఆ కథ వినేందుకు ఆమె ఉవ్విళ్ళూరుతూ వుంది. ఆ విషయంలో ఎన్నో ప్రశ్నలు గుచ్చి గుచ్చి అడిగింది. సావిత్రి స్పష్టంగా చెప్పినా ఆమెకు తృప్తిగా లేదు.

"నీ భర్తకు భార్య కావాలని లేదా?"

"కావాలనే వుంది. కానీ అది కారణం కాదు మాతాజీ! నా వయస్సు అలాంటిది." అన్నది సావిత్రి.

"నీవు భవిష్యత్తును గురించి యేమీ ఆలోచించలేదా?"

"లేదు. అప్పుడేమీ ఆలోచించలేదు. యౌవనం పొంగులో వున్న సమయం అది."

"ఆ రెండో వ్యక్తి?"

"నేనతన్ని ప్రేమించాను మాతాజీ!"

"నీవతన్ని ఎందుకు ప్రేమించావ్?"

"ప్రేమించాను" అని మాత్రం ఆమె చెప్పగలిగింది. మాతాజీ ప్రశ్నలు కూడా అలాగే వున్నాయి. ఆమె వేసిన ప్రశ్నలకు బాధ కలగలేదు. సంకోచం కూడా అనిపించలేదు. కాని ఆ వృత్తాంతమంతా ఈమెకు ఎలా తెలిసిపోయిందని ఆమెకు ఆశ్చర్యం వేసింది.

ఆ స్త్రీ జీవిత చరిత్ర సంగ్రహంగా చెప్పినా మాతాజీకి స్పష్టంగా బోధపడటం సహజం. సన్న్యాసిని అయినా గుచ్చిగుచ్చి ప్రశ్నలడగటానికి కూడా అదే కారణం. కొన్ని సంవత్సరాల క్రితం తిరువనంతపురంలో తంకమ్మ అనే ఆఫీసు క్లర్కు ఇలాగే తప్పటడుగు వేసింది. ఆమె పరిస్థితి వేరు. అదే భేదం. ఆమె సందులపాలవలేదు. బిచ్చమెత్తుకునే అవసరం ఆమెకు రాలేదు. సందుల్లో ప్రవేశించే బదులు ఆమె ఆశ్రమంలో ప్రవేశించింది. ఒక ఆశ్రమాన్ని ఆమె ఏర్పాటు చేయగలిగింది. దానికి మాత అయింది. ఎదుట నిలబడ్డ ఆ స్త్రీకి కలిగిన అనుభవమే ఆశ్రమ మాతకు కూడా కలిగింది. ఇద్దరి అంతరంగిక అనుభవాల్లో భేదమేమీ లేదు.

కొంచెంసేపు మాత జ్యోతిర్మయీదేవి ఆ తులనాత్మక పరిశీలనలో మునిగిపోయి కూర్చుంది. సావిత్రి కూడా ఆలోచనలో మునిగి వుంది. అబద్ధం

చెప్పినందుకు ఆమె దిగులు పడుతూవుంది. అలా యిద్దరూ వాళ్ళవాళ్ళ ఆలోచనల్లో మునిగిపోయి మౌనంగా కూర్చున్నారు. సావిత్రి మళ్ళీ ఆరంభించింది. వినయపూర్వకంగా ఆమె విన్నవించుకుంది:

"నేను అబద్ధం చెప్పాను, నన్ను క్షమించు, మాతాజీ. నేను చాలా పాపం చేశాను. తప్పు చేశాను. నిజంచెప్తే నన్ను తన్ని బయటికి గెంటేస్తారని నేను భయపడ్డాను. నిజం చెప్తే నాకు మంచినీళ్ళు కూడా దొరకవు, అలాంటి పాపిష్ఠి దాన్ని నేను."

ఆ మాటలు ఆశ్రమ మాతను స్తంభింపజేశాయి. తంకమ్మ యిలా మారకపోయినట్టయితే ఆమెకు మాత్రం మంచి నీళ్ళు పుట్టేవా అని అనిపించింది. ఆ తంకమ్మను మాత్రం ఎవరయినా కనికరించేవాళ్ళా? ఈనాడు ఆమెను కాపాడుతున్న దేమిటి? ఈ పరిస్థితే కదా?"

జ్యోతిర్మయిదేవికి జీవితంలో తొలిసారి తన యథార్థ జీవన చిత్రం గోచరించింది. తనవాళ్ళెవరు? అనే ఆలోచన ఆమె మనస్సులో ఉదయించింది. ఆమెకు తెలిసిన వాళ్ళ కందరికీ ఆమె కథ తెలుసు. ఎవరూ ఆమెను కనికరించరు. బహుశా ఎదుట నిలబడ్డ ఆ దురదృష్టవంతురాలు ఆమె వృత్తాంతం తెలిస్తే ఆమెకు సానుభూతి చెప్పవచ్చు.

"నీవు ఇక్కడ నా దగ్గర ఉంటావా?" అన్నది మాతాజీ.

సావిత్రికి ఆలోచించవలసిందేముంది? "అలాగే. వుంటాను." అన్నది.

మాతాజీ ఏమయినా అడగవచ్చు, లేదా కొన్ని ముఖ్యమైన విషయాలు చెప్పవచ్చునని సావిత్రి ఎదురు చూస్తూ వుంది. మర్యాదగా వుండాలి, పాతకథ మళ్ళీ పునరావృతం కాకూడదు, ఇది ఆశ్రమమనే విషయం గుర్తుంచుకోవాలి అని ఏవో కొన్ని సూచనలు చేయవచ్చు. కాని అలా ఏమీ జరగలేదు. అయినా ఆమె తనంతట తానే అన్నది: "నేను మర్యాదగా ఉంటాను."

"మంచిది. అలాగే వుండు." అని ఆమోదించింది మాతాజీ.

మాతాజీ ఆ రోజంతా దిగులు దిగులుగా అనారోగ్యంగా వుంది. ఈ ప్రపంచంలో ఇలాంటి తంకమ్మలూ, సావిత్రులూ ఎంతమంది వున్నారో? వాళ్ళంతా బిచ్చమెత్తుకుంటూ తిరుగుతున్నారు. మరో రకంగా ఆలోచిస్తే - బిచ్చమెత్తుకుంటూ రోగాలతో బాధపడవలసింది - తంకమ్మ ఈ యిల్లే లేకపోతే? ఇలాంటి దిక్కులేని ఆడవాళ్ళకు శరణాలయంగా మారితే ఇది ఎలా వుంటుందని ఆలోచించింది ఆశ్రమమాత.

ఒక బిచ్చగత్తెకు అక్కడ ఆశ్రయమివ్వటం ప్రభావతీదేవికి ఇష్టం కాలేదు. నిత్యానందమయికి, తేజస్వరూపిణికి ఆ విషయంలో ప్రత్యేకమైన అభిప్రాయమేమీ లేదు. ఇది ఆశ్రమమాత చేసిన నిర్ణయం. అదీకాక ఒక పేదరాలు ఇక్కడ బతికితే నష్టమేమిటి?

రెండుమూడు రోజుల తర్వాత మాతాజీ బయట నుంచి వచ్చేప్పుడు మరో బిచ్చగత్తెను వెంటబెట్టుకొని వచ్చింది. ఆమె వృత్తాంతం కూడా సావిత్రి వృత్తాంతం లాగానే కొంచెం భిన్నంగా వుండచ్చు. "మళ్ళీ మరోదాన్ని తెచ్చింది" అన్నది ప్రభావతీ దేవి మిగిలిన సన్న్యాసినులతో. "ఇలా ఒక్కొక్కరినే పోగు చేసేందుకు ఎవరినన్నా అడగటం, పెట్టటం అక్కర్లేదా?"

మిగిలిన సన్న్యాసినులేమీ మాట్లాడలేదు. ఒక్క ప్రభావతీదేవి మాత్రమే వాగుతూ వుంది. వాళ్ళేమీ అడగనూ లేదు, ఎదురు చెప్పనూ లేదు.

చాలా రోజులు గడవక ముందే ఏడుగురు అనాథస్త్రీలు ఆశ్రమంలో చేరారు. ప్రభావతీదేవి పట్టలేని కోపంతో తేజస్వరూపిణితో అన్నది: "పిట్టకు తెలుసు పిట్టకూతలో పరమార్థ మేమిటో?"

పరిస్థితులు ఇలాగే వుంటే యీ ఆశ్రమం పనికిమాలిన పడుచువాళ్ళతో నిండిపోతుంది. ఆశ్రమం ఇక ఆశ్రమం అనిపించుకోదు. ఆశ్రమంలోని పవిత్రత అడుగంటి పోతుంది. 'చదువుకొద్దీ సాధన' అన్నట్టు ఈ ఆడంగులు తమ పాత ధోరణిని ఇక్కడకూడా ప్రవేశపెడతారు.

సావిత్రి నూతన జీవితం ఆరంభించింది. ఆమె తిరిగి తన అందచందాలను సంతరించుకుంది. ఆమెలో మంచి తేజస్సు వచ్చింది. భక్త బృందంలోని మగవాళ్ళు అందరి కంటె ఎక్కువగా ఆమెను జాగ్రత్తగా గమనిస్తారు. ఆమెను గురించి తెలుసుకోవాలని వాళ్ళు కుతూహల పడతారు. అక్కడి సదుపాయాలను బట్టి ఆమె అలంకరణ కూడా చేసుకుంటూ వుంటుంది.

## ముప్పై ఆరు

ఉన్నట్టుండి ఆశ్రమం ఇలా సమస్యల పాలయింది. ఆశ్రమమాత పట్ల ప్రభావతీ దేవి మనస్సులోవున్న వైరం బయటికి కనిపించసాగింది. ఇప్పటికి చాలామంది బిచ్చగత్తెలు పోగయ్యారు. ఇంకా పోగవుతారు. అందులో సందేహం లేదు. ఇది ఆమె జీవితంలో అకస్మాత్తుగా వచ్చిన మార్పు. ఈ పనులన్నీ ఆమె ఎవరినీ అడక్కుండానే చేస్తున్నది. మిగిలిన వాళ్ళకు కూడా ఇందులో అధికారం వున్నదన్న మాట అలా వుంచి మిగిలిన వాళ్ళు కూడా అక్కడ వున్నారనయినా ఆమె గుర్తించాలి కదా? ఆ మాత్రం మర్యాద కూడా లేకుండా పోయింది. ఆశ్రమంలో ఖర్చు కూడా పెరిగి పోతూవుంది. ఇంత మందికి తిండి యెక్కడ నుంచి వస్తుంది? ఆదాయం ఏముంది? ఆలోచన లేకుండా ఆమె చేసిన యీ పనిని ప్రభావతీ దేవి తీవ్రంగా ఖండించింది.

వాళ్ళిద్దరూ ఎదుటపడి పోట్లాడ లేదు. అంతే. కాని భక్త బృందంలో ఇది చర్చనీయాంశమయింది. అయినా మాతాజీకి ఏమీ పట్టలేదు. ఆమె యెవరితో ఏమీ అనలేదు. కాని ప్రభావతీ దేవి తన వ్యక్తిగత స్వభావంవల్ల చాలామందికి చెప్పదగిన విషయాలు చెప్పేసింది. కొంతమందితో చాడీలు కూడా చెప్పింది. మరికొంత మందితో అధికార పూర్వకంగా వాదించింది.

కొంతమందితో మాట్లాడేప్పుడు మాతాజీ మీద నేరారోపణ చేసింది. ఇలా అడ్డమైన వాళ్ళనందరినీ చేరిస్తే వాళ్ళను తన్ని బయటికి గెంటేస్తానని ప్రభావతీదేవి ఒక సహాయ కార్యదర్శి భార్యతో అన్నది. ఈ వార్త రెండు మూడు రోజుల తర్వాత ఆమె ఆశ్రమమాత చెవిలో వేసింది.

మాత జ్యోతిర్మయీ దేవికి, ధోరణి అతిగా మారిందనిపించింది. ఆమె చిరాకుపడి అడిగింది:

"ఇక్కడి నుంచా? నేను తీసుకొచ్చిన స్త్రీలనా?"

భవానీ అమ్మ (ఆమె పేరది) అన్నది: "ఏమంటున్నారు?". మాతాజీకి కోపం వచ్చింది -

"విను భవానీ అమ్మా! ఇది నా యిల్లని ఆమెతో చెప్పు. నాకు ఇష్టమయిన వాళ్ళను నేను ఇక్కడ ఉంచుకుంటాను." అన్నదామె. ఆమెకు ఇంకా ఏమేమో అనాలని వుంది -

"అధికారం సంగతి అలా వుంచి నేను ఆశ్రమానికి మాతాజీని. ఆ విధంగా కూడా నాకు హక్కు వుంది."

ప్రభావతీ దేవికి ఈ వార్త చాలా తొందరగా అందింది. ఆ మాట విని ఆమె ఇలా అంది: "అధికారం ఉంటే ఇంటిమీద వుంటుంది. ఇప్పుడిది ప్రజాసంస్థ. నేను కూడా ఇక్కడికి ఊరికే రాలేదు. కష్టపడి సంపాదించిన పన్నెండు వేల రూపాయలు నావి యిక్కడ వున్నాయి. లేనిపోని అధికారం ఆమె చూపిస్తే నేనూ చూపిస్తాను".

ఈ సంస్థ మేలు గమనించి తాను చాలా వరకు ఓర్చుకుంటున్నానని ప్రభావతీ దేవి అన్నది.

మాతాజీ చేరదీసిన మహిళలు ఒకచోట చేరి మాట్లాడుకుంటున్నారు. అలా మాటలమధ్య ఎవరో ఒక ఛలోక్తి విసిరారు. అందరూ బిగ్గరగా నవ్వారు. ఎంత ఆపుకున్నా ఆగనంత బిగ్గరగా నవ్వారు. కాని ఏడెనిమిది మంది ఆడవాళ్ళు ఒకేగదిలో వుండి నవ్వారు. ఆ ఆడవాళ్ళు అలా నవ్వినందువల్ల పెద్ద ధ్వని అయింది. పాపం వాళ్ళు అలా నవ్వటం అక్కడ నిషేధం. ప్రభావతీ దేవి మనస్సులో అణగివున్న కోపం బయటికి పొంగింది. కోపంతో మొహం ఎర్ర బారింది. ఎర్ర బారిన ముఖంతో ఆమె పక్క గదిలోకి వెళ్ళి వాళ్ళమీద విరుచుకు పడింది. చెడా బడా తిట్టింది. బెదిరించింది. పాపం వాళ్ళు చిన్నబుచ్చు కున్నారు. మళ్ళీ వీధులపాలు కావాల్సి వస్తుందేమోనని భయపడ్డారు.

"ఇలా యిక్కడ హాయిగా వున్నామని ఒళ్ళు తెలియకుండా ప్రవర్తించకండి. మాతాజీ పెంచిన పిల్లలమనుకొని ఎగిరి పడుతున్నారేమో? ఇక్కడ వున్నది మాతాజీ ఒక్కరే కాదు. ముందే చెప్తున్నాను. మిమ్మల్ని తన్ని బయటికి నెట్టేస్తాను." అన్నది ప్రభావతీ దేవి.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఛలోక్తి విసిరిన ఆవిడకు చాలా బాధకలిగింది. ఆమె సావిత్రి. ఆమెవల్ల అందరికి చెడ్డపేరు వచ్చింది. విచారించి నిర్ణయిస్తే తప్పు ఆమెదే అని తేలుతుంది.

సావిత్రి తప్పు తనదేనని భావించి అన్నది: "ఇక ముందు మేము నవ్వం మాతాజీ! క్షమించండి."

కోపమంతా ఆమె మీద విరగబడింది:

"ఛీ! పాసుముండా! నీవే యీ ఆశ్రమం పేరు చెడగొడుతున్నావు. నీ అలంకారం, కులుకు, సోకు, నవ్వు, కళ్ళు తిప్పటం అంతా గమనిస్తున్నాను. ఇక్కడి నుంచి ఎవరినన్నా లేవదీసుకు పోదామని వుందా నీకు?"

సావిత్రి నివ్వెర పోయింది. ఆమె అలా యెప్పుడూ ఆలోచించ లేదు. అలాంటి స్వభావమే అయినప్పటికీ, అలాంటి అవకాశం ఎప్పుడూ లభించలేదు కదా! ఆమె కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

మాతాజీ ఎక్కడ నుంచి వచ్చిందో తెలియదు. "ఏమిటవుతున్నదిక్కడ?" అని అడిగిందామె.

ప్రభావతీ దేవి కొంచెం కంగారు పడ్డట్టు అనిపించింది. కొంచెం సేపు ఆగి ఆమె అన్నది: "ఇక్కడ వీళ్ళంతా వెకిలిగా పగలబడి నవ్వుతూ గంతులేస్తూ వున్నారు."

"అయితే, వాళ్ళు ఆ మాత్రం నవ్వటానికి వీల్లేదా?" అన్నది మాతాజీ.

ప్రభావతీ దేవి ఆత్మ నిగ్రహం కోసం పడుతున్నపాట్లు కనిపిస్తూనే వున్నాయి.

"నాకిది యిష్టం లేదు."

మాతాజీ నాలుక చివరనే దానికి సమాధానం వుంది:

"ఇవన్నీ మనకు ఇష్టమయి తీరాలి."

"అలా ఎవరు నిశ్చయించారు?"

"నేనే."

"అలా నీ అంతట నీవు నిర్ణయించగలవా?"

దానికి సమాధానం లేకనే లేకుంటే ఆ చర్చ అక్కడ జరగటం ఇష్టం లేకనో మాతాజీ దానికి సమాధానం చెప్పలేదు. "ఎందుకు ఏడుస్తున్నావ్?" అని ఆమె సావిత్రిని అడిగింది.

ప్రభావతీ దేవికి ఇది బొత్తిగా గిట్టలేదు. భూమి కంపించేటట్టు నడుస్తూ ఆమె అక్కడ నుంచి వెళ్ళిపోయింది. ప్రభావతీ దేవి వెళుతూ వుంటే మాతాజీ తదేకదృష్టితో చూచింది. సావిత్రిని ఆమె మళ్ళీ అడిగింది: "ఎందుకు ఏడుస్తున్నావ్?"

ప్రభావతీదేవి అన్న మాటలు సావిత్రి మాతాజీకి చెప్పలేదు. "తప్పు నాదే" అన్నది.

"మీరందరూ నవ్వారు. అంతేగా" అన్నది మాతాజీ సానుభూతి చూపిస్తూ.

"అవును. అంతే".

మాతాజీకి యింకా ఏమో చెప్పాలని వుంది. కాని యేమీ చెప్పలేదు. చెప్తే బహుశా ఆమె యిలా చెప్పి వుంటుంది: "నవ్వండి. బాగా నవ్వండి. తనివి దీరా నవ్వండి. ఆనందంగా వుండండి."

ఆ సమయంలో ఆమె ముఖంలోని విషాద చ్ఛాయలు ఆమె మనస్సులోని చింతా భావాన్ని చెప్పక చెబుతున్నాయి: "నేనలా నవ్వ లేకపోయినా కనీసం మీ ఆనందాన్ని చూస్తాను."

దెబ్బ మీద దెబ్బలాగా మర్నాడు మరో విషయం జరిగింది. ఆశ్రమ మాత మరో బిచ్చగత్తెను వెంట బెట్టుకు వచ్చింది.

ప్రభావతీదేవి ఎంత మాత్రం సహించే స్థితిలో లేదు. ఒక్క విషయం మాత్రం తేల్చుకొని తీరాలి. ఆశ్రమానికి సర్వాధికారి స్వామీజీ. ఆయనతో తన గొడవ చెప్పుకోవాలి. ఆయన వచ్చి నిర్ణయిస్తారు.

నిత్యానందమయి ప్రభావతీదేవితో ఏకీభవించకుండా వెళ్ళిపోయింది. ఆమె ప్రభావతీదేవి వాదాన్ని ఖండించనూ లేదు, బలపరచనూ లేదు. ఆమె పరిస్థితి అది.

"మాతాజీ మార్గంలో తప్పేమీ లేదు. కాని - "అన్నదామె.

ఆమెకు ఒకరి వైపు మొగ్గటం ఇష్టం లేదు. తేజస్వరూపిణి కూడా అదే అభిప్రాయం వ్యక్తపరిచింది. ఆశ్రమ పరిపాలనా విషయంలో ఆమెకు ఏమీ భాగం అక్కర్లేదు. ఆ మహిళలకు భగవత్సేవతో జీవితం గడపటమే అభీష్టం.

భక్త బృందంలో చాలామంది ప్రభావతీ దేవిని సమర్థించారు. అది యెలా జరిగిందే తెలియదు. కొంతమంది ఆశ్రమ మాత పక్షాన నిలబడ్డారు. కానీ వాళ్ళు చాలా తక్కువ మంది. అనాధ వనితా మందిరం ఆశ్రమం యొక్క వుద్దేశాలలో ఒకటి. ఏదో ఒకరోజు అది ఆరంభించి తీరాలి. ఆశ్రమంలో ఈ దిక్కులేని స్త్రీలు వుంటే తప్పేముంది? భక్తులు కలుసుకున్నప్పుడు వాళ్ళు ఈ విషయమే చర్చిస్తూ వుంటారు.

ఎన్ని రోజులో గడవలేదు. నిత్యానందస్వామి విచ్చేస్తున్నారని వార్త వచ్చింది. ఆ రోజు నుంచి భక్త మండలిలో చర్చనీయాంశమిదే. తిరువనంతపురంలో ఇది ముఖ్యమైన సంఘటన. ప్రభావతీదేవికి చాలా ఆనందంగా వుంది. ఆమె పంపించిన నివేదిక ఫలించింది. అంతేకాదు, స్వామీజీ స్వయంగా వస్తున్నారు. స్వామీజీ వస్తే తనకు విజయం లభిస్తుందని ప్రభావతీ దేవి నమ్మకం. అందువల్ల స్వామీజీ స్వయంగా రావాలనే ఆమె కోరింది. దానికి కారణం కూడా వుంది: చిన్న స్వాములవారు వస్తే మాతాజీకి అనుకూలంగా నిర్ణయం జరుగుతుంధని ప్రభావతీ దేవి అభిప్రాయం.

వాళ్ళిద్దరి మధ్య చాలా కాలం నుంచి సన్నిహితమైన సంబంధం వుంది. స్వామీజీ అలాంటి వారు కాదు. ఆయనకు ప్రభావతీదేవి మీద ప్రత్యేకమైన వాత్సల్యం వుంది. కాని ఆశ్రమ మాతకు విచారంగా వుంది. స్వామీజీకి మొదటి నుంచీ ప్రభావతీదేవి అంటే యిష్టమని ఆమెకు తెలుసు. కాని మాతాజీ చిరాకు పడలేదు. ఆమె చాలా గట్టి నిర్ణయం చేసుకుంది. ఆమె కొంతమంది భక్తులతో ఇలా అన్నది: "స్వామీజీ సరియైన నిర్ణయం చెయ్యకుండా ఈ పిల్లలను ఇక్కడ నుంచి వెళ్ళగొడితే నేనేం చెయ్యాలో నాకు తెలుసు." ఆమె స్వామీజీని సవాలు చేస్తోంది. అలాంటి నిర్ణయం చేసుకుని వుంది.

స్వామీజీ రాకకు అన్ని ఏర్పాట్లూ జరుగుతూ వున్నాయి. ఆశ్రమం స్థాపించిన తర్వాత స్వామీజీ రావటం ఇదే మొదటిసారి. తిరువనంతపురంలో స్వామీజీ చెయ్యవలసిన పనులు చాలా వున్నాయి. భక్తులందరికీ ప్రతియింట్లో స్వామీజీకి పాదపూజ చెయ్యాలని వుంది. అయిదువందల మంది పిల్లలకు స్వామీజీ తన పావన కరకమలాలతో అన్నప్రాశన చెయ్యాలి. చాలామంది అధికార్లు కొత్తగా కట్టుకున్న యిండ్లలో స్వామీజీ పాలు పొంగించాలి. కొన్ని కర్మాగారాలకు ప్రారంభోత్సవం చెయ్యాలి. ఇదీ ఆయన కార్యక్రమం. ఈ విధంగా చూస్తే స్వామీజీ సంవత్సరమంతా అక్కడ గడిపినా యీ కార్యక్రమాలకు వ్యవధి చాలదు.

స్వామీజీ తిరువనంతపురం వచ్చిన రోజున ప్రభుత్వ కార్యాలయాల్లో సగం మంది క్యాజువల్ లీవు పెట్టారు. ఎక్కడా సరిగ్గా పని జరగలేదు.

పూజ్య పాదులు స్వామీజీ ఆశ్రమంలో ప్రవేశించే సమయంలో ధూప దీపాదులతో అలంకరించిన పళ్ళేరాలు చేతుల్లో పట్టుకొని సన్న్యాసినులు నిలబడ్డారు. భక్త బృందాన్ని ఆకర్షించే ఒక సంఘటన జరిగింది. ప్రభావతీ దేవి స్వామీజీని చూడగానే వెక్కి వెక్కి యేడ్చింది. ఆశ్రమమాత దృఢసంకల్పంతో ఎర్రబారిన ముఖంతో పెదవులు బిగపట్టి నిర్వికారంగా నిశ్చలంగా నిలబడి వుంది. స్వామీజీ ప్రభావతీదేవి తలనిమిరి మెల్లగా ఏదో అన్నారు. "ఏడవకు తల్లీ!" అని అన్నారని దగ్గరవున్న రెవెన్యూ సెక్రటరీ భార్య చెప్పింది. మాతాజీ వైపు స్వామీజీ చూచిన తీరు కూడా అర్థభరితంగా వుంది. మాతాజీ ఆ చూపుల తీరును ఏ మాత్రం లక్ష్య పెట్టలేదు. భక్త మండలిలో ఆ రోజు అదే చర్చనీయాంశం.

ప్రభావతీ దేవి గెలుస్తుంది. స్వామీజీ అలాగే నిర్ణయం చేస్తారు. మాతాజీని ఆశ్రమ మాత పదవినుంచి తొలిగిస్తే ఏమవుతుంది? ఆ మహిళలను ఆశ్రమం నుంచి బయటికి పంపించమని స్వామీజీ ఆదేశిస్తారా? ఆదేశిస్తే మాతాజీ కూడా వాళ్ళతో పాటు వెళ్ళిపోవటం ఖాయం. మాతాజీ ఏదో గట్టి నిర్ణయం చేసుకుని వుంది. భక్త మండలిలో ఏవేవో పుకార్లు బయలు దేరాయి. మాతాజీ నిర్లక్ష్య భావంతో వుండటం భక్తులకు కుతూహల హేతువయింది.

అయినప్పటికీ పూజ్యపాదులగు స్వామీజీ అందరికీ ఒక నియమావళి ఏర్పాటు చేస్తారని వార్త వ్యాపించింది.

భక్తుల్లో పిల్లలు, పెద్దలు అందరూ ఆ రోజు భజనలో పాల్గొన్నారు. భజన తర్వాత స్వామీజీ ప్రవచనం ఉంటుంది. స్వామీజీ సాన్నిధ్యంలో జరిగే ప్రార్ధనకు ప్రత్యేకమైన ప్రాధాన్యం వుంది. ఇంతమందిని ఆకర్షించిన విషయం కేవలం ఇదే కాదు. ఆశ్రమ విషయాలను గురించి పూజ్యపాదులయిన స్వామీజీ ఏదో సూచన చేస్తారు. అది తెలుసుకొనేందుకు భక్తులంతా ఉవ్విళ్ళూరుతున్నారు.

భజన సమయంలో ఆధ్యాత్మిక చైతన్యం వెల్లివిరిసింది. అక్కడ చేరిన వాళ్ళకు మోక్షానుభూతి కలిగింది. ఆ అపూర్వానుభవం గొప్ప విశేషం.

ఆ తర్వాత స్వామీజీ ప్రవచనం ఆరంభమయింది. భక్త జనులు మౌనంగా కూర్చుని వింటున్నారు. ఉపోద్ఘాతంగా కొన్ని మాటలు చెప్పిన తర్వాత స్వామీజీ అరిషడ్వర్గాలను గురించి ఉపన్యసించారు: కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలకు సామాన్య మానవులేకాక మహర్షులు కూడా లొంగిపోయారు. దానికి ఎన్నో కధలు ఆయన వర్ణించారు. కాషాయ గుడ్డలు ధరించేప్పుడు చేసే శపధాన్ని ఆయన గుర్తు చేశారు. అరిషడ్వర్గాలకు లొంగిపోనని సంకల్పం చేసుకుంటే వ్యక్తిత్వం ఎప్పుడూ నశించదని స్వామీజీ ప్రతి పాదించారు. ఉపన్యాసంలో ఆయన చెప్పిన ఒక వాక్యం అర్ధయుక్తంగా వుంది. "ఆపదలో వున్న వాళ్ళను ఆదుకోవటం కూడా భజన చేయటం వేదాంత చర్చలో పాల్గొనటంలాగా దైవచింతనలో చేరిందే" - ఇదే ఆ వాక్యం.

ప్రభావతీదేవికీ, ఆమె సహచరులకూ ఈ వాక్యం అనుకోకుండా తగిలిన చెంప దెబ్బ. స్వామీజీ అభిమతం ఏ దిక్కున పయనిస్తున్నదో తెలిసింది.

ఉపన్యాసం పూర్తి కాగానే ప్రభావతీ దేవి చప్పబడి పోయింది.

ఆ రోజు రాత్రి ప్రభావతీదేవి పూజ్యపాదులయిన స్వామీజీ సన్నిధికి వెళ్ళి ఆయన కాళ్ళమీద పడి యేడ్చిందని చెప్పుకున్నారు. ఆమె చెప్పదలచిన విషయాలు చాలా వున్నాయి. అవన్నీ ఆమె చెప్పుకుంది.

మాతాజీ వీటికి ఏ మాత్రం చలించలేదు. ఆమెకు ఈ విషయాల్లో ఏమీ ఆసక్తి కూడా లేదు. నిర్ణయం ఎలా వున్నా, తనకేమీ ఫర్వాలేదన్న భావం ఆమెలో కనిపించింది. తనతోటి భక్తురాలితో ఆమె యిలా అన్నది: "పూజ్యపాదుల అభిప్రాయం మనకు ప్రతికూలంగా వుంటే దాన్ని మార్చి వేస్తాం."

పూజ్యపాదులకు ప్రభావతీదేవి అంటే ఇష్టం. అది ఒక దౌర్బల్యం. అది సన్న్యాసానికి పూర్తిగా విరుద్ధమని అనక తప్పదు.

మాతాజీ చేరదీసిన పేదవనితలు ఈ గొడవను పసికట్టారు. వాళ్ళందరూ కలిసి దీన్ని గురించి ఆలోచించారు. ఎవరికీ తెలియకుండా ఆశ్రమం నుంచి వెళ్ళిపోతే బాగుంటుందని సావిత్రి అభిప్రాయం.

"మాతాజీ మంచి తల్లి. ఆమెను మనం ఎందుకు బాధించటం? నీడలో వుండి పళ్ళెంలో భోజనం చేసేందుకు మనం నోచుకోలేదు. మనం ఇలా అనుభవించవలసిందే. మాతాజీ దయామయి. ఆమెను కష్ట పెట్ట గూడదు." అన్నదామె.

గౌరికుట్టి, చిన్నమ్మ నిట్టూర్పు విడుస్తూ అన్నారు: "అదృష్ట రేఖ మారిస్తే మారుతుందా?"

పార్వతి అనే ఆమె అభిప్రాయం వేరు:

"ఇక్కడి గొడవ మనకు తెలిసినట్టు మనమెందుకు ప్రవర్తించటం? ఇక్కడికి తీసుకురమ్మని మనం అడగలేదు. మనకేమీ తెలియనట్టు వుండాలి. వెళ్ళమని అన్నప్పుడు వెళ్ళిపోదాం."

మరో ఆమె కూడా అదే అభిప్రాయం వెల్లడించింది. మరో ఆమె సావిత్రితో ఏకీభవించింది. కాని ఆమెకు ఒక విషయం నచ్చలేదు.

"ఎవరికీ చెప్పకుండా వెళ్ళటం మంచిదికాదు. అందరి దగ్గరా సెలవు తీసుకొని వెళ్ళాలి. అదే మంచిది."

ఆలోచిస్తూ వుంటే చిన్నమ్మకు ఒక విషయం తట్టింది – "అసలు మాతాజీ మనల్ని వెళ్ళమని చెప్పిందా? చెప్పలేదు కదా!"

సావిత్రికి ఆ విషయంలో సందేహం లేదు. మాతాజీ అనుమతి తీసుకొనే వెళదామని అనుకోకండి" అన్నదామె.

ఆ మహిళలు ఇక వెనకటి చింపిరి గుడ్డలు, సొట్టలుపడిన పాత్ర సామాను పోగు చేసుకోవాలి. అవన్నీ వాళ్ళు ఎక్కడో పారేశారు. ఇకముందు గమ్యస్థానం ఏమిటో తెలియకుండా ముందుకు వెళ్ళాలి. ఆ దారిని గురించి వాళ్ళు ఆలోచించుకుంటున్నారు.

"ఇక్కడికి అనవసరంగా వచ్చాం "అన్నదొకావిడ.

అందరూ అందుకు సమ్మతించారు. ఏ దారిన వెళుతున్నామో, ఆ దారినే వెళితే సరిపోయేది.

తను వచ్చిన నాటి నుంచి ఆశ్రమంలో గొడవ ఆరంభమైందని తలుచుకొని సావిత్రి చాలా దిగులు పడింది. తనను తాను దూషించుకుందామె. హృదయంగల ఆశ్రమ మాతను కూడా కష్టపెట్టినట్టయింది. మాతాజీని ఈ క్లిష్టపరిస్థితి నుంచి ఎలాగయినా తప్పించాలని సావిత్రి ఆలోచన.

మాతాజీకి సావిత్రితో ప్రత్యేకమైన అనుబంధం వుంది. ఆమెకు మాతాజీ మీద కూడా అలాగే ప్రత్యేకమైన అభిమానం వుంది. మాతాజీ ఆమెను ఓదారుస్తూ అన్నది: "మీరంతా యిక్కడ లేకపోతే, ఇక యిక్కడ ఈ ఆశ్రమం కూడా వుండదు." అన్నదామె గట్టిగా.

ఎన్ని రోజులు గడిచినా స్వామీజీ ఏమీ నిర్ణయించలేకపోతున్నారు. ఈలోగా ప్రభావతీదేవి భక్తుల్లో చాలా మందిని తన వశం చేసుకుంది. మాత

జ్యోతిర్మయీ దేవి యొక్క నిర్లక్ష్యం చాలా మందికి ఈర్ష్య కలిగించింది. పూజ్యపాదులు స్వామీజీని కూడా ఆమె లెక్క చేయటం లేదు. ఆమె ప్రవర్తన యెవరికీ నచ్చలేదు. ఆ సమయంలో ఒక సంఘటన జరిగింది. స్వామీజీ విశ్రాంతి తీసుకునే సమయంలో ఆ గదిలో మెల్లిగా ఎవరో స్త్రీ నవ్వుతున్నట్లు పార్వతి అనే ఆశ్రమవాసినికి వినపడింది. ఆమె నక్కి నక్కి చూచింది. స్వామీజీ చేతిమీద తలవాల్చి సోఫామీద పండుకొని వున్నారు. గదిలో ప్రభావతీ దేవి వుంది. ఆ దృశ్యాన్ని పార్వతి జ్యోతిర్మయీ దేవికి తన భాషలో ఇలా చెప్పింది:

"అబద్ధం కాదు మాతాజీ! చిన్నమ్మగారు గుమ్మం దగ్గర నిలబడ్డారు. తల వంచుకుని రెండు చేతుల వేళ్ళను ఒకదానిలో ఒకటి చొప్పించి నవ్వుతూ సిగ్గుపడుతూ పసి పిల్లలాగా నిలబడ్డారు. స్వామీజీ పండుకునే, మెల్లిగా ఏదో సరసాలాడుతున్నారు. నాకు సిగ్గయింది."

మాత జ్యోతిర్మయీ దేవికి ఇది ఆశ్చర్యకరంగా లేదు. పార్వతి అలా చెప్తూ వుంటే జ్యోతిర్మయీ దేవి ఏవిధమైన భావభేదం లేకుండా ఏమీ ప్రశ్న అడక్కుండా అలాగే వింటూ వుంది. ఇది ఇలాగే జరుగుతుందని ముందే అనుకున్నట్టుంది ఆమె వాలకం.

స్వామీజీ ఆ సమస్యను గురించి అన్ని దృక్కోణాలనుంచీ పరామర్శ చేశారు తన భక్తబృందంతో. వాళ్ళ అభిప్రాయం కనుక్కున్నారు. ఒక రోజు వెనకటి లాగానే భజన తర్వాత ఉపన్యాసం చెప్తూ ఒక సూచన చేశారు.

ఆ రోజు స్వామీజీ ఉపన్యాసం సన్న్యాసాన్ని గురించి. ఆ వుపన్యాసంలో ప్రధాన భాగమిది:

"సన్న్యాసంలో ఏమీ పని చెయ్యకుండా కూర్చోటం కాదు. హాయిగా కాలక్షేపం చెయ్యటం కూడా కాదు. సన్న్యాసి యీ ప్రపంచంలో చెయ్యవలసిన పనులు చాలా వున్నాయి. ఇచ్ఛా శక్తులననుసరించి ప్రతి సన్న్యాసి ఏదో ఒక సంఘసేవా కార్యక్రమం చేపట్టాలి. ఆశ్రమంలో ఏదో ఒక సంఘసేవా కార్యక్రమం చేపట్టాలి. ఆశ్రమంలో ప్రార్థనాది కార్యక్రమాల్లో లయమయిపోయి, వేదాంత చర్చల్లో పాల్గొనే సన్న్యాసికి కూడా అందుకు తగిన వసతులు వుండాలి. అది కూడా సంఘసేవే. ఆశ్రమాన్ని అనాథ మందిరంగా రూపొందించాలనే ఆలోచనకు ఉన్న విరోధాన్ని ఈ దృష్టితో అర్థం చేసుకోవాలి."

ప్రభావతీ దేవి జయించింది. కాని వెంటనే స్వామీజీ అన్నారు: "అనాథ రక్షణను జీవితంలో ఒక వ్రతంగా భావించే సన్న్యాసికి దానికి కావలసిన సదుపాయాలు కల్పించాలి. నిరుత్సాహపరచగూడదు."

పూజ్యపాదులు స్వామీజీ వుద్దేశ్యం అందరికీ స్పష్టంగా తెలిసి పోయింది. అనాథ మందిరం వేరే ఏర్పాటు చేసి నడిపించాలి. ఇది సరియైన

తీర్మానమని అందరూ అన్నారు. ఆశ్రమం ఆశ్రమంలాగే వుండాలి. అనాథ వనితా మందిరం అనాథ వనితా మందిరంలాగే వుండాలి.

కాని ఆశ్రమమాత ఆ సూచనను అంగీకరిస్తుందా?

ఆ పరిస్థితిలో మాత జ్యోతిర్మయీ దేవి ఒంటరిదై పోయింది. స్వామీజీ తీర్మానాన్ని అందరూ అంగీకరిస్తున్నారు. ప్రభావతీ దేవి పట్టు నెగ్గింది. కష్టాలలో నుంచి అక్కడికి వచ్చిన మహిళలు ఆశ్రమమాతను తమ సంరక్షకురాలిగా భావించి ఆమెతోనే వుంటారు.

మాత జ్యోతిర్మయీ దేవికి మళ్ళీ జీవితంలో ఒంటరి అయినట్టు అనిపించింది. అందువల్ల సహజంగా ఆమెలో వున్న అధికార భావం తలయెత్తింది: ఆశ్రమ మాతగా తనకుగల అధికారమే కాక యీ ఆశ్రమం తనది. తానే యీ ఆశ్రమాన్ని ఏర్పాటు చేసింది. ఆ అధికారాన్ని ఆమెకు కాకుండా చేసే అధికారం ఎవ్వరికీ లేదు.

స్వామీజీ, ఆశ్రమ మాతను ఏకాంతంగా పిలిచి తన అభిప్రాయం ఆమెకు చెప్పారు. అనాథ మందిరం పాత ప్రణాళిక ప్రకారం పట్టియూరు కావిలులో ఆరంభించాలి. అది యెంత త్వరగా చెయ్యగలిగితే అంత మంచిది. ఆశ్రమం ఆశ్రమంలాగానే వుండాలి.

"జ్యోతిర్మయికి అది అంత కష్టమైన పనికాదు. ఈనాటి నుంచీ ప్రయత్నించు. భక్తుల సహకారం కూడా లభిస్తుంది." అన్నారాయన.

ఈ చివరి వాక్యం వినేప్పుడు ఆమె ముఖం మీద అవిశ్వాసం, వ్యంగ్య వినోదం మందహాసంగా రూపొంది మరుక్షణం అంతరించింది. అది స్వామీజీ దృష్టిని తప్పించుకోలేక పోయింది. "ఆఁ, ఏమిటి?" అని అడిగారాయన.

వెంటనే సమాధానం వచ్చింది. మనస్సులో వున్న ఆలోచనలన్నీ ఒక్కసారి శబ్దరూపంలో బహిర్గతమయ్యాయి. ఆ కంఠంలో అభిమానంతో కూడిన తిరస్కార భావం కూడా ఉన్నట్టు అనుమానం వెయ్యకపోదు.

"అనాథ మందిరం ఏర్పరిచేందుకు ఒకరి ఉపదేశం అక్కర్లేదు. ఇంతకు ముందే ఏర్పరిచాను. ఇక ముందు కూడా నడిపిస్తాను." భక్తుల సహకారాన్ని గురించి కూడా ఆమె చెప్పింది.

మఠాధిపతికి చెప్పవలసినట్టుగా చెప్పలేదు. ఆయనకు కూడా అలాగే అనిపించింది. కాని అది అనుచితమని ఆయనకు అనిపించలేదు.

స్వామీజీకి అది బోధపడినట్టులేదు. అందుకని ఆయన అన్నారు: "మంచిది తల్లీ! మంచిది. సాధ్యమైనంత త్వరలో అది స్థాపించాలి. వృద్ధికి రావాలి."

మాతాజీకి యీ శుభకామన నచ్చలేదు. ఆమె చెప్పవలసిన విషయాలు ఇంకా చాలా వున్నాయి. ఆమె అడిగింది: "ఆశ్రమం ఆశ్రమంలాగానే వుండాలంటే - నన్ను ఆశ్రయించివున్న అనాథలు ఏంకావాలి?"

ప్రశ్న నోటి నుండి వెలువడగానే ఇది అనవసరమైన ప్రశ్న అనిపించింది. ప్రశ్న తప్పు పోయింది. అక్కరలేని సమాధానం తెప్పించే ప్రశ్న అది. అయినా ఆ సమాధానాన్ని స్వీకరించేందుకు ఆమె సిద్ధమయింది.

స్వామీజీ అన్నారు: "అవును తల్లీ! ఆశ్రమం అన్ని విధాలా పవిత్రమైన ఆశ్రమంగానే వుండాలి. కొత్త స్థలం ఎంపికచేసి అక్కడ అనాథ మందిరం స్థాపించాలి. అదే మంచిది. అనాథమందిరం ..."

స్వామీజీ మాట ఆయన నోట్లో వుండగానే తుపాకి గుండులా ఒక ప్రశ్న ఆయన వైపు సూటిగా వెళ్ళింది:

"నేను ఇక్కడి నుంచి వెళ్ళి పోవాలన్నమాట?"

"నన్ను అలా ఎందుకడుగుతున్నావు తల్లీ!" అన్నారు స్వామీజీ గంభీరంగా.

జ్యోతిర్మయీదేవి చర్చకు గానీ, వుపన్యాసానికి గాని సిద్ధంగా లేదు. "అదే మీ వుద్దేశం. పూర్తిగా అదే. కాని నేనొక్క విషయం చెప్తున్నాను. ఆ అనాథలతో నేను కూడా వెళ్ళిపోతాను. అంతటితో అందరి వుద్దేశం నెరవేరుతుంది." అన్నదామె.

స్వామీజీ సమాధానం కోసం ఎదురు చూడకుండానే మాత జ్యోతిర్మయీ దేవి తలవంచి నమస్కారం చేసి అక్కడినుంచి వెళ్ళి పోయింది.

అలా మాట్లాడి బయిటికి రావటం బాగాలేదనిపించింది మాత జ్యోతిర్మయీ దేవికి. ఎదిరించటం జరిగింది. కాని అది సరియైన పద్ధతిలో జరగలేదు. అది ఎదుటి వాళ్ళను గెలిపించే ఎదురుకోలు.

యజమానురాలి అధికార భావం మళ్ళీ తలయెత్తింది. అక్కడి నుంచి వెళ్ళ వలసిందెవరు? తానా? లేక ప్రభావతీ దేవితో సహా స్వామీజీయా? వెళ్ళి పోయేందుకు అనుమతి అడగటం తప్పు. వాళ్ళనే బయటికి వెళ్ళమని చెప్పివుండవలసింది వ్యవహారం చెడిపోయింది జీవితమంతా యిలాంటి తప్పులతోనే గడిచింది. జ్యోతిర్మయీ దేవి తన జీవితంలోని ప్రముఖమయిన సంఘటనలను ఒక వరుసలో గుర్తు చేసుకుంది. కేశవపిళ్ళను ధిక్కరించి కాలితో తన్ని గెంటేప్పుడు ఈ చవటతో ప్రయోజనం లేదని అనిపించింది. ఆ రోజు వెళ్ళమని అనకుండా మర్నాడు కూడా రమ్మని చెప్పివుండవలసింది. రామచంద్రన్ నాయరుతో ఏర్పడ్డ సంబంధం కూడా అలాగే అయిపోయింది. అతను వదిలేసినప్పుడు తన హక్కును నిలబెట్టుకునేందుకు ప్రయత్నించలేదు. అలా వదిలేసేందుకు వీల్లేదని కూడా అనలేదు. తర్వాత కూడా కేశవపిళ్ళె తనను ఏలుకునేవాడు. తన హక్కును తాను ఎన్నడూ అర్థం చేసుకోక పోవటంవల్ల, తన సామర్థ్యాన్ని సరిగ్గా వుపయోగించుకోక పోవటం వల్ల, కార్యక్రమాన్ని అవగాహనం చేసుకోక పోవటం వల్ల తన జీవితం కుంటుపడి నడిచింది. తను వుద్యోగం మానివేయటం మంచి పనేనా అని

జ్యోతిర్మయీ దేవి ఆలోచించింది. ఆ ఆలోచన మెరుపులా మెరిసి పిడుగులా సమూలంగా కదిలించి వేసింది. ఈ కాషాయ వస్త్రాలు ఎందుకు కట్టుకున్నట్టు? ఈ జీవితంలో లభించిన తృప్తి యేమిటి? అలా ఆలోచిస్తే 'ఎందుకు' అనే ప్రశ్న ఎన్నిసార్లో ఎదురవుతుంది.

తన జీవితాన్ని ఆమె సింహావలోకనం చేసుకుంటే ఒక్కవిషయం తేట తెల్లమయింది. ఏ పరిస్థితిలో కూడా అన్నీ మరిచిపోయి తనకు ఆధారంగా నిలబడే వ్యక్తి ఆమెకు ఒక్కడే మిగిలాడు. అతనే కేశవపిళ్ళై. అతను తప్ప యింకెవరున్నారు? ఆమె అంతఃకరణలో చేరి యెవరో అడుగుతున్నట్టున్నారు: "నీకు మరెవరున్నారు? అన్ని వేళలా అతనొక్కడే. ముందు కూడా అతని దగ్గరకి వెళ్ళవచ్చు. అతని దగ్గరకి వెళితే జరిగినవన్నీ మరిచిపోతాడు. ఎంత ఆపద వచ్చినా ఆదుకుంటాడు."

భక్తుల్లో చాలామందితో జ్యోతిర్మయీ దేవి కటువుగా మాట్లాడింది. ఈ కాషాయ బట్టలను విడిచి దూరంగా విసిరేయాలనిపించింది. వాటి పవిత్రతను ఆమె అంగీకరించటం లేదు. ఎంతమందికో ఇక్కడ ఆశ్రయం లభించింది. అవసరమయితే వాళ్ళతోపాటు వీధుల్లో తిరిగేందుకు ఆమె వెనుదీయదు. కాషాయ బట్టలు విసిరిపారేస్తే ఆశ్రమ మాత పదవి పోతుందని ఆమెకు తెలుసు.

మాతాజీ యిప్పుడు భజనకూ, వేద ప్రవచనానికి నియామకంగా వెళ్ళటం లేదు. ఈ రెండింటిలో ఏదో ఒకటి తేలాలని ఆమె భావం. ప్రభావతీ దేవి మాట నెగ్గింది. మార్గం నిష్కంటకమయినందుకు ఆమెకు చాలా తృప్తిగా వుంది. జ్యోతిర్మయీదేవి యిదంతా గమనిస్తూ వుంది.

జ్యోతిర్మయీ దేవి, సావిత్రి - యిద్దరూ ఏకాంతంగా కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

సావిత్రి ఆశ్చర్యంతో అడిగింది: "అది అలా జరుగుతుందా మాతాజీ?"

జ్యోతిర్మయీ దేవి పూర్తి నమ్మకంతో చెప్పింది: "నీవు చూస్తూ వుండు. నేను చేసి చూపిస్తాను. నేను నా అంతట నేనే సర్వస్వం వదిలేశాను."

"అది దైవ నిర్ణయం" అన్నదామె మళ్ళీ కొంత సేపటికి.

సావిత్రికి పూర్తిగా నమ్మకం కుదరలేదు. ఆమె అడిగింది: "ఆయనకు భార్య, కూతురు వున్నారు కదా? ఇది యెలా సాధ్యమవుతుంది మాతాజీ?"

జ్యోతిర్మయీ దేవి అన్నది: "ఆయన దాన్నిగా ఉండేందుకే నేను జన్మించాను. అతన్ని నేను ఎన్నిసార్లో వదిలేశాను. కాని విధాత అందుకు ఒప్పుకో లేదు. ఇక ముందు నేను ఆయనతోనే ఆయన దానిగా వుండేందుకు నిర్ణయించుకున్నాను."

ఆయన అంగీకరిస్తాడని సావిత్రికి నమ్మకం లేదు. ఏ పురుషుడు అందుకు ఒప్పుకుంటాడు? కాని జ్యోతిర్మయీదేవికి ఏమాత్రం సందేహం లేదు.

మాతాజీ చివరిమాటగా చెప్పింది: "నా జీవితం అతనితో గడవటమే విధి నిర్ణయం."

ఆశ్రమంలో బయలు దేరిన యీ వివాదం మెల్లమెల్లగా భక్తులదాకా ప్రసరించింది. పూజ్యపాదులు స్వామీజీ కూడా ప్రయోజనకరమయిన నిర్ణయమేమీ చెయ్యలేక పోయారని వాళ్ళు అభిప్రాయ పడ్డారు. దానికి చాలా కారణాలున్నాయి. ప్రభావతీ దేవి పట్ల పూజ్యపాదులు స్వామీజీకి ప్రత్యేకమైన వాత్సల్యం వుందని ప్రజల అభిప్రాయం. ఆశ్రమ మాత తన యిష్టం వచ్చినట్టు చేసే వ్యక్తి. అయినదానికీ, కానిదానికీ ఆమె అందరితో వైరం తెచ్చుకుంటుంది, అని కూడా కొందరు అభిప్రాయ పడ్డారు. అనాథ వనితామందిరం ఏర్పడి తీరాలని కొందరు వాదించారు. కేవలం నామ సంకీర్తనా, జపం, భజనా చేస్తే చాలదు. ఇలాంటి సంఘసేవ కూడా అవసరమని వాళ్ళ అభిప్రాయం. మరి కొందరి అభిప్రాయం దానికి భిన్నంగా వుంది. ఈ సన్న్యాసినులు జీవిత మధ్య భాగంలో సన్న్యాసం తీసుకున్నారు. వాళ్ళకు పాత అనుభవాలున్నాయి ఈర్ష్య, కలహం, ఆశ - వీటిని ఎంత అదుపులో పెట్టినా వాళ్ళకు సాధ్యం కావటం లేదు. ప్రతి వ్యక్తికీ ఒక చరిత్ర వుంది. పాత విషయాలు గుర్తుకు వస్తూ వుంటాయి. అప్పుడప్పుడూ నిట్టూర్పులు విడుస్తూ వుంటారు. పండ్లు కొరుకుతూ వుంటారు. ఈ విధంగా భక్తుల ఆధ్యాత్మిక జీవితంలో అవరోధం ఏర్పడింది.

రామచంద్రన్ నాయరు భార్య విమలమ్మ కూడా ఒక భక్తురాలు. ఆమె భక్తుల కుటుంబంలో జన్మించింది. ధన్యానందాశ్రమం పట్ల ఆమెకు ఎక్కువ ఆసక్తిలేదు. అయినా ఆధ్యాత్మిక వికాసానికి దోహదం చెయ్యని నీరస జీవితమంటే ఆమెకు అసహ్యం. అందువల్ల ఆమె ధన్యానందాశ్రమానికి వెళుతూవుంటుంది. ధన్యానందాశ్రమంలోని కార్యక్రమాలు విమలమ్మకు శుష్కంగా కనిపించేవి. పల్లెటూరిలోని ఒక ఆశ్రమం తోటి సంబంధం వుండటం వల్ల విమలమ్మకు సంగీతం మీదా, నృత్యం మీదా ఆసక్తి యేర్పడింది.

విమలమ్మ మనస్సులో కొత్త ఆశ చిగురించింది. ఏమయినా సరే, ఒక ఆధ్యాత్మిక కేంద్రం చాలామందికి అవసరం. ధన్యానందాశ్రమం ఒక నిర్దిష్టమైన లక్ష్యం లేకుండా సాగుతున్నది. మలబారునుంచి ఉమాదేవిని పిలిపించి ఒక ఆశ్రమాన్ని స్థాపింపజేస్తే ఎలా వుంటుందని ఆలోచించింది. ఆమె తిరువనంతపురం వచ్చిన నాటినుంచి ఉమాదేవిని గురించి ప్రశంసిస్తూ వుంది. కాని తిరువనంతపురం వాళ్ళు అంతగా పట్టించుకో లేదు. ఆ ఆశ్రమం కేవలం ఆడవాళ్ళదవుతుంది. అందులో మగవాళ్ళు కూడా సభ్యులుగా చేరవచ్చు. కాని మహాధిపత్యం మహిళదిగానే వుంటుంది.

అందులో కార్యక్రమాలు భజనలు, గీతా ప్రవచనాల వరకే పరిమితం కాక నృత్యగీతాలకు కూడా స్థానం వుంటుంది.

కొంతమంది స్త్రీలు తిరువనంతపురంలో ఉమాదేవి ఆశ్రమం ఒకటి స్థాపించాలని నిశ్చయించుకున్నారు.

## ముప్పై యేడు

మాత జ్యోతిర్మయీ దేవి జీవితంలో చాలా ముఖ్యమయిన రోజులు కొన్ని గడుస్తున్నాయి. రెండింటిలో ఏదో ఒకటి తేల్చుకోవాలి. అనాధ వనితలపట్ల కనికరం కూడా నిజానికి రెండు మూడు రోజుల నుంచి తగ్గిపోయింది. వాళ్ళతోపాటు వెళ్ళిపోయేందుకు తను సిద్ధంగా వున్నానని ఆమె చెప్పేసింది. ఆమె హృదయ పూర్వకంగానే ఆ మాట చెప్పింది. ఈనాడు కూడా ఆమె చెప్పిన మాటకు విలువ వుంది. కానీ అది అమె లక్ష్యం కాదు. సాధ్యమైనంత త్వరగా ఒక అనాధ మందిరం ఏర్పాటు చెయ్యాలని ఆమె ఆలోచిస్తున్నది. ఈ మధ్య మాత జ్యోతిర్మయీ దేవికి ఆ జీవితం మీద చాలా అసహ్యం వేస్తూ వుంది. తాను ఇలా బతకవలసిన దాన్ని కాదని ఆమెకు అనిపించింది. ఈ జీవితంలో దిగటమే పొరపాటయింది. మరి యెలాంటి జీవితం కావాలి? మరోలా జీవించేందుకు ఆమెకు అన్ని సదుపాయాలూ లభించాయి.

యాజమాన్యం, అధికార కాంక్ష, స్వచ్ఛంద స్వభావం, వెనకటి జీవితంలో అనుభవించిన కష్టనష్టాలు, ఈనాటి పరిస్థితి – అన్నీ కలిసి గతజీవితానుభూతి అనే బట్టీలో కరిగిపోయి మాత జ్యోతిర్మయీ దేవిని తంకమ్మగా మార్చేశాయి. కాని వెనకటి తంకమ్మగాకాదు. వెనకటి తంకమ్మకు మతి లేదు. ఇచ్ఛా శక్తి లేదు. ఏ పని చేయతగింది, ఏది చేయతగంది – అనే యుక్తాయుక్త విచక్షణ లేకుండా నిర్లక్ష్య భావం వుండేది. ఆ తంకమ్మ కేశవ పిళ్ళను చులకనగా చూచి వెళ్ళగొట్టింది. అతను వెళ్ళి పోయిన తర్వాత అంతా శూన్యమయిపోయింది. ఆ తంకమ్మకు తను చేసిన తప్పులు అర్థమయినట్టు లేదు. రామచంద్రన్ నాయరు ఆమెను తాంబూలం లాగా నమిలి నమిలి తమ్మలా ఉమ్మేశాడు. అయినా తంకమ్మ ఏమీ అనుకోలేదు. ఆ తర్వాత, ఎగిరిపోయిన పిట్ట తిరిగి ఆమె చేతిమీద వాలి ఆమెను మురిపించింది. కాని ఆమె ఆ పిట్టను పంజరంలో బంధించుకోలేదు. ఆ విషయం ఆమె పట్టించుకోనే లేదు. ఆ పిట్ట ఆమె చుట్టూ తిరుగుతూనే వుంది. 'శేఖర విలాసం' తన ఆస్తి అని తంకమ్మకు ఎన్నడూ అనిపించలేదు. ఉద్యోగం నిరుపయోగమని ఆమె వదిలేసింది. చిన్నస్వామి మాటల్లో చిక్కుకొని ఆమె అలా చేసింది. తర్వాత సన్న్యాసం తీసుకుంది. ఇప్పుడు ఈ కాషాయ బట్టల్లో ఏమీ గొప్పదనం కనిపించటం లేదు.

ఇక ముందు ఏం చెయ్యాలి? బహుశా సావిత్రిని గురించి తెలుసుకున్న తర్వాత ఆమెలాగానే తనుకూడా జీవితంలో ఎలా నష్టపడిందో తనకు

బోధపడింది. వెనక జరిగినవన్నీ తెలివి తక్కువ పనులు. పూర్తిగా తెలివి తక్కువ చేష్టలు. పూర్తిగా సావిత్రిలా కాకపోవటానికి తన అదృష్టమే కారణం.

తంకమ్మ వెనకటి నష్టాన్ని పూడ్చుకునేందుకు ప్రయత్నిస్తూంది. స్వామిత్వం, అధికార భావం ఆమెకు జీవన శక్తిని ప్రసాదించి వుంటాయి. ఈ పరిస్థితిలో కేశవ పిళ్ళై కర్తవ్యం ఎవరిపట్ల వుంది? అతను జీవితంలో మరెవరికయినా ఏమన్నా ఉపకారం చేశాడా? కేశవపిళ్ళై విషయంలో తనంతట తాను అతనివైపు మొగ్గలేదు. రామచంద్రన్ నాయరు చేతుల్లో తనంతట తాను చిక్కిపోయిన మాట మాత్రం నిజం. కేశవపిళ్ళై మీద తనకు అధికారం వుంది. ఆమెకోసం ఒక యిల్లు కట్టించి యిచ్చినంత మాత్రాన ఆ బాధ్యత తీరిపోతుందా? కేశవపిళ్ళై ఎప్పటికయినా తనవాడు. ఇంతవరకూ ఆమెకు అతనివల్ల ఏమీ రాలేదు. తలవంచుకుంటే లాభం లేదు. జీవితం ఇంకా చాలావుంది. మంచి అవకాశం చెయిజారిపోయింది. ఇప్పుడనుకొని లాభం లేదు. తను ఎందుకు జన్మించిందో తంకమ్మకు తెలిసిపోయింది. ఆ విషయంలో స్పష్టమైన ఆలోచన ఆమెలో అంకురించింది. ఇలా కాషాయ బట్టలు కప్పుకొని తిరిగేందుకు కాదు. ఆ ఆలోచనలతో ఆమె అతీతాన్ని అవలోకించింది. సూక్ష్మ నిరీక్షణతో చూచిన ఆ చూపులకు వెలుగు కనిపించింది. ఆ వెలుగులో ముందు వెళ్ళవలసిన దారి స్పష్టంగా గోచరించింది.

ఆమె కేశవపిళ్ళైకు మన్నించరాని అపచారాలు చేసింది. అది తంకమ్మకు తెలుసు. ఆ పల్లెటూరి యువకుడు తనను ప్రేమించాడు. అతను తనను ఎప్పుడయినా కష్టపెట్టినట్టు ఆమెకు గుర్తు లేదు. ఎప్పుడూ అలా జరగలేదు. అన్ని వేళలా అతని సానుభూతినే ఆమె అనుభవించింది. కాని అతని ప్రేమను తను అర్థం చేసుకోలేదని తంకమ్మ పశ్చాత్తాప పడింది.

ఆమె చేసిన తప్పులన్నీ కర్తవ్య భావంతో చేసినవేనా? కేశవపిళ్ళై చేసిన సాయమంతా కర్తవ్య భావంతో చేసిన దేనా? ఈనాడు తంకమ్మ ఒంటరిదయి పోయింది. ఆమెకు ఎవరూలేరు. ఆమె దగ్గర ఏమీ లేదు. ఇకముందు కూడా ఆమె అతని దగ్గరికే వెళ్తుంది. కాని ఈసారి వెళ్ళటం ఒకేసారి వెళ్ళటం అవుతుంది. ఇక అక్కడి నుంచి తిరిగి రావటమనేది లేదు.

తనకు అలాంటి అధికారం వుందని తంకమ్మ తనలో తాను తర్కించుకుంది. తనలోని స్త్రీత్వానికి మొట్టమొదట విలువ కట్టినవాడు కేశవపిళ్ళై. మొట్టమొదటసారి ఆమెను ముద్దు పెట్టుకున్నవాడు కేశవపిళ్ళై. మగవాడి మమకారం కోసం మొట్టమొదట ఆమె కేశవపిళ్ళై ఎదుటనే నిలబడింది. జీవితమనే నృత్యంలో మొట్ట మొదటిసారి కాలుజారి తప్పటడుగు వేసింది ఎవరి వల్ల? తంకమ్మ ఆ రోజులను గుర్తు చేసుకున్నది. ఆడదాని మనస్సు చలించి నప్పుడు అదుపులో పెట్టటం

తెలివిగల మగవాని పని. ఆ మగవాడు ఆమెను తప్పు చేశావని ఒక్కసారి కూడా అడగలేదు. ఆమె తప్పు చేసిందని ఎప్పుడూ కోప్పడ లేదు. ఆ రోజు ఆమె తప్పటడుగు వేసినప్పుడు ఆమెను దండించి వుంటే ఆమె చెడిపోయేది కాదు. తంకమ్మ తనలో తాను తర్కించుకుంటూ వుంది. అతను ఎన్నడూ కోపంతో మాట్లాడనే లేదు. ఆ ప్రియుడు దండించే వ్యక్తి అయినట్టయితే యెంత బాగుండేది! అదుపులో పెట్టలేని ప్రియుడు భర్త కాలేకపోయాడు.

తంకమ్మ తను చేసిన తప్పులన్నీ అతనితో చెప్పుకుంటుంది. కాళ్ళు పట్టుకొని క్షమాపణ కోరుకుంటుంది. అలా కాళ్ళ మీద పడ్డప్పుడు అతను ఒక్కొక్క తప్పు చెప్పించి కాళ్ళ కింద నలిపేస్తే? అందులో ఒక ఆనందముంది. ఇకముందు అలాంటి తప్పులు చెయ్యొద్దని అతను మందలించాలి. ఒక గీత గీచి అది దాటి బయటికి రావద్దని చెప్పినా - తంకమ్మ దాన్ని కూడా అంగీకరిస్తుంది. ఆమె తన సర్వస్వం కేశవపిళ్ళైకు అర్పించేందుకు సిద్ధంగా వుంది.

కాని యీ పాప భారం మోసుకొని ఆమె అక్కడికి ఎలా వెళ్ళ గలుగుతుంది? ప్రేమ పూరితమైన యీ హృదయాన్ని అర్పిస్తే - అతను నమ్ముతాడా? ఈ కరుణార్ద్ర నయనాలను ఎవరు నమ్ముతారు? ఈ కళ్ళల్లో ఇప్పుడు కూడా ఆకర్షించే శక్తి వుందా? ఈ పెదవుల మీద చిరునవ్వు ఇప్పుడుకూడా హృదయాన్ని దోచుకోగలదా? ఇప్పుడు మిగిలిన శక్తి యేమిటి? ఏమీలేదు. ఈ తూణీరంలోని బాణాలన్నీ పాతబడి పోయాయి. తుప్పు పట్టి పోయాయి. ఇక ఒకటే ఆధారం. ఉన్నదున్నట్టు అంతా చెప్పేయాలి. సర్వస్వం చెప్పుకునే అధికారమే యీనాడు తనకున్న బలం.

ఈ విధంగా ఆలోచించి మాత జ్యోతిర్మయీ దేవి ఒకనాడు కన్యాకుమారిలో ప్రభుత్వ రహదారి బంగళాలో వున్న ఛీఫ్ సెక్రటరీ దగ్గరకి వెళ్ళింది. ప్రాంతీయ పునర్విభజనకు సంబంధించిన కాగితాలు చూచుకునేందుకు ఆయన తన భార్య దగ్గర రెండు రోజులు సెలవు తీసుకొని అక్కడికి వెళ్ళాడు. జ్యోతిర్మయీ దేవి అక్కడికి చేరింది. అది సరియైన స్థలమని భావించే అక్కడికి వెళ్ళి వుంటుంది.

తంకమ్మ ఏడుస్తూ వుండగా కేశవపిళ్ళై యెప్పుడూ చూడలేదు. ఆమె బిగ్గరగా ఏడుస్తూ వుంది. కేశవపిళ్ళై లేచి నిలబడ్డాడు. "ఏమిటి? ఏమయింది? ఎందుకేడుస్తున్నావు?"

జ్యోతిర్మయీ దేవి ఏమీ మాట్లాడ లేక పోయింది. అది అభినయం కాదు. ఏడుపు కోసం ప్రయత్నించి దాన్ని ఒక ఉపాయంగా ప్రయోగించాలనే వుద్దేశంతో ఆమె రాలేదు. జీవితంలో అనుభవించిన పరాజయ భావమంతా యీనాడు కన్నీటి రూపంలో కారుతూ వుంది. ఎక్కువగా ఏడ్చినందువల్ల

ఆమెకు ఎక్కిళ్ళు వస్తున్నాయి. కేశవపిళ్ళై ఉద్విగ్నుడయినాడు. ఇలాంటి పరిస్థితిలో ఆమె నెప్పుడూ చూడలేదు.

తన యెదుట నిలబడి వున్న స్త్రీ ఒక సన్న్యాసిని అనే మాట కూడా ఆ సమయంలో కేశవపిళ్ళై మరిచి పోయినాడు. ఆమె తంకమ్మగానే కనిపించింది.

"ఏమిటయింది చెప్పు. అసలు సంగతేమిటో చెప్పు ." అంటూ అతను మాత జ్యోతిర్మయీ దేవి దగ్గరకి వెళ్ళాడు. ఆమె చేతులను మొహం మీదనుంచి తీసేశాడు.

ఆమె ముఖం అశ్రుపూరితంగా వుంది. కన్నీరు కారటంవల్ల మొహం ఎర్రబారింది. పెదవులు కంపిస్తూ వున్నాయి. ఏదో చాలా కష్టంలో వున్నదని అనిపించింది కేశవపిళ్ళైకు. కాని అదేమిటో అతనికి బోధపడలేదు. ఆతురతతో మళ్ళీ అడిగాడు:

"సమస్య ఏమిటో చెప్పు. జరిగిందేమిటో చెప్పు. ఏదో మార్గం ఆలోచిద్దాం."

కేశవపిళ్ళై తన చేతులను ఆమె మెడమీద వేసి ఆమెను దగ్గరగా చేర్చుకుని గుండెకు హత్తుకున్నాడు. ఆ స్పర్శలో అలౌకికమయిన శక్తి వుంది. కేశవపిళ్ళై ఆవేశపూరితుడయినాడు. అది అతనిలోని దౌర్బల్యం. "చెప్పు" అని మళ్ళీ అడిగాడు.

మాత జ్యోతిర్మయీ దేవి అశ్రుపూరిత నేత్రాలతో అతని వైపు రెప్పవాల కుండా చూచింది. "నాకు ఎవ్వరూ లేరు. ఏమీ లేదు." అన్నది.

మాత జ్యోతిర్మయీ దేవి ఆ ప్రశ్నకు వెంటనే సమాధానం వస్తుందని ఎదురు చూస్తున్నది. మరుక్షణంలో - లేకుంటే ఆ తర్వాతి క్షణంలో - ఆ ప్రశ్నకు సమాధానం వచ్చి తీరాలి. "నేనున్నాను. నాదంతా నీదే" అని సమాధానం వస్తుందని అనుకుంది. అదే సమాధానం ఆమెకు కావాలి.

అలాంటి సమాధానం రాలేదు. చాలా క్షణాలు గడిచాయి. చేతులు విడిపించుకుని రెండు చేతులూ వెనక్కుకట్టుకొని అతను విచారంతో వెళ్ళి కుర్చీమీద కూర్చున్నాడు.

కాలం ముందుకు సాగిపోతూవుంది. ఎవరూ ఏమీ మాట్లాడటం లేదు. జ్యోతిర్మయీ దేవి ఏడుస్తూ వుంది.

అతను ఆలోచిస్తున్నాడు. అన్నీ గుర్తు చేసుకుంటున్నాడు. కార్యకారణ సంబంధం స్పష్టంగానే కనిపిస్తూ వుంది. ఒక వరుసలో ఆలోచిస్తే చాలు. గొలుసు లాగితే కడియాలన్నీ ఒక దాని వెంట ఒకటి వస్తాయి.

ఒక అధికారి లాగా లేదా సంరక్షకునిగా సమయోచిత గాంభీర్యంతో అతనన్నాడు: "ఇప్పటి కర్థమయిందా?"

మాత జ్యోతిర్మయీ దేవి పరుగెత్తి ఆతని కాళ్ళు పట్టుకుంది. కేశవపిళ్ళై కాళ్ళు వెనక్కి లాక్కున్నాడు. కాని ఆమె వదల్లేదు.

"నన్ను కాళ్ళతో తన్నండి. నన్ను క్షమించండి."

అతనామెను పట్టుకొని లేవనెత్తాడు. ఆమె కుర్చీ దగ్గర నిలబడ్డది.

అతను ఓదారుస్తూ అడిగాడు: "ఆఁ, ఇప్పుడు చెప్పు. ఏమయిందో చెప్పు."

అది చాలా పెద్ద కథ కదా? ఇంత తొందరగా ఎలా చెప్పటం? కేవలం ఆ సమయంలో ఆమె పరిస్థితి చెప్పాలంటే వట్టియూరుకావిలలో అనాథ మందిరం కోసం స్థలం రిజిష్టరు చేయించమని అర్జీ తీసుకుని వెళ్ళిఉంటే కేశవపిళ్ళె అన్నది నిజం అని చెప్తే సరిపోతుంది. కానీ జ్యోతిర్మయీ దేవికి కావలసింది అది కాదు. "నన్ను స్వీకరించండి" అని వేడుకోవటమే ఆమె ఉద్దేశ్యం. అప్పుడు ఈ ఆశయం స్పష్టంగా లేదు. ఆ మాట చెప్పేందుకు ఆమెకు నోరు రాలేదు.

"నాకు ఎవ్వరూ లేరు. నాకు ఏమీలేదు" అని మళ్ళీ అన్నదామె.

కొంచెం నిర్దాక్షిణ్యంగా అతను పెదిమలు విరుచుకుని చిరునవ్వు విసిరాడు. కొంచెం సేపు కేశవపిళ్ళె కుర్చీ చేతులను తడుతూ కూర్చున్నాడు. "అయితే నన్నిప్పుడేం చేయమంటావ్?" అని అడిగాడు.

దానికేమీ సమాధానం రాలేదు. అతని బుగ్గ మీద ఒక కన్నీటి బొట్టు రాలింది. కేశవపిళ్ళె తల యెత్తి చూచాడు.

"ఆఁ?"

జ్యోతిర్మయీ దేవి వినయపూర్వకంగా అన్నది: "నన్ను క్షమించండి." ఆ తర్వాత మళ్ళీ వినయంగా అన్నది: "నన్ను క్షమించానని ఒక్కసారి చెప్పండి."

ఆ విన్నపం కేశవపిళ్ళె హృదయాన్ని స్పృశించింది. అశ్రుపూరిత ముఖం నుంచి వెలువడిన ఆ విన్నపంలో ఏదో అసాధారణత్వం వుంది. కేశవపిళ్ళె వెనకటి ఘటనలను గుర్తు చేసుకున్నాడు. సచివాలయంలో రెవిన్యూ శాఖలో పదిహేను రూపాయలు తెచ్చుకునే గుమాస్తా జీవితం అది! దానికి పునాది వేసింది ఆమే కదా? ఆమె ఎవరికి అపచారం చేసింది? తనకు ఏమయినా అపచారం చేసినట్టు కేశవపిళ్ళెకు అనిపించలేదు. ఆమె చేసిన తప్పేమిటో అతనికి బోధపడ లేదు. ఆమె తనకు తానే అపచారం చేసుకుంది. దానికి గాను క్షమాపణ కోరుతున్నది.

"నన్ను క్షమించరా?" అని ఆమె మళ్ళీ అడిగింది.

కేశవపిళ్ళె తన చేతులతో ఆమె నడుమును చుట్టి వేశాడు. ఆమెను అలా దగ్గరకు లాగుకొని మందహాసంతో సమాధానం చెప్పాడు: "క్షమిస్తున్నాను."

బహుశా అతను అలా మాట సామెతగా అన్నాడు. కాని పూత జ్యోతిర్మయీ దేవి మనస్సు ఊరడిల్లినట్టేవుంది. ఒక యుగం గడిచింది.

మాత జ్యోతిర్మయీదేవి కాషాయ బట్ట అంచుతో మొహం తుడుచుకుంది. కేశవపిళ్ళె మూడు నాలుగు పర్యాయాలు ఆమెను గట్టిగా కౌగిలించుకున్నాడు. జ్యోతిర్మయీ దేవి దానికి సమ్మతించి నిలబడివుంది.

ఇప్పుడిప్పుడే అశ్రువులు నిండిన ఆ నయనాల్లో ఆవేశం పొంగుతూ వున్నదని కేశవపిళ్ళె గమనించాడు. ఏడిచినందువల్ల కళ్ళు, మొహం ఎఱ్ఱబారాయి. అందువల్ల ఆ మొహం చూచేందుకు మరింత అందంగా వుంది. ఆమెకు ఏదో కావాలనిపిస్తున్నది. చుంబనం కోసం ఉద్రూతలూగే సమయంలో ఆమె ముఖం ఎలా వుంటుందో కేశవపిళ్ళెకు తెలుసు.

"ఒహో! ఈ ఏడుపులూ, కేకలూ ఇందుకేనా? దానికింత ఆరాట మెందుకు?" అన్నాడతను.

కేశవపిళ్ళె తన మొహం ముందుకు వంచాడు. మాత జ్యోతిర్మయీదేవి మొహం అతని మొహం వైపు వంచింది.

"ఈ కాషాయ బట్టలను అపవిత్రం చెయ్యనియ్యకు" అన్నాడు కేశవపిళ్ళె కొంత పరిహాస ధోరణిలో.

"ఈ కాషాయ బట్టలా? ఇదొక మోసం."

ఈ సమాధానం కేశవపిళ్ళెకు నవ్వు పుట్టించింది.

కేశవపిళ్ళెకు- ఇంతవరకూ ఆమె సమాగమంలో కొంత ప్రత్యేకత కనిపించేది. కాని యిప్పటి యీ సమాగమంలో అలాంటి విశేషమేమీ లేదు. తంకమ్మ సన్న్యాసం తీసుకున్నది. అందువల్ల తనకు ఒక విధంగా మేలే అయినట్టు అతను భావించాడు. ఆమె మరో మార్గంలో వెళ్ళిపోయింది. ఆమె ఆ దారి వదలి మళ్ళీ వస్తుందనిగాని, అలాగే వెళ్ళి పోతుందని గాని అతననుకోలేదు. కాని ఆమె తిరిగి రావటం కేశవపిళ్ళెకు ఏమీ ఆశ్చర్యకరంగా లేదు. అలా అవుతుందనే అతననుకున్నాడు. తంకమ్మ ఎన్నిదార్లనో అనుసరించింది. చివరకు తిరిగి వచ్చింది.

కాని ఆమె నిజంగానే ఏడుస్తున్నదని అతనికి అనిపించింది. అది నటన కాదు. ఆమె బలవంతంగా ఏడుపు తెప్పించుకోగలదని తోచదు. లేదు, ఆమె అలా చెయ్యలేదు. అలా నటించటం ఆమెకు చేతయివుంటే ఆమె యిలా వుండి వుండదు. ఏడ్చేందుకూ, నవ్వేందుకూ, విపరీతమైన మనస్థితి ప్రదర్శించేందుకూ, ధన్యవాదాలు చెప్పేందుకూ, ఎదిరించేందుకూ ఎన్నో అవకాశాలు లభించాయి. ఏడ్చినందువల్ల ప్రయోజనముందని తెలిసినా ఆమె ఏడవలేదు. నవ్వురాకుండా ఆమె నవ్వలేదు. మనస్సులోని భావాలను ఆమె ఎన్నడూ దాచుకోలేదు. ఆమె కృతఘ్నురాలని అనిపించింది. కాని భవిష్యత్తును గురించి ఆలోచించకుండా కోపతాపాలను వెళ్ళగక్కింది. అలాంటిదీ తంకమ్మ జీవితం. ఇప్పుడామె ఏడుపు నిజమైన ఏడుపు. ఆమె కాళ్ళు పట్టుకోవటం నటన కాదు. క్షమాపణ కోరుకోవలసిన సన్నివేశాలు

చాలా వచ్చినా ఈ రోజు క్షమాపణ కోరవచ్చుననే ఆలోచన ఆమెకు ముందే వచ్చి వుంటుంది. ఏదో గొడవ జరిగి వుంటుంది. "నాకు ఎవరూ లేరు, ఏమీలేదు" అంటున్నది. బహుశా ఆ సన్యాసిని ఈమెను బయటికి గెంటేసి వుంటుంది. ఇంతకుముందు కూడా ఆమె ఒకసారి హెచ్చరిక చేసింది. ఇప్పుడు దిక్కులేనిదయింది. బహుశా ఆశ్రమంలో కాషాయ బట్టలకు తగని పని ఏదయినా చేసివుంటుంది. ఈ కాషాయ బట్టల పట్ల ఆమెకు ఏమాత్రం గౌరవం లేదనే విషయం ఇప్పుడే తెలిసి పోయింది. ఆ మాట ఆమె నిర్మొహమాటంగా చెప్పను గూడా చెప్పింది.

ఒకప్పుడు అనుభవించిన ఆనందం కాలక్రమంలో మరుపుకు వచ్చింది. ఈనాడు మళ్ళీ చేతికి అందింది. ఆ కోరిక నశించలేదు. నిద్రాణమై ఉంది. అది మళ్ళీ చలించింది. ఇప్పుడది ఆశగా రూపొందింది. కేశవపిళ్ళై మాత జ్యోతిర్మయీ దేవిని గట్టిగా హత్తుకొని కౌగిలించుకున్నాడు. ఆమె కూడా చేతులతో గట్టిగా పట్టుకుంది. చిరునవ్వుతో కేశవపిళ్ళై ఆమె చెవుల్లో చెప్పాడు: "మళ్ళీ కాళ్ళతో తన్ని బయటికి నెడతావా? ఇక అలాంటి పని చెయ్యకు."

మాత జ్యోతిర్మయీదేవి దానికి సమాధానం చెప్పలేదు. ఆమె పిచ్చిదానిలాగా అతని శరీరంలో ప్రతి అవయువాన్నీ ముద్దు పెట్టుకుంటున్నది.

క్షమాపణ కోరటం, ఏడవటం, కన్నీరు కార్చటం - ఇవన్నీ మాత జ్యోతిర్మయీ దేవి అవలంబించిన ఉపాయాలని చెప్పగలమా? లేదు. అలా చెప్పేందుకు వీల్లేదు. జీవితాన్ని మరో దిక్కుకు మరల్చవలెననే సంకల్పం ఉదయించినప్పుడు ఇది దానికి ఉపాయం కాదని చెప్పగలమా? ఈ విపరీత మార్గంలో ముందుకు పోయేందుకు పరిశ్రమ అవసరం. మరి దీన్ని పరిశ్రమ అని భావించకూడదా? ఏడవకుండా, క్షమాపణ కోరకుండా ఇక్కడికి వచ్చివుంటే? ఇంతకు ముందు మాత జ్యోతిర్మయీ దేవి లాగానే యిక్కడికి రాలేదా? ఇష్టమైన వ్యక్తి ఏం చెప్పినా వింటాడు. చేసిన తప్పులన్నీ ఏకరువు పెట్టి క్షమాపణ కోరితే చెప్పిన మాటలన్నీ విన్న తర్వాత బహుశా 'నీ తప్పులన్నీ క్షమిస్తున్నాను' అని అనవచ్చు. ఒక వేళ మనస్ఫూర్తిగా అన్నా అనవచ్చు. తర్వాత అవసరమైనప్పుడు కావలసిన సాయం కూడా చేస్తాడు. అందులో సందేహం లేదు. అలాంటి సంరక్షకుడు వుండటం జీవితానికి శ్రీరామ రక్ష. కాని జ్యోతిర్మయీదేవి ఆశయం ఇదేనా? చేయిజారిపోయిన వ్యక్తి ఆమెకు మళ్ళీ లభించాలి. చుంబనంతో ఆరంభమయిన ఆ వ్యక్తి చుంబనంతోనే తిరిగి రావాలి. ముందుముందు కూడా ఆమె వచ్చి యిలా ముద్దు పొందగలదా? అలా జరిగితే ఇది మంచి వుపాయమన్నట్టే. అది నటన కాకపోయినా కావాలని తెలిసి అవలంబించిన ఒక మార్గం.

లేకుంటే అతనికి ఈమె కావలని వచ్చిందా? కేశవపిళ్ళై తన ముద్దు కోరికను కాదనడని ఆమెకు తెలుసు. ఒక్క ముద్దు అనేక రూపాలు తాల్చగలదని అతనికి తెలుసు. కేశవపిళ్ళై మళ్ళీ ఆమె వలలో చిక్కుకున్నాడు.

ఆమె ముఖంలోని దుఃఖ విషాదచ్ఛాయలు తొలిగి పోయాయి. మాత జ్యోతిర్మయీ దేవి తృప్తి పడింది. ఆశ్రమ విశేషాలు తీరికగా వివరంగా కేశవపిళ్ళైకు చెప్పుకుంది. ఇలా కాకుంటే మరోలా సంభాషణ సమాప్తమయ్యేదని కేశవపిళ్ళైకు తెలుసు. అందువల్ల అతనికి ఆ కథ వినాలన్న కుతూహలం లేదు.

"నీవిక హాయిగా వుండే మార్గం చెప్తాను. చాలా?" అన్నాడు.

మాత జ్యోతిర్మయీదేవి నాజూకుగా సమాధానం చెప్పింది: "నాకదేం అక్కర్లేదు. నా బతుకు తెరువు నేను చూచుకోగలను."

కేశవపిళ్ళైకు అందులో సారాంశం అర్థం కాలేదు.

"అయితే నీతోటి అనాథలను కూడా పోషించాలంటావా?"

"ఏమయినా సరే, వాళ్ళను నేను వదిలిపెట్టను." అన్నది జ్యోతిర్మయీదేవి.

కేశవపిళ్ళై గంభీరంగా అన్నాడు: "ఇది చాలా కష్టమే. అయితే వాళ్ళను కూడా నన్ను పోషించ మంటావ్."

"సరే అయితే. ఆ ఆశ్రమాన్ని స్వాధీనం చేసుకోవాలని వుందా?" అని అడిగాడు.

అనాథ వనితా మందిరం ఒకటి ఏర్పడాలని జ్యోతిర్మయీ దేవి కోరిక. దానికి కూడా ఏదో మార్గం చూస్తానని అన్నాడు కేశవపిళ్ళై. "అంతే కదా! మరి దిగులంతా తీరిపోయిందా?" అని అడిగాడు.

దరహాసంతో జ్యోతిర్మయీ దేవి "తీర లేదు" అన్నట్టుగా తలవూపింది.

"ఇంకా చెప్పవలసిన విషయాలు చాలా వున్నాయి."

"అలాగా? చాలా వున్నాయా? ఎన్ని పగళ్ళు, ఎన్ని రాత్రిళ్ళు చెప్పాలో?" అన్నాడతను పసిపిల్ల వాడిలా.

"జీవితాంతం - " జ్యోతిర్మయి నాలుకదాకా మాట వచ్చింది. కాని బయటికి రాలేదు. అలా కబుర్లు చెప్పుకునే సమయం ఇంకా రాలేదని ఆమెకు అనిపించి వుంటుంది. గంట గొట్టినట్టు నవ్విందామె. వెంటనే ఆమె పుట్టెడు దిగుల్లో మునిగిపోయింది. ఆమెకు ఉన్నట్టుండి ఏదో గుర్తు వచ్చినట్టుంది. అన్నీ చెప్పే సమయం ఇంకా రాలేదు. కనుక అంతా ఒక్కసారి చెప్పటం సాధ్యం కాదు.

కేశవపిళ్ళై ముఖం తడుముతూ అన్నదామె: "ఇలా కలుసుకున్నప్పుడు మనం ఎంతెంత కాలం గడిపేవాళ్ళం?"

అది యథార్థమయిన విషయం. వాళ్ళ చిరకాల సంబంధంలో ఇలా క్షణిక సమాగమం ఎన్నడూ జరగలేదు.

"అవును, నీవు రాక్షసిలా వుండేదానివి. నేను భయపడే వాణ్ణి గదూ?"

కొంచెం ఆగి కొంచెం కోపంతో అతనడిగాడు: "ఈ రోజు మనం కలుసుకున్నట్టుగా నీవు మరెవ్వరితోనయినా కలుసుకున్నావా?"

కేశవపిళ్ళై తన ప్రశ్నకు సమాధానం కోసం జ్యోతిర్మయీ దేవి వైపు ఉత్సాహంతో చూస్తున్నాడు. ఆమె మొహం తెల్లబోలేదు. ఆమె ముఖం మీద తియ్యని చిరునవ్వు చిందులాడింది. "లేదు" అన్నట్టుగా మాత జ్యోతిర్మయీ దేవి తల వూపింది. కేశవపిళ్ళై అంతటితో వదల్లేదు:

"రామచంద్రన్ నాయరుతోనే?"

ఆ ప్రశ్నకు కూడా మాత జ్యోతిర్మయీదేవి నిషేధాత్మకంగా తలవూపి సమాధానం చెప్పింది.

"ఆ చిన్న స్వామి అనే యువకుని సాంగత్యంలోనే?"

దానికి సమాధానంగా కూడా ఆమె నిషేధాత్మకంగా తలవూపింది. కేశవపిళ్ళై అన్నాడు:

"నీవు ఈ ప్రశ్నకు నిజమైన సమాధానం చెప్పటంలేదు."

"లేదు. ఇది నిజం" అని జ్యోతిర్మయీదేవి ఒట్టు పెట్టుకున్నట్టు గట్టిగా చెప్పింది.

"అయితేమరి నీవు అమ్మనూ, నాన్ననూ వదిలిపెట్టి ఆ రామచంద్రన్ నాయరుతో అన్నాళ్ళు ఎందుకు కాపురం చేశావు?"

కేశవపిళ్ళై ఆ విషయాలన్నీ తెలుసుకుందామనే కోరికతో ఉబలాటంతో అడుగుతున్నాడు. ఈ కోరిక, ఈ ఉబలాటం ఎన్నేండ్ల నుంచో ఏదిగుళ్ళ యెడార్లలోనే దాగి వుంది. మెట్టు మీద మెట్టు పైకి ఎక్కాలనే ఆలోచనల్లో యీ వ్యక్తిగత కష్టాలు తలయెత్త లేదు. ఈనాడు అవి తలయెత్తుతూ వున్నాయి. ఒక సామాన్య వ్యక్తి భార్య, కాదు ప్రియురాలు మరోవాడి చేతికి చిక్కితే అది యెలా జరిగింది, ఎంతవరకు సాగింది అని తెలుసుకోవాలనుకోవటం సహజం. ఈ విషయమై యింతవరకూ కేశవపిళ్ళై విచారణ ఆరంభించలేదు. అది యీ రోజు జరుగుతూవుంది.

మాత జ్యోతిర్మయీ దేవి మరో ప్రశ్న అడిగింది. ఆ ప్రశ్నలో ఉపాలంభచ్ఛాయ వుంది.

"ఇవన్నీ నన్ను ఈ రోజే అడగాలా?"

"ఆ రోజు అడిగితే కాలదన్ని గెంటేసే దానివిగదా?"

"అయితే అంతకంటె గట్టిగా నా బుగ్గమీద కొట్టవలసింది" అన్నదామె కామపూరితమైన నవ్వుతో అతని బుగ్గలు గిల్లుతూ.

"అవునవును. నిజమే."

"అవును. నన్ను కొట్టి, తిట్టి, కాలికింద నలిపేస్తే బహుశా నేను బాగు పడేదాన్ని." అన్నది జ్యోతిర్మయీ దేవి.

ముఖ్యమైన తాళపు చెవి దొరికిందనిపించింది కేశవపిళ్ళైకు. ఆమె చెప్పింది అబద్ధం కాదు. నిజం అందులో సూక్ష్మంగా ప్రకాశిస్తూ వుంది. ఆనాడు తప్పుదారి పట్టిన తంకమ్మ విషయంలో ధైర్యంగా కలగజేసుకుని వారించిన వాళ్ళెవరూ లేరు. తను కూడా అలాంటి ప్రయత్నం ఏమీ చెయ్యలేదు.

"నన్నెవ్వరూ కాదనలేదు. నేనొక మార్గంలో వెళ్ళాను. ఆ మార్గంలో అందరూ నన్ను బాధించిన వాళ్ళే". అన్నదామె.

'అందరూ' అనటంలో ఆమె వుద్దేశ్యం ఏమిటి? అది కేశవపిళ్ళైకు అర్ధమయింది. మాత జ్యోతిర్మయీ దేవి కొంచెం ఆగి మళ్ళీ అన్నది: "మీకు నా మీద ఏ మాత్రం ప్రేమలేదు. నేను ఎటుపోతే మీకేం నష్టం అనుకుని నన్ను వదిలేశారు. నేను తప్పుదారి పట్టినా చూస్తూ వూరుకున్నారు. అంతట ఆగమని మాట మాత్రం అన్నారు కారు. పట్టుకొని ఆపలేదు. నేను ఆ దారిన వెళ్ళాను. చెడిపోయాను."

మాత జ్యోతిర్మయీ దేవి దుఃఖం పట్టలేక పోయింది. వెక్కి వెక్కి యేడ్చింది. కేశవపిళ్ళై దిగులుపడి కూర్చున్నాడు. అతనికి అది నిజమేనని తోస్తున్నది. గద్గద కంఠంతో మాత జ్యోతిర్మయీ దేవి అన్నది: "అదిరించి బెదిరించే వాళ్ళు ఎవరూ లేకపోవటం వల్ల నేను చెడిపోయాను."

కేశవపిళ్ళైకు తానేదో తప్పు చేసినట్టనిపించింది. నిజంగా చూస్తే యీ ఐశ్వర్యానికి ఆధారం ఆమే కదా? అవును, కచ్చితంగా ఆమే. ఆమె పట్ల తనకు మితిలేని బాధ్యత వుంది. తన కోసం ఆమె చేయగలిగిందంతా చేసింది. తన కృషి ఫలించింది. తంకమ్మ కేశవపిళ్ళైకు స్వాధీనమయింది. కాదనేందుకు వీల్లేదు. అలా తనకు స్వాధీనమయిన స్త్రీ తప్పుదారిన పడితే తను ఏం చేస్తున్నట్టు? పల్లెత్తు మాటయినా అనలేదు. 'ఏమిటి నీవు చేస్తున్న పని?' అని ఒక్కసారి మందలించను గూడా లేదు. తనపని నెరవేరింది. ఆ తర్వాత ఆమె తప్పుదారిన వెళుతూవుంటే చూస్తూ కూర్చున్నాడు. ఇది న్యాయమేనా? ఇదేనా ధర్మం? అతని అంతరంగంలో ఎవరో అలా ప్రశ్నిస్తున్నారు. దానికి సమాధానం చెప్పుకునేందుకు నేరస్థుడయిన కేశవపిళ్ళై ప్రయత్నిస్తున్నాడు. దండించకుండా, బెదిరించకుండా, కనీసం నీవు తప్పుదారిన ఎందుకు వెళ్తున్నావని అడగకుండా తను ఎందుకున్నానా అని తనను తాను ప్రశ్నించుకుంటున్నాడు. అది మోసం కదా అని ఆలోచిస్తున్నాడు.

మాత జ్యోతిర్మయీదేవి వెక్కివెక్కి యేడుస్తూ మళ్ళీ అన్నది: "మొట్ట మొదట మీరే కదా నన్ను 'స్త్రీ'గా గుర్తించి చేరదీసింది?"

"అది కూడా నిజమే" అప్రయత్నంగా అతని నోట వెలువడింది ఆ వాక్యం. "నీకు నేను అపచారం చేశాను." అన్నాడు.

ఆ తర్వాత అతని ఆలోచన మరోవైపు వెళ్ళింది. ఆమె పట్ల చాలా అపచారం జరిగింది. పెండ్లి సంగతి ఆమెకు చెప్పకుండా దాచాడు. అయినా ఆమె వల్ల లాభం పొందేందుకు ఆమెను ప్రేమిస్తున్నట్లుగా నటించాడు. అది ఘోరమయిన విశ్వాసఘాతు కత్యం. అది యెంత పెద్ద పొరపాటో కేశవపిళ్ళె ఆలోచిస్తున్నాడు. ఇది అతనికి అప్పుడు తెలియలేదు. కొన్ని సంవత్సరాల తర్వాత ఇప్పుడు ఆలోచిస్తున్నాడు: పెళ్ళి సంగతి ఆమెకు తెలిసి వున్నట్లయితే వాళ్ళ జీవితం ఎలా వుండేదో? అదృష్టం అతనికి కలిసి వచ్చింది. నిచ్చెన మెట్టు మొదటిది ఎక్కిన తర్వాత రెండవ మెట్టు అందేసరికి మొదటి మెట్టు అవసరం లేకపోవటం వల్ల అతనా మెట్టును మరిచిపోయినాడు. ఆ తర్వాత ఈనాటి వరకూ అతనికి ఆ విషయం గుర్తులేదు.

హృదయ పూర్వకంగా ఆమెకు ఈమాట చెప్పి ఆమెను క్షమాపణ కోరుకుంటే ఎలా వుంటుందని కేశవపిళ్ళె ఆలోచించాడు. అతని అంతరంగంలో అలాంటి ఆవేశం బయలుదేరింది. కాదు, అప్పుడే చెప్పగూడదు.

కేశవపిళ్ళె యేమీ మాట్లాడ లేదు. కాని నిజం చెప్పాలనే ఆశయం అతని ముఖంలో కనిపిస్తున్నది.

"నా మీద ప్రేమ లేదుకదూ? నిజం చెప్పండి."

"ఎందుకు నీవలా అడుగుతున్నావ్?" అన్నాడు కేశవపిళ్ళె.

జ్యోతిర్మయీదేవి గట్టి నమ్మకంతో సమాధానం చెప్పింది: "లేదు. మీకు నా మీద ప్రేమ లేదు. జ్ఞాపకం చేసుకోండి. ఎప్పుడయినా మీరు నన్ను మనసారా గట్టిగా ముద్దు పెట్టుకున్నారా? ఈ రోజులాగా నన్నెప్పుడయినా గాఢంగా కౌగిలించుకున్నారా? నా మీద మీకు ప్రేమ లేదు. అబద్ధం చెప్పకండి."

"ఇవాళ నీ మీద ప్రేమ వున్నట్టనిపించిందా?" అని అడిగాడు కేశవపిళ్ళె.

సిగ్గుతో చిరునవ్వు చిందుతూ జ్యోతిర్మయీదేవి తల వూపింది. 'అవున'ని స్పష్టంగా చెప్పలేదు.

ఆమె మరో ఇరుకు ప్రశ్న వేసింది: "నన్ను పెళ్ళి చేసుకుంటానని ఎప్పుడయినా అన్నారా?"

కేశవపిళ్ళె సమాధానం చెప్పలేని ప్రశ్న అది. మరో ఎదురు ప్రశ్న అడిగి అతను తప్పించుకున్నాడు:

"అలా నేననలేదా?"

"లేదు, ఎప్పుడూ అనలేదు."

"ఆ విషయం నువ్వు అడిగి వుండచ్చు గదా?"

ఇలాంటి ప్రశ్నలకు జ్యోతిర్మయీ దేవి వెంటనే సమాధానం చెప్పగలదు. ఆమెకు ఏమీ కష్టమైన పనిగాదు.

"నేను అమాయకురాలిని. నన్ను అదుపులో పెట్టుకునే వాళ్ళెవరూ లేకపోయారు. మీ స్పర్శ నాకు పిచ్చెక్కించేది. ఆ పిచ్చిలో నాకిలాంటివి గుర్తు వచ్చేవికావు. అందుకని నేనడగలేదు."

ఆ మాట కాదనేందుకు వీల్లేదు. కాని అందులో ఏదో లోపముందనిపించింది కేశవపిళ్ళెకు. జ్యోతిర్మయీదేవి తన కథ చెప్పింది: "నేను తప్పు చేశాను. క్షమించేందుకు వీల్లేని తప్పు చేశాను. నా తెలివితక్కువ వల్ల మీకు నా మీద అసహ్యం వేసింది. దానికి కారణం మీరు నాలో చెలరేగజేసిన పిచ్చితనమే. తరవాత నేను మరొకడితో లేచి పోయాను."

"అతని వల్ల నీకు తృప్తి కలిగిందా?" అని అడిగాడు కేశవపిళ్ళె అసహ్యించుకుంటూ.

ఆ ప్రశ్నలోని జుగుప్సాభావం జ్యోతిర్మయీ దేవికి అర్థమయినట్టు లేదు. రామచంద్రన్ నాయరుతో ఆనాడు ఆమెకుగల సంబంధాన్ని గురించి కేశవపిళ్ళెకు తొలిసారి అసహ్యం వేసింది. వెనక గోవిందన్ నాయరు, తర్వాత శేఖరపిళ్ళెవల్ల, భాగీరథీ అమ్మ వల్ల ఆ సంబంధాన్ని గురించి అన్ని విషయాలూ తెలుసుకున్నా అతనికి అసహ్యం కాని ద్వేషంకాని కలగలేదు. ఏదో మామూలు వార్తగా అది విన్నాడు. గోవిందన్ నాయరుకు కోపం వచ్చి వెళ్ళిపోయినాడు కూడాను. ఈనాడు అసహ్యించుకోవటానికి కారణమేమిటి? నిజానికి ఈ రోజు కేశవపిళ్ళెకు ఆ సంబంధం మనస్కరించటం లేదు. ఈ మనస్థితిని అర్థం చేసుకోకుండానే జ్యోతిర్మయీ దేవి సమాధానం చెప్పింది:

"అందరూ మంచివాళ్ళే. అతనికి కూడా నేను ఒక పనిముట్టుగా పనికి వచ్చాను. అతనికి కూడా నా మీద ప్రేమ లేదు. నిజానికి మీరు నాకు పిచ్చెక్కేట్టు చేశారు. దానితో నా జీవితం నాశనమయింది. ఎవ్వరూ నన్ను ప్రేమించలేదు."

కేశవపిళ్ళెకు తృప్తి కలగలేదు. "అతను పెళ్ళి చేసుకుంటా ననలేదా?" అని అడిగాడు.

జ్యోతిర్మయీ దేవి వెంటనే సమాధానం చెప్పింది: "లేదు. ఈనాటి వరకూ ఎవరూ ఆ మాట అనలేదు."

"పోనీ నీవతన్ని అడగలేదా?"

జ్యోతిర్మయీ దేవి ఆ విషయాన్ని గురించి చెప్తే చాలా చెప్పాలి. అప్పటికి ఆమె జీవితాన్ని చాలా అర్థం చేసుకుంది. ఆమె పెళ్ళి సంగతి యెత్తింది. కాని ఆ ప్రశ్నలు రామచంద్రన్ నాయరుకు రుచించలేదు. సమాధానం చెప్పకుండా అతను తప్పించుకుని వెళ్ళిపోయాడు. జ్యోతిర్మయీ దేవి కథను

ఇలా ముగించింది: "నేను బలవంతం చేసేసరికి ఆ సంబంధమే తెగిపోయింది. నృత్యం, సంగీతం తెలిసిన అమ్మాయిని అతను పెళ్ళి చేసుకున్నాడు.

కేశవపిళ్ళె తృప్తి పడ్డాడు. చాలా విషయాలు అతనికి తెలిశాయి. అతని ఆలోచనలు మనస్సును కెల్లించి విచారగ్రస్తం చేశాయి. జీవితానికి ఆధారభూతమైన మనస్థితి చలిస్తున్నట్టు అనిపించిందతనికి. ఒక పెద్ద చిక్కు వచ్చి పడింది.

చాలా సేపు ఇద్దరూ ఏమీ మాట్లాడలేదు. జ్యోతిర్మయీ దేవికి ఒక కోరిక వుంది: "మీ చేతుల్లో నిశ్చింతగా ఒక్కరాత్రి పడుకొని నిద్రపోనిస్తారా?"

ఆమెను దగ్గరకి లాక్కొని ముద్దు పెట్టుకొని కేశవపిళ్ళె అన్నాడు: "నిద్రపోనియ్యను."

## ముప్పై యెనిమిది

ఇలా ప్రేమ విశ్వాస పూరితమైన జీవితం పార్కువ్యూలో ఇంతకు ముందెప్పుడూ కనిపించలేదు. ఇక్కడి జీవితంలో చీకూ, చింతా యేమీ లేదు. కానీ ఎక్కడికక్కడ సమాధానపరుచు కోవటం మాత్రముంది. నవ్వుతూ కులాసాగా కాలం గడపవచ్చు. చౌకరకపు నవ్వుకాదు. పరస్పరానురాగంతో, ఆవేశంతో కూడిన నవ్వు. నిజానికి ఇది యిక్కడ కాపురం చేసే భార్యా భర్తలకు శోభనంరాత్రి.

ఇంత వయసు వచ్చినా ఆ భార్యాభర్తల ప్రేమావేశం తగ్గలేదు. ఒకటే విశేషం. యువతీయువకుల శోభనం రాత్రిలాగా అందులో చులకదనం లేదు. నేడో రేపో నిజం బయట పడగానే ఒకరినొకరు దూషించుకొని విడిపోయే స్వభావం వాళ్ళ ఆవేశంలో లేదు. పెళ్ళయిన తర్వాత ఇన్ని సంవత్సరాలకు పిల్లలు కూడా పుట్టిన తర్వాత శోభనం రాత్రి యేమిటి? అవును. శోభనం రాత్రే. కామవాంఛ తీర్చుకునే శోభన రాత్రి కాదు. ఒక పురుషుడికి ఒక స్త్రీ లభించింది. ఒక స్త్రీకి ఒక పురుషుడు దక్కాడు. ఆ తర్వాతి శోభన రాత్రి కాదది.

మరో విషయం, వాళ్ళకు దేన్ని గురించి కూడా విచారం లేదు. వాళ్ళకు లేని దంటూ లేదు. డబ్బు, అధికారం అన్నీ వున్నాయి. పరిపూర్ణమైన తృప్తికి కావలసినవన్నీ వున్నాయి. పెళ్ళయిన తర్వాత కొన్ని సంవత్సరాలు గడిచాక పిల్లలు పుట్టి జీవితం భారమయినప్పుడు భార్యాభర్తలు ఒకరిమీద ఒకరు నేరాలు మోపుకుంటూ వుంటారు. ఒకరికొకరు మనస్సు యిచ్చి శోభనం రాత్రి హాయిగా గడపవలసిన వాళ్ళు ఒకరితో ఒకరు పోట్లాడు కుంటారు. ఇక్కడ అలాంటి దేమీ లేదు. కాత్యాయనీ అమ్మకు కావలసిందల్లా ప్రేమ. ఆమె ప్రేమ కోరింది. అది ఆమెకు లభించింది.

కేశవపిళ్ళై కాత్యాయనీ అమ్మను అర్థం చేసుకున్నాడు. ఇక వాళ్ళ యింట్లో ఆనందమే ఆనందం.

కానీ ఉన్నట్టుండి ఆ యింటిలోని ఆనందానికి ఏదో ఆటంకం ఏర్పడ్డది. తలవని తలంపుగా హఠాత్తుగా అలా అయింది. ఎవరూ అలా అనుకోలేదు. ఆ దంపతులు జీవితంలో గౌరవానికి, విరోధానికి సంబంధించిన పరీక్షలను ఎన్నింటినో ఎదుర్కొన్నారు. ఏ విధమయిన సంఘర్షణ కూడా వాళ్ళకు కొత్తది కాదు. నల్ల మబ్బు ఉన్నట్టుండి కమ్ముకున్నది. బహుశా కేశవపిళ్ళై హృదయంలో ఏదో మారుమూల ఇంతవరకు ఎవరికీ తెలియకుండా దాగి వున్నది యేదో అనుకూల పరిస్థితికోసం ఎదురుచూస్తూ వుండి వుంటుంది. జీవితంలో తొలిసారి కాత్యాయనీ అమ్మ ముద్దు కోరినప్పుడు కేశవపిళ్ళై ముఖం ముందుకు పెట్టగానే అతనికి మరో ముఖం కనిపించింది. ఆ ముఖాన్ని తొలగించి కాత్యాయనీ అమ్మ ముఖాన్ని చూచేందుకు అతను కొంచెం సేపు కళ్ళు మూసుకొని మళ్ళీ తెరిచాడు. అలా యెలా జరిగింది? అతను తంకమ్మను మరిచిపోయినాడు కదా? బహుశా కేశవపిళ్ళై తన భార్యను అర్థం చేసుకొని ఆమెను గుర్తించేసరికి కప్పిపుచ్చిన అభిలాష మళ్ళీ తలయెత్తేందుకు కాలదోషం పట్టి వుంటుంది. ఆ తర్వాత అతను ముద్దు పెట్టుకొని వుంటాడు. ఇప్పుడు మళ్ళీ ఆ అభిలాష తలయెత్త సాగింది.

కేశవపిళ్ళై కన్యాకుమారి నుంచి కొంత మార్పుతో తిరిగి వచ్చాడు. విప్పారిన నవ్వుతో స్నానం చేసి చిక్కుదీసుకుంటూ కాత్యాయనీ అమ్మ గుమ్మం దగ్గరకి వచ్చి నిలబడ్డది. కారు దిగిన కేశవపిళ్ళై బలవంతంగా నవ్వాడు. అవును, నవ్వేందుకు ప్రయత్నించాడు. జరిగినదంతా దాచేందుకు చేసిన ఆ ప్రయత్నం ఫలించలేదు., ఆ నవ్వు కూడా నిష్ప్రయోజనంగా నీరయిపోయింది. ఎందుకో కానీ కాత్యాయనీ అమ్మ చప్పబడిపోయింది. ఆ నవ్వు పోయింది. అలసట వచ్చేసింది. కాత్యాయనీ అమ్మ అతనిలో అలాంటి భావ భంగిమలు బహుశా అంతకు ముందు ఎప్పుడూ చూడలేదు.

"ఒకరోజు ఆలస్యమయింది" అని చెప్పాలని అనుకున్నాడతను. కాని ఆ వాక్యం లోపలనే వుండిపోయింది. కేశవపిళ్ళై చాలా అలసిపోయినట్టు కనిపిస్తున్నాడు. నిజంగా కూడా అతనికి చాలా అలసటగా వుంది.

"ఒక రోజు ఆలస్యమయింది" - అన్నాడతను. అదికూడా, అసలు విషయం దాచేందుకు చేసిన ప్రయత్నం. కాత్యాయనీ అమ్మ నీరసంగా భర్త వెంట వెళ్ళింది

లోపలికి వెళ్ళి ఆయన బట్టలు మార్చుకున్నాడు. కాత్యాయనీ అమ్మ అక్కడే నిలబడివుంది.

"నాకు కాఫీ కూడా ప్రాప్తం లేదా?"

ఈ ప్రశ్నలో కొంచెం బెదిరింపు, దోషారోపణ వున్నట్టు కాత్యాయనీ అమ్మకు తోచింది. లోలోపల ఏదో ఆవేదనగా వుంది. నిజమే. బట్టలు మార్చుకునే సరికి కాఫీ తెచ్చి వుండవలసింది. ఈనాటి వరకూ ఆమె అలాగే చేస్తూ వచ్చింది. జీవితంలో ఆమె వల్ల జరిగిన మొదటి పొరపాటది. ఈ పొరపాటు ఎలా జరిగిందో ఆమెకు తెలియదు. ఆమె తనను తానే తిట్టుకుంది. మొత్తం మీద ఇది తప్పే.

అప్పటికి కేశవపిళ్ళై చిరునవ్వుతో ప్రేమను అభినయిస్తూ అన్నాడు: "వెళ్ళి ఒక కప్పు కాఫీ తీసుకురా."

ఆ చిరునవ్వు, ప్రేమ యిప్పుడు నటనే. మనస్సులో ఒకటి, బయటికి ఒకటి - కాత్యాయనీ అమ్మ ఇంతవరకు ఇలాంటి భావం చూడలేదు.

కాత్యాయనీ అమ్మ కీలు బొమ్మలాగా కాఫీ తెచ్చేందుకు వెళ్ళింది. తన మనస్సు తనను వంచిస్తూ వున్నదని కేశవపిళ్ళైకు అనుమానం వేసింది. అలసటగా కనిపించటం, కొంచెం బెదిరించటం, ఆ తర్వాత ఆపేక్షను అభినయించటం - ఇవన్నీ అబద్ధానికి హంగులు. మూడు రోజులు ముందు ఎలా వున్నాడో అలాగే కులాసాగా కబుర్లు చెప్తూ తమాషాగా మాట్లాడుతూ వుంటే బాగుండేది. అలా ఎందుకు ఉండలేక పోయాడు? మళ్ళీ కాత్యాయని వచ్చేలోగా అలా ఉండేందుకు ప్రయత్నించాడు. ఆమె చిన్నబోయింది. మొహం దిగులుగా వుంది. ఆమెను నవ్వించి ముద్దాడి హుషారు చెయ్యాలనుకున్నాడు.

కాత్యాయనీ అమ్మ కాఫీ తీసుకుని వచ్చింది. కాఫీ తాగుతూ కేశవపిళ్ళై ఒక గంభీరమైన విషయం చెప్పాడు: "ప్రాంతీయ పునర్విభజన జరగటంలో ఏదో కొంత గొడవ అయ్యేటట్టుంది. ఇప్పుడే ఆ ఫైలు చూస్తే తెలిసింది."

ఆమెకు ఆ విషయంలో అభిరుచి లేకపోయినా అభిరుచి చూపిస్తున్నట్టు ఆమె అడిగింది: "అలాగా? అంటే?"

కేశవపిళ్ళై వివరంగా చెప్పాడు:

"మలబారు కూడా తిరువితాంకూరు, కొచీన్‌తో కలిసి కేరళ ప్రాంతం ఏర్పడుతున్నది. మలబారువాళ్ళు చాలామంది మద్రాసు ప్రాంతంలో వుద్యోగం చేస్తున్నారు. వాళ్ళంతా యిక్కడికి వచ్చేస్తారు. వాళ్ళల్లో ఇద్దరు - అందులోనూ ముఖ్యంగా ఒకరు - నా కంటె ఎక్కువ జీతం తీసుకుంటున్నాడు. కాని సెక్రటరీ పదవిలో ఉన్నాడు. ఉద్యోగ రీత్యా అతను నాతో సమానం కాదు. కాని అతను ఇటువైపు రావాలని నిశ్చయించుకున్నాడు. అతను వస్తే అతన్నే చీఫ్ సెక్రటరీ చేస్తారేమో? అతనికి అలాంటి అధికారం వుంది. ఫైలు జాగ్రత్తగా చదివిన తర్వాత నాకా విషయం తెలిసింది."

కాత్యాయనీ అమ్మకు అది కొత్త విషయం కాదు. "ఇది మీరిది వరకు ఒక రోజు చెప్పారు గదా?" అన్నదామె.

కేశవపిళ్ళై ఏదో కొత్త విషయం చెప్పాలని చెప్తున్నాడు. కాత్యాయనీ అమ్మ సమాధానం అతని భావాలను భంగపరచింది. కాత్యాయనీ అమ్మ కంఠస్వరం ఆ విషయం అతననుకున్నంత గంభీరం కాదని సూచిస్తున్నది. కాని అది అలా వదిలి పెట్టవలసిన విషయం కూడా కాదు.

"ఫైలు చూస్తే తెలిసింది - ఇందులో ఏదో మడత పేచీ వుందని. ఛీఫ్ సెక్రటరీ పదవి నుంచి తొలిగి పోవలసి వుంటుంది. అదే నాకు బాధగా వుంది. మనస్సు, శరీరం నీరసించి పోయాయి."

కాత్యాయనీ అమ్మ వెంటనే సమాధానం చెప్పింది: "అలాంటి పరిస్థితి ఏర్పడితే రిటైరయి వెళ్ళిపోదామని మీరో రోజన్నారుగా! అలాగే చేద్దాం. అందులో ఇంత బాధపడవలసిన విషయం ఏముంది? ఆ రోజు మీరంత బాధపడ లేదే?"

కేశవపిళ్ళై సమాధానం చెప్పలేక పోయాడు. అతని మనస్సులోని బాధకు ఇది కారణం కాదనే విషయం స్పష్టంగా తెలుస్తూ వుంది.

"అయినా విచారంగా వుండదా?"

కాత్యాయనీ అమ్మ యేమీ మాట్లాడలేదు. ఆమె మౌనంగా వుండటంలో భావం భర్త చెప్పిన కారణం మీద ఆమెకు నమ్మకం లేకపోవటం. కొంచెం సేపు ఆగి ఆమె అన్నది: "ఆ రోజు ఈ మాట చెప్పేప్పుడు మీరేమీ బాధపడలేదు. ఇప్పుడిలా బాధపడటానికి కారణమేమిటి?"

కేశవపిళ్ళైకు ఏం చెప్పాలో తోచలేదు. కొంచెం సేపటికి అతనొక సమాధానం వెదికాడు: "అయినా బాధపడవలసిన విషయం ఒకటి వుంది."

కాత్యాయనీ అమ్మ గంభీరమైన కంఠంతో అన్నది: "నేను నిర్మోహమాటంగా చెప్తున్నాను. కారణం ఇదికాదు. మరేదో వుంది."

కొంచెం ఆగి మళ్ళీ అన్నది: "అసలు నాకివన్నీ ఎందుకు చెప్తున్నట్టు? నాకేమన్నా తెలుసు కాబట్టా?"

అందులోని ఉపాలంభం కేశవపిళ్ళైకు అంతగా నచ్చలేదు.

ఆ కుటుంబంలో పల్చని మాలిన్యం కమ్ముకున్నది. భార్య పక్కనున్న టేబిలు మీద గీతలు గీస్తూ నిలబడి వుంది. భర్త దిగులుతో కూర్చుని వున్నాడు. ఇలా ఒకరితో ఒకరు మాట్లాడకుండా ఇంతసేపు వుండటం ఆ యింట్లో ఎప్పుడూ జరగలేదు. ఇద్దరూ దిగులుతో మౌనంగా వున్నారు.

కేశవపిళ్ళై దిగులుకు కారణం తాను చేసిన అపచార భావం. లేకుంటే మూడు నాలుగు రోజుల క్రితం జరిగిన సంఘటన కాత్యాయనీ అమ్మకు తెలిసి అనుమానిస్తున్నదేమోననే భయం. కాత్యాయనీ అమ్మకు ఆ విషయం తెలిసే అవకాశమేమీ లేదు. ఎవరన్నా చెప్పారేమోనని కూడా అతనికి భయం

వేసింది. అదీకాక మరో విశేషం వుంది. ఇటీవల అతనికి ఒక విశిష్టమైన అనుభూతి యేర్పడింది. అదే రకమైన ప్రపంచం. అదే రకమైన అనుభూతి. అతని మనస్సులో ఒక రకమైన గగుర్పాటు శాశ్వతంగా స్థిరపడిపోయింది. రక్తంలో అది సహజంగా ప్రవహిస్తూ వుంది. ఈ అనుభూతి యింతకు ముందు ఎక్కడ దాగివుంది? ఒక నూతన స్వర్గ ద్వారం తెరుచుకున్నట్టు అతనికనిపిస్తున్నది. జీవితంలో అలాంటి అనుభూతి అనుభవించి తీరాలి. దానికి ఏకైక ప్రతిబంధకం అతని భార్య. ఎదుట నిలబడి వున్న ఆవిడ - ఆమే - ప్రతిబంధకం. ఆమె యెదుట కనిపిస్తూ వుంటే అతనికి కలిగే అసహ్యమే అతని దిగులుకు కారణమేమో?

కేశవపిళ్ళై యింతసేపు దిగులుగా మౌనంగా ఇంతకుముందు ఎన్నడూ కూర్చోలేదు. ఫైలు చూచేప్పుడూ, ఏదన్నా రాసుకునేప్పుడూ కాత్యాయనీ అమ్మ పక్కనే ఉండేది. మధ్య మధ్యలో అతను లేచి ఆమెను ముద్దు పెట్టుకుంటూ వుండేవాడు. లేకుంటే ఆమె బుగ్గమీద చిటికె వేసేవాడు. వేలు గుచ్చేవాడు. లేకుంటే ఎత్తుకొని తిరిగేవాడు. లేకుంటే ఏదో చెప్పి రెచ్చగొట్టేవాడు. ఏమీ లేకుంటే ఎవో కబుర్లు చెప్పేవాడు. అంతేకాని ఇలా మాట్లాడకుండా నిశ్శబ్దంగా అతనెప్పుడూ కూర్చోలేదు.

కాత్యాయని అమ్మ వెక్కివెక్కి యేడుస్తూ వెనక్కు వెళ్ళి పోయింది. అలా యేడవవలసిన కారణమేమిటి? భర్త చాలా సేపటినుంచి ఏదో ఆలోచిస్తూ మౌనంగా కూర్చున్నాడు. అంతేకదా? దానికి ఏడవటమెందుకు? ఏమయిందని? తన భార్యకు ఆ విషయం ఎలాగో తెలిసి వుంటుందని కేశవపిళ్ళైకు భయం. సందేహం భయంగా మారింది. అతను లోపలికి వెళ్ళి కాత్యాయనీ అమ్మను కౌగిలించుకున్నాడు. "ఏమిటిది? ఏమిటీ పిచ్చి?"

కాత్యాయనీ అమ్మ యేమీ మాట్లాడలేక పోయింది. అతనే మళ్ళీ అన్నాడు: "ఇంతకు ముందెప్పుడూ ఇలా జరగలేదు. ఎందుకిలా వున్నావ్? నేను ఇంటికి రానప్పుడు కూడా నీవిలా ఏడవలేదు. ఇప్పుడెందుకిలా యేడవటం?"

కేశవపిళ్ళై కాత్యాయనీ అమ్మ చేతులు తొలగించి కన్నీరు తుడిచాడు. ముద్దు పెట్టుకున్నాడు. అతని ముఖం, పెదవులూ కన్నీటితో తడిసి పోయాయి. అప్రయత్నంగానే అతను మొహం తుడుచుకున్నాడు. అది తప్పని అతనికి తోచింది. పతనాన్ని కూడా అతను ఉన్నతిగా భావించాడు. కృత్రిమంగా నవ్వుతూ అతనన్నాడు: "ఆహా! ఉప్పగా ఉంది."

ఆ తర్వాత భార్యను చేతితో పట్టుకొని కూర్చోబెట్టాడు. తను కూడా పక్కనే కూర్చున్నాడు. వీపు నిమురుతూ అడిగాడు: "ఏమిటీ పిచ్చి? ఎందుకేడవటం?"

కాత్యాయనీ అమ్మకు కూడా ఆ విషయం తెలియదు. "ఏడుపు వచ్చింది." అన్నది.

"ఏడుపు ఎందుకు వచ్చింది - అని అడుగుతున్నాను."

"నాకేదో భయంగా వుంది" అన్నది కాత్యాయనీ అమ్మ.

"భయమా? ఎందుకు?"

"ఎందుకో తెలియదు."

అతను భార్యను కౌగిలించుకున్నాడు. అందులో బిగువు తనం లేదు. కాత్యాయనీ అమ్మకు బిగువు అనిపించలేదు.

ఆ రోజు రాత్రి పార్కువ్యూ పడకగదిలో వ్యాపించిన అప్రసన్న వాతావరణాన్ని తొలిగించేందుకు ప్రయత్నం జరుగుతూవుంది. కాత్యాయనీ అమ్మ తనలోని అకారణ భయాన్ని పోగొట్టు కొనేందుకు ప్రయత్నిస్తున్నది. కాని అది పోవటంలేదు. కన్యాకుమారిలో జరిగిన వృత్తాంతం కాత్యాయనీ అమ్మకు తెలియలేదనే విషయం మాత్రం స్పష్టంగా తెలుస్తూనే వుంది. ఒకవేళ ఆమెకు తెలిసివుంటే ఈపాటికి చెప్పివుండేది. మరి యీమె ఎందుకింత నీరసించి పోయింది? అని కేశవపిళ్ళె తనలో తాను ప్రశ్నించుకుంటున్నాడు. ఆ ప్రశ్నకు ఒకే ఒక సమాధానం వస్తున్నది."

"తప్పకుండా ఏదో మార్పు జరిగి వుంటుంది."

కేశవపిళ్ళెలో వచ్చిన మార్పు అతనికే తెలియటం లేదు. అతను వెనకటిలాగా మామయీలు భర్తగా వ్యవహరించాలని పూర్తిగా ప్రయత్నిస్తున్నాడు. కాని సాధ్యం కావటం లేదని అతనికి కూడా తెలుసు. కాత్యాయనీ అమ్మను నవ్వించి ఆమెకు ఆనందం కలిగించేందుకు ఎంత ప్రయత్నించినా ఫలించటం లేదు.

ఏదో కారణం వెతకాలి. ప్రాంతీయ పునర్విభజన తర్వాత తన వుద్యోగం విషయంలో ఏదో గందరగోళం జరుగుతుందని చెప్పి నచ్చ చెప్పాలని నిశ్చయించుకున్నాడు కేశవపిళ్ళె. అదొక్కటే మార్గం కనిపిస్తున్నది. అందులో కొంత నిజం కూడా వుంది. ఛీఫ్ సెక్రటరీ పదవి కోసం మలబారు వాళ్ళల్లో అందరి మద్దతు తీసుకొని ఎవరయినా యిక్కడికి రావచ్చు. మలబారు వుద్యోగస్థు లందరూ మద్రాసు నుంచే వస్తారు. ఇంగ్లీషు వాళ్ళ దగ్గర పనిచేశామని వాళ్ళకు గర్వం. వాళ్ళు పోరాడి తీరతారు. కేశవపిళ్ళె యీనాటి సమస్య కాని కథను కల్పించి దాన్ని సవిస్తరంగా వర్ణించాడు.

"స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచీ యింతవరకూ ఏర్పడని విషమ పరిస్థితి యిప్పుడు ఏర్పడ బోతున్నది. ఈ మలబారు వాళ్ళు కలిసి కూడగట్టుగా పోరాడతారు. అక్కడి కాంగ్రెసు నాయకులూ, సామ్యవాదులూ, పి.యస్.పి. వాళ్ళూ తమ శాఖకు చెందిన వుద్యోగస్థుడి విషయం వస్తే అందరూ ఏకమవుతారు. తిరు-కొచిన్ లాగా కాదు.

"ఆ రోజు 'ఏమయితే అదికానీ' అన్నారు కదా? ఆ రోజు ఈ భయం ఎక్కడికి పోయింది?" అన్నది కాత్యాయనీ అమ్మ.

"ఇప్పుడంత కంటె గంభీరమైన పరిస్థితి ఏర్పడింది. చెన్నపట్నం నుంచి వచ్చే వాళ్ళకు మనం గిట్టం."

కాత్యాయనీ అమ్మ గట్టిగా అన్నది: "ఏమయినా చెప్పండి, ఇదేమీ కాదు. అసలు విషయం వేరేవుంది. ఉద్యోగం పోతే పోనియ్యండి. మనకు తిండికి బట్టకూ లోటు లేదు. హాయిగా బతకగలం."

"మరి అమ్మాయి పెళ్ళి సంగతి? ఉద్యోగంలో వుంటే మంచి సంబంధం దొరుకుతుంది. లేకుంటే అది సాధ్యం కాదు." అన్నాడు కేశవపిళ్ళె.

కాత్యాయనీ అమ్మకు ఒక నమ్మకముంది: "అదృష్టం ఎలా వుంటే అలా అవుతుంది. లేకుంటే ఏమీ లేదు." ఆమె ఎప్పటిలాగానే కేశవపిళ్ళె ఫైళ్ళు చూచుకునేప్పుడు పక్కనే కూర్చుంటూంది. కాని మౌనంగా కూర్చుంటూంది. వాగ్వాదంకాని, ద్వేషం కాని, దెప్పి పొడవటంకాని ఏమీ లేదు. ఏదో నష్టమయినట్టు అనిపిస్తూంది. కొన్నాళ్ళు ఇలాగే జరిగితే కాత్యాయనీ అమ్మ క్రమంగా ఇలాంటి పరిస్థితికి అలవాటుపడి పోతుందని కేశవపిళ్ళె అభిప్రాయం. అదే తృప్తిగా వుంటుంది. ఉల్లాసం, హాసం, వ్యంగ్యం – ఇవన్నీ ఏమీ వుండవు, అంతే. నాలుగయిదు రోజులు అలాగే గడిచాయి. ఒక రోజు కేశవపిళ్ళె పార్కువ్యూ ఉద్యాన వనంలో తిరుగుతున్నాడు. అతని వెంట కాత్యాయనీ అమ్మ ఛాయలా అనుసరిస్తూవుంది. కాని ఆ దృశ్యం మౌనంగా వుంది.

కాత్యాయనీ అమ్మ దీనంగా అన్నది: "ఇప్పటివరకూ మనం ఇలా వుండలేదు".

కేశవపిళ్ళెకు హృదయంలో కొంత బాధ కలిగింది. ఆరోజుల్లో ఎంత సేపు మాట్లాడుకున్నా తనివి తీరేదికాదు. కాని యీ కొత్త అలవాటును నిలబెట్టేందుకు అతనన్నాడు: "మనం ముసలివాళ్ళమయిపోలేదా? ఇంకా పసిపిల్లలమా?

వెంటనే అశ్రుపూరితమైన సమాధానం వచ్చింది:

"నేను వయస్సులో వున్నప్పుడు ఇలాంటివేమీ లేవుగదా?"

కృత్రిమ మందహాసంతో కేశవపిళ్ళె అన్నాడు: "అదంతా మనం చాలా అనుభవించాం. ఇంకా చాలలేదా?"

ఆమె మెడమీద చెయ్యి పెట్టి కొంచెం కదిలిస్తూ అతనన్నాడు: "ఇదుగో కాత్యాయనీ, కేరళ రాష్ట్రమొకటి యేర్పడబోతున్నది. చాలా పని వుంది. తిరువితాంకూరు, తిరుకొచిన్ విషయమే వేరు. నాకు చిరాకు కలిగించే సమయం వచ్చింది. ఫైళ్ళు మనస్సును ఫెళ్ళుమని విరిచి వేధిస్తూ వున్నాయి. నీవు విషయం అర్థం చేసుకోకుండా పసిపిల్లలా ప్రవర్తించకు."

ఆ తర్వాత నిజాయితీని, ఆపేక్షను నటిస్తూ అదే ధోరణితో కేశవపిళ్ళై అన్నాడు: "కన్యాకుమారిలో వున్నప్పుడు నాకా విషయం ఎంత గంభీరమయిందో అర్థమయింది. ఆ తర్వాత నాకు మనస్సు సరిగ్గా లేదు. ఇప్పుడు కూడా ఆ ఫైలును గురించే ఆలోచిస్తున్నాను. ఈ మలబారు మేనేన్ వాళ్ళు గొప్ప చెప్పుకుంటూ యిక్కడికి వస్తే గొడవ అవుతుంది. వాళ్ళు చెప్పే మాటలే మనకు బోధపడవు. వెధవ దేశం. అన్నిటికీ కొరతే, కావలసినన్ని స్కూళ్ళు కూడా లేవు. అది అలా వుంచి మద్రాసు నుంచి యీ వుద్యోగస్థులంతా వచ్చి తిరువితాంకూరులో మనవాళ్ళ నెత్తినెక్కి కూర్చుంటారు. అది దిగులు పడవలసిన విషయం కదూ? వచ్చే శనివారం ఆ ఫైలు తీసుకుని నాలుగయిదు రోజులు బయటికి వెళ్ళి రావాలి."

"ఎక్కడికి?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

కేశవపిళ్ళై సమాధానం స్పష్టంగా లేదని తెలిసి పోతున్నది.

"అదా - మరి - పిరుమెడ్‌కో, తెకడంకో."

"ఇక్కడ తిరువనంతపురంలో కూర్చుని చూస్తే సరిపోదూ? అనుమతి దొరకదా?"

కేశవపిళ్ళైకు కొంచెం కోపం వచ్చింది. "అది యెలా సాధ్యమవుతుంది? గవర్నమెంటు పని గదా?"

కాత్యాయనీ అమ్మ కొంచెం సర్దుకుంది. "ఎందుకు నీవిలా అయిపోయినావు?" అడిగాడు కేశవపిళ్ళై.

"ఎలా?"

"ఉద్యోగానికి నీవెప్పుడూ అడ్డురాలేదే?"

"నేను దేనికీ అడ్డురాను. నేను దేనికీ అడ్డురాలేదు. ఇక్కడ నేను వుండను. వెళ్ళిపోతున్నాను." అన్నది కాత్యాయని కన్నీరు కారుస్తూ. ఏడుస్తూ లోపలికి వెళ్ళిపోయింది.

× × × × ×

మూడు సముద్రాలు కలిసే సంగమ స్థలం ప్రపంచం మొత్తంలో అపూర్వమైన స్థలం. అక్కడ ప్రేయసీ ప్రియులు కలుసుకున్నారు. అయినా సహ్యాద్రి కొండల్లోని ఉద్యానవనాన్ని వాళ్ళు సంకేత స్థానంగా ఎన్నుకున్నారు. కేశవపిళ్ళై కాత్యాయనీ అమ్మ వైపు చూడకుండానే లేక ఆమెను చూచేందుకు మొహం చెల్లకనే 'నాలుగయిదు రోజులు రాను' అని చెప్పి కారులో కూర్చున్నాడు. కాత్యాయనీ అమ్మ గుమ్మం దగ్గర నిలబడి అశ్రుపూరిత నయనాలతో, కారు కదులుతూ వుంటే చూస్తూ వుంది. తనను వదిలిపెట్టి అతను ఎక్కడికో వెళుతున్నట్టు అనిపించిందామెకు. అదుపు, నిలుపు లేకుండా కారు రివ్వున వెళుతూవుంది. భార్య నిలబడి వుండటం కేశవపిళ్ళై చూచాడు. వెనక్కి తిరిగి చూడాలని అతను చాలాసార్లు

అనుకున్నాడు. కాని వెనక్కి తిరగలేదు. దూర దేశం వెళ్ళేప్పుడు అలా యెప్పుడూ జరగలేదు. కారు మలుపులన్నీ తిరిగి కంటికి కనిపించకుండా వెళ్ళిపోయింది. కాత్యాయనీ అమ్మ పైట చెంగుతో మొహం కప్పుకొని లోపలికి వెళ్ళి పోయింది. జీవితంలో తొలిసారి తనకు శాశ్వతమైన యెడబాటు కలిగినట్టు తోచింది కాత్యాయనీ అమ్మకు.

కేశవపిళ్ళె మనస్సు కూడా సరిగ్గా లేదు. కాని చాలా దూరంలో వున్న పచ్చని బయలు అతన్ని చెయ్యిపట్టి లాగుతూ వుంది. మోటారుకారు వెళ్ళ గలిగినంత వేగంతో వెళుతూ వుంది. అక్కడికి చేరవలసిన సమయం మించి పోతూవుంది.

ఆ అరణ్యంలో ఒక నది వుంది. ఆ నది లూకోస్ టీ తోటలను మధ్యగుండా రాతినేలను పులుముకుంటూ రాచుకుంటూ పగుళ్ళను పెగిలించుకుంటూ పాటలు పాడుకుంటూ ఎక్కడో లీనమై పోతుంది. ఆ రోజు సాయంత్రం ఆ అడవిలో ప్రవహించే నది ఒడ్డున తంకమ్మ, కేశవపిళ్ళె కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. తంకమ్మ కాషాయ బట్టలు వదిలేసింది. ఆమె కొప్పులో మల్లెపూల దండ కొప్పును మించి బరువుగా దిద్దుకుంది. మంచి బట్టలు వేసుకుని ప్రేయసిలా అలంకరించుకుని వచ్చింది.

సెలయేటికి ఆవలి ఒడ్డున నిప్పు కణికల్లాగా విప్పారిన పూలచెట్టు కొమ్మమీద రెండు పక్షులు కూర్చుని సిగ్గుతో ఏమో చేస్తున్నాయి. ముక్కుకు ముక్కు రాచుకుంటూ తలలు నిమురుకుంటూ, మెడలు పూసుకుంటూ వున్నాయి. వాటి ఆవేశం చెప్తే తీరదు. పక్కనే అనుకుని కూర్చున్న తంకమ్మ ఆదృశ్యాన్ని కేశవపిళ్ళెకు చూపుడు వేలితో చూపించింది. ఆమెకు సిగ్గు వేసింది. పకపకా నవ్వింది. ఇంతలో వాళ్ళిద్దరి పెదవులు ఏకమయ్యాయి.

"అరే, ఎవరన్నా చూస్తారు" అన్నదామె.

× × × × ×

కేశవపిళ్ళె చాలా ఫైళ్ళు తెచ్చాడు. వాటిని తెరిచి చూడను గూడా లేదు. తోటలో వున్న బంగళాలో ఒక పడక కుర్చీలో అతను కూర్చున్నాడు. దానిమీదనే ఒకవైపు ఒరిగి తంకమ్మ కూడా కూర్చుని వుంది. అతని చేతుల్లో ఆమె ఒదిగిపోయింది. అప్పుడు వాళ్ళు గంభీర సంభాషణ సాగించారు. ఆమె ఆశ్రమ విశేషాలు చెప్తూవుంది. "అయితే యిప్పుడు నీవు ఆశ్రమ మాతవు కావా?" అని అడిగాడతను.

"కాదు" అని పెదవులు విరుచుకుంటూ చెప్పింది.

"నేను వదిలేశాను. ప్రభావతీ దేవికి ఆ పదవి మీద మోజు పుట్టింది. ఆమెనే కానియ్యమని అనుకున్నాను. కాని అనాథ మందిరం ఏర్పడేవరకూ ఆ దిక్కులేని దీనాంగనలు అక్కడే వుండాలి."

తంకమ్మ తెలివి తక్కువ మాటలకు కేశవపిళ్ళై నవ్వాడు. అమాయకురాలిగా ఆమె అన్నది: "నేను ఆశ్రమ మాతను ఎలా అవుతాను? బాగుంది మీరు చెప్పేది? ఇలా మధ్య మధ్య వస్తూ వుండాలి గదా? ముందు ముందు మద్రాసు వెళ్ళాలి. టీచికి వెళ్ళాలి. మరి ఆశ్రమమాతగా ఉంటే యెలా జరుగుతుంది? భజనలో కూర్చుంటే కన్యాకుమారి గుర్తొస్తుంది."

తంకమ్మ అలా ఒక దాని తర్వాత ఒకటి ఏవేవో కబుర్లు చెప్తుకు పోతూవుంది. ఆమె అమాయకత్వం చూచి కేశవపిళ్ళైకు జాలి వేసింది. ఇంత వయస్సు వచ్చింది. జీవితంలో ఎన్నో ఒడుదుడుకులు చూచింది. అయినా యింకా బరువు బాధ్యతలు తెలియలేదు. మరి యెప్పుడు తెలుస్తాయి?

తంకమ్మ ఒక గొప్ప విషయం చెప్పింది: "ఆశ్రమంలో ఇప్పుడు వాతావరణం ఎలా వుందో తెలుసా? చాలా తమాషాగా వుంది. ప్రభావతీదేవి తన ప్రార్థనాలయంలో స్వామీజీ పటం పెట్టుకుంది. దాని పక్కనే ప్రభావతి పటం వుంది. దానికి అటూయిటూ రాధాకృష్ణులు, లక్ష్మీనారాయణులు లాంటి పటాలున్నాయి. ఆమె తనే పూజ చేస్తుంది. తన పటానికి తనే హారతి యిస్తూ వుంటే చూచితీరాలి. ఎంత భక్తి? నవ్వు వస్తుంది."

కేశవపిళ్ళైకు ఆశ్రమాన్ని గురించి వివరాలు తెలుసుకోవాలనిపించింది. "ఈ ప్రభావతికీ, స్వామీజీకి మధ్య ఎలాంటి సంబంధం వుంది?" అని అడిగాడు.

తంకమ్మ సమాధానం చెప్పింది: "స్వామీజీ దగ్గరకి వెళ్ళి ఒయ్యారం ఒలకపోస్తుంటే చూడాలి. అందులో ప్రభావతి చాలా చురుకయింది. ఆ ఒయ్యారం ఎలా వుంటుందో తెలుసా? నాకు అలా చేసి చూపించటం చేతగాదు."

కేశవపిళ్ళై భావ గర్భితంగా అన్నాడు: "లేదు, లేదు. నీకలాంటి అలవాట్లు లేవు గదా?"

దానికి ఆమె అలిగింది.

అలా రెండు రోజులు గడిచాయి. ప్రతిరోజూ ఏదో ఒక కొత్త అనుభూతి కేశవపిళ్ళైకు కలిగేది. అలాంటి అనుభూతులు మరికొన్ని పొందేందుకు మద్రాసులో కలుసుకునే తేదీలు నిశ్చయమయ్యాయి. సముద్రతీరంలో, ఉద్యాన వనంలో కలుసుకోవటమయింది. ఇక మహా పట్నంలో కలుసుకోవాలి.

ఆనకట్ట తెగి ప్రవహిస్తూ వుంటే కేశవపిళ్ళై ఆ ప్రవాహంలో కొట్టుకుపోతూ వున్నాడు. కాని ఒళ్ళు తెలియకుండా అలా వెళ్ళటం లేదు. మధ్యమధ్య ఆ గమన పరిణామాన్ని గురించి జంకుతూ వెళ్తున్నాడు.

ఒక రోజు తన ఒళ్ళో తల పెట్టుకుని పండుకున్న తంకమ్మను అతను సూటిగా ప్రశ్నించాడు: "నీ వుద్దేశ్యం ఏమిటి?" అని.

ఇది ముందే ఆలోచించి అడిగిన ప్రశ్నకాదు.

ఏమీ జంకు లేకుండా ఒళ్ళో పడుకొని వున్న తంకమ్మ మొహం చూడగానే అతని నోట వెలువడ్డ ప్రశ్న అది. అడిగిన తర్వాత అలా అడిగి వుండ గూడ దనిపించింది. కాని అడగవలసిందేనని మరుక్షణం అనిపించింది. కేశవపిళ్ళై సమాధానం కోసం ఎదురు చూస్తున్నాడు.

దానికి సమాధానం ఒక ఎదురు ప్రశ్నగా వచ్చింది. అతనడిగిన ప్రశ్న ఆమె విన్నట్లు లేదు.

"ఏమిటి? ఏమిటన్నారు?"

ఆ తర్వాత అతను తన వుద్దేశ్యం చెప్పాలని ప్రయత్నించ లేదు. ఆ ప్రశ్న వదిలేశాడు. ఆ నూతన లోకానుభూతుల మీద కేశవపిళ్ళైకు విరక్తి కలగలేదు. "ఊరికినే అడిగాను" అన్నాడు.

"ఏమిటడిగారు?"

"ఏమీ లేదు, ఏమీ లేదు."

ఈ విధంగా ఆ సంబంధాన్ని నిర్వచించే స్థితి తప్పి పోయింది. మరో రోజు మంచు పడుతున్న సంజవేళ తోటలో గుండా వాళ్ళు వెళుతూ వున్నారు. కేశవపిళ్ళై అడిగాడు:

"ఇదంతా ఎవరికన్నా తెలిస్తే?"

"తెలిస్తే - నేను ఆశ్రమమాతననా? అదేగా మీరనేది?"

"అంతే కాదు - నా సంగతి కూడా ఆలోచించు. నేనూ ఒక భర్తను. ఒక తండ్రిని."

తంకమ్మ కొంచెం చల్లబడ్డట్లు కనిపించింది. ఆమె దాన్ని గురించి ఆలోచించనే లేదు. ఒక రాగాన ఆమె నోరు మూసుకొని వుండేది కాదు. ఆ చల్లదనం ఆమె నోరు మూయించింది.

"నీవు దీన్ని గురించి ఆలోచించలేదా?" అన్నాడతను.

తంకమ్మలో ఉత్సాహం, ఉల్లాసం, అభిరుచి తగ్గిపోయింది. ఆ స్త్రీ యధార్థస్థితిని ఎదుర్కొంటున్నది. కేశవపిళ్ళై ఆ సంభాషణను అంతట ముగించలేదు.

"మా ఆవిడకు ఈ విషయం తెలిసిందనుకో. అప్పుడేమవుతుంది? లేదు. నీకి విషయం అర్థం కాదు."

తంకమ్మకు ఈ విషయం బోధపరచాలని కేశవపిళ్ళై నిశ్చయించుకున్నాడు.

నీవు కూడా ఒక భార్యవయితే నీకి విషయం అర్థమయ్యేది. మరో ఆడదానితో కులాసాగా కాలక్షేపం చెయ్యటం."

తంకమ్మ దిగజారిపోయింది. నీరసపడి పోయింది. ఆమె జాలిగా అడిగింది: "నా మీద ప్రేమ లేదా?"

కేశవపిళ్ళైకు చిరాకు కలిగించే ప్రశ్న యిది. అలాంటి ప్రశ్న వస్తుందని అతననుకోలేదు. తంకమ్మ కూడా దానికి సూటిగా సమాధానం వస్తుందని అనుకో లేదు. సమాధానం రాకుండానే ఆమె మళ్ళీ ఇలా అన్నది: "నేను మొట్టమొదట మిమ్మల్ని ప్రేమించాను. నన్ను మీరు మొదట ప్రేమించారు."

"నిజమే తంకమ్మా! కాని ఆ ప్రేమకు విలువ కట్టకుండా నీవు చాలా రోజులు గడిపావు. ఈనాటి పరిస్థితి......"

కేశవపిళ్ళై వాక్యం పూర్తి చెయ్యకముందే తంకమ్మ అడిగింది: "ఈనాటి పరిస్థితి?"

"మారి పోయింది. నీవు మారిపోయిన మరో జీవిత విధానాన్ని అవలంబించావు. సన్యాసం తీసుకున్నావు. నేను ఒకర్ని పెళ్ళి చేసుకున్నాను. ఆవిడ నన్ను ప్రేమించింది. నేను ఆమెకు చెందిన వాణ్ణి. కేవలం ఆమెకే. కాబట్టి ఆ దృష్టితో ఆలోచించాలి."

తంకమ్మ జాలిగా అడిగింది: "అయితే నా మీద ప్రేమ లేదా?" కేశవపిళ్ళై సానుభూతితో సమాధానం చెప్పాడు: "ఉన్నది. నీ మీద ప్రేమ వుంది. నిన్ను మరిచిపోను. నిర్లక్ష్యంకూడా చెయ్యను. మన సంబంధం మాత్రం చాలా గొడవకు దారి తియ్యవచ్చు. అదే నీకు తెలియాలి."

ఆ రోజు రాత్రి బంగళాలో వాళ్ళిద్దరూ ఈ విషయమే చర్చించుకున్నారు. కాని దాని ధోరణి వేరుగా నడిచింది. తంకమ్మ మనస్సులో తన అధికార భావం తలయెత్తింది. దాన్ని గురించి ఆమెకు వాదించాలని కూడా వుంది.

"మీరు నన్ను ప్రేమతో చూచేవారు. నాకు కూడా ప్రేమ వుండేది కదా?" అని అడిగింది. కేశవపిళ్ళై కొంచెం నవ్వుతూ అన్నాడు: "నీవెప్పుడూ ఇదే ప్రశ్న అడుగుతావు."

"అవును. మరో ప్రశ్న అడిగేందుకు నాకేముంది?" అన్నది తంకమ్మ.

"నా సమాధానం కూడా యిదే - నీవు అన్నింటినీ చెడగొట్టేస్తావు." ఈ మాట అనేప్పుడు పెళ్ళి సంగతి అతని మనస్సులో వుంది.

"నేను కొన్ని విషయాలు నిర్మొహమాటంగా చెబుదామనుకుంటున్నాను. మీరేమనుకోరు గదా?" అన్నది తంకమ్మ ఎన్నడూ లేని గాంభీర్యంతో.

"లేదు," అన్నాడు కేశవపిళ్ళై. ఆమె అన్ని సంగతులు స్పష్టంగా చెప్పవచ్చు.

"అయితే నేనొక విషయం అడుగుతాను. అప్పుడు నేను కలగజేసుకుంటే మీ ఆవిడ ఈ రోజు పార్కువ్యూలో వుండగలిగేదేనా?"

అది చాలా విషపూరితమైన ప్రశ్న. దానికి అతనొక భాష్యం చెప్పాడు: "నీకు మా ఆవిడ మీద కోపం, లేకుంటే "మీరు పార్కువ్యూలో

వుండగలిగేవారేనా?" అని నన్ను అడగవలసింది. అయినా ఫరవాలేదు. నేను సమాధానం చెప్తాను.

తంకమ్మకు ఆ తర్వాత ఏమడగాలో తోచలేదు.

కేశవపిళ్ళై చెప్పాడు: "మా ఆవిడకు పార్కువ్యూలో వుండటం యిష్టమే లేదు. అక్కడ వుండాలనే కోరికే లేదు."

ఏం సమాధానం చెప్పాలో తోచక తంకమ్మ విసుక్కుంటూ అన్నది: "మీరు నన్ను చెడగొట్టేశారు."

"లేదు తంకమ్మా! లేదు. నేనేం చెయ్యలేదు." అన్నాడు కేశవపిళ్ళై శాంతంగా.

తన వెనకటి వాదాన్ని తంకమ్మ మళ్ళీ ప్రతిపాదించింది: "నన్ను మీరు అదిరించి బెదిరించి సరియైన దారిలో నడిపించలేదు. అదుపులో పెట్టుకో లేదు." అదే ఆమె గొడవ.

"ఎలాగయినా దీన్ని చెడిపోనీ అని అనుకున్నారు మీరు."

ఈ ఆలోచనకు అంతు లేదనుకున్నాడు కేశవపిళ్ళై. ఈ సంబంధాన్ని గురించి తంకమ్మ మనస్సులో స్పష్టమైన భావం ఉండాలని అతను మళ్ళీ అడిగాడు: "అదంతా నిజమే. కాని నీ వుద్దేశ్యం ఏమిటి?"

"మీరు నా వారు."

కొంచెం సేపు ఓపిక పట్టి కేశవపిళ్ళై అన్నాడు: "కాదు. నేను కాత్యాయని భర్తను." కొంచెం ఆగి అతనడిగాడు: "ఈ విషయం నీవు కాదంటావా?"

మరో మార్గం లేక తంకమ్మ అన్నది: "మరి నేనే -"

కేశవపిళ్ళై సానుభూతితో అన్నాడు: "ఆ విషయం చెప్తాను, 'నా కెవ్వరూ లేరు, నాకేమీ లేదు' అని ఊరికే దిగులు పడకు. నీకు నేనున్నాను. నీ యందు నాకున్న బాధ్యత కారణంగా నీకేమీ లేకుండా పోదు."

తంకమ్మకు ఆ విషయం స్పష్టంగా తెలుసుకోవాలని వుంది. కేశవపిళ్ళై చెప్పాడు: "నేను ఆ విషయం నిశ్చయించుకొన్నాను. ఈట్టివాడు కొండల్లో టీ తోటలున్నాయే, వాటిల్లో నా భాగం దాదాపు మూడు వందల యెకరాలు వున్నాయి. అది నీకిస్తాను. కాని ఒక్క విషయం. అది నీ యిష్ట ప్రకారం ఎవరికయినా వ్రాసిఇచ్చేందుకు గాని అమ్ముకునేందుకు గాని వీల్లేదు. దానివల్ల వచ్చే ఆదాయంతో నీవు, నీతో వున్న ఆ ఆడవాళ్ళు హాయిగా కాలక్షేపం చెయ్యొచ్చు."

"అయితే నేను పెన్షనుతో బతకాలన్న మాట." అన్నది తంకమ్మ విషయం పూర్తిగా అర్థం చేసుకుంటూ.

"అలాగే అనుకో. కాని ఆ భావంతో కాదు. నీకు ఎప్పుడు ఏ యిబ్బంది వచ్చినా నేను నీకు సాయం చేసేందుకు సిద్ధంగా వుంటాను."

"అంటే......" అని తంకమ్మ ఆగిపోయింది.

కేశవపిళ్ళె ఆమె మనస్సులో భావాన్ని గమనించి అన్నాడు: "అంతే. అదే మన సంబంధం. కన్యాకుమారిలో నీవు నా సాయం కోరి వచ్చావు."

చిరునవ్వుతో అతను మళ్ళీ అన్నాడు: "ఇప్పుడు కూడా నీవు వెనకటిలాగా నన్ను కాలితో తన్ని బయటికి గెంటెయ్యగలవు. నాకు నా భార్య గుర్తువచ్చే సరికి నేను చప్పబడి పోతాను. ఆ తర్వాత నన్ను ఆడిపోస్తావు."

నిజమైన సందేహం తంకమ్మ బయట పెట్టింది: "అప్పుడు కన్యాకుమారిలో, మరి యిప్పుడు........"

"అది కేవలం దౌర్బల్యం."

"మీరు మళ్ళీ నాకు పిచ్చెక్కేట్టు చేశారు."

"నీవు కూడా నన్ను అలాగే చేశావు. సరే, అది అలావుండనీ. వయస్సు పరిపక్వమయ్యే కొద్దీ, నిషిద్ధఫలం యొక్క వయఃపరిమితి తగ్గిపోతుంది."

పొంగిపోయే ఆవేశంతో తంకమ్మ అన్నది:

"హే భగవాన్! మిమ్మల్ని నా వైపు లాగి తెచ్చే బంధం వుంటే."

"బంధమా?" అడిగాడు కేశవపిళ్ళె.

"అవును. బంధమే. నాకు కూడా ఒక నలుసు - పసికూన - ఏర్పడితే."

## ముప్పై తొమ్మిది

ఈట్టికాడు కొండలో కొంత భాగం జాతీయ పోరాటంలో బాధపడ్డ స్వాతంత్ర యోధుల పేరిట రిజిష్టరయింది. రామన్ ఇలయత్ పేరిట కూడా అయిదెకరాల భూమి రిజిష్టరయింది. కాని భూమికి బదులు నాలుగు వందల రూపాయలు ఇచ్చారు. నారాయణ నాయరు ద్వారా అది లభించింది: మరి కొంత మందికి కూడా అలాగే డబ్బు ముట్టింది.

ఈట్టికాడు కొండమీద చెట్లు కొట్టించే పని పూర్తి అయ్యేవరకూ జల విద్యుత్ ప్రణాళిక ఆగిపోయింది. అందువల్ల దేశానికి చాలా ఆదాయం వచ్చే అవకాశం పోయింది. ఆ లోయ అంతా టీ తోటగా మారింది. దాని యజమానులు కాంగ్రెసు అధ్యక్షుడు లూకోస్ మంత్రి మిస్టర్ మాత్యూ. కేశవపిళ్ళె, మరి యిద్దరు ధనవంతులూ.

శంకరపిళ్ళెకు ఏమీ యివ్వలేదు. అలాగే యింకా చాలామందికి ఏమీ ముట్టలేదు. వాళ్ళు కూడా జైలుకు వెళ్ళి నానా బాధలూ అనుభవించిన వాళ్ళే. స్వాతంత్ర్య సంగ్రామంతో ఏమీ సంబంధం లేని వాళ్ళకు కూడా భూమి యిచ్చారని విచారిస్తే తెలిసింది.

శంకరపిళ్ళె దీన్ని సహించలేక పోయాడు. అతనికి పిచ్చెక్కినట్టయింది. ఏం చెయ్యాలో అతనికి తెలియటం లేదు. ప్రతి రోజూ ప్రభుత్వానికి ఒక అర్జీ పంపుతున్నాడు. అందువల్ల అతనికి కొంచెం మనశ్శాంతిగా వుంటున్నది. ఒకనాడు తన అర్జీలో తాను అనుభవించిన కష్టాలన్నీ ఏకరువు పెడతాడు.

మర్నాడు ఉన్నవీ లేనివీ అన్నీ రాసి ప్రభుత్వాన్ని దూసి పోస్తాడు. మరో రోజు తాను సహించిన యాతనలను వర్ణిస్తాడు. దేనికి సమాధానం రాలేదు.

ఈ పరిస్థితి శంకరపిళ్ళై చాలా రోజులు సహించలేక పోయాడు. అతనికి కోపం హెచ్చిపోతూ వుంది. కనపడ్డ వాళ్ళందరికి ఈ అన్యాయాన్ని గురించి చెప్పుకుంటాడు. కాని యెవరు మాత్రం ఏం చెప్పగలరు? ఏం సలహా యివ్వగలరు? చాలామంది తిరువనంతపురం వెళ్ళి తన గొడవ చెప్పకోమని అన్నారు. మరి కొంతమంది సచివాలయం గుమ్మం దగ్గర కూర్చుని నిరాహార దీక్ష ఆరంభించమని చెప్పారు. పాపం ఆ వీరయోధుడు ఏదో ఒకటి చెయ్యాలి. లేకుంటే అతని గొంతు చించుకు పోతుంది.

చాలా కష్టం మీద అతను మూడు నాలుగు రూపాయలు పోగు చేశాడు. తిరువనంతపురం వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. ఈ అన్యాయానికి ఏదో ఒక పరిష్కారం కనుక్కోకుండా తిరిగిరానని శంకరపిళ్ళై అందరికి చెబుతున్నాడు. రామన్ ఇలయత్ మాత్రం "ఎలా పరిష్కారం చేస్తావేయ్? శంకరపిళ్ళై?" అని అడిగాడు.

శంకరపిళ్ళైకు కోపం వచ్చింది. "నీవు బిచ్చపు గింజలు పోగుచేసుకొని కూర్చున్నావు. అందుకని యిలా మాట్లాడుతున్నావు."

రామన్ ఇలయతుకు కోపం రాలేదు. "అయితే వెళ్ళి ప్రయత్నించు. నీ ప్రయత్నం నెరవేరితే నాకు కూడా సంతోషమే."

"చాలా సంతోషం" అన్నాడు శంకరపిళ్ళై మొహం చిట్లించుకుంటూ.

ఈ విధంగా శంకరపిళ్ళై తిరువనంతపురం వెళ్ళేందుకు కొట్టయం చేరుకున్నాడు. కట్టుకున్న బట్టలుకాక రెండు ధోవతులు, రెండు చొక్కాలు, ఒక దుప్పటి, రెండు అంగవస్త్రాలు మూట కట్టుకుని ఒక మందు సీసా కూడా తీసుకొని బయలు దేరాడు. ఒక గొప్ప అన్యాయాన్ని మహా యుద్ధంలో తేల్చుకునేందుకు అతను ఒంటరిగా వెళ్తున్నాడు. అతన్ని సాగనంపేందుకు ఎవరూ ముందుకు రాలేదు. తన వుద్దేశ్యాన్ని పదిమందికి చెప్తూ అతనే వుపన్యాసం కూడా యివ్వలేదు. ఆ ధర్మ వీరుని మెడలో అలాంటి ధర్మ వీరుడే అయిన మత్తాయి ఒక దండ మాత్రం వేశాడు. మత్తాయికి ఒకటే కాలు. అందరికీ చెప్పినప్పటికీ ప్రస్థాన సమయంలో అక్కడ ఒక్కరూ లేరు. మత్తాయి నడవలేడు. అతని యింటి కుక్కకు ఎముకలు, చర్మం తప్ప మరేమీ లేవు. ఆ బక్కచిక్కిన కుక్క చాలా దూరం అతనితో వెళ్ళి ఒక మూల మూత్రవిసర్జనం చేసి వెళ్ళిపోయింది. ఈ విధంగా ఆ ధర్మ వీరుడు దృఢ సంకల్పమనే ఆయుధంతో ధర్మ యుద్ధం కోసం బయలు దేరాడు.

శంకరపిళ్ళై కొట్టయం నుంచి కొల్లం వెళ్ళే పడవ ఎక్కాడు. కుటమాటి నుంచి మరో వ్యక్తి ఆ పడవలో ఎక్కాడు. అతని వయస్సు యాభైఅయిదుకు మించి వుంటుంది. అతని చేతిలో కూడా ఒక మూట వుంది. అతను

శంకరపిళ్ళై దగ్గరకి వచ్చి కూర్చున్నాడు. కొంచెం సేపటిలోనే ఇద్దరి మధ్య సంభాషణ ఆరంభమయింది.

సంభాషణ శంకరపిళ్ళైతో ఆరంభమయింది.

"ఎక్కడికి?"

"తిరువనంతపురం. మీరు?"

"నేను కూడా తిరువనంతపురమే వెళ్తున్నాను."

"అయితే మనమిద్దరం ఒకచోటికే వెళ్తున్నామన్నమాట. మంచితోడు దొరికినట్టయింది."

శంకరపిళ్ళైకు కూడా కొంచెం తృప్తిగా వుంది. ఆ యాభైఅయిదేళ్ళ వ్యక్తి పేరు కృష్ణన్. అతను రొండిలో నుంచి తమలపాకుల సంచి తీసి "ఆకు వేసుకుంటావా?" అని అడిగాడు.

"లేదు, నేను తాంబూలం వేసుకోను. పొడిగానీ, బీడీ గానీ అలవాటు లేదు." అన్నాడు శంకర పిళ్ళై.

"ఒక విధంగా చూస్తే అది మంచిదే".

తాంబూలం వేసుకుంటూ కృష్ణన్ అడిగాడు: "తిరువనంతపురంలో ఏం పని? అక్కడెవరన్నా చుట్టాలున్నారా?"

తన ప్రయాణపు ఉద్దేశ్యం చెప్పేందుకు శంకరపిళ్ళై అంతకు ముందు నుంచే తయారవుతున్నాడు. అదే సమయంలో ఈ ప్రశ్న తగిలింది. "ఎవ్వరూ లేరు. మనుష్యు లెవ్వరూ నాకు కావలసిన వాళ్ళు లేరు. బహుశా తిరువనంతపురం సెంట్రల్ జైల్లో తెలిసిన జైలరెవరన్నా వుంటారు. అంతకు మించి యెవ్వరూ లేరు. నేను ధర్మ యుద్ధం కోసం బయలు దేరాను."

కృష్ణన్ మనస్సులో కుతూహలం హెచ్చింది. యుద్ధానికి వెళ్తున్నాడు. ఎందుకో యేమో? కృష్ణన్ అడగాల్సిన అవసరం లేకుండానే శంకరపిళ్ళై అన్ని విషయాలూ చెప్పేశాడు. ఇలా అతను ఎంతమందికో ఎన్నిసార్లో చెప్పాడు. ఇన్ని మాటలు విన్న తర్వాత తిరువనంతపురం ఎందుకు వెళ్ళుతున్నారని కృష్ణన్ అడక్కుండానే తన ప్రయాణం యొక్క ఉద్దేశ్యం అతను చెప్పకుండా ఉండలేకపోయాడు.

"మా అబ్బాయి కూడా కాంగ్రెసు వాడే. అంటే మా వూళ్ళో కాంగ్రెసు కార్యకర్తలకు నాయకుడు. వాడు పిలిస్తే అందరూ గుమికూడవలసిందే. మా యిల్లు ఆలప్పీకి కొంచెం దక్షిణంగా వుండేది. దాన్ని పరూర్ అనేవాళ్ళు. ఎగుమతి కార్యాలయంలో పని చేసే వాడు. ఆ రోజుల్లో 1922లో ఆ ఆఫీసులో పనిచేసే వాళ్ళందరూ బల్లాలు తీసుకొని ఊరేగింపుగా బయలు దేరాలని నిర్ణయించుకున్నారు. పోలీసువాళ్ళు ఎదురయితే బల్లాలతో పొడిచివెయ్యాలని కూడా నిశ్చయించుకున్నారు. అలా చెయ్యమని కాంగ్రెసు

వాళ్ళే రహస్యంగా చెప్పారు. వార్తాపత్రికల్లో మీరు చదివి వుంటారు. అతని పేరు పున్నప్ప వయిలారు."

శంకరపిళ్ళెకు అర్థమయింది. దాన్ని గురించి ఏదో మాట అనకుండా ఉండలేక పోయాడు: 'మహాత్ముడు బోధించిన అహింసా సిద్ధాంతానికి విరుద్ధంగా నడిచి నందువల్ల యీ వుద్యమం తప్పుదారి పట్టింది."

కృష్ణన్‌కు ఆ విషయంలో భేదాభిప్రాయం లేదు. "తప్పేమరి. తప్పే. కాని కాంగ్రెసు వాళ్ళందరూ మాట్లాడకుండా కూర్చున్నారు. మా అబ్బాయి తుపాకి గుండు తగిలి చనిపోయాడు."

అతను తిరువనంతపురం ఎందుకు వెళుతున్నాడో, ఆ కథ చెప్పుకొచ్చాడు "నాకు ఇద్దరు పిల్లలు. ఒక పిల్లవాడు, ఒకపిల్ల వాళ్ళ అమ్మ చాలా రోజుల కిందే చనిపోయింది. 1918లో కలరా వచ్చినప్పుడు చనిపోయింది. అప్పుడు మా అబ్బాయి అయిదువందల రూపాయలు బ్యాంకులో వేశాడు. అతను కాంగ్రెసులో చేరగానే ఆ డబ్బు జప్తు చేశారు. చాలామంది కాంగ్రెసు వాళ్ళ యిండ్లనుంచి సామాను తీసుకెళ్ళారు. వాళ్ళ పొలాలు జప్తు చేశారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత జప్తు చేసిన ఆస్తి పాస్తులన్నీ తిరిగి యిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. అప్పుడు మా అబ్బాయి లేనే లేడు. చనిపోయాడు. నేనొక అర్జీ పెట్టాను. మేము వారసులం కనక మాకు డబ్బు చెల్లించాలని వ్రాశాను. అయిదు సంవత్సరాల తర్వాత దీనికో సర్టిఫికేటు కావాలని జవాబు వచ్చింది. దాని పేరు ఉత్తరాధికార ప్రమాణ పత్రమట. అది కోర్టునుంచి సంపాయించాం. దానికో సంవత్సరం పట్టింది. దాన్ని జతపరచి మరో అర్జీ పంపించాను. ఇప్పుడు మూడు సంవత్సరాల నుంచి దాని కోసం ప్రయత్నిస్తున్నాను. ఆ రోజు నేను పంపించిన అర్జీ, ప్రమాణ పత్రం – ఆ రెండూ ఇప్పుడు ఆఫీసులో కన్పించటం లేదు. ఏ ఆఫీసులో కూడా లేవు. మళ్ళీ ఒక అర్జీ పంపించమని ఒకరు చెప్పారు. కోర్టు నుంచి మళ్ళీ ప్రమాణ పత్రం నకలు తీసుకొని పంపించమన్నారు. అది కూడా పంపించాను. ఇప్పుడు దాన్ని 'ప్రీ-ఆడిటు'కు పంపించామంటున్నారు. అది తిరిగి రావాలి. కాని, ప్రీ-ఆడిటుకంటూ వెళితే అక్కడ ఆఫీసులో కూర్చున్న పెద్ద మనుషులు ఆ డబ్బు ఈ జన్మకు రాకుండా చేస్తారట. 'ప్రీ-ఆడిటు' అంటేనే తిరిగి యివ్వవలసిన డబ్బు ఇయ్యకుండా చూచే పన్నాగమని మరి కొందరు అంటున్నారు."

కృష్ణన్ కథ కొన సాగించాడు: "అమ్మాయి పెద్ద పిల్లఅయింది. మూడు నాలుగు సంబంధాలు వచ్చాయి. ఇచ్చేందుకు చేతిలో ఏమన్న ఉండాలి గదా? వచ్చినవాళ్లకు బంగారమూ కావాలి. డబ్బూ కావాలి. తల్లిలేని పిల్ల గదా? వయసు వచ్చిన తర్వాత నేను కనిపెట్టుకొని వుండగలనా? కనిపెట్టుకొని వుంటే మాత్రం ఏం ప్రయోజనం? వయసు వచ్చిన పిల్ల పొరపాటు

చెయ్యవచ్చు. ఎప్పుడు మనస్సు చలిస్తుందో ఎవరికి తెలుసు? నేను నిప్పుమింగుతూ బతుకుతున్నాను. ఆ డబ్బు వస్తే అమ్మాయికి పెండ్లి చెయ్యాలి. ఇప్పుడొక సంబంధం వచ్చింది. అందుకే నేను వెళ్తున్నాను. అమ్మాయిని వాళ్ళ పిన్ని దగ్గర వదిలి పెట్టి వెళ్తున్నాను. పని నెరవేరిన తర్వాతనే నేను ఇంటికి వెళ్తాను."

పని సానుకూలమైతేనే యిల్లు చేరతానని శపథం చేసి బయలు దేరిన ఆ వ్యక్తి శంకరపిళ్ళైకు అలా ప్రయాణం ప్రారంభం లోనే కనిపించాడు. అలాగే ఏదో దృఢ సంకల్పంతో బయలు దేరిన వ్యక్తులు ఎంతమందో అక్కడ నలువైపులా వుండివుండవచ్చు. ఎవరికి తెలుసు?

"నీవు ఏదన్నా పనిమీద ఆఫీసుకు గాని, కోర్టుకు గాని వెళ్ళావా?" అడిగాడు కృష్ణన్.

శంకరపిళ్ళైకు అలాంటి అనుభవంలేదు. ఒక మహా సంగ్రామంలో సామాన్య యోధుడిగా కాలక్షేపం చేసిన వ్యక్తి అతను. కృష్ణన్ మళ్ళీ చెప్పటం మొదలు పెట్టాడు: "అయితే అక్కడికి వెళ్ళి చూడాలి. ఏదయినా విషయం తెలుసుకునేందుకు గానీ, ఎవరినన్నా కలుసుకునేందుకు గానీ వెళ్ళాలంటే సామాన్యుడు లోపలికి వెళ్ళలేడు. డబ్బుంటే అన్నీ సాధ్యమవుతాయి. బంట్రోతుల దగ్గర్నించి అందరికీ కాఫీ నీళ్ళకు ఏదో కొంత ముట్ట జెప్పాలి. అప్పుడు వెళ్ళచ్చు. ఇక లోపలికి వెళ్ళి చూస్తే అడ్డంగా టేబిలు ఎదురుగా కుర్చీల్లో కూర్చుని వుంటారు. పైన ఫాను తిరుగుతూ వుంటుంది. దాన్ని ఆపేందుకు వీల్లేదు. ఆపినా ఆగదు. కాగితాలు ఎగిరిపోతూ వుంటాయి. ఏదో విధంగా మనం లోపలికి ప్రవేశిస్తే వాళ్ళ చూపులు, భావాలు చూచి తీరాలి. కొంతమంది పకపక నవ్వుతూ వుంటారు. కొందరు వేళాకోళం చేస్తారు. మరికొంత మంది కోప్పడతారు. భయపెడతారు. బెదిరిస్తారు. అదీకాక వాళ్ళకు చాలా గర్వం. అసలు వాళ్ళంతా మన పల్లెటూరి వాళ్ళే. మనపిల్లలు, తమ్ముళ్ళు, బంధువుల్లాంటి వాళ్ళే. కాని వుద్యోగంలో చేరగానే మారిపోతారు. ఒక కథ చెప్తాను వినండి." అంటూ కృష్ణన్ ఒక కథ ఆరంభించాడు. పరూరులో వాళ్ళ పొరుగింటి పెద్ద మనిషిని గురించిన కథ అది. అతనేదో ఆఫీసులో గుమాస్తా.

"నా కళ్ళ యెదుట పెరిగిన పిల్లవాడతను. నా మీద అతనికి చాలా ఆపేక్ష. నేను అతని దగ్గరకి వెళ్తే అతని స్నేహితులు నన్ను ఎగతాళి చేసి పంపించేశారు."

"ఇంకా చాలా కథలున్నాయి. మరో వ్యక్తి కోసం రెండు రూపాయలు లంచం ఇవ్వాల్సి వచ్చింది. మరోసారి వెళితే ఎవరో ఒకరు వచ్చి నన్ను బయటికి వెళ్ళమన్నాడు."

"మనకేం చదువా సంధ్యా? పొట్ట పొడిస్తే అక్షరం రాదు. ఏదో తెలిసిన వాళ్ళు గదా అని వెళ్తాం. ఏదో సాయం చెయ్యకపోతారా అని వెళతాం. తీరా అక్కడికి వెళ్ళే సరికి వాళ్ళ తీరు ఇలా వుంటుంది."

చాలా అనుభవజ్ఞుడిలాగా కృష్ణన్ అన్నాడు: "ఒక విధంగా చూస్తే వాళ్ళననుకొని లాభం లేదు. వాళ్ళ తప్పేమీ లేదు. నేనూ నా గోవిందన్ వున్నామనుకో. అతనితో కలిసి నేను కూడా తాటి వ్యాపారం చేశాను. నా భార్యను మొట్ట మొదట చేసుకుందామనుకున్నాడు. అతని అదృష్టం పండింది. మంచి రోజులు వచ్చాయి. ఇప్పుడతనికి మూడు ఆఫీసులు వున్నాయి. ఒక్కపంటలో అతనికి యాభైవేల కొబ్బరి కాయలు వస్తాయి. పొలం కూడా వుంది. కారులో తిరుగుతాడు. అతన్ని కలుసుకోవాలంటే చాలాసేపు కాచుకుని కూర్చోవాలి. కలుసుకున్న తర్వాత కూడా మాట్లాడడు. పని చాలా వున్నట్టు నటిస్తాడు. పెద్దవాడు, పెద్ద వుద్యోగం. మరి వుద్యోగస్థులు కదా? అంతే. అంతకు మించి యేమీ లేదు. మన పిల్లలు కూడా రేపు అంతే."

కృష్ణనుకు ఒకటే విచారం. ఈ విషయంలో ఇంత ఆలస్యం కావటం, ప్రీఆడిట్ కారణంగా డబ్బురాక పోవటం దీనికంతా కారణం ఆలప్పుళ గుమాస్తా అంటా డతను. అతను తెలిసిన వాడు కూడాను. అతనే చిరిచాప అడిగాడు. అది నేనివ్వలేక పాయినాను. దురదృష్టవశాత్తు ఆ రోజే యివ్వలేక పోయాను.

కృష్ణన్ చెప్పుకు పోతున్నాడు: "మనమింకా యిలా అర్జీలు పంపిస్తూ వుంటే వాటిని పట్టించుకోకుండా వుండేందుకు కారణమేమిటో తెలుసా? అక్కడ ఆఫీసులో వాళ్ళంతా కబుర్లు చెప్పుకుంటూ కూర్చుని వుంటారు. కొంతమంది పక్కన కూర్చున్న అమ్మాయిలతో ప్రేమ సంభాషణలు సాగిస్తారు. కొంతమంది ఆడపిల్లలు ఒళ్ళు తెలియకుండా కూర్చుని వుంటారు. మరి కొంతమంది టేబిలు చుట్టూ నిలబడి మాట్లాడుతూ వుంటారు. కొంతమంది కాఫీ తాగేందుకు వెళ్తారు. అలా అలా అయిదు గంటలయిపోతుంది. మొత్తం మీద అది వినోద స్థలం. మనం పంపిన అర్జీ అక్కడే యెక్కడో పడివుంటుంది. కట్టకట్టి యెక్కడో పడేస్తారు.

తన అర్జీ కూడా యిలాగే యెక్కడో ఏమూటలోనో వుంటుందని అనుకున్నాడు శంకరపిళ్ళె. కృష్ణన్ చెప్పినట్టే అన్నీ జరుగుతూ వుంటే తను ఈ గందరగోళం నుంచి యెలా తప్పించుకోవటం? శంకరపిళ్ళెఆలోచిస్తున్నాడు. అనుభవంగల కృష్ణన్ అన్నాడు: "అయితే నేనొకమాట చెప్తాను. వీళ్ళంతా ప్రభుత్వంలో పని చేసేవాళ్ళు. వాళ్ళు చెప్పేది కూడా కొంతవరకు నిజమే. ఈ గుమాస్తాలు కూడా ఇప్పుడు కూడగట్టుకొని పని చేస్తున్నారు. వాళ్ళకూ ఒక సంఘం వుంది. వాళ్ళు చెప్పేది కూడా

నిజమే. అసలు విషయమేమిటంటే వాళ్ళకు కూడా మంచి ఆహారం కావాలి. వాళ్ళ భార్యలకు కూడా మంచి మంచి చీరలు కావాలి. పరువు ప్రతిష్ఠలతో బతకాలి. పిల్లలు పైకి రావాలి. ఒక విధంగా మంచి జీవితం గడపాలి. దీనికంతా జీతం చాలదంటారు. కాఫీ తాగాలి, సిగరెట్లు కాల్చాలి. సినిమాలకు వెళ్ళాలి. బాడుగలు చెల్లించాలి. దీనికంతా జీతం చాలుతుందా?"

శంకరపిళ్ళై యీ మాటలన్నీ విని వూరికే వుండలేక పోయాడు. "అవును. అది కావాలి. ఇది కావాలి. నెయ్యి కారేప్పన్నం తినాలి. కారులో షికారు చెయ్యాలి. పట్టు చీరెలతో బంగారు నగలతో భార్యలను అలంకరించు కోవాలి. పిల్లలకు పెద్దపెద్ద వుద్యోగాలు కావాలి. దీనికంతా వాళ్ళు పల్లెటూరి వాళ్ళమీదే పడాలా?"

శంకరపిళ్ళై కోపంతో మాట్లాడుతున్నాడు. కృష్ణనుకు ఆశ్చర్యం వేసింది. "ప్రభుత్వంలో పని చేసే వాళ్ళు కదా? వాళ్ళ పరువు మర్యాదలకు అనుగుణంగా వుండాలి కదా? అన్నాడు.

శంకరపిళ్ళై శాంతించలేదు. "కావాలి. కావాలి. వాళ్ళకూ, వాళ్ళ పిల్లలకూ, పిల్లలకూ అందరికి తరతరాలదాకా అధికారం, ఐశ్వర్యం ఈ నాటికంటే ఎక్కువగా కావాలి. రాజుల మహారాజుల కాలంలోవలె రాజుకొడుకే రాజు. కొడుకు లేకుంటే మేనల్లుడు రాజవుతాడు. గుమాస్తా కొడుకులు, మేనల్లుళ్ళే గుమాస్తాలు. ఉద్యోగంతో ఉదరపోషణ చేసుకోవచ్చు. కాని ఉద్యోగస్థుడి కొడుక్కు సుంకం చెల్లించవలసిన అవసరం లేదు. ఇప్పుడు ఉన్న జాతులతోపాటు ఉద్యోగస్థుల జాతి కూడా ఒకటి ఏర్పడుతుందా?"

శంకరపిళ్ళై ఆవేశం చూచి కృష్ణన్ అడిగేశాడు: "నీవు సామ్యవాదివి కాదుగదా?"

శంకరపిళ్ళై ఆ మాట ఎలా సహించగలడు? అతను కూడా పత్రికలు చదువుతుంటాడు గదా?

"నేనా? ప్రభుత్వోద్యోగుల సంఘం ఏర్పాటు చేసేవాళ్ళు సామ్యవాదులు. వాళ్ళు వేట్లకోసం ఏమడిగితే అది యిచ్చేసెయ్యాలి. సామ్యవాదులు అలా కేకలు వేస్తూ తిరుగుతుంటారు గదా? కష్టపడి పనిచేసే కూలీలు, రైతులు వాళ్ళను ఉద్యోగస్థులుగా భావించి వాళ్ళకు దణ్ణాలు పెడుతూ వుంటారు గదా?"

"అది నిజమే" అన్నాడు కృష్ణన్. శంకరపిళ్ళైకు ఆవేశం తగ్గలేదు. "ఈ పల్లెటూరి వాళ్ళలాగానే వాళ్ళూ జీవితం గడుపుకుంటే చాలదూ?" అన్నాడు.

"అలాగే వుండాలి." అన్నాడు కృష్ణన్.

శంకరపిళ్ళై మళ్ళీ మొదలు పెట్టాడు: "నేనే లెక్క చెపుతాను. విను. పది ఎకరాల పొలం వుంటే మన వూళ్లో అతను ధనవంతుడి కిందనే లెక్క కదా?"

అవునన్నాడు కృష్ణన్.

"అతను వ్యవసాయం చేసుకుంటే ఖర్చులు పోను అతనికెంత లాభముంటుంది?"

కృష్ణన్ లెక్కవేశాడు: "పరూరులో తూరుపు పొలాల్లో ఖర్చంతా పోను ఆరు వందల కుంచాల ధాన్యం వస్తుంది. కుంచం రూపాయికి అమ్మితే ఆరువందల రూపాయలు వస్తాయి. వస్తే ఎనిమిదవందల కుంచాల ధాన్యం కూడా రావచ్చు."

"అంటే అతనికి ఎనిమిది వందల రూపాయలు వస్తాయి." అన్నాడు శంకరపిళ్ళై.

"పది ఎకరాల పొలం వున్న వాళ్ళు మీ వూళ్ళో ఎంతమంది వుంటారు?" అడిగాడు శంకరపిళ్ళై.

"నలుగురయిదుగురు ఉంటారు."

"అంతే కదా? మిగిలిన వాళ్ళంతా తక్కువ స్థాయిలో వాళ్ళే", అంటూ శంకరపిళ్ళై తనవాదం ఆరంభించాడు.

"అంటే బీదవాళ్ళే ఎక్కువ" అన్నాడు కృష్ణన్.

శంకరపిళ్ళై వాదించేందుకు పూనుకున్నాడు: "అంటే మన వూరి స్థితి అలా వుంది. మా వూరు కూడా అంతే. ఒక్క విషయం అడుగుతాను. బంట్రోతుకు నెల జీతమెంత వస్తుంది?"

డెబ్భై యెనభై రూపాయలుంటుందని కృష్ణన్ అభిప్రాయం.

"అంటే ఒక బంట్రోతుకు వచ్చే జీతం ఎంతో, అంత ఆదాయం మనవూళ్ళల్లో మామూలు రైతుకు కూడా రాదు. మరి వీళ్ళు జీతం చాలదు చాలదంటూ లంచం తీసుకోటంలో న్యాయమేముంది?" అన్నాడు శంకరపిళ్ళై.

"వాళ్ళంతా ఒక సంఘంగా ఏర్పడ్డారు" అన్నాడు కృష్ణన్.

శంకరపిళ్ళై అన్నాడు: "వాళ్ళు ధనవంతుల్లాగా బతకాలి. తమకంటె తక్కువ స్థాయివాళ్ళు వాళ్ళకు కనిపించరు. వుద్యోగం దొరికితే చాలు, మన అబ్బాయిలు, మేనల్లుళ్ళు కూడా మారిపోతారు. ఆ తర్వాత మన వూరివాడే అనే భావం కూడా వుండదు. ఇప్పుడు కూడా అందరూ ఏమంటున్నారు? పిల్లవాడికి గవర్నమెంటులో వుద్యోగం వస్తే చాలు. రోజులు గడిచిపోతాయిట."

అన్నీ విని కృష్ణన్ అన్నాడు: "ఆఫీసుకు వెళ్ళి యివన్నీ అనుకుంటే పని జరగదు."

"కాదేయ్. కొంచెం విషయమర్థం కావద్దూ?" అన్నాడు శంకరపిళ్ళై అంతటితో ఆగకుండా.

కృష్ణన్ పెద్ద పెద్ద వుద్యోగస్థుల విషయం చెప్పుకొచ్చాడు: "ఈ రోజుల్లో పెద్ద పెద్ద వుద్యోగస్థులందరూ చిన్న చిన్న కుర్రాళ్ళు. మీసాలు గూడా బాగా రావు. ఒట్టి పసిపిల్లలు. వాళ్ళకు పెళ్ళి విషయమేమీ పట్టదు. వాళ్ళు మాత్రం చాలా హుషారుగా వుంటారు. వాళ్ళను కలుసుకునేందుకు వీల్లేదు. కలుసుకుంటే ఇంగ్లీషులో మాట్లాడతారు. హే భగవాన్, వాళ్ళు పల్లెటూరి వాళ్ళ లాగా కాదు, అచ్చం ఇంగ్లీషు వాళ్ళలాగా వుంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత అన్నీ చక్కబడతాయనుకున్నాం. కాని వెనకటి కంటె మరీ హీనమై పోయింది."

"నేనూ, నాలాంటి వేలాది జనం కష్టాలు అనుభవించింది అందువల్లనే కదా!" అన్నాడు శంకరపిళ్ళై.

కృష్ణన్ కూడా తన సంగతి చెప్పుకున్నాడు:

"సదాశివన్ తుపాకి దెబ్బకు చనిపోవటం అలాంటివన్నీను."

కాంగ్రెసువాది శంకరపిళ్ళై ఆ పరిస్థితిలో కూడా అందుకు అంగీకరించేందుకు సిద్ధంగా లేడు. అధికారం మరిచిపోయినా, విన్నవాళ్ళు వేళాకోళం చేసి నవ్విపోయినా సరే.

"వయలార్, పున్నప్రాలో అమాయకులను సామ్యవాదులు మోసం చేశారు. వాళ్ళకు తుపాకి దెబ్బలు తగలవని నమ్మకంగా చెప్పి కమ్యూనిస్టులు వాళ్ళకు ద్రోహం చేశారు. వాళ్ళు అనవసరంగా అసువులు కోల్పోయారు. అంత మాత్రంతో స్వాతంత్ర్యం వచ్చిందా?" అన్నాడు శంకరపిళ్ళై.

కృష్ణన్ కూడా వదల్లేదు. అది వాళ్ళ అబ్బాయి చేసిన ఆత్మాహుతిని చిన్నబుచ్చే మాట.

"మరి టోపీ పెట్టుకొని, జెండా ఎగరేసి, కేకలు పెట్టినందువల్ల వచ్చిందా? మరో విషయముంది. మీకెవరికీ తెలియదు. పున్నప్రా, వయలారులో చనిపోయిన వాళ్ళందరూ నిజానికి సామ్యవాదులే. వాళ్ళు తెలివితక్కువ దద్దమ్మలు కాదు. చస్తే చస్తామని చెప్పి గట్టి నిర్ణయం చేసుకుని వెళ్ళారు. ఆ కాలపు కాంగ్రెసు వాళ్ళు వాళ్ళను మోసం చేశారు. వయలారు, పున్నప్రాలో జరుగుతున్న సన్నాహాలను గురించి వాళ్లకు తెలుసు. వాళ్ళు మాట్లాడకుండా దాన్ని హర్షించి వూరుకున్నారు. కొంత మంది కాంగ్రెసు నాయకులు అనుకూలంగానే వున్నారు. కాని కాల్పులు జరిగిన తర్వాత ప్రభుత్వం చేసిన పని సరియైనదని అన్నారు కాంగ్రెసు వాళ్ళు. అది అతి అయింది."

చాలాసేపటి వరకూ ఇద్దరిలో ఎవరూ మాట్లాడ లేదు. ఇద్దరూ ఎవరి ఆలోచనలో వాళ్ళు మునిగి వున్నారు. పడవలోని మిగిలిన

ప్రయాణీకులందరూ నిద్రపోయారు. వాళ్ళిద్దరికే నిద్ర పట్టలేదు. పున్నప్రా వయలారులో మరణించిన వందల కొద్దీ జనాన్ని గురించి ఆలోచిస్తున్నాడు శంకరపిళ్ళై. దీవాన్‌జీ సిపాయిలు కాల్పులు చేశారు. ఆ తర్వాత జరిగిన ఆక్రమణలను గురించి కూడా అతను చాలా కథలు విన్నాడు. ప్రాణ భయంతో ఒక యింట్లో ఏదో మూల దాక్కొనివున్న ఇరవైమందిని ఎలుకలను చంపినట్టు కాల్చి చంపేశారు. ప్రాణాలను గుప్పిట్లో పెట్టుకుని చెరువులో దాక్కొని శ్వాసపీల్చుకునేందుకు నాచులో గుండా ముక్కు మాత్రం బయటికి పెట్టుకుని వున్నా, అటువంటి వాళ్ళ నెంతమందినో ఆచూకి పట్టి తుపాకులు పేల్చి చంపేశారు. వీళ్ళ శవాలనన్నిటినీ పోగుచేసి దాని మీద మట్టి పేర్చినగుట్ట యిప్పటికీ వుంది. వీళ్ళంతా ఎందుకు చనిపోయినట్టు? ఎవరో చెప్పిన మాయమాటలు విని చనిపోయేందుకు సిద్ధమైనారా? శంకరపిళ్ళై నమ్మలేకపోతున్నాడు. వాళ్ళల్లో దేశాభిమానం లేకపోలేదు. స్వాతంత్ర్యం కోసం వాళ్ళు తమ ప్రాణాలను అర్పించారు. సామ్యవాదులు చెప్పిన పోచుకోలు మాటలు విని తుపాకులు పేలితే ప్రమాదం లేదులే అని తెలివితక్కువగా నిలబడ్డ మూర్ఖులు కారు వాళ్ళు. శంకరపిళ్ళై వాళ్ళ త్యాగాన్ని ఉపేక్షించలేకపోతున్నాడు. వయలారు, పున్నప్రాలో జరిగిన సంగ్రామాన్ని శంకరపిళ్ళై తన భావనాశక్తితో తన మనస్సులో చిత్రించుకున్నాడు. బారులు తీరినట్టు నిలబడ్డ ఆ వ్యక్తుల నేత్రాలు దేశాభిమానంతో వెలుగుతూ వున్న దీపపు ప్రమిదలు. పాపం వాళ్ళను మరిచిపోవటం మహాపాపం!

శంకరపిళ్ళై తన పక్కన కూర్చున్న కృష్ణన్ని క్రీగంటితో చూచాడు. స్వాతంత్ర్యం సాధించేందుకు అతను గూడా తనకు తోచింది చేశాడు. అందుకోసం అతను అన్నిటికంటె విలువైన – తన కన్న కొడుకును కానుకగా సమర్పించాడు. ఒక్కగాన ఒక్క కొడుకు. అతను తెలివిగలవాడే, అందులో సందేహం లేదు. అతనికి జీవితంలో ఎన్నో ఆశలూ, ఆలోచనలూ వుండే వుంటాయి. సందేహం లేదు. చిన్న వయస్సులోనే అతను అయిదువందల రూపాయలు సంపాయించుకున్నాడు. అతను గూడా ఏవో కలలు గన్నాడు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ పసిడి నేలలో బతకాలని కుతూహల పడ్డాడు. అతనే బతికి వుంటే ఈ పక్కన కూర్చున్న వ్యక్తికి ఇలా తిరగవలసిన అవసరం వుండేది కాదు. సదాశివన్ బతికి వుంటే ఈ పాటికి కూతురికి పెండ్లి అయివుండేది. ఈనాడు పసిపిల్లలను ఆడించుకుంటూ హాయిగా కాలక్షేపం చెయ్యగలిగేవాడు. కాయంకుల కొలనుగాలి మేస్తూ పస్తు పండుకొని ప్రయాణం చెయ్యవలసిన అవసరం వచ్చేది కాదు. స్వాతంత్ర్య సాధనలో అతను ఎంత అమూల్యమైన కానుక అర్పించాడో!

శంకరపిళ్ళై యిలా ఆలోచిస్తున్న సమయంలో కృష్ణన్ కూడా దాదాపు అదే ఆలోచనలో వున్నాడు. ధర్మయోధుడైన శంకరపిళ్ళైను అతనికి

తెలియకుండా కృష్ణన్ చాలా పరీక్షగా చూచాడు. అతన్ని చూస్తే జాలివేసింది. గాంధీ టోపీ పెట్టుకొని మూడు వన్నెల జాతీయపతాకం పట్టుకొని ఆవేశంతో నడిచే ఆ వ్యక్తిని కృష్ణన్ తన మనస్సులో చిత్రించుకున్నాడు. పాపం! అతనికి 'నా' అనేవాళ్ళు లేరు. స్వాతంత్ర్యం వచ్చింది. కాని స్వాతంత్ర్యమంటే యేమిటో అతనికి తెలియదు. ఈనాడు కూడా అతను ధర్మయుద్ధం సాగిస్తున్నాడు. ఎవరితో? లంచగొండి తనంతో, అవినీతితో, అన్యాయంతో! కాని ఆ వ్యక్తి వాటితో పోరాడగలడా? ఇలాంటి శంకరపిళ్ళెలు ఎంత మందో దేశం నలుమూలలనుంచి తిరువనంతపురం చేరుతూ వుండవచ్చు. కాని యేనాటికయినా యే చోటనయినా వాళ్ళందరూ కలుసుకోగలరా?

ఈ వ్యక్తికి తనకు రావలసిన అయిదెకరాల భూమి ఎప్పటికయినా వస్తుందా? ఇతని మనస్సులో అపరిపక్వంగా నానా రకాల సమస్యలు మెదులుతూ వున్నాయి. అసలే కోపిష్టి. ఇలా ఆఫీసుకు వెళితే వెళ్ళిన పని నెరవేరకపోవటం ఖాయం. అతనికి ఎవరు దిక్కు? అని కృష్ణన్ ఆలోచిస్తూ వున్నాడు. ఇతను ధర్మావేశంతో పిచ్చివాడిలాగా పరుగెత్తుతూ అక్కడక్కడ నిలబడుతూ "అవినీతిని అరికట్టండి" అని కేకలు వేస్తాడు. అది చూచి పిల్లలు 'అడుగో, పిచ్చి వాడు' అని చప్పట్లు కొడతారు. నవ్వుతారు. దారిన పోయే వాళ్ళు చూస్తూ నిలబడతారు. వాళ్ళ చెవుల్లో నుంచి మాత్రం ఈ కేకలు వాళ్ళ తలకెక్కుతాయా? ధర్మం కోసం, నీతికోసం జీవితమంతా ధారపోసే మనిషి ఇతను. సదాశివన్ జీవితం ముగిసిపోయింది. ఇతని ఆయుస్సు పెరుగుతూవుంది.

కృష్ణన్‌కు జాలి వేసింది. ఎలాగయినా అతన్ని దురవస్థ నుంచి కాపాడాలనిపించింది. 'అవినీతి అంతమైపోతుంది. నీతి, న్యాయం నెలకొంటాయి. అందరికీ సమానమయిన అధికారం, అవకాశం లభించి అందరూ హాయిగా జీవితం గడిపే రోజులు వస్తాయి' అని అతనికి నచ్చ చెప్ప గలిగితే చాలు.

కృష్ణన్ నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ "కాని ఒక్క విషయం వుంది" అన్నాడు శంకరపిళ్ళెను తట్టి.

"ఏమిటది?" అన్నాడు శంకరపిళ్ళె "చెప్పాలంటే చాలా వుంది. చాలా సేపు పడుతుంది. ఇప్పుడు మన వూళ్ళో ఎగుమతి కార్యాలయం వుంది. వాళ్ళకు పని లేదు. బోనసు లేదు. కుట్టనాడులో కూలీలకు వెనకటిలాగానే కూలియిస్తున్నారు. దానికితోడు ఈ అవినీతి, అక్రమం. డబ్బున్నవాడికి ఏ పనయినా అవుతుంది. ఏ ఆఫీసుకు వెళ్ళినా ఒక్కక్షణంలో పనయిపోతుంది. అంతా దాని మీదనే ఆధారపడి వుంటుంది."

మా వూళ్ళో కూడా ఇలాగే వుందన్నాడు శంకరపిళ్ళె. టీ తోటల్లో కూలీలు సమ్మె చేస్తున్నారు. వాళ్ళ కూలీలు తగ్గిపోయాయి. కంబళ్ళు ఇవ్వటం లేదు. ఎప్పుడూ ఇలాంటి తగాదాలే వుంటాయి.

కృష్ణన్ మరో విషయం చెప్పాడు: "ఒక రోజు ఆలప్పుళాలో ఒక సమావేశమయింది. ఈ దేశంలో అన్ని పట్టణాల్లోని పాకి-కూలీ వాళ్ళ సంఘ సమావేశమది. వాళ్ళ నాయకుడొకడు ఉపన్యసించాడు. అతను యింకా ఎన్నో సంఘాలకు నాయకుడు. చాలా గొప్ప నాయకుడు. పాకి వాళ్ళకు వారానికి ఇంత సబ్బు, ఇంత డబ్బు ఇవ్వాలని నిర్ణయించారు. చాలా రోజుల క్రితం సమ్మె జరిగినప్పుడు అలాంటి నిర్ణయం జరిగింది. కాని అది అమలులోకి రాలేదు. సబ్బూ యివ్వలేదు. డబ్బూ యివ్వలేదు. అందుకనే పనివాళ్ళంతా సమావేశమైనారు. ఇక ఆ నాయకుడి ఉపన్యాసం వినాలి." అని కృష్ణన్ ఆగిపోయాడు. ఉపన్యాసంలో అతను చెప్పిన విషయాలు చెప్పేందుకు కృష్ణన్ జంకుతున్నాడు.

"ఏమిటా వుపన్యాసం?" అని అడిగాడు శంకరపిళ్ళె.

"ఉపన్యాసంలో అంత చెప్పుకోవలసిన విషయమేమీ లేదు. కానీ యేదో వుంది. పాపం, ఈ బీదవాళ్ళకే అన్ని యిబ్బందులూ వస్తుంటాయి. అందుకే వాళ్ళు సంఘాలు ఏర్పాటు చేసుకుంటారు."

అందులో శంకరపిళ్ళెకు ఏమీ సందేహం లేదు.

కృష్ణన్ చెప్పాడు: "వాళ్ళ ప్రభుత్వం వచ్చిన తర్వాత లంచగొండితనం ఆగిపోతుంది. లంచం తీసుకున్నవాళ్ళకు శిక్ష వేస్తారు. పాకి వాళ్ళకు సబ్బు బిళ్ళలిస్తారు, బోనసు ఇస్తారు - ఈ మాట అతను తన వుపన్యాసంలో చెప్పాడు. దీనిలో అంత చెప్పుకోదగిన విషయమేమీ లేదు."

శంకరపిళ్ళెకు అసలు విషయం అర్థమయింది. "అంటే ఆ నాయకుడు సామ్యవాది కదూ? వాళ్ళ పరిపాలన రానే రాదు. వస్తే యీ దేశం నాశనమయి పోతుంది." అన్నాడతను.

కృష్ణన్ కాదనలేదు. "కాని వాళ్ళంతా ఏకకంఠంతో బిగ్గరగా ఈ అవినీతినీ, అక్రమాన్నీ అరికడతామని కేకలు పెట్టారు. ఏమయినా సరే మేము బీదవాళ్ళ తరఫున పోరాడతామని చెప్పారు వాళ్ళు."

శంకరపిళ్ళె మనస్సు కలవరపడ్డది. సామ్యవాదం పరిపాలనలోకి ప్రవేశిస్తుందని అతను ఊహించను గూడా లేదు. "అలా జరగదు" అన్నాడతను.

వాళ్ళ వూళ్ళో అందరూ యిందుకు సిద్ధంగా వున్నారని చెప్తూ కృష్ణన్ అన్నాడు: "నా విషయం నేను చెప్తున్నాను. నా డబ్బు నాకు వచ్చే మార్గం నేను చూచుకుంటున్నాను. ఒకవేళ రాకపోతే వాళ్ళ పరిపాలనలో ఆలస్యం

లేకుండా నాకు తప్పక వస్తుందని పూర్తిగా నమ్మకం వుంది. నీకు నీ భూమి కూడా తప్పక వస్తుంది."

"మీ అబ్బాయి తుపాకి దెబ్బకు చనిపోయాడు, కాబట్టి నీకు నీ డబ్బు వస్తుంది" అన్నాడు శంకరపిళ్ళై.

"అలా అయితే నీకు నీ అయిదెకరాలు కూడా వస్తాయి. అది నా బాధ్యత." అన్నాడు కృష్ణన్ ఒట్టు పెట్టుకొని.

"వాళ్ళ పరిపాలన ఎప్పుడు వస్తుంది?" అని అడిగాడు శంకరపిళ్ళై అపనమ్మకంతో.

"వచ్చే యెన్నికల్లో, లేకుంటే చూద్దాంగా?"

శంకరపిళ్ళై యేమీ మాట్లాడ లేదు. అయిదెకరాల భూమి మీది ఆశాకిరణం అతని అంతరంగంలో చొచ్చుకొని పోయినట్టనిపించింది. అందువల్లనే అతనికి భయం వేస్తున్నది.

"నేను ఈ జన్మలో సామ్యవాదిగా మారను." అన్నాడు శంకరపిళ్ళై.

"నేను కూడా సామ్యవాదిని కాను. కాబోనుకూడా." అన్నాడు కృష్ణన్. ఒక క్షణం ఆగి కృష్ణన్ మళ్ళీ అన్నాడు:

"వాళ్ళంతా అంటుంటారు గదా–మేము పేదసాదల కోసం కృషి చేస్తామని. వాళ్ళ సంగతి కూడా చూద్దాం. వాళ్ళు చెప్పేదానిలో ఏదో వుంది. అయినా సామ్యవాదంలో చేరటం అసంభవం."

చాలాసేపు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. కృష్ణన్ కొంచెం నిద్రపోదామనుకున్నాడు. మూట విప్పి దుప్పటి తీశాడు. దుప్పటి కప్పుకొని పండుకున్నాడు. శంకరపిళ్ళై కూడా బెంచి మీద ముడుచుకొని పండుకున్నాడు.

తెల్లవారే సరికి పడవ అష్టముడి చేరింది. కొల్లంనుంచి పదిగంటలకు బండి దొరుకుతుందనీ, అది ఒంటి గంటకు తిరువనంతపురం చేరుతుందనీ అన్నాడు కృష్ణన్. "తిరువనంతపురంలో ఎక్కడుంటావ్?" అని అడిగాడు కృష్ణన్.

కృష్ణన్ ఎక్కడా దిగేందుకు చోటు లేదు. ఆ విషయాన్ని గురించి అతను ఆలోచించను గూడా లేదు. "నీవెక్కడ దిగుతావ్?" అని అడిగాడతను కృష్ణన్ని.

"నేను తిరువనంతపురంలోనూ, ఆలప్పుళాలోనూ చాలా రోజుల క్రితం వున్నాను గదా! అందువల్ల తిరువనంతపురంలో ఒక స్థలం చూచుకున్నాను."

అది యెక్కడ అని తెలుసుకునేందుకు శంకరపిళ్ళై కృష్ణన్ వైపు చూచాడు. కృష్ణన్ చెప్పాడు: నంతన్‌కోడనే స్థలం వుంది. తిరువనంతపురంలోనే వుంది. అక్కడ ఒక చిన్న హొటలుంది. ఆ హొటలు పేరు – శివమయం లక్ష్మి హొటలు. ప్రస్తుతం వయసులో వున్న ఒక ఆవిడ

ఆ హోటలు నడుపుతూ వుంది. ఇంతకు ముందు వాళ్ళ అమ్మ ఆ హోటలు నడిపించేది. ఇది వరకు నేను వెళ్ళినప్పుడు వాళ్ళమ్మ ఉండేది. ఖర్చు తక్కువ. మంచి తిండి. పొద్దున్నే రెండణాలకు ఫలహారం, పావలాకు భోజనం. రాత్రికి రెండణాలిస్తే ఉడక బెట్టిన కూరలు, ఉప్మా యిస్తారు. ఎలాగో ముడుచుకొని పండుకోవచ్చు కూడా.

శంకరపిళ్ళై ఆలోచిస్తున్నాడు: అలాగయితే రోజుకు అర్థరూపాయి కావాలి. కనీసం మూడు రోజులుండచ్చు. ఆ తర్వాత? దాన్ని గురించి శంకరపిళ్ళైకు భయమేమీ లేదు. వెళుతున్నది ధర్మయుద్ధానికి కదా?

కృష్ణన్ చెప్పాడు: "వెనకటి యజమానురాలు చాలా మంచిది. ఇప్పుడు చీఫ్ సెక్రటరీ లేడూ? ఆయన ఒకసారి అక్కడ దిగారట. అప్పుడాయనకు వుద్యోగమేమీ లేదు. అతను పెద్ద వుద్యోగంలోకి వచ్చినా ఆ యిల్లాలు అతని దగ్గరకి వెళ్ళ లేదు. అంతటి మర్యాద కలమనిషి ఆమె."

"ఆయన వెళ్ళి కలుసుకున్నాడా?" అడిగాడు శంకరపిళ్ళై.

"బాగా వుందిది. ఆయన కింకా ఆ విషయం గుర్తుంటుందా?"

సలభై

ఒక వుత్తరం, నగిషీ గల రుమాలు - ఈ రెండూ కేశవపిళ్ళై మనస్సును కలవరపెడుతూ వున్నాయి. రోజా అలాంటివేవే వస్తూ వుంటాయి. కొన్నాళ్ళనుంచీ రోజా ఆఫీసుకు వచ్చి చీటీ పంపిస్తూంటుంది. ఒకటి రెండుసార్లు లోపలికి రమ్మని అనుమతి యిచ్చాడు. లోపలికివస్తే యిక బయటికి వెళ్ళటం మరిచిపోతుంది. ఏవో కొన్ని ప్రతిజ్ఞలు చెయ్యాలి. మళ్ళీ లోపలికి రానియ్యలేదు. మనస్సు బాధపడ్డది. ఇది చాలా నిర్దాక్షిణ్యమైన నిర్ణయం. తంకమ్మ పార్కువ్యూకి రాలేదు. అంతవరకు మేలయింది. కానీ ఎప్పుడయినా అక్కడికి కూడా రావచ్చుననే భయం లేకపోలేదు. ఆమె కాలాంతకురాలు. అంత పని చేసినా చెయ్యచ్చు. అలావస్తే మదాలసగా అయినా వస్తుంది. లేకుంటే పరమసాధ్విగా నటిస్తూ వస్తుంది. అదీ కాకుంటే పూర్తి అధికారంతో వస్తుంది. ఏనాడయినా యిది జరగవచ్చు. ఆ ఆలోచనతో కేశవపిళ్ళై భయపడుతున్నాడు. తను ఇంట్లో వుండగా వస్తే ఫరవాలేదు. ఆ సమయంలో తను యింట్లో లేకపోతే - ఏమవుతుందో ఊహించటం కూడా కష్టమే. ఏమవుతుంది? బహుశా యిద్దరూ వాదించుకుంటారు. హక్కెవరిది అని కూడా వాళ్ళు చర్చించుకోవచ్చు. ఒకరి మీద ఒకరు చెయ్యి చేసుకున్నా చేసుకోవచ్చు. కాని యీ విషయమై కేశవపిళ్ళైకు తన భార్య మీద పూర్తి నమ్మకముంది. కాత్యాయనీ అమ్మ అలాంటి దృశ్యానికి ఎంతమాత్రం ఆస్కారమియ్యదని అతనికి నమ్మకముంది. కాని ఆ యిల్లాలు ఎంత ఓర్చుకుంది. వెనక జరిగిన వన్నీ తను ఆమెకు చెప్పి క్షమాపణ కోరుకున్నాడు. కాత్యాయనీ అమ్మ క్షమించింది కూడాను. అంతా బాగానే

వుంది. ఇన్నీ అయిన తర్వాత మళ్ళీ తను వెనకటి మార్గాన్నే అనుసరించాడు. ఆ సంగతి ఆమెకు తెలియదు. తెలియకూడదని అతని అభిప్రాయం. కన్యాకుమారిలో, పిరుమెడ్‌లో, ఆ తర్వాత మద్రాసులో ఒకానొక దుర్బల ముహూర్తంలో ఆమెకిచ్చిన వాగ్దానాన్ని గురించి తన భార్యకు తెలిస్తే ఆమెకు చిచ్చు మింగినంత పని అవుతుంది. ఆమెను ఓదార్చేందుకు మరో మార్గం కూడా లేదు. ఆ మంట ఆమె గుండెలో జీవితాంతం వుంటుంది. ఈ వార్ధక్యంలో శాంతి లేకుండా పోతుంది. కాత్యాయనీ అమ్మ ఇదంతా సహించలేదన్న విషయం మాత్రం ఖాయం.

అందుకనే యింటినుంచి ఆఫీసుకు వెళ్ళిన తర్వాత రోజుకు పదిహేను సార్లు ఫోను చేస్తాడు. ఆమె యెక్కడ వచ్చిందో అని భయం. టెలిఫోనులో ఎప్పుడడిగినా ఒకటే మాట: "విశేషమేం లేదు కదా?"

కేశవపిళ్ళైకు అది అలవాటయిపోయింది. అతని మనస్సులో మరో భయం కూడా వుంది. ఆ స్త్రీని చూస్తే తనలో ఉద్రేకం ఉప్పొంగి పోవటం ఇంకా తగ్గలేదని అతని అనుమానం. ఆలోచనల చలిమిరిలో కూడా ఆ వెచ్చదనం చల్లారటం లేదు. భవిష్యత్తును గురించి ఒక నిర్ణయం చేసుకొని తీరాలి. ఈ ఉద్రేకం మంచిది కాదని అతనికి తెలుసు. వివేకం అతన్ని సరియైన దారిలో తీసుకొని పోయేందుకు కృషి చేస్తున్నది. ఆ విషయం పూర్తిగా మరిచి పోయే శక్తి అతనిలో లేకపోలేదు. కాని అలా మరిచిపోయేందుకు విశ్వప్రయత్నం చెయ్యాల్సి వస్తున్నది. ఫైలు చూసేప్పుడు, పండుకొనబోయేప్పుడు, కాత్యాయనీ అమ్మ దగ్గర కూర్చున్నప్పుడు, ఉదయం లేచినప్పుడు - అందాకా యెందుకు, ఏదయినా గంభీరమైన విషయాన్ని గురించి చర్చించేందుకు సమావేశానికి వెళ్ళేప్పుడు తనకు తెలియకుండానే కన్యాకుమారి వైపో, పిరుమెడ్ వైపో అతను కొట్టుకు పోతూవున్నాడు. పగటి కలలు కంటూ వుంటాడు. అక్కడి నుంచి తిరిగి వచ్చేందుకు ఒక పెద్ద కొండదాటి వచ్చినంతగా కష్టపడతాడు. అక్కడ ఎవరో తనను రాకుండా ఆపేసినట్లు అనిపిస్తుంది. తన ఏకాగ్రత దెబ్బ తిన్నదని అనిపించింది కేశవపిళ్ళైకు. ఏపనీ సరిగ్గా చెయ్యలేకపోతున్నాడు. వెనక చీఫ్ సెక్రటరీ కృష్ణన్ నాయరు బుద్ధి సరిగ్గా పని చెయ్యకపోతే ప్రాంతీయ కాంగ్రెసు సంగ్రామాన్ని గురించి నాలుగయిదు వాక్యాల్లో తను సారాంశం చెప్పేశాడు. ఆ తర్వాత తన జీవితానికి పునాది అని చెప్పదగిన నివేదిక ఒకటి తయారు చేసి దీవాన్‌జీకి సమర్పించాడు. ఇదంతా గంభీరంగా తీవ్రంగా ఆలోచించగలిగినందువల్లనే సాధ్యమయింది. ఈనాడు అతని బుద్ధిలో అంతటి కుశాగ్రత లేదు. ఉద్యోగ విషయాల్లో ఏ పనీ సక్రమంగా చేస్తున్నట్లు అతనికి తృప్తిగా లేదు. తను చేసిన పనుల్లో ఎక్కడో ఏదో పొరబాటు జరిగినట్లు అతనికి అనిపిస్తూ వుంది. ఎప్పుడూ ఏదో దిగులుగా వుంటున్నది.

కన్యాకుమారిలో ఆమె కుమిలి కుమిలి యేడ్చి అతని కాళ్ళు పట్టుకుంది. అతని మనస్సును చలింప జేసేందుకు ఆ కన్నీటి బొట్టు చాలు. ఆమె స్పర్శ సోకగానే అతను చలించాడు. ఆ స్పర్శలో ఏదో అయస్కాంత శక్తి వుంది. అంతటితో అతనికి మైకం కమ్మింది. పిరుమేడ్‌లో ఆ అయస్కాంత శక్తి పై పారవిడిపోయింది. మెదడులో వెలుగు ప్రవేశించింది. అయస్కాంతం నుంచి మనస్సును తప్పించుకునేందుకు ప్రయత్నిస్తున్నట్టు అతనికి తోచింది.

తనకు అందిన వుత్తరాలనూ, చేతి రుమాళ్ళనూ తగల బెట్టిన తర్వాతనే అతను ఇంటికి వెళ్ళేవాడు. కాని యీ ప్రయత్నమంతా మరో యుక్తికి ఆహుతి అవుతుందని అతనికి తెలుసు. ఏమవుతుందో చూడాలి. ఎంత ఆలోచించినా తంకమ్మ ముందు ముందు ఎలా తారసిల్లుతుందో అతనికి బోధపడటం లేదు. భయ పెడుతుందేమో? పరువు ప్రతిష్ఠలకు భయపడి తన స్వాధీనం అయిపోతాడనే వుద్దేశ్యంతో 'ఆత్మ హత్య చేసుకుంటానని బెదిరిస్తుందేమో? ఇక ముందు ఆమె కన్నీటికి విలువ యేమీ వుండదు. ఏదో మార్గం ఆలోచిస్తున్నాడు.

పార్కువ్యూలో అడుగంటిన ఆనందం మళ్ళీ అంకురించలేదు. మళ్ళీ వస్తుందా ఆ ఆనందం? శాశ్వతంగా అది నశించిపోయినట్టే అనిపిస్తున్నది. మళ్ళీ అలాంటి మనస్థితి నెలకొల్పేందుకు అతను ప్రయత్నిస్తూ వున్నాడు. ఆ కాంతి, ఆ కళ మళ్ళీ ఆ యింటికి తీసుకురావాలని కేశవపిళ్ళెకు చాలా గాఢంగా వుంది. కాని యెలా వస్తుందో తెలియటం లేదు. దానికి మార్గమేమీ కనిపించటం లేదు. ఇంటికి వెళ్ళగానే, ఇక్కడ వెలిగే ఆ దీపాన్ని ఊది ఆర్పివేసిన ఆ ఘడియ చాలా విషఘడియ అని అనిపించేదతనికి. జీవితంలో తను చేసిన పెద్ద పొరపాటది. కేశవపిళ్ళె మనస్సులో అంతులేని పశ్చాత్తాపం కూడా వుంది. ఏది యెలా వున్నా కాత్యాయనీ అమ్మకు మాత్రం ఈ విషయమేమీ తెలియదు. తెలిస్తే యెలా వుంటుందో? ఇప్పుడుమాత్రం దిన చర్యలు అన్నీ మామూలుగా జరుగుతున్నాయి. గుమ్మం దగ్గర నిలబడి భర్తకు స్వాగతం చెప్తుంది. ఫైళ్ళు చూచేప్పుడు ఆయన దగ్గరే కూర్చుంటుంది. కాని పక్కన కూర్చుని కునికి పాట్లు పడుతూ వుంటుంది. తోటలో తిరిగేప్పుడు కూడా ఆమె వెంటవెంటనే నడుస్తుంటుంది. కాని ఆమె మనస్సు ఎక్కడెక్కడో తిరుగుతున్నట్టుంటుంది. మనస్సు ఎప్పుడూ విచారంగా వుంటుంది. రాత్రిపూట అతని గుండె మీద చెయ్యివేసి పండుకుంటుంది. కాని యిద్దరూ ఏమీ మాట్లాడుకోకుండా నిద్రను నటిస్తూ పండుకుంటారు. నిద్ర వట్టదు. ఇంద్రజాలంలాగా వెనకటి నవ్వులు, ఉల్లాసం, సరససల్లాపాలు అన్నీ వినబడుతూ వుంటాయి. కానీ ప్రయోజనం లేదు. అలా దిగజారినట్టు ఉండటం మంచిది కాదని కాత్యాయనీ అమ్మకు

తెలుసు. ఆఫీసులో పగలంతా పనిచేసి అలిసిపోయి యింటికి వచ్చిన పెనిమిటికి ఇలా విచారకరంగా స్వాగతం చెప్పటం తప్పు. ఆయనకు ఉత్సాహం, ఉల్లాసం కలిగించాలి. కేవలం మంచి ఆహారం తయారుచేసి పెడితే చాలదు. అది పరిచర్య కాదు. ఇదంతా కాత్యాయనీ అమ్మకు తెలుసు. తన కర్తవ్యం తాను నెరవేర్చలేక పోతున్నానని కూడా ఆమెకు తెలుసు. తనకర్తవ్యం నెమ్మదిగా ఆమెను శారీరకంగా మానసికంగా బాధించటం మొదలయింది. మట్టితో తనంతట తాను ఒక కుండ తయారు చేసుకొని నీళ్ళు మోసుకుని తెచ్చే పాతివ్రత్యం క్షీణించి పోయింది. పరపురుషుణ్ణి ఆమె నీటిలో కూడా చూడలేదు. ధర్మవిరుద్ధమైన కల కూడా ఆమెకు రాలేదు. కాని యీ నీరసం ఆమెలో ఎలా వచ్చిందో తెలియదు. ఆమె మనస్సులో ఆవేదనగా వుంది. అలాంటప్పుడు భార్యాభర్తల మధ్య సంభాషణ విశేషంగా వుండదు. ఏవో కొన్ని గంభీరమైన విషయాలు మాట్లాడుకుంటారు.

ఒకరోజు కాత్యాయనీ అమ్మ అడిగింది: "గంటకు నలభైసార్లు ఆఫీసునుంచి ఫోను చేసి విశేషమేం లేదు గదా అని అడుగుతారెందుకు? మీకేదో భయంగా వున్నట్టు తోస్తున్నది."

కేశవపిళ్ళె వెంటనే యేమీ సమాధానం చెప్పలేక పోయాడు. బుద్ధి కొంచెం మందగించినా ఒక్క క్షణంలో అతనికి ఆలోచన తట్టింది. కొంచెం సందేహిస్తూ అతను సమాధానం చెప్పాడు:

"నీవు దిగులు పడుతుంటే చూచి యిక్కడి నుంచి వెళ్తాను గదా? అందుకని భయం వేస్తుంది. అందుకే మాటి మాటికి పిలిచి అడుగుతుంటాను."

"ఆహా! గెలిచాను. సరియైన సమాధానం చెప్పాను." అంతమంచి సమాధానం తనకు ఎలా తట్టిందా అని అతనికి ఆశ్చర్యంగానే వుంది. తనలో తాను తన తెలివికి మురిసి పోతున్నాడు. కాని యీ సమాధానం ఆమెకు అర్థమయిందో లేదో యిప్పుడు చూడాలి. అర్థం కాక పోయేందుకు అందులో ఏమీ లేదు. కాని కాత్యాయనీ అమ్మ ఏమీ మాట్లాడలేదు. అందువల్ల ఆమెకు ఆ సమాధానం అర్థమయిందో లేదో తెలియలేదు.

"ఎప్పుడు చూచినా నీవు ఏడుపు మొహం పెట్టుకొని అలా దిగులుగా కూర్చుంటావెందుకు? ఏమయిందని?" అడిగాడు కేశవపిళ్ళె.

కాత్యాయని అమ్మ ప్రశ్నకు ప్రతి ప్రశ్న అడిగింది:

"ఎప్పుడు చూచినా నీరసంగా విచారంగా కంగారుగా నన్ను పట్టించుకోకుండా నాతో ఏమీ పనిలేనట్టుగా మాటా మంచీ లేకుండా అలా కూర్చుండి పోతారెందుకు? నేను పక్కన కూర్చుని వుంటే మీ పక్కన ఒక మనిషి వున్నదనే భావం కూడా మీలో వున్నట్టు కనిపించదు. అందువల్ల

నాకు ఉత్సాహం తగ్గిపోతున్నది. మొదట నాకర్థం కాలేదు. ఇప్పుడు తెలిసి పోయింది. నాలో కొంచెం ఉత్సాహం కల్పించి ఆ తర్వాత నన్ను పట్టించుకోలేదు. అదే నాకం తోస్తున్నది. మిమ్మల్ని తృప్తి పరచగలుగుతున్నానని అనుకుంటూ వచ్చాను. కాని మీరు నా తృప్తిని వదిలేశారు."

కేశవపిళ్ళ యీ విషయాన్ని పూర్తిగా కాదనలేక పోయాడు. "నాకు వుద్యోగంలో వుండే చిరాకు నీకు తెలుసా?" అన్నాడతను.

"ఆఁ, ఏమిటో అది?"

"మలబారును కేరళలో కలిపిన తర్వాత మనశ్శాంతి లేనే లేదు. మదరాసు నుంచి వచ్చిన యీ వుద్యోగస్థులు పెద్ద గొడవ తెచ్చి పెట్టారు. వాళ్ళంతా బాగా పని తెలిసిన వాళ్ళనీ, తెలివిగలవాళ్ళనీ వాళ్ళ భావం. ఇక్కడి వాళ్ళందరూ లంచగొండివాళ్ళనీ తెలివి తక్కువ వాళ్ళనీ వాళ్ళనుకుంటారు. మద్రాసు నుంచి వచ్చిన మలబారు వుద్యోగస్థులు ఇక్కడి వాళ్ళకొక పేరు పెట్టారు. అదేమిటో తెలుసా? 'సంప్రతి పిళ్ళ'.

ఆ సంభాషణలో కాత్యాయనీ అమ్మకు ఏమీ ఆసక్తి కనిపించలేదు. ఆసక్తికి ఆస్కారం కూడా లేదు. "ఇవన్నీ వెనక మీరు చెప్పిన వేగా?" అన్నదామె. తన విషయాల్లో కాత్యాయనీ అమ్మకు ఆసక్తి కలిగించాలని కేశవపిళ్ళ అభిప్రాయం. అలా చేస్తేనే గాని తన తటస్థభావాన్ని తార్కికంగా నిరూపించటం సాధ్యం కాదు.

"అప్పుడు నేను ఊరికే ఊహించాను. ఇప్పుడు నాకు పూర్తిగా అర్థమవుతున్నది. అందువల్ల నేను బాగా నష్టపడుతున్నాను. నాకు ఎంత విచారంగా వుందో నీకు అర్థం కాదు."

కేశవపిళ్ళ తన భార్యకు కల్పిత కథలు చెప్పటం లేదు. మదరాసు సర్వీసు నుంచి వీళ్ళు వచ్చిన తర్వాత ప్రభుత్వ సమస్యలు బాగా చిక్కుబడి పోయాయి. ఉద్యోగంలో వుండే చిక్కులు కాత్యాయనీ అమ్మకు అర్థంకావు. అయినా భర్తను వేధిస్తున్న ఆ చిక్కులేమిటో తెలుసుకోవాలని ఆమెకు కొంచెం కుతూహలం కలిగింది. ఆమె వినేందుకు సిద్ధంగా వున్నదని గమనించి కేశవపిళ్ళ చెప్పటం మొదలెట్టాడు: "వాళ్ళు చెన్నపట్నం నుంచి వచ్చామని గొప్పలు చెప్పు కుంటారు. గొప్పగొప్ప దొరల దగ్గర, ఐ.సి.యస్. అధికార్ల దగ్గర పనిచేశామని వాళ్ళకు గర్వం. మనవాళ్ళకు వాళ్ళను చూస్తే అసహ్యం. ఇక్కడ పనిచేస్తున్న తెలివిగల ఉద్యోగస్థులు కొందరు వాళ్ళను అవమాన పరిచేందుకు ప్రయత్నిస్తూ వుంటారు. అదంతా ఫైళ్ళల్లో కనిపిస్తూంటుంది. అదికాక మరో గొడవ కూడా వుంది. మదరాసునుంచి వచ్చిన వాళ్ళ జీతాలు ఎక్కువ. హెూదా తక్కువ. వాళ్ళకు పెద్ద పదవులు కావాలి. ఇక్కడ పెద్ద పెద్ద వుద్యోగస్థుల్లో గుసగుసలు బయలు దేరాయి. మదరాసు నుంచి వచ్చిన

వాళ్ళంతా మననెత్తి మీద కూర్చుంటారు. అదే భయం. సచివాలయంలో అంతటా కలవరమే. ఒకరి మీద ఒకరికి అసహ్యం, అవిశ్వాసం, అవమానం చెయ్యాలనే ప్రయత్నం - వీటితో నాకు మనశ్శాంతి లేకుండా పోతున్నది."

కొంచెం సేపాగి కేశవపిళ్ళె మళ్ళీ అన్నాడు: "ఈ ప్రమాదం నాదాకా కూడా వస్తున్నది."

"ఎవరో పెద్ద జీతం తీసుకునేవాడు వచ్చాడంటారు. అంతేగా?" అన్నది కాత్యాయనీ అమ్మ.

"అవును. అదే, అతనికి నాకంటె సర్వీసు తక్కువ. జీతం నాకంటె ఎక్కువ. అతను సెక్రటరీగా వచ్చాడు. అదే సమస్య. మరో సమస్య ఏమిటంటే అతనికి సెంటరులో చాలామంది పరిచయస్థులున్నారు. ఢిల్లీలో మనకు తెలిసిన వాళ్ళెవరూ లేరు. మన సంగతి మనం తప్ప మరెవరూ పట్టించుకోరు. కొందరు కేంద్రమంత్రులు అతనికి బంధువులు.విధాన సభలో కూడా అతనికి బంధువులున్నారు. కమ్యూనిస్టులు, కాంగ్రెసు సభ్యులు కూడా వున్నారు."

కేశవపిళ్ళె తనలోతాను గొణుక్కున్నాడు: "ఈ మేనేన్, నంబియార్, నంబిడి, చాక్యార్, పోనుపాల్ - వీళ్ళంతా మలబారు వాళ్ళ మాటవస్తే ఏకమవుతారు. నాకు ఐ.ఏ.యస్. గ్రేడిచ్చేందుకు కూడా కేంద్రంలో మలబారతను అడ్డుపుల్లలు వేశాడు. అప్పట్లో కాంగ్రెసు, కమ్యూనిస్టు, పి.యస్.పి. - యివన్నీ యేమీ లేవు. వాళ్ళంతా ఒకటి. తిరువనంతపురం వాళ్ళల్లో అలాంటి ఐకమత్యం లేదు. ఇక్కడి వాళ్ళంతా మీన మేషాలు లెక్క బెట్టే బాపతు.

దీనికి సమాధానంగా కాత్యాయనీ అమ్మ ఎన్ని సంవత్సరాల నుంచో ఒకే ఒక సూచన చేస్తూ వచ్చింది. "అలాంటి తగాదా యేదన్నా వస్తే రాజీనామా చేయటం మంచిది. మనస్సులో ఇంత బాధ పడవలసిన అవసరమేముంది?"

కేశవపిళ్ళె ఆ విషయం అంతటితో వదిలిపెట్టేందుకు సిద్ధంగా లేడు. "అలా అన్నీ వదులుకొని వెళ్ళామాయేం? జీవితంలో నేనే ఆటలో దిగాను. పూర్తిగా ఆట ఆడి తీరాలి. ఆటముగిసే వరకూ ఆడాలి. ఆ సెక్రటరీ మూడు నాలుగు పర్యాయాలు నాదగ్గరకి వచ్చి తన గొప్ప చూపించబోయాడు. అమితమైన గర్వంతో నన్ను కలుసుకునేందుకు వచ్చాడు. నన్ను కలుసుకున్న తర్వాత అతని కంత బాగా లేదు. ఇక చూస్తాను వాడి విషయం."

అయినా కాత్యాయనీ అమ్మ తన వెనకటి సమాధానమే చెపుతూంది - ఈ పని యింతటితో మానెయ్యండి అని.

కాత్యాయనీ అమ్మకు చెప్పదగిన విషయం కేశవపిళ్ళె దగ్గర మరొకటి వుంది. అది ఆమెకు నచ్చవచ్చు.

"వెనక ఒక ఆశ్రమానికి చందా అడిగేందుకు కొంతమంది తిరువనంతపురం ఆడవాళ్ళు వచ్చారు. వాళ్ళు నీకేమీ నచ్చలేదు. గుర్తుందా?"

"గుర్తుంది" అన్నది కాత్యాయనీ అమ్మ. కేశవపిళ్ళె చిరునవ్వుతో అన్నాడు: "ఇక మద్రాసు నుంచి వచ్చిన అధికార్ల భార్యలను చూస్తే నీవేమంటావో?"

"ఎలా వుంటారేమిటి?"

"వాళ్ళు కాటుక పెట్టుకోవటం, జుట్టు ముడి వేసుకోవటం - అన్నింటిలో మితిమించిన ఫ్యాషను కనిపిస్తుంది. మద్రాసు సినిమా తారలు వుండే చోటు గదా? వాళ్ళు అక్కడి నుంచి వచ్చారు. తిరువనంతపురంలోని ఆడవాళ్ళను వాళ్ళు ఓడించేశారు. ఈ తిరువనంతపురం వాళ్ళు ఉత్తరాది వాళ్ళ అలంకరణను గురించి యేమంటారో తెలుసా?"

"ఏమంటారు?" అన్నట్టుగా కాత్యాయనీ అమ్మ చూచింది. ఆమె యింకా హృదయలాఘనంలో దిగలేదు. ఆదారిలో పడేందుకు ఇంకా చాలా దూరం వెళ్ళాలి.

కేశవపిళ్ళె చెప్పాడు: "నితంబాలంకార ప్రదర్శనం."

"అంటే?"

"స్త్రీలు వెనక భాగాన్ని బాగా అలంకరించుకుని ప్రదర్శించటం. దానికో చెడ్డపేరు."

"వాళ్ళు ధోవతి, అధోవస్త్రం కట్టుకుంటారు. అది చాలా బాగుంటుంది. అదే అసలు పద్ధతి. ఈ తిరువనంతపురం ఆడవాళ్ళ లాగా అస్తవ్యస్తంగా బట్టకట్టుకొని తిరగరు."

అయినా కాత్యాయనీ అమ్మకు హుషారు రాలేదు. ఎన్ని వుపాయాలో పన్ని చూచాడు. స్త్రీల వేషభాషలను గురించి చెప్పాడు. కేశవపిళ్ళె మరో విషయం చెప్పాలనుకున్నాడు:

"ఇప్పుడు మరో ఎన్నికలు వస్తున్నాయి. ఇక ముందు ఇక్కడ సామ్యవాదులు పరిపాలిస్తారని అందరికీ నమ్మకం. ఏది ఎలాగున్నా కాంగ్రెసువాళ్ళకు మర్యాద తెలుసు. వీళ్ళ కేమీ తెలియదు."

దిగులులో మునిగి పోయిన కాత్యాయని అమ్మ కొంచెం తేరుకుందని చెప్పేందుకు వీల్లేదు. ఆమె యేదో సలహా చెప్పాలని ఆలోచిస్తూ వుంది.

ఆమె కొంచెం కోపంతో అన్నది: "స్వరం తప్పకుండానే పాట ఆపటం మంచిది. మనం ఇక్కడి నుంచి వెళ్ళి పోవాలి. వుద్యోగం చేసినంత వరకు చాలు. ఇదివరకు ఇక్కడ ఎంత వుత్సాహంగా వుండేది? మనమెంత కలిసి

మెలిసి వుండేవాళ్ళం? జీవితం హాయిగా గడుపుకునేందుకు మనకు కావలసినంత వుంది. అనవసరంగా యీ అగచాట్లు పడటం ఎందుకు? నాకు ఇక్కడ ఉండాలని యెంత మాత్రం లేదు. ఇక్కడ వుండే కొద్దీ యేవేవే గొడవలు వస్తూ వుంటాయి. ఉద్యోగం అక్కర్లేదు, వదిలెయ్యండి.

ఆమెలోని క్షణికమైన కోపాన్ని కేశవపిళ్ళై గమనించాడు. అందులో భయం కూడా పొడగడుతూ వుంది. "అప్పుడే వెళ్ళవలసిన సమయం రాలేదు. ఇక్కడ వుద్యోగంలో వుండగానే అమ్మాయికి వివాహం చెయ్యాలి. ఇక్కడ వుంటేనే మంచి సంబంధం కుదురుతుంది. ఆ పని అయిపోయిన తర్వాత వుద్యోగం వదులుకున్నా ఫరవా లేదు."

ఒక్క క్షణం ఆగి కేశవపిళ్ళై అన్నాడు:

"వాడి దుంప తెగ! ఆ నారాయణ పిళ్ళైకు చెప్పినందువల్ల ఏమీ ప్రయోజనం లేకుండా పోయింది. మరి యింకెవ్వరితోనన్నా చెప్పాలి."

"మలబారులో ఒక వుద్యోగస్థుడి సంగతి ఒకరోజు చెప్పారు కదూ? మళ్ళీ ఆ సంగతి ఆలోచించలేదే?" అన్నది కాత్యాయనీ అమ్మ.

"అతనంత బాగా లేడు. పిల్లవాడు బుద్ధిమంతుడు. ఐ.యే.యస్. చేయించవచ్చు. కాని......"

"కాని......."

"అతను కొంచెం మోసగాడని అంటారు."

అలా యెందుకనుకుంటున్నారని కాత్యాయనీ అమ్మ మళ్ళీ అడిగింది. అతని స్వభావం అంత మంచిది కాదా?

"ఎలుకను పట్టే పిల్లి కుండను కూడా పగలగొడుతుంది అది నీ కిష్టమేనా?"

ఆమె వెంటనే సమాధానం చెప్పింది: 'హే భగవాన్! అక్కర్లేదు. ఎలుకలను పట్టకండి. నా అనుభవం నా కూతురికి అక్కర్లేదు.'

కేశవపిళ్ళై నవ్వాడు.

అతను మాట మార్చి అన్నాడు:

"ఇప్పుడు మనం ఇక్కడి నుంచి వెళ్ళి పోయామంటే ఓడిపోయినట్టే అర్థం. ఇలా పరాజయంతో అస్త్ర సన్న్యాసం చేసి వెళ్ళటం బాగుంటుందా?"

కాత్యాయనీ అమ్మ సమాధానంతో సిద్ధంగా వుంది:

"ఇది పరాజయమా? అలాంటి దేమీలేదు. దానికి మంచి భర్త కూడా దొరుకుతాడు."

కేశవపిళ్ళై గాంభీర్యంతో అడిగాడు:

"నేనే విషయం అడుగుతాను. విడమరిచి చెప్పు. నీవింత విచారంగా ఎందుకుంటున్నావ్? నాకు తెలిసినంతవరకు కారణమేమీ కనిపించటం లేదు.

నేను నిన్ను పల్లెత్తి మాట అనను. నాకు నీతో విరోధమేమీ లేదు. నీవన్న మాట నేను కాదనను. మరి యిలా యెందుకుంటున్నావు?"

కాత్యాయనీ అమ్మ దాపరికం లేకుండా సమాధానం చెప్పింది:

"అంతేనా? అలా చేస్తే నాకేమీ దిగులుండేది కాదు. మీరు బెదిరిస్తే నాకు పోయేదేముంది? కోపం వచ్చి రెండు దెబ్బలు వేస్తే మాత్రం తప్పేముంది?"

"అయితే యింతకూ నీవనేదేమిటి?" అని అడిగాడు కేశవపిళ్ళె చిరునవ్వుతో. తనను ఏం చెయ్యమంటుందో చెప్పమని మరోసారి అడిగాడు.

కాత్యాయని అమ్మ అన్నది:

"ఎవరో మనమీద ఏమో ప్రయోగించారు. అదే మనల్ని పిశాచంలా పట్టి బాధిస్తున్నది. ఇక్కడ ఎవర్నిచూచినా మనకు శత్రువులే. ఎవరో ఏదో చేశారు. అందులో సందేహం లేదు. మనం ఇలా వున్నామని మనమీద అందరికీ అసూయ. అమ్మాయికి ఒక్క సంబంధం కూడా రాలేదు. ఆ విషయం మీరు పట్టించుకుంటేగా ?"

కేశవపిళ్ళెకు నవ్వు వచ్చింది. కాని ఆ నవ్వును అతను ఆపుకున్నాడు.

కాత్యాయనీ అమ్మ చెప్పసాగింది:

"ఎంత త్వరగా వచ్చిందో అని ఆలోచిస్తున్నాను. ఎవరో బాగా కనిపెట్టి మనమీద సూటిగా ప్రయోగించారు. ఎంతటి పాపాత్ములో. నేను కావాలని యెవరికీ ద్రోహం చెయ్యలేదు. నాకు ఇలా యెందుకు జరగాలి? ఆరోజు కన్యాకుమారి నుంచి వచ్చిన తర్వాత ఆరంభమయింది."

"ఏమిటి ఆరంభమయింది?" అన్నాడు కేశవపిళ్ళె.

"ఆపేక్షా, ప్రేమా లేకపోవటం."

"నీ మీదనా?"

"అవును."

"నాకా?"

"అవును."

"నీకది యెలా తెలుసు?"

"మొహం చూస్తే తెలియటంలే? ఉన్న మాట చెప్పనా?"

చెప్పమని అనుమతించాడు కేశవపిళ్ళె చెప్పటం ఆరంభించింది కాత్యాయనీ అమ్మ:

"ఇదివరకు మనం ఇలా వుండేవాళ్ళమా? ఇలా మాటా మంతీ లేకుండా ఒకరి సంగతి ఒకరికి పట్టకుండా ఉండే వాళ్ళమా? గంటకు నలభైసార్లు నన్ను పిలిచేవారు. నేను ఏ పని మొదలు పెట్టినా వెంటనే పూర్తి చేయగలిగే దాన్ని కాదు. పని మధ్య పదిసార్లు పిలిచేవారు. తీరా దగ్గరకి వస్తే 'ఏమీ లేదు, ఊరికే పిలిచాను' అనేవారు. నేను దగ్గర కూర్చుంటేనే గాని పని సాగదనేవారు. అవునా? కాదా? ఇప్పుడో? అసలు నన్ను పిలుస్తున్నారా?"

కాత్యాయనీ అమ్మ అన్నది నిజం. స్నానం చేసేప్పుడు కూడా అతను పిలిచేవాడు. పనిచేసుకునేప్పుడు తన దగ్గరనే వున్నా ఆవిషయమే మరిచిపోయి 'కాత్యాయనీ!' అని పెద్దగా కేకవేసేవాడు.

"ఏమన్నా పిచ్చి పట్టిందా?" అని అడిగేదామె.

"ఓ, నాకు గుర్తులేదు." అని నవ్వేవాడు.

ఇలా ఆ యిల్లు 'కాత్యాయనీ' అనే కేకలతో మారు మ్రోగుతూ వుండేది. ఆమె అస్తమానం తన దగ్గరనే కూర్చోవాలి. లేకుంటే వీల్లేదు. కాత్యాయనీ అమ్మ అలాంటి సన్నివేశాలను ఒక్కొక్కటే గుర్తుకు తెచ్చింది. "మరి యిప్పుడో?" అని ప్రస్తుత పరిస్థితిని తెలియజెప్పింది.

దానికేదో సమాధానం చెప్పవలసిన బాధ్యత కేశవపిళ్ళై మీద వుంది.

"మనశ్శాంతి వుండాలి కదా? అవునా? కాదా?"

"మనశ్శాంతి వున్నా లేకున్నా నా అవసరముంది కదా? మనస్సు సరిగ్గా లేనప్పుడు కూడా నేనిక్కడ ఇలాగే వుండే దాన్ని కదా?"

"లేదు. నా మనస్సులో బాధ నీకర్థం కాదు. నేను విచారంగా వున్నప్పుడు నీవు కూడా దిగులు మొహం వేసేదానివి."

కాత్యాయనీ అమ్మ ఆ మాటను ఖండించింది. ఆమె స్వంత విషయం చెప్ప సాగింది: "ఉదయం మెళుకువ రాకపోతే నన్ను ఎలా లేపేవారు? అలా తెల్లవారిన తర్వాత కళ్ళు తెరుపుడు పడితే నాకెంతో వుత్సాహంగా వుండేది. ఎక్కడలేని ఓపిక వచ్చేది. కష్టమనిపించేది కాదు. నా మీద ప్రేమ వుంటే చాలు. నాకు మరేమీ అక్కర్లేదు."

అవును, కాత్యాయనీ అమ్మ అన్నమాట నిజం. చాలా రోజులనుంచి అలా జరగటం లేదని కేశవపిళ్ళై గుర్తు చేసుకున్నాడు. కాని అది కావాలని మాన లేదు. కావాలని ఒక కార్యక్రమంగా దాన్ని ఆరంభించలేదు కూడాను. కేశవపిళ్ళై లేచినప్పుడు కాత్యాయనీ అమ్మ వెల్లకిలనే, పక్కకు తిరిగి పండుకుని వుండేది. అప్పుడామెను హావభావాలతో అతను లేపేవాడు. అదెంతో ఆనందంగా వుండేది. అది అలాగే జరుగుతూ వచ్చింది. కన్యాకుమారి నుంచి తిరిగి వచ్చిననాడు కేశవపిళ్ళై లేచేసరికి కాత్యాయనీ అమ్మ పక్కలో లేదు. ఆమె బయట ఎక్కడనో కూర్చుని దిగులుపడుతూ వుంది. ఆ తర్వాత ఆ కార్యక్రమం ఆగిపోయింది.

"ఇక ముందు అలాగే జరుగుతుంది." అన్నాడు కేశవపిళ్ళై.

"ఇక ఆ పద్ధతి ఆరంభించటం మీ చేతగాదు. అందులో అంత ఆప్యాయత కూడా వుండదు. ఆ రోజులు గడిచి పోయాయి." అన్నది కాత్యాయనీ అమ్మ తడుముకోకుండా.

కాత్యాయనీ అమ్మ చెప్పింది నిజమేనని అనుమానం వేసింది కేశవపిళ్ళైకు. కాని అతను అలాంటి భావం కనబరచలేదు.

కాత్యాయనీ అమ్మ అన్నది: "నా మీద ప్రేమ వుంటే చాలు...నాకు మరేమీ అక్కర్లేదు. ఇంక అది సాధ్యం కాదు. ఎవరో పగవాళ్ళు మనమీద ఏదో ప్రయోగం చేశారు. అది మాత్రం ఖాయం."

కేశవపిళ్ళకు ఏమనాలో తోచలేదు. కాత్యాయనీ అమ్మ వెనకటి మంచి రోజులను, మోజులను గుర్తు చేసుకుంటూ వుంది. "నా దగ్గర కూర్చుని అన్నం తినమని బలవంతం చేసేవారు కదూ? మరి యిప్పుడో?"

మర్నాడు కేశవపిళ్ళ నిద్రలేచి చూచేసరికి కాత్యాయనీ అమ్మ మెళుకువతో పండుకొని వుంది. అయినా అతను ఒక నటన పూర్తి చేశాడు. కాని ఆ నటన జయప్రదంగా కొనసాగినట్లు కేశవపిళ్ళకు అనిపించలేదు. అతని ముఖం మీద నీరస మందహాసం తెలిసిపోయింది.

ఇంతలో ఒక రోజు మాజీమంత్రి మాత్యూ, కాంగ్రెసు ప్రెసిడెంటు లూకోస్ - ఇద్దరూ పార్కువ్యూకి వచ్చారు. అది రహస్య సమావేశం. మలబారు సంఘం వాళ్ళు ఏదో జాతీయమైన ప్రమాదం తీసుకురాబోతున్నారని లూకోస్ అభిప్రాయం. రాబోయే ఎన్నికల్లో కాంగ్రెసు వాళ్ళ బలం తగ్గిపోతుంది. బహుశా మలబారు సామ్యవాద ప్రాంతం అవుతుంది. మలబారువాళ్ళ వల్ల రానున్న గొడవలను గురించి కేశవపిళ్ళకు చెప్పాలి. అది రాబోయే గొప్ప ప్రమాదమని లూకోస్ అభిప్రాయం.

మాత్యూ మందహాసంతో తన అభిప్రాయం తెలియ పరిచాడు:

"ఈ యెన్నికల్లో మాకు సహాయం చెయ్యాలి"

నిప్పు రగిలినట్లు కేశవపిళ్ళ మండి పడ్డాడు:

"హుష్! ఆ మాట అనవద్దు. అవన్నీ పాతకాలపు విషయాలు. అప్పుడు మనకు సహాయం చేసేవాళ్ళు ఉండేవాళ్ళు. కనక మనం పోరాడి విజయం సాధించాం. రాబోయే రోజులు అలాంటివి కావు. మీరు నన్ను కలుసుకునేందుకు వచ్చారని తెలిస్తే చాలు. సలహాదారులు నన్ను సంజాయిషీ అడుగుతారు. ఇది సామ్యవాదులకు శక్తి నిచ్చే సమయం."

లూకోస్ తను వచ్చిన పని స్పష్టంగా చెప్పాడు:

"ఎన్నికల కట్టుబాట్లు తెలిసినవారు మరెవరూ లేరు. సరిగ్గా పోరాటం జరక్కపోతే సామ్యవాదులు గెలవటం ఖాయం. సరిగ్గ ప్రచారం చేసి తీవ్రంగా కృషి చెయ్యకపోతే కాంగ్రెసు పతనం తప్పదు."

"అది నిజమే" అన్నాడు కేశవపిళ్ళ కూడా. అంతేకాక యిక్కడ సామ్యవాదుల ప్రాబల్యమే యెక్కువగా వున్నదన్న అభిప్రాయం కూడా అతను వ్యక్తం చేశాడు. కాని మాత్యూ దానితో ఏకీభవించలేదు.

లూకోస్ అన్నాడు:

"మేము వచ్చిన వుద్దేశం మరింత స్పష్టం చేస్తాను. మేమంతా కలిసి ఆలోచించాం. ఒక నిర్ణయానికి కూడా వచ్చాం. పరిపాలనలో మనం

సంపాయించిన అనుభవ సామర్థ్యాలను సద్వినియోగం చేసుకోవాలని నిర్ణయించుకున్నాం."

మాత్యూ, లూకోస్ ఒకరి మోహం ఒకరు చూసుకొని నవ్వుకున్నారు. కేశవపిళ్ళైకు అందులోని ఆంతర్యం బోధపడలేదు.

"అసలు విషయమేమిటో స్పష్టంగా చెప్పవేయ్" అన్నాడతను.

మాత్యూ మరికొంత రహస్యంగా చెప్పాడు:

"కేరళ కాంగ్రెసు బాధ్యత వహించాలి". కేశవపిళ్ళై ఫక్కున నవ్వాడు.

"అయితే నన్ను రాజకీయ నాయకుడిలా నినాదాలు లేవదీస్తూ తిరగమంటావా?"

లూకోస్ కొంచెం మార్పు చేశాడు:

"అది కాదు మేమన్నది. అలా అనుకోకండి. పింఛను తీసుకొనే యీ వుద్యోగంలో నుంచి వెళ్ళి పోవాలి."

కేశవపిళ్ళై మాట్లాడక వూరుకున్నాడు

"మీరు ఎన్నికల్లో నిలబడాలి."

"నేనా?"

"అవును. అందులో ఆశ్చర్యమేముంది?" అన్నాడు మాత్యూ.

లూకోస్ ఆ వాక్యాన్ని పూర్తి చేశాడు.

"ఎన్నికల్లో గెలిచి మీరు కేరళకు ముఖ్యమంత్రిగా రావాలి."

కేశవపిళ్ళై పెద్దగా నవ్వాడు.

"ఏం, ఇందులో నవ్వవలసిందేముంది?" అన్నాడు మాత్యూ.

"ఏం లేదు. ఏం లేదు." అన్నాడు కేశవపిళ్ళై.

"కాంగ్రెసు పరిపాలనలో జరిగిన అవకతవకలన్నీ మంత్రులకు పరిపాలనా తంత్రం తెలియకపోవటం వల్లనే జరిగాయి. శాఖలను గురించి కూడా వాళ్ళకేమీ తెలియదు. ఈ పరిస్థితి మారాలి." అన్నాడు మాత్యూ.

నిజానికి కేశవపిళ్ళై మనస్సులో ఇంతవరకు ఇలాంటి ఆలోచన రాలేదు. అందువల్ల ఆ సూచన అతన్ని కదిలించి వేసింది. ఒక్కక్షణం తను ముఖ్యమంత్రి అయినట్టే అనుకున్నాడతను. "ఎందుకు కాకూడదు?" అని ఎవరో లోపల ప్రవేశించి అడుగుతున్నట్టుంది. అతనిలో అభిలాష గంతులు వేసింది. కొన్ని యేండ్ల క్రితం హరిహర అయ్యరు అనే బ్రాహ్మణుడు గోవిందన్ నాయరు తను చీఫ్ సెక్రటరీకి సహాయక కార్యదర్శి అయినప్పుడు, ఒకనాడు నీవు ఆ కుర్చీలో కూర్చుంటావు అని సూచించారు. ఆశీర్వదించారు కూడాను. ఆ ముసలి బ్రాహ్మడి ఆశీస్సులు ఫలించాయికదా ! అలాగే ఇదికూడా జరగ బోతున్నదేమో!

"ఈ మంత్రులకంటె బాగానే పరిపాలన నడిపించగలను." అన్నాడు కేశవపిళ్ళై తన్మయత్వంతో.

తన నోటి దగ్గర ఆహారం బలవంతంగా ఎవరో లాక్కొని పోయినట్టనిపించింది లూకోసుకు. అయినా అతనన్నాడు:

"తప్పకుండాను అందులో సందేహమేముంది."

మాత్యూ కూడా ఏదో చెప్పాలని చెప్పాడు: "ఇది దేశానికి మీరు చేయవలసిన గొప్పసేవ. లేకుంటే యీ సామ్యవాదులు వచ్చి దేశాన్ని మట్టిపాలు చేసేస్తారు."

లూకోస్ వ్యవహార దక్షత కొంచెం కార్యరూపం తాల్చింది: "ఈ వుద్యోగం వెనకటిలాగా సక్రమంగా కొనసాగదు. అప్పుడే యీ పరిపాలన చిరిగిపోయిన పుస్తకంలా తయారయింది. ఇంకా సిగ్గు పడవలసిన సంఘటనలు జరుగుతాయి. ప్రస్తుతం జీవితం సుఖంగా గడుపుకొనేందుకు కొద్దోగొప్పో వుంది. ఎంత కాదన్నా పెన్షను వస్తుంది. ఈ వుద్యోగానికి రాజీనామా చెయ్యాలి."

కొంచెం సేపు అర్థభరితమైన మౌనం ఏర్పడ్డది. లూకోస్ ఆ మౌనాన్ని భంగం చేస్తూ అన్నాడు:

"ఇందులో ఇంత ఆలోచించవలసిందేముంది?"

"వెంటనే యిది జరిగితీరుతుందని అనుకొని లూకోస్ ఇక్కడికి వచ్చారా?" అన్నాడు కేశవపిళ్ళె.

ఇద్దరూ తాము కొంచెం తొందర పడ్డామేమో అనుకొన్నారు. లూకోస్ కొంచెం సర్దుకున్నాడు.

"అదేం లేదు. మేము మాటసామెతగా అన్నాం."

ఆ తర్వాత వాళ్ళు తోటలను గురించి వ్యక్తిగతమైన విషయాలు ముచ్చటించుకున్నారు. మాత జ్యోతిర్మయీ దేవికి కేశవపిళ్ళెకు రావలసిన భాగం ఇప్పించే యేర్పాట్లు జరిగాయి.

"ఆలస్యం చెయ్యకుండా నిర్ణయించండి" అని సవినయంగా చెప్పి లూకోస్, మాత్యూ వెళ్ళి పోయారు.

కాత్యాయనీ అమ్మ నిద్రపోతూవుంది. కేశవపిళ్ళె త్వరత్వరగా వచ్చి ఆమెకు చక్కలిగిలిపెట్టి లేపాడు. ఆ తర్వాత ఆమెను ఎత్తుకొని తిప్పుతూ ఆ గదిలో నృత్యం చేశాడు.

కాత్యాయనీ నిద్రమత్తులో వుండి కూడా నవ్వుతూ ఉత్సాహం కనబరచింది. కేశవపిళ్ళెకూడా హుషారుగా వున్నాడు.

"ఏమిటీ ఆనందం?" అని అడిగిందామె.

"నేను ముఖ్యమంత్రినయితే?"

"ఓహెూ అదా విషయం?"

ఆ తర్వాత మంచం మీద కూర్చుని కేశవపిళ్ళె అసలు విషయమంతా చెప్పాడు. కాత్యాయనీ అమ్మ సమాధానం ఇది:

"ఈసారి సామ్యవాదులు పాలిస్తారు."

"అది నిజం. కాబట్టి నేను వుద్యోగం వదిలేసి సామ్యవాదులతో కలిసి యెన్నికల్లో నిలబడనా?"

కాత్యాయనీ అమ్మకు అవన్నీ యేమీ అక్కర్లేదు. తిరువనంతపురం నుంచి వెళ్ళిపోతేచాలు. విజయమ్మకు వివాహం కూడా కావాలి.

సలభై ఒకటి

కన్యాకుమారిలో, పిరుమెడ్‌లో జరిగిన వృత్తాంతం తర్వాత జ్యోతిర్మయీ దేవిలో చాలా మార్పు వచ్చింది. ఆమె దాదాపు సన్యాస జీవితం వదిలేసినట్టే. ప్రార్ధనలకు కూడా ఆమె వెళ్ళటం లేదు. ప్రభావతీ దేవి ప్రభుత్వం వచ్చిన తర్వాత ఆశ్రమంలో అంతకు ముందు ప్రవేశించిన అనాధ స్త్రీలు ఒక్కొక్కరే అక్కడి నుంచి వెళ్ళి పోసాగారు. అందుకు ఆమె కాదని కూడా అనలేదు. సావిత్రి మాత్రం ఇంకా అక్కడే వుంది. అనాధ మందిరాన్ని గురించి జ్యోతిర్మయీ దేవికి ఇప్పుడేమీ గుర్తున్నట్టు లేదు. దాన్ని గురించి ఆమె యెవరితో ఏమీ అంటున్నట్టు కూడా లేదు. ఆశ్రమంలో మిగిలిన సన్యాసినులతో తనకేమీ సంబంధం లేనట్టుగానే ఆమె మెలుగుతూ వుంది.

పిరుమెడ్ వృత్తాంతం జరిగిన ఒక నెలకు జ్యోతిర్మయీ దేవిలో గర్భవతి అయిన సూచనలు కనిపించాయి. మాటిమాటికి నోట్లో నీళ్ళు రావటం, ఉమ్మివెయ్యటం, వాంతులు రావటం ఎందుకో ఆమెకు బోధపడలేదు. కాని సావిత్రి యిదంతా గమనించింది. మాతాజీలో ఏదో దౌర్బల్యం ప్రవేశించిందని ఆమెకు సందేహం కలిగింది. తల్లి తనబిడ్డ నడిగినట్టుగా" ఏమిటిదంతా? ఈ ఉమ్మి వేయటం, వాంతి చేసుకోవటం?" అని అడిగింది.

ఏదో నేరం మోపుతున్నట్టు భావించి తప్పు చేసిన బిడ్డలాగా జ్యోతిర్మయీదేవి "ఏమీ లేదు" అని సమాధానం చెప్పింది.

మళ్ళీ అలాగే జరిగినప్పుడు సావిత్రి మళ్ళీ అడిగింది: "ఏమీ లేదంటే సరిపోదు. ఏమయిందో విషయం చెప్పండి".

తప్పు చేసినందుకు సిగ్గు పడుతూ కూడా తనలోని గాంభీర్యం పోకుండా "ఏమీ లేదు" అన్నది జ్యోతిర్మయీ దేవి.

చివరకు కన్యాకుమారిలో, పిరుమెడ్‌లో జరిగిందంతా విశదంగా సావిత్రికి చెప్పింది జ్యోతిర్మయీ దేవి. సావిత్రికి భయం వేసింది. "ఇక ఏం చెయ్యాలనుకుంటున్నావు మాతాజీ!" అని కంగారుపడుతూ అడిగింది.

ఆ రోజులాగా ఈనాడు కూడా ఈ విషయం జ్యోతిర్మయీ దేవికి సావిత్రికి అనిపించినంత ఎబ్బెట్టుగా అనిపించలేదు.

"ఎందుకంత భయం?" అదే ఆమె ఎదురుప్రశ్న.

"ఇది ఆశ్రమమం. ఇక్కడ మీరు చాలా ముఖ్యులు. కొంచెం ఆలోచించండి మాతాజీ."

పేరు ప్రతిష్ఠలుగల స్త్రీకి ఇది దోషారోపణమే. కాని యెంత ప్రయత్నించినా సావిత్రి అందులోని గాంభీర్యాన్ని అర్థం చేసుకోలేక పోయింది. ఒకరోజు జ్యోతిర్మయి స్పష్టంగా అనేసింది: "ఆడదానికి కడుపు రాదా? కడుపు వస్తే కనదా?"

సావిత్రి సమాధానం చెప్పలేక పోయింది.

కాని జ్యోతిర్మయీ దేవికి ఒక అనుమానం తీర్చుకోవాలని వుంది. "నలభై ఆరేండ్ల వయస్సులో ఆడదానికి కడుపు వస్తుందా?"

ఇది ఆమెకు తెలియదు. "వస్తే రావచ్చు. భగవంతుడు రాసిపెట్టివుంటే జరిగి తీరుతుంది. లిఖితం అనుభవించి తీరాలి" అన్నది సావిత్రి.

ఆ తర్వాత జ్యోతిర్మయీ దేవి మనస్సులో ఎప్పుడూ ఈ ప్రశ్న మెదులుతూనే వుంది: "నలభై ఆరేండ్ల వయస్సులో ఆడవాళ్ళకు కడుపు వస్తుందా?" అదే అనుమానం ఆమెకి.

ఒక రోజు విసుగుపుట్టి సావిత్రి అడిగింది: "నలభై ఆరేండ్లకు కడుపు వస్తుందా అని ఆ రోజు ఆలోచించారా?"

ఇది ఒక విధంగా దోషారోపణ. అది గమనించకుండా జ్యోతిర్మయీదేవి సమాధానం చెప్పింది: "అదేమీ నేనాలోచించలేదు. నే నేమీ ఆలోచించలేదు సావిత్రీ!"

సావిత్రి చెవిలో ఏదో చెప్పింది. 'ఏమిటి నీవు చెప్పేది?' అని జ్యోతిర్మయి అడుగుతున్నది. 'ఏమీలేదు' అని సావిత్రి సమాధానం. నిజానికి సావిత్రి లోపల లోపల ఉడికి పోతూ వుంది.

ఇద్దరి అభిప్రాయాల్లో చాలా వ్యత్యాసముంది. ఆ వ్యత్యాసం ఇద్దరికీ బోధపడలేదు. నలభై ఆరేండ్ల వయస్సులో స్త్రీ గర్భవతి అవుతుందా - అని జ్యోతిర్మయీ దేవి ఎందుకు అడుగుతున్నదో సావిత్రికి అర్థం కాలేదు. జ్యోతిర్మయీ దేవి స్త్రీ. స్త్రీ తల్లి కావటం సహజం. తల్లి అయేందుకు రొమ్ముల్లో జిల పుట్టాలి. గుండెలో ఆవేశంరావాలి. అది ఒకరకమైన ఉద్రేకం. తల్లి అయేందుకే స్త్రీ జన్మిస్తుంది. ప్రసవవేదన అన్ని సుఖాలకంటె గొప్పది. తను తల్లి అయేందుకు వీల్లేక పోతే ఈ నేరూరటం, వాంతులు రావటం గర్భవతి లక్షణాలు ఎందుకు కనిపిస్తున్నట్టు? ఈ సందేహ నివారణకే జ్యోతిర్మయీ దేవి 'నలభై ఆరేండ్ల 'వయస్సులో కడుపు వస్తుందా? అని మాటిమాటికి అడుగుతూ వున్నది. ఆమెకు అది కచ్చితంగా తెలుసు కోవాలని వుంది. అదే నిజమయితే తన జీవితం చరితార్థమయినట్టు భావిస్తుందామె.

సావిత్రి అపార్థం చేసుకుంది. ముందు మరేమీ ప్రమాదం జరగదు కదా అనీ ఆమె చెయ్యకూడని పని చేసిందేమోననీ అనుకొన్నది. కాని అది నిజం కాదు. నలభై ఆరేళ్ళ వయస్సులో కూడా కడుపు వస్తుందని నిరూపించేందుకే ఆమె మాటిమాటికీ ఈ ప్రశ్న అడుగుతూ వున్నది. సావిత్రి తన సమాధానం కోసం ఆమె ఎదురుచూస్తున్నదని అనుకున్నది. జ్యోతిర్మయీ దేవి తన జీవితాన్ని చరితార్థం చేసుకుందామని ఉవ్విళ్ళూరుతున్నదనే విషయం సావిత్రి అర్థం చేసుకోలేక పోయింది.

అలా కొన్ని రోజులు గడిచాయి. ఈ పరిస్థితి నుంచి తప్పించేందుకు సావిత్రికి ఒకే మార్గం తోచింది. కేశవపిళ్ళకు ఈ వార్త తెలియజెయ్యమని చెప్పింది. అందుకే జ్యోతిర్మయీ దేవి కేశవపిళ్ళకు ఉత్తరం మీద ఉత్తరం రాస్తూ వుంది.

జ్యోతిర్మయీ దేవి రోజూ వుత్తరాలు రాస్తూవుంది. కాని అతని దగ్గరి నుంచి ఒక్కదానికీ జవాబు రాలేదు. ఇది మగవాళ్ళకు అలవాటే అని సావిత్రికి తెలుసు. అలాంటి భావం కూడా వాళ్ళు కనబరచరని ఆమెకు తెలుసు. దానికి భిన్నంగా ఎక్కడయినా జరిగితే అది ఆశ్చర్యకరమయిన విషయం. కాని జ్యోతిర్మయీ దేవి నిశ్చింతగా వుంది. అంతేకాదు. తన ప్రాణేశ్వరుడు తనకు ప్రసాదించిన పరమానందాన్ని గురించి ఆమె పరవశించి పాటలు పాడుకుంటూ వుంది. ఆ పాటలు వింటుంటే బాగానే వుంది. కాని ప్రాణేశ్వరుడు ప్రసాదించింది పరమానందమనే భావం ఈ పరిస్థితిలో కలుగుతుందా? ఆ మగవాణ్ణి శపిద్దామనిపిస్తుంది కదా!

సావిత్రి అడిగింది: "ఆశ్రమ మాత గర్భవతి అయిందని అందరికీ తెలిస్తే అది ఆశ్రమానికీ, దేశానికీ, చివరకు ఆశ్రమ మాతకూ కూడా సిగ్గు చేటు కదా?"

"ఆశ్రమమూ ఆశ్రమం! ఆశ్రమం పేరుప్రతిష్ఠలు మంటకలిసిపోతే పోనీ. ఎవరికి నష్టం?"

సావిత్రి మాట్లాడలేదు. జ్యోతిర్మయీ దేవి చెప్పసాగింది: "సావిత్రీ! నా విషయం అందరికీ తెలుసు. నా చరిత్ర కూడా తెలుసు. నేను దోషిని. నేను మంచి దాన్నని నేను చెప్పుకోటం లేదు."

కాని సావిత్రికి ఒక ప్రశ్న అడగాలనిపించింది: "మరి మాతాజీ! ఈ వేషం ఎందుకు వేసుకున్నట్టు?"

సావిత్రి పూర్తిగా జ్యోతిర్మయీ దేవి ఆశ్రమంలో బతుకుతూ వున్నది అలాంటి స్త్రీ ఇలాంటి ప్రశ్న వెయ్యటం కొంచెం ధిక్కరించినట్టే వుంటుంది. కాని అందులోని వ్యంగ్యం, తిరస్కారం జ్యోతిర్మయీ దేవి పట్టించుకున్నట్టులేదు. "కొంచెం దారి మార్చుకోవాలనుకున్నాను మార్చుకున్నాను." అన్నది ఆమె ఆ ప్రశ్నకు సమాధానం చెబుతూ.

"ఒకవేళ ఇది నిజమయితే నా కడుపులో ఆయన బీజం ప్రవేశించిందన్న మాట. ఆ తృప్తి నాకు చాలు." అన్నది జ్యోతిర్మయీ దేవి.

"కాని ఆయనకు దీన్ని గురించి అలా అనిపిస్తుందా." జ్యోతిర్మయీ దేవి కూడా ఈ పరిస్థితికి సమాధాన పడ్డట్టే వుంది. "ఇది నా అదృష్టం సావిత్రీ! లేకుంటే నా గర్వానికి ప్రతిఫలం. అది నేననుభవించి తీరాలి. నీతికి, నియమానికి కట్టుబడి నేను నా యౌవనం గడపలేదు."

ఒక పెద్ద నిట్టూర్పుతో జ్యోతిర్మయీదేవి తన మాట ముగించింది - "ఒకనాడు జీవితాన్ని వ్యర్థం చేసుకున్నాను. ఎక్కడికీ చేరుకోలేక పోయినాను."

కొంచెం సేపు వాళ్ళిద్దరికి చెప్పుకోవలసిన విషయాలు ఏమీ తోచలేదు. జ్యోతిర్మయీదేవి తన జీవితాన్ని ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటూ వుంది. సావిత్రి కూడా ఆ సమయంలో తన గత జీవితాన్ని గురించే ఆలోచిస్తూ వుండవచ్చు.

దానికి పర్యవసానంగా సావిత్రి ఒక సూచన చేసింది: "నేనో విషయం చెప్పనా మాతాజీ! నాకది బాగుంటుందని తోచింది. మాతాజీ! ఇంత వరకూ మీరు వుత్తరాలే రాస్తున్నారు. వెళ్ళి ఒకసారి కలుసుకుంటే ఎలా వుంటుంది? ఇలా అయింది, ఏం చెయ్యమంటారని అడిగితే చాలు. ఆయన ఏదో ఒక ఉపాయం చెప్తారు."

దీనికి సమాధానం చెప్పేందుకు జ్యోతిర్మయీ దేవికి ఎక్కువ ఆలోచించవలసిన అవసరం లేకపోయింది.

"దేనికి ఉపాయం?" అని అడిగింది.

"జవాబు చెప్పలేని స్థితిలో సావిత్రి అన్నది:

"లేదు - ఇలా - దీనికి కారకుడయిన మగవాడిని కొంచెం అడిగి చూడటం మంచిది కదా?"

కొంచెం సేపాగి సావిత్రి మళ్ళీ అన్నది:

"ఏమీ కాకపోయినా అపకీర్తి తొలిగిపోతుంది కదా?"

విషాదపూరితంగా నవ్వి జ్యోతిర్మయీ దేవి దానికి సమాధానం చెప్పింది: "ఆ కాలం గతించింది సావిత్రీ! అది నీకు చెప్పాను గదా? ఇకముందు మనం కలుసుకోవటం లేదు, మన యిద్దరిమధ్యా ఎలాంటి సంబంధం వుండకూడదని - ఆయన స్పష్టంగా చెప్పేశారు."

"అది యీ ప్రమాదం జరక్కముందు చెప్పిన మాట కదా? ఇప్పుడిలా జరిగింది. దీనికొక మార్గం ఆయన వెతకాలి గదా? మోసం చేసి ఏదో అయిపోయిందని అంటే సరిపోతుందా?"

"అయితే ఆయన ఏం చెయ్యాలంటావు? ఏమిటి నీవనేది?" అని అడిగింది జ్యోతిర్మయీదేవి.

సావిత్రికి ఆ విషయమై అంత ఆలోచించవలసిన అవసరం లేక పోయింది. ఆమె వెంటనే సమాధానం చెప్పింది: "ఆయన ఒప్పుకోవాలి. అదే కావాల్సింది. మరేం చెయ్యనక్కర్లేదు."

జ్యోతిర్మయీ దేవి 'కాదు' అన్నట్టుగా తలవూపింది.

"ఆయన మనశ్శాంతికి నేనెప్పుడూ అంతరాయం కలిగించను."

"అయితే" అని ప్రశ్నించింది సావిత్రి ఊపిరాడనట్టు.

"అయితే ఏముంది. ఇదే నిజమయితే నేను బిడ్డను కంటాను. నా జీవితం సార్థకమవుతుంది. ఆ బిడ్డను నేను బంగారంలా పెంచుకుంటాను. ఈ యిల్లు నాది. ఇక్కడనే నా జీవితం తెల్లవారుతుంది."

సావిత్రికి జ్యోతిర్మయీ దేవి ఉద్దేశం తెలిసి పోయింది. కాని ఆమె ఆంతర్యం బోధపడలేదు.

"నా ప్రాణేశుడు నా కొసగిన యీ
పరమానందము వరప్రసాదము
ఎంతని చెప్పను ఇంతీ"

అని జ్యోతిర్మయీ దేవి పాడుకుంటూ వున్నది. అంత బిగ్గరగా పాడకపోయినా ప్రభావతీ దేవికీ, మరి కొంత మందికీ ఆ పాట వినిపించింది.

సావిత్రి ఆ పాటలో లీనమై పోయింది. ఆమె శిలా విగ్రహంలాగా కూర్చుండి పోయింది. వెనకటి విషయాలు గుర్తు తెచ్చుకుంటూ జ్యోతిర్మయీ దేవి పాడుతూవుంది. ఆ పాటలో ఇమిడి ఉన్న అనుభవాలు ఆమె పొందింది గదా!

కొన్ని చరణాలు పాడిన తర్వాత సావిత్రి అడిగింది: "మాతాజీ, ఈ పాటకు అర్థమేమిటి?"

జ్యోతిర్మయీ దేవి భావయుక్తంగా నవ్వింది.

"ఏమిటీ, ఇది వింటే దీనికి అర్థమంటూ ఒకటి వున్నదని కూడా అనిపించిందా?"

మందహాసంతో సావిత్రి దానికి సమాధానం చెప్పింది: "ఏదో అర్థమున్నదని మాత్రం నాకు అనిపిస్తున్నది. కాని పూర్తిగా అర్థం కావటం లేదు."

జ్యోతిర్మయీ దేవికి ఆ పాటకు అర్థం చెప్పేందుకు ఓపికా లేదు, తీరికా లేదు. ఆ పాటలోని భావలహరిలో ఆమె కొట్టుకుపోతున్నది. ఆ పాటను ముక్కలు ముక్కలు చేసి దానికి ప్రతిపదార్థం, తాత్పర్యం చెప్పేందుకు ఆమెకు మనస్కరించలేదు. "ముందు విను, అర్థం కోసం బాధపడకు. తర్వాత చెప్తాను." అన్నది.

జ్యోతిర్మయీ దేవి మళ్ళీ పాట ఆరంభించింది. సావిత్రి అర్ధ నిమీలిత నయనాలతో పాటలో మునిగి పోయింది.

నిత్యానందమయి, తేజస్వరూపిణి కిటికీ చాటున నిలబడి ఆదృశ్యాన్ని చూచారు. లోపల ఇద్దరూ ఆ పాటలో తన్మయత్వం పొందుతున్నారని వాళ్ళు కనిపెట్టారు. వాళ్ళు చెవులు మూసుకుని ఒకరి మొహం ఒకరు చూచుకోటం మొదలు పెట్టారు. బహుశా యీ వార్త చెప్పేందుకు ఆశ్రమ మాత ప్రభావతీదేవి దగ్గరికి వెంటనే వెళ్ళినట్టుంది.

పాట ముగిసింది. అయినా సావిత్రి అలాగే కూర్చుని వుంది. జ్యోతిర్మయీ దేవి ఆమెను తన్మయత్వంనుంచి తట్టి లేపింది. "ఏమిటే, నీకు ఇదంతా అనుభవానికి వచ్చిందా?" అని అడిగింది.

"ఆ, లేదు మాతాజీ! నాకు పూర్తిగా అర్థం కూడా కాలేదు. ఒక్క క్షణం తర్వాత సావిత్రి పారవశ్యంతో అడిగింది: "మాతాజీ?"

"నేను నీకంతా చెప్పాను గదటే? ఒక్కసారి గాదు, రెండుసార్లు."

"అదేనా యిది?" అడిగింది సావిత్రి.

"అదే" ననే భావంతో జ్యోతిర్మయీ దేవి తల వూపింది.

పాపం శాంతించుగాక అని అక్కడనుంచి పరుగెత్తి వెళ్ళి ఏకాంతంలో కూర్చున్న నిత్యానందమయి., తేజస్వరూపిణి ఆలోచించుకుంటున్నారు. అది స్తోత్రం చెయ్యవలసిన స్థలం. అక్కడ కూర్చుని ఆమె పాడుతున్న పాటఏమిటి?

"అది నేను వినలేను. నా చెవులు బద్దలయిపోతున్నాయి." అన్నది తేజస్వరూపిణి.

"అది వింటూ నిలబడడం పాపం" అన్నది నిత్యానందమయి.

"ఒట్టి పాపమేనా?"

"మనస్సు చలించిపోతుంది. అలాంటి చోటికి దూరంగా వుండాలి."

తేజస్వరూపిణి దాపరికం లేకుండా ఒప్పేసుకుంది: "నిజం చెప్తాను. ఆ పాట వింటుంటే నా ఒళ్ళు పులకలెత్తి పోయింది. ఏదో బాధ కలిగింది. అందుకనే నేను చెవులు మూసుకున్నాను."

ఆ మాటను పూర్తి చేస్తూ నిత్యానందమయి అన్నది: "అది యింకా చెవుల్లో గింగురుమని వినిపిస్తూనే వున్నది."

తేజ స్వరూపిణి అడిగింది: "మనం మాతాజీ దగ్గరకి వెళ్ళి యీ విషయం చెప్తే యెలా వుంటుంది? ఈ రోజు పాట పాడింది. ఇంకోరోజు గదిలోకి మగవాళ్ళను పిలుచుకు రావచ్చు."

నిత్యానందమయి దానికి సమాధానం చెప్పలేదు. కాని ఆమెకు ఒక అభిప్రాయముంది. ఇప్పుడామె సన్న్యాసిని కాదు. సన్న్యాసం వదిలి చాలా రోజులయింది. "ముందు ముందు ఇక్కడ చాలా విషయాలు జరుగుతాయి." అంటూ ఆమె ముగించింది.

అటు జ్యోతిర్మయీ దేవి సావిత్రికి ఆ పాటలో అర్థం చెబుతూ వుంది. సావిత్రి శ్రద్ధగా వింటున్నది. అంతా చెప్పిన తర్వాత ఆమె తన అభిప్రాయం తెలియపరిచింది: "అయినా ఇది కొంచెం అతిగానే వుంది మాతాజీ."

ఆ పాట వెనక ఒక కథ వుంది. జ్యోతిర్మయీ దేవి ఆ కథ చెప్పింది: వెనకటి కాలంలో ఒక రాజు తన రాణి మీద అలిగి ఆమెను కలుసుకోలేక పోయాడు. ఆ రాణి సోదరుడు కవి. అతను తన సోదరికి ఈ పాట వ్రాసిఇచ్చాడట.

సావిత్రికి నమ్మకం కుదరలేదు. ఆమె నివ్వెర పోయి చూస్తూ వుంది.

"సోదరుడు సోదరికి ఈ పాట వ్రాసి ఇచ్చాడా?"

"అవును ఈ రాణికి వీణ వాయించటం, పాటపాడటం బాగా వచ్చు. ఒక రోజు సాయంత్రం రాణి వీణ వాయిస్తూ 'శంఖ ముఖం' లోని తన మహల్లో కూర్చుని యీ పాట పాడిందట. అప్పుడే రాజు తంపురాన్ గాలి కోసం బయటికి వచ్చి అక్కడ కూర్చుని వున్నాడట. ఆ పాటవిని రాజు తన పాత వైరమంతా మరిచి పోయి రాణి దగ్గరకి వెళ్ళాడని అంటారు."

ఇలాంటి సంఘటన జరిగిందనటంలో సావిత్రికి ఏమీ సందేహం లేదు. నిజానికి ఆ పాటలో ఏదో మహత్తరమైన మంత్రశక్తి వుంది. మగవాడిగా పుట్టిన వాడు ఆ పాట వింటే చాలు, అన్నీ మరిచి పోయి అక్కడికి చేరతాడు.

"కాని బాబయ్య మీ పాట వింటే......" అన్నదామె.

కొంచెం సేపు ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. బహుశా జ్యోతిర్మయీ దేవి కూడా అదే ఆలోచనలో వున్నట్టుంది. కాని సావిత్రి మరో ఆలోచనలో పడింది.

"బాబయ్య ఇప్పుడయినా సరే వస్తే......." ఒక్క క్షణం ఆగి సావిత్రి చెప్ప దలుచుకుంది చెప్పేసింది:

"మాతాజీ! మీరెన్నో వుత్తరాలు రాశారు. ఒక్క దానికి కూడా జవాబు రాలేదు."

తను జవాబు కోసం వుత్తరాలు రాయలేదన్నది జ్యోతిర్మయీ దేవి. కేవలం అతనికి శుభవార్త తెలియ పరిచేందుకే ఆమె రాసింది.

సావిత్రి అంతకు ముందు వందసార్లు అడిగిన అదే ప్రశ్న మళ్ళీ అడిగింది: "మీరెప్పుడూ అదే మాట అంటారు. నాకేమో అర్థం కాదు. ఆయనకు తెలిసినంత మాత్రాన లాభమేముంది?"

"ఆయనకు ఈ విషయం తెలిస్తే అంతే చాలు." జ్యోతిర్మయీ దేవి తన మొదటి సమాధానమే మళ్ళీ చెప్పింది.

"పోనీ అలాగే అనుకున్నా వుత్తరంలో ఈ సంగతి స్పష్టంగా రాసినా సరిపోయేది. కనీసం అదన్నా చెయ్యలేదు."

సావిత్రి కొంచెం వినుక్కుంటూ సమాధానం చెప్పింది: "మీ కింకా సందేహమా మాతాజీ? నాకు ఈ విషయంలో అనుభవం వుంది. లక్షణాలన్నీ అవే."

జ్యోతిర్మయీ దేవి తన సందేహానికి కారణం చెప్పింది: "నలభైఆరేళ్ళ వయస్సులో ఇలా అవుతుందా అని."

"ఆ విషయం నాకు తెలియదు. కాని యిది అదే."

"మీరు ఆయన దగ్గరకి వెళ్ళి మాట్లాడితే ఎలా వుంటుంది?" అన్నది సావిత్రి మళ్ళీ.

మరో క్షణం ఆగి మళ్ళీ ఆమె సూచన చేసింది:

"ఆయనే దీనికొక మార్గం వెతుకుతారు. మీకేమో యిది ఆటగా తమాషాగా వుంది."

సావిత్రి అంతటితో ఆపలేదు:

"ఇలాంటి గొడవలోనే నేను గూడా చిక్కుకొని నిప్పు మింగాను."

జ్యోతిర్మయీ దేవిలో ఏ మాత్రం కంగారు కనిపించలేదు. సావిత్రి చెప్పినట్టు నిప్పు మింగేంత ప్రమాదం ఇందులో ఏమీ లేదని ఆమె అభిప్రాయం. మందహాసం ఆమె ముఖం మీద మందగించకుండా నిరంతరం చిందుతూనే వుంది. ఆ నలహాను ఆమె నిరాకరించలేదు, అంతే. అది చాలా అసాధారణమైన పరిస్థితి.

త్వరలోనే ఆశ్రమవాసుల కందరికీ యీ విషయం తెలిసి పోయింది. నిత్యానందమయి, తేజస్వరూపిణి రహస్యంగా విన్నారు. జ్యోతిర్మయీదేవిలో వచ్చిన మార్పు కూడా వాళ్ళ సందేహానికి కారణమయింది. ఆమె విషయంలో అది పిడుగు లాంటి వార్త.

దాని అర్థమేమిటి? ఆశ్రమం మట్టిపాలయినట్టే. ఇకముందు ఇక్కడికి ఎవరయినా వస్తారా? ఒక్కరి పొరపాటు వల్ల అందరూ దీన్ని వ్యభిచార గృహంగా పరిగణిస్తారు. ఏమీ తప్పు చెయ్యకపోయినా నిత్యానందమయిని, తేజస్వరూపిణిని కూడా అందరూ అనుమానిస్తారు. వాళ్ళెక్కడికి వెళ్ళ గలరు? ప్రజలకు మొహం ఎలా చూపించగలరు? ప్రభావతీ దేవి తన దగ్గర వున్నదంతా యిక్కడ ఖర్చు పెట్టేసింది. జీవితంలో పరాజితులయిన వీళ్ళందరూ ఇక్కడ క్షేమంగా వుండచ్చని దీని అభివృద్ధి కోసరం, కృషి చేస్తున్నారు. ఈ పాడుముండవల్ల అంతా ఛిన్నాభిన్న మయిపోయింది.. ఆ సన్న్యాసినులకు జీవితంలో ఇది గడ్డు సమస్యగా తయారయింది.

మరో విషయం. విమలమ్మ మలబారు నుంచి ఉమాదేవిని పిలుచుకు వచ్చింది. 'ఉమాదేవీ సదన' మనే పేరిట మరో ఆశ్రమం కూడా ఆరంభమయింది. ఉమాదేవి ఆంధ్ర దేశం నుంచి వచ్చింది. వయస్సులో వున్నది.. అందంగా వుంటుంది. పసిడి వన్నెలో వుంటుంది. మడమలదాకా

జుట్టు వేలాడుతూ వుంటుంది. నల్లటి కళ్ళు. నవ్వితే ఎవరయినా లొంగిపోతారు. తిరువనంతపురమంతా యిప్పుడు 'ఉమాదేవి సదనం' వైపు ప్రవాహంలా కొట్టుకు పోతున్నది.

అందరూ ఒకరి మీద ఒకరు దోషారోపణ చేస్తున్నారు. ఇలాంటి పరిస్థితి ఏర్పడేందుకు ప్రభావతీ దేవి కారణమని అంటుంది తేజస్వరూపిణి. జ్యోతిర్మయీ దేవి వెంటబెట్టుకొని ఆశ్రమంలో చేర్చిన దురాచార స్త్రీలందరూ ఎలా వచ్చారో అలా వెళ్ళి పోతారు. ప్రభావతీ దేవి ఆశ్రమమాత కావాలనుకుంది. ఆమె డబ్బు తెచ్చింది. పెద్ద వుద్యోగం వదులుకుని వచ్చింది. జ్యోతిర్మయీ దేవికి ఏమీ అధికారం లేకుండా చేసింది. ఆమె వెనకటి దారినే మళ్ళీ అనుసరించింది. తేజస్వరూపిణి ఇలా తర్కించు కుంటున్నది. నిత్యానందమయి అభిప్రాయం మరో రకంగా వుంది. జ్యోతిర్మయీ దేవి ఆశ్రమ మాతగా వున్నా యిలా జరిగివుండేది. అది ఆమె స్వభావం. కాని యిద్దరికీ భవిష్యత్తును గురించి పెద్ద అనుమానం. ఈ విషయం అందరికీ తెలిస్తే ఎలా తిరగటం? ఎలా బతకటం?

ముగ్గురు సన్న్యాసినులూ కలిసి ఆలోచించారు. పరిస్థితి ఎంత విషమించిందో అందరికీ అర్థమయింది. ఇంత సురక్షితమైన కేంద్రం ఇలా మారుతుందని యెవ్వరూ అనుకోలేదు. ఒకరినొకరు దూషించుకోవటం మానేసి అందరూ కలిసి ఒక మాట అన్నారు. ఒక మార్గంలో వెళ్ళేప్పుడు తనతో చరించే వాళ్ళెవరో గమనించి వుండవలసింది. ఆ విషయం మనసులో పెట్టుకున్నట్టయితే యీ స్త్రీతో సంబంధం పెంచుకునే వాళ్ళు కాదు. ప్రభావతీ దేవి అన్నది: "ఏం చేద్దాం? మన అదృష్టం ఇలా వుంది. పాతపురాణమంతా అయిపోయిందనుకున్నాం. ఈ ముసలి తనంలో ఇది నాగు పాములా పడగ విప్పుతుందని అనుకోలేదు."

అందరూ ఆ మాట ఒప్పుకున్నారు. తేజస్వరూపిణి అడిగింది: "దీనికి ఉపాయమేమిటి? ఇప్పుడు మన తెలివి తక్కువను గురించి ఆలోచిస్తూ కూర్చుంటే లాభం లేదు. ఇక్కడికి అందరూ రావటం మానేశారు."

"మాతాజీని నేరుగా అడుగుదాం" అని నిత్యానందమయి తన అభిప్రాయం చెప్పింది.

ప్రభావతీ దేవి ఆమోదించింది.

"అడుగుతాను. అడక్కుండా ఎలా ఉండను? అడగటమేకాదు, అడిగిన తర్వాత ఆశ్రమం నుంచి వెళ్ళిపొమ్మని కూడా అంటాను. ఆశ్రమంలో ఇలా అవినీతిగా ప్రవర్తించిన వాళ్లను శిక్షించేందుకు ఒక శిక్షా పద్ధతి కూడా ఏర్పరుస్తాను."

"వెళ్ళమని అంటే వెళ్తుందా? ఇది ఆమె యిల్లుకదా? ఆశ్రమం కోసం ఇచ్చిన తర్వాత ఆమెను బయటికి వెళ్ళమనవచ్చునా?"

అలా అనవచ్చునని చెప్పింది ప్రభావతీదేవి. కాని ఆమె వెళ్ళకపోతే కేసుపెట్టి తగూలాడవలసి వస్తుంది. ఆకు ముల్లు మీద పడ్డా, ముల్లు ఆకు మీద పడ్డా ముప్పు ఆకుకే వస్తుంది.

"కేసు పెట్టినా పెట్టకపోయినా ఆశ్రమం పేరు మాత్రం చెడిపోయింది"

మనమంతా వెళ్ళి ఆమె కాళ్ళ మీదపడి దయచేసి ఇక్కడి నుంచి వెళ్ళమ్మా అని బతిమాలుకుందాం. మమ్మల్ని నాశనం చెయ్యవద్దని ప్రాధేయపడదాం." అని సూచించింది తేజస్వరూపిణి.

"ఆమె అలాంటి ఉత్తమురాలేం కాదు. మనం లక్ష చెప్పినా ఆమె యిక్కడి నుంచి వెళ్ళదు" అని తన అభిప్రాయం చెప్పింది ప్రభావతీదేవి.

ఒక్కక్షణం ఆగి ప్రభావతీ దేవి మళ్ళీ అన్నది: "ఆ బిచ్చగత్తెలను చేర్చినప్పుడే నేననుకున్నాను - ఏదో గొడవ వస్తుందని. ఆరోజుతో ఈ ఆశ్రమంలో వున్న పవిత్రత నశించింది". అందరూ ఈ అభిప్రాయంతో ఏకీభవించారు.

సన్యాసినులు చాలాసేపు ఈ విషయం చర్చించుకున్నారు. కాని ఒక నిర్ణయానికి రాలేకపోయారు. అందరి మనసులో ఏదో ఆలోచన వున్నట్టుంది. కాని ఆ విషయం చెప్పేందుకు అందరూ సందేహిస్తున్నారు. ఉపాయం ఎంత వరకూ కొనసాగుతుందో అని అందరికీ సందేహమే. అయినా ముగ్గురి తలకాయల్లో అదే ఆలోచన ప్రవేశించింది. ఆ విషయమై వాళ్ళు ప్రత్యేకంగా చెప్పవలసిందేమీ లేదు. అలాంటి పరిస్థితిలో ఏ ఆడదానికయినా మొట్టమొదట అదే ఆలోచన తడుతుంది.

ఎవరింట్లోనయినా పెళ్ళిగాని పిల్లకు కడుపు వచ్చిందనుకోండి. అది రహస్యంగా వుంటుంది. మొట్టమొదట తట్టే ఉపాయ మేమిటి? కాటేసిన పాము చేతనే విషం దించేందుకు ప్రయత్నించటం జరుగుతుంది. రెండో ఉపాయం - ఆ పిల్లకూ, మిగిలిన వాళ్లకూ చెడ్డపేరు రాకుండా వుండేందుకు ఎవరికీ తెలియకుండా కడుపు తీసేయించటం.

"అది చాలా కష్టం. తప్పు. పాపం. అయినా చెయ్యటం మంచిది" అన్నది ప్రభావతీదేవి మెల్లగా.

ఆ తర్వాత ఆమె మరో మాట అన్నది: "నిత్యానందమయి తన సందేహం మాత్రం తెలియ జేసింది. మార్గమేమీ సూచించలేదు."

"ఏమిటి మీరనేది? ఆమె దానికి ఒప్పుకుంటుందా?"

"ఆశ్రమంలోనా? అదియెలా సాధ్యమవుతుంది?" అన్నది తేజస్వరూపిణి.

"లేకుంటే యెవ్వరికీ తెలియకుండా మూటాముల్లె కట్టుకుని మనం యిక్కడి నుంచి పోదాం." అన్నది ప్రభావతీదేవి.

నిత్యానందమయికి మరో అనుమానం వుంది: "మనం ఆమెకు ఈ సలహాయిచ్చిన తర్వాత ఆమె మనం ఇలా సలహాయిచ్చామని వూళ్ళో అందరికి చెప్తే?"

ప్రభావతీ దేవి కొంచెం ఆలోచించి ఆ తర్వాత అన్నది: "చెప్తే చెప్పనీ. మనం చెప్పవలసింది చెప్పితీరాలి. ఇదుగో నేను వెళ్ళి చెప్తున్నాను."

## సలభై రెండు

ఉమాదేవీ సదనం ధన్యానందాశ్రమం లాంటిది కాదు. అక్కడ ఆరాధ్యమూర్తి ఆశ్రమమాతే. రాధాకృష్ణులకు కూడా సమానమైన ప్రాధాన్యమే యిచ్చినా సదనంలో మరో ఆరాధ్యదైవం లేడు. ఉమాదేవి తన ప్రతిమ ఎదురుగా పద్మాసనం వేసుకుని పూజ చేస్తారు. ఉమాదేవీ సదనం తిరువనంతపురంలో ధనవంతుల పేటలో విశాలమైన స్థలంలో స్థాపించబడింది. కొద్ది రోజుల్లోనే రెండంతస్తుల భవనం తయారయింది. శాఖోపశాఖలుగా విస్తరించింది. ధన్యానందాశ్రమానికి లభించిన ప్రజా సహకారం కంటె చాలా ఎక్కువగా ఈ ఉమాదేవీ సదనానికి లభించిందనటంలో సందేహం లేదు. దానికి కారణం కూడా వుంది. ధన్యానందాశ్రమం వట్టి శుష్క వేదాంతం, ఆధ్యాత్మిక చర్చలకు అంకితమైన సంస్థ. అక్కడ జరిగే కార్యక్రమాల్లో కేవలం ముసలి వాళ్ళు ఆసక్తి చూపించేవారు. కాని ఈ సదనం అలా కాదు. అక్కడి వాతావరణమే వేరు. ధన్యానందాశ్రమంలో సాంబ్రాణి, గుగ్గిలం, నెయ్యి లాంటివి ఘుమ ఘుమలాడుతూ వుంటే, సదనంలో కమ్మని మల్లెపూల వాసనలు, గులాబీ సంపెంగల పరిమళాలు, అత్తరు వాసనలు గుబాళిస్తూ వుంటాయి. 'గీత గోవిందం' లోని చరణాలు వీణానాదంలో మేళవించి శ్రుతి రమణీయంగా వినిపిస్తూ వుంటాయి. పిల్లనగ్రోవి రవళిలో చెట్లు చేమలు, తీగలు, పొదలు కూడా ఆ మంజుల నిస్వనాలకు తలలూపుతూ వుంటాయి. కాలి అందెలు, చేతి కంకణాలు ఘల్లు ఘల్లున మోగుతూ వుంటే అందరూ పులకిత గాత్రులై పోతూవుంటారు. ఎంత ముసలి వాడయినా అక్కడ వయసు వాడిగా మారిపోతాడు. ఎంత ముసలమ్మ అయినా పెద్ద నిట్టూర్పుతో 'కృష్ణా' అని పిలుస్తుంది. వాతావరణమంతా ఆకర్షణీయంగా వుంటుంది.

అక్కడి ఆధ్యాత్మిక చైతన్యం రజోగుణ ప్రధానం. ఉమాదేవి దానికి కేంద్రం. ఆడదాని అందమంతా ఆకారం ఆల్చినట్టుగా వుంటుంది ఉమాదేవి. బంగారు చాయలో మిసమిసలాడే ఆ మాతాజీకి తాను చాలా అందంగా వుంటానని తెలియటమే కాదు, తన అందం మీద తనకు పూర్తి అభిమానం కూడాను. అందులో తప్పేముంది? విశాలమైన కేశరాశి, వంకరలు తిరిగిన ముంగురులు ఆమె అనుమతిలేకుండా ముడిపడేందుకు వీల్లేదు. కొత్త కొత్త పద్ధతిలో ఆమె తన కేశజాలాన్ని నిత్యం సవరించుకొని అలంకరించు కుంటుంది. ఆమె

జారిపోయే కాషాయిగుడ్డ కట్టుకోదు. తన శరీరచ్ఛాయకు సరిపోయే రంగులో కేశాలంకరణకు అనుగుణంగా వుండే మేలి పట్టు చీరెలను చక్కగా ధరిస్తుంది. ఆమె పెదవులు గులాబీ రేకుల్లా వుంటాయి. వాటికి సరితూగే పలువరుస. భగవంతుడు ఆమెకు తియ్యని చిరునవ్వులు కూడా ప్రసాదించాడు. ఆమె తియ్యని మందహాసానికి భక్తులు ఇట్టే పరవశమై పోతారు. కళ్ళు తీర్చి దిద్దినట్టుంటాయి. నల్లని కనుబొమలు కళ్ళకు మరింత ఆకర్షణ కూర్చుతాయి. ఆ కళ్ళు విరిసిన కలువపువ్వుల్లా అందరినీ భావోన్మత్తులను చేసి బంధిస్తాయంటే అతిశయోక్తిలేదు - ఆమె ఒక్కసారి తన దృష్టి ప్రసరిస్తేచాలు. దేవి శరీర నిర్మాణంలో ఏలోపం లేదు. కళ్ళు, చెవులు, కాళ్ళు, చేతులు అన్నీ అమర్చినట్టు వుంటాయి. ఆటవెలది లాంటిది ఆమె అంగసౌష్ఠవం. ఆమె అడుగుపెట్టినా, కదలినా, నడిచినా, కూర్చున్నా, మాట్లాడినా, నవ్వినా అందం చిందుతూ వుంటుంది. ప్రతి చేష్టలో హృదయాన్ని దోచుకునే లయ కనిపిస్తుంది. ఆమె కంఠం చాలా మధురంగా వుంటుంది. ఆమె పాడుతుంది కూడాను. అందం పాపమా? అందం తరిగి పోకుండా చూడటం అపరాధమా? అది కూడా ఒక సిద్ధికదా? బహుశా సదనంలో అందుకే రజోగుణ ప్రధానమైన ఆరాధనకు ప్రాధాన్యం లభించింది. రజోగుణ సాధనతో ఆత్మారాధన సాధ్యంగా భావించబడి వుంటుంది.

తిరువనంతపురంలోని ధనవంతులందరిని సదనం ఆకర్షించింది. శుష్కమైన ధన్యానందాశ్రమం నిర్జీవమై పోయింది. అక్కడికి ఎవరూ వెళ్ళటం లేదు. అక్కడ ముగ్గురు సన్న్యాసినులు చేరి భజన చేసుకుంటూ వుంటారు.

తిరువనంతపురంలో పిల్లలు, గృహిణులు పాట వచ్చిన వాళ్ళందరూ సదనానికి వెళతారు. అంతేకాక నృత్యంలో ప్రవేశం వున్న వాళ్ళు కూడా వెళ్తుంటారు. అక్కడ సంగీతానికి, నృత్యానికి వేరే సభామండపాలున్నాయి. అంతేకాక పిల్లల తల్లిదండ్రులు కూడా తమ పిల్లల పాటవినేందుకు, నృత్యం చూచేందుకు వెళుతూ వుంటారు. ఒకసారి అక్కడికి వెళ్ళారంటే మళ్ళీ వెళ్ళకుండా వుండలేరు. సంగీతం, నృత్యం దేవి సమాధి స్థితిలో వుంటుంది. అప్పుడప్పుడూ నృత్యం చేస్తుంది. ఆ సమయంలో ఆమె ప్రత్యేకమైన ఆవేశంలో వుంటుందంటారు.

సదనం ఆరంభించినప్పటినుంచీ విజయమ్మ అక్కడికి వెళుతూవుండేది. మధ్యమధ్య తను గూడా పాడుతూ వుండేది. తల్లిని గూడా సదనానికి తీసుకెళ్ళాలని ఆ అమ్మాయి చాలాసార్లు ప్రయత్నించింది. కానీ కాత్యాయనీ అమ్మ ఎప్పుడూ ఒకే సమాధానం చెబుతూవుండేది: "నాకు సదనమూవద్దు. ఆశ్రమమూ వద్దు."

తన తల్లికి ఆశ్రమమన్నా, అలాంటి యితర సంస్థలన్నా యింత అసహ్యం ఎందుకు ఏర్పడిందో విజయమ్మ తెలుసుకోగలదా? బహుశా

తెలుసుకోవచ్చు. భాగీరథీ అమ్మ అక్కడ చాలా రోజులు వున్నది గదా? విజయమ్మ పాడుతుందని తెలిసి కూడా కాత్యాయనీ అమ్మ వెళ్ళలేదు. అమ్మాయిని రోజూ వెళ్ళమని అనుమతించ లేదు కూడా. ఇలాంటి ఆశ్రమాలూ, సదనాలూ విశృంఖలంగా తిరిగే వాళ్ళకు గూళ్ళలాగా ఉపకరిస్తాయనీ, అక్కడికి వెళ్ళిన వాళ్ళంతా చెడిపోతారనీ ఆమె అభిప్రాయం.

"ఈ ఆశ్రమాల్లో, సదనాల్లో వ్యభిచారిణులే ప్రవేశిస్తారు. అక్కడికి వెళ్ళేవాళ్ళు గూడా అలాంటి వాళ్ళే. వ్యభిచారంలో దిగిన తర్వాత కాపాయ బట్టలు కట్టుకుంటారు. అదే ఆశ్రమం" అంటూ ఉంటుందామె.

కాత్యాయనీ అమ్మను తప్పు పట్టేందుకు వీల్లేదు. ఎంత పవిత్రమైన ఆచరణగలదైనా సరే, సన్న్యాసిని అనేసరికి ఆమెకు ఏ మాత్రం గౌరవభావం వుండదు.

విజయమ్మ రకరకాలుగా జుట్టు సవరించుకుంటూ వుంటుంది. అది చూస్తే కాత్యాయనీ అమ్మకు చెడ్డకోపం. "ఏమిటా వేషాలన్నీ? జడవేసుకునేది అలాగేనా?" అంటూ వుంటుందామె.

విజయమ్మ నవ్వుతుంది. అసలు కేశాలంకరణలో కొత్తకొత్త పద్ధతులన్నీ ఉమాదేవీ సదనంలో దేవి దగ్గరే ఆరంభమవుతాయి. ఆమెకు కావలసినంత జుట్టుంది. ఒకరోజు చేసుకున్న అలంకరణ మరోరోజు చేసుకోకుండా రోజుకో రకంగా కనిపిస్తూంటుంది. భక్తురాండ్రు కూడా ఆ అలంకరణను అనుసరిస్తారు. ఆ విషయం కాత్యాయనీ అమ్మకు తెలిస్తే దేవిని గురించి ఆమె యింకా ఏమనేదో తెలియదు.

:బట్ట కట్టుకోవటంలో, జుట్టు సవరించుకోవటంలో విజయమ్మలో త్వరత్వరగా చాలా మార్పులు వస్తున్నాయి. చిన్నది గదా, తిరువనంతపురంలాంటి పట్నవాసంలో వుంటున్నది గదా అందుకని యిలా చేస్తున్నదని అనుకున్నదామె. కాని కాత్యాయనికి అదంతా యిష్టం లేదు. అప్పుడప్పుడూ ఆమె కోపంగా అడుగుతూ వుంటుంది:

"ఏమిటమ్మాయి యిదంతా? ఆడవాళ్ళు చీరె, రవిక ఎందుకు కట్టుకుంటారు ఆలోచించు. ఇలా కట్టుకోటంకంటె అన్నీ విప్పితిరిగితే తప్పేముంది?"

విజయమ్మకు ఇలాంటి కోరికలు సదనం వల్లనే ఏర్పడ్డాయి.

చాలాసార్లు ఇలాంటి చిన్నచిన్న విషయాలు పెద్ద పెద్ద సమస్యలై కేశవపిళ్ళె దాకా వెళ్ళాయి. కేశవపిళ్ళె భార్య చెప్పిందంతా విని అంటాడు:

"కాలం మారుతున్నది గదా, కాత్యాయనీ? వయసులోవున్న పిల్లల వేషభాషలు గూడా మారుతున్నాయి. అభిరుచి కూడా మారుతూవుంది. అందుకు నీవింత గొడవ చెయ్యటం ఎందుకు?"

"అయితే యిలా వుండటమే మంచిదంటారా?"

"నీ చిన్న తనంలో నీవున్నట్టు, లేకుంటే యీ రోజుల్లో అందరూ వున్నట్టుంటే మన అమ్మాయి ముఖం ఏ కుర్రవాడూ చూడడు. ఆడపిల్లలు ఇలా వుంటేనే మగపిల్లలకు మక్కువ ఏర్పడుతుంది."

కాత్యాయనీ అమ్మ ఏమీ సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయింది. నాలుగయిదడుగులు వెళ్ళిన తర్వాత కాత్యాయనీ అమ్మ వెనక్కి తిరిగి చూచి అన్నది: "అయినా యింతవరకూ ఏ మగపిల్లవాడికి మక్కువ ఏర్పడలేదే?"

విజయమ్మ వివాహం సంగతి మనస్సులో పెట్టుకుని కాత్యాయనీ అమ్మ యీ మాట అన్నది.

కేశవపిళ్ళె యీ విషయం పట్టించుకోవటం లేదని చెప్పేందుకు వీల్లేదు. కాని అతను చేయవలసినంత ప్రయత్నం చెయ్యటం లేదనే విషయం మాత్రం నిజం. ఈ సమస్య భార్య లేవదీసినప్పుడు అతనిలో కొంతవేడి పుట్టుకొస్తుంది. ఆ తర్వాత మళ్ళీ చిక్కు ప్రశ్నల్లో చిక్కుకోగానే ఆ విషయం మరిచిపోతాడు. కాత్యాయనీ అమ్మ ప్రతిరోజూ ఈ విషయం గుర్తు చేస్తూనే వుంటుంది. అయినా ఆలస్యమయింది.

ఇకముందు ఈ విషయం చాలా గంభీరంగా ఆలోచించాలి. ఇంతకు ముందే ఆలోచన ఆరంభించి వుండాల్సింది. కేశవపిళ్ళె భార్యను పిలిచాడు. ఆమె వచ్చింది. అతను అడిగాడు:

"చూడు, అమ్మాయి వివాహాన్ని గురించి యిక తీవ్రంగా ఆలోచించాలని నిశ్చయించుకున్నాను. దానికి ఎలాంటి కుర్రవాడు కావాలో చెప్పు."

ఈ మాట అతను చాలాసార్లు అడిగాడు. ఆమె చాలాసార్లు చెప్పింది. తనకూతురికి ఎలాంటి భర్త కావాలో ఆమె వూహించుకొనివుంది. రూపం, స్వభావం అన్నీ ఆమె మనస్సులో స్పష్టంగా వున్నాయి.

"అతను మంచివాడుగా వుండాలి. అంటే ఆపేక్ష వుండాలి. అంతతెలివి గలవాడు కానక్కర్లేదు. ఎక్కువ సామర్థ్యంకలవాడు కూడా అక్కర్లేదు. బరువంతా తనమీద వేసుకుని సతమతమయ్యేవాడుగా వుండకూడదు. వుద్యోగస్థుడు అక్కర్లేదు. ముఖ్యంగా తిరువనంతపురం వాడు పనికిరాడు. భగవంతుడి దయవల్ల బతుకుతెరువుకు కావలసిన ఆస్తివుంటే చాలు. స్వభావం మాత్రం మంచిదయివుండాలి." ఇది ఆమె రూపకల్పన.

ఒక్క క్షణం ఆగి కాత్యాయనీ అమ్మ మళ్ళీ అన్నది:

"కాని అది తిరువనంతపురం ఫ్యాషన్లన్నీ అలవాటు చేసుకుంది. చంకలు కనిపించే జాకెట్లు, వక్షోజాలు నిక్కబొడుచుకున్నట్టు కనిపించే బాడీలు వేసుకుంటుంది. నా మాటలు దానికి నచ్చుతాయో? నచ్చవో?"

కాత్యాయనీ అమ్మ మనస్సులో వున్న పిల్లవాడు ఎలా వుంటాడో కేశవపిళ్ళెకు తెలుసు. చాలా రోజుల నుంచి యీ మాటలు వినబడుతూ వుండటమే కాక భార్యగా, స్త్రీగా ఆమెతో కష్టసుఖాలు అనుభవించటం దానికి

కారణం. కుట్టనాడులో పుట్టిన ఆ స్త్రీకి కొంత సంప్రదాయం తెలుసు. ఆమెకు కొన్ని సిద్ధాంతాలు, విలువలు, నియమాలు, ఆచారాలు, నీతి, నిజాయితీలు ఉన్నాయి. ఔచిత్యం, అనౌచిత్యం గమనించే సామర్థ్యం వుంది. ఆమె తన భార్య అయిన తర్వాత ఆమె అనుభవాన్ని తన దృక్కోణంతో గమనించి అర్థం చేసుకోగలిగాడు. కాత్యాయనీ అమ్మ ఎప్పుడూ సత్యానికి కట్టుబడి వుంది.

ఒక్కక్షణం ఆగి కేశవపిళ్ళై కాత్యాయనీ అమ్మ జీవితాన్ని గురించి ఆలోచించాడు. ఆమె జీవితం ఆనందంగానే గడిచిందా? పోనీ, ఆమెకు జీవితంలో తృప్తి అనేది లభించిందా? ఒక విధంగా లేదనే చెప్పాలి. ఆమెకు కోరిన వస్తువులున్నాయి. కావలసినంత డబ్బుంది. ఠీవిగా జీవించే స్తోమతు వుంది. కాత్యాయనీ అమ్మ స్నేహితులకే కాక, ఏ స్త్రీకయినా ఆమెను చూస్తే అసూయ ఏర్పడుతుంది. దేశంలో ఒక ముఖ్యమైన వుద్యోగస్థుని భార్య ఆమె. కాని ఆమెకు జీవితంలో తృప్తి లభించిందా? ఆందోళన, ఆవేదన, ఆవేశం లేకుండా ఆమె జీవితం గడిచిందా? 'అవును' అని చెప్పలేడు కేశవపిళ్ళై. ఆమె జీవితం అలా గడవలేదు. కాని దానికి పూర్తిగా తనే కారణం కాదని అతని భావం.

నేను మామూలు కుట్టనాడు రైతునే అయివుంటే కాత్యాయనీ ఎగురుడు పిట్టలా ఉల్లాసంగా తృప్తిగా జీవితం గడపగలిగేది. బహుశా గడిచేది. కాత్యాయనీ అమ్మ అలాంటి కుట్టనాడు రైతు భార్యగా వుంటే ఎలా వుండేదని కలలు గంటున్నదా అని అనుకున్నాడు కేశవపిళ్ళై. ప్రభుత్వోద్యోగి జీవితంలోని అనవసరమైన పుటలను తిరగవెయ్యటం ఆమెకు అలవాటవటంతో అది నెమ్మదిగా ఒక దిగులుగా మారింది. ఇంకే వ్యక్తి భార్యనైనా బాగుండేది అనే ఆలోచన ఆమె మనస్సులో ఎప్పుడూ ఉదయించదు. తనమెడలో తాళికట్టిన వ్యక్తి చీఫ్ సెక్రటరీ ఎందుకయినాడా అని మాత్రమే ఆమె విచారం. అతను తిరువనంతపురంలో కాపురం పెట్టి వుండకూడదని ఆమె భావం. అతను కుట్టనాడులో మామూలు రైతుగా వుంటే బాగుండేది. అలా జరగకపోవటం వల్ల ఆమె నానా బాధలు అనుభవించవలసి వచ్చింది. ఆమె జీవితం దుఃఖపూరితమయింది. కిట్టుమామ చెప్పిన భవిష్యవాణి కేశవపిళ్ళైకు జ్ఞాపకం వచ్చింది. అది కాత్యాయనీ అమ్మను గురించిన విషయం: "అమ్మాయి అదృష్టవంతురాలు. కాని ఆమెకు మనశ్శాంతి వుండదు."

నిజమేమరి. జీవితంలో ఇన్ని సదుపాయాలు ఏర్పడటానికి కారణం ఆమె అదృష్టమే. కాని ఆమెకు మనశ్శాంతి లేదు. అసలామెకు ఏం మేలు జరిగింది. ఆమె జీవితంలో ఎప్పుడూ విషాదచ్ఛాయలు అలుముకుని

వున్నాయి. జీవితపు పునాదులను కూడా పెకలించి వేసే భయం ఆమెను పీడిస్తూనేఉంది.

ఇందులో కాత్యాయనీ అమ్మ తప్పేమీ లేదా అని కేశవపిళ్ళె ఆలోచించాడు. నా మీద ఆవిడకు పూర్తిగా నమ్మకమే కుదరలేదు. నన్ను సరిగ్గా అర్థంచేసుకోను గూడా లేదు. తనుమాత్రం భార్యమీద ప్రేమ చూపిస్తున్నాననే కేశవపిళ్ళె అభిప్రాయం. ఎక్కడికి వెళ్ళినా, ఎలా తిరిగినా చివరకు ఆవిడ దగ్గరకే చేరతాడు గదా? పిరుమెడ్‌లో అతను నిర్దాక్షిణ్యంగా తంకమ్మను తిప్పి పంపించాడు గదా? అది అతని జీవితంలో ఎదురులేని నిదర్శనం కదా? కాని కాత్యాయని తనను అర్థం చేసుకోలేకపోయింది. బహుశా భార్యకు ఈ మాత్రం ప్రేమ సరిపోదు కాబోలు. అలా భర్త చలించగూడదు. మరోచోటు వెతుక్కుంటూ తిరగ కూడదు. ఇలాంటి తిరుగుడును ఏ భార్య అయినా ప్రేమరాహిత్యంగానే భావిస్తుంది. మరో ఆడదానితో మాట్లాడితేనే భార్యకు గుండె దడ వస్తుంది.

కేశవపిళ్ళె ఆలోచన మరో దిక్కున ప్రవహించింది. తనవల్ల భార్యకు మనశ్శాంతి లేకుండా పోయింది. మరి తల్లిదండ్రుల సంగతియేమిటి? తనవల్ల వాళ్ళు దుర్మరణం పొందారు. వాళ్ళుకూడా అశాంతితోనే జీవితం గడిపారు. దీనికంతా తనే కారణమా?

నిజంగా ఆలోచిస్తే తన తప్పేముంది? తన తప్పులను గురించి కేశవపిళ్ళె ఆలోచించుకున్నాడు. భార్యకూ, తల్లిదండ్రులకూ మనశ్శాంతి లేకుండా చేసిన తన స్వభావంలోని మంచి చెడ్డలను విశ్లేషించుకున్నాడు. తన జీవితంలోని ఎక్కువ తక్కువలను గుర్తుచేసుకున్నాడు. ముఖ్యమైన సన్నివేశాలను సమీక్షించుకున్నాడు. తనస్వభావంలో చెడ్డది అని చెప్పగలిగింది ఎక్కడ వుందని ఆలోచించుకున్నాడు. రాతిగుండెగల న్యాయమూర్తి దగ్గర తను ఏం చెప్పుకోగలనని ఆత్మపరీక్ష చేసుకున్నాడు. తన జీవితం ఇలా వుండాలని వుద్దేశించి తను జీవితాన్ని మలుచుకోలేదు. తను చాలా బుద్ధిమంతుడనీ, గొప్పవాడనీ తన్నుతాను సమర్థించుకోలేదు. ఒకానొక యుగధర్మాన్ని అనుసరించి అధికార యంత్రంలో ఇరుక్కున్నాడు. అందులో నలిగిపోకుండా బయట పడేందుకు ప్రయత్నించాడు. అంతవరకే తన తెలివి తేటలు. అంతకు మించి మరేమీ అధికారం, ప్రాబల్యం తనకు లేదని అతనికి తెలుసు. 'భయంకరం' అనేందుకు అందులో భయపడవలసినదేముంది?

కేశవపిళ్ళె మళ్ళీ భార్యను పిలిచాడు. ఆమె వచ్చింది. విజయమ్మ వివాహాన్ని గురించి ఆమెతో ఇంకొంత విస్తారంగా మాట్లాడాలి. పక్కనున్న కుర్చీలో ఆమెను కూర్చోమన్నాడు. భర్త చెప్పే మాటలు వినేందుకు ఆమె వచ్చి కూర్చున్నది.

ఏదో చాలా గంభీరమైన విషయం చెప్తాడని అనుకున్నది కాత్యాయనీ అమ్మ. అది వినేందుకు తయారయి ఆమె కూర్చుంది.

కేశవపిళ్ళై ఆరంభించాడు: "అమ్మాయికి ఎలాంటి భర్త కావాలో నీకు కొన్ని కచ్చితమైన అభిప్రాయాలున్నాయి కదా?"

"అవును" అన్నట్టుగా కాత్యాయనీ అమ్మ తలవూపి అన్నది: "నేను ఎప్పుడూ అదేమాట అంటాను".

"కాని అమ్మాయికి కూడా అది యిష్టం కావాలి గదా?"

ఆ విషయంలో కాత్యాయనీ అమ్మకు భేదాభిప్రాయం లేదు. "అవును. లేకుంటే తల్లిదండ్రులే నిర్ణయించి పెళ్ళి చేస్తే నాకయినట్టే అవుతుంది. నన్ను చూడకుండా పెళ్ళి చేసుకున్నారు కాబట్టి......" అన్నదామె.

కేశవపిళ్ళై మధ్యలో జోక్యం చేసుకుని అన్నాడు: "ఏదయినా ముఖ్యమైన విషయం చెప్పేప్పుడు కూడా నామీద దాడి చెయ్యటం మానవు కదా?"

కాత్యాయనీ అమ్మ గంభీరంగానే అన్నది: "నేను నేరంగా చెప్పటం లేదు. నిజం చెపుతున్నాను. అమ్మాయి భవిష్యత్తు కోసం."

"నీవు కూడా నన్ను చూడలేదు కదా?" అన్నాడు కేశవపిళ్ళై.

"లేదు. అయినా మీరు నాకు నచ్చారు. అలా నే నేమీ ఆలోచించలేదు. భర్త ఎలా వుండాలి అనే విషయంలో నాకు ప్రత్యేకమైన అభిప్రాయాలేమీ లేవు. నేనేం చదువుకున్నాను కాబట్టి? లోకం నాకేం తెలుసు కాబట్టి? కాని యిప్పుడు మన అమ్మాయి అలాంటిది కాదు గదా? కొత్తకొత్త ఫ్యాషన్లు తెలుసు. అందుకనే దాని యిష్టం మనం తెలుసుకోవాలన్నాను. అందుకే నేనింతగా చెప్పాను."

పిల్ల పెళ్ళిని గురించి భార్య అభిప్రాయంలో వచ్చిన మార్పును కేశవపిళ్ళై అర్థం చేసుకున్నాడు.

"బహుశా ఐ.ఏ.యస్. ఆఫీసరో, ఇంజనీరో, డాక్టరో బాగా ఫ్యాషనుగా వుండేవాడు తనకు భర్త కావాలని వుందేమో?"

"కావచ్చు. దాని స్వభావం అలాంటిదే. నేనింతకు ముందు చెప్పినట్టు రైతులాంటివాణ్ణి అది ఒప్పుకోకపోవచ్చు. ఒక్కటే చూడాలి. దాన్ని ఆపేక్షగా చూచేవాడు, మంచి స్వభావం కలవాడు కావాలి."

ఒక్కక్షణం ఆగి కాత్యాయనీ అమ్మ అన్నది: "కాని వుద్యోగం, చదువు, టీవి, ఫ్యాషను ఇవన్నీ, వున్నవాడు అలా వుండడు. అలాంటివాడికి ప్రేమ వుండదు. అదే నా భయం."

కేశవపిళ్ళై వేళాకోళంగా అన్నాడు:

"అయితే మరి ఇన్ని ఫ్యాషన్లు తెలిసిన మన అమ్మాయి కూడా మంచి భార్య కాలేదేమో?"

కాత్యాయనీ అమ్మకు కూడా అలాంటి సందేహం లేకపోలేదు. ఒక్కక్షణం ఆగి ఆమె అన్నది:

"అదీ నిజమే. నా కడుపునపుట్టినా అది పెరిగింది మరోరకం వాతావరణంలో గదా? నాలాగా పెరిగితే యిలాంటి వేషంతో తిరుగుతుందా?"

కొంచెం ఆగి ఆమె మళ్ళీ అన్నది:

"లేదులెండి. అది అలాంటిది కాదు. మంచి యిల్లాలవుతుంది."

"ఎలాంటి కుర్రాడు కావాలని నీవడుగుతావా?" దాన్ని అన్నాడు కేశవపిళ్ళె.

"పెళ్ళి సంబంధం రానియ్యండి. అప్పుడడుగుదాం, నచ్చాడా లేదా అని. అదేం లేకుండా నీకెలాంటి వాడు కావాలని అడిగితే అదేం చెప్తుంది?" అన్నది కాత్యాయనీ అమ్మ.

కేశవపిళ్ళె తన తెలివి తక్కువకు తనలో తాను నవ్వుకున్నాడు.

కూతురికి సంబంధం వెతికేందుకు కేశవపిళ్ళె చాలామందిని నియమించాడు.

ఒకరోజు కాత్యాయనీ అమ్మ ఉమాదేవీ సదనానికి వెళ్ళింది. విజయమ్మ బలవంతం చేసి ఆమెను తీసుకు వెళ్ళిందనే చెప్పాలి. కూతురు అస్తమానం చెపుతూంటే అది యెలా వుంటుందో చూద్దామని ఆమెకు కూడా కుతూహలం కలిగింది.

ఆ రోజు సాయంత్రం కాత్యాయనీ అమ్మ అక్కడనుంచి యింటికి వచ్చింది. ఆమె చూచి సహించలేనిది యేదో ఆమె కంట పడినట్టుంది. అసహ్యాభావంతో ముఖం చిట్లించుకుంది. ఇంత జుగుప్సాకరమైన విషయాలు జరుగుతాయా అని ఆమెకు ఆశ్చర్యం వేసింది.

"ఏమయింది? సదనం ఎలా వుంది?" అడిగాడు కేశవపిళ్ళె.

"సదనం! బలే సదనం! బలే ఆశ్రమం! అవినీతి రాజ్యమేలుతున్నదక్కడ. నన్నడిగితే భర్త అంటే యిష్టం లేనివాళ్ళు, మగవాళ్ళకోసం మొహం వాచిన వాళ్ళు, ఆడవాళ్ళ ముఖం ఆవులించి చూచేవాళ్ళు అంతా కలిసి అక్కడ రాధాకృష్ణుల పేరు చెప్పి ఒకరినొకరు రాసుకుంటూ పూసుకుంటూ విచ్చలవిడిగా విహరిస్తున్నారు. సిగ్గుచేటు. అక్కడికి వెళ్ళగానే మల్లెపూల వాసన గుప్పుమని కొట్టింది. ఇక పాటలు వినాలి! శ్రీకృష్ణుడు రాధ వలువలు ఎలా విప్పాడు, పడకటింట్లో పరామర్శ ఎలా చేశాడు? ఇవీ అక్కడి ముచ్చట్లు. కామాంధులంతా ఆశ్రమంలో చేరారు".

కాత్యాయనీ అమ్మ ఇంత కోపంతో ఇంత కటువుగా మాట్లాడటం కేశవపిళ్ళె మొట్టమొదటిసారి చూచాడు. ధన్యానందాశ్రమం కోసం చందా అడిగేందుకు

వచ్చిన ఆడంగులను ఆమె యింతకు ముందు విమర్శించింది. కేశవపిళ్ళైకు నవ్వు వచ్చింది. "నెమ్మదిగా మాట్లాడు. అమ్మాయి వింటుంది" అన్నాడు.

"అదా? ఈ తిట్లన్నీ అది యింతకు ముందే విన్నది. తొందరగా ఏదన్నా మంచి మనువు చూచి దానికి పెళ్ళి చేయండి." తర్వాత కొంచెం ఊపిరి తీసుకొని కాత్యాయనీ అమ్మ మళ్ళీ అన్నది: "అక్కడికి వచ్చే ఆడవాళ్ళు మోసపోతారని అనిపిస్తున్నది నాకు. పెళ్ళిగాని వాళ్ళకూ, అందమైన మొగుడులేని వాళ్ళకూ కడుపువస్తే ఆదుకునేందుకు భర్త వుండాలిగా?"

"అలా కంగారు పడకుండా చెప్పు" అన్నాడు కేశవపిళ్ళె.

"అలాంటి వాళ్ళకే ఆ చోటు. ఇంకా వినండి. అక్కడికి మేం వెళుతూవుంటే మేడమెట్ల మీద ఒక దేవి నిలబడి వుంది. చంకలు కనిపించే సన్నపాటి రెవిక తొడుక్కుని వుంది. అంతకంటె సన్నటి చీరె. ఇక ఆమె నిలుచున్న తీరు చూడాలి. ఒక కాలుపైకి పెట్టి అందరినీ ఆకర్షించే బోగం సానిలా నవ్వుతూ కన్ను కొడుతూ నిలబడ్డది. ఆమె తొడ కనిపిస్తూనే వుంది. ఆడవాళ్ళు అలా నిలుచుంటారా? ఇక దేవి యెదురుగా జరిగే పాటలు, ఆటలు చూడాలి. ఆమె సమాధిలో వున్నదంటారు. అదేం లేదు. పాటలు వింటూ ఆమె పారవశ్యంతో కళ్ళు మూసుకుని కూర్చుంటుంది. ఆమె దేవి అట."

ఇంతలో విజయమ్మ బట్టలు మార్చుకుని వచ్చింది. నాన్నగారితో ఏదో విషయం చెప్పాలని అక్కడికి వచ్చింది.

"కర్మం చాలక అమ్మను నేను సదనానికి తీసుకు వెళ్ళాను. అమ్మకు ఇంత కోపం రావటం నేనెప్పుడూ చూడలేదు. పూజ మొదలు పెట్టగానే యిక యింటికి వెళదామన్నది. ఇవాళ పూజ చాలా బాగా జరిగింది".

కాత్యాయనీ అమ్మ కోపాన్ని ఆపుకొని అన్నది: "ఆమె పూజా సరే, ఆమె సరే! అమ్మె తనకే తను పూజ చేసుకుంటుంది."

విజయమ్మ నవ్వుతూ అడిగింది:

"మల్లె పూలంటే అమ్మకు బొత్తిగా గిట్టకపోవటానికి కారణమేమిటి నాన్నా? మల్లెపూల వాసన ఆమెకు ఏ మాత్రం గిట్టదు."

దానికి కారణం కేశవపిళ్ళైకు తెలుసు.

కాత్యాయనీ అమ్మ విసుక్కుంటూ అన్నది:

"దాని దుంపతెగా! మల్లెపూలు ఆశ్రమానికెందుకు?"

తల్లికి వల్లమాలిన కోపం రావటం చూచి విజయమ్మ విరగబడి నవ్వింది.

ఆ తర్వాత భార్యాభర్తలు చాలా సేపు మాట్లాడుకున్నారు. ఉమాదేవి చరిత్ర వాళ్లకు ఆశ్చర్యం కలగజేసింది. ఆనాడు అక్కడ చేరిన భక్తుల్లో చాలామంది ఉమాదేవికి ప్రేమ పాత్రులయివుంటారని వాళ్ళకు అనుమానం.

ఈ ఆడంగులంతా యిలాగే చెడిపోతారు. వాళ్ల పిల్లలు కూడా చెడిపోతారు.

కాత్యాయనీ అమ్మకు అదే విచారం.

రాత్రి చాలా పొద్దుపోయినా కేశవపిళ్ళై ఫైళ్ళు చూచుకుంటూ వున్నాడు. కాత్యాయనీ నిద్రపోయి వుంటుందని అనుకున్నాడు. ఉన్నట్టుండి ఆమె అతని యెదట నిలబడి వుంది.

"ఇంకా నీవు నిద్రపోలేదా?"

"లేదు. నిద్రపట్టలేదు. ఒక విషయం చెపుదామని వచ్చాను. పండుకొని ఆలోచిస్తూ వుంటే యీ మాట గుర్తుకు వచ్చింది. అంతకు ముందు గుర్తులేదు."

కేశవపిళ్ళై కలం వక్కన పెట్టి ఆమాట వినేందుకు తయారుగా కూర్చున్నాడు. కాత్యాయనీ అమ్మ మెల్లిగా చెప్పింది:

"మన అమ్మాయి కూడా ఎవరినో ప్రేమించినట్టు నాకు తోస్తున్నది."

కేశవపిళ్ళై ఉలిక్కి పడ్డాడు. అతని చెవులు నిక్కపొడుచుకున్నాయి. కాత్యాయనీ అమ్మ ఆరంభించింది:

"మంచి కుర్రాడు. చూడ ముచ్చటగా వున్నాడు. మేము వెళుతుంటే మాకు వక్కవక్కనే తప్పుకోకుండా వెళ్తున్నాడు. వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నారు. 'ఈమె మా అమ్మ' అని అతనికిది చెప్పింది. తర్వాత అతను పద్యాలు, పాటలు రాస్తాడనీ, తను పాడే పాటలన్నీ అతను రాసినవేననీ అమ్మాయి నాకు చెప్పింది. అతను చాలా మర్యాదగా వున్నట్టు నాకు కనిపించాడు. ఆ సమయంలో నాకేమీ ఆలోచన తట్టలేదు. ఇక్కడికి వచ్చి పండుకున్న తర్వాత ఇలా అనుమానం వేసింది."

కేశవపిళ్ళై నవ్వాడు: "అంతేనా? నాకేదో భయమేసింది. అది కాలేజీలో చదువుకున్న పిల్ల కదా? ఎవరో తెలిసిన వాళ్ళు వుంటారు. ఊరికే పక్కపక్కన వస్తూ వుండచ్చు. ఆ సదనం చూసిన పిచ్చి ఆవేశంలో నీకు అలా అనిపించిలది".

కాదన్నట్టుగా కాత్యాయనీ అమ్మ తల తిప్పుతూ అన్నది: "కాదు. నేనెప్పుడూ అలా పొరబడను. ఎదుట నిలబడి మాట్లాడేప్పుడు అతని కంఠంలో, కళ్ళల్లో, భావాల్లో ఏదో వ్యత్యాసం కనిపించింది. ఇప్పుడు కూడా అతను నా కళ్ళల్లో మెదులుతూ వున్నాడు.

ఒక్కక్షణం ఆగి అతన్ని గురించి ఏదో అర్థమయినట్టుగా కాత్యాయనీ అమ్మ అన్నది:

"మీరేమన్నా చెప్పండి. వాళ్ళిద్దరికి ఏదో సంబంధముంది".

"అయితే ఆ విషయం దాన్ని అడుగు" అన్నాడు కేశవపిళ్ళై.

"బలే బాగుంది. ఏదయినా చెప్తే వెంటనే దాన్ని అడగమంటారు. ఎక్కడన్నా సంబంధం చూచి ముడిపెట్టే సేయండి. అదే మంచిది."

కాత్యాయనీ అమ్మ తనలో తాను అనుకుంది:

"ఇదంతా ఆ పాడు సదనానికి వెళ్ళినందుకు ప్రతిఫలం. అక్కడ చీకట్లో, ఆ పొదల్లో ఆమూలల్లో ఏమయినా జరగవచ్చు. అక్కడ మల్లె చెట్లే కాదు, తెల్లపూలు పూచే సువాసనపు చెట్లు చాలా వున్నాయి. అక్కడ యిద్దరూ కలిసి యేమయినా - భగవంతుడా! నేనేం చెయ్యను." నాకేదో భయంగా ఉంది.

కేశవపిళ్ళకు అలాంటి అనుమానం లేదు. అది కేవలం కాత్యాయనీ అమ్మ అపోహ అని అతని అభిప్రాయం. అయినా అమ్మాయి పెళ్ళికి వెంటనే ఏర్పాట్లు చేసి తీరాలి. ఇక ఆలస్యం చెయ్యకూడదు.

కేశవపిళ్ళ అడిగాడు:

"అతన్ని చూస్తే నీకేమనిపించింది?"

వెంటనే సమాధానం వచ్చింది:

"అతను మర్యాదస్థుడు. చూచేందుకు బాగున్నాడు. అంతకు మించి నాకేం తెలుసు?"

× × × ×

చాలా రోజులు గడిచాయి. పార్కువ్యూలో పిల్లను చూచేందుకు ఎవరో వస్తున్నారు. ఉత్తరాది చాలక్కూడికి చెందిన ఒక కుర్రాడు. అతను ఇంజనీరు. మద్రాసులో వుద్యోగం. సాయంత్రం కాత్యాయనీ అమ్మ విజయమ్మను పిలిచి యీ విషయం చెప్పింది. విజయమ్మ తెల్ల మొహం వేసింది.

"ఎందుకమ్మాయి అలా దిగులు పడినట్టున్నావ్?" అన్నది కాత్యాయనీ అమ్మ.

'ఏమీలేదు' అన్నది విజయమ్మ. పెళ్ళి సంగతి మొట్ట మొదటిసారి ప్రస్తావనకు వచ్చిందని అలా కంగారుపడి వుండవచ్చునని అనుకున్నది కాత్యాయనీ అమ్మ.

మర్నాడు కేశవపిళ్ళ సెలవు పెట్టాడు. పిల్లవాడు, అతని బంధువులు వుదయమే వచ్చేశారు. ఆ రోజు విజయమ్మ అంత వుత్సాహంగా లేదు. ఇంజనీరుకు విజయమ్మతో ప్రత్యేకంగా మాట్లాడాలని వుంది. ఈ మాట మధ్యవర్తి నారాయణ నాయరు కేశవపిళ్ళకు చెప్పాడు. అందుకు కేశవపిళ్ళ ఏమీ అభ్యంతర పెట్టలేదు. అది మంచిదే అని అతని అభిప్రాయం. కాత్యాయనీ అమ్మకు మాత్రం అది కొంచెం ఎబ్బెట్టుగా తోచింది:

"ఇదేం విచిత్రం! పెళ్ళి కాకముందే పిల్లవాడు పిల్లతో మాట్లాడటమా? ఇదేం పద్ధతి? ఇదివరకు మేమిలాంటివి ఎరుగుదుమా?"

గార్డెన్‌లో కూర్చుని వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నారు. కాత్యాయనీ అమ్మ బంగళాలో ఒక గది కిటికీలో నుంచి చూస్తున్నది. పెళ్ళికాకముందే చెయ్యగూడని పని ఏమీ వాళ్ళు చేయటం లేదు గదా అని ఆమె చూస్తూ వుంది. లేదు, వాళ్ళు సరస సల్లాపాలేమీ చెయ్యటం లేదు. గంభీరంగా ఏదో

మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ ముఖంలో సిగ్గుగాని చిరునవ్వుగాని యేమీ కనబడటం లేదు.

ఇద్దరూ ఒకరి కొకరు నమస్కారం చేసుకుని వేరయ్యారు. ఇంజనీరు నారాయణ నాయరుతో కొంతసేపు మాట్లాడాడు. నారాయణ నాయరు కేశవపిళ్ళై దగ్గరికి వచ్చాడు. అతను చాలా విచారంగా వున్నాడు. కాత్యాయనీ అమ్మ కూడా అక్కడనే ఉంది.

నారాయణ నాయరు విచారంగా అన్నాడు:

"సిగ్గుచేటు".

"ఏమిటి నారాయణ నాయర్?"

" ఈ పెళ్ళి జరగదు. తను పెళ్ళి చేసుకోనని అమ్మాయి స్పష్టంగా చెప్పేసింది. అమ్మాయి భర్తను ఎన్నుకుందిట. అతన్ని తప్ప మరొకర్ని చేసుకోదట."

కేశవపిళ్ళై స్తంభించిపోయాడు. అతని నర నరాలు నీరసంగా కుప్పపడి పోయాయి.

."ఎవరతను నారాయణ నాయర్?" అడిగింది కాత్యాయనీ అమ్మ.

"అతను సామ్యవాది. సామ్యవాదులకు పాటలు, పద్యాలు రాసిపెడుతుంటాడు. అతని పేరు విశ్వనాథన్. వాళ్ళిద్దరూ ఒకచోట చదువుకున్నారు. ఒకరినొకరు ప్రేమించుకున్నారు."

"సామ్యవాదా?" అని అడిగాడు కేశవపిళ్ళై విచారంతో.

"అవును" అన్నాడతను నిరాశతో.

కేశవపిళ్ళై టేబిలు మీద తలవాల్చుకుని కూర్చున్నాడు. "ఇది మొదటే చెప్తే బాగుండేదిగా" అన్నాడు నారాయణ నాయరు విసుక్కుంటూ.

"ఈ విషయం మాకు ఎలా తెలుస్తుంది? ఇంతవరకూ మాకీ విషయం తెలియదు గదా?" అన్నది కాత్యాయనీ అమ్మ.

'సరే' అన్నాడు నారాయణ నాయరు. "ఇది అవమానకరమైన విషయం. అందులో సందేహం లేదు."

"క్షమించండి" అని లాంఛన ప్రాయంగా అంటూ ఇంజనీరు ప్రవేశించాడు. తప్పుచేసినట్లు కేశవపిళ్ళై తటాలున లేచి ఇంజనీరును కూర్చో పెట్టాడు. వెయ్యి సార్లు క్షమాపణ కోరుకున్నాడు. కాని నిజానికి అతని తప్పేముంది? ఇంజనీరు కూడా కొంచెం విచారంగా కనిపిస్తున్నాడు. పెళ్ళి చూపులకు వెళ్ళటం ఇది అతనికి మొదటిసారి. అది యిలా పరిణమించింది.

"ఒక విధంగా చూస్తే యిది మంచిదే అయింది. విజయమ్మ ఈ ప్రేమాను బంధాన్ని మనస్సులో దాచుకొని మీ బలవంతాన యీ సంబంధానికి ఒప్పుకుని ఉంటే? జీవితం ఎంత అశాంతిమయం అయ్యేదో?" అన్నాడు ఇంజనీరు.

కేశవపిళ్ళై అందుకు ఒప్పుకున్నాడు.

ఒకరినొకరు ఏమీ అనుకోకుండా మొహం ముడుచుకొని పెళ్ళి వాళ్ళు వెళ్ళి పోయారు.

"నా మాట నిజమయింది కదా? నేను పొరపాటు పడలేదుకదా " అన్నది కాత్యాయనీ అమ్మ.

ఈ పరిస్థితికి సమాధాన పడేందుకు కేశవపిళ్ళై చాలా ప్రయత్నించవలసి వచ్చింది. ఆ సమస్యను అన్ని కోణాలనుంచీ అతను పరిశీలించాడు. సమాధాన పడటం కంటె వేరే మార్గం లేదు. ఉన్న పరిస్థితిలో ఎక్కువ లాభం పొందేందుకు ప్రయత్నించాలని అతను నిర్ధారణ చేసుకున్నాడు. కాత్యాయనీ అమ్మకు అంత విచారంగా లేదు. ఈ ప్రేమానుబంధం ఉమాదేవీ సదనం నుంచి ఆరంభం కాకపోవటం ఆమెకు తృప్తిగా వుంది. విశ్వనాధన్ ప్రేమపాత్రుడని విజయమ్మ ఘంటాపథంగా చెప్పింది. అతన్నే ఆమెకు చేసుకోవాలని వుంది.

"అయితే యేం?" అన్నది కాత్యాయనీ అమ్మ.

"అయితే యేం?"అన్నది కాత్యాయనీ అమ్మ.

కేశవపిళ్ళై తన కూతుర్ని ఒక విషయం అడగాలను కున్నాడు: "ఇలా కవిత్వం రాసుకుంటూ కూర్చుంటే జీవితం ఎలా గడుస్తుందమ్మా?"

జీవితంలోని సాధక బాధకాలు తెలియని ఆ పిల్లకు అది చాలా చిన్న విషయంగా తోచింది. ఆ విషయం ఆ పిల్ల ఆలోచించివుండదు. అయినా వెంటనే సమాధానం చెప్పింది: 'మేమెలాగో బతుకుతాంలే, నాన్నా".

కేశవపిళ్ళైకు మనస్సు కుదుట పడింది. తను సంపాదించిందంతా ఆమెకే. కేవలం ఆమెకే.

పెళ్ళి తిరువనంతపురంలో చేయకూడదని నిర్ణయమయింది. కేశవపిళ్ళై మనస్సుకు ఒక ఆలోచన తట్టింది. ముందు ముందు సామ్యవాద ప్రభుత్వం రాబోతున్నది. విశ్వనాధన్ సామ్యవాది. పెళ్ళికి వచ్చే పెద్దలందరూ సామ్యవాదులయివుంటారు. వాళ్ళతో సంబంధం ఏర్పరుచుకోవచ్చు. సామ్యవాదపు బంధుత్వంగా దాన్ని భావించవచ్చు.

కాని పెళ్ళి స్వగ్రామంలో చెయ్యాలని కాత్యాయనీ అభిప్రాయం.

## నలభై మూడు

ఛీఫ్ సెక్రటరి కేశవపిళ్ళై రాజీనామా యివ్వలేదు. వుద్యోగంలోనే ఉన్నాడు. సామ్యవాద ప్రభుత్వం వస్తుందన్న అంచనా నిజమయింది. ఏది యెలాగయినా యిది కేశవపిళ్ళైకు అంత అనుకూలమైన విషయం కాదు. కాని అదే జరిగింది.

ఆ రోజుల్లో సెక్రటరీ గోపి. ఎన్నికలకు ముందు, ఎన్నికల సమయంలో, ఎన్నికల తర్వాత గోపి చాలా వుపన్యాసాల్లో, పేపర్లల్లో, సమావేశాల్లో ఎన్నో

విషయాలు చెప్పాడు. సామ్యవాద పరిపాలన వస్తే ఏమేం చేస్తాము - అనే విషయం గోపీ పేరు పేరు వరుసన చెప్పాడు. ఆ మాటలన్నీ కేశవపిళ్ళను నిరుత్సాహ పరిచి వుండవచ్చు. వీళ్ళ పరిపాలనలో ప్రభుత్వం సరిగ్గా నడవదనీ, ఏ పని కూడా సక్రమంగా కొనసాగదనీ అతని అభిప్రాయం. గోపీ అంటే కేశవపిళ్ళకు అంత యిష్టం లేదు. ఆ రోజు ఆల్వాలో కలుసుకున్న తర్వాత అతను గోపీని చూడలేదు. గోపీ ముక్కోపి. సామ్యవాదులను గురించి కేశవపిళ్ళకు మరో అభిప్రాయం కూడా వుంది. పార్టీ క్రమ శిక్షణను అనుసరించే పరిపాలన జరుగుతుంది. అలాగే గోపీ అధికారం చలామణీ అవుతుంది. ప్రభుత్వంలో కూడా అతను జోక్యం చేసుకుంటాడు.

అయినా కేశవపిళ్ళకు గోపీ బాగా తెలుసు. మాత్యూ, లూకోస్, నారాయణ నాయర్, గోపీ - వీళ్ళు నలుగురిని ఒకానొక పర్యాయం కేశవపిళ్ళ తనవలలో వేసుకున్నాడు. ఆ వలలో చిక్కకుండా గోపీ తప్పించుకు పోయిన మాట కూడా నిజమే. అయినా తనకు బాగా తెలిసిన వాడు. తర్వాత కేశవపిళ్ళ గోపీని చూడ లేదు. గోపీ కూడా అతన్ని కలుసుకునేందుకు రాలేదు. ఇక ముందు తను ఒక నూతన రాజ్యాంగంతో పోరాడాలి. అది ఎలా వుండబోతుందో తెలియదు. మంత్రుల పేర్లు బయట పడ్డాయి. అన్నీ తెలిసిన పేర్లే. ఒకరిద్దరు మాత్రం కొంచెం అపరిచితులు. ఇతరులు ఎలాంటి వాళ్ళో, వాళ్ళతో ఎలా వ్యవహరించాలో ఇంకా నిర్ధారణ చేసుకోలేదు. తను పదహారణాల వుద్యోగ ధర్మంలో వుండటమే శ్రేయస్కరమని కేశవపిళ్ళ బుద్ధికి తోచింది. కాని అతని వ్యక్తిత్వం అతన్ని ఆ పద్ధతిలో వుద్యోగం చెయ్యనియ్యదు. పూలను అమ్ముకునేవాడు గడ్డిని అమ్ముకోలేడు. ఇన్నాళ్ళనుంచీ అతను వుద్యోగం చేస్తూనే వున్నాడు. దీవాన్‌జీ కాలంలోనూ, కాంగ్రెసు ప్రభుత్వంలోనూ కేశవపిళ్ళ కేవలం ఉద్యోగస్థుడిగానే పని చెయ్యలేదు. ఇలా ఒకరి ఆజ్ఞకు లొంగి పని చేయటం అతని అంతస్సు అంగీకరించదు.

కాత్యాయనీ అమ్మ తన వెనకటి సలహా మళ్ళీ చెప్పింది: "ఉద్యోగం వదిలేసి - మనం ఇక్కడి నుంచి వెళ్ళి పోదాం. ఈ తెలివి తక్కువ దద్దమ్మల దగ్గర తైతక్కలాడినందువల్ల లాభమేముంది?"

ఇప్పుడు కేశవపిళ్ళ ఆ సూచనను నిరాకరించటం లేదు. ఆ విషయాన్ని గురించి అతను గంభీరంగా ఆలోచిస్తున్నాడు.

"నేనుకూడా అదే ఆలోచిస్తున్నాను:" అన్నాడొకరోజు.

"ఇందులో అంత ఆలోచించవలసిందేముంది?"

"ఆలోచించేదేమీలేదు. కాని, కాత్యాయనీ! అందుకు మనస్సు ఒప్పుకోదు. ప్రభుత్వోద్యోగంలో వచ్చిన చిక్కేయిది. ఒకసారి వుద్యోగంలో ప్రవేశించిన

తర్వాత యాభై అయిదేళ్ళు పూర్తి అయ్యేందుకు ఒక్కరోజు మిగిలినా వుద్యోగం వదిలిపెట్టి వెళ్ళేందుకు బుద్ధిపుట్టదు."

ఈ విషయం కాత్యాయనీ అమ్మకు అర్థం కాలేదు. అర్థంకాదు గూడాను. "ఈ దద్దమ్మలు బయటికి గెంటినప్పుడు వెళ్ళటం బాగుంటుందా? అపస్వరాలు రాకముందే పాట ఆపటం మంచిది కదా? ఆశ ఎంత చెడ్డదో? మీకు ఈ వ్యామోహం, ఈ ఆశ యింకా పోలేదా?"

ఇద మిత్థమని నిర్ణయించ లేక పోవటం వల్ల "ఊఁ" అని సమాధానం చెప్పాడు. కాత్యాయనీ అమ్మ ఊరుకోలేదు:

'వాళ్ళ చేత వెళ్ళమనిపించుకోటం అవమానకరం కాదా? అది కూడా అనుభవించాలా? మద్రాసు నుంచి వచ్చిన మేనేన్ను ఛీఫ్ సెక్రటరీ చేద్దామని వాళ్ళనుకుంటున్నారని చెప్పారు గదా? అతను కూడా సామ్యవాది అని చెప్పారు గదా?"

ఛీఫ్ సెక్రటరీ పదవి మీద కన్నేసిన ఆర్.టి. మేనేన్ కు ఇద్దరు దగ్గర బంధువులు యం.యల్.ఏలు గా వున్నారు. అతని మేలుకోరే మంత్రులు కూడా ఇద్దరున్నారు. మలబారు ప్రాంతంలోని యం.యల్.ఏలు - కాంగ్రెసు వాళ్ళు, పి.యస్.పి వాళ్ళు అందరూ అతన్నే సమర్థిస్తారు. అదీ పరిస్థితి - అన్నాడు కేశవపిళ్ళై.

"ఈ సామ్యవాదులు మొట్టమొదట రహస్యంగా మద్రాసు వెళ్ళారు. అప్పుడు వీళ్ళందరూ అతని యింట్లోనే దాక్కొని వున్నారు. అతను సామ్యవాది అనటంలో ఏ మాత్రం సందేహం లేదు."

"అయితే వాళ్ళతన్ని తప్పకుండా తీసుకొస్తారు. ఆ తర్వాత వాళ్ళు మీ మీద ఏదన్నా నేరారోపణ చేస్తారు. దానికి మీరెందుకు అవకాశమియ్యటం?" అన్నది కాత్యాయనీ అమ్మ.

కేశవపిళ్ళైకు మాత్రం ఇలా అస్త్ర సన్యాసం చేసి పరాజయాన్ని అంగీకరించటం మనస్కరించటం లేదు. "ఉద్యోగం వదిలి భయపడి మనం ఎలా జీవించగలం? నేను కూడా ఈ దేశంలో పుట్టి పెరిగిన వాణ్ణే గదా? అంతే కాదు, ఇలా వదిలి పెట్టవద్దని బలవంతం చేసే వాళ్ళు కూడా వున్నారు.

"ఎవరు వాళ్ళు? మాత్యూ, లూకోస్ అయివుంటారు." అన్నది కాత్యాయనీ అమ్మ.

". వాళ్ళేకాదు. ఇంకా చాలా మంది వుద్యోగస్థులున్నారు. కూడగట్టుకొని వుండేందుకు మేము ఆలోచించాం. మంది అధికారం చలాయించేందుకు వచ్చారు. దేశాన్ని నాశనం చెయ్యమని వీళ్ళ చేతిలో పెట్టి వెళ్ళటం సబబేనా? ఈ దేశంలో అందరూ సామ్యవాదులేనా?"

తన భర్త ఎలాగయినా వుద్యోగం వదిలేస్తే బాగుంటుందని కాత్యాయనీ అమ్మ వుద్దేశ్యం. "ఇప్పుడు మీరంతా దేశాన్ని రక్షించ బోతున్నారా?" అని అడిగిందామె.

"రక్షించి తీరాలి. లేకుంటే దేశం దక్కదు. వివేకం, మర్యాద, నాగరికత లేనివాళ్ళందరూ వచ్చి చేరారు. దేశం ఆపదలో వుంది. దేశాన్ని కాపాడేందుకు జాగ్రత్తగా వుండటం చాలా అవసరం."

తనను వుద్యోగం వదిలి పెట్టద్దని మొరబెట్టుకొనే వాళ్ళ పేర్లు కేశవపిళ్ళై ఏకరువు పెట్టాడు. వాళ్ళల్లో వుద్యోగస్తులూ వున్నారు. జాతీయ నాయకులూ వున్నారు. వీళ్ళకు దూరంగా వుండే పనికిమాలిన వాళ్ళూ వున్నారు.

"ఈ మేనేన్ మన సంపద అంతా మలబారుకు తీసుకొని పోయేందుకు ప్రయత్నిస్తాడు. అతని దృష్టి అంతా దానిమీదనే వుంది. మంత్రులు కూడా అతన్నే సమర్థిస్తారు. అలా వదిలేందుకు వీల్లేదు" అన్నాడతను.

ఇలాంటి పరిస్థితిలో కూడా కొత్త మంత్రివర్గం శపథం చేసే రోజు ఉదయం కేశవపిళ్ళై మనస్సులో ఎప్పుడూ లేని ఆందోళన చెలరేగింది. ఏదో తెలియని చెడ్డదశ ఆరంభమయినట్టు తోచింది అతనికి. ముందు ముందు ఎలాంటి ఆపదలు వస్తాయో? అవి యేమిటో తెలిస్తే మనస్సుకు కొంచెం ఊరటగా వుంటుంది. ఉద్యోగం పోతే పోనీ. ఏమీ ఫర్వాలేదు. కేశవపిళ్ళైలో నూతన సామర్థ్యం వచ్చింది. దేశం మట్టిలో కలిసి పోయినా సరే - అతనికి అంత విచారంగా లేదు. దేశం నాశనమైపోతే పోనీ. అన్నీ మలబారుకు దాటేస్తారన్న తిరువనంతపురం వాళ్ళ భయం కూడా అతన్ని బాధించటం లేదు. తిరువనంతపురం అంతా శూన్యమయినా అతనికేమీ నష్టం లేదు. తిరువనంతపురం మీద అతనికంత మమకారం లేదు. సామ్యవాదులతో కలిసి పని చెయ్యవలసి వస్తే ఒకప్పుడు కాంగ్రెసు వాళ్ళంటే అసహ్యం వేసేది కదా? కానీ వాళ్ళతో కలిసి మెలిసి పని చేశాడా లేదా? అలాగే సామ్యవాదులతో కూడా కలిసి పని చెయ్యవచ్చు గదా? అలాంటప్పుడు మనస్సులో ఇంత కలవరమెందుకు? ముందుముందు సంపాదన మందగిస్తుందనే దిగులా? ఇంతవరకు సంపాదించిన దానితో ఇకముందు కూడా హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చుననేగదాతనకి ధైర్యం ఉంది మరి దిగులెందుకు? ఇవన్నీ కేశవపిళ్ళైకు సంబంధించిన సమస్యలు. అతనికి తనకున్నది చాలు. అంతకుమించి వస్తే కాదనడు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు తనకేమి వచ్చినా దానికి రెట్టింపయింది. ఇకముందు గూడా అలాంటి అవకాశం వుంటే వదులుకోవలసిన అవసరం లేదు. సామ్యవాదులు కూడా ఈ దేశంలో పుట్టినవాళ్ళే. మాతృభూమి పండించి యిచ్చిన అన్నం తిని ఇక్కడి నీళ్ళు తాగి పెరిగిన వాళ్ళే. కాంగ్రెసు వాళ్ళలాగా సామ్యవాదులు కూడా తమ సంప్రదాయానికీ, ఆచారాలకూ, ఆలోచనలకూ, ఆశయాలకూ

వారసులే. ఒకవిధంగా అందరూ ఒకతల్లి బిడ్డలనే చెప్పుకోవాలి. వాళ్ళ పరిపాలనా కాలంలో కూడా తనుకొంచెం కూడ బెట్టుకుంటే తప్పేముంది? వాళ్ళకు మాత్రం డబ్బుంటే చేదా? కాకపోతే వాళ్ళ పద్ధతిని అర్థం చేసుకుని అనుసరించేందుకు కొన్ని రోజులు పడుతుంది. అది కూడా అతనికొక సమస్య కాదు. మరి మనస్సులో ఈ అశాంతికి కారణమేమిటి? స్పష్టంగా తెలియటం లేదు. కొన్ని గంటలు గడిచేసరికి ఈ అశాంతి కంగారుగా మారింది. ఆ తర్వాత భయంగా మారింది. ఏదో మహావిపత్తు ముంచుకు వస్తున్నట్టుంది. అదేమిటో తెలియదు.

ఆ రోజు వచ్చిన వుత్తరాలన్నీ టేబిలు మీద పెట్టి వున్నాయి. అనుకోకుండా ఆ రోజు అతను తనంతట తానే ఉత్తరాలు తెరిచి చూస్తున్నాడు. ఒక వుత్తరం కోసం అతను ఎదురు చూస్తున్నాడు. చేతి వ్రేళ్ళు వణుకు తున్నాయి.

ఉత్తరాల కుప్ప అంతా గాలించాడు. ఒక వుత్తరం కనిపించింది. అడ్రసు చూచాడు. దస్తూరీ అతనికి తెలిసిందే. దాని మీద తిరువనంతపురం ముద్ర వేసివుంది. గుండె దడదడలాడుతూ వుండగా కేశవపిళ్ళ ఆ వుత్తరం తెరిచాడు.

ఉత్తరం చాలా చిన్నది. సుపరిచితమైన దస్తూరీలో అక్షరాలు ముక్కల్లాగా స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ధన్యానందాశ్రమం

4-4-1957

నా హృదయేశ్వరునికి

నమస్కారములు. నేను మీ ఆత్మను నాలో బంధించుకున్నాను. నేనిక కలకాలం మీ దాన్ని అయినాను. ఇకముందు నన్ను బయటికి నెట్టి పంపించ వచ్చుననే ఆలోచన మానెయ్యండి. మీరు నా వారు. చుంబన సహస్రములతో,

మీ దాని

తంకం

కేశవపిళ్ళకు ఏమీ బోధపడలేదు. ఆత్మను బంధించుకున్నదా? అంటే? అతని ఆత్మ అంతటా అన్ని విధాలా స్వతంత్రమయింది. ఎక్కడా బంధంలో చిక్కుకోలేదు. కేశవపిళ్ళకు ఏమీ అర్థం కానటం లేదు. కాత్యాయనీ అమ్మ కూడా అతని ఆత్మను కట్టుబాటు చెయ్యలేక పోయింది. తను కలకాలం కేశవపిళ్ళ దాన్ని అయిపోయానని రాసింది. బహుశా అందులో వ్యత్యాసం లేకపోవచ్చు. ఎప్పుడు తలుచుకుంటే అప్పుడు రమ్మని చేతితో సంజ్ఞ చేస్తే వచ్చేస్తుంది. ఏమి చెయ్యమంటే అది చేస్తుంది. దూది పింజలాగా గాలిలో ఎగిరిపోతూ వుంటుంది. అంతే. ఇకముందు నన్ను బయటికి నెట్టి

పంపించవచ్చుననే ఆలోచన మానెయ్యండని రాసింది. కేశవపిళ్ళె ఆమెను. ఉపేక్షించాడు. ఆ మాట ఆమెతో స్పష్టంగానే చెప్పాడు. ఆమె జీవనోపాధికి ఏర్పాటు కూడా చేశాడు. అయినా తనను వదిలి పెట్టదా? ఉపేక్షించే ఆలోచనే వద్దంటే ఏమిటి అభిప్రాయం? ఒకసారి కచ్చితంగా వీల్లేదని చెప్పేశాను గదా? అవును, కచ్చితంగానే చెప్పాను. అందులో ఏమన్నా పొరపాటు జరిగిందా? కేశవపిళ్ళెకు సరిగ్గా గుర్తులేదు. ఏమయినా సరే, యికముందు ఆవిడతో ఏ విధమయిన సంబంధం పెట్టుకోకూడదని అతను గట్టి నిర్ణయం చేసుకున్నాడు.... ఆ తర్వాత రాసింది – "మీరు నావారు" – అని. అది యెలా సాధ్యం? ఒక ఆడ కూతురు బిడియం లేకుండా యిలా తన అధికారం ఋజువు చేసుకోగలదా? అది చాలా గంభీరమయిన విషయం. 'మీరు నా వారు' – ఆమె చాలా గట్టిగా చెప్పింది. ఆ వాక్యం కింద గీత కూడా గీసింది. ఆమెకు అలాంటి అధికారమేముంది?

ఈ సరికొత్త ధోరణి కేశవపిళ్ళెకు బోధపడలేదు. దీని వెనక ఏదో బలం వుంది. ముందు ముందు తన జీవితంలో ప్రవేశించి జీవితాన్ని చెడగొట్టాలనుకుంటున్నదా? ఇప్పుడావిడకు చాలా యుక్తులు తెలును. అన్నీ నేర్చుకుంది. మొట్టమొదట్లో ఆమె కల్లాకపటం తెలియని అమాయకురాలు. ఈనాడు అలా కాదు. కన్యాకుమారిలో ఆమె వల పన్ని అందులో తనను ఇరికించింది – అవును, అది ఒక పన్నాగమే. కేశవపిళ్ళె జ్ఞాపకం చేసుకున్నాడు. బాగా ఆలోచించి తయారు చేసుకున్న కార్యప్రణాళికలో అదొక అంశం. ఆ ప్రవాహంలో పడి తను చాలా దూరం కొట్టుకొని వెళ్ళాడు. తన్ను తాను మరిచి మరో ప్రపంచంలోకి వెళ్ళాడు. ఇక ముందు కూడా ఏదో పన్నాగం పన్నాలని నిర్ణయించుకొని వుంటుంది. అది ఏమై వుంటుందా అని కేశవపిళ్ళె ఆలోచిస్తున్నాడు. ఏమయినా సరే, దానికి లొంగకుండా దృఢంగా వుండాలని అనుకున్నాడు. కాని అలా వుండగలనా అని అతనికి భయం వేసింది.

ఛీ! ఇది అంతులేని ఆపదలా తయారయింది. మాటి మాటికీ ఆమె అతన్ని రెచ్చగొడుతూ వున్నది. ఈ బాధ్యతకు ఎలా స్వస్తి చెప్పటం? ఈ సంబంధం చాలా దూరం వెళ్తుంది. ఈ సంగతి ఆ రోజే తెలిసివుంటే అప్పుడే వదులుకుని విదిలించుకొనేవాడ్ని. మనస్సు హాయిగా వుండేది. కొత్తకొత్త అధికారాల స్వరూప స్వభావాలు కేశవపిళ్ళెలో భీతిని కల్పిస్తున్నాయి. వాటిని తప్పించుకొనేందుకు ఒకటే మార్గముంది. గట్టితనం ఒక్కటే మార్గం. అదే గట్టిగా నిశ్చయించుకోవాలి.

కేశవపిళ్ళె ఆ వుత్తరం మరోసారి చదువుకున్నాడు. అందులో మరో భావం వున్నట్టు అతనికి తోచింది. అక్షరాలు వెనకటి కంటె స్పష్టంగా వున్నాయి. సంబోధన అమోఘంగా వుంది. హృదయేశ్వరుడు! రాసేది 'మీ దాసి'.

కేశవపిళ్ళై చిరునవ్వు వినురుతూ పెదిమలు విరుచుకున్నాడు. హృదయేశ్వరుడట! దానికి ప్రేమలేఖలు రాయటం కూడా చేతనవును. తనకేమీ ప్రేమ లేఖ రాయలేదు. అది అలాంటి సంబంధం కూడా కాదు. ఎప్పుడయినా ఒక వుత్తరం రాసేందుకు అదేమన్నా ఉద్దేశ్య రహితమైన సంబంధమా? ఆవిడకు ప్రేమ లేఖ రాయటం మాత్రం తెలుసు. అందులో సందేహం లేదు. బహుశా అది రామచంద్రన్ అలవాటయి వుంటుంది. దాని హృదయంలో ఒక అధీశ్వరుడు కూడా వున్నాడా? ఆమెహృదయానికి అధీశ్వరుణ్ణని కేశవపిళ్ళై ఎన్నడూ అనుకోలేదు. కనీసం హృదయాన్ని ఆమె తనదిగా భావించుకోగలిగానని కానీ, భావించుకోగలశక్తి తనకున్నదని గానీ అతనికి అనిపించలేదు. దానికి ప్రేమా అక్కర్లేదు, భర్తా అక్కర్లేదు. తనకు తెలుసు. ఆ విషయంలో తను ఆ పరీక్షలో నెగ్గలేక పోయినాడు. పరాజితుడై తిరస్కరింపబడ్డాడు. అలాంటప్పుడు తను హృదయేశ్వరుడెలా అయినాడు ఇదంతా కపటం. నటన.

"మీ దాని తంకం!" - ఇది ఆ కపట నాటకానికి హాంగు తనెప్పుడూఆమెను 'తంకం' అని పిలిచినట్టు కేశవపిళ్ళైకు గుర్తు లేదు. తననా పేరు పెట్టి పిలవాలని అలాంటి పేరు తనే పెట్టుకొని వుంటుంది. తంకం! శుద్ధ తంకం! ఎంత బూటకం! మొత్తం మీద చాలా వుత్సాహంతో ఆ ఆడది యీ వుత్తరం రాసింది. ఈ పొడుపు కథను గురించి ఆలోచిస్తూ వుంటే ఎంత కాలం గడిచిందో కేశవపిళ్ళై గమనించలేదు. ఆలోచనతో తల నొప్పివచ్చిందే కాని అసలు విషయం అంతు చిక్కటం లేదు. ఏదో మరో దాడి జరగబోతున్నదని మాత్రం కచ్చితంగా తెలుస్తున్నది.

చాలా ఆఫీసు వుత్తరాలతో టేబిలు నిండి వుంది. కాని వాటిలో ఏ ఒక్కదాని మీదకీ అతని దృష్టి ప్రసరించలేదు. ఇలాంటి పరిస్థితి యింతకు ముందు ఒకసారి ఏర్పడ్డది. ఛీఫ్ సెక్రటరీగా ఛార్జీ తీసుకున్న రోజది. కేశవపిళ్ళైకు ఆ రోజు స్పష్టంగా గుర్తుంది. ఆ రోజు కూడా ఆమె రాసి పంపిన ఒక కాగితం అన్నిటి కంటె ముందు టేబిలు మీద కనిపించింది. ఉద్యోగానికి రాజీనామా చేస్తూ రాసిన ఉత్తరం అది. ఆ వుత్తరం చదివిన తరవాత అతనికి మరో పని చేయాలనిపించలేదు. మిగిలిన పనంతా మరునటి రోజు చేద్దామని వదిలేశాడు. ఈ రోజు కూడా అలాగే వుంది. ఇది రెండో వుత్తరం. అసహ్యం వేసే ప్రేమ లేఖ. ఆలంకారికమైన భాషలో రాసింది. చదివితే యేమీ అర్థం కావటం లేదు.

పదవీ స్వీకారం చేయించేందుకు టయిమయిందని బంట్రోతు వచ్చి చెప్పాడు. కేశవపిళ్ళై ఆ విషయం పూర్తిగా మరిచి పోయినట్టున్నాడు. లాంఛన ప్రాయంగా ఆ పని జరిపించటం తప్ప అందులో కేశవపిళ్ళైకు ఏమీ వుత్సాహం ఉన్నట్టు లేదు. సచివాలయంలోని వుద్యోగస్థులను సంబోధిస్తూ

ముఖ్యమంత్రి చిన్న వుపన్యాసం యిచ్చాడు. ఉద్యోగస్థులందరూ సహకరించాలని ఆయన విజ్ఞప్తి చేశాడు. అందరూ కలిసి ఒక్కుమ్మడిగా ప్రయత్నించి ముందంజ వేయటమే ప్రభుత్వం అన్నారాయన. ఉద్యోగస్థుల తరఫున చీఫ్ సెక్రటరీ జవాబు చెప్పాలి. అది కేవలం లాంఛన ప్రాయంగా నీరసంగా వుంది. ఈ సందర్భంలో ఇలాంటి వుపన్యాసం చీఫ్ సెక్రటరీ యిచ్చి వుండగూడదని అందరికీ అనిపించింది. ఈ మంత్రివర్గం ప్రభుత్వంలోకి రావటం చీఫ్ సెక్రటరీకి ఇష్టం లేదని కూడా కొంతమంది అనుకున్నారు. మంత్రి వర్గానికీ, చీఫ్ సెక్రటరీకి మధ్య సామరస్యం కుదిరేటట్టు లేదని ఆ రోజంతా సచివాలయంలో అందరూ చర్చించుకున్నారు. ఇంతకు ముందు ఇలాంటి సందర్భాల్లో చీఫ్ సెక్రటరీ ఇలా ప్రవర్తించలేదు. చాలామంది యిలాంటి సందర్భాలను పునశ్చరణ చేసుకున్నారు. చీఫ్ సెక్రటరీ యిలా పట్టీ పట్టనట్టు వుండటం మంత్రులకు కూడా అంతు పట్టలేదు.

చిన్న చిన్న వాక్యాలు మూడు మాట్లాడి వుపన్యాసం ముగించాడు. అంతకు మించి అతను మాట్లాడలేక పోయాడు. మంత్రివర్గంతో కానీ, ప్రజాభీష్టం ప్రకారం ప్రభుత్వంలోకి వచ్చి నూతన చరిత్రను సృష్టించిన సామ్యవాదులతో కానీ విరోధం వుండేందుకు కారణమే లేదు. మంత్రి వర్గంలో ఇద్దరు ముగ్గురు కేశవపిళ్ళెకు ఇంతకు ముందే తెలుసు. కొన్ని సమావేశాల్లో వాళ్ళు అతన్ని కలుసుకున్నారు. ఇతరులతో ఏమీ పరిచయం లేదు. అయినా వాళ్ళను చూస్తే ఎవరినన్నా తొలిసారి చూసినప్పుడు అనిపించే కొత్తదనం కనిపించలేదు. వెనక ప్రభుత్వంలోకి వచ్చిన మంత్రుల్లాగానే వున్నారు. తంకమ్మ వుత్తరం వల్ల ఏర్పడ్డ మానసికమైన అశాంతే యిందుకు కారణం. ఆ వుత్తరం ఒక ముఖ్యమైన రోజును పాడు చేసింది. భావి జీవితం కూడా అందువల్ల దెబ్బతింటుంది. కేశవపిళ్ళె మనస్సు మరింత బాధపడ్డది.

వాళ్ళకు కలిగిన చెడు అభిప్రాయాన్ని ఎలా బాగువరచటమా అని కేశవపిళ్ళె ఆలోచిస్తున్నాడు. అందరూ పూర్తిగా అపార్థం చేసుకున్నారు. ఎవరి మనస్సూ నొప్పించకుండా వుండే మార్గాన్ని తను అనుసరించాలి. ఎవరి అభిప్రాయాన్నీ ఎదిరించకుండా వుండటం మంచిది. వాళ్ళేం చెప్తే అదే బాగుందని అంటూ వుండాలి. ఇలా కొన్నాళ్ళు తన అభిప్రాయాలనూ, వ్యక్తిత్వానీ అణచుకొని వుండాలని అతను నిశ్చయించుకున్నాడు. అంతకు మించి మరోమార్గం కేశవపిళ్ళెకు కనిపించటంలేదు.

భర్త అలా దిగులుగా వుండటం కాత్యాయనీ అమ్మ గమనించింది. ఉద్యోగమే అక్కర్లేదనే ఆ స్త్రీకి ఈ దిగులు అనవసరమని తోచింది.

తిరువనంతపురంలో ఎక్కడ చూచినా ఇదే చర్చనీయాంశం. రకరకాల పుకార్లు బయలు దేరాయి. భవిష్యత్తును గురించి కూడా వూహాగానాలు చేశారు. అందుకు సంతోషించిన వాళ్ళు కూడా వున్నారు. దిగులు

పడుతున్న వాళ్ళే తక్కువ. అసలు లేరనే చెప్పవచ్చు. వాళ్ళమీదికి ఏం వస్తుందోనని కూడా కొంతమంది విచారపడటం మానేశారు. కాని తిరువనంతపురంలో మరో విషయంలో బాగా భేదాభిప్రాయం ఏర్పడ్డది. సామ్యవాదులకు మద్రాసు నుంచి వచ్చిన ఆర్.టి. మేనేన్ కావాలి. ఆయన ఛీఫ్ సెక్రటరీ అవటం కొచ్చిన్ – తిరువితాంకూరు వాళ్ళకు అంత మంచిది కాదు. ఆయన దృష్టి యెప్పుడూ మలబారుకు సంబంధించిన విషయాల మీదనే వుంటుంది. అయితే కేశవపిళ్ళె వల్ల తిరువనంతపురానికి ఏం లాభం జరిగిందని కొందరి వాదం. అతను ఉత్తరాది వాడు కావటం వల్ల తిరువనంతపురం అంటే అతనికి గిట్టదు. కాని ఆర్.టి.మేనేన్ కంటె కేశవపిళ్ళే నయమని వాళ్ళు కూడా ఒప్పుకుంటారు. కొచ్చిన్ వాళ్ళు కూడా ఈ సందర్భంలో తమ అభిమతాన్ని తెలియ పరిచేందుకు ప్రయత్నిస్తున్నారు. కుంజి శంకరమేనేన్ను ఛీఫ్ సెక్రటరీ ఎందుకు చెయ్యకూడదు? వాళ్ళకు కూడా ఆర్.టి. మేనేన్ కంటె కేశవపిళ్ళె అంటేనే ఎక్కువ యిష్టం. మంత్రివర్గం కూడా మలబారు వైపే ఎక్కువగా మొగ్గుతూంది. తిరువితాంకూరు – కొచ్చిన్ ప్రాంతపు మంత్రులు గొప్ప ఆదర్శవాదులు. కేరళ దేశాన్ని సమగ్రమైన దృష్టితో చూడాలని వాళ్ళు బహిరంగంగా ఉపన్యాసం చెప్తూ వుంటారు. మలబారునుంచి వచ్చిన వాళ్ళు స్వంత విషయం చక్కబెట్టుకొనే స్వార్ధపరులు .

ఈ మధ్యలో ప్రాంతీయ కమిటీ సెక్రటరీ గోపీ చేసిన వుపన్యాసం ఒకటి పత్రికల్లో అచ్చయింది. అది చాలా భావ యుక్తంగా వుంది. పార్టీ తరఫున ఉద్యోగస్థులకు చేసిన హెచ్చరిక అది. అవినీతిని నిర్మూలించాలని ప్రకటించిన తర్వాత అయోగ్యులయిన అధికారులు ఎంత వున్నత పదవుల్లో వున్నా సరే దిగిరావాలని గోపీ స్పష్టంగా ప్రకటించాడు. కొంతమందికి ఈ ప్రభుత్వం ఇష్టం లేకపోవచ్చు. ఈ ప్రభుత్వం పరిపాలనలోకి రాగానే కొంత మంది మొహం చిట్లించుకుని మన్నుదిన్న పాములా చప్పబడి పోయినారనే విషయం కొంతమంది గమనించకపోలేదు. సామ్యవాదుల ప్రభుత్వం దాన్ని గమనించి అర్ధం చేసుకోకపోలేదు. అలాంటి ఉద్యోగస్థులు మారుతున్న పరిస్థితులతో రాజీపడి ముందంజ వేసేందుకు ఎంతకాలం పడుతుందో అని వేచి వున్నాం. వాళ్ళు సరియైన మార్గంలోకి వస్తారా? రారా? అనేదే తేలాలి – ఆ వుపన్యాసం లోని సారంశమిది. ఇందులో విమర్శకు గురి అయిన వ్యక్తి కేశవపిళ్ళే అని వేరే చెప్పవలసిన అవసరం లేదు. గోపికి కేశవపిళ్ళె బాగా తెలుసు – అనే విషయం దేశంలో కొంతమందికి తెలుసు ఈ రకంగా కేశవపిళ్ళె సామ్యవాదుల ఆగ్రహానికి పాత్రుడయినాడనే జనశ్రుతి బయలు దేరింది. అయినా యీ పరిస్థితిలో కేశవపిళ్ళెకు నలువైపులా తిరువితాంకూరు – కొచ్చిన్ వాళ్ళు కొంతమంది వుద్యోగస్థులు చేరారు.

జీవితంలో ఇది తొలి అనుభవం తనకు మద్దతుగా తనతోపాటు నలుగురయిదుగురు నిలబడటం! కేశవపిళ్ళైకు వాళ్ళ మీద అవిశ్వాసం కూడా లేదు.

ప్రతిరోజూ తంకమ్మ దగ్గర నుంచి వుత్తరం వస్తూంది. అదే విషయం వాక్యాలు మార్చి రాస్తూ వుంటుంది. ఆ వుత్తరాలన్నీ ఒక చోట పెట్టి వుంచాడు.

ఒకటి రెండు రోజులయిన తర్వాత అవి చెత్త బుట్టలోకి చేరిపోతాయి. కాని వాటిని మళ్ళీ అతను తీసేసుకున్నాడు. ఆ రహస్యం ఎక్కడ బయట పడుతుందో అని అతనికి భయం. ఆనాటి వుత్తరంలో కూడా విశేషమేమీ లేదు. అసలామెకు పిచ్చి పట్టినట్టుంది. లేకుంటే యేమిటిదంతా? ఇప్పుడా వుత్తరాలకు అతనేమీ చలించటం లేదు. ఆఫీసరు చూచినట్టు చూచి వాటిని చింపి పారేస్తాడు. చాలా ముఖ్యమైన రోజున తన భవిష్యత్తునంతా పాడు చేసేందుకే అనిపించేట్టు ఆమె లేఖ పంపించింది. అంతకు మించి మరోదానివల్ల ప్రయోజనం లేదు. ఆ వుత్తరమే రాకుంటే అతను పదవీ స్వీకారం రోజు పదిలంగా ప్రవర్తించి వుండేవాడు. ఎవరికీ ఎలాంటి అపోహలకూ ఆస్కారం ఇచ్చే వాడు కాదు. ఆ రోజు తను ఎందుకంత విచారపడ్డాడో అతనికి బోధపడటం లేదు. తన జీవితం తానేచెడగొట్టు కొనేందుకేమో?

సచివాలయంలో చాలా మార్పులు వస్తాయని దేశంలో అంతటా అనుకుంటున్నారు. మంత్రివర్గంలోనూ, పార్టీలోనూ పెద్ద పెద్ద స్థాయిలో ఆలోచనలు జరుగుతూ వున్నాయి. శాఖాధ్యక్షుల్లో కూడా కొంతమంది తారుమారయ్యే సూచనలు కనిపిస్తూ వున్నాయి. కొత్త ప్రభుత్వాన్ని అభిమానించే వ్యక్తులను నియమిస్తారు. శ్రామికుల గుత్తా సంఘం యాజమాన్యంలోనే దేశాభ్యుదయ ప్రణాళికలు కొనసాగుతాయి. దేశంలో వున్న యిలాంటి సహకార సంస్థలను సామ్యవాదులు రిజిష్టరు చేశారు. మద్య నిషేధం లేని స్థలాలను వేలం వెయ్యకుండా అంగళ్ళు నడుపుకునేందుకు కూలీల సహకార సంస్థకు అధికారం యిస్తున్నారు. ఇవన్నీ సామ్యవాదులు డబ్బు చేసుకునేందుకు చేస్తున్న పనులని కొందరు విమర్శిస్తున్నారు. భూమి నియామక బిల్లు, విద్యావిషయకమైన బిల్లు కార్య రూపం తాలుస్తూ వున్నాయి. ఈ హడావిడి అంతా అందుకోసరమే.

సచివాలయంలో సెక్రటరీలను మార్పిడి చేసే విషయం కాబినెట్‌లో చర్చకు వచ్చింది. ఆర్.టి.మేనేన్ బాగా పరిచయం, అనుభవం గల వ్యక్తి కావటంవల్ల అభ్యుదయ కార్యక్రమాల బాధ్యత పూర్తిగా అతనికి అప్పజెప్పి అతన్ని సెక్రటరీగా నియమించాలని మంత్రివర్గం అభిప్రాయ పడింది. చీఫ్ సెక్రటరీకి కూడా అతని మీద ఏమీ అధికారం లేకుండా అభ్యుదయ

ప్రణాళికను పునస్సమీక్షించాలని ఆలోచన జరిగింది. కేశవపిళ్ళె తటస్థంగా దీన్ని బలపరచలేక పోయాడు.

కేశవపిళ్ళె జీవితంలో పై అధికార్లతో అతనికి విరోధం రావటం ఇది తొలిసారి. మంత్రి వర్గం వెలిబుచ్చిన అభిప్రాయంతో క్యాబినెట్ సెక్రటరీకి గల వైముఖ్యాన్ని తూచా తప్పకుండా కేశవపిళ్ళె వ్యక్తపరిచాడు. ఆర్.టి.మేనేన్ను గురించి తనకుగల అభిప్రాయాన్ని అతను నిర్మొహమాటంగా చెప్పేశాడు. అతని అభిప్రాయంలో ఆర్.టి.మేనేన్ సమర్థుడు కాడు. చీఫ్ సెక్రటరీతో ప్రమేయం లేకుండా అభ్యుదయ కార్యక్రమాలను నడిపించినందువల్ల రాగల అవ్యవస్థను అనుభవజ్ఞుడయిన వుద్యోగిగా చీఫ్ సెక్రటరీ వివరించాడు. సమర్థులయినా వారిని నియమించే విషయంలో కూడా అతను తన భేదాభిప్రాయాన్ని తెలియబరిచాడు. ఉద్యోగస్థులను గురించి అభిప్రాయం తెలియబరిచే అధికారం అతనికి వుంది గదా? మంత్రులకు ప్రభుత్వాన్ని గురించి యేమీ తెలియదు గదా? ఈ విధంగా మంత్రివర్గం తలపెట్టిన కార్యక్రమాన్ని పూర్తిగా కేశవపిళ్ళె ఖండించాడు - అది పరిపాలనకు సంబంధించిన విషయం కాబట్టి. కాని మంత్రి వర్గం తమ ప్రణాళికలనే .ఆమోదించింది. కేశవపిళ్ళె వెలిబుచ్చిన అభిప్రాయాల్ని మినిట్సులో రికార్డు చేశారు.

"కాత్యాయనీ! నీవు రోజూ అంటావు గదా - వుద్యోగం వదులుకొని వెళ్దామని. అందుకు సిద్ధమయి వచ్చాను" అన్నాడు కేశవపిళ్ళె ఇంటికి రాగానే.

వెంటనే యీ నూతన కార్యక్రమం అమలులోకి వచ్చింది. కాంగ్రెసుకు సంబంధించిన పత్రికలు దీన్ని తీవ్రంగా విమర్శించాయి. సామ్యవాద పత్రికలు దీన్ని గొప్ప సంక్షేమ కార్యక్రమంగా నిరూపించి ప్రచురించారు.

ఆ.తర్వాత చీఫ్ సెక్రటరీ అభిప్రాయ భేదాన్ని రికార్డులో చేర్చకుండా మంత్రివర్గ సమావేశం ఒక్కటి కూడా పూర్తి కాలేదు. కేశవపిళ్ళెకు ధైర్యం వచ్చింది; సాహసం చేకూరింది. ఏమయితే అది కానీ - అన్నట్టు తయారయినాడు. తాటి చెట్ల వాళ్ళ సంస్థకు సారాదుకాణాలు ఇచ్చేస్తే దేశానికి వచ్చే లాభం తగ్గి పోతుందని అతను సూచించాడు. అన్నిటికంటె ఎక్కువ అభిప్రాయ భేదం కూలి సహకార సంఘానికి సార్వజనిక కార్యక్రమాల్లో కంట్రాక్టు ఇవ్వటాన్ని గురించి ఏర్పడింది.

మంత్రి వర్గ సమావేశాల్లో కూడ గట్టుకుని వున్నప్పటికీ మంత్రులు తమ ప్రణాళికలను ప్రచారంలోకి తీసుకురాలేక పోయారు. ఎంత కలిసి మెలిసి వున్నా ఏదో ఒక అంతరాయం వస్తూనేవుంది. చట్టం, నియమాలు పెద్ద ప్రతిబంధకం. ఇవన్నీ కేశవపిళ్ళె సృష్టించినవేనని మంత్రి మహాశయులకు తెలుసు. కాని వాళ్ళేమీ చెయ్యలేక పోతున్నారు.

ప్రాంతీయ కమిటీ సెక్రటరీ గోపీ తీవ్రంగా ప్రతిఘటించాడు. అతను చీఫ్ సెక్రటరీని ఎదిరించాడు. దేశంలో సామాన్య జనానీకానికి లాభించే ప్రణాళికల్లో అడ్డుపుల్లలు వేసేందుకు కేశవపిళ్ళ సాంకేతికమైన ప్రతిబంధకాలను సృష్టించటం పార్టీ గమనించిందని అన్నాడు గోపీ. అంతటితో ఆగక జాగ్రత్తగా మెలగవలసిందని హెచ్చరిక కూడా చేశాడు.

తర్వాత కొద్దిరోజులకు కాంగ్రెసు పత్రికల్లో ఒకవార్త ప్రచురించబడింది. శ్రమజీవులయిన కంట్రాక్టర్ల సంఘానికి సంబంధించిందది. ఈ సంఘం సామ్యవాద నాయకులను జిల్లా స్థాయిలో శాశ్వతంగా కంట్రాక్టర్లనుగా నెలకొల్పేందుకు ప్రయత్నిస్తున్నదని అందులో వ్రాశారు. కొద్దికాలంలోనే చాలా పెద్ద మొత్తం పోగు చేసుకున్న గోపీ సంపాదన గురించి కూడా అందులో విమర్శకు వచ్చింది.దీవాన్‌జీ పరిపాలనా కాలంలో నత్తనడకతో నడిచి, కొంచెం సాగిన తర్వాత ఇట్టికాడు కొండలోయ వరకూ వచ్చి ఆగిపోయిన జలవిద్యుత్ ప్రణాళికను కొంత కాలం తాత్కాలికంగా ఆపి వేయటం మంచిదని ఆర్.టి.మేనేన్ మంత్రి వర్గానికి సూచించాడు. దేశంలోని అభ్యుదయ కార్యక్రమాలను సమీక్షించి త్వరలో వాటిని పునర్గఠితం చెయ్యాలని కూడా అతను నిర్దేశించాడు. ఇంతవరకూ జరిగిన పనులు శాస్త్ర విరుద్ధంగా జరిగాయి. అందువల్ల కొన్నాళ్ళు ఈ అభ్యుదయ కార్యక్రమాలను ఆపివేసి కొత్త కొత్త ప్రణాళికలను కనిపెట్టి ప్రవేశ పెట్టాలి.

### సలభై నాలుగు

రాజకీయ బాధితుడు శంకరపిళ్ళె అనే వ్యక్తి సచివాలయం గుమ్మం దగ్గర సత్యాగ్రహం చెయ్యబోతున్నాడని కొన్ని వార్తా పత్రికలు ప్రకటించాయి. ఒక రోజు ఉదయం శంకరపిళ్ళె సచివాలయం గుమ్మం దగ్గర ఒక ప్రకటన రాసి తగిలించుకొని కూర్చున్నాడు. ఎవరూ అతన్ని ఊరేగింపులో తీసుకుని వచ్చి అక్కడ కూర్చోబెట్టలేదు. నినాదాలూ, ఊరేగింపులూ అలాంటివేమీ లేవు. దారినపోయే వాళ్ళు ప్రకటన చదివి వెళ్ళిపోయారు. ఎవరికీ సానుభూతి యేర్పడినట్టు లేదు.

కాంగ్రెసు వాళ్ళుగానీ, సామ్యవాదులు గానీ అతన్ని పట్టించుకోలేదు. కాంగ్రెసు బాధితులకు సాయం చెయ్యటంలో సామ్యవాదులకేమీ ఆసక్తి వుండదు గదా? కాంగ్రెసు వాళ్ళు కూడా మన పేరు చెడగొట్టేందుకు ఎవరో మరో యెత్తుగడ ఆరంభించారనుకున్నారు. 'నిరాహార దీక్ష' అనే పేరు ఆ ప్రకటనలో ఎక్కడనే కనిపించింది. మర్నాడు పోలీసులు శంకరపిళ్ళెను అక్కడి నుంచి వెళ్ళగొట్టారు.

ఇక తన పని నెరవేరినట్టే అనుకొని కృష్ణన్ తిరువనంతపురం వచ్చాడు. అతని పార్టీ పరిపాలనలోకి వచ్చింది కదా! ఇక ఆలస్యం, లంచం

అలాంటివేమీ వుండవు. పెళ్ళికి ముహూర్తం పెట్టించినా తప్పు లేదని అతననుకున్నాడు. ఈ ధోరణిలో కృష్ణన్ తిరువనంతపురం చేరాడు.

ఒక విధమైన ఆత్మవిశ్వాసంతో, ధైర్యంతో కృష్ణన్ సచివాలయంలో ప్రవేశించాడు. ప్రభుత్వ వైఖరే మారింది. తన పని చూచుకునేందుకు తను ఎక్కడికి వెళ్ళాలో అతనికి తెలుసు. ఆ వైపు ఒక గుమాస్తా కూర్చుని వున్నాడు. అక్కడే అడగాలి.

అప్పుడు పగలు పన్నెండు గంటలయింది. చాలా కుర్చీలు ఖాళీగా వున్నాయి. వెనకటిలాగా ఆడామగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ వున్నారు. వరాండాలో ముగ్గురు నలుగురు మాట్లాడుకుంటూ వున్నారు. వెనక చూచిన దానికంటె భేదమేమీ కనిపించటం లేదు. ఆ కుర్చీ ఖాళీగా వుంది. అక్కడ మామూలుగా కూర్చుండే వ్యక్తి కనిపించలేదు. ఏదో జరిగి వుంటుందని తోచింది కృష్ణనుకు.

కృష్ణన్ కొంచెం సేపు అటూ ఇటూ చూచాడు. అన్ని డిపార్టుమెంట్లూ అలాగే వున్నాయి. ఆ గుమాస్తా కూర్చుండే కుర్చీ వైపు అతను మరోసారి చూచాడు. అక్కడెవ్వరూ లేరు. ఆ పక్కనున్న గుమ్మం దగ్గర ఒక బంట్రోతు స్టూలు మీద కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. కృష్ణన్ అతని దగ్గరికి వెళ్ళాడు. "ఏమిటయ్యా?" అని అడిగాడు బంట్రోతు.

బంట్రోతు ఆపాదమస్తకం కృష్ణన్ని చూచాడు. "అతన్ని ఒక విషయం అడగాలి." అన్నాడు కృష్ణన్.

కొంచెం దూరంగా ముగ్గురు నలుగురు నిలబడి మాట్లాడుతున్నారు. వాళ్ళల్లోనే అతనున్నాడని చెప్పాడు బంట్రోతు. కృష్ణన్ వాళ్ళ దగ్గరికి వెళ్ళాడు. వాళ్ళు చాలా గంభీరంగా మాట్లాడుకుంటున్నారు. కృష్ణన్ చాలా సేపు అక్కడ నిలబడ్డాడు. వాళ్ళు మాట్లాడుతున్న విషయమేమిటో అతనికి అర్థమయింది.

అక్కడక్కడా గుమాస్తాలు పోగయి కబుర్లు చెప్పుకోటానికీ, చాలా కుర్చీలు ఖాళీగా వుండటానికి కారణం ప్రభుత్వంలో చాలా మార్పులు రావటమే. సెక్రటరీలను, సహాయక సెక్రటరీలనూ అటూయిటూ మార్చేస్తున్నారు. దాన్ని గురించి అందరూ ఆలోచిస్తున్నారు. కొత్త ప్రభుత్వంలో నమ్మకస్థులను ముఖ్యమైన పదవులలో వేసి మిగిలిన వాళ్ళను కొంతమందిని బయటికి పంపించారు., మరికొంత మందిని ముఖ్యమైన పదవులనుంచి తొలిగించారు. ఆర్థిక శాఖలో ఒక కొత్త వ్యక్తి వచ్చాడు.

"అయితే వీళ్ళంతా సామ్యవాదాన్ని సమర్థించేవాళ్ళా?" అని అడిగాడొక గుమాస్తా.

మద్రాసు నుంచి వచ్చిన వాళ్ళు కదటోయ్? ఒకగొప్ప సామ్యవాది యం.పి.కి బంధువు కావటంవల్ల సమర్ధించే వాడే అయివుంటాడు." మరో గుమాస్తా జవాబు చెప్పాడు.

"అయితే యీ మార్పుల వల్ల సెక్రటరీల అసలు రంగు బయట పడుతుంది." మరో వ్యక్తి అడిగాడు.

అలాగే అనిపిస్తున్నదన్నాడు మరొకడు.

నాలుగోవ్యక్తి అడిగాడు: "అయితే ఛీఫ్ సెక్రటరీని ఏం చేస్తారు? అతన్ని ఎక్కడికి మారుస్తారు?" ఇది కావాలని అడిగిన ప్రశ్న. ఆ వ్యక్తి మళ్ళీ యిలా అన్నాడు: "అతను మొదటి తరగతి కాంగ్రెసు వాడు."

ఈ సంగతి బాగా తెలిసిన మరో వ్యక్తి సమాధానం చెప్పాడు: "ఈ మధ్య ఆయన కొంచెం చప్ప బడ్డాడు. కాని మళ్ళీ తేరుకున్నాడు. మారి వుండచ్చు. ఆయన తయారు చేసిన జాబితాను ఇప్పుడు క్యాబినెట్ మంజూరు చేసిందని అంటున్నారు. ప్రభుత్వానికి అతని మీద పూర్తిగా నమ్మకముంది. అవినీతి నిర్మూలన శాఖను పునర్వ్యవస్థీకరించే బాధ్యత అతనికి అప్పచెప్పారు."

'భేష్' అనాలి గనక అన్నాడు మూడో వ్యక్తి ఛీఫ్ సెక్రటరీ రాజీనామా చేసి ఎన్నికల్లో నిలబడి మంత్రి వర్గంలో ప్రవేశిస్తారనే పుకారును గురించి కూడా అక్కడ చర్చ జరిగింది.

"ఆయన అలాంటి పిచ్చిపని చెయ్యడోయ్! కాంగ్రెసు మళ్ళీ ప్రభుత్వంలోకి రాదని ఆయనకు తెలుసు. ఆయన చాలా తెలివిగలవాడు. ఇప్పుడు ఆయన చెయ్యవలసిందేమిటంటే సామ్యవాదులతో సంబంధం ఏర్పరచుకోవటం." అన్నాడు మరొకడు.

మరోవ్యక్తి ఆశ్చర్యపడుతూ అన్నాడు:

"గోవిందన్ పిళ్ళెలో కూడా ఇంత సామర్ధ్యం లేదు."

"ఇంకెన్నాళ్ళు?" అడిగాడు మొదటి వ్యక్తి.

"చాలా రోజులున్నట్టు లేదు. సంవత్సరం, సంవత్సరన్నర ఉంటుంది."

"మన సంభాషణ ఎవరో జాగ్రత్తగా వింటున్నారు"- అప్పుడే వాళ్ళ దృష్టి కృష్ణన్ వైపు ప్రసరించింది.

"ఏం కావాలి?" అడిగారు ఎవరో కృష్ణన్ని.

"ఆ కుర్చీలో కూర్చుండే అతన్ని కలుసుకోవాలి".

ఆ గుమాస్తా వాళ్ళల్లోనే వున్నాడు.

"ఏం కావాలి?" అని అడిగాడు.

కృష్ణన్ తన సంగతి వివరంగా చెప్పాడు.

వాళ్ళలో ఒకరు ఆ గుమాస్తాను హెచ్చరించారు.

"తొందరగా వెళ్ళు. చేయవలసిందేదో చేసేసెయ్యి."

"లేకుంటే?"

"ఉద్యోగం ఊడుతుంది. అంగడి మూత పడుతుంది. ఇదంతా ఒక యూనియన్. తెలిసిందా?"

"అదా? ఇలాంటివి చాలా చూచాం. ఏం ఫరవాలేదు"

ఆ హెచ్చరిక అతన్ని అంతగా కదిలించినట్లు లేదు.

"దెబ్బ తగిల్తే అప్పుడు తెలిసివస్తుంది." అన్నాడు హెచ్చరించిన వ్యక్తి.

ఎలాగో ఆ గుమాస్తా తన సీటులోకి వెళ్ళాడు. కృష్ణన్ అతని వెనకనే వెళ్ళాడు. చాలా సేపటి దాకా ఆ గుమాస్తా లావుపాటి రిజిష్టర్లు తిరగేశాడు, షెల్ఫులో వున్న ఫైళ్ళన్నీ వెదికాడు - అంతా చూసి చివరికన్నాడు:

"ఆ ఫైలు ఇక్కడ లేదు. చాలా రోజుల కిందట నీ అర్జీ ఒకటి యిక్కడికి వచ్చినట్లుంది. దాన్ని రెవెన్యూ బోర్డుకు పంపించేశాం."

కృష్ణన్ నివ్వెరపోయాడు:

"ఇదివరకు ఇక్కడ కూర్చున్న అతను ఈ మాట చెప్పలేదే? అతను 'ఆడిటు'కు పంపించామని చెప్పాడు."

గుమాస్తాకు ఆ విషయం నచ్చలేదు.

"అయితే నీవు అతన్నే అడిగుండవల్సింది" అన్నాడు.

కృష్ణన్ చప్పబడ్డాడు.

"ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు? ఈ ప్రభుత్వం వస్తే అన్నీ చక్కబడతాయనుకున్నాను. ఈ డబ్బు వస్తే పెండ్లి చెయ్యాలి. ఇంట్లో అమ్మాయి పెండ్లికి సిద్ధంగా వుంది. రెండు నెలల్లో పెండ్లి జరిపిస్తానని నేను మాటిచ్చాను."

"అమ్మాయికా?" అన్నాడతను.

ఆ ప్రశ్నలోని పరిహాస విషాన్ని ఆ తండ్రి అర్థం చేసుకో లేకపోయినాడు. అతను అమాయకంగా సమాధానం చెప్పాడు:

"కాదు. పెళ్ళి వాళ్ళు వచ్చారు. నన్నేం చెయ్యమంటారు?"

గుమాస్తా తల తిప్పాడు.

"తాతగారి దర్బారులో యూనియనుందా? యూనియన్?" కృష్ణన్‌కి అర్థంకాలేదు. గుమాస్తా వివరించాడు: "సామ్యవాద యూనియన్?"

"లేదు. అక్కడ ఒక శాఖ వుంది. చంద్రశేఖర్ దానికి పెద్ద."మీరు ఎవరికి వోటిచ్చారో?" అడిగాడు గుమాస్తా. ఇంతలో ముగ్గురు నలుగురు గుమాస్తాలు వచ్చారు.

"సామ్యవాదులకు" అన్నాడు కృష్ణన్.

అక్కడికి వచ్చిన గుమాస్తాల్లో ఒకరికి కృష్ణన్ మీద సహానుభూతి ఏర్పడింది. అతను తోటి గుమాస్తాతో అన్నాడు: "ఇతనితో తొందరగా మాట్లాడి పంపించేసెయ్."

ఆ గుమాస్తా దానికి సిద్ధంగానే వున్నాడు. అతను ఉపదేశం ఆరంభించాడు:

"అయితే తాతా, ఒక పని చెయ్యి. రెవిన్యూ బోర్డుకు వెళ్ళి అడుగు. ఆ తర్వాత అకౌంటాఫీసుకు వెళ్ళి విచారించు. లేకుంటే నేనొక సులువైన మార్గం చెప్తాను. అబ్బాయి పేరిట ఆర్థిక శాఖలో జమ కట్టిన డబ్బు ఇచ్చేందుకు ప్రభుత్వం ఇచ్చిన అధికార పత్రం జతపరుస్తూ మరో అర్జీ పంపించు. నేను చూచుకుంటాను."

"నాకు డబ్బిచ్చేందుకు ఉత్తర్వు వచ్చేసింది. నా అధికారపత్రం కూడా మంజూరయింది. అది 'ప్రీ-ఆడిటు'కు పంపామని యింతకు ముందు ఇక్కడ కూర్చున్న గుమాస్తా అన్నాడు."

"అయితే ఒక పనిచెయ్యి, ఇప్పుడు మాత్రం వెళ్ళు. ఒంటి గంట అయింది. మేమేదన్నా తినేందుకు వెళ్ళాలి. ఆ తర్వాత చాలా పనుంది. 'ప్రీ-ఆడిటు'లో కనుక్కొని రా."

కొంచెం లోపల లోపల తర్కించుకుంటూ కృష్ణన్ అక్కడ నిలబడి వున్నాడు. గుమాస్తా నెమ్మదిగా చెప్పాడు: "వెళ్ళు. సీటు ఖాళీ చెయ్యి. నా సమయం వృథా చెయ్యకు."

కృష్ణన్ వెళ్ళిపోయాడు. ఇంతవరకు ఇలాంటి అనుభవం కాలేదు. ఆ గుమాస్తా వేళాకోళం చేసి పంపించేశాడని అనిపించలేదు కృష్ణనుకు. వెనకటి సమాచారం నిజమా ఇప్పుడు చెప్పింది. నిజమా అని అతనికి సందేహం. కొత్త నివేదిక యివ్వమంటున్నాడు. దానికి పాత కాగితాలు, అధికార పత్రం అన్నీ కావాలి. బోర్డు ఆఫీసుకు, మరో ఆఫీసుకు వెళ్ళి కనుక్కోమన్నాడు. ఆ ఆఫీసులెక్కడున్నాయో, తెలియదు. అంతా అయోమయంగా వుంది. ఇంతవరకూ ప్రీ-ఆడిటులో తన కాగితాలున్నాయని అనుకుంటున్నాడు. ఇప్పుడు అది కూడా అనుమానమే.

వెనకటి గుమాస్తా కలుపుకోలుగా మాట్లాడేవాడు. అతను వయసులో కొంచెం పెద్దవాడు. అనుభవజ్ఞుడు. అన్ని విషయాలూ వివరంగా చెప్పేవాడు. ఇతను తన విషయం పూర్తిగా చెప్పుకునేందుకు అవకాశం కూడా యివ్వలేదు.

ఏం చెయ్యాలో తోచక సచివాలయం దక్షిణం వైపు ఒక చెట్టు కింద కూర్చుండి పోయాడు-కృష్ణన్. బోర్డు ఆఫీసు ఎక్కడనే? ప్రీ-ఆడిట్ ఎక్కడనే? ఎవరిని అడగటం? ఎలా తెలుసుకోటం?

శివమయం లక్ష్మి హొటల్లో వుద్యోగం పోయి మరో పనికోసం ప్రయత్నించుకుంటున్న పోలీసు బంట్రోతు ఒకడు కనిపించాడు. తనకు చేతనయిన సాయం చేస్తానని చెప్పాడతను. కాని కొంచెం డబ్బు ఖర్చు పెట్టాలి. ఎక్కువ అక్కర్లేదు. నాలుగయిదు రూపాయలు సరిపోతాయి. అతను ఒక నిజమైన మాట కూడా చెప్పాడు.

"ఇప్పటి ప్రభుత్వంలో లంచమియ్యాల్సిన పనిలేదని అనుకుంటున్నారేమో తాతయ్యగారు. అవునా? ఇప్పుడు మంత్రి పదవిలో వున్న ఒక వ్యక్తి దగ్గర నేను డబ్బు తీసుకున్నాను. ఒక సంఘం సమ్మెలో రాజీ కుదిర్చినందుకు పెట్టుబడి దార్లు అతనికి ఏదో ముట్టు జెప్పారు. అది కూడా నాకు తెలుసు. అందువల్ల అవన్నీ మరిచిపోండి."

ఈ విధంగా ఆ పోలీసు బంట్రోతు సాయంతో అతను మరో ప్రయత్నం చేసి చూచాడు. రెవిన్యూ బోర్డులో పనిచేసే గుమాస్తాను కనుక్కుంటే అకౌంట్సాఫీసులో జప్తు చేసిన వస్తువులను తిరిగి యిచ్చేందుకు ప్రభుత్వం జారీ చేసిన ప్రకటన నంబరు, తేదీగల ఉత్తరం దొరికింది. దానికి ప్రత్యుత్తరం పంపలేదు. 'ఆఫైలు మాత్రం దొరకదు. దాన్ని వెతకటం చాలా కష్టమైన పని' అని ఆ గుమాస్తా తేల్చి చెప్పాడు. కాబట్టి మరో అర్జీ యివ్వటమే మంచిదని కూడా అతను సలహా చెప్పాడు. ఇంతవరకూ చేసిన ప్రయత్నమంతా మరిచి పోవాలి. ఆలస్యం అవుతుందనే విషయం అతను కాదన లేదు.

అకౌంట్సాఫీసులో మరోసారి ప్రయత్నం చేద్దామనుకున్నాడు కృష్ణన్. కాని పాపమతను ఆ ఆఫీసులో అడుగు పెట్టలేక పోయాడు. ఆ సమయంలో తిరువనంతపురంలోని సామ్యవాద కార్యాలయానికి వెళ్ళి చెపితే పని అవుతుందని ఎవరో అతనికి చెప్పారు. కృష్ణన్ ఆ కార్యాలయానికి వెళ్ళాడు. అక్కడ తెలిసిన వాళ్ళెవరూ కనిపించలేదు. అయినా నేరుగా సెక్రటరీ దగ్గరికి వెళ్ళాడు. ఆయన అన్ని విషయాలూ శ్రద్ధగా విని రాసుకున్నాడు. వీలయినంతవరకూ ప్రయత్నిస్తానని మాట కూడా యిచ్చాడు.

కృష్ణన్ తిరువనంతపురం వచ్చి దాదాపు ఒక నెల అయింది. ఒకపూట భోజనంతో అతను రోజులు గడుపుతూ వున్నాడు. దగ్గరవున్న డబ్బంతా ఖర్చయిపోయింది. ఈ పనిలో దిగినప్పటికంటే ఇప్పుడు పరిస్థితి చాలా దిగజారిపోయింది.

అసలీ పనికి పూనుకోవటం పొరబాటయింది. దీనికయిన ఖర్చంతా మిగుల్చుకుంటే యీపాటికి పిల్ల పెళ్ళి చేసివుండేవాడు. ఈ లోపల ఎన్ని యేండ్లో గడిచాయి. అదీగాక యిన్ని రోజుల నుంచీ కూలీనాలీ చేసుకున్నా అనవసరమైన యీ ఖర్చు లేకుండా పెండ్లికి కావలసిన డబ్బు సంపాయించుకునేవాడు. ఈ విధంగా కృష్ణన్ ఈ విషయాన్ని గురించి తొలిసారి తనలోతనే కార్యకారణ చర్చ ఆరంభించాడు. ఇంతకు ముందు ఇలా ఆలోచించలేదు. ఇది మృగతృష్ణలా తయారయింది. ఏదో ఆశ.

కృష్ణన్ పూర్తిగా నిరాశ చెంది తిరిగి వూరు చేరుకున్నాడు. అతనికి తెలిసినంతవరకు మరే మార్గం కనిపించటం లేదు. ఆలప్పుళలో సామ్యవాదులు పున్నప్ర - వయలార్ దినోత్సవం జరుపుకొనేందుకు ఏర్పాట్లు

చేస్తున్నారు. సామ్యవాద ప్రభుత్వం పరిపాలనలోకి వచ్చిన తర్వాత తొలిసారి జరుగుతున్న పున్నప్ర - వయలార్ దినోత్సవమిది. అందువల్ల దీనికి ప్రత్యేకమైన ప్రాముఖ్యముంది.

పెళ్ళివాళ్ళు పెళ్ళి విషయం తేల్చుకునేందుకు వచ్చారు. కృష్ణన్ ఏం చెప్పగలడు? ఈ కథంతా వినేందుకు వాళ్ళకేమీ అభిరుచి లేదు. ఇలా ఆలస్యం చేస్తే మరో సంబంధం మాట్లాడుకోవలసి వస్తుందని వాళ్ళు హెచ్చరించారు. కృష్ణన్ ఫలానా రోజుకు తయారవుతామని కూడా చెప్పలేక పోయాడు.

న్యాయం కోసం తిరువనంతపురం వెళ్ళిన శంకర పిళ్ళైకు సచివాలయం వాకిట్లో కృష్ణన్ కనిపించాడు. కాంగ్రెసువాళ్ళ అన్యాయం, అక్రమం, అవిశ్వాసాన్ని గురించి అతను శివమయం లక్ష్మీ హోటల్లో అందరికి చెప్పాడు. కాంగ్రెసు కోసం జీవితమంతా ధారపోసిన వ్యక్తికి ఈనాడు తిరిగి చూస్తే కనిపించే వ్యక్తి లేకుండా పోయినాడు. అతని వృత్తాంతం అలాంటిది.

కృష్ణన్ తనవూళ్ళో వున్న స్థానిక కమిటీ సెక్రటరీని కలుసుకుని తన గొడవంతా చెప్పుకున్నాడు. అతను సానుభూతితో సాంతంగా విని అన్నాడు: "ఏదో మార్గం చూస్తాను. ఈ పున్నప్ర - వయలార్ సభ అయిపోనివ్వండి."

కృష్ణనుకు ఆ సమాధానం ఎంత మాత్రం నచ్చలేదు. "పూర్ణిమ దాకా ఆగమంటే వురిటి నెప్పులు ఆగుతాయా? వాళ్ళు మరో సంబంధం చూచుకుంటారు" అన్నాడు.

సెక్రటరీకి అది అంత సమస్యగా తోచలేదు. "అయితే మనమూ మరో సంబంధం చూచుకుందాం. వాళ్ళను వెళ్ళనియ్యండి." అన్నాడు.

ఏమీ చెయ్యలేని ఆ ముసలాయన వణికి పోయినాడు. అతని ఒళ్ళు మండింది. కాని తన కోపాన్ని తనలోనే మింగుకున్నాడు. ఎందుకు మింగేశాడో తెలియదు.

ఇంతలో మరో సమస్య బయలు దేరింది. కాంగ్రెసువాళ్ళు పున్నప్ర - వయలార్ విరోధ ప్రదర్శన ఆరంభించారు. టీ దుకాణంలో దీన్ని గురించి కృష్ణన్‌కు కొంచెం ఆచూకి తెలిసింది. సామ్యవాదులు నాయకత్వం వహించి కొంతమందిని అన్యాయంగా బలి యిప్పించారు. పున్నప్ర - వయలారును గురించి అతనికి అంత మాత్రం తెలిసింది.

ఆ వార్త ఆ తండ్రి గుండెలో చొచ్చుకు పోయింది. అతనికి ఆశ్చర్యం వేసింది. తనలో తాను ప్రశ్నించుకున్నాడతను: "అయితే యిదంతా మోసమా?"

ఆ ప్రశ్న కృష్ణన్ని వెంబడించింది. ఎంత దూరం వెళ్ళి ఆలోచించినా అదే అతనికి స్ఫురిస్తూ వుంది. అదే ప్రశ్న వినబడుతూవుంది.

సదాశివన్ తుపాకీ దెబ్బ తిని చనిపోయాడు. అందువల్ల ఎవరికి లాభం? తనకా? తన ఏకైక సోదరికా? అలా ఆలోచించగా ఆలోచించగా కృష్ణన్ ఆలోచన అదే రకంగా పయనించింది. ఆ త్యాగ వీరుల పేరు విని వందల కొలది పేదవాళ్ళు వోట్లు వేశారు. ఎన్నికల రోజున కృష్ణన్, మనస్సులో తన కొడుకును స్మరిస్తూనే ఆ కాగితపు ముక్క పెట్టెలో వేశాడు. సమావేశాల్లో వుపన్యాసాలు వినేప్పుడు, కేకలు పెడుతూ వూరేగింపు ముందుకు సాగేప్పుడూ అతని మనస్సు ఆవేశంతో పరవశించి పోతూ వుండేది. అదంతా కొడుకును తలుచుకొనే. ఎవరి మేలుకోసమో ఆ పసివాడు తుపాకీ గుండు దెబ్బకు ఎదురుగా తన గుండెకాయ విప్పినిలబడ్డాడు. స్మశానంలో అతని గుండె కాలిపోయిన భస్మం నల్లటి యిసుక రేణువుల్లో కలిసి పోయింది. ఆ భస్మకణాలు ఈనాడు తన చెల్లెలి పరిస్థితినీ, తనబాధలనూ చూచి దిగులుతో దహించుకుపోతూ వుంటాయి. లేకుంటే అనవసరంగా అసువులు కోల్పోయినందుకు ఉమిలి కుమిలి కుంగిపోతూ వుంటాయి. లేదా కోపావేశంతో గజగజ కంపించి పోతూ వుంటాయి.

అతని ఆత్మ తనకు ఏమో చెప్తున్నట్టు తట్టింది కృష్ణన్‌కు. తనకు కూడా ఏదో అడగాలని వుంది. బహుశా పున్నప్రలోని కొబ్బరి చెట్ల ఆకుల గలగలలో అతని ఆత్మ ఏదో చెపుతున్నట్టుంది. కాని ఆ భాష బోధపడదు. వెతికి వెతికి అతన్ని ఎక్కడ చూడటం? అతని ఆర్తనాదాన్ని ఎలా వినటం? ఏమని పిలిస్తే అతను పలుకుతాడు?

త్యాగవీరుల స్మారకోత్సవం బ్రహ్మాండంగా జరిపించేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు. కొంతమంది మంత్రులు వస్తున్నారు. అలాగే నిరసన సభ కూడా బ్రహ్మాండంగా జరగబోతున్నది. కొంతమంది ప్రముఖ కాంగ్రెసు నాయకులు కూడా వస్తున్నారు. వాళ్ళల్లో చాలామంది శంకరపిళ్ళె కోసం నాయకత్వం వహించారు. సదాశివన్ భస్మంతో మరికొందరు నాయకులయినారు. పాపం కృష్ణనుకు అలా అనిపిస్తున్నది.

స్థానిక కమిటీ సెక్రటరీతో కొన్ని విషయాలు మాట్లాడాలని కృష్ణన్ నిశ్చయించుకున్నాడు. అలా మాట్లాడితేనే కాని మనస్సు కుదుట పడేటట్టు లేదు. కాని ఏకాంతంగా అతనితో మాట్లాడే అవకాశమే దొరకదు. సెక్రటరీ ఎప్పుడూ తీరని పనిలో వుంటాడు. స్థానిక కమిటీ కార్యాలయంలో ఎప్పుడూ గుంపులు గుంపులుగా జనం వుంటారు. ఏవేవో విషయాలను గురించి అస్తమానం అక్కడ చర్చలు జరుగుతూ వుంటాయి.

పున్నప్ర - వయలార్ దినోత్సవంలో ఈ సంవత్సరం కృష్ణన్ కేవలం వీధిలో నిలుచుని చూచే సామాన్య ప్రేక్షకుడు. ఎలుగెత్తి కేకలు పెడుతూ బారులు తీరి ముందుకు సాగే వాళ్ళను వీధిలో నిలబడి చూస్తున్నాడు కృష్ణన్. ఇంత పెద్ద వూరేగింపును అతను ఇంతవరకు చూడలేదు. చూచేందుకు ఎంతో

ఆకర్షణీయంగా వుంది. ఇదివరకులా కాదు. చాలా మార్పులు వచ్చాయి. జెండాలో ఎర్రరంగు కొంచెం పల్చబడింది. బాగా దుస్తులు వేసుకుని తయారయి వచ్చిన వాళ్ళ వూరేగింపది. మంచి మంచి ధోవతులు కట్టుకుని వున్నారు. కాని అంత వుత్సాహం కనిపించటంలేదు. వెనకటి రోజుల్లో ఈ వూరేగింపులో పాల్గొనే వాళ్ళ కళ్ళు నిప్పులు కక్కుతూ వుండేవి. దానికి కారణం కూడా వుంది. పున్నప్రలో తుపాకి దెబ్బలకు చనిపోయిన వాళ్ళ బంధువులనందరినీ కృష్ణన్ గుర్తు పట్టగలడు. వాళ్ళల్లో చాలామంది ఇప్పుడు లేరు. గోవిందన్ కూడా కనిపించలేదు. కృష్ణన్ అంతప్పన్ కోసం వెతికి చూచాడు. కేశవన్ భార్య (వితంతువు) కూడా లేదు. అలీ తండ్రి కుంటివాడయినా ఆ వూరేగింపుకు ప్రాణ ప్రాయంగా వుండేవాడు. అతను బతికే వున్నాడు. కాని ఆ వూరేగింపులో లేడు. వీళ్ళంతా భూమిని ఉక్కిరి బిక్కిరి చేసేవాళ్ళు. కృష్ణన్ అలా ఒక్కొక్కరినీ వెతుకుతూ వుంటే కొన్ని కొత్త మొహాలు వూరేగింపులో కనిపించాయి. గత సంవత్సరం ఊరేగింపు మీద రాళ్ళు రువ్విన ఓసెఫ్ ఎర్రజెండా పట్టుకొని వెళుతున్నాడు. సమావేశం వైభవోపేతంగా జరిగింది. సమావేశాన్ని చెడగొట్టే పప్పు కూడా అందులో వున్నాడు. ప్రతి రోజూ సమావేశాలను చిందరవందర చెయ్యటమే పప్పు పని. చాలాయేళ్ళ నుంచి నిరసన సభల్లో పాల్గొన్న వాడు కంట్రాక్టరు కొచ్చుకోశి కూడా పున్నప్ర - వయలార్ దినోత్సవంనాడు త్యాగ వీరులకు శ్రద్ధాంజలి అర్పించేదుకు హాజరయినాడు. కొచ్చుకోశి 1922వ సంవత్సరంలో ఇంటింటికీ వెళ్ళి వేటాడిన సిపాయీలతో కలిసి పనిచేసిన వ్యక్తి. అమాయకుడయిన కృష్ణనుకు ఏమీ బోధపడటం లేదు. ఆనాటి సమావేశం చాలా గొప్పగా జరిగింది. ఒకరు కాదు, ఇద్దరు మంత్రులు వచ్చారు.

అయినా మర్నాటి వూరేగింపులోనూ, సమావేశంలోనూ అంతప్పన్, కుంటి పరీత్ పాల్గొనటం చూచి కృష్ణన్ సహించలేక పోయాడు. వాళ్ళు కాంగ్రెసు జెండా పట్టుకుని కేకలు పెడుతున్నారు. ఇది చాలా విచారకరమైన విషయం. అంతపన్నూ, పరీతునూ పిలిచి వాళ్ళు చేస్తున్న పని సరియైనదేనా అని అడుగుదామనుకున్నాడు కృష్ణన్. కాని అతన్ని అడగటం ఎలాగా?

మరి రెండు రోజులు గడిచాయి. సెక్రటరీని కలుసుకుని యివన్నీ చెపుదామని కృష్ణన్ ఉద్దేశ్యం. అతనికి చాలా విషయాలు తెలుసుకోవాలని వుంది. తన సంగతి కూడా చెప్పుకోవాలి. 'స్మారక దినం అయిపోనియ్యి చూద్దాం.' అన్నాడు గదా? అందుకని ఒకరోజు పార్టీ ఆఫీసుకు వెళ్ళాడతను.

ఆ రోజు అక్కడ రోజూకంటె ఎక్కువ మంది వున్నారు. పార్టీ ఆఫీసుకు అంతకు ముందు ఎన్నడూ రానివాళ్ళు కూడా అక్కడ వున్నారు - మట్టత్త

కృష్ణ మేనేన్, ఏరాత్త అంతోనీ లాంటివాళ్ళు. కృష్ణనుకు ఏమీ అర్థం కావటం లేదు. పార్టీ ఆఫీసుకు వీళ్ళు రావటం చూసినా కృష్ణన్ నమ్మలేక పోతున్నాడు. వీళ్ళందరూ సామ్యవాదులయినారా యేమిటి? మొత్తం మీద ఇదంతా అతనికి గందరగోళంగా కనిపించింది.

కృష్ణన్ సెక్రటరీ దగ్గరకి వెళ్ళాడు. ఆయన ఏవో కాగితాలు చూసుకుంటున్నాడు.

"ఇక నా సంగతి మీరు కొంచెం చూడాలి" అన్నాడు కృష్ణన్. పనిలో వున్నప్పుడు అతను గదిలోకి రావటం సెక్రటరీకి అంత బాగా లేదు. కాని అలాంటి భావం అతను కనబరచలేదు. "ఏమిటి సంగతి?" అన్నాడు.

"సదాశివన్, ఖజానాలో జమగట్టిన డబ్బు సంగతి" సెక్రటరీకి జ్ఞాపకం వచ్చింది. "కొన్నాళ్ళు పోనియ్యండి. నాకు బొత్తిగా తీరటం లేదు" అన్నాడు.

కృష్ణన్ తన యిబ్బందులను చెప్పుకుంటూ అన్నాడు: "మా అమ్మాయికి నిశ్చయించిన సంబంధం చెయి జారిపోయింది. ఇక మరో సంబంధం చూసుకోవాలి. కాని దానికి కూడా చేతిలో డబ్బుండాలి కదా?"

"మంచిది. అలాగే చూద్దాం. కొన్నాళ్ళు దాటిన తర్వాత ఈ విషయం ఆలోచిస్తాను."

క్యామిల్, ఆంథోనీ సామ్యవాదు లెలా అయినారో తెలుసుకోవాలనిపించింది.

"ఈ క్యామిల్, ఆంథోనీ ఎందుకు వచ్చారు?" అని అడిగాడు.

"వాళ్ళకు కబురు చేసి పిలిపించాం. వాళ్ళు తమ స్థలాల్లో వున్న హరిజనులను బయటికి పంపిస్తున్నారని ఆక్షేపణ వచ్చింది."

"అంతే వాళ్ళు వచ్చేశారా?" కృష్ణన్ ఆశ్చర్యంతో అడిగాడు.

"రాకపోతే? ఇప్పుడు మన ప్రభుత్వంగదా? ఎన్నికలప్పుడు పడ్డ అగచాట్లన్నీ మరిచిపోయారు?"

ఒక చెట్టు కింద కూర్చుని వున్న కృష్ణన్ క్యామిల్‌నూ, ఆంథోనీ మాప్పిలానూ జాగ్రత్తగా గమనించాడు. వాళ్ళు కూడా అలాకూర్చుని వుండటం కృష్ణనుకు చాలా బాగుంది. సెక్రటరీ చెప్పింది నిజం.ఎన్నికల సమయంలో పడ్డ అగచాట్లు వృధా కాలేదు. ఆ ధనవంతులను పార్టీ ఆఫీసుకు రప్పించగలిగాం. అందుకు కృష్ణన్ నిజంగా తృప్తి పడ్డాడు.

వీధిలో ఒక కారు వచ్చి ఆగింది. అందులో నుంచి ఆలప్పుళలోని గొప్ప వ్యాపారస్థుడొకడు దిగి ఆఫీసులోకి వెళ్ళాడు. కృష్ణనుకు అతను తెలుసు. అంతగొప్పవాడు కూడా పార్టీ ఆఫీసుకు రావటం చాలా గొప్ప విషయం. స్మారక దినోత్సవంనాడు మంత్రి గారి వుపన్యాసంలోని ఒక వాక్యం కృష్ణన్ చెవుల్లో మారుమోగుతూ వుంది:

"పున్నప్రా - వయలారులో తుపాకి గుండు తగిలి ప్రాణాలు కోల్పోయిన వాళ్ళ రక్తంతో ఏర్పడ్డ పార్టీ పటుత్వం తొలిసారి మనం యీ రోజు చూస్తున్నాం."

అవును. క్యామిల్, అంథోనీ మాప్పిలా చింతచెట్టు కింద కూర్చునివున్నారు. ఆలప్పుళ నుంచి ఒక గొప్పధనవంతుడు వచ్చాడు. ఇక ముందు ఏమేమి కాబోతున్నదో?

కొంచెం సేపు ఆగి ఒక వ్యక్తి వచ్చి చెప్పాడు:

"నోటీసు బోర్డు ప్రకారం ఈ రోజు వచ్చిన వాళ్ళందరూ ఆదివారం రావచ్చు. ఈ రోజు అర్జీలను గురించి విచారణ జరగదు."

కొంచెం సేపు ఎవ్వరూ ఏమీ మాట్లాడ లేదు. అంతోనీ మాప్పిలా లేచి "ఆదివారం మేము చర్చికి వెళ్ళాలి" అన్నాడు.

"ఏమయినా సరే, ఆదివారం వచ్చి తీరాలి."

కొంచెం సేపటికి ఆ ధనవంతుడితో కలిసి సెక్రటరీ కారులో కూర్చుని వెళ్ళిపోయాడు. వెనక సీటులో ఇద్దరూ కూర్చున్నారు. కారు వెళుతూవుంది. ఆ వెళ్ళటంలో ఏదో ఆకర్షణ వుంది.

ఆఫీసులో ప్యూనుగా వుండే అతనికి సెక్రటరీ పదవి లభించింది. అది గర్వించవలసిన విషయం. కాని - ఎక్కడో ఏదో పొరపాటు జరిగినట్టు అనిపించింది కృష్ణనుకు. ఆ ధనవంతుడితో ఇంతవరకూ కీచులాడుతూ ఇప్పుడతనితోపాటు కారులో తిరగటం ఎంతవరకూ న్యాయం అని ఆలోచించుకుంటున్నాడతను.

ఎంత ఆలోచించినా యీ నూతన వ్యవస్థ కృష్ణనుకు బోధపడటం లేదు. ఎక్కడో ఏదో లోపం వుందని తోస్తున్నదతనికి. కొన్ని విషయాల్లో లాభం కనిపిస్తున్నది. కాని లాభం కంటె లోపమే ఎక్కువగా వున్నట్టు తోస్తున్నది.

కొన్ని రోజులు గడిచిన తర్వాత సెక్రటరీ, కృష్ణన్ చెప్పిన వివరాలు ఒకచోట రాసుకున్నాడు. చెయ్యవలసింది చేస్తానని కూడా చెప్పాడు. ముందు ముందు పరిస్థితులు మారతాయని నమ్మకం కుదిరింది కృష్ణనుకు.

ఒకవారం తర్వాత ఆలప్పుళలో ఒక సంఘటన జరిగింది. పాకీవాళ్ళు, వాళ్ళ కోరికలు బయటపెట్టారు. సమ్మె చేస్తామని బెదిరించారు. ఇది కేవలం ఆలప్పుళ కు సంబంధించిన సమస్య కాదు. అన్ని పట్టణాల్లో దీని ప్రభావం కనిపించింది. సెక్రటరీ తప్పకుండా దీన్ని పట్టించుకోవలసిన పరిస్థితి యేర్పడ్డది. కృష్ణన్ సెక్రటరీని మరోసారి కలుసుకున్నాడు. తన సంగతి పట్టించుకోలేకపోయినానని అతను స్పష్టంగా చెప్పాడు. అందుకు చాలా కారణాలున్నాయి. అవన్నీ కృష్ణనుకు తెలుసు.

"ఇంక కొద్ది దినాలు ఓపికపట్టు. ఈ మునిసిపాలిటీ గొడవ అయిపోనీ. అప్పుడు ఆలస్యంకాకుండా చూస్తాను."

అంత వినయంగా చెప్తుంటే తను కాదని యెలా అనగలడు? ఒక్కవిషయం స్పష్టంగా తెలుస్తున్నది. సెక్రటరీకి ఒకచోట కూర్చునేందుకు తీరిక లేదు.

ఆ తర్వాత తిరువనంతపురం వెళితేనేగాని పనికాదని అన్నాడు సెక్రటరీ. అక్కడికి వెళితేనే పని అవుతుంది. కృష్ణన్ తన పరిస్థితి విడమరిచి చెప్పాడు:

"నా దగ్గర ఒక్క దమ్మిడీ కూడా లేదు. ఇన్నాళ్ళూ కూడబెట్టుకున్న డబ్బంతా నేను తిరువనంతపురంలో ఖర్చు పెట్టుకుని వచ్చాను. ఇక చిల్లి గవ్వ కూడా నాకు పుట్టదు."

సెక్రటరీ అర్థం చేసుకుంటూ వున్నాడు. "మరి నీ పని త్వరగా కావాలంటే ఎలా అవుతుంది?"

కృష్ణన్ ఏమీ సమాధానం చెప్పలేక పోయినాడు. సెక్రటరీయే మళ్ళీ అన్నాడు: "ఖర్చుపెట్టాల్సిన చోట పెట్టకుండా యెలా జరుగుతుంది?"

ఖర్చు పెట్టటంలో కృష్ణనుకు అభ్యంతరమేమీ లేదు. కాని అతని చేతిలో ఏమీలేదు. ఆ విషయం కూడా సెక్రటరీకి తెలుసు.

సెక్రటరీ కూడా ఏమీ చెయ్యలేని పరిస్థితిలో వున్నట్టు అన్నాడు: "అయితే నీ సంగతి అంతా వివరంగా వ్రాసి తొందరగా దీని మీద చర్య తీసుకోవలసిందని నేను 'స్టేట్ కమిటీ ఆఫీసు'కు రాస్తాను. అలా పని జరుగుతూ వుండనీ. మరో విషయం నీకు చెప్పాలి. ఇలాంటి అర్జీలు దేశంలో అన్ని వైపుల నుంచీ వస్తున్నాయి."

కృష్ణన్ ఏడ్చాడు: "అందుకని?"

"ఆలస్యమవుతుంది."

కృష్ణన్ సహించలేక పోయినాడు.

"అయితే మా అబ్బాయి తుపాకి దెబ్బకు ఎందుకు చనిపోయినట్టు?"

సెక్రటరీ కొంచెం కంగారు పడ్డాడు.

"మీరూ, మీలాంటివాళ్ళు, ఆ ధనవంతులతో, తుపాకులు పేల్చిన పోలీసు అధికారులతో కలిసి కార్లల్లో తిరిగేందుకా?"

సెక్రటరీకి ఎవరో చెంప దెబ్బ వేసినట్టుగా అనిపించింది.

"బాబూ! కొంచెం ఆలోచించి మాట్లాడు".

"లేకుంటే?"

"వీరమరణం పొందిన వాడి తండ్రివని చూస్తున్నాను. లేకుంటే చెప్పేవాణ్ణి."

"నీవేం చెప్తావులే?...

మోసం! మోసం!" అంటూ కృష్ణన్ వెళ్ళి పోయాడు.

— సలభై అయిదు —

నెలలు గడిచాయి. పార్టీనాయకుడికి ఛీఫ్ సెక్రటరీ ప్రవర్తన తృప్తికరంగా లేదు. ప్రత్యక్షంగా విరోధ భావాన్ని కూడా కనబరుస్తున్నాడు. చీఫ్ సెక్రటరీ, ప్రభుత్వం తలపెట్టిన అభ్యుదయ కార్యక్రమాల్లో అడ్డుపుల్లలు వేస్తున్నాడని అతని ఆక్షేపణ. ఆ కార్యక్రమాల ప్రచారంలో ఛీఫ్ సెక్రటరీ సాంకేతికమైన ఆటంకాలు తీసుకొస్తున్నాడు.

కాని అతని ఆక్షేపణ కేశవపిళ్ళైకు అర్థం కావటం లేదు. కొత్త ప్రభుత్వంతో కలిసి పని చేసేందుకు అతను చేతనయినంతవరకూ ప్రయత్నిస్తున్నాడు. అతనికి ఇదంత కష్టమయిన పనిగా తోచలేదు. అతనికి తన అభిప్రాయం ఎప్పుడూ బలహీనంగా కనిపించలేదు. అభ్యుదయ కార్యక్రమం, సార్వజనిక నిర్మాణ కార్యక్రమం అతని చేతిలోనే వుంది. ఆర్.టి.మేనేన్, ఆ శాఖకు సంబంధించిన మంత్రులూ వాళ్ళంతట వాళ్ళే స్వతంత్రంగా అన్ని విషయాలూ ఆలోచించుకొని నిర్ణయాలకు వస్తున్నారు. క్యాబినెట్ సెక్రటరీగా, నిర్ణయం తానే చెయ్యాలి. కాని అతను తన అభిప్రాయమేమీ తెలియపరచటం లేదు. తన అభిప్రాయమంటూ అతనికి లేకుండా పోయింది.

ఒక రోజు ఒక విశేషం జరిగింది. ముఖ్యమంత్రి చీఫ్ సెక్రటరీని తన గదిలోకి పిలిపించాడు. రోజూ జరిగే ఆఫీసు పనులను గురించి ఆయన అడిగాడు. అదంత ముఖ్యమైన విషయం కాదు. ముఖ్యమంత్రి పిలిపించింది ఈ మామూలు విషయాలు మాట్లాడుకునేందుకు కాదని కేశవపిళ్ళైకు తెలుసు. ముఖ్యమంత్రి మనస్సులో ఏదో వుంది. అదేమిటో మొదట తెలియలేదు. కొంచెం సేపు సంభాషణ సాగిన తర్వాత ఆ విషయం బయట పడింది.

"చీఫ్ సెక్రటరీకి ఇంతకాలం నుంచీ అనుభవమున్నా అందువల్ల ప్రభుత్వానికేమీ ప్రయోజనం లేకుండా పోతున్నదని అందరూ ఆక్షేపిస్తున్నారు" అన్నాడాయన.

ఆమాట అని ముఖ్యమంత్రి నవ్వుతూ కూర్చున్నాడు.

"నాకు అర్థం కావటంలేదు" అన్నాడు కేశవపిళ్ళై.

ముఖ్యమంత్రి ఒక మెట్టు పైకెక్కి అన్నాడు: "మీరు ఈ ప్రభుత్వంతో పూర్తిగా సహకరించటం లేదని ఆక్షేపణ" కేశవపిళ్ళైకు ఆశ్చర్యం వేసింది.

"ఎక్కడ ఏవిధంగా నేను సహకరించలేదో స్పష్టంగా చెప్తే బాగుంటుంది."

ముఖ్యమంత్రి స్పష్టంగా సమాధానం చెప్పలేదు. "మీరు ఏ విషయంలోనూ మీ అభిప్రాయం చెప్పరు - అని కూడా ఆక్షేపణ వుంది." అన్నారాయన.

కేశవపిళ్ళైకు తన విషయం చెప్పుకొనే అవకాశం వచ్చింది కాబట్టి అన్నాడు: "నాకు నా అభిప్రాయం చెప్పుకునే అవకాశం దొరికితే కదా?"

ముఖ్యమంత్రి ఫక్కున నవ్వారు. వాగ్వాదం కోసం ఆయన సిద్ధంగా లేరు.

"అంటే ఒక విషయం తేలింది. ప్రభుత్వానికి, ఛీఫ్ సెక్రటరికి సరిపడటం లేదన్నమాట."

దాన్ని ఒప్పుకొనేందుకు గాని, నిరాకరించేందుకుగాని కేశవపిళ్ళె సిద్ధంగా లేడు. అతను మాట్లాడకుండా వూరుకున్నాడు. కాని స్టేట్ కమిటీ సెక్రటరీ కేశవపిళ్ళెకు వ్యతిరేకంగా అస్తమానం ఏదో ఒక రిపోర్టు రాయటాన్ని గురించి అతను మాట్లాడదామనుకున్నాడు. ఒక విధంగా అది అనుచితమైన పని గదా?

ముఖ్యమంత్రి ఛీఫ్ సెక్రటరీకి ఒక సూచన చేసి దాన్ని గురించి ఆలోచించమన్నాడు-

"నేను బలవంతం చేస్తున్నాననుకోకండి. అది కేవలం వ్యక్తిగతమైన అభిప్రాయం. పార్టీకి గాని, మంత్రి వర్గానికి గానీ ఈ అభిప్రాయంతో ఏమీ ప్రమేయం లేదు. అది నా స్వంత అభిప్రాయం. మిస్టర్ కేశవపిళ్ళెతో చెప్తున్నాను అంతే."

అదేమిటో విందామని చాలా కుతూహలంతో కేశవపిళ్ళె కూర్చున్నాడు. నూతన రాజ్యాంగాన్ని గురించిన విషయమేదో అయివుంటుందను కున్నాడతను.

"చీఫ్ సెక్రటరీ కొన్ని నెలలపాటు సెలవు పెడితే ఎలా వుంటుంది?" అన్నాడు ముఖ్యమంత్రి.

చీఫ్ సెక్రటరీ సమాధానం కోసం ఎదురు చూడకుండానే ముఖ్యమంత్రి అన్నాడు: "బలవంతం చెయ్యటం లేదు. సూచన చేస్తున్నాను. ఎలాగయినా కొంచెం వ్యవధానమంటూ ఏర్పడింది గదా? అది మాత్రం కాదనలేము. కొన్నాళ్ళు ప్రభుత్వానికి దూరంగా వుంటే బాగుంటుందేమో. ఆలోచించండి. అంతే."

కేశవపిళ్ళె తను వుద్యోగంలో చేరినప్పటి నుంచీ యిప్పటి వరకూ జరిగిన వన్నీ జ్ఞాపకం చేసుకున్నాడు. పార్క్యవ్యూ బయట, వాకిట్లో కావలా కాసి పదిహేను రూపాయల నెలజీతం వచ్చే వుద్యోగం దొరికిన నాటి నుంచీ యీనాటి వరకూ తన జీవితాన్ని ఒక్కసారి వెనక్కి తిరిగి చూచుకున్నాడు. ఒక్కక్షణం ఆ బరువు మొయ్యు లేక కేశవపిళ్ళె కుంగిపోయాడు. అతనికి ఊపిరి సలపనంత పని అయింది. ఒళ్ళంతా నీరసించి పోయింది. అతని మొహం పాలిపోవటం ముఖ్యమంత్రి గమనించాడో లేదో? ప్రాణం పోవటం, ఉద్యోగం పోవటం సమానంగా వున్నాయి.

కొంచెం సేపు కేశవపిళ్ళె అలాగే కూర్చుండి పోయాడు. అతనేమీ ఆలోచించటం లేదు. రాతి విగ్రహం లాగా కూర్చున్నాడు.

"ఈ పని మానేసెయ్"

అని ఎవరో అంటున్నట్టు అతనికి అనిపించింది.

"జీవితం గడిచేందుకు కావలసినంత ఆస్తి వుందిగా."

ఇది ఒక ఓదార్పు. కాత్యాయనీ అమ్మ ఎప్పుడూ ఇలాగే చెపుతుంది. కేశవపిళ్ళైకు ప్రాణం లేచి వచ్చింది. కానీ అతని మనస్సు చింతాక్రాంతమయింది. రిటైరయ్యేందుకు ఎన్ని రోజులో లేవు. ఇంతవరకూ ధైర్యంగా పని చేశాడు. ఇక యీ పంజరంలో చిక్కుకున్న తర్వాత ముందడుగు వెయ్యటం కష్టం. ఇప్పటికే ఆ కుర్చీలో కూర్చోటం అవమానకరంగా వున్నది. ఇంతటితో ఇక్కడి నుంచి వెళ్ళిపోతే ఎలా వుంటుంది? వచ్చే పెన్షనుతో కాలక్షేపం చేస్తే ఎలా వుంటుంది?

"వీల్లేదు" అని తనలో ఎవరో అంటున్నట్లు అనిపించింది . నిజమే అలా నిర్ణయించటం బాగాలేదు. ఇలాంటి పరీక్షలు చాలా ఎదుర్కొన్నాడు. తను ఇప్పుడు ఓడిపోయి పారిపోవటమేనా? వీల్లేదు. ఆ 'వీల్లేదు' అనే మాటలో అసాధారణమైన శక్తి వుంది.

కేశవపిళ్ళై ముఖ్యమంత్రిని కింది నుంచి పైదాకా చూచాడు. ఒక్కక్షణంలో ఆయన జీవితమంతా పోలీసు రిపోర్టులాగా తనకళ్ళల్లో మెదిలింది. ఆయన అన్నంత మాత్రాన తను వుద్యోగం వదులుకొని పోవటమేనా? అది పిరికితనం కాదా?

అప్పటికి మౌనంగా చాలా క్షణాలు గడిచాయి. కేశవపిళ్ళై లేచాడు.

"సరే! మరి నేను చెప్పిన విషయం ఆలోచించు. బలవంతమేమీ లేదు." అన్నాడు ముఖ్యమంత్రి.

సమాధాన మేమీ చెప్పకుండా చేతులు జోడించి కేశవపిళ్ళై గదిలో నుంచి బయటికి వచ్చాడు. తన గదిలోకి వెళ్ళేప్పుడు వరాండాలో, ఏదో ఫైలు తీసుకుని ఆర్.టి.మేనేన్ వెళ్తున్నాడు. కేశవపిళ్ళై అతన్ని చూచాడు. కేవలం కళ్ళతో చూచాడు. మెదడు చూడలేదు.

కొన్ని అడుగులు వేసిన తర్వాత కేశవపిళ్ళై వెనక్కు తిరిగి చూచాడు. మేనేన్ కూడా వెనక్కు తిరిగి చూచాడు. ఆర్.టి. మేనేన్ ముఖ్యమంత్రితో కలిసి మాట్లాడేందుకు వెళుతూ వుండచ్చు.

కేశవపిళ్ళై దీర్ఘమైన నిట్టూర్పు విడవలేదు. కాని పళ్ళు కొరికి నీళ్ళు నమిలాడు. మెదడంతా వేడెక్కింది. ఇంతవరకు అతను తన జీవితంలో ఎరుగని వికారభావం ఎక్కడి నుంచి ఎలా ప్రవేశించిందో కాని అతన్ని చాలా నిరుత్సాహపరిచింది. ఆర్.టి.మేనేన్ వెళుతూవుంటే కేశవపిళ్ళై మరోసారి వెనక్కు తిరిగి చూచాడు. విజయ గర్వంతో మేనేన్ వెళ్తున్నాడు.

ఇంతవరకు లేని మనోవ్యధ కేశవపిళ్ళైను వేధిస్తూ వున్నది. కాలం గడిచేకొద్దీ ఆ మనోవ్యధ హెచ్చుతూనే వున్నది కానీ తగ్గటం లేదు. అతను ఊరికే కూర్చోలేక పోతున్నాడు. ఏదో ఒకపని చెయ్యాలనే తీవ్రలాలస పొంగి పొరలుతూవుంది. ఏం చెయ్యాలో తెలియటంలేదు.

ఆఫీసులో ఏమీ పని చెయ్యకుండా కేశవపిళ్ళై తొందరగా ఇంటికి వెళ్ళాడు. అతని మనస్సులోని ఆవేదనను కాత్యాయనీ అమ్మ సులభంగా గమనించింది. చాలాకాలం తర్వాత ఆమెలో చైతన్యం వచ్చింది. భర్త మనస్సులో ఏ మాత్రం ఆందోళనగా వున్నా ఆమెకు వెంటనే తెలిసిపోతుంది. దానికి కారణమేమిటో కూడా ఆమె చెప్పగలదు. ఆ రోజు కూడా అతని పరిస్థితిని అతన్ని చూడగానే కనిపెట్టింది. ఏమయిందని అతన్ని అడగకముందే చెప్పాడు:

"వాళ్ళు నన్ను వెళ్ళ గొట్టాలని చూస్తున్నారు. నేను ఎదురుగా వుంటే వాళ్ళ దొంగ నాటకాలన్నీ సాగవు. వాళ్ళ కూలీ కంట్రాక్టర్ల సంఘాలు, సముద్రంలో రాళ్ళు పాతటం, కూలీ సొసైటీ అవన్నీ సరిగ్గా సాగటంలేదు. ఇప్పుడు నన్ను సెలవు పెట్టమని అడుగుతున్నారు."

కాత్యాయనీ అమ్మకు అందులో ఆశ్చర్య పడవలసిందేమీ కనిపించలేదు. ఆమె అభిప్రాయంతో మరికొందరు కూడా ఏకీభవించారని ఆమెకు తృప్తిగా వుంది. ఆమె అభిప్రాయం కూడా అదే.

"నేను ప్రతి రోజూ చెప్తూనే వున్నానుగదా?" అన్నది కాత్యాయనీ అమ్మ. ఒక్కక్షణం ఆగి ఆమె మళ్ళీ అన్నది:

"వెళ్ళటమే మనకు మంచిది. ఈ తిరువనంతపురం నుంచి వెళ్ళిపోతేనే గాని మనకు మనశ్శాంతి వుండదు."

కాత్యాయనీ అమ్మ కాదనేందుకు వీలుకాని విషయాన్ని కలవరపడకుండా చెప్పింది. అదే ఆమెలో విశేషం. కేశవపిళ్ళై తలవూపాడు. హుంకరించాడు. ఇవ్వాళ ఏదో విశేషం వుందని అనిపించింది కాత్యాయనీ అమ్మకు. ఏం జరిగిందో తెలుసుకోవాలని ఆమె కుతూహలంగా కూర్చున్నది. అతను మొదలు పెట్టాడు:

"ఆ మలబారు కుక్క మొరగటం మొదలు పెట్టింది." ఈ వాక్యంతో అతను కథ ముగించాడు. కాత్యాయనీ అమ్మ తన అభిప్రాయం చెప్పింది: "అపశ్రుతులు రాకముందే పాట ఆపితే బాగుండేది."

ఏమీ తోచక పచార్లు చేస్తున్న కేశవపిళ్ళై అన్నాడు: "అవును - పాట ఆపేస్తాను. కాని పాట ఆపి నేను హాయిగా విశ్రాంతి తీసుకునేందుకు వెళ్ళను."

"అయితే ఏం చెయ్యాలని మీ వుద్దేశ్యం?"

కేశవపిళ్ళై దానికేమీ సమాధానం చెప్పలేదు. తలవూపి 'ఊఁ' అన్నాడు. కాత్యాయనీ అమ్మకు కుతూహలమేమీ హెచ్చలేదు. ఈ వుద్యోగం వదిలేసి తిరువనంతపురం నుంచి వెళ్ళిపోతే చాలు. కాని ఆయనకింకా ఏమో చెయ్యాలని వుంది. ఏమయినా సరే.

కాత్యాయనీ అమ్మ జీవితంలో అది కీలకమయిన క్షణం! ఇలాంటి క్షణం ఆమె జీవితంలో ఇంతవరకు రాలేదనే చెప్పవచ్చు. చాలా రోజుల తర్వాత ఎంతో ప్రయత్నంతో ఆమె ముఖంలో చిరునవ్వు మొలిచింది. చాలా రోజుల కిందట అతను కన్యాకుమారి నుంచి వచ్చిన తర్వాత ఆమె పెదవులు చిరునవ్వును మరిచి పోయాయి. ఈ మధ్య ఆమెలో చాలా మార్పు వచ్చింది. చాలా బలహీనమయి పోయింది. మొహంలో కాంతి తగ్గిపోయింది. ఒళ్ళు ముడతలు పడటానికి ఇంక ఎన్నాళ్ళో పట్టేట్టు లేదు. ముఖంలో ఎముకలు కనిపిస్తూ వున్నాయి. వెంట్రుకలు కొంచెం తెల్లబడ్డాయి. ముఖంలో కాంతి, శాంతి శాశ్వతంగా అడుగంటిపోయినట్టు తోస్తున్నది. ఒక విధంగా ఆమె నిర్జీవ మయిపోయింది! అలాంటి ఆమె ఈనాడు నవ్వింది. ఏదో చీకటి పోయి వెలుతురువచ్చినట్టు లేదా బరువు తీసేసినట్టు వుంది. బహుశా ఆమె యికముందు మంచి రోజులు వస్తాయనుకుంటూ వుంది. తిరువనంతపురం వదిలి పెడితే శుభ సమయం రావచ్చు.

"ఉద్యోగం వదులుకున్నా తిరువనంతపురంలోనే వుంటారా యేం?" అని అడిగిందామె.

ఆ ప్రశ్న కేశవపిళ్ళె మనస్సులో చొరబడలేదు. ఆయన మనస్సులో ఏదో పెద్ద ఆలోచన కార్యరూపం తాల్చబోతూవుంది.

"ఆ" కేకలువేస్తూ వీధుల్లో తిరిగేవాడికి నన్నిలా అనేంత ధైర్యం వచ్చింది! వీణ్ణి ఎలా కిందికి దించాలో చూస్తాను నేను గూడా!"

వెనక రెవిన్యూ డిపార్టుమెంటులో గుమాస్తాగా పనిచేసే గోవిందన్ నాయర్, హరిహర అయ్యర్ తన దగ్గరికి వచ్చి శుభాకాంక్షలు చెప్పినప్పుడు హరిహర అయ్యర్ చేసిన ఆశీర్వచనం కేశవపిళ్ళె మనస్సులో ఏ పొరలోనో యింకా మెదులుతూవుంది. మంత్రి కావాలని అతను ఆశీర్వదించాడు. కాని కేశవపిళ్ళెకు ఆ విషయం ఇప్పుడు బాగా గుర్తు లేదు. ముఖ్యమంత్రి తనను అవమాన పరిచాడు. దానికి ప్రతీకారం చేసి తీరాలి. ఈ మంత్రి వర్గాన్ని కిందికి దించాలి.

కాత్యాయనీ అమ్మకు ఆ విషయంతో పని లేదు. ఆమె వెనకటి ప్రశ్న మళ్ళీ అడిగింది: "ఏమన్నా చెయ్యండి. కానీ తిరువనంతపురంలోనే వుంటారా?"

కేశవపిళ్ళె ఆ ప్రశ్నను జాగ్రత్తగా విన్నాడు:

"ఏమిటీ? ఏమడిగావూ?"

కాత్యాయనీ అమ్మ మళ్ళీ అదే ప్రశ్న అడిగింది: "ఉద్యోగం వదిలిపెట్టేందుకు మీరు ఇష్టపడ్డట్టేవున్నారు. మంచిదే. కాని తిరవనంతపురంలోనే యిక ముందు కూడా వుందామని అనుకుంటున్నారా అని అడిగాను."

"ఎక్కడుంటే యేం? నా పంతం నేను తీర్చుకోవాలి" అన్నాడు కేశవపిళ్ళె.

కాత్యాయనీ అమ్మ తన అయిష్టం స్పష్టంగా చెప్పేసింది: "నాకు మాత్రం ఇష్టంలేదు. నేను వెళ్ళిపోతాను. ఓర్చుకో గలిగినంతవరకూ ఓర్చుకున్నాను. ఇక నేను ఓర్చుకోలేను."

కేశవపిళ్ళెకు కోపం వచ్చింది: "ఏనుగులను గురించి మాట్లాడుతూ వుంటే ఏలక్కాయల సంగతి చెప్పుకొస్తావ్? నీకు బొత్తిగా వివేకం లేదు."

కాత్యాయనీ అమ్మకు కూడా కోపం వచ్చింది. భర్త యింత పెద్దగా మాట్లాడేప్పుడు కాత్యాయనీ అమ్మ మామూలుగా ఏమీ మాట్లాడేది కాదు. కాని యిప్పుడు మాత్రం ఎదిరించేందుకు సిద్ధమయింది. అంతే కాదు. తను చెప్పవలసినంత గట్టిగా చెప్పలేక పోతున్నానేమో అనిపించిందామెకు.

"అవును వివేకం లేకుండానే మాట్లాడుతున్నాను. అమ్మాయిని తీసుకొని నేను ఊరికి వెళ్ళి పోతాను."

"చూడు. నీ మాటలకు లోబడి నేను పాముతో ఆడుకుంటాననుకోకు." కేశవపిళ్ళె కఠోరమైన హెచ్చరిక చేశాడు.

"నా సంగతి నేను చెప్తున్నాను."

కేశవపిళ్ళె చెయ్యెత్తి కేకలు పెడుతూ కాత్యాయనీ అమ్మ వైపు ఉరికాడు. కాత్యాయనీ అమ్మ ఏ మాత్రం చలించలేదు. ఉన్నచోట అలాగే నిలబడి పోయింది. కొడితే కొట్టనీ. దెబ్బలు తింటాను - అన్నట్టుగా నిలబడింది. "అంతపనీ చేస్తారని నాకు తెలుసు" అన్నది కాత్యాయనీ అమ్మ కన్నీరు నింపుకుంటూ.

దుఃఖం సహించలేక ఆమె అన్నది: "అయితే నేనొక సులువైన మార్గం చెప్తాను. ఆ పని కూడా చేసెయ్యండి. నన్ను చంపెయ్యండి. అడిగేవాళ్ళెవ్వరూ లేరు. ఎవరికి ఆచూకి కూడా తెలియదు. అప్పుడిక మీకు బాధే వుండదు. మంత్రి పదవి వచ్చిన తర్వాత ఆమెతో హాయిగా వుండచ్చు. మీకు తగిన భార్యకదా ఆమె."

కొంచెం అతిగా మారింది. కేశవపిళ్ళె పెద్దగా అరిచాడు. అవును, అరుపుగానే వినిపించింది.

"ఏమన్నావ్?"

కాత్యాయనీ అమ్మ కూడా వదల్లేదు.

"అవును. అదే నేనన్నది - ఈ బాధను తొలిగించుకుని దాన్ని భార్యగా చేసుకుని మంత్రిపదవితో మహారాజులా వుండమని అన్నాను. ఒక్క దెబ్బతో పోతుంది నా ప్రాణం." కాత్యాయనీ అమ్మకు ఒళ్ళు తెలియని స్థితి ఏర్పడింది. వెక్కివెక్కి యేడుస్తూ వుంది. ఇద్దరూ ఎలుగెత్తి మాట్లాడుతున్నారు. ఇంతవరకూ వాళ్ళు ఇంత బిగ్గరగా ఎప్పుడూ మాట్లాడుకోలేదు.

కేశవపిళ్ళై కూడా తన్ను తాను మరిచిపోయాడు. అతను కూడా ఏమీ మాట్లాడలేక పోతున్నాడు. పళ్ళు కొరుకుతూ ఏదో గొణుగుతున్నాడు. ఆవేశాన్ని అణుచుకొనేందుకు ప్రయత్నించటంవల్ల అతని నరాలూ, కండరాలూ బిగుసుకుపోయినాయి.

అది ఒకరకమైన విస్ఫోటం. ఆ కుటుంబంలో ఇలా యెప్పుడూ జరగలేదు. కేశవపిళ్ళైకు ఎప్పుడూ ఇంత ఆవేశం రాలేదు. కాత్యాయనీ అమ్మ కూడా తన భర్తను ఎన్నడూ ఇలా ఎదిరించలేదు. అన్నింటినీ ఓర్పుతో సహించే ఆ యిల్లాలు భర్తతో సవాలుచేస్తూ నిలబడ్డది. భర్త బెదిరింపును ఎదిరిస్తూ నిలబడ్డది.

ఏడుపు మధ్యలో ఆమె మాటలు వినబడుతున్నాయి: "నాకు తెలుసు. ఇలా అవుతుందని నేను అనుకుంటూనే వున్నాను."

"ఏమిటవుతుందని?" అన్నాడు కోపావేశంలో కేశవపిళ్ళై.

"నన్ను కొట్టటం. ఇక ముందంతా ఇంతే. నాకు తెలుసు."

కేశవపిళ్ళై ఒళ్ళు తెలియని స్థితిలో చెయ్యెత్తాడు. అలాంటి సంఘటన తొలిసారి జరుగుతూ వున్నది. కోపంతో అతనన్నాడు: "నన్ను నువ్వు హాయిగా వుండనియ్యవులే?"

"నేనెప్పుడూ అశాంతికే కారణమయినాను. నాకు తెలుసు" వెంటనే సమాధానం చెప్పింది కాత్యాయనీ అమ్మ.

కేశవపిళ్ళై సహించలేక పోయాడు. అతని సహన శక్తి పని చెయ్యలేదు.

"ఏమయిందని నీవిలా భద్రకాళిలా చిందులు తొక్కుతున్నావ్? ఇలాంటి రంగం తయారు చేసేందుకు నేనేం చేశాను? ఏమన్నాను? ఏమయిందసలు?"

దానికి కూడా కాత్యాయనీ వెంటనే సమాధానం చెప్పింది: "ఇవాళకాదు, చాలా రోజుల కిందట, కన్యాకుమారి వెళ్ళినప్పుడయింది. ఆలోచించండి, ఏమయిందో, ఎలా అయిందో."

సమాధానం చెప్పలేక కేశవపిళ్ళై పళ్ళు కొరుకుతూ అరిచాడు: "ఛీ, నన్ను హాయిగా బతకనియ్యవు."

"నేనేంచేశాను. ఈ మంగళ సూత్రం నా మెడలో కట్టిన నాటి నుంచి వెనక్కి తిరిగి చూడండి. నేనేమయినా అన్నానా?"

కొంచెం ఆగి కాత్యాయనీ అమ్మ మళ్ళీ అన్నది: "అన్నింటికి నేను ఓర్చుకొని వున్నాను. కొంచెం ఆలోచించండి."

కన్యాకుమారి నుంచి వచ్చిన తర్వాత యింట్లో వచ్చిన మార్పులను గురించి కాత్యాయనీ అమ్మ వేరువేరుగా వివరించి చెప్పింది. వెనకటి అనురాగం, ఆప్యాయం మళ్ళీ కనిపించలేదు. ఆ నవ్వులూ సరసాలూ మళ్ళీ యిక్కడ వినిపించలేదు. ఏదో మరిచి పోయినట్టు ఆలోచిస్తూ వుండేవారు.

నాజీవితంలోని ఆనందం నశించిపోయింది అనేమాట నిజం. ఇది కాదంటారా అని కాత్యాయనీ అమ్మ నిలదీసి అడిగింది.

కేశవపిళ్ళై మాట్లాడకుండా కూర్చున్నాడు. ఇలాంటి సందర్భాల్లోనే కాదు, ఇంతకంటె గంభీరమైన పరిస్థితుల్లోకూడా ప్రశాంతంగా వివేకంతో గట్టిగా కాత్యాయనీ అమ్మ చెప్పిన సమాధానాలను కేశవపిళ్ళై జ్ఞాపకం చేసుకున్నాడు. ఏ విషయాన్నీ కూడా అతను గంభీరంగా భావించలేదు. గంభీర విషయాల బరువు బాధ్యతలు అతని కెప్పుడూ అనిపించలేదు. ఎంత గంభీరమయిన విషయాలయినా యీనాడు ఎంత వేరుగా కనిపిస్తున్నాయి. భార్య మరీ బాధ కలిగించే మాటలంటున్నది.

చేయగలిగింది లేక కేశవపిళ్ళై దీనంగా అన్నాడు: "ఎక్కడ ఎలా తిరిగినా యింతవరకూ నాకు ఇంటికి వస్తే మనశ్శాంతిగా వుండేది. ఇక ముందు అది కూడా వుండదేమో?"

కాత్యాయనీ అమ్మ దాపరికం లేకుండా నిజం చెప్పింది: "నేను కూడా ఇక ఓర్చుకోలేను. నేను బాధగా వున్నట్టు నాకు కూడా అనిపిస్తున్నది. మరో వుద్దేశంతో మిమ్మల్ని నేను బాధించటం లేదు."

ఇద్దరూ అలిసిపోయ్యారు. అదుపు లేని కోపం ఎంతవరకూ వెళ్ళాలో అంతవరకూ వెళ్ళింది. అంతటితో బుద్ధి, నరాలు, ఆవేశం-అన్నీ చప్పబడి పోయాయి. అలా చప్పబడటం వల్ల ఏదో పొరపాటు జరిగిందనే భావం ఏర్పడింది. జీవితమంతా కూడబెట్టుకున్నది, ఒక్క క్షణంలో నాశనమయి పోయిందని అనిపించింది కాత్యాయనీ అమ్మకు. అనకూడని మాటలు కూడా అనేసింది. ఎన్నో పరీక్షలు గడిచాయి. ఆ రోజుల్లో కూడా యిలా జరగలేదు. యౌవనం పొంగులో వున్నప్పుడు కూడా యిలా కాలేదు. అన్నీ అనుభవించిన తర్వాత ఈ రోజు ఇలా జరిగింది. తనేదో తప్పు చేశాననే పరితాపంతో కాత్యాయనీ అమ్మ ఏడుస్తూ వుంది.

కేశవపిళ్ళై కూడా బాధపడుతున్నాడు. అతను కూడా నీరస పడ్డాడు. ఏ పనిలోనూ తనకు అడ్డురాని భార్యమీద చెయి చేసుకున్నాడు. ఇంత తెలివి తక్కువ పని ఎలా చేశానా అని ఆలోచిస్తున్నాడు. భార్యతో ఎలా ప్రవర్తించాలి అనే విషయం అతనికి తెలుసు. దానికి వేరే శిక్షణ అవసరం లేదు. ఇప్పుడు ఆ సామర్థ్యం కూడా నశించింది. అదే అతనికి భయం. అయ్యో! అలా చేసివుండకూడదు. న్యాయం, అన్యాయం అనే విచక్షణ కూడా లేకుండా పోయింది.

కాత్యాయనీ అమ్మ అంత బలహీనంగా, నీరసంగా వున్నా ఆమె మనస్సుకు కొంత ఊరట కలిగింది. తనంత తప్పు చేయలేదనిపించింది. ఈ నెపంతో తనలో తాను చర్చించుకొనేందుకు అవకాశం దొరికింది - అది కూడా అనుకోకుండా, ఉన్నట్టుండి. పుట్టింట్లోనూ, అత్తగారింట్లోనూ కూడా

తల్లిదండ్రులూ, అత్తమామలూ అన్నమానం తగులాడుకుంటూనే వుండేవాళ్ళు. కాత్యాయనీ అమ్మకు ఆ విషయం గుర్తుకు వచ్చింది. అత్తయ్య ఎప్పుడూ మామగారికి కోపం తెప్పించేది. అలా చూస్తే తను చేసింది పెద్ద తప్పేంకాదు. పప్పు పిళ్ళై కుట్టియమ్మ మీద చెయ్యెత్తటమే కాదు, కొట్టేవాడు కూడాను. అంతలోనే యిద్దరూ పక్కపక్కన కూర్చుని కబుర్లు చెప్పుకునే వాళ్ళు. అత్తయ్య మామగారికి తాంబూలం కట్టి యిచ్చేది. మామయ్య వెంటవెంటనే నీడలాగా తిరుగుతూండేది. అలాంటప్పుడు అత్తయ్యను మామయ్య ఒక దెబ్బ వేస్తే తప్పేముంది? ఆయనకా అధికారముంది. దొరకవలసింది దొరికి తీరాలి. దానికోసం అత్తయ్య ఏదో నసపెడుతూ మామయ్య దగ్గరికి వెళ్తూ వుండేది. ఆ లెక్కప్రకారం ఈ రోజు జరిగింది కాత్యాయనీ అమ్మకు అంత పెద్ద విషయంగా తోచలేదు. కాని నాన్నగారు గానీ, మామయ్యగారు గానీ తనలో కొంత భాగాన్ని మరో ఆడకూతురికి పంచిపెట్టలేదు.

వెనకటిలాగా ,కన్యాకుమారిలో జరిగిందంతా ఒక్కసారి తన భార్యతో విడమరిచి చెప్తే యెలా వుంటుందని కేశవపిళ్ళై అనుకున్నాడు. ఇదివరకు కూడా జరిగిందిచెప్పి తన బరువు దించేసుకుంటే ఆ రోజు అతనికెంతో హాయిగా వుంది. అసలు సంగతి పూర్తిగా తెలిసిన తర్వాత భార్యకు కూడా మనస్సు కుదుటపడింది. మళ్ళీ, కన్యాకుమారి నుంచి వచ్చినప్పటి నుంచీ ఆ యింట్లో ఆనందం అంతరించింది. సంతృప్తి కరువైపోయింది. ముందు ముందు మళ్ళీ మంచి రోజులు వస్తాయా? ఉద్యోగం పోయిన తర్వాత యింట్లో పరిస్థితి కూడా అంతంత మాత్రంగానే వుండి పోతుందా? జీవితంలో అన్నీ వున్నాయి; కాని ఆనందమే లేదు. ఆ పరిస్థితిని గురించి కేశవపిళ్ళై ఆలోచిస్తున్నాడు.

కాత్యాయనీ అమ్మ అన్నింటినీ ఓర్చుకుంటుంది. అన్నింటినీ మన్నిస్తుంది. మరిచిపోతుంది. ఆమె ఎలాంటిదో అతనికి ఇంతకుముందే తెలిసింది. కన్యాకుమారిలోనూ, పిరుమెడ్‌లోనూ జరిగిన వృత్తాంతాన్ని ఆమె క్షమిస్తుంది; మరిచి పోతుంది.

కాని కేశవపిళ్ళైకు ఆ విషయం చెప్పేందుకు ధైర్యం చాలలేదు. ఆమెతో ఎలా చెప్పటం? ఇక ముందు ఇలాంటి పొరపాటు చెయ్యనని ఒట్టుపెట్టుకున్నాను గదా? ఆ మాటమీద ఆమెకు నమ్మకం కూడా కుదిరింది. ఏదో అలాంటిదే జరిగివుంటుందని ఆమెకు అనుమానం వేసే వుండచ్చు. ఆమెలోని ఉత్సాహమంతా నశించింది. ఆడిన మాట తప్పిన తను, నేరాన్ని ఒప్పుకున్నంత మాత్రాన ఆమె హర్షించి వూరుకుంటుందా?

కేశవపిళ్ళైలో ఎవరో ప్రవేశించి "ఆమెకు చెప్ప"మని ఆజ్ఞాపిస్తున్నారు. ఆ అంతరాజ్ఞను అతను కాదన లేకుండా వున్నాడు. ఎలాంటి తప్పు చేసినా

ఆమెకు మనస్సులో మాట చెప్పేస్తే హాయిగా వుంటుంది. ఆమె అన్నింటినీ మన్నిస్తుంది. మరి చెప్తే తప్పేముంది?

కాని ఆమెకు ఎలా చెప్పటమనేదే కేశవపిళ్ళైకు బోధపడటం లేదు. "నేను కన్యాకుమారిలో ఫైళ్ళు చూచుకునే సమయంలో ఆమె లోపలికి వచ్చింది - అని మొదలు పెట్టనా? లేకుంటే" పొరపాటయింది. క్షమించాలి అంటూ ఆరంభించనా? లేదా అవన్నీ వదిలేసి 'నా మనస్సునెందుకిలా బాధపెడుతున్నావ్? నేను ఎక్కడ ఎలా తిరిగినా చివరకు నేను నీ వాణ్ణే అనుకో. ఇంతవరకూ జరిగిందంతా దీన్ని బలపరుస్తూనే వుంది గదా?"అంటూ ఆరంభించనా? ఇలా కేశవపిళ్ళై ఆలోచిస్తున్నాడు. ఇందులో చెప్పవలసిందేమిటి? దాచవలసిందేమిటి? ఏ విషయం ఎంత చెప్పాలి? దేనికి ఎంత ప్రాధాన్యం ఇవ్వాలి? ఆరంభాన్ని బట్టి కథను అల్లాలి. చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. "కన్యాకుమారిలో నేను కాగితాలు చూచుకునే సమయంలో -" అని ఆరంభించాలని నిర్ణయించుకున్నాడు. దాని ప్రకారం చెప్పవలసింది చెబుతూ దాచవలసింది దాస్తూ చెప్పేందుకు ఒక కథాక్రమాన్ని ఏర్పాటు చేసుకున్నాడు.

చేసిన తప్పుకు విచారిస్తూ కాత్యాయనీ అమ్మ కూర్చుని వుంది.

× × × × × ×

హాస్పిటలు 'పే-వార్డు'లో జ్యోతిర్మయి ప్రసవ వేదనతో కాన్పు గడియకోసం ఎదురుచూస్తూ వుంది. ఆమె అంత వుత్సాహంగా అంతకు ముందెప్పుడూ కనిపించలేదు. ఆమెకు తోడుగా అక్కడ ఒక్క సావిత్రి మాత్రం కూర్చుని వుంది. కాని రకరకాల ఆందోళనలతో ఆమె చాలా నీరసించి వుంది. జ్యోతిర్మయీ దేవి గంటకు నలభై సార్లు ఆశ్రమాన్నీ, ఆశ్రమవాసులనూ శపిస్తూ వుంది. జీవితంలో అతి భయంకరమైన విషయాన్ని గురించి ఇన్నాళ్ళు గడిచినా భయం పోలేదు.

"పాపిష్ఠి వాళ్ళు .కడుపు పోగొట్టుకోమని చెప్పారు. వాళ్ళ కడుపు కాలిపోవాలి."

ఇదే ఆమె ఆక్షేపణ, శాపనార్థం. సావిత్రి వింటూ కూర్చున్నది. ఈ విషయంలో ఆమె చెప్పదలుచుకుంది లేక కాదు. చెప్పలేకపోయింది అంతే. ఆమె మనస్సులో చీకటి కమ్ముకుంది. ఆ సన్న్యాసినుల అభిప్రాయమే తన అభిప్రాయం కూడా అయివుంటుంది. కాని బయటికి చెప్పలేదు. జ్యోతిర్మయీ దేవిలో ఎక్కడ లేని వుత్సాహం, సన్న్యాసినులమీద ఆమెకున్న శత్రుత్వం చూస్తే సావిత్రికది పెద్ద సమస్యగా తయారయింది.

ఒసారి సావిత్రి జ్యోతిర్మయీ దేవితో అననే అన్నది: "వాళ్ళ నలా యెందుకంటావమ్మా? ఆశ్రమానికి చెడ్డ పేరు వస్తుందని వాళ్ళలా అని వుంటారు."

సావిత్రి వుద్దేశ్యం తెలునుకోకుండానే జ్యోతిర్మయీదేవి సమాధానం చెప్పింది: "ఆశ్రమానికి చెడ్డ పేరా? మరి మంచి పేరెలా వస్తుంది? నాకన్నీ తెలుసు. అక్కడ బాగా బతికింది నేనెక్కదాన్నే."

జ్యోతిర్మయీ దేవి అక్కడి కథలు చెప్తూవుంటే సావిత్రి అన్నది: "లేదు మాతాజీ! ఇక ముందు వాళ్ళక్కడికి వెళ్తారా? ఆశ్రమం పేరు నిలిస్తేనే గదా వాళ్ళక్కడ కాలక్షేపం చెయ్యగలిగేది? అన్నీ వదిలిపెట్టి వాళ్ళక్కడికి వచ్చారు. అది కూడా నాశనమయిపోతే వాళ్ళేం చెయ్యగలరు?"

"వాళ్ళ ప్రేమికుల దగ్గరికి వాళ్ళు వెళ్ళి పోతారు."

వెంటనే జ్యోతిర్మయి మళ్ళీ అన్నది: "నాకన్నీ తెలుసు. సన్యాసం తీసుకున్న తర్వాత, తీసుకోకముందు అన్ని కథలూ నాకు తెలుసు."

ఆ ఆశ్రమంలోని సన్యాసినులకు జీవితంలో ఇక దారి లేదని తోచింది సావిత్రికి. అందరూ వాళ్ళను చూచి ఎగతాళి చేస్తున్నారు. ఆ దారిన వెళ్ళే వాళ్ళంతా రకరకాల కథలు చెప్పుకుంటూ వెళ్తున్నారు. ఇకముందు అక్కడికి ఎవరు వస్తారు? తనను గురించి ఆలోచన లేకుండా ఆమె అవివేకంగా చేసిన పని చూస్తే సావిత్రికి అసహ్యం, వైరాగ్యం కలగటమేకాక ఆశ్చర్యం వేసింది. అంతే కాదు, భయం వేస్తూవుంది.

"మాతాజీ! కన్న తర్వాత ఏం చేస్తారు?" అని అడిగిందామె.

విషాదపూరితమైన నవ్వుతో జ్యోతిర్మయీ దేవి సమాధానం చెప్పింది: "నేనా? నన్ను గురించి నువ్వు దిగులుపడకు."

"ఎందుకు? ఆయన మిమ్మల్ని మన్నిస్తారా?"

"మన్నించక్కర్లేదు."

"అయితే?"

జ్యోతిర్మయీదేవి మాట్లాడలేదు. సావిత్రి సమాధానం కోసం ఎదురుచూస్తూ వుంది. ఆశ్రమవాసులకేకాదు, జ్యోతిర్మయీ దేవికి కూడా భవిష్యత్తును గురించి ఎంత ఆలోచించినా ఏమీ దారి కనిపించటం లేదు. జ్యోతిర్మయీ దేవి మనస్సులో ఏముందో తెలుసుకోవాలని వుంది సావిత్రికి.

జ్యోతిర్మయీ దేవి చాలా ,గంభీరంగా దాటరాని ఆజ్ఞ యిస్తూ అన్నది: "నీకేమీ తెలియవలసిన పని లేదు. తెలిసింది చాలు. నా బిడ్డను తీసుకెళ్ళి ఆయన యెదుట ఉంచు. ఆ తర్వాత వెంటనే తిరిగి రా. బిడ్డ చనిపోతే తండ్రి యెవరో యిప్పటి లాగానే ఎప్పటికీ ఎవరికీ తెలియనక్కర్లేదు. ఎవరికీ చెప్పొద్దు."

"ఒక్క క్షణం ఆగి మాతాజీ మళ్ళీ అన్నది:

"ఆ తర్వాత నీవు, వెనకటిలాగానే అంతులేని దారిలో అనంతంగా సంచరించు."

"తర్వాత?"

ప్రశ్న పూర్తి కాకముందే జ్యోతిర్మయి దేవి అందుకుంది: "ఓహ్! నన్ను గురించి నువ్వు దిగులు పడకు, ఎవ్వరూ దిగులు పడనక్కర్లేదు."

"మరి?"

"నేను చెప్పినట్టు నువ్వు చెయ్యి. అంతే. నీవు చెయ్యవలసిందంతా అంతే. నీకు బరువు లేకుండా చూడాలి. ఆ బిడ్డను చేతుల్లో పెట్టుకొని ఏదో విధంగా పార్కువ్యూలోకి ప్రవేశించు. ఆయన చరణ సన్నిధిలో కానుకలాగా అర్పించి వెనక్కి వచ్చేయి. అంతే."

రెండు రోజుల తర్వాత జ్యోతిర్మయి దేవి సావిత్రి చేత రెండు శపథాలు చేయించింది. పుట్టబోయే బిడ్డ తండ్రి యెవరో ఎవ్వరికి చెప్పనని మొదటి ఒట్టు. కాని సావిత్రి అందులో కొంత మార్పు చేసేందుకు అనుమతి కోరింది. కేవలం ఆయనకు మాత్రం చెప్పాలి. రెండో ఒట్టు - ఆ బిడ్డను సావిత్రి మరి యెప్పుడూ చూడగూడదు. సావిత్రికి తన అదృష్టాన్ని గురించి ఒకే ఒక ఆక్షేపణ వుంది. బిచ్చమెత్తుకుంటున్న తను ఆ ఆశ్రమం గుమ్మంలో ఎందుకు అడుగు పెట్టాలి? ఆమె చాలా అనుభవించింది. ఇలాంటి అనుభవం కూడా ఆమె నొసట రాయాలా? ఇలాంటి బాధ్యతలు తన నెత్తి మీద పడటంలో అర్థమేమిటి?

## సలభై యారు

తన వుద్యోగానికి రాజీనామా యిచ్చినప్పటికీ, తన రాజీనామాను ఆమోదిస్తారనే నమ్మకం కేశవపిళ్ళెకు లేదు. ఇన్నాళ్ళ నుంచీ అన్ని పరిస్థితులనూ ఆకళింపు చేసుకున్న వుద్యోగస్థుణ్ణి ఏ ప్రభుత్వం కూడా అంత సులభంగా వదులు కోలేదు. ఈ మధ్య కొంత మంది కేశవపిళ్ళెకు అనుకూలంగా పత్రికల్లో వ్యాసాలు కూడా వ్రాశారు. మొత్తం మీద ఇంత తొందరగా వుద్యోగం మానుకోవలసిన అవసరం ఉండదనే కేశవపిళ్ళె అనుకుంటున్నాడు. బహుశా ముఖ్యమంత్రి తనను పిలిపించి రాజీనామా వాపసు తీసుకోమని చెప్తాడు. ఏదిఏమయినా తను వుద్యోగం వదులుకొని పోవలసిన పరిస్థితి ఏర్పడదనే కేశవపిళ్ళె అంచనా. కొద్ది రోజుల్లోనే అతనిలో చాలా మార్పులు వచ్చాయి. ఉన్నట్టుండి ముసలితనం వచ్చేసింది. అలసట, ఆయాసం ఎక్కువగా వుంటున్నది. అలా అనుకుంటూండగానే ఒకరోజు ప్రభుత్వం కేశవపిళ్ళె రాజీనామాను అంగీకరించి, పెన్షను తీసుకుని రిటైరయేందుకు అతన్ని అనుమతించింది. తేదీ కూడా నిశ్చయమయింది - మర్నాడే.

ఇలా అవుతుందేమె అనికూడా అనుకుంటూనే వున్నాడు. చాలా రోజులనుంచీ అతను లోలోపల యిలాంటి పరిస్థితికోసరం తయారవుతూనే వున్నాడు. అయినా తీవ్రమైన ఘాతం తగిలింది. ఏదో ఒక రోజు వెళ్ళిపోవాల్సిందే గదా అనుకొని సమాధానపరుచుకోవచ్చు. ఆరోజు

తప్పించుకునేందుకు వీల్లేదు గదా? ప్రభుత్వ పదవినుంచి ఏదో ఒకరోజు విరమించుకొని తీరాలి. అదంతా నిజమే. సమాధానపరుచుకోవాలంటే అతని జీవితంలో ఇంకా చాలా విషయాలున్నాయి. ఇంత వరకు వస్తానని కానీ, రావాలని కానీ అనుకొని అతను ఉద్యోగంలో చేరలేదు. అలా చూస్తే అతను జీవితంలో చాలా సాధించాడు. చాలా సార్థకమైన జీవితం అతనిది.

ఈ జీవితం ఇంతటితో ముగిసిపోతున్నదని కేశవపిళ్ళైకు అనిపించింది. ఆ సమయంలో అతనికి వెనకటి విషయాలు చాలా గుర్తుకు వచ్చాయి. మొట్టమొదట శివమయం లక్ష్మి హొటలు యజమానురాలు లక్ష్మిఅమ్మ గుర్తుకువచ్చింది. దగ్గుతో బాధపడుతూ బలహీనంగా వుండేది. ఉద్యోగం వెతుక్కుంటూ తిరువనంతపురం వీధుల్లో తిరిగే రోజుల్లో డబ్బులేకుండా తిండి పెట్టనని అంటూ కూడా వేళకు గుప్పెడన్నం పెట్టేది.| అప్పు తీర్చగానే ఆనందించి ఆశీర్వదించేది. రాత్రి అందరికీ అన్నం పెట్టిన తర్వాత ఒంటరిగా కూర్చుని దగ్గుతూ వుండేది. దగ్గుతో ఆమె వంగిపోతూవుండేది. "ఆనందంగా వర్ధిల్లు నాయనా!" అని ఆశీర్వదిస్తూ వుండేద కాని 'నన్ను మరిచిపోకు' అని యెప్పుడూ అనేది కాదు లక్ష్మిఅమ్మ. ఆ తర్వాత ఆమెను అతనెప్పుడూ కలుసు కోలేదు. ఆ హొటలు ఇంకా అక్కడ వున్నట్టే వుంది. తను అక్కడికి వెళ్ళనూ లేదు. ఆమెను పలకరించనూ లేదు. అలా చెయ్యలేదని అతని మనస్సుకు స్ఫురించలేదుకూడా. ఈ తప్పును ఏ న్యాయాలయమైనా మన్నించగలదా? కేశవపిళ్ళైకు అబ్బిన అదృష్టాన్ని గురించి ఆమెకు తెలిసే వుంటుంది. ఏదన్నా పని కావాలని ఆమె ఎన్నడయినా తన దగ్గరికి వచ్చిందా? ఆమెకు ఇక్కడికి రావాల్సిన అవసరమే వచ్చి వుండదు. కాని తను చేసిన తప్పు మాత్రం కేశవపిళ్ళైను తొలిసారి బాధించింది.

వెనకటి రోజులను గుర్తు చేసుకుంటూ కేశవపిళ్ళై అలా అలా ఎక్కడికో వెళ్ళిపోయాడు. చిన్న చిన్న విషయాలు కూడా అతనికి గుర్తు వచ్చాయి. మ్యూజియం పడమటి వైపున కలకల నినాదంతో ప్రవహించే పంటకాలువ గట్టు మీద మట్టి యింట్లో ఒక అమ్మాయి వుండేది. నల్లరూపున బొద్దుగా అందంగా వుండేది. ఇంట్లో కూర్చుని ఎప్పుడూ పుస్తకం చదువుకుంటూ వుండేది. ఆ పిల్ల నల్లమొహం మీద చల్లని చిరునవ్వు ఎవరినైనా క్షణంలో ఆకర్షించేది. కేశవపిళ్ళైకు, ఆ అమ్మాయికి తనకూ ఏదో సంబంధమున్నట్టు అనిపించింది. ప్రతిరోజూ ఆ దారిన వెళ్ళేప్పుడు ఆ అమ్మాయి నవ్వేది. అతను కూడా నవ్వేవాడు. ఆమెను పిలిచి పలకరించి ఒక్కమాట అని వుంటే అది తన జీవితంలో తీరని చిక్కులను సృష్టించి వుండేది. కేశవపిళ్ళై పలకరిస్తాడని ఆ పిల్ల అనుకుంటూ వుండేది. ఆమె ఏదో చెప్పాలని అనుకుంటున్నదని కేశవపిళ్ళైకు అనిపించేది. ఆ పిల్ల యిప్పుడు కూడా వుండి వుంటుందా? ఏ పరిస్థితిలో వుందో? ముసలితనం వచ్చి నాయనమ్మ

అయి వుంటుంది. కేశవపిళ్ళై మనః పటలంలో మాత్రం ఆ పిల్ల యింకా పడుచు పిల్లే. అందులో ఏమీ మార్పు రాలేదు.

ప్రత్యేకంగా ఆ అమ్మాయి ఎందుకు గుర్తు వచ్చిందో కేశవపిళ్ళైకు ఆశ్చర్యంగా వుంది. జీవితం చివరిదశలో ఆ అమ్మాయికి సంబంధించిన జ్ఞాపకాలు చెరగని ముద్రవేసుకొని వున్నాయి. కాత్యాయనీ అమ్మా, తంకమ్మలతోపాటు ఆమె కూడా తన ఆత్మలో శాశ్వతమైన చిత్రాన్ని చిత్రించి పోయిందా?

పార్కువ్యూ బయట గుమ్మం దగ్గర ఛీఫ్ సెక్రటరీ దృష్టిని ఆకర్షించుకునేందుకు ఎదురు చూసిన రోజులను కేశవపిళ్ళై గుర్తు తెచ్చుకున్నాడు. పోలీసులు అతన్ని కోపగించుకుని బయటికి గెంటేశారు. అతని మీద జాలిపడ్డవాళ్ళు కూడా లేకపోలేదు. అదంతా అతని అదృష్టం. అలా ఎదురుచూచేవాడు ఈ పదవికి చేరుకోవటం అలా వుంచి అసలు ఏదయినా వుద్యోగం దొరుకుతుందని కూడా అతననుకోలేదు. జీవితంలో తనకు లభించిన కొద్ది సదుపాయాలకు తానెంతో తృప్తి పడ్డాడు. అందులో కేశవపిళ్ళైకు సందేహం లేదు. మేనేన్ చాలా మంచివాడు. దయగలవాడు. ఇతరుల కష్టాలు తెలిసినవాడు. ఆయన వుద్యోగం నుంచి వెళ్ళిపోతే ఎవరికీ ఏమీ అనిపించలేదు. ఆఖరికి తను కూడా అతను వెళ్ళిపోయాడే అని బాధపడలేదు.

కేశవపిళ్ళై ఆలోచనలు మరో వైపు ప్రసరించాయి. చాలా కాలం తను ఛీఫ్ సెక్రటరీగా పని చేశాడు. ఎవరికయినా ఏదన్నా వుద్యోగం ఇచ్చికానీ, మరో విధంగా కానీ ఉపయోగపడ్డాడా? కేశవపిళ్ళై ఛీఫ్ సెక్రటరీ అయిన తర్వాత వుద్యోగం కోసరం ఎంత మందో ఆ గుమ్మంలో కాచుకొని వుండి వుంటారు. అవును, తప్పకుండా అలాంటి వాళ్ళు వుంటారు. కాని అతని దృష్టిలోకి, వాళ్ళు రాలేదు.

రాత్రి సరిగ్గా నిద్ర పట్టకపోవటం వల్ల మర్నాడు ఉదయం కేశవపిళ్ళైకు బద్ధకంగా వుంది. ఆలస్యంగా లేచాడు. ఫోను మోగుతూ వుంది. రిసీవరు ఎత్తాడు. సచివాలయం నుంచి ఫోను వచ్చింది. అక్కడ ఇద్దరు చనిపోయారు. రెండు శవాలూ పక్కపక్కనే వున్నాయి. ఆత్మహత్య చేసుకుని వుంటారని అనుమానం.

కేశవపిళ్ళై స్తంభించి పోయాడు. వెంటనే అతని కళ్ళయెదుట ఉరివేసుకుని చనిపోయిన గోపాలన్ నాయర్ కనిపించాడు. సర్వనాశనమయింది. వీళ్ళకు ఆత్మహత్య చేసుకునేందుకు ఈ రోజే దొరికిందా? గోపాలన్ నాయరు లాగా వీళ్ళతో కూడా తనకేమన్నా సంబంధముందేమోనని కేశవపిళ్ళైకు భయం వేసింది. ఏమీ గుర్తు రావటం లేదు. ఇన్నాళ్ళనుంచి వుద్యోగం చేస్తూ వున్నందువల్ల ఎప్పుడయినా ఏదయినా

సంబంధం వున్నా వుండచ్చు. ఎన్నో అర్జీలు అతని చేతి మీదగా వెళ్ళాయి. ఎన్నో ఉత్తర్వులు అతను జారీ చేశాడు. అందులో కొన్ని యథార్థం గమనించకుండా నియమ విరుద్ధంగా జారీచేసి వుండచ్చు. అలాంటి ఉత్తర్వులకు గురియైన బాధితులయివుంటారేమో? అయివుండచ్చు కూడా అని అనుకున్నాడు కేశవపిళ్ళె.

ఆ రోజు కేశవపిళ్ళె ఆఖరిసారి ఛీఫ్ సెక్రటరీగా సచివాలయానికి వెళుతున్నాడు. తిరిగి వచ్చేసరికి ఆ పదవి వుండదు. ఆ రోజు తొందరగానే అతను ఇంటి నుంచి బయలు దేరాడు.

సచివాలయానికి ఎదురుగా పూలతోట మధ్య జెండా పాతిన స్తంభం ఒకటి వుంది. ఆ చనిపోయిన యిద్దరూ ఆ జెండా కింద పడుకొని వున్నారు. అక్కడ చాలా గుంపు చేరింది. పోలీసులు విచారణ చేస్తున్నారు.

కేశవపిళ్ళె వెళ్ళి ఆ చనిపోయిన వ్యక్తులను గురించి అడిగాడు. పోలీసులు వివరాలు తెలియజేశారు. అందులో ఒకరు మీనాక్షి శంకరపిళ్ళె. అతను కాంగ్రెసు వాడు. అతనికి రావలసిన అయిదెకరాల భూమి రాలేదు. కొంతమంది అతని భూమిని అపహరించారు. అతను సచివాలయం ఎదుట నిరహార దీక్షకూడా చేశాడు. రెండో వ్యక్తి ఆలప్పుళా నివాసి కృష్ణన్. అతని కుమారుడు పున్నప్రాలో తుపాకి దెబ్బకు గురిఅయి మరణించాడు. అతనికి చాలా డబ్బు రావాల్సివుంది. అతని కూతురికి పెండ్లి కాకుండానే కడుపు వచ్చింది - అని పోలీసు వాళ్ళు చెప్పారు.

ఇద్దరూ వుత్తరాలు రాసి పెట్టారు.

కేశవపిళ్ళె ఆ వైపు వెళ్ళాడు. అందరూ తప్పుకున్నారు. గాలిలో ఎగురుతున్న జాతీయ పతాకం నీడ ఆ రెండు శవాలమీదా పడుతున్నది.

కేశవపిళ్ళెకు వెంటనే జ్ఞాపకం వచ్చింది - ఉట్టికాడు కొండలో తోట ఆశ్చర్యం వేసింది.

ఎవరో తలమీద తన్నినట్టు అనిపించింది కేశవపిళ్ళెకు.

× × × × ×

కేశవపిళ్ళె తనను గురించి ఆత్మ పరీక్షచేసుకుంటూ ఆలోచించుకున్నాడు ఒకరికి ఉపకారం చెయ్యటం మాట అటుంచి తనకు ఉపకారం చేసినవాళ్ళను కనీసం గుర్తు పెట్టుకో గలిగాడా? మేనేన్ పరిస్థితి ఎలా వుందని తనేమయినా విచారించాడా? కృష్ణన్ నాయరును మళ్ళీ కలుసుకోనేలేదు. ఇదంతా ఎంతవరకు న్యాయం? కాని కేశవపిళ్ళె సమాధాన పరుచకునేందుకు ఒకటే ఆధారం వుంది. మేనేన్‌కు, కృష్ణన్ నాయరుకు ఏదయినా అవసరముంటే తను తప్పకుండా చేసేవాడు. వాళ్ళకేమీ అవసరమే లేకుండా పోయింది. అందుకనే తనేమీ చెయ్యలేదు. అంతే. కాని వాళ్ళను మళ్ళీ కలుసుకోక పోవటం బాగాలేదని అతని అంతరాత్మ చెబుతూ వుంది. అతనికి చాలా

బాధగా ఉంది. ఇటు వీళ్ళిద్దరూ అన్యాయంగా పిడికెడు మట్టిలో కలిసి పోయారు.

భర్తకు ఉద్యోగం వదిలిపెట్టి వెళ్ళ వచ్చుననే ఉత్తర్వు వచ్చాక కాత్యాయనీ అమ్మకు ఇక ఒకే ఒక ప్రశ్న మిగిలింది. ఆ ప్రశ్న అడక్కుండా ఆమె ఉండలేకపోయింది:

"ఇక ముందు కూడా తిరువనంతపురంలో వుందామనేనా మీ వుద్దేశ్యం?"

"ఈ వూరంటే నీకంత విరోధమెందుకు?" అన్నాడు కేశవపిళ్ళె ఆప్రశ్నకు సమాధానంగా.

"మన అదృష్టమంతా యిక్కడనే కలిసి వచ్చింది కదా?" అంటూ అతను ఇంకా ఏమో చెప్ప సాగాడు:

"రిటైరయిన తర్వాత జీవచ్ఛవంలా పడివుండటం నాకు ఇష్టం లేదు. ముందు ముందు నేను చెయ్యవలసిన పనులు చాలా వున్నాయి"

కేశవపిళ్ళె గట్టి సంకల్పంతో ఈ మాట అన్నాడు. కాత్యాయనీ అమ్మకు అర్థమయింది. ఆమె ఏమి ఆలోచిస్తున్నదీ కూడా అతనికి తెలుసు.

కాత్యాయనీ అమ్మ ఒళ్ళు తెలియని స్థితిలో అనేసింది: "అది మళ్ళీ మిమ్మల్ని బుట్టలో వేసుకుందా?"

కేశవపిళ్ళెకు ఆశ్చర్యం వేసింది. ఈ ప్రశ్న సూటిగా వెళ్ళి అతని మనస్సుకో, గుండెకో తగిలింది. కాత్యాయనీ అమ్మకు అసలు సంగతి తెలిసిపోయిందేమో? అలా సూటిగా అడుగుతూ వుందే? బాధపడుతున్నట్టు గాంభీర్యాన్ని అభినయించేందుకు అతను చాలా ప్రయత్నించాడు. కాని అతనికి చేత కాలేదు.

కాత్యాయనీ అమ్మ భర్తను బతిమాలుతూ అన్నది: "వెనక నాకు ఉన్నదున్నట్టు అంతా చెప్పారు. అంతా విని నేను సహించాను. ఇక ముందు అలా జరగదని నమ్మాను. అదంతా చెప్పుకున్న తర్వాత మనకెంతో హాయిగా వుంది. ఇప్పుడు మళ్ళీ ఆ తృప్తి, ఆనందం అన్నీ పోయాయి. ఆలోచించండి కొంచెం."

ఆ మాట కాదనేందుకు వీల్లేదు. ఆ యింటి ఆనందం అడుగంటిన మాట నిజం. రిటైరయిన తర్వాత యింట్లో విషాదం మిగిలింది. కాని ఒకటి మాత్రం నిజం. అతని హృదయంలో తంకమ్మ లేదు. తంకమ్మకు అందులో స్థానం లేదు. అందులో బలహీనమైన దేవత వుంది - కాత్యాయనీ అమ్మ. ఆ దేవి యింత నీరసించి పోయేందుకు కారణమేమిటో తెలియదు.

కాత్యాయనీ అమ్మ భర్త వైపు సూటిగా చూస్తూ అడిగింది: "అంతా నాకు చెప్పెయ్యండి. ఏమీ దాచకండి. అన్నింటికీ నేను ఒప్పుకోగలను. అన్నీ మరిచి పోవటం కూడా నాకు తెలుసు. దాన్ని మళ్ళీ కలుసుకున్నారా? నిజం చెప్పండి".

వెంటనే అంతా విడమరిచి చెప్పాలనే ఆలోచన అతనికి వచ్చింది. క్షణంలో ఆ ఆలోచన మారిపోయింది. తనను అపార్థం చేసుకున్నందుకు కాత్యాయనీ అమ్మను చీవాట్లు పెడదామనిపించింది. కాని తప్పు చేసిన కేశవపిళ్ళెకు ధైర్యం చాలలేదు. మళ్ళీ యెవరో లోపల ప్రవేశించి ఉన్నదున్నట్లు నిష్కల్మషంగా చెప్పేయమని సలహా చెప్తున్నట్టుంది. ఆ సలహాలో గొప్ప న్యాయముంది. శక్తివుంది. వివేకవముంది. మళ్ళీ యిల్లు ఆనంద నిలయమవుతుంది. కాత్యాయనీ అమ్మ క్షమిస్తుంది. ఆమె ఓర్చుకుని క్షమించటం నేర్చుకున్నది.

ఉన్నదున్నట్టు విడమరిచి చెప్పేస్తే? అవును. అయిందేదో అయిపోయింది. కాత్యాయనీ అమ్మ మీద ప్రేమ వుండబట్టే తంకమ్మను తోసి వేయగలిగాడు. చేసిన తప్పు ఒప్పుకుని మనస్సు కుదుట పరుచుకునేందుకు మరో చోటు ఏముంది? ఇప్పుడు కూడా ఒట్టు పెట్టుకునేందుకు కేశవపిళ్ళె సిద్ధంగా వున్నాడు. ఈ ఒట్టుకు వ్యతిరేకంగా కేశవపిళ్ళె యిక ముందు ప్రవర్తించడు. కానీ తన తప్పు ఒప్పుకోవటమే అతనికి చాలా కష్టంగా వుంది. జీవితంలో మొదటి నుంచీ ఆమెకు తను ద్రోహం చేస్తూనే వున్నాడు.

"నీవు ఏడవకుండా ఉంటే నేను చెప్తాను. నీవు అనుకున్నదేమీ కాదు. అయినా చెప్తాను." అన్నాడతను.

కాత్యాయనీ అమ్మ అతని దగ్గరగా ఆనుకుని నిలబడి అతని భుజం మీద చెయివేసింది.

"లేదు. నేను ఏడవను. నేను దిగులుపడను కూడా. మిమ్మల్ని ఏమీ అనను." అంటూనే ఆమె కంట తడిపెట్టుకుంది.

"అరే, కళ్ళనీళ్ళు వచ్చాయే. ఏడుపు రాబోతూ వుంది."

కాత్యాయనీ అమ్మ పైట కొంగుతో కళ్ళుతుడుచుకొని అన్నది: "లేదు, లేదు, నేను ఏడవటం లేదు." తలయెత్తి భర్త వైపు చూస్తూ అన్నది: "చెప్పండి."

ఆ రెండు ముఖాలూ ముద్దు కోసం దగ్గరకు చేరాయి. బహుశా ఒక చుంబనం వాటికి అవసరం.

కాత్యాయనీ అమ్మ వినేందుకు సిద్ధంగా వుంది. ఆయన చెప్పేందుకు కూడా తయారవుతున్నాడు. కాని యేం చెప్పాలి, ఎలా ఆరంభించాలి అనేది అతనికి తెలియటం లేదు. అందువల్ల కొంచెం సేపు ఇద్దరూ అలాగే నిలబడి పోయారు.

ఇంతలో ఎక్కడి నుంచో ఒక ఆడకూతురు అక్కడికి వచ్చింది. ఆమె ఒక పసిపిల్లవాణ్ణి తెల్లగుడ్డలో కప్పి రొమ్ముకు ఆనించుకొని వచ్చింది. ఆమె పేరు సావిత్రి. వెంటనే కేశవపిళ్ళె, కాత్యాయనీ అమ్మ విడి పోయారు.

సావిత్రి తన చిన్న బరువును కేశవపిళ్ళె కాళ్ళ ముందు పెట్టింది.

అతను మగపిల్లవాడు. పుట్టి ఒక్కరోజు కూడా కాలేదు. పిల్లవాడు ఏడుస్తూ వున్నాడు.

కేశవపిళ్ళై మాట్లాడకుండా నిలబడ్డాడు. కానీ అతని కంతా అర్థమైనట్టేవుంది. కాత్యాయనీ అమ్మ నివ్వెరపోయి నిలుచుంది.

"ఇతను జ్యోతిర్మయీ దేవి పిల్లవాడు. ఇక్కడికి తీసుకు వెళ్ళమని చెప్పింది. పిల్లవాడు పుట్టాడు. తల్లి అతన్ని ఒక్కసారి చూచి ప్రాణాలు విడిచింది." అన్నది సావిత్రి.

విజయమ్మ కూడా అక్కడికి వచ్చింది. బహుశా పిల్లవాడి యేడుపు విని ఆమె అక్కడికి వచ్చి వుంటుంది. కేశవపిళ్ళై దీనంగా కాత్యాయనీ అమ్మ ముఖంవైపు చూశాడు.

ఆ చూపులతోనే నిశ్శబ్దంగా భార్యతో వినయంగా చెప్పుకుంటున్నాడు. పిల్లవాణ్ణి చేరదియ్యవలసిందని. కాని కాత్యాయనీ అమ్మ రాతి బొమ్మలా నిలబడి పోయింది.

"పిల్లవాణ్ణి తీసుకో" అని అధికార పూర్వకంగా అతను చెప్పగలడా?

చాలాసేపు గడిచింది. పిల్లవాడు ఏడుస్తున్నాడు. విజయమ్మ తనకంతా అర్థమైనట్టే, ఎవరినీ ఏమీ అడక్కుండా ఆ పిల్లవాణ్ణి తీసుకుని రొమ్ముకు అనించుకుంది.

కేశవపిళ్ళై సావిత్రిని ఏమేమో అడుగుదామనుకున్నాడు. కాని ఆమె వెళ్ళిపోయింది.

ఉద్యోగంలో ప్రవేశించిన రోజులాగానే వుద్యోగం నుంచి విరమించుకునే రోజు కూడా జీవితంలో చాలా ప్రధానమయిన రోజు. కేశవపిళ్ళై సచివాలయం వదిలిపెట్టి వెళ్ళటం ముఖ్యమైన ఘటన. ఆ కుర్చీలో అతను చాలా కాలం కూర్చున్నాడు. కాని హృదయ పూర్వకంగా ఎవరి దగ్గరా సెలవు తీసుకుని వెళ్ళాలని అతనికి లేదు. ఎవరితోనూ అతనికి అంత సంబంధం లేదు. అతనితో కూడా ఎవరికీ అంత సంబంధం లేదు, కాని ముఖ్యమంత్రితో మాత్రం అతను నవ్వుతూ అన్నాడు: "బహుశా నేను మళ్ళీ యిక్కడికి వస్తాను."

ఈ విధంగా కేశవపిళ్ళై ఉద్యోగ జీవితం పూర్తి అయింది.

ఏం వచ్చింది? ఏం పోయింది? తనకు చాలా అన్యాయం జరిగిందనే భావంతో అతను సచివాలయం వదిలి వెళ్ళాడు.

రాజభవనం నుంచి వెళ్ళిపోతున్నాడు. తంకమ్మ చనిపోయినా కాత్యాయనీ అమ్మకు తిరువనంతపురంలో వుండటం ఇష్టంలేదు. ఆ కుటుంబం పల్లెటూరికి వెళ్ళాలనే నిర్ణయించుకున్నారు.

విజయమ్మ ఆ చంటి బిడ్డను ఎత్తుకొని పార్కువ్యూ బయటి గుమ్మం దగ్గరికి వెళ్ళింది. ఆమె వెనక కాత్యాయనీ అమ్మ వెళ్ళింది ఆమె ముఖంలో

నిశ్చింతా, నిర్మలమైన కాంతి కనిపిస్తున్నది. కేశవపిళ్ళై కూడా బయటికి వెళ్ళాడు. వెనక్కి తిరిగి ఆ పెద్ద భవనాన్ని చూచాడు. అతని కళ్ళు చెమర్చినట్టు కనిపిస్తున్నాయి.

Laser Typeset by Type Shoppe 1-698/A/1, Vidyanagar, Hyderabad – 500 044
& printed at The Central Electric Press, Naraina Phase I, New Delhi – 110 028.

ఆ కుటుంబంతో పాటు మోటారు కారు తిరువనంతపురం వదలి పెట్టింది.

పూర్తిగా పల్లెటూరి యువకుడయిన కేశవపిళ్ళె బి.ఎ. డిగ్రీ పుచ్చుకుని ప్రభుత్వోద్యోగంలో ప్రవేశిస్తాడు. క్రమంగా ఉన్నతపదవులను సాధించి చివరకు చీఫ్ సెక్రటరీ అవుతాడు. పై స్థాయిని అందుకున్న తర్వాత తనకు ఆ స్థాయిని అందించిన వాళ్ళనే నిర్దాక్షిణ్యంగా కాలదన్ని కిందికి నెట్టేసే వర్గానికి అతను ప్రాతినిధ్యం వహిస్తాడు. 'మెట్టుకు పై మెట్టు'లో ప్రధానమైన ఇతివృత్తం కేశవపిళ్ళెకు సంబంధించిందే అయినా అందులో మరి యిద్దరు స్త్రీ పాత్రల కథ వుంది. అందులో ఒకరు ఒర్పుకు మారు పేరయిన అతని ధర్మపత్ని కాత్యాయనీ - పల్లెటూరి పిల్ల. ఎంతో నిగ్రహంతో ప్రవర్తిస్తుంది. రెండవ స్త్రీ పాత్ర తంకమ్మ. కేశవపిళ్ళెకు ప్రియురాలు. తీరని కామవాంఛ, అంతులేని వ్యామోహం ఆమెను అవరించి ఉంటాయి. కేశవపిళ్ళె ఆమెను నిర్లక్ష్యం చేయటం వల్ల ఆమె తప్పు దారిన పడుతుంది. నిజమైన ప్రేమ ఆమెకు కరువయిపోయింది.

షష్టి పూర్తి అయినా తకళి శివశంకరపిళ్ళె యిప్పుడు కూడా రచనా వ్యాసంగంలో నిమగ్నులై వున్నారు. సర్వోత్తమమైన నవల ఇంకా నేను రాయాలంటారాయన.



రూ. 93.00

నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RSK01D540 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 11/08/23 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 519 |
| పెద్ద సైజు పేజీలు | లేవు |
| ఖాళీ పేజీలు | CI, XIV, 501, II |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | [illegible] |
| పేజీలు విడదీసినది | Chaitanya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | Swathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |